తాళపత్రాలలో

నిక్షిప్తమైయున్న తెలుగువారి
సనాతన సంప్రదాయ శాస్త్రీయ
సంస్కృతి విశ్వాసాల సమాహార

# గోపురం



మోహన్ పబ్లికేషన్స్,
రాజమండ్రి-1.

తాళపత్రాలలో నిక్షిప్తమైయున్న
తెలుగువారి సనాతన సంప్రదాయ
శాస్త్రీయ సంస్కృతి విశ్వాసాల సమాహార

# గోపురం

సంపాదకులు, సేకరణ, సంకలనకర్తలు :


శ్రీ పురాణపండశ్రీచిత్ర - కాకినాడ
శ్రీ పుచ్చా శ్రీనివాసరావు-విజయవాడ
శ్రీ ఆదిపూడి వేంకటశివసాయిరామ్ - గుంటూరు
డా॥ అనప్పిండి సూర్యనారాయణమూర్తి-రాజమండ్రి
శ్రీ చల్లా మాణిక్యసుబ్రహ్మణ్య శర్మ - రాజమండ్రి
శ్రీ పేరి భాస్కరరాయశర్మ - ఎ.కోడూరు
ఆచార్య శ్రీ హరిశివకుమార్ - వరంగల్
శైలి - హైదరాబాద్





ప్రకాశకులు : ఫోన్ : (0883)246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101

వెల : 144 .00

Once Visit :- WWW.MOHANPUBLICATIONS.COM




వివిధ పత్రికల్లో వెలువడినవి, టెలివిజన్ ఛానళ్లలో ప్రముఖులు చెప్పినవి, సనాతనులైన పండితులు మౌఖికంగా చెప్పినవి ఇతరత్రా అనేక గ్రంథాలు; తాళపత్రాల నుంచి సేకరించి ఒక మాలగా ఏర్చి కూర్చి 1,116 పైగా అంశాలని ఈ గ్రంథంలో పొందు పరచడమైనది. తెలుగు ప్రజానీకానికి అందుబాటులో ఉండటం కోసం ఎవరైనా ప్రచురించుకొన వచ్చును. మాకు తెలియజేస్తే మేము కూడా సంతోషిస్తాం.

"విబుధజనుల వలన
విన్నంత కన్నంత
తెలియవచ్చినంత
తేట పరతు"

అన్న పోతన గారి మాటలే మా ఈ గ్రంధ ముద్రణకి ప్రేరణము.

**ఈ గ్రంథమును కానుకగా అందించవలసిన సమయాలు, సందర్భములు**

1. గృహప్రవేశమునకు
2. గృహారంభములకు
3. వివాహములకు
4. షష్టిపూర్తిమహోత్సవం
5. పదవీ విరమణసభలకు
6. సంస్మరణ సభలకు
7. ప్రతిష్ఠామహోత్సవాలు
8. యాగములకు
9. నోములు, వ్రతములకు

ఈ పుస్తకం కోసం ఎన్నో జాగ్రత్తలు తీసుకోవడం జరిగినది. అయినా పొరపాట్లు జరగటానికి అవకాశం ఉండవచ్చును. మాకు తెలిపిన మలిముద్రణలో సవరించగలవారము.

ఈ గ్రంథము పంచటానికి ఎక్కువ కాపీలు కావలసినవారు ప్రకాశకులను సంప్రదించగలరు. 9247 88 88 87

# బహూకరణ



శ్రీమతి / శ్రీ ..............................................గారికి

......................................................సందర్భముగా

**తాళపత్ర సమాహార గోపురం అను ఈ పుస్తక**

**రత్నమును బహూకరించడమైనది.**

తేది : ............ సంతకం



## ఈ గ్రంథము గురించి....

మన పూర్వీకులు ఎన్నో సంప్రదాయములు ఏర్పరచినారు. అలానే ఆచారములు కూడ మన జీవితములో ఒక భాగముగా చేసియున్నారు. నిత్యజీవితములో ఆచారములలోను, వ్యవహార ములోనూ జీవన విధానములలోను ఎన్నో మార్గదర్శకాలని నిర్దే శించినారు. పూర్వకాలములో మహర్షులు అనేక ఆచారములు, సంప్రదాయములు, వ్యవహారములను, విషయములను తాటాకుల మీద వ్రాసి పొందుపరచినారు. ఇలాంటి ఎన్నో విషయములు కాల క్రమేణా మరుగనపడిపోతున్నాయి. మన తాతలు తండ్రులు కొన్ని విషయములు అందించేవారు. కాని ఈ రోజు ఆ పరిస్థితి ఎక్కడా కనపడుటలేదు. కేవలము టి.వి. మీడియాకు ప్రాముఖ్యత యిస్తున్నారు. తెలుసుకోవాలని ఆశలేదు. తెలుపవలసిన వారు మనకు తగ్గిపోవుచున్నారు. ఈ విధముగా మన సత్యాలను గ్రహించలేక పోవుచున్నాము. కావున ఎంతోమంది పెద్దలు, పీఠాధి పతులు, గురువులు అందించిన విషయములను పుష్పమాలగా అందించుచున్నాము. ఇంతకు ముందు ఎన్నో తాళపత్ర గ్రంథములు వచ్చినవి. కాని ఈ గ్రంథములోవున్న సమాచారము మరి ఏ గ్రంథములో లభించదు. ఇందులో అతిశయోక్తి లేదు. వెయ్యినూటపదహారు పైగా విషయాలు అందింపబడుచున్న ఏకైక గ్రంథము. కావున పాఠకులు ఈ గ్రంథమును మంచి విజయమును అందించగలదని ఆశిస్తూ....



## ఈ గ్రంథమునకు పరిశీలించబడిన ఉపయుక్త గ్రంథములు

1. భవిష్యవాణి మాసపత్రిక - డా॥ జంధ్యాల
2. సప్తగిరి మాసపత్రిక - డా॥ సముద్రాల లక్ష్మణయ్య
3. శ్రీరామకృష్ణప్రభ మాసపత్రిక - స్వామి సుకృతానంద
4. స్వాతి వారపత్రిక - ఉషశ్రీ
5. స్వాతివారపత్రిక -అనిల్ స్వాతి,సత్యాన్వేషణ
6. స్వాతి వారపత్రిక - సద్గురు సుభాషితం -సద్గురుజగ్గీవాసుదేవ్
7. భక్తిమాసపత్రికలు - కె.బి.సోమయాజులు
8. ఋషిపీఠం మాసపత్రిక - శ్రీసామవేదం షణ్ముఖశర్మ
9. భక్తిసుధ మాసపత్రిక - శ్రీరాజావారు
10. శ్రీపాంచరాత్ర సుదర్శనమ్ -శ్రీదిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు
11. గాయత్రివిజ్ఞాన్ -ద్రాక్షారపు రాధకృష్ణమూర్తి
12. శ్రీపాంచరాత్రకౌమదకీ-దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు
13. దైవమ్ మాసపత్రికలు
14. ఆరాధన మాసపత్రికలు
15. దర్శనమ్ మాసపత్రికలు
16. వసుధ మాసపత్రిక -బ్రహ్మశ్రీ కె.ఎస్.సోమయాజులు మరియు బ్రహ్మశ్రీ కప్పగంతు సుబ్బరాయ సోమయాజులు





17. సప్తగిరి మాసపత్రిక - శ్రీమొవ్వ వృషాద్రిపతి
18. సాయి సన్నిధి మాసపత్రికలు
19. గురుప్రియ మాసపత్రికలు
20. ఈవారం-శ్రీవారము మాసపత్రికలు
21. జ్యోతిషం టుడే మాసపత్రికలు
22. వేంకటేశం మాసపత్రికలు
23. శ్రీరామకృష్ణప్రభ మాసపత్రికలు -రెంటాల జయదేవ
24. సాక్షి దినపత్రిక -డా.మైలవరపు శ్రీనివాసరావు
25. దేవుళ్ళ డాట్‌కామ్ - పుచ్చా శ్రీనివాసరావు
26. ప్రశ్నోత్తరమణిమాల -శ్రీజయేంద్ర సరస్వతి
27. మనకోసం మాసపత్రికలు
28. జ్ఞానమార్గం మాసపత్రికలు
29. సంఖ్యావాచక పదకోశము -బి.అనంతరావు
30. కాలజ్ఞాన సుధమాసపత్రికలు

ఇంకా ఎన్నో పురాతన గ్రంథములు, మాసపత్రికలు మరియు తాళపత్ర గ్రంథములు.

వీరందరికి పేరు పేరుగా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.



MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

## విషయసూచిక









MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

MOHAN PUBLICATIONS.COM

**1. సూర్యుడ్ని ఏఏ సమయాల్లో చూడరాదు?**

ప్రభాతవేళ, సూర్యాస్తమయవేళ, మిట్టమధ్యాహ్న సమయమున రవిని సూటిగా చూడరాదు. అలాగే సూర్య మరియు చంద్రగ్రహణ సమయాల్లోనూ చూడరాదు. అట్టి సమయాల్లో సూర్యుని నుంచి వెలువడే కిరణాలు మానవశరీర నిర్మాణానికి కీడునుకల్గిస్తాయి.

**2. శ్రీకృష్ణపరమాత్ముడు నెమలి పింఛాన్ని తలపై ఎందుకు ధరిస్తాడు?**

సకల చరాచర సృష్టిలో సంభోగం చెయ్యని ఏకైక ప్రాణి నెమలి మాత్రమే. శ్రీకృష్ణునికి 16,000 వేలమంది గోపికలు. అన్ని వేలమంది గోపికలతో శ్రీకృష్ణుడు సరససల్లాపాలు మాత్రమే ఆడాడు. అల్లరిచేసి గెలిచే వాడు. ఆ విషయాన్ని తెలియచేయటానికే శ్రీకృష్ణుడు నెమలి పింఛం ధరిస్తాడు. శ్రీకృష్ణుడు ఒట్టి అల్లరి కృష్ణుడు మాత్రమే.

**3. మాతృ, పితృ, ఆచార్య, దైవ, ఋషి రుణాలంటే?**

పశుపక్షాదుల్లా పుట్టగానే, కాళ్ళు రాగానే బైటికి తరిమెయ్యరు. తల్లీ, తండ్రీ ఇద్దరూ జీవితకాలం సంపాదించిన ధనాన్ని పోగు చేసి ఇచ్చి, పెళ్ళి కూడా చేసి ధర్మ, అర్థాలతో సుఖించే పరిస్థితులని సృష్టిస్తారు. ప్రేమతో పెంచుతారు. తల్లీ, తండ్రీ రుణం, ఎంత సేవచేసినా తీరదు. చేయాల్సిందల్లా ముసలితనంలో వార్ని బిడ్డల్లా చూసుకోవటమే.

మల మూత్రాలను కడిగి పెంచి పెద్ద చేసినందుకు ఆ సమయంలో తల్లి ఋణం తీర్చుకోవాలి. తాను సంపాదనతో నిస్వార్థముతో పెంచి పెద్ద చేసిన తండ్రి ఋణం తీర్చుకోవాలి. లోకజ్ఞానాన్నీ, విజ్ఞానాన్నీ, నేర్పినందుకు గురు ఋణాన్నీ, మనకి బుద్ధినీ, కర్మనీ ఇస్తున్న దైవ ఋణాన్ని భక్తి ద్వారా ధర్మ మార్గం ద్వారా, సకల శాస్త్రాలనూ, ధర్మాలనూ గ్రంథాల ద్వారా మనకు అందచేసినందుకు ఋషి రుణాన్ని తీర్చుకోవాలి. వివాహం ద్వారా అన్ని రుణాలన్ని తీర్చి, తిరిగి తాను ఋణ పడటమే మానవ జన్మ.

**4. హారతి వల్ల లాభము ఏమిటి ?**

గృహములోను, పూజాగదిలోనేకాదు,గుడిలోను, శుభకార్యాలప్పుడూ.... పిల్లల పుట్టిన రోజుల వేడుకలలోను,క్రొత్త పెళ్ళికూతురు గృహములోకి ప్రవేశించేటప్పుడూ హారతి ఇస్తుంటారు. ఎక్కడ హారతి పట్టినా ఓ ఆరోగ్య సూత్రంఉంది. శుభకార్యాల్లో ఎన్నో కుటుంబాలకు సంబంధించిన వారు ఒకేచోట చేరుతారు. అలాగే దేవాలయలలో అనేక మంది భక్తులు





దేవుడ్ని దర్శిస్తుంటారు. దానివలన పరిసర ప్రాంతపు గాలి అపరిశుభ్రం అవుతుంది. అనేక క్రిములు చేరతాయి. కనుక హారతి కర్పూరం వెలిగించి హారతి ఇవ్వడం ద్వారా అనేక సూక్ష్మక్రిములు కర్పూర పొగకు నశిస్తాయి. ముక్కుకు సంబంధించిన వ్యాధులూ, అంటువ్యాధులూ ప్రబల కుండా ఉంటాయి. కర్పూరహారతి ఎలాగైతే క్షీణించి పోతుందో, అలాగే మనం తెలిసీ తెలియక చేసిన పాపాలు సమసిపోవాలని కోరుకుంటూ హారతిని కళ్ళకద్దుకోవటమే అసలు సిసలు ఆధ్యాత్మిక అర్థం, పరమార్థం.

**5. చిన్న పిల్లలకి దిష్టి ఎందుకు తీస్తారు?**

చిన్నారుల పుట్టిన రోజు పండగ వేడుకలలో అలాగే అనేక శుభ కార్యాల్లో పాల్గొన్న పెద్దలకీ, పిల్లలకీ దిష్టిని విభిన్న పద్ధతుల్లో తీస్తూ ఉంటారు. పిల్లలూ, పెద్దలూ ఘనవిజయాలు సాధించినప్పుడూ, బాగా ప్రశంసలు పొందినప్పుడు అతిగా నీరసించి డీలాపడినప్పుడు దిష్టితీస్తారు. అలాగే పిల్లలకి పసుపూ, సున్నం కలిపిన నీటితో దిష్టితీస్తూంటారు. బయటజనుల దృష్టిదోషం తగలకుండా ఉండాలని దిష్టితీస్తే చిన్నపిల్లవాడు కలవరింతలు లేకుండా నిద్రపోవటమూ, నిద్రలో ఉలిక్కిపడుతూ లేవటం వంటి అవలక్షణాలు లేకుండా ఉంటాడు.

చిన్నపిల్లలు కావచ్చు, పెద్దలు కావచ్చూ అనేక వేడుకల్లో పాల్గొనటం వల్ల చుట్టూ అంతా చేరటంవల్ల చిన్నపిల్లలూ లేదా పెద్దలూ కొంత అస్వస్థతకు గురిఅవుతారు. అందుకే వివాహవేడుకలలోను, పుట్టిన రోజువేడుకలలోను విధిగా హారతి ఇచ్చి చివరలో ఎర్ర నీళ్ళతో దిష్టి తీస్తారు. ఎర్రరంగు పదేపదే చూడటంవల్ల అనేక రోగాలు సమసిపోతాయి. మనసుకి ప్రశాంతతోపాటు ధైర్య గుణంవస్తుంది.

**6. ఎలాంటివేళల్లో భోజనాన్ని తినకూడదు?**

గ్రహణం సమయమున అనగా సూర్యగ్రహణానికి 12 గంటల ముందుగా, అలాగే చంద్రగ్రహణానికి 9 గంటల ముందుగా ఎటువంటి పదార్థాన్ని ఆహారంగా తీసుకోకూడదు.

**7. 'ఏడు' సంఖ్య మంచిదా కాదా ?**

తిరుమల తిరుపతి కొండలు 7. ప్రత్యక్షదైవం సూర్య భగవానుడి నుంచి వచ్చే కిరణాలు 7, పాతాళం క్రింద లోకాలు7, భువర్లోకాలు 7. అలాగే ద్వీపాలు7. పెళ్ళిలో వధూవరులు ఇద్దరూ కలసి వేసే అడుగులు

MOHAN PUBLICATIONS.COM

7. అగ్ని దేవుని నాలుకలు 7. బ్రహ్మోత్సవాలు జరిగేదీ 7వ నెలలో. సప్త స్వరాలు కూడా ఏడే. 7 సంఖ్యమంచిది కాదని కొందరి మూఢనమ్మకము. 7 కూడా మంచిదే. భగవంతుడు సృష్టించిన ప్రతిదీ మనకోసమే. దాన్ని ఉపయోగించే పద్ధతుల వల్లే ఫలితం మనకిలభిస్తుంది.

### 8. దేవునికి దీపారాధన చేసేటప్పుడు దీపాన్ని ఏనూనెతో వెలిగించాలి?

దీపారాధనకు ఆవునెయ్యి ఉత్తమము. మంచి నూనె మధ్యమము. ఇప్ప నూనె అధమము. ఆవునెయ్యితో వెలిగించిన దీపము యొక్క ఫలితము అనంతము. అష్టైశ్వరాలూ, అష్టభోగాలూ సిద్ధిస్తాయి. వెండి లేదా పంచ లోహాలతోనూ, మట్టితో చేసిన దీపాలు అత్యుత్తమము.

అలాగే ఆముదంతో వెలిగించి చేసే దీపారాధన వలన దాంపత్య సుఖమూ, జీవిత సౌఖ్యమూ కలుగుతాయి. వేరుశెనగ నూనెతో దీపారాధాన చేయరాదు. శ్రీమహాలక్ష్మికి ఆవునెయ్యి దీపమూ, గణపతికి నువ్వుల నూనెతో వెలిగించిన దీపము చాలా ఇష్టము.

### 9. లక్ష్మీదేవి తామర పువ్వులోనూ, ఇరుప్రక్కలా ఏనుగులతోనూ ఎందుకు ఉంటుంది?

సరస్సులో తామర నిలకడగా ఉండదు. నీటి ప్రవాహానికి కదులుతూ అటూఇటూ ఊగుతూ ఉంటుంది. తానూ నిలకడలేని దానిని అని చెప్పటమే లక్ష్మీదేవి తామర పూవులో కొలువై ఉండటములోని పరమార్థం. ఇక ఇరుప్రక్కలా వున్న ఏనుగులకు అర్థం ఏమిటంటే శ్రీమహాలక్ష్మి ధనబలము గజబలమంతటిదని అర్థం చేసుకోమని పరమార్థం.

### 10. తిరుమల తిరుపతిలో పూలబావి ప్రత్యేకత ఏమిటి?

అద్దాల మంటపానికి ఉత్తరం దిక్కున ఉంది ఈ పూలబావి. స్వామి వారికి సమర్పించిన తులసీ, పూలదండలు, పువ్వులు ఎవ్వరికి ఇవ్వకుండా ఈ పూలబావిలోనే పడేస్తారు.

ఆపదవచ్చినప్పుడు తొండమానుడు ఈ పూలబావి రహస్య సొరంగ మార్గం ద్వారానే ఆ వెంకటేశ్వరస్వామిని శరణువేడాడు. స్వామి వారు ఆ ఆపద సమయంలో ఏకాంతంగా ఉన్నారు. తొండమానుడ్ని చూసి శ్రీమహాలక్ష్మి సిగ్గుతో శ్రీమహా విష్ణువు వక్షస్థలంలో చేరింది. అదే సమయంలో భూదేవి తొండమానుడు కట్టించిన పూలబావిలోకి వెళ్ళి రహస్యంగా దాక్కుందని పురాణాల గాథ.





### 11. ఉత్తరం దిక్కున తలపెట్టి ఎందుకు నిద్రించరాదు?

మన భూమిలో గురుత్వాకర్షణశక్తి ఉత్తర దక్షిణాలుగా ఇమిడి ఉంటుంది. మనమూ అలానే నిద్రపోయామంటే ఉత్తర దక్షిణాల్లో ఇమిడి ఉన్న ఆ శక్తి యొక్క తరంగాలు మన మెదడులో దాగవున్న శక్తివంతమైన విద్యుత్ తరంగాలని తగ్గించి వేస్తాయి. దానివలన అనేక ఆరోగ్య, మానసికి సమస్యలు వస్తాయి. రక్త ప్రసరణ వ్యవస్థలో చాలా మార్పువస్తుంది. మెదడులో లోపాలు తల ఎత్తుతాయి. అలా కాకుండా తూర్పు పడమరల వైపు నిద్రిస్తే మెదడు సుఖవంత స్థానంలో ఉండి మెరుగు పడుతుంది. రక్త ప్రసరణసరిగా జరిగి శరీరానికి నూతన ఉత్తేజం వస్తుంది.

### 12. స్త్రీ తన కన్నా వయసు ఎక్కువ ఉన్న మగవారిని ఎందుకు పెళ్ళి చేసుకోవాలి?

తన కన్నా ఎక్కువ వయసు గల స్త్రీతో శారీరక సంభోగం వలన పురుషునికి శక్తి తగ్గిపోతుందనేది అసత్యం. స్త్రీకి సిగ్గు ఎక్కువ. కనుక ప్రేమతోలాలించి, బుజ్జగించాలంటే తనకన్నా చిన్నదవ్వాలి. స్త్రీ సహజంగా పురుషుని కన్నా బలవంతురాలు కాదు. కనుక సంసారాన్ని మోయలేదు. కష్టపడలేదు. పైగా స్త్రీ పెద్దదైతే కుటుంబం యొక్క భారం స్త్రీ మీదే పడుతుంది. మగవాడిదే కుటుంబ భారమని చెప్పటానికే అనాదిగా ఈ ఆచారం. అందువల్లే భార్యకంటే భర్తకి ఎక్కువ వయసు ఉండాలన్నది మన పెద్దలు నియమం పెట్టారు.

### 13. పూజలో కొబ్బరికాయ కుళ్ళితే మంచిదా? కాదా ?

పూజలో కొట్టిన కొబ్బరికాయ కుళ్ళితే దోషమేమికాదు. అపచారం అంతకన్నా కాదు తెలిసి చేసిన పని కాదు కనుక దేవాలయాల్లో కొట్టే కొబ్బరికాయ కుళ్ళితే వెంటనే ఆ కాయను నీళ్ళతో శుభ్రంచేసి మళ్ళీ మంత్రోచ్చారణ చేసి స్వామిని అలంకరిస్తారు. అంటే ఆ దోషం కుళ్ళిన కొబ్బరికాయదేకాని ఇచ్చిన వ్యక్తిది కాదని ఇందులోని పరమార్థం. అలాగే ఇంట్లో పూజ చేసేటప్పుడు కొబ్బరికాయ కుళ్ళితే కుళ్ళిన భాగాన్ని తీసేసీ కాళ్ళూ, చేతులూ, ముఖమూ కడుగుకొని పూజామందిరాన్ని శుభ్రంగా కడిగి మళ్ళీ పూజ ఆరంభించటం మంచిది.

వాహనాలకి కొట్టే కాయ కుళ్ళితే దిష్టి అంతా పోయినట్టే. అయినా సరే మళ్ళీ వాహనం కడిగి...మళ్ళీ కొబ్బరికాయ కొట్టాలి.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

**14. విజయవాడ కనకదుర్గమ్మ ముక్కు పుడకను కృష్ణమ్మ అందుకుంటే కలియుగాంతమేనా?**

శ్రీశ్రీశ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మం గారు కాలజ్ఞానంలో ఎన్నో విషయాలు చెప్పారు. ధూమశకటాలు నడుస్తాయని, ముఖానికి రంగేసుకున్న వారు దేశనాయకులవుతారనీ, భర్తలేని స్త్రీ రాజ్యమేలుతుందనీ, త్రాగే మంచినీళ్ళు కొనుక్కుంటారనీ....ఆయన చెప్పిన వన్నీ జరిగాయి. విజయవాయ కనకదుర్గమ్మ ముక్కు పుడకను కృష్ణమ్మ అందుకుంటే కలి యుగం అంతమయిపోయినట్టే. అంత ఎత్తున కృష్ణమ్మ ఎగిస్తే ఇక భూమి మీద ఏం మిగులుతుంది?

**15. కార్తీకమాసంలో ఆహారంతో పాటు తీసుకోకూడనవి ఏవి?**

ఉల్లిపాయ, ఇంగువ, ముల్లంగి, ఆనపకాయ, మునగకాయ, వంకాయ, గుమ్మడికాయ, పుచ్చకాయ, వెలగపండు, చద్ది అన్నము. మినుములు, పెసలు, శెనగలు, ఉలవలు, కందులు ఇవన్నీ వాడరాదు. అష్టమి నాడు కొబ్బరీ, ఆదివారము ఉసిరీ తినరాదు.

**16. మంగళ, శుక్రవారాలు ఇతరులకు డబ్బు ఎందుకివ్వరు?**

సంపాదించేవాడు సంపాదిస్తుంటే ఖర్చు చేసేవాళ్ళు ఖర్చు చేస్తారు. కనీసం ఆ 2 రోజులైనా ఆ సోమరి తనాన్ని ఆపాలన్న ప్రయత్నము. అలాగే అమావాస్యనాడు కూడా అప్పు ఇవ్వరు. ధనాన్ని అదుపు చెయ్యటానికి ఇది మంచి పద్ధతే అయినా మనకి గానీ, ఇతరులకు గానీ ఆపదసమయాల్లో ఈ నియమం పనికి రాదు. ఇలా చెయ్యటంవల్ల మరింత ధనం పోతుంది.

**17. అలిగి అత్తగారింటికి, చెడిపోయి చెల్లెలింటికి వెళ్ళకూడదని ఎందుకంటారు?**

పూర్వం కొడుకుని సరయినదారిలో పెట్టలేకపోతే, సంవత్సరకాలం పాటు అత్తగారింటికి పంపేవారు. అంటే అప్పట్లో అది శిక్షతో సమానము. తన వారి మీద అలిగి అత్తగారింటికి వెళితే ఎవరైనా సరే తన ఆర్థిక స్వేచ్ఛను, సాంఘిక స్వేచ్ఛను, మానసిక ఆనందాన్ని కోల్పోతారు. అలాగే చెడిపోయి చెల్లెలింటికీ వెళ్ళరాదు. ఆడపిల్ల పుట్టింటి నుంచి ప్రేమానురాగం, ధనమూ ఆశిస్తుంది. అటువంటి చెల్లిలి ఇంటికెళ్ళి ఆ మూడు ఆమె నుంచి ఆశించటం వల్ల చులకనవుతారు. కాని వాస్తవానికి చులకనయ్యేది మనమే కాదు, అత్తగారింట్లో ఉన్న చెల్లి కూడా!





**18. కుంకుడూ, మామిడీ, దానిమ్మ వంటి చెట్లను గృహాల్లో ఎందుకు పెంచకూడదు?**

ఇలాంటి చెట్లు నీటి శాతాన్ని ఎక్కువగా పీలుస్తాయి. తద్వారా గృహావసరాలకి ఉపయోగపడే అనేక చెట్లు, నీరు సరిపోక పెరగవు. కొన్ని చెట్లు గృహయజమాని జాతకానికి సరిపోవు. అందుకే సర్వసమ్మతమైనవీ, గృహావసరాలకి ఉపయోగపడే చెట్లనే పెంచుకుంటారు. పై చెట్లు పెంచాలనుకుంటే మీ మీ జాతకాల ప్రకారం నక్షత్రాలు ప్రకారం సరిచూసు కుని పెంచుకోండి.

**19. గరుడ పురాణమును ఇంట్లో చదువవచ్చా? చదవకూడదా?**

వ్యాసమహర్షి రచించిన 18పురాణాలో ఒకటి ఈ గరుడ పురా ణము. నరకం గురించి, పాపాత్ముల శిక్షలను గురించి గరుత్మంతుడు అడిగిన ప్రశ్నలకు శ్రీమహావిష్ణువు చెప్పిన సమాధానాలు ఈ గరుడ పురా ణంలో ఉన్నాయి. దీనిలో ప్రేతకల్పము ఉండటంవలన ఇంట్లో చదువ వచ్చా, చదవకూడదా అన్న సందేహం చాలా మందిలో ఉంది. ఈ పురాణం వ్యాస విరచితము. అన్ని పురాణాల్లాగానే దీనిని ఇంట్లో ఉంచుకోవచ్చు. ఎవ్వరికైనా ఈ పురాణం ఇవ్వాలంటే హంస ప్రతిమతో కానుకగా ఇవ్వాలి.

**20. చెవులెందుకు కుట్టిస్తారు?**

ఆడపిల్లలకు చెవులూ, ముక్కూ కుట్టించి చక్కని ఆభరణాలు ధరింప చేసి లక్ష్మీదేవిలా తలచుకొని మురిసిపోయే ఆ కార్యక్రమంలో మరో ఆరోగ్య రహస్యం కూడా ఉంది. చెవులు కుట్టించుకుంటే కంటి చూపుశక్తి పెరుగు తుంది. ఆక్యుపం క్చర్ వైద్యవిధానం చెవికుట్టించుకుంటే శరీరం మొత్తానికి మంచి దని చెబుతోంది.

**21. పండగ రోజుల్లో, పుణ్యరోజుల్లో ఉల్లిపాయను తినకూడదా?**

అలాంటి రోజులు ఎంతో పవిత్రమైనవి. ఆ రోజంతా నిర్మలంగా, ప్రశాంతంగా మనస్సూ, శరీరమూ భగవంతుని మీదే లగ్నం చేయాలి. అలా ఉంచాలంటే ఉల్లిపాయను తినకూడదు. ఉల్లిపాయలో ఉత్తేజం చేసే శక్తి ఉంది. నిగ్రహాన్ని సడలించేలా చేస్తుంది. కాన వాటిని ఆ రోజుల్లో దూరంగా ఉంచాలి.

**22. ఆవు ముఖాన్ని చూడకూడదంటారు ఎందుకని?**

శివలింగం ముందుభాగాన్ని బ్రహ్మదేవుడూ, చివరి భాగాన్ని శ్రీమహావిష్ణువు చూసి రావాలని ఒకసారి పందెము వేసుకున్నారు. దేవతల

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

సాక్షిగా ఇద్దరూ బైలుదేరారు. బ్రహ్మ ఎంత దూరం వెళ్ళినా శివలింగం ముందు భాగం కనిపించలేదు. విష్ణువుకు చివరిభాగం కన్పించలేదు. బ్రహ్మ దేవుడికి మార్గం మధ్యలో దేవలోకపు గోవూ, మొగలి చెట్టూ కన్పిస్తాయి.

బ్రహ్మ వారితో తాను శివలింగంముందు భాగము చూసినట్టు దేవతలకి సాక్ష్యం చెప్పమంటాడు. బ్రహ్మదేవుడు అడిగితే కాదంటామా అని బ్రహ్మతో కలిసి వెళ్ళి బ్రహ్మ శివలింగం ముందుభాగం చూశారని సాక్ష్యం చెబుతాయి. దేవతలు నిజమని నమ్మి బ్రహ్మదేవుడ్నే విజేతగా ఎంపిక చేస్తారు. ఈలోగా శ్రీమహావిష్ణువు వస్తాడు. అదే సమయంలో ఆకాశవాణి దేవలోకపు గోవూ, మొగలిపువ్వు అబద్దం చెప్పాయని తెలియ చేస్తాయి. దానితో అసత్యాన్ని పలికిన బ్రహ్మకి పూజలుండవనీ, అబద్ధపు సాక్ష్యాన్ని చెప్పిన మొగలిపువ్వు పూజకు పనికిరాదనీ, గోవుముఖము చూస్తే దోషమని శాపము విధించబడినది.

## 23. వివాహంలో ఖచ్చితంగా చేయాల్సిన విధులు పదహారు... అవి ఏమిటి?

ఒకటి వరాగమనమూ, రెండు స్నాతకము, మూడు మధుపర్కమూ, నాలుగు మంగళస్నానమూ, అయిదు గౌరిపూజా, ఆరు కన్యావరణమూ, ఏడు కన్యాదానమూ, ఎనిమిది సుముహూర్తమూ, తొమ్మిది మంగళ సూత్ర ధారణమూ, పది తలంబ్రాలూ, పదకొండు హోమమూ, పన్నెండు పాణిగ్రహణమూ, పదమూడు సప్తపదీ, పధ్నాలుగు అరుంధతీ నక్షత్ర దర్శనమూ, పదిహేను స్థాలీపాకమూ, పదహారు నాగవల్లీ.... ఈ విధులతో వివాహ మహోత్సవం సంపూర్ణమవుతుంది. పూర్వము పెళ్ళంటే పదిరోజులు పైనే చేసేవారు.

## 24. "జీర్ణము, జీర్ణము వాతాపి జీర్ణము" అని ఎందుకంటారు?

దండకారణ్యంలోని ఇల్వలుడూ, వాతాపీ అనే రాక్షస సోదరులు, అరణ్యంలోవచ్చే పోయేవారిని మాయమాటలతో పిలుచుకు వచ్చి ఆరగిస్తుంటారు. అతిథి పూజకని భోక్తలను పిలుస్తాడు ఇల్వలుడు. వారురాక ముందే వాతాపి మేకలా మారిపోతాడు. ఇల్వలుడు మేకను కోసి వండి వడ్డిస్తాడు. వాతాపి భోక్తల కడుపు చీల్చుకుని బయటికి వస్తాడు. ఆ తర్వాత ఎంచక్కా వార్ని ఇద్దరూ కలసి భుజిస్తారు.

అగస్త్యుడికి ఈ విషయం తెలిసి భోక్తలా వెళతాడు. ఎప్పటిలానే ఇల్వలుడు వాతాపిని వండి వడ్డిస్తాడు. అగస్త్యుడు భుజించిన తర్వాత





ఎప్పటివలె 'వాతాపీ బైటకిరా' అంటాడు. అప్పుడు అగస్త్యుడు 'ఇంకెక్కడి వాతాపి.... ఎప్పుడో జీర్ణమయిపోయాడు. 'జీర్ణము, జీర్ణము వాతాపి జీర్ణమంటూ' పొట్టను రుద్దుకుంటాడు. అలా అగస్త్యుడు వాతాపిని జీర్ణము చేసుకొని ఇల్వలుడ్ని బూడిద చేస్తాడు. ఎంత చెడు ప్రభావం కలదైనా, అరగనిదయినా అలా అంటే కడుపులో కొండ ఉన్నా అరుగుతుందని తల్లి నమ్మకము. అందుకనే తల్లి పిల్లలకి భోజనం పెట్టి పూర్తయిన తర్వాత ఆ మాటంటుంది.

## 25. భగవంతుని పూజకు ఏ పూలు శ్రేష్టమైనవి?

పరమేశ్వరుని పూజలకు జిల్లేడూ, గన్నేరూ, మారేడూ, తమ్మి, ఉత్తరేణు ఆకులూ, జమ్మి ఆకులూ, జమ్మి పూలూ, నల్లకలువలూ మంచివి.

దాసాని, మంకెన, నదంత, మొగలి, మాలతి, కుంకుమ మద్ది.... ఈ పూలు పూజకు పనికి రావు. తొడిమలేని పువ్వులు పూజకు పనికిరావు. తమ్మి పువ్వుకు పట్టింపులేదు. మారేడు నందు శ్రీమహాలక్ష్మీ, నల్లకలువ నందు పార్వతీ, తెల్లకలు వనందు కుమారస్వామీ, కమలమునందు పరమేశ్వరుడూ కొలువై ఉంటారు. అలాగే చదువులతల్లి సరస్వతీ దేవీ తెల్లజిల్లేడులో, బ్రహ్మ కొండ వాగులో, కరవీరపుష్పంలో గణపతీ, శివమల్లిలో శ్రీమహావిష్ణువూ, సుగంధ పుష్పాల్లో గౌరిదేవీ ఉంటారు. అలాగే శ్రీమహావిష్ణువుని అక్షింతలతోనూ, మహాగణపతిని తులసితోనూ, తమాల వృక్ష పువ్వులతో సరస్వతీ దేవినీ, మల్లెపువ్వులతో భైరవుడ్నీ, తమ్మి పూలతో మహాలక్ష్మినీ, మొగలి పువ్వులతో శివుడ్నీ, మారేడుదళాలతో సూర్యభగవానుడ్ని ఎట్టిస్థితిలోనూ పూజింపరాదు.

## 26. బట్టలుతికిన నీళ్ళు కాళ్ళమీద పోసుకుంటే పుట్టింటికి అరిష్టమా?కాదా?

ఒకవిధంగా చెప్పాలంటే అవుననేచెప్పాలి. ఎందుకంటే మురికి పట్టిన బట్టల నీటిని ఆలోచించకుండా కొందరాడాళ్ళు కాళ్ళ మీద పోసుకుంటారు. ఈవిధంగా చేయటంవల్ల పుట్టింటికి అరిష్టమే! ఆడవాళ్ళు ఎక్కువసమాయం నీటిలో ఉంటూ పనిచేయటం ద్వారా కాళ్ళకూ, చేతులకూ పగుళ్లొస్తాయి. నూటికితొంభై మంది మధ్యతరగతి వారిలోను, ఆ క్రింద తరగతి స్త్రీలలో ఖచ్చితంగా కాళ్ళపగుళ్ళు ఏర్పడతాయి. వారిలో పదిశాతం చదువుకున్న, లేదా అందం పట్ల, ఆరోగ్యంపట్ల శ్రద్ధఉన్నవాళ్ళు

MOHAN PUBLICATIONS.COM

మాత్రమే తగు జాగ్రత్తలు తీసుకుంటారు. ఈవిధంగా జాగ్రత్తలు తీసుకోని స్త్రీలు బట్టలుతికిన నీటిని, మలిన మైననీటిని కాళ్ళపై పోసుకోవటం ద్వారా ఎన్నో క్రిములు వారి శరీరంలోకి ప్రవేశించి, అనారోగ్యాన్ని కలగచేస్తాయి. అప్పుడు అస్వస్థతగురైతే భర్త పుట్టింటికి పంపించేస్తాడు. ఆపై పడేది పుట్టింటి వాళ్ళేకదా. కూతురు సంతోషంగా ఆరోగ్యంగా ఆనందంగా పుట్టింటికివస్తే ఆనందించాలని ప్రతీ తల్లీ, తండ్రీ కోరుకుంటారు.

## 27. ఈ మూడు విషయాలు దగ్గర మొహమాటం పనికిరాదంటారు ఏమిటా 3?

1వది డబ్బు.. ఇక్కడ కనుక మోహమాట పడితే డబ్బు పోయి తనతో పాటు తనని నమ్ముకున్న వార్నీ ఇబ్బందులలో పడవేయవలసి వస్తుంది. 2వది భోజనం... ఇక్కడా కూడా మొహమాటపడితే మాడేది తన కడుపే. 3వది శృంగారం... ఇక్కడ సిగ్గుపడితే శృంగార, సరసాల్లో అసలైన ఆనందాన్ని చేజార్చుకున్నవారుఅవుతారు. కనుక ఈ 3 మూడు విషయాలు వద్ద అస్సలు మొహమాట పడరాదు.

## 28. గుడిలో మన ప్రవర్తన ఎలా ఉండాలి?

గట్టిగా అరవటం, నవ్వటం, ప్రాపంచిక విషయాల గురించి ఎక్కువగా మాట్లాడటం చేయరాదు. గుడి పరిసర ప్రాంతాలన్నీ పరిశుభ్రంగా ఉంచాలి.

కొబ్బరి పెంకులూ, అరటి తొక్కలు గుడిలో నియమించిన నిబంధనల ప్రకారం తొట్టిల్లోనే వేయాలి. త్రోసుకుంటూ లేదా ముందువార్ని దాటుకుంటూ దైవ దర్శనం చేసుకోరాదు. దేవుడ్ని కనులారా చూసి ఆ తరువాత కనులు మూసుకొని ప్రార్ధన చేయాలి. గుడిలో నిల్చుని తీర్ధం పుచ్చుకోవాలి. ఇంట్లో కూర్చుని తీర్ధం పుచ్చుకోవాలి. దీపారాధన శివునికి ఎడమవైపూ, విష్ణువుకు కుడివైపూ చేయాలి. అమ్మవారికి నూనె దీపమయితే ఎడమపక్కగా, ఆవు నేతి దీపమైతే కుడి వైపు వెలిగించాలి.

## 29. శ్రీశైలంలో పాతాళగంగలోని నీరు పచ్చగా ఎందుకుంటుంది?

చంద్రగుప్త మహారాజు అనేక సంవత్సరాలు యుద్ధంచేసి, విజయాలతో రాజ్యంచేరతాడు. అంతఃపురంలోని స్త్రీలతో ఉన్న అందాల రాశిని తన కూతురని తెలియక ఆశిస్తాడు. ఆపై తెలిసినా వినకపోవటంతో, చంద్రావతి శ్రీశైలం అరణ్యాలకి వచ్చి పరమేశ్వరుడ్ని అనుగ్రహించమని



తపస్సు చేస్తుంది. అక్కడికి కూడా చంద్రగుప్తుడు వచ్చి చంద్రావతిని చెరపట్టబోతుండగా మహాశివుడు ప్రత్యక్షమై కామంతో కనులు మూసుకు పోయిన నీవు పచ్చలబండవై పాతాళగంగలో పడి ఉండమని శపిస్తాడు. ఆపై వేడుకోగా, శ్రీమహావిష్ణువు కలియుగంలో అవతరిస్తాడు. ఆ అవతార పురుషుడు స్నానంకై పాతాళగంగలో దిగిననాడు, స్నానమాచిరించిన నాడు నీకు శాపవిమోచనం కలుగుతుందని మహేశ్వరుడు శెలవిస్తాడు.

## 30. స్త్రీ స్నానము ఎలా చేయాలి?

స్త్రీ స్నానం చేసేటప్పుడు మౌనంగా ఉండాలి. ఒంటి మీద నూలు పోగు లేకుండా చేయాలి. స్నానం చేసేటప్పుడు స్త్రీ తన జుట్టును ముడివేసు కోవాలి. స్నానం ఎక్కువ సేపుచేయాలి. స్నానముఅయిన తరువాత ముందు ముఖాన్నీ ఆ తర్వాత వక్షస్థలాన్ని ఆపై తలను, అటుపిమ్మట మిగతా భాగములు తుడుచుకోవాలి. చూపుడు వ్రేలు ఉపయోగించకుండా బొట్టుపెట్టు కోవాలి.

## 31. తెల్లవారు జామున వచ్చే కలలు నిజమవుతాయా?

జ్యోతిష్య శాస్త్ర ప్రకారమూ, మనోవిశ్లేషణా శాస్త్రజ్ఞుల ప్రకారమూ ఎక్కువ శాతం అవుతాయనే సూచనలు తెలియచెబుతున్నాయి.

దానికి కారణం తెల్లవారుజాము అనగా మెలుకువ వచ్చే సమయం.

అనగా ఆ సమయంలో ముఖ్యమైన పనిగూర్చి మగతగా నిదుర పోతూ మనసు తెలియకుండా ఆలోచిస్తుంటుంది దాని తాలూకా ఫలితం లేదా జరగబోయే సంఘటన మనకు ఎంతో కొంత తెలుస్తుంది. ఆ విషయాల ఆధారంగా మనం ఊహించుకున్నదే కలగా వస్తుంది. అనగా వాటిల్లో ఎక్కువగా జరిగే అవకాశము ఉంది.

## 32. ఎలాంటి భోజనాన్ని తినాలి?

కాకులు ముట్టుకున్నదీ, కుక్కా, ఆవూ వాసన చూసిన భోజనాన్ని తినకూడదు. పాలతో భోజనం చేశాక, పెరుగుతో భోజనం చేయకూడదు. కాళ్ళు చాపుకుని, జోళ్ళు వేసుకుని భోజనముచేయరాదు. భార్యతో కలిసి తిన కూడదు. భర్త భుజించిన తర్వాత భార్య తినాలి. కలిసి తినాల్సివస్తే ముం దుగా భర్త ఓముద్దను తిన్న తర్వాత భార్య భర్తతో కలసితినవచ్చు.

భోజనముచేయడానికి ఎడమచేయి ఉపయోగించరాదు. నిలవ వున్న అన్నాన్ని భుజించకూడదు. చల్లారిన అన్నాన్ని వేడిచేసి తినకూడదు.

MOHAN PUBLICATIONS.COM

10,15 పదార్థాలతో భోజనం కన్నా కూర, పప్పు, పచ్చడి, మజ్జిగతో తీసుకునే ఆహారమే అమృతము. నిలువ పచ్చడి కంటే రోటి పచ్చడి ఎంతో శ్రేష్ఠము. నిలువ పచ్చళ్ళు వయసులో 2రోజులకోసారి, మధ్య వయసులో వారానికి 2 సార్లు, నలభై దాటిన తర్వాత 15 రోజులకొకసారి, యాభై దాటాక నెలకోసారి తీసుకోవటం ఆరోగ్యకరం.

## 33. సంసారము ఎలా చేయాలి?

మగవాడు తనని నమ్మి ప్రేమించి, తనతో వచ్చిన ఆడదానికి ముందుగా కడుపునిండా తిండి పెట్టాలి. ఆ తర్వాత స్త్రీ తన సిగ్గును దాచుకోవటానికి బట్టలివ్వాలి. తన అంద చందాల రక్షణనిమిత్తం గృహమనే భద్రతనివ్వాలి. ఆ తర్వాత రాత్రివేళలో మాత్రమే కలవాలి. స్త్రీలలో రజస్సు వచ్చిన అనగా చివరి రోజులు మంచివి. రజస్సు కనబడిన నాలుగు రోజులు దూరంగా ఉండాలి. 4,6,8,10,12,14,16,18 ఇలా సరిసంఖ్య రోజుల్లో మాత్రమే కలిస్తే పుత్రసంతానం కలుగుతుంది. అలాగే 5, 7, 9, 11, 13, 15, 17 బేసి సంఖ్యల్లో మాత్రమే కలిస్తే ఆడపిల్ల పుడుతుంది.

అలాగే శని,ఆది, మంగళవారాలలో కలవకూడదు. 4వ రోజు కలిస్తే పుట్టినవారు తక్కువ ఆయుష్షుతో పుడతారు. 5వ రోజు మంచి సంతానవంతమైన ఆడపిల్ల పుతుంది. 6రోజు సామాన్య సగటు మనిషి జన్మిస్తాడు. 7వరోజు గొడ్రాలైన ఆడపిల్లా, 8రోజు అధిక సంపన్నుడు 9వరోజున మహాపతివ్రతా, 10వరోజు తల్లిదండ్రుల కీర్తి ప్రతిష్టలు నిలబెట్టేవాడూ, 11వరోజున నలుగురు నోళ్ళలో నానేదీ, 12వరోజున ఉత్తమోత్తమమైన పురుషుడూ, 13వ రోజున ఎక్కువమంది భర్తల గలదీ, 14వరోజున ఆధ్యాత్మిక చింతనకలిగిన సన్యాసి, 15వరోజున సకల భోగాలూ అనుభవించే పడతీ, 16వ రోజు లోకులచేపొగడబడే సుపుత్రుడు జన్మిస్తాడు.

పట్టపగలూ, సంధ్యా సమయాల్లో స్త్రీల వద్దకు శృంగారము కొరకు వెళ్ళరాదు. తనకన్నా పెద్ద స్త్రీ లేదా గర్భవతితో శృంగారం నిషిద్ధం. బహు లావూ, బహుసన్నమూ, అవయవ లోపమున్న స్త్రీతో శృంగారం చేయరాదు. గురుస్థలములోనూ, గుడి ప్రదేశములోనూ, యజ్ఞయాగాదులు జరిగేచోట, అవి జరుగుతున్నప్పుడు ఆయాప్రదేశాల్లో స్త్రీకి దూరంగా ఉండాలి. కడుపారా భుజించినప్పుడూ, పదహారు సంవత్సరముల వయస్సు ముందూ, డెబ్బై సంవత్సరాల తర్వాత శృంగారం మంచిది కాదు.



## 34. మహిళలు దేవునికి సాష్టాంగ నమస్కారం ఎందుకు చేయకూడదు?

దేవునికి సాష్టాంగ నమస్కారం పురుషులు చేయవచ్చు. తమ 8 అంగాలనూ అనగా వక్షం, నుదురూ, 2చేతులూ, 2కాళ్ళూ, 2 నేత్రాలు, భూమిపై ఆన్చి నమస్కరించవచ్చు. కానీ స్త్రీలు సాష్టాంగ నమస్కారము చెయ్యాలనుకున్నప్పుడు పొట్ట నేలకు తగులుతుంది. ఆ స్థానంలో గర్భకోశం ఉంటుంది. ఇలాచెయ్యటంవల్ల గర్భకోశానికి ఏదైనా హాని జరిగేఅవకాశం ఉంది. అందుకే స్త్రీలను మోకాళ్ళపై ఉండి నమస్కరించాలని పెద్దలు చెప్పారు.



## 35. గణేశుని పూజలో తులసిని ఎందుకు వాడకూడదు?

వినాయకచతుర్థినాడు అనేక పత్రాలనూ, పువ్వులనూ తీసుకువచ్చి ఆరాధిస్తాము. కాని ఆ పత్రాల్లో తులసి ఉండదు. సర్వదేవతలకు ఎంతో పవిత్రమైన తులసిని విఘ్నేశ్వరుడు మాత్రం ఇష్టపడకపోవటానికి కారణము ఏమిటంటే.... పూర్వం భగీరథతీరంలో విఘ్నేశ్వరుడు సంచరిస్తుండగా ధర్మధ్వజ యువరాణి గణేశున్ని చూసి మోహించి వివాహం చేసుకోమంది. అందుకు గణేశుడు కాదనటంతో ధర్మధ్వజ యువరాణి కోపించి, దీర్ఘకాలం బ్రహ్మచారిగా ఉండమని శపించింది. అందుకు ప్రతిఫలంగా విఘ్నేశ్వరుడు ప్రతిశాపమిస్తూ దీర్ఘకాలం ధర్మధ్వజ యువరాణిని రాక్షసునిచెంత ఉండమని శపించాడు. గణేశుని శాపానికి చింతించిన రాకుమార్తె వినాయకుని మన్నించమని వేడుకొంది. అప్పుడు వినాయకుడు శాంతించి, కొంతకాలం నీవు రాక్షసుని దగ్గరఉండి, ఆపై పవిత్రమైన తులసిగా జన్మిస్తావు అని చెబుతాడు. అందుకే వినాయకుడు తులసిని తన అర్చనలో ఇష్టపడడు.

## 36. రోజుకి రెండుసార్లే భోజనం ఎందుకు చేయాలి?

చిన్నతనంలోనూ, వయసులోనూ ఇంకోసారి భోజనం చేయచ్చు. ముప్ఫయి దాటిన తర్వాత మూడు పూటలా ఆహారము వల్ల అన్ని విధాలుగా అనర్థమే. ఒక్కపూటమాత్రమే తింటే మలబద్ధకము వస్తుంది. సంసారబంధం లేనివారు ఒక్కపూటే తినాలి. రెండు పూటలా తినరాదు. మరోపూట పళ్ళనే తీసుకోవాలి. సంసారి మాత్రమే రోజూ రెండు పూటల భోజనం చేయాలి.

## 37. జపించేసే టప్పుడు ఏమి చేయాలి? ఏమి చేయకూడదు?

అపరిశుభ్రంగా ఉండి జపం చేయరాదు. అలా జపంచేస్తే దైవ దీవెనలకు బదులు కోపాన్ని రుచి చూడవలసి వస్తుంది. చేతులు మురికిగా

MOHAN PUBLICATIONS.COM

ఉండటం, బట్టలు లేకుండా ఉండటం, అనవసర విషయాలను మధ్యలో ప్రస్తావించడం, ప్రాపంచిక విషయాల గురించి ఆలోచిస్తూ జపించే జపము జపమే కాదు.

జపముచేసే వేళల్లో ఆవులింతలు, మగతగా ఉండడం, బద్ధకించడం చేస్తూ ఏదో జపిస్తున్నామంటే అలా చేసే జపంవల్ల ఏ ప్రయోజనం వుండదు. తుమ్ము, దగ్గు వస్తే ఓంకారాన్ని ఉచ్చరించి ఆచమనం చేయాలి. జంతువులను తాకితే స్నానం చేసి జపించాలి. జపం చేసే సమయంలో ఏమీ భుజించరాదు. ఒకేబట్టతోనూ, అనేక వస్త్రాలతోనూ జపించకూడదు.

## 38. భోజనము ఏవైపు తిరిగి చెయ్యాలి?

ప్రతిరోజు రెండుసార్లు భోజనము చేయాలని తైత్తిరియ బ్రాహ్మణం శెలవిస్తోంది. రెండుసార్లు మధ్యలో ఏ ఆహారమూ తీసుకోకపోతే ఉపవాసం చేసినంత ఫలితం కూడా వస్తుంది. భోజనము చేసేటప్పుడు తూర్పు దిక్కుకి తిరిగి మాత్రమే భోజనం చేయాలి. తూర్పు దిక్కుకి తిరిగి చేయటంవల్ల ఆయుష్షు పెరుగుతుంది. అలాగే దక్షిణదిశగా తిరిగి భోజనము చేస్తే కీర్తి, ప్రతిష్టలు లభిస్తాయి. ఉత్తరంవైపు తిరిగి భోజనము చేస్తే కోరిన కోరికలు ఫలిస్తాయి. పడమర, దక్షిణం వైపున భోజనం చెయ్యకూడదని పురాణాలలో ఉంది. కనుక తూర్పు వైపు తిరిగి భోజనము చేయటం అనేది చాలా ఉత్తమమైన పద్ధతి.

ఆకుల మీద, ఇనుప పీటల మీద కూర్చొని భోజనం చేయకూడదు. డబ్బుని ఆశించేవాడు మర్రి, జిల్లేడూ, రావి, తుమ్మి, కానుగ ఆకుల్లో భోజనం చేయాలి. సన్యాసులు మాత్రం మోదుగ, తామర ఆకులో మాత్రమే భోజనం చేయాలి. భోజనానికి ముందూ, తర్వాత ఆచమనం చెయ్యాలి. భోజనం చేసే ముందు అన్నాన్ని పరబ్రహ్మ స్వరూపంగా భావించి నమస్కరించి భుజించాలి.

## 39. పూజకు పనికిరాని పువ్వు - మొగలిపువ్వు అంటారు ఎందుకని?

22వ ప్రశ్నకిఇచ్చిన సమాధానంలో బ్రహ్మదేవుడి కోసం మొగలి పువ్వు అబద్ధాన్ని చెప్పినట్లుచదివారు కదా! దానితో ఆగ్రహించిన పరమ శివుడు పూజకు పనికిరాదని శాపమిచ్చాడు. అది పురాణగాథ. అంతే గాకుండా మొగలి పువ్వు అన్ని పువ్వులవలే ఆహ్లాదాన్ని, అనుకూలమైన శక్తిని ఇవ్వలేదు. పువ్వులకున్న సహజ తత్వానికి విరుద్ధంగా వ్యతిరేకశక్తిని





వెదజల్లుతూ ఉంటుంది. కనుక పరిసర ప్రాంతాలలో పూజా సంబంధిత ప్రభావాన్ని క్షీణింపజేస్తుంది. అందుకనే మొగలిపువ్వును పూజలో వాడరు.

## 40. మాంసాహారంలో ఏమి తినకూడదు?

మనుధర్మ శాస్త్రం ఆధారంగా ఎలాంటి మాంసాహారం తీసుకోవా లని పరిశోధిస్తే.... యజ్ఞం చేసే సమయంలో చేసే జంతుబలి హింస క్రిందకురాదని, ఆ జంతుబలిలో చంపబడే జంతువులు ఉత్తమజన్మలు పొందుతాయని, మాంసాహారం తిననివాళ్ళు, అశ్వమేథ యాగఫలాన్ని పొందుతారని శాస్త్రాలు చెబుతున్నాయి.

మద్యం, సంసార సుఖం, మాంసంను శాస్త్రాల్లో చెప్పినట్లుగానే వాడితే చాలా మంచిదని శాస్త్రాలు చెబుతున్నాయి. పితృదేవతలకు అర్పించి నదీ, అలాగే దేవతలకు అర్పించినదీ, కొన్నదీ, ఇతరుల ఇచ్చిన మాంసాన్ని తినటంలో తప్పు లేదని మను ధర్మశాస్త్రం చెబుతోంది. తిన కూడని మాంసాల్లో ఆవూ, గుఱ్ఱమూ, కుక్కా, నక్కా, కోతీ, పిల్లీ, ఏనుగూ, సింహమూ, పెద్దపులీ, ఎలుకా, చుంచూ, ఊరపందీ ఉన్నాయి. అలాగే భోజనం అయ్యాక వెంటనే నిద్రపోరాదు. రాత్రిపూట ఉప్పువేసుకుని భోజనంచెయ్యరాదు. భోజనము బాగావేడిగా ఉన్నది తీసుకుంటే శక్తితగ్గుతుంది. అలాగేబాగా చల్లనిపదార్థములుతీసుకున్నజీర్ణముకావు. పొరపాటునభోజనములో వెంట్రు కలుంటే వెంటనే ఆ భాగం తొలగించి నీళ్ళు చల్లుకొని ఆ తర్వాత తినాలి.

## 41. దేవుని వద్ద కొబ్బరికాయను కొట్టేది ఎందుకు...?

సర్వదేవతలను పూజించే సమయాల్లోనూ, యజ్ఞ, హోమాదుల్లోనూ, కొన్ని శుభకార్యాల్లోనూ కొబ్బరి కాయను కొట్టడం తప్పనిసరి. కొబ్బరి కాయపైనున్న పెంకు మన అహంకారానికి ప్రతీక. ఎప్పుడైతే కొబ్బరి కాయను స్వామిముందు కొడతామో మనం మన అహంకారాన్ని విడనాడు తున్నామనీ, లోపలున్న తెల్లని కొబ్బరిలా మన మనసును సంపూర్ణంగా స్వామి ముందు పరిచామని తద్వారా నిర్మలమైన కొబ్బరినీరులా తమ జీవితాలని ఉంచమని అర్థం. సృష్టి మొత్తంలో నీరున్న కాయ కొబ్బరికాయే.

కొబ్బరికాయ అంటే మానవ శరీరం. బొండం పైనున్న చర్మం, మన చర్మం.... పీచు మనలోని మాంసము, పెంకే ఎముక, కొబ్బరే ధాతువు, అందులోని కొబ్బరినీరు మన ప్రాణాధారం..... కాయపైనున్న మూడు కళ్ళు ఇడ, పింగళి, సుషుమ్న అనే నాడులు.

MOHAN PUBLICATIONS.COM

### 42. భోజనానికి ముందూ, తర్వాత ఆచమనముగావించేదేందుకు?

భోజనానికి ముందు నీటిని విస్తరిచుట్టూ విడుస్తూ, ఆపై 'అమృతమస్తు' అని కొంత నీటిని సేవిస్తారు. ఆపై యమధర్మరాజునూ, చిత్రగుప్తుడ్ని, సర్వదేవతలనూ స్మరిస్తూ కుడి ప్రక్క అన్నాన్ని బలిగా కొంతవేస్తారు. ఆపై భోజనము ముగించి ఆచమింపచేస్తారు. ఈ పద్ధతిలో ఎంత దైవభక్తితో పాటు ఆరోగ్యరహస్యం కూడా ఉంది. విస్తరీ లేదా కంచము చుట్టూ నీళ్ళు తిప్పేది. కంటికి కనిపించని అనేకానేక సూక్ష్మజీవులు తినే ఆహారంలో కలవకూడదని, అలా నీటితో ఆహారము చుట్టూ తిప్పగానే ఓ రక్షణ కవచము ఏర్పడి సమస్త సూక్ష్మక్రిములు స్థంభించిపోతాయి. తిరిగి భోజనాంతరం చేసే ఆచమనము ద్వారా ఆ రక్షణ కవచము తొలిగి సూక్ష్మ క్రిములు వాటి ద్రోవన అవి ప్రయాణిస్తాయని.

### 43. దేవుని ముందు కోరుకున్న కోర్కె బైటికి చెబితే తీరదా?

భగవంతుడ్ని పూజించినవారు కోరుకొనే కోర్కె ఖచ్చితంగా ఎంతో బలీయమైనదై ఉంటుంది. అలాగే బహు కష్టమైనదీ, మానవసాధ్యం కానిదీ అయి ఉంటుంది. అటువంటి కోర్కె తీరిందంటే అది ఎంతో ఆనందించతగ్గ విషయం. ఆ కోరిక ధనంకావచ్చు, సుఖముకావచ్చు, పదవీకావచ్చు, చక్కని భర్తలేదా భార్యా ఏదైనాకావచ్చు. కోరుకున్న కోర్కెని బయటకిచెబితే విన్నవారు పైకినవ్వుతూ ఆనందంగాచెప్పినా లోలోన జరగకూడదని కోరుకోవచ్చు. అలాంటికోర్కెజరగకుండా తీరకుండా మానవప్రయత్నంచేయచ్చు. పైకి కనిపించేదంతా నిజం కాదు. మీకు తెలియకుండానే మీకు శత్రువులుండవచ్చు, వారు మీ స్నేహితులే కావచ్చు, అందుకే చెప్పొద్దొంటారు.

### 44. మొట్టమొదటి సారిగా 'జననీ జన్మ భూమిశ్చ, స్వర్గాదపీ గరీయసీ' అన్నదెవరు?

శ్రీరామచంద్రుడు మానవావతారమెత్తి, పరిపూర్ణ మైన మానవునిగా జీవించి, ధర్మ,అర్ధ,కామ, మోక్షాలను స్వయంగా అనుభవించిన తర్వాత తానే ఇలా చెప్పాడు- తల్లీ, జన్మించిన ప్రదేశమూ స్వర్గముకన్నా ఉత్తమమయినవి అని, లక్ష్మణ విభీషణాదులతో లంకలో ప్రవేశించిన తరువాత లంకలోని ఐశ్వర్యమూ,వజ్రాల భవంతులను శ్రీరామునికి చూపించి, 'ఆహా అయోధ్య కన్నా ఐశ్వర్యవంత మైనది .... ఇక్కడే ఉండి పోవచ్చు గదా...' అని శ్రీరామునితో అంటే, ఆ సమయాన శ్రీరాముడు మృదుమధురంగా 'జననీ, జన్మభూమిశ్చ, స్వర్గాదపిగరీయసీ' అని చెప్పాడు.



### 45. కార్తీక మాసంలో ఉసిరి చెట్టు క్రింద భోజనాలెందుకు?

ధాత్రి చెట్టు అనగా ఉసిరి చెట్టు క్రింద సమారాధనము చేసి బంధు మిత్ర హితులతో ఎవరు వన భోజనము చేస్తారో, ఆ సమయంలో ఎవరు పురాణం వింటారో వారు నీచజన్మలు పొందక శ్రీమహావిష్ణువు దీవెనలను సంపూర్ణంగా పొందుతారు.

అలాగే సంవత్సరంలో ఒక్కసారయినా చెట్లు బాగా వుండే వనాలకి వెళ్ళి గడపటంద్వారా శ్వాసనాళాలు రిలాక్స్ అవుతాయి. చక్కని ప్రాణవాయువును పీల్చడం ద్వారా అనేక దోషాలు శరీరం నుంచి తొలగిపోతాయి. ఉసిరిచెట్టు నుంచి వచ్చే గాలిని పీల్చడంద్వారా ఎన్నో వ్యాధులు సమిసిపోతాయి. కార్తీకమాసంలో ఉసిరిచెట్టును పూజిస్తే సమస్త విష్ణు క్షేత్రములందు విష్ణుపూజ చేసిన ఫలం వస్తుంది.

### 46. చిన్న పిల్లలు పక్క ఎందుకు తడుపుతారు?

ఊహ తెలియని వయసులో ఏవిషయం గురించైనా చిన్నారులు భయపడటం వలన, తల్లీ, తండ్రీ పోట్లాడుకోవటం చూడటంవల్లా, బాగా ఒత్తిడికి గురైనప్పుడు, అదేవిషయం గురించి ఆలోచించటమువల్ల, అలాగే స్కూల్లో తోటి విద్యార్థులు ఆడుకొను బొమ్మలు తన దగ్గర లేవని బెంగపెట్టుకోవటంవంటి వాటివల్ల కూడా పక్క తడుపుతారు. కనుక పిల్లల మనసు తెలుసుకుని ఎప్పటికప్పుడు వారిని అర్థము చేసుకుంటూ వారికి ధైర్యమూ, ప్రేమారంగరిస్తే ఆ అలవాటు క్రమంగా మానేస్తారు. చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ ప్రేమా వారికెంతో అవసరము.

### 47. విష్ణుసహస్ర నామం చదవటానికి ముందు రుద్ర శాప విమోచనం చదవాలా? వద్దా?

విష్ణు సహస్రనామాన్ని మంత్రానుష్టానంగా చేయాలంటే రుద్రశాప విమోచనాన్ని గురువు ద్వారా మంత్రోపాసనతో స్వీకరించాల్సిందే. పూజకూ, పఠనంకూ, పారాయణమునకు ఈ నియమ నిబంధనలు ఏమీలేవు.

### 48. శివలింగం ఇంట్లో ఎందుకు పెట్టుకోకూడదు?

శివునికి నిత్యపూజ జరగాల్సిందే. కావున చెయ్యగలిగితేనే శివలింగాన్ని ఇంట్లో ఉంచుకోవాలి. శివలింగానికి నిత్యము ఖచ్చితమైన సమయంలో అభిషేకమూ, నివేదన జరగాలి. అలా నిష్టగా చేసే పరిస్థితులు ఈ పోటీ ప్రపంచంలో లేవు. కాన శివలింగాన్ని అలా నిత్య పూజ చెయ్యలేన

MOHAN PUBLICATIONS.COM

ప్పుడు మహాశివుని ఆగ్రహానికి గురికావటంకన్నా, మీకు దగ్గరిలోని గుడిలో శివలింగాన్ని ఇచ్చివేయటం మంచిది.

## 49. గుడిలో ఎందుకు ప్రదక్షిణలు చేస్తారు?

'ప్రదక్షిణం' లో 'ప్ర' అనే అక్షరము పాపాలకి నాశనము...'ద' అనగా కోరికలు తీర్చమని, 'క్షి' అన్న అక్షరము మరుజన్మలో మంచి జన్మ ఇవ్వమని.'ణ'అనగా అజ్ఞానము పారద్రోలి ఆత్మజ్ఞానము ఇవ్వమని. గుడిలో భగవంతుడి చుట్టూ తిరిగే ప్రదక్షిణంలో ఇంత అర్థం ఉంది. పూర్వం ఆదిలో వినాయకుడు పార్వతీ, పరమేశ్వరుల చుట్టూ తిరిగి విశ్వానికి ప్రదక్షిణ చేసిన ఫలం పొందాడు. కావున భగవంతుని చుట్టూ చేసే ప్రదక్షిణ విశ్వ ప్రదక్షిణమవుతుంది. ఆత్మ ప్రదక్షిణ అవుతుంది. భగవంతుడా! నేను అన్ని వైపుల నుంచి నిన్నే అనుసరిస్తూ ధ్యానిస్తున్నానని అర్థం.

## 50. రాహుకేతువులకి అప్రదక్షిణము చేయాలా?

గ్రహాలకి రాజు సూర్యుడు అన్నీ గ్రహాల మధ్యన ఉంటాడు. చంద్రుడు ఆగ్నేయంగా ఉంటాడు. అంగారకుడు దక్షిణంగానూ, బుధుడు సూర్యునకు ఈశాన్యంగానూ, బృహస్పతి ఉత్తర దిక్కుగానూ ఉన్నారు. తూర్పున శుక్రుడుంటాడు. పశ్చిమ దిక్కున శనైశ్చరుడూ, నైఋతిలో రాహువూ, వాయువ్యంలో కేతువూ ఉంటారు. అయితే గ్రహాలన్నీ ఒకే విధంగా ఉంటే రాహుకేతువులు వేరుగా అప్రదక్షిణంగా తిరుగుతున్నట్టు ఉంటాయి. అయినా మనం ఆయా గ్రహాల పూజల ప్రకారమే చేయాలి.

## 51. భార్య, భర్తకు ఏ వైపుగా ఉండాలి?

సర్వ కార్యాల్లోనూ భార్య భర్తకు ఎడమ వైపునే ఉండాలన్న నియమాన్ని శాస్త్రం ఎక్కడా చెప్పలేదు. పూజలు నిర్వహించేటప్పుడూ, దాన ధర్మాలూ చేసేటప్పుడు భార్య ఖచ్చితంగా భర్తకు ఎడమవైపునే ఉండాలి.

కన్యాదానం,విగ్రహప్రతిష్ఠలప్పుడూ భార్య భర్తకుడివైపున ఉండాలి. బ్రహ్మదేవుడు పురుషుడ్ని కుడిభాగం నుంచీ, స్త్రీని ఎడమభాగం నుంచీ సృష్టించాడని పురాణాలు చెబుతున్నాయి. శ్రీమహావిష్ణువు తనభార్య లక్ష్మి దేవిని ఎడమస్థానంలో పదిలంగా ఉంచుకున్నాడు. నిద్రావస్థలో కూడా భర్త భార్యపై కుడిచేతినివేసి ఆ సమయంలోనూ రక్షణగా చూసుకుంటాడు. భర్త చేతి స్పర్శతో భార్య అనంత మైన భద్రతని పొందుతూ సుఖంగా నిద్రిస్తుంది.





## 52. గుడికి ఏఏ వేళల్లో వెళ్ళాలి ?

సూర్యుడు ఉదయించే సమయాన శ్రీమహావిష్ణువు గుడికి, సూర్యు అస్తమించిన సమయాన పరమేశ్వరుని గుడికి వెళ్ళటం చాలా మంచిది. శ్రీమహావిష్ణువు స్థితికారకుడు. కనుక ఆయన మన జీవన పోరాటంలో నిత్యం వచ్చే సమస్యలను అడ్డు తొలగిస్తాడు. మన బుద్ధి ద్వారా ఆపదలను తొలగించి మనల్ని సుఖంగా ఉండేలా చూస్తాడు. పరమేశ్వరుడు లయకారకుడు. కనుక సూర్యాస్తమయ సమయంలో ఈశ్వరుడ్ని దర్శిస్తే రెట్టింపు ఫలితాన్ని అందిస్తాడు. తొందర పడకుండా చాలా ప్రశాంతంగా భగవంతుడ్ని దర్శించాలి.

## 53. పంచకన్యా స్మరణ ఎందుకు చేస్తారు?

**"అహల్యా ద్రౌపదీ, సీతా, తారా, మండోదరీ, తథా పంచకన్యాః పఠేన్నిత్యము మహాపాతక నాశనం"**

ప్రతిరోజూ పంచకన్యా స్మరణ చేస్తే సర్వ పాపాలు తొలగపోతాయని, పురాణా చెబుతున్నాయి. ఇలా వీరిని స్మరించటం ద్వారా స్త్రీ తన ధర్మములను విస్మరించకుండా ఉంటుందని మరింత ధృఢనిశ్చయముతో స్త్రీ తనధర్మాన్ని పాటిస్తుందని నిత్యము స్మరించమంటారు.

## 54. దరిద్రుడితో స్నేహం చేస్తే ఆ దరిద్రం మన కంటుకుంటుందా?

ఖచ్చితంగా అంటుకొంటుదనే చెప్పాలి. ఎందుకంటే ప్రొద్దున లేవగానే మనకు సమస్యలూ, బాధలు అనేకం. ఇవేకదా దరిద్రానికి మూలకారణము. డబ్బులేని దరిద్రుడితో స్నేహంచేస్తే డబ్బునూ, విద్య లేనివాడితో స్నేహం చేస్తే విద్యను, సంస్కారములేని దరిద్రుడితో స్నేహం చేస్తే సంస్కారమూ మనకు తెలియకుండానే తరిగిపోతాయి. అందుకే ఏ విషయములోనైనా, ఏ రంగములోనైనా మనకంటే ఉన్నతమైన వారితో స్నేహం చెయ్యాలంటారు.

## 55. ఏ రోజున ఏ దేవుని పూజించాలి?

సోమవారం ఈశ్వరుడ్ని, మంగళవారం సుబ్రహ్మణ్యేశ్వర స్వామినీ, హనుమంతుని, బుధవారం శ్రీమహావిష్ణువునూ, గురువారం నవగ్రహాలనూ, శ్రీ షిర్డి సాయిబాబాను, శుక్రవారం అమ్మవారినీ, శనివారం శ్రీవేంకటేశ్వర స్వామినీ, ఆదివారం సూర్య భగవానుని పూజించాలి.

MOHAN PUBLICATIONS.COM

### 56. వెల్లుల్లి రక్తాన్ని గడ్డ కట్టించకుండా కాపాడుతుందా?

శక్తివంతమైనది రక్షితమైనది వెల్లుల్లి. ఇది రక్తాన్ని పలుచగా చేసి ధమనుల్లో రక్తం గడ్డ కట్టకుండా చేస్తుంది. వీలయినంత ఎక్కువగా వెల్లుల్లి, నీరుల్లిపాయలను తీసుకోవడం గుండెకెంతో మంచిది.

### 57. గుడికి వెళ్ళేటప్పుడు తలస్నానం చేసి వెళితే మరింత శుభమా?

తలస్నానం చేసి వెళితే శరీరము మొత్తం శుచిగా ఉంచుకొని దర్శనం చేసుకున్నట్టు. మన నిత్య కృత్యాలతో మనసు ఎల్లప్పుడూ అనేక విధాలుగా కామ, క్రోధ, లోభ, మదాలతో నిండి ఉంటుంది. ఆ మనసుని పవిత్రంగా, పరిశుద్ధంగా చేసుకొని వెళ్ళే ఆధ్యాత్మిక శక్తి మనకు లేదు గనుక, కనీసం శరీరం మొత్తాన్ని శుభ్రపరుచుకొని దర్శించుకుంటున్నాము. ఈ శరీరంలా మనసును శుచిగా, నిర్మలంగా ఉండేలా చెయ్యమని అర్థమే పూర్తి స్నానము యొక్క భావము.

### 58. ఏ దేవతలకి ఏం ఇష్టం?

వినాయకుడికి నివేదనా, శివునకు అభిషేకమూ, అమ్మవారికి స్తోత్రము, విష్ణువుకి అలంకారమూ, సూర్యునకు నమస్కరమూ, గురువునకు శుశ్రూష ప్రియం. స్త్రీకి చీరలూ, నగలూ, పురుషునికి ధనమూ, కీర్తి, పిల్లలకి ఆటలూ, పెద్దవారికి ఆధ్యాత్మిక చింతన ఇష్టం.

### 59. తిరుమల తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి పాదరక్షలు ఎందుకు అరుగుతున్నాయి?

శ్రీ వెంకటేశ్వరస్వామి వారి పాదరక్షలు చాలా పెద్దవిగా ఉంటాయి. అవి కాలంతోపాటు అరుగుతున్నాయి. దానికి కారణం శ్రీ వేంకటేశ్వరునికి భార్యపై ప్రేమ ఎక్కువ. శ్రీవారు రాత్రి ఆలయాన్ని మూసిన తరువాత ఈ పాదరక్షలు ధరించి, ఏడుకొండలునుదిగి అలమేలు మంగాదేవి వద్దకెళ్ళి మళ్ళీ ఏడుకొండలు ఎక్కి తన యథాస్థానానికి సుప్రభాత వేళకి చేరుకుంటాడు. అందుకే అవి అరిగి పోతుంటాయని భక్తుల ప్రగాఢ నమ్మకము.

### 60. గురువారం తిరుమల శ్రీ వేంకటేశ్వరుడ్ని మూడు రూపాలతో చూడవచ్చా?

గురువారంనాడు శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులకు మూడు రూపాలతో దర్శనము ఇస్తాడు. గురువారం ఉదయం రెండవ అర్చన అయిన తర్వాత శ్రీ వేంకటేశ్వరుడు ఆభరణాలూ, అలంకరణలూ లేకుండా దర్శన



మిస్తాడు. నొసటన సన్నని నామము మాత్రం ఉంటుంది. ఆ సమయంలో స్వామి వారి నేత్రాలని దర్శించి తరించవచ్చును. రాత్రి తోమాలసేవ అయిన తర్వాత పూలంగి సేవలో దర్శన మిస్తారు. అనగా గురువారం ఉదయం సకలాభరణములతోనూ రెండవ అర్చన తర్వాత అభరణాలు లేకుండా, రాత్రికి పుష్పాలంకరణతో దివ్య దర్శనాన్ని భక్తులకు అందిస్తారు శ్రీవేంకటేశ్వర స్వామి.

### 61. రథసప్తమి రోజు జిల్లేడు ఆకుపై రేగిపండు పెట్టుకుని తలస్నానం ఎందుకుచేస్తారు?

అమ్లగుణం గల రేగుపండూ, జిల్లేడూ ఆకూ తలకు ఎంతో మేలు చేస్తాయి. జిల్లేడు ఆకులోని రసాయనాలు జుట్టును మరింతగట్టి పరుస్తుంది. అలాగే మెదడుని చల్లబరుస్తుంది. అందుకే ఆ రోజున నదుల్లోనూ, వీలుకాకపోతే ఇంట్లోనయినా విధిగా అలా స్నానం చేస్తారు. ఈ ఆచారం కోనసీమ ప్రాంతలవారు ఎక్కువగా పాటిస్తున్నారు.

### 62. తులసిని ఆడవాళ్ళు కోయరాదా?

కోయరాదనే శాస్త్రాలు చెబుతున్నాయి. శుక్రవారం, ఆదివారం, ఏకాదశి, అమావాస్య, పౌర్ణమి రోజులలో తులసినీ ఉసిరి పత్రాన్నీ కోయ రాదు. అలాగే తులసి మొక్కను నాటడం, తొలగించటం మగవారే చేయాలని, మగవారు కోసిన తులసితోనే పూజించాలని శాస్త్రం. తులసిని కోసెటప్పుడు స్తుతించి, నమస్కరించి పురుషులు కోయాలి.

### 63. తల్లికి పెట్టే నమస్కారం ఎంత పుణ్యము?

ఆరుసార్లు భూ ప్రదక్షిణ చేసినంత, పదివేల సార్లు కాశీ వెళ్ళి వచ్చినంత, వందలాదిసార్లు సముద్ర స్నానం చేసినంత. ఇట్టి వాటికి పదిరెట్ల ఫలం మాతృవందనం ద్వారా కలుగుతుంది.

### 64. పెళ్ళిలో మంగళ సూత్రం కట్టటంలో పరమార్థం ఏమిటి?

వరుడునైన నేను వధువువైన నీ మెడలో మాంగళ్యం కడుతున్నాను. మనద్దరి జీవనం ఈ క్షణం నుంచిప్రారంభం. నిండు నూరేళ్ళు పూర్ణ ఆయుష్షుతో మనం కలిసి మెలసి ఉండాలి. 2 తాళిబొట్లు గౌరీ శంక రులు. పరస్పరం ఇద్దరం ఒక్కటై అటు అత్తింటివార్ని, ఇటు పుట్టింటి వార్ని 2తాళి బొట్లవలే ఎల్లప్పుడు కలిపి ఉంచి సుఖమయ జీవితాన్ని గడుపుతామని మంగళసూత్రం కట్టడలో అర్థం పరమార్థం.

MOHAN PUBLICATIONS.COM

## 65. పురుషుడు స్నానం ఎలా చెయ్యాలి?

స్నానమంటే హడావుడిగా 4చెంబులు నెత్తిన పోసుకొని వచ్చెయ్యటం కాదు. కొంత మంది శరీరం తడవకుండా స్నానం అయ్యిందనిపిస్తారు. స్నానం అలాచెయ్యకూడదు. అన్ని స్నానాలకన్నా సముద్రస్నానం శ్రేష్టం. ఎందుకంటే ఉప్పు నీటిలో స్నానం ద్వారా మన శరీరంలోని అనేక మలినాలు తొలగిపోతాయి.

2వది నదీస్నానం. వేకువజామున నదీ స్నానం చేస్తే అనేక చర్మ రోగాలు దూరమవుతాయి. నదీ జలాలు కొండ, కోనలనూ, చెట్టూ పుట్టలనూ తాకుతూ ప్రవహిస్తాయి. అలా ప్రవహించటం ద్వారా ఎన్నో వనమూలికల రసం నదీజలాల్లో కలుస్తుంది. అందుకనే నదీ స్నానం ఎంతో ఉత్తమమైనది. ఆరోగ్యవంతమైనది.

ఇక చివరిది ఇంటిస్నానము. అతి వేడి నీటితోగానీ, అతి చల్లటి నీటితోగానీ స్నానం చేయకూడదు. గోరువెచ్చటి నీళ్ళతో స్నానం చేస్తే శరీరానికి, శరీరంలోపల వున్న అవయవాలకి ఎంతో సేదతీరుతుంది. అనారోగ్యంగా ఉన్నవారూ, చిన్నపిల్లలూ సరైన రీతిలో వేడి లేదా చన్నీటితో స్నానం చేయాలి.

## 66. నిద్రలేవగానే ముందుగా చూడాల్సినవి

ఇష్టదైవం, సూర్యుడు, బంగారం, సముద్రం, తన ప్రతిబింబం, వయో వృద్ధులు, పుణ్యస్త్రీలూ, దూడతో ఉన్న ఆవూ, మంగళతోరణములూ, పసుపు బట్టలూ, తులసి మొక్కలూ, ఇటువంటివి చూస్తే ఇంక ఆ రోజంతా శుభప్రదంగా ఉంటుంది.

## 67. జ్యోతిర్లింగ దర్శన ఫలములు ఏమిటి?

సౌరాష్ట్ర సోమనాథుడ్ని దర్శించిన భోగభాగ్యాలు కలుగుతాయి. శ్రీశైల మల్లికార్జునుడ్ని సేవించిన సర్వదరిద్రాలు సమిసిపోతాయి. ఉజ్జయిని మహాకాలుడ్ని కొలిచిన సర్వభయ పాపాలూ హరించుకుపోతాయి. ఓంకారేశ్వరము అమరలింగేశ్వరుడు, ఇహపరాలూ, సౌఖ్యానిస్తాడు. పరళి వైద్యనాథ లింగాన్ని సేవించిన అనేక దీర్ఘవ్యాధుల నయమవుతాయి. భీమేశ్వరము భీమేశ్వరలింగాన్ని దర్శించిన శతృజయం కలిగి అకాల మృత్యు భయాలు తొలగి పోతాయి. రామేశ్వరము రామేశ్వరలింగాన్ని దర్శించి, కాశీలో గంగా జలాన్ని అభిషేకించిన, మహోన్నతమైన పుణ్యఫలం కలిగి





పరమపదాన్ని చేరుతారు. ద్వారక నాగేశ్వరుడ్ని దర్శించిన మహాపాతకాలూ, ఉపపాతకాలూ నశిస్తాయి. కాశీ, విశ్వేశ్వర లింగాన్ని సేవించిన సమస్త కర్మబంధాల నుంచి విముక్తి. నాసిక్ త్ర్యంబకేశ్వర స్వామిని కొలిచిన కోరికలు తీరుతాయి. అపవాదులు పోతాయి. హిమాలయ కేదారేశ్వర లింగాన్ని దర్శించిన వారు ముక్తిని పొందుతారు. వీరులు ఘృష్ణేశ్వర లింగాన్ని దర్శించిన ఇహపర భోగాలను అందిస్తుంది.

## 68. స్త్రీ పెళ్లైన మొదటి రాత్రి తెల్లచీరను, భర్త పోయినప్పుడు తెల్లచీరను ధరించటంలో తేడా ఏమిటి?

చాలా మంది 2 సందర్భాల్లోనూ ఒకే చీరనుకుంటారు. కానీ కాదు. రెండిటికి చాలా తేడావుంది. కొత్త పెళ్ళికూతురు పాలగ్లాసుతో భర్త దగ్గరకు చేరేటప్పుడు తీపి గుర్తుగా తెల్లచీరను ధరించి, భర్తను సమీపిస్తుంది. అటువంటి సందర్భంలో కొత్తపెళ్ళికూతురు ధరించే తెల్లచీరకు చివర అంచులుంటాయి. సరస్వతీదేవి ధరించే తెల్లటి చీరవంటి ఆ చీరను వధువు ధరించటానికి ముందు శుభ ప్రదమయిన పసుపుతో అలంకరిస్తారు. ఇక రెండో విషయానికొస్తే విధవ ధరించే తెల్లచీరకు అంచులుండవు. పసుపు రాయరు.

## 69. తిరిగి ఆడదీ, తిరక్క మగవాడూ చెడతారా?

పూర్వర విజ్ఞానం గురించి తెలియచేసే సాధనాలు ఉండేవికావు. అప్పట్లో ప్రజలు కొడుకుని దేశసంచారం పంపించి సమాజ పోకడా, మోసం, న్యాయం, ధర్మం, తెలివి, లౌక్యమువంటివి వంటపట్టించుకుని రమ్మనేవారు. అలా దేశసంచారం చేసి వచ్చిన వారికి పెళ్ళి జరిపించి బాధ్యతలను ధైర్యంగా అప్పచెప్పేవారు.

అదే స్త్రీ తిరిగితే ప్రథమంగా జరిగేది గర్భవతి కావటం ఖాయం. లౌక్యం, విజ్ఞానం సంగతి ప్రక్కన పెడితే అన్ని వైపుల నుంచి నవ్వుల కావలసింది. అందుకే స్త్రీలను ఎంత దగ్గరివాళ్ళ ఇంటికైనా పంపరు. స్త్రీనీ, ధనాన్నీ చాలా జాగ్రత్తగా భద్రపరుస్తారు, రక్షణ కల్పిస్తారు. అలాచెయ్యకపోతే ధనమయితే పోతుంది. స్త్రీ అయితే చెడుతుంది. ధనాన్నీ స్త్రీని ప్రక్క ప్రక్కన పెడితే మొదట స్త్రీని ఆశించి ఆ తరువాత ధనాన్ని ఆశిస్తాడు పురుషుడు.

MOHAN PUBLICATIONS.COM

### 70. చంటిపిల్లల్ని కాళ్ళ మీద పడుకోబెట్టుకుని స్నానం చేయిస్తారు ఎందుకు?

చిన్నారులకి స్నానం చేయించటమన్నది చాలా పెద్దపని. అందుకనే పసిపిల్లలకు అత్తగారో, అమ్మవంటి పెద్దవారో ఆ సమయంలో దగ్గరుండి స్నానం చేయిస్తు ఉంటారు. చిన్నారులుస్నానం చేసే సమయంలో నీళ్ళు చెవుల్లోకి, ముక్కుల్లోకి వెళితే చంటి పిల్లవాడికి ప్రమాదం కలిగే అవకాశం ఉంది . అందుకే తల్లి లేదా పెద్దవారు తన రెండు కాళ్ళ మీద పడుకోబెట్టు కొని, గోరువెచ్చని నీటితో స్నానం చేయిస్తారు. స్నానానికి అరగంట ముందు పిల్లవాని ఒంటికి నూనె రాసి, మెత్తగా మసాజ్‌చేసి మాడుకు ఆముదం పెట్టి, ఆ తరువాత నలుగు పిండితో స్నానం చేయించాలి. ఆవిధంగా కాళ్ళ మీద పడుకోబెట్టుకుని స్నానం చేయిస్తే పిల్లలు ఏడ్వరు...

నలుగుపెట్టి, నూనె రాసి స్నానం చేయించటం ద్వారా చిన్నారులకు వ్యాయామం అవుతుంది. తద్వారా మంచి ఆరోగ్యకరమైన శరీర పటుత్వం వస్తుంది. భవిష్యత్తులో అందంగా, ఆరోగ్యంగా పెరుగుతారు.

### 71. జపం ఏయే ప్రదేశాల్లో చేయాలి ?

ఇంట్లోలో జపం ఎంత చేస్తే అంత ఫలితము ఉంటుంది. నదీ పరిసర ప్రాంతాల్లో జపంచేస్తే రెట్టింపు ఫలితం వస్తుంది. గోశాలలో జపంచేస్తే వందరెట్లు, యాగశాలలో జపంచేస్తే అంతకు మించి ఫలితం వస్తుంది.

పుణ్య ప్రదేశాల్లోనూ, దేవతా సన్నిధిలోనూ జపంచేస్తే 10వేల రెట్లు ఫలితం వస్తుంది. శివాలయంలోగాని, శివసాన్నిధ్యంలో గాని జపంచేస్తే మహోన్నతమైన ఫలితం వస్తుంది. పులితోలు మీద కూర్చుని జపంచేస్తే మోక్షం కలుగుతుంది. అలాగే వెదురు చాపపై కూర్చుని జపము చేస్తే దరిద్రం ఆవహిస్తుంది. రాయిమీద కూర్చుని జపంచేస్తే రోగాలు వస్తాయి. కటిక నేల మీదకూర్చుని జపంచేస్తే దుఃఖము సంభవిస్తుంది. కొయ్యపీట మీద కూర్చుని జపంచేస్తే దారిద్ర్యం కలుగుతుంది. గడ్డిమీద జపంచేస్తే కీర్తి నాశనము అవుతుంది.

### 72. అట్లతద్దినాడు అట్లు ఎందుకు పోస్తారు?

ఆశ్వయుజ బహుళ తదియ నాడు వచ్చే అట్లతద్దె మహిళలకు ఓ ముఖ్యమైన పండగ. ఈ పండగరోజు అట్లుపోస్తారు. అలా పోసేటప్పుడు





అట్లకు ఎన్ని రంధ్రాలు పడతాయో, అన్ని వేల సంవత్సరాలు తమకి అయిదో తనాన్ని ప్రసాదించమని గౌరిదేవిని ప్రార్థించటమే అట్లతద్దె ఆనవాయితి. అలాగే పెళ్ళికాని వారు ఈ అట్లతద్దె జరుపుకోవటంవల్ల తమకు వచ్చే వరుడు అందగాడు, చక్కటిసంతానం కలుగుతారని ఓ ప్రగాఢ విశ్వాసం.

### 73. మసాలా దినుసులు ఆరగించడం మంచివా ? కాదా ?

మిరియాలు రక్తాన్ని గడ్డ కట్టించవు. ఆకలిని పెంచుతాయి. లవంగం రక్తం గట్టిపడకుండా నిరోధిస్తుంది. అల్లం రక్తంలో ప్రమాదంగా మారే చెడు పదార్థాలను సరిచేస్తుంది. ఇక నీరుల్లిని ఎంత పచ్చిగాతిన్నా ఉడికించి తిన్నా రక్తాన్ని నిరంతరం మన శరీరంలోకి ప్రవహింప చేస్తుంది.

### 74. ఎన్నటికీ తిరిగి పొందలేనివి ఏమిటి?

భూతకాలము, విల్లునుంచి బయటకు వచ్చిన బాణమూ, పెదవి దాటిన వాక్కు, చేజారిన అవకాశమూ ఎప్పటికీ తిరిగిరావు, ఎన్నటికివాటిని పొందలేము. కనుక కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. మాట్లాడే వాక్కుని ఆచి తూచి మాట్లాడితే ఎటువంటి అనర్థాలు జరగవు. అవకాశం చాలా తక్కువగా వస్తుంది. అప్పుడే దానిని సద్వినియోగ పరచుకోవాలి. దానిని దుర్వినియోగ పరచుకొని ఆ తరువాత అవకాశం ఎంత ఎదురుచూసినా మళ్ళీ అది రాకపోవచ్చును. అందుకే పెద్దలు అంటారు. చేతులు కాలేక ఆకులు పట్టుకుంటే ఉపయోగం లేదు.

### 75. ముక్కోటి ఏకాదశినాడు ఉత్తర ద్వారాన్ని ఎందుకు దర్శించాలి?

ముక్కోటి ఏకాదశినాడు శ్రీ మహావిష్ణువు యోగనిద్ర నుండి మేల్కొంటాడు. ఉత్తర ద్వారం నుంచి దర్శనమిస్తాడు. ఉత్తరద్వారం ద్వారా శ్రీమహావిష్ణువుని దర్శిస్తే ఎంతో పుణ్యం కలుగుతుంది. స్వామి నిద్ర లేచిన రోజున మొట్టమొదటిసారిగా ఎవరైతే దర్శనం చేసుకుంటారో వారు మనసులో కోరుకున్న కోరిక ఎటువంటిదైనా విష్ణువు తప్పకుండా తీరుస్తాడని ఓ ప్రగాఢ నమ్మకం. అలాగే ముక్కోటి ఏకాదశినాడు ఎన్ని పనులున్నా వాటిని మానుకొని ఆ స్వామిని ఉత్తర ద్వారం గుండావెళ్ళి దర్శిస్తే ముక్కోటి దేవతలూ దీవిస్తారు.

### 76. అద్దం పగిలితే అరిష్టమా? కాదా?

అద్దం పగిలితే అరిష్టమా కాదా తర్వాత కాని ముందు పగిలిన అద్దంలో మన మోహాన్ని చూసుకోకూడదు. పగిలిన అద్దాన్ని ఇంట్లో

MOHAN PUBLICATIONS.COM

ఉంచకూడదు. మరకలు పడి లేదా మాసిపోయిన అద్దాన్ని అస్సలు ఉంచకూడదు. అద్దానికీ, లక్ష్మీదేవికీ చాలా దగ్గర సంబంధం ఉంది. అద్దం అంటే లక్ష్మీదేవి స్థానం.అద్దంలో ఎప్పుడూ ఒకే బొమ్మ నిలకగా ఉండదు. లక్ష్మీదేవికూడా అంతే. అద్దం పగిలితే ధన నష్టమని పురాణాలు చెబుతున్నాయి. గాజు వస్తువు ఏదైనాసరే పగిలినప్పుడు ఎంత జాగ్రత్తగా శుభ్రపరచినా దానియొక్క రజను ఎక్కడో ఒకచోటవుండి చటుక్కున కాటు వేస్తుంది. కనుక అద్దం విషయంలో ఎన్నో జాగ్రత్తలు తీసుకుని సహనంతో పగిలిన అద్దంముక్కలను ఎవరు నడవని ప్రదేశాల్లో వాటిని పారెయ్యాలి.

## 77. దేవాలయంలోకి వెళ్ళే ముందు కాళ్ళు ఎందుకు కడుక్కోవాలి?

గుడికి వెళ్ళాలి అంటే స్నానం చేసే వెళతాము. అయినా గుడి బైట పంపు వద్ద లేదా బావి వద్ద మళ్ళీ కాళ్ళు కడుక్కొని వెళతాము. దానికి కారణం స్నానం అయ్యాక, వెళ్ళేముందు చెప్పులు ధరిస్తాము. కనుక ముందుగా గుడి బైట పాదరక్షలను వదలి, పంచభూతాల్లో ఒకటైన భూమిపై నిలబడి, పంచభూతాలకి అధిపతి అయిన నీ వద్దకు వస్తున్నామని మననం చేసుకుంటూ, ఆపాదమస్తకమూ పరిశుభ్రం చేసుకోవటానికి, తొలుత రెండు కాళ్ళు వెనక, ముందూ తడిచేలా కడుక్కుంటాము. మూడుసార్లు పుక్కిలించి నీటిని బైటకి వదలాలి.

'దేవా! శరీరమూ, వాక్కుకి మూల కారకమైన నాలుకా, నోరూ కూడా శుభ్రపరుచుకొని నీ ముందుకు వచ్చి ప్రార్థిస్తున్నాము. కావున మమ్ము దీవించు' అని అర్థం. అందుకే విధిగా దేవాలయంలోకి వెళ్ళే ముందు కాళ్ళూ, నోరూ శుభ్రపరుచుకొని దర్శించుకోవాలి.

## 78. తమలపాకు తొడిమ, చివర్లు ఎందుకు తెంపి తాంబూలం సేవిస్తారు?

తమలపాకు తొడిమ తింటే వ్యాధి రావటానికి అవకాశాలు ఎక్కువ. అలాగే చివర్లు తింటే పాపం. ఆకులో ఉండే ఈనెలు తింటే బుద్ధి మందగిస్తుంది. తమలపాకు నమలగానే ఊసివేయాలి. దానికి కారణం తొడిమ, ఈనెలూ, చివర్లు ఇంకా మిగిలి ఉంటాయి. తొలి రసం ద్వారా బైటికి వదిలెయ్యటం జరుగుతుంది. తాంబూలంలో ఒక వక్క మాత్రమే వాడాలి. రెండు వక్కలు పనికి రావు. తాంబూలాన్ని గాయాలతో ఉన్నవారూ, కంటి జబ్బులున్న వారూ, క్షయాదులున్నవారూ వేసుకోకూడదని శాస్త్రాలు





చెబుతున్నాయి. ఆకుకి రాసే సున్నం మధ్య వేలూ లేదా బొటన వేలితోనే రాసుకోవాలి. దాని వల్ల ఆయుష్షు పెరుగుతుంది. ఈ రెండు వేళ్ళ ద్వారా సున్నం వ్రాయటం ద్వారా హృదయ నరాల్లో ఉత్తేజం కలిగి హృదయం తన పని తను మరింత సులువుగా చేసుకుంటుంది.

## 79. అసలు స్నానం ఎంత సేపు చెయ్యాలి ?

ప్రతీరోజు అరగంటైనా స్నానం చేస్తే చాలామంచిది. 4చెంబులతో శరీరాన్ని బాగా తడిపి, సున్నిపిండిలాంటి వాటితో శుభ్రంగా రుద్దుకుని, ఆపై 7,8 చెంబులతో శరీరాన్ని శుభ్రపరుచుకోవాలి. మెత్తటి టవల్‌తో దేహాన్ని అద్దుకొని తుడుచుకోవాలి. స్నానమైన తరువాత దేహంలోని అవయవాలను శుభ్రంగా తుడుచుకోకపోవటంవల్ల ఎన్నో రోగాలు వచే అవకాశములున్నాయి. ప్రాణాంతకమైన క్యాన్సర్ భయంకరమైన జబ్బులు కూడా వచ్చే అవకాశము ఉంది. కనుక శుభ్రంగా స్నానం చేసి ఫ్యాన్ క్రింద ఓ నిమిషంపాటు నిల్చుని ఆపై బట్టలు ధరించండి.

మహిళలు వంటి మీద ఏమీ లేకుండా స్నానం చెయ్యాలి. మగవారు ఏదో వక గుడ్డ చుట్టుకుని స్నానం చేయాలి.

ప్రభాతవేళ 4,5 గంటమధ్య చేసే స్నానం ఋషిస్నానం అంటారు ఆ తరువాత ఉదయం 5,6 గంటలమధ్య చేసేది దైవస్నానం అంటారు. అటుపిమ్మట ఉదయం 6,7గంటల మధ్య చేసేది మానవ స్నానం అంటారు. ఇంక ఆ తరువాత చేసేది రాక్షస స్నానం. స్నానంచేసేటప్పుడు చన్నీటి స్నానం చాలామంచిది. నదీ స్నానం అన్నిటి కంటె ఉత్తమమైనది. తెల్లవారు జామున 10వేల రూపాయలు ఆదాయమొస్తున్నా మానుకొని మరీ సరైన స్నానం చెయ్యటం మంచిది.

## 80. గోవు సర్వదేవతలకు ప్రతిరూపమా?

గోవు పాలు, పెరుగు, నెయ్యి, మల మూత్రాలు ఆవునుంచి వెలువడే వీటిని పంచగవ్యములు అంటారు. గో మూత్రమునందు వానదేవుడూ, గోమయమందు అగ్నిదేవుడూ, గో ఘృత మందు సూర్యభగవానుడూ, గో దధి యందు వాయుదేవుడూ, గో క్షీరమందు చంద్రుడూ ఉంటారని ప్రశస్తి. అందుకే గోమాత పూజింపతగినదిగా, పవిత్రమైనదిగా సర్వదేవతలకు ప్రతిరూపంగా భావిస్తారు.

MOHAN PUBLICATIONS.COM

### 81. తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారిచేతులు ఎందుకు అలా ఉంటాయి?

శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించిన వారికి స్వామివారు చేతులు ఉండే తీరు విచిత్రంగానే గోచరిస్తుంది. స్వామివారి చేతులు భూమిని చూపిస్తున్నట్లు ఉంటాయి. ఆ భంగిమకు అర్థం ఏమిటంటే తనను తన పాదాలను శరణువేడిన భక్తులకు భూలోకంలో దారిద్ర్యం అంటూ ఉండదని నమ్మకం.

ఇదే విషయం శ్రీవేంకటేశ్వర సుప్రభాతంలో కూడా ఉన్నది. ఈసారి తిరుమలకు వెళ్ళినప్పుడు శ్రీవేంకటేశ్వరస్వామిని తనివితీరా చూడండి.

### 82. ఉంగారాన్ని ఎడమ చేతి వ్రేలుకే ఎందుకు పెట్టుకోవాలి?

ఎడమ చేతివ్రేలికీ, మెదడులోని రక్తనాళాలకు చాలా దగ్గర సంబంధము ఉంది. ఎడమచేతి వ్రేలికి ఉంగరం ధరించటంవల్ల మెదడు చైతన్యవంతమై ఉత్సాహంగా మనల్ని ముందుకు నడిపిస్తుంది.

### 83. ఏ పాపం చేస్తే ఏవిధంగా పుడుతారు?

బ్రాహ్మణహత్య చేస్తే పాండురోగంతో పుడతాడు. గోవునుచంపిన వాడు మరుగుజ్జుగా జన్మిస్తాడు. స్త్రీని హత్య చేసినవాడు నిత్యం జబ్బులతోనే జీవించేటట్లుపుడతాడు. మాంసాన్ని తిన్న బ్రాహ్మణుని కుష్ఠువ్యాధితో పుట్టి సర్వబాధలు పడతాడు. పురాణాలను,శాస్త్రాన్ని అవమానించినవాడు క్షయరోగంతో పుడతాడు. అబద్ధపు సాక్ష్యం చెప్పినవాడు మూగవాడిగానూ, అబద్ధాలని వినేవాడు చెవిటివాడుగానూ, ఉప్పును దొంగిలించినవాడు చీమగానూ, నిత్యం వ్యభిచారంచేసినవాడు అడవిలో ఏనుగుగానూ, పిలవని పేరంటానికి వెళ్ళినవాడు కాకిగానూ, స్నేహితుని మోసంచేసినవాడు గ్రద్ధగానూ, అమ్మకంలో మోసం చేసినవాడు గుడ్లగూబగానూ, భర్తను హింసించే స్త్రీ జలగగానూ, భర్తను మోసంచేసిన స్త్రీ బల్లిగానూ, గురుపత్నితో సంభోగంచేసినవాడు తొండగానూ, అతికామాన్ని కలిగినవాడు గుర్రంగానూ జన్మిస్తాడు. భార్యని హింసిస్తే వచ్చే జన్మలో మేకగా పుడతాడు.

### 84. స్త్రీల అలంకారములు పదహారు... అవి ఏమిటి?

1. దంత ధావనము 2. నలుగు పెట్టి స్నానము 3. పసుపు పూత 4. చీర, రవిక 5. పారాణి 6. శిరోజాలంకరణ 7. పుష్పాలంకరణ 8. పాపిట కుంకుమ 9. బుగ్గన చక్కటి చుక్క 10. లలాట తిలకము 11.





గోరింటాకు 12. తాంబూలము 13. పెదవులకి ఎరుపు 14. కంటికి కాటుక 15. సర్వాభరణ అలంకరణ 16. పెళ్ళిఅయిన వారికి మంగళ సూత్రమూ, నల్లపూసలూ, మెట్టెలు.

### 85. సాలగ్రామములు నిజంగా-శక్తివంతమైనవా?

1. ఎరుపు సాలగ్రామము : సామ్రాజ్య పదవీ సంక్రమిస్తుంది.
2. తెలుపు సాలగ్రామము : ప్రాపంచిక అవసరాలను తీరుస్తుంది.
3. పసుపు సాలగ్రామము : లక్ష్మీదేవిస్థానం, సకల సిరిసంపదలు.
4. బూడిదరంగు సాలగ్రామము: డబ్బుతోకూడిన పేరు ప్రఖ్యాతులు.
5. ముదురురంగు సాలగ్రామము: వీటిని అస్సలు పూజించరాదు.

### 86. మాంసాహారుల పూజలు ఫలిస్తాయా? ఫలించవా?

శాఖాహారము సాత్విక గుణానికి ఎంతో ఉపయోగపడుతుంది. మనసును ప్రశాంతంగా ఉంచుతుంది. భగవదనుగ్రహం కలగటానికీ, భక్తి, చిత్తశుద్ధి మనలో పెరగటానికి శాఖాహారం ప్రధానమవుతుంది.

మంసాహారము మన ఆయుష్షును హరిస్తుంది. శాఖాహారము తినేవారినీ, మాంసాహారము తినేవారిని క్షుణ్ణంగా పరిశీలిస్తే శాఖాహారులకే ఎక్కువ ఆయుష్షుతోపాటు ఆరోగ్యం కూడా సమపాళ్ళలో ఉంటుంది.

### 87. గుడిలో రావిచెట్టు, వేపచెట్టు ఎందుకు కలిసి ఉంటాయి?

సాధారణంగా ప్రతీ గుడిలో రావి, వేప చెట్లు కలిసే ఉంటాయి. రావిచెట్టును శ్రీమహావిష్ణువుగానూ, వేపచెట్టును లక్ష్మీదేవి అంశగానూ భావించాలని పురాణాలు చెబుతున్నాయి. ఈ జంట వృక్షాలను పూజించి ప్రదక్షిణం చేయటం ద్వారా ఎన్నోదోషాలు తొలగి పరిపూర్ణ సుఖజీవనం పొందుతారు. శనిదోషం ఉన్నవారు రావిచెట్టుకు పూజచేయాలి. రావిచెట్టుకు నమస్కరిస్తే ఎన్నోదోషాలు తొలగిపోతాయి.

శ్రీకృష్ణపరమాత్ముడు అంత్యదశలో ఈ చెట్టు క్రిందే విశ్రమించి వైకుంఠాన్ని చేరుకున్నట్లు ప్రశస్తి. అలాగే వేప చెట్టు గాలికి కూడా ఎన్నో జబ్బులుదూరమవుతాయి. మనం పెంచినా పెంచక పోయిన పవిత్ర ప్రదేశంలో పవిత్రమైన వృక్షాలు వాటికవే పెరుగుతాయి. రావిచెట్టు ఇంటి పరిసర ప్రాంతాలలో ఉండకూడదు. వేప చెట్టును ఇంటికి ముందుకాని వెనుకగాని వేసుకోవాలి. ఇంటి ముందు వేప చెట్టుంటే ఏ జబ్బులు రావు.

MOHAN PUBLICATIONS.COM

## 88. ఏదేవుని ఏ సమయాల్లో పూజించాలి?

తెల్లవారుజామున 3గంటలకు శ్రీమహావిష్ణువును పూజిస్తే ఆయన దయ మనపై అపారంగా ఉంటుంది. ప్రాతఃకాలము సూర్యభగవానుని ఉదయం 6గం॥లోగ పూజించాలి. ఈ సమయంలోని పూజ శ్రీరామచంద్రు నికి, శ్రీవేంకటేశ్వర స్వామికి కూడా ఇష్టమైనది. ఉదయం 6-7 గం॥ వరకూ పరమశివుడ్నీ, దుర్గదేవిని పూజిస్తే మంచి ఫలితము కలుగుతుంది. మధ్యాహ్నము 12 వేళ హనుమంతుని పూజించిన ఆయన కృపకు పాత్రులవుతారు. సాయంత్రము 3 గంటలకు రాహువును పూజిస్తే మంచి ఫలితము కలుగు తుంది. సూర్యాస్తమయమున శివపూజకు దివ్యమైన సమయం. రాత్రి 6-9 గం॥వరకూ లక్ష్మీదేవిని పూజిస్తే ఆమె కృపాకటాక్ష ములు మనపై ఎప్పుడూ ఉంటాయి.

## 89. వాస్తు శాస్త్రమును ఎప్పటినుంచి అవలంభిస్తున్నారు?

పురాతన కాలంనుంచి అంటే మహాభారతం జరిగిన కాలం నుంచీ వాస్తుశాస్త్రమును అవలంభిస్తున్నట్లు వుంది. రామాయణంలో అరణ్యవాస సమయంలో లక్ష్మణుడు కుటీరం నిర్మించగానే శ్రీరాముడు సీతాదేవితో కలిసి వాస్తుపూజచేసి గృహప్రవేశం చేశారు. విశ్వకర్మ, మయుడూ, వాస్తు శాస్త్రనిపుణులే, ఆరోగ్యానికీ, ఆహ్లాదానికీ, ఆనందానికీ అన్నింటికీ మూలమే వాస్తుశాస్త్రమే. సుగ్రీవుని పట్టాభిషేకము తరువాత సీతాన్వేషణకు నిరీక్షిస్తున్న సమయంలో శ్రీరామలక్ష్మణులు వాస్తు చూసుకునే కొనసాగారు.

## 90. తిలకాన్ని ఎందుకు ధరించాలి?

మన దేహంలోని ప్రతి అవయవానికి ఒక్కొక్క అధిదేవత ఉన్నారు. అలాగే నుదుటన బ్రహ్మదేవుడు అధిదేవత. నుదురు బ్రహ్మస్థానం. బ్రహ్మ రంగు ఎరుపు. కనుక బ్రహ్మస్థానమైన నుదుటున ఎరుపు రంగు తిలకం తప్పనిసరిగా ధరించాలి.

నుదుటున సూర్యకిరణాలు సోకరాదు. మనలోని జీవి, జ్యోతి స్వరూపడిగా భూమిమధ్యమంలోని ఆజ్ఞాచక్రంలో సుషుప్త దశలో హృదయ స్థానంలో అనగా అనాహత చక్రంలో ఉంటాడు. కనుక తిలకాన్ని ఉంగరపు వ్రేలితో పెట్టుకుంటే శాంతిచేకూరుతుంది. నడివ్రేలుతో ధరిస్తే ఆయుష్షు పెరుగుతుంది. బొటనవ్రేలితో ధరిస్తే శక్తివస్తుంది. చూపుడు వ్రేలితో ధరిస్తే భక్తీ, ముక్తీ కలుగుతుంది.





ప్లాస్టిక్ బొట్టు బిళ్ళలకన్నా సాధారణ కుంకుమ ధరిస్తే జ్ఞానచక్రాన్ని పూజించినట్టు అవుతుంది.

కుడిముక్కురంధ్రం పేరు పింగళ. ఎడమ ముక్కు రంధ్రంపేరు ఇడ. ఈ రెంటినీ పైకిఏటవాలుగా పంపిస్తే ఆ రెండూ కలిసేచోట అంటే భ్రూమ ధ్యంలో ఉండేది సుషుమ్నానాడీస్థానం. ఆ సుషుమ్న శిరస్సు మధ్యలో ఉన్న బ్రహ్మ రంధ్రం నుండి వెన్నెముక చివరి వరకు నిటారుగా ఉంటుంది. ఈ మూడు కలిసేచోట బొట్టుపెట్టాలి. శైవులైతే అడ్డంగాగీసే మూడు గీతలలో పైన క్రింది గీతలని రెండు వేళ్లతో ఎడమ నుండి కుడికి గీసి, మధ్యగీతని కుడి నుండి ఎడమకి గీయాలి. అదే వైష్ణవులైతే అటు ఇటు గీతలని ఇడ పింగళనాడులకి గుర్తుగా నిటారుగా గీసి, మధ్యలో సుషుమ్నం ఉందని మరోగీతని గీయాలి. ఎవరైనా కనుబొమ్మల మధ్యనే బొట్టు పెట్టాలి.

అనుష్ఠానంచేసినా, అర్చనచేసినా వైదిక కర్మకాండలుచేసినా, సంస్కార విధులు నిర్వర్తిస్తున్న నుదిటిపై, శరీరంపై తిలకధారణ చేయడం ఆచారం. తిలకం పెట్టుకోకుండా చేసే ఏ కార్యమూ సఫలీకృతం కాదు.

కుంకుమ, సింధూరం, హోమభస్మం, చందనం, రావి, తులసి చెట్ల మొదలులో ఉన్నమట్టి మొదలైన తిలకాలను ఉపయోగిస్తారు. దేవీదేవతలకు బొట్టు పెట్టేటప్పుడు అనామిక వ్రేలుతో, స్వయంగా బొట్టు పెట్టుకొనేటప్పుడు మధ్యవ్రేలితో, పితృగణాలకి చూపుడు వ్రేలుతో, బ్రాహ్మణులు, శ్రేష్ఠవ్యక్తులకు పెట్టేటప్పుడు ఉంగరం వ్రేలుతో పెట్టాలి.

కనుబొమ్మల మధ్య తిలకధారణ చేస్తే అక్కడ ఉండే ఆజ్ఞాచక్రం మేల్కొం టుంది. మానవునియొక్క శక్తి ఊర్ధ్వగామి అవుతుంది. తిలకధారణ వల్ల శరీ రంలో చల్లదనం వచ్చినట్లనిపిస్తుంది. ఉదాసీనత పోతుంది. ఓజస్సు, తేజస్సు పెరుగుతుంది. నుదిటిపై తిలకం వశీకరణ మంత్రంలాటిది. ఇది చూపరులకు ఆకర్షితులనుచేస్తుంది. దుష్టశక్తుల నుంచి రక్షిస్తుంది. మనోవాం ఛలు తీరుస్తుంది. ఆబాలగోపాలం తిలకధారణచేయండి. సంప్రదాయాన్ని పాటించండి.

## 91. బిల్వ వృక్షం ఎక్కడ పుట్టింది?

శ్రీమహావిష్ణువు తన సతితో కలిసి శివుని గూర్చి తపస్సు చేస్తుండగా లక్ష్మీదేవి కుడిచేతి నుంచి బిల్వవృక్షం జన్మించింది. మహాశివుడు ప్రత్యక్షమై జగద్రక్షణ భారాన్ని శ్రీ మహావిష్ణువుపై ఉంచాడు.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

శ్రీవృక్షమనే పేరుతో కూడా పిలిచే ఈ బిల్వ వృక్షంను దేవతలు స్వర్గంలోనూ, మందర పర్వతం పైనా, వైకుంఠంలోనూ నాటారు. శివుని కిష్టమైన ఈ బిల్వ వృక్ష ఆకులతో ఏ రోజైనా పూజ చేయవచ్చు. సోమవారం కోస్తే సోమవారం నాడే పూజకి వినియోగించాలి. ఎండినా, కోసి రెండు మూడు రోజులైనా శివపూజకు వాడకూడదు. బిల్వ వృక్షానికి ప్రదక్షిణలు చేస్తే సమస్త దోషాలు పోతాయి. సంతానం లేని వారికి సంతానం కలుగుతుంది. బిల్వ వృక్ష పత్రం లక్ష బంగారు పువ్వులతో సమానము.

## 92. షష్టి పూర్తి వేడుకలు ఎందుకు చేసుకోవాలి ?

ఇరవై సంవత్సరాల బాల్యమూ, మరో నలభై సంవత్సరాలు యవ్వనమూ, కౌమారాలతో అరవై నిండిపోతాయి. అప్పటికే ఎంతో అలసి పోతారు తప్పులూ, ఒప్పులూ, కష్టాలూ, నష్టాలూ, అయిన వార్ని దూరం చేసుకోవటమూ వంటి వన్నీ అనుభవించి, అరవైకి చేరుకున్నాక వెనుతిరిగి చూసుకోవటమే షష్టిపూర్తి. కోపావేశాలూ, పగలూ, ప్రతీకారాలూ, పట్టుద లలూ వదలి అందర్నీ ఆహ్వానించి, అన్ని తప్పులనూ క్షమించటమే కాకుండా తనను క్షమించగలిగే వారికి క్షమాపణ చెప్పి అందర్నీ ఆహ్వానించి చేసుకునే పండుగే షష్టిపూర్తి. ఆ వయసు వచ్చేటప్పటికి అలా షష్టిపూర్తి చేసుకోవటం ద్వారా తను వదిలేసిన కర్మలేమున్నాయో తెలుస్తుంది. అందుకే ఆ సమయంలో తులా భారం తూగి ధనాన్ని పేదలకి పంచుతారు. అయిన వారికీ, ఆడపిల్లలకీ కావలిసినవన్నీ ఇస్తారు.

## 93. దీపారాధనలో తెలియకుండా చేసే పొరపాట్లు ఏమిటి?

స్టీలు కుందుల్లో దీపారాధన చేయరాదు. అగ్గిపుల్లతో దీపాన్ని వెలిగించరాదు. ఒకవత్తితో దీపాన్ని చేయరాదు. ఏకవత్తి శవం వద్ద వెలిగిస్తారు. దీపాన్ని అగరవత్తితో వెలిగించాలి. దీపారాధన కుందికి మూడుచోట్ల కుంకుమ పెట్టి అక్షితలు వేయాలి. విష్ణువుకు కుడివైపు ఉంచాలి. ఎదురుగా దీపాన్ని ఉంచరాదు. దీపం కొండెక్కితే 108 సార్లు 'ఓం నమశ్శివాయ' అని జపించి దీపం వెలిగించాలి.

## 94. పిడుగులు, ఉరుములు పడేటప్పుడు 'అర్జునా, ఫాల్గుణా' అని ఎందుకు పెద్దలు అనమంటారు?

వానపడే సమయంలో పిడుగులు పడటం ప్రకృతి ధర్మము. ఆ సమయంలో చెట్టుక్రింద ఉండరాదు. అలాగే అర్జునా, ఫాల్గుణా అనటంలో





కూడా ఓ గొప్ప కథఉంది. మహాభారత సమయంలో అజ్ఞాతవాసాన్ని ముగించిన అర్జునుడు ఆయుధాలకోసం ఉత్తరుడిని శమీవృక్షం వద్దకు తీసుకువస్తాడు. ఉత్తర గోగ్రహణం ద్వారా ఆవులను తరలించుకు పోతున్న దుర్యోధన, కర్ణాదులను ఎదిరించడానికి ఆయుధాలను శమీవృక్షం మీద నుంచి క్రిందకు తీసుకురమ్మాంటాడు. అప్పుడు ఉత్తరకుమారుడు భయపడుతుంటే, తనకున్న పదిపేర్లనుచెప్పి ఉత్తర కుమారుడి భయం పోగొట్టి ధైర్యాన్ని కలిగిస్తాడు.

ఆ పదిపేర్లు ఏమిటంటే... అర్జునా, ఫాల్గునా, పార్థ, కిరీటి, శ్వేతవాహన, భీభత్స, విజయ, కృష్ణ, సవ్యసాచీ, ధనుంజయ, ఇవన్నీ కూడా అర్జునుడి పేర్లే కనుక ఆ పది పేర్లలో పిడుగులు,ఉరుములు వచ్చినప్పుడు ఏఒక్కపేరును తలచుకున్నా భయం పోతుంది. కొన్ని ప్రాంతాల్లో పిడుగు పడుతున్నప్పుడు అర్జునుడి రథచక్రంయొక్క సూల విరిగిపోయిందని అదే పిడుగుగా మారిందని చెబుతారు. అలా చెప్పటంలో కూడా అర్జునుడిని తలచికోవడవే కనబడుతుంది.

## 95. బల్లిమీద పడితే ?

కనుబొమ్మలపై పడితే ధన లాభము. వెనుక మెడపైన పడితే ఆపదలు. రొమ్ముపై పడితే జయము. కడుపుపై పడితే సంతానప్రాప్తి. భుజములపై పడితే ఆరోగ్యము. మణికట్టు మీద పడితే గర్వభంగము. వెన్ను ముక మీద పడితే ఈతి బాధలు. పిరుదులపై పడితే స్త్రీ సుఖం. తొడలపై పడితే భోగము. మోకాలిపై పడితే వాహనప్రాప్తి. జుట్టు మీద పడితే సంకటములు స్త్రీల జడల మీద పడితే ఆందోళన.

## 96. భార్యను సంతోషపెడుతూ బ్రహ్మచర్యం ఎలా పాటించాలి?

పెళ్ళి చేసుకొన్న భార్యను తగిన విధంగా భర్త సంతోషపెట్టాలి.

పరాయి స్త్రీలను మనసులో ఉంచుకోకుండా భార్యతోనే గడపాలి. మహిళలకు ప్రకృతిసిద్ధమైన 16 రోజులూ శృంగారం నిషేధం.

అనగా రజస్వలకు ముందు, వెనుక రోజులతో పాటు మొదటి 4 రాత్రులూ అలాగే 11వ, 13వ రాత్రులు తప్ప మిగిలిన 10రాత్రులూ భార్యతో సంగమమునకు శుభప్రదమైనవి. అమవాస్య, పౌర్ణమి రాత్రుల యందు నిషేధం. ఆ 2 రోజులు వదిలి భార్యతో సంగమించినచో బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించినంత పుణ్యం దక్కుతుంది.

MOHAN PUBLICATIONS.COM

## 97. యజ్ఞ భస్మములో ఎన్ని వనమూలికలు ఉంటాయి?

రావీ, మోదుగా, మేడీ, ఉత్తరేణూ, జమ్మీ, జిల్లేడూ, చంద్రా దేవదారూ, దర్భ,జువ్వీ లాంటి వాటితో యజ్ఞము నిర్వహించిన తరువాత లభించేదే యజ్ఞభస్మము. ఈ భస్మము చాలా పవిత్రమైనదీ.

## 98. కార్తీక స్నానమెందుకు?

ఈ మాసంలో సూర్యోదయానికి ముందు స్నానం చేస్తే ఆయురారోగ్యాలు కలుగుతాయి. మెడ వరకూ నీటిలో ఉండి స్నానం చెయ్యటం ద్వార ఉదర వ్యాధులు నయమవుతాయి. కార్తీక స్నాన విషయంలో ఓ ఆరోగ్య సూత్రం కూడా ఉంది. వర్షాకాలంలో పడిన నీరు భూమిలోకి ఇంకి బలమైన అయస్కాంత మండలం ఏర్పడుతుంది. వర్షాకాలం తర్వాత వచ్చే కార్తీకమాసంలో ప్రవహించే నదుల్లో అయస్కాంత శక్తి అపారంగా ఉంటుంది. దాని వల్లే కార్తీక మాసంలో నదీ స్నానమూ, సముద్ర స్నానమూ చేయమంటారు. హరిహరాదులకు ప్రీతికరమైన మాసం కార్తీకమాసము. ఈ మాసములో నదీ సముద్ర స్నానమూ, దీపారాధన ఎంతో పవిత్రము. పురుగులూ, మిడతలూ, చెట్లూ, పక్షులూ ఇలా అనేక జీవులు కార్తీక దీపాన్ని చూసి తమ జన్మరాహిత్యాన్ని పొందుతాయి.

## 99. ఆడపిల్ల నీళ్లోసుకుందని అంటారు ఎందుకని ?

సాధారణంగా స్త్రీలు నెలతప్పగానే నీళ్ళోసుకుంది అనే అంటారు. అంటే స్నానం చెయ్యటంకాదు. ఆమె గర్భశయంలో పిండం పడగానే ఉమ్మనీరు పుడుతుంది. దానినే మన పెద్దలు నీళ్ళోసుకుందని అంటారు.

## 100. భగవద్గీతను ఎవ్వరైనా చదవచ్చా?

భగవద్గీతను సాధువులూ, సన్యాసులూ, వేదాంతులూ మాత్రమే చదవాలనీ, అలాగే మడిబట్టలతోనూ, పంచెనూ ధరించి గీత చదవాలనీ, స్త్రీలు చదవరాదని కొన్ని అపోహలున్న మాట వాస్తవమే అయిన అది తగదు.

దాహమేసిన వారు దాహాన్నితీర్చుకున్నట్టు, రోగమొచ్చిన వారందరూ ఔషధాన్ని తీసుకున్నట్టు, భగవంతునిపై భక్తి ఉన్న వారంతా చదవటానికి అర్హులే. అలాగే భగవద్గీత అందరి కోసం. కులమత లింగ బేధములు లేవు. తపశ్శీలత లేనివారికీ, భక్తి లేకుండా ఉన్నవారూ, గురుభక్తి లేనివారూ, ద్వేషాన్ని కురిపించే వారూ వీరు భగవద్గీత చదువుటకు అనర్హులు.





## 101. స్త్రీ ధనాన్ని ఆశించరాదు.... ఎందుకని?

పరుల ధనాన్ని ఆశించటం మహాపాపం. స్త్రీ ధనాన్ని అపహరిస్తే ఆ పాపం మాములు పాపం కన్నా పదిరెట్లు అగును. స్త్రీలు మగవారివలే భోగులు కాదు. వారి ధనాన్ని సంతానం కోసమూ, కుంటుంబం కోసమూ, దైవకార్యాల కోసమే ఖర్చు చేస్తారు. అట్టి ధనాన్ని అపహరించటమూ, ఋణం తీసుకొని తిరిగి ఇవ్వకపోవటం పాపాలన్నింటిలో కెల్లా మహా పాపము. ఈ పాపంకన్నా స్త్రీ శీలాన్ని ఆశించటము మహాఘోరాతి ఘోరమైన పాపము. స్త్రీ తన శరీరాన్ని ధర్మబద్ధంగా తల్లీ, తండ్రీ దానమిచ్చినవాడికి అనగా తన అయిదోతనానికి చిహ్నమైన భర్తకే అర్పిస్తుంది. అలాంటి స్త్రీని ఏ విధంగా లోబరుచుకొని అనుభవించినా అది పాపమే.

## 102. గోత్రాలు ఎలా పుట్టాయి?

పురాతన కాలంలో వారందరికీ గోవులే ధనం. ఓ చోట నుండి మరోచోటికి వలసలు కూడా వెళుతుండేవారు. అలాంటి సమయంలో గోరక్షణకి గాను గోత్రములు ఏర్పరిచారు. ఒకరి గోవులు, మరొకరి గోవుల్లో కలసి పోవటం వల్ల వచ్చే గొడవలని గోత్రపాలకులు తీర్చేవారు. అలాగే తగువులు తీర్చిన గోత్రపాలకులు తపోనిష్ఠతో ఉండేవారు. క్రమశిక్షణతో ధర్మ అర్థాలని బోధించేవారు. అలాంటి గోత్రపాలకుల పేర్లే ఆపై వారివారి సంతానానికి గోత్రాలయ్యాయి. వారి వంశక్రమంలో జన్మించిన వారు వారి వారి మూల పురుషులను 'గోత్ర' నామంతో ఆరాధిస్తున్నారు. పూజల్లో, యజ్ఞాల్లో, వివాహ సంబంధమైన విషయాల్లో గోత్రం యొక్క పాత్ర ఎంతో ఉంటుంది.

## 103. అమావాస్య మంచిరోజు కాదా?

చాలామంది అమావాస్య మంచిది కాదంటారు. మహాభారత యుద్ధం పాండవులు అమావాస్య నాడే ప్రారంభించారు.

విజయాన్ని సాధించారు. అధర్మాన్ని ఓడించి, ధర్మాన్ని గెలిపించిన ముహూర్తమిది. కొన్ని రాష్ట్రాల్లో అమావాస్య మంచిరోజు. ఆ రోజు కోసం వేచి ఉండి పనులు ప్రారంభిస్తారు. శుభకార్యాలు జరుపుకుంటారు.

## 104. గుడిలో స్త్రీలను పూజారులుగా ఎందుకు నియమించరు?

దేవుని రూపమైన విగ్రహాలకి మంత్ర యంత్రాలతో ప్రతిష్ఠ జరిగాక అవి అనంతమైన శక్తిని పొందుతాయి. సాక్షాత్తు దైవస్వరూప అంశ ఆ

MOHAN PUBLICATIONS.COM

విగ్రహానికి వస్తుంది. నిత్య దీప ధూప నైవేద్యాలు తప్పనిసరిగా ఉంటాయి. మడి,ఆచారము అత్యవసరం.

స్త్రీలలో ప్రకృతి సహజంగా దూరంగా ఉండాల్సిన రోజులు కొన్ని ఉంటాయి. ఏ సమయంలో అలా జరుగుతుందో స్త్రీలకే తెలీదు. అటువంటప్పుడు దేవాలయాల్లోవారు పూజారులుగా ఉండి పూజలను నిర్వహిస్తూంటే దైవదోషం అవుతుంది. మళ్ళీ ఎన్నో శుద్ధిప్రక్రియలు చేయాలి. అందుకే దేవాలయాల్లో స్త్రీలను పూజారులుగా ఉంచరు. గుడిలో సహితం శుభ్రపరిచేందుకు స్త్రీలను నియమించరు.

**105. పిల్లలు పుట్టని వార్ని రావిచెట్టుకు ఎందుకు ప్రదక్షిణలు చెయ్యమంటారు?**

పిల్లలు కలగనివారిని రావిచెట్టుకు ప్రదక్షిణాలూ, తీర్థయాత్రలూ చెయ్యమంటారు. తీర్థయాత్రలు చెయ్యటం ద్వారా అలసిపోతారు. దానికి తోడు ప్రశాంతత వస్తుంది. మానవ సహజమైన ఆర్థిక బాధలూ, వ్యాపార వ్యవహారాల గూర్చి పెద్దగా పట్టించుకోకపోవటం వల్ల మనసు తేలిక పడుతుంది. తర్వాత ఇద్దరూ ఎక్కువసార్లు ఏకమవ్వటం వల్ల సంతానం కలిగే అవకాశం ఎక్కువ. అలాగే రావిచెట్టుకు ప్రదక్షిణం చెయ్యటం ద్వారా సంతానం కలగకపోవటానికి కారణమైన దోషాలని రావిచెట్టు గాలి తొలగిస్తుంది.

**106. కన్యాదాన ఫలమెంత?**

గంగా నదిలో ఇసుకను సప్తర్షి మండలం వరకూ పోసి వెయ్యి సంవత్సరాల తర్వాత ఒక్కొక్క ఇసుక రేణువును ఇసుక కుప్ప నుంచి తీసి వేసే సమయమంత కన్యాదాత బ్రహ్మలోకంలో నివాసముంటాడు. నువ్వులను సూర్యమండలం వరకూ పోసి ఒక్కొక్క గింజను తీసినంత కాలము స్వర్గసుఖాలూ కన్యాదాత బ్రహ్మలోకమున పొందును. మినుములను ధ్రువమండలం వరకూ పోసి, వెయ్యి సంవత్సరాల తర్వాత ఒక్కొక్క గింజనుతీసి వేసే సమయమంత కన్యాదాత బ్రహ్మలోకమున ప్రకాశించును.

**107. సహపంక్తి భోజనాలందు అందరూ ఒకేసారి లేవాలని ఎందుకు చెబుతారు?**

సహపంక్తి భోజనానికి కూర్చున్న అందరివీ ఒకే జీవన ప్రమాణ ముల అయి ఉండవు. మంచీ, చెడు అలవాట్లతో రకరకాల వాళ్ళు ఉంటారు. వారి వారి శరీరాల్లో విద్యుత్ వారివారి శరీరపు శక్తి ప్రకారం పని చేస్తుంది.





సహపంక్తిలో కూర్చున్నప్పుడు దాదాపు శరీరపు భాగాల విద్యుత్ నియంత్రణ ఒకే రకంగా ఉంటుంది. శక్తిహీనుడయిన వ్యక్తి ముందుగా లేచాడను కుందాం. అతడు శక్తిహీనుడయితే మిగతావారి శక్తి ఎంతో కొంత లాగేసు కుంటాడు. అయినా ఆహారమూ, నిద్రా, సంభోగము మూడింటికి అడ్డు అవసరం.

**108. గొబ్బిళ్ళూ ముగ్గులు వేయటం ప్రయోజనము ఉన్నదా ?**

ముగ్గులూ, పండుగ దినాల్లో గొబ్బిళ్ళూ లక్ష్మీదేవికి ప్రీతికరము, మంగళకరములు. స్త్రీలకు అదొక నిత్య వ్యాయామము. ముగ్గులోని సున్నపు పొడి వల్ల పరిసరాల్లోని సూక్ష్మక్రిములు నశింపచేసి పిల్లాపాపలకు అనారోగ్యాలు చేస్తుంది.

పేడనీళ్ళు కళ్ళాపి చల్లి, రకరకాల ముగ్గులు పెట్టి, గొబ్బిళ్ళను అలంకరించి, రకరకాల రంగులు చల్లి ఆనందపడటం హృదయానికే కాదు కనులకూ మంచిది. దానితో పాటు శరీరంలోని అనేక రోగాలను పోగొట్టే శక్తి గోమయానికీ, ముగ్గుపొడికి ఉంది.

**109. వివాహవేడుకల్లో స్నాతకము ఎందుకు చేస్తారు ?**

దీనినే సమావర్తనము అనికూడా అంటారు. బ్రహ్మచర్య కాలంలో ధర్మవిధులను సకాలంలో చేయకుండా అనగా, భోజన విధులూ, స్నానమూ, జందెము ధరించకపోవుటా, ఇత్యాది వాటితో పాటు జూదమూ, మద్యమూ, పరస్త్రీతో సంభాషణలూ, అసభ్య గీతాలను వినుటా, ఇటువంటి వెన్నోవాటి ద్వారా దోషములు కలుగుతాయి. అట్టివన్నీ పోవటానికి చేసేదే స్నాతకము. తెలిసీ తెలియక చేసిన అన్నిదోషములూ ఈ స్నాతకము ద్వారా సమసి పోతాయి.

**110. శ్రీరామనామ మహిమ అంత గొప్పదా ?**

విభీషణుడు ఓ కార్యం కొరకై శ్రీరామునికి ఓ సందేశం పంపదలచి, సేవకునితోచెప్పి వెళ్ళిరమ్మన్నాడు. ఆ సేవకుడు తాను లంకను దాటి సముద్రాన్ని మీదుగా అయోధ్యను చేరగలిగే శక్తి తన వద్ద లేదని చెప్పాడు. దానికి విభీషణుడు ఓ పత్రం ఇచ్చి, ఇదే సముద్రాన్ని దాటిస్తుందని, మళ్ళీ నా కడకు వచ్చే వరకూ విప్పి చూడరాదని చెప్పాడు. ఆపై సేవకుడు ఆగ మేఘాల మీద ఆకాశగమనం చేయసాగాడు. ఆ సేవకుడు సముద్రాన్ని దాటుతూ, ఆ పత్రంలో అంత శక్తి ఏముందా అని చూశాడట. 'శ్రీరామ'

MOHAN PUBLICATIONS.COM

అని ఉందంట. 'ఓసి ఇంతేనా' అనుకున్నాడో లేదో టప్పున సముద్రంలో పడిపోయాడంట. రామనామాన్ని ఎంత నమ్మితే అంత శక్తి వస్తుంది. అంతే కాదు నమ్మకమే మనిషికి బలమైన శక్తి. నమ్మి మోసపోయిన వాడు లేడనేది ఇందుకే.

**111. సంబంధాన్ని ఎలా కుదుర్చుకోవాలి?**

ఏడుతరాలు తండ్రి వంశస్థులతోనూ, ఆరుతరాలు తల్లి వంశస్థుల తోనూ ఎలాంటి రక్త సంబంధంలేని స్త్రీ పురుషుల మధ్య వివాహం జరగాలి. అలాగే ఏకగోత్రీకుల కాకూడదు. వివాహమంటే 'ఎత్తుకుపోవటం' పురుషుడు స్త్రీతో సర్వ ధర్మాలనూ, సుఖాలనూ సమంగా కలిసి చేస్తానని చెప్పి తల్లీ, తండ్రీ అన్నదమ్ములూ, సోదరీమణులూ, బంధుమిత్రులకీ చెప్పి వారి ఇష్టంతో ఎత్తుకు పోవటమే పెళ్ళి.

**112. సీమంతము చేసేదెందుకు?**

గర్భం ధరించిన స్త్రీకి గర్భదోషాలు తొలగిపోవటానికి, దానితో పాటు భూతాదిగ్రహ బాధలు తల్లికి, బిడ్డకి తగలకుండా సుఖంగా ప్రసవించ టానికి ఈ సీమంతము చేస్తారు. వేడుకగా ఈ కార్యక్రమాన్ని చేయటంతో పాటు మంత్ర పూర్వకంగా చేయటం మరింత మంచిది.

**113. ప్రతివారూ చేయవల్సిన సంస్కారములు**

గర్భాదానము, పుంసవనమూ, సీమంతమూ, జాతకర్మమూ, నామకరణమూ, గృహోపనిష్క్రమణమూ, అన్నప్రాశనమూ, కేశఖండనమూ, కర్ణవేదమూ, చేలమూ, ఉపనయనమూ, వేదవ్రత చతుష్టయమూ, నాలుగు వివాహ పద్ధతులు. ఇందులో ఏదిచెయ్యక పోయినా జన్మించిన జన్మకి పరమార్థం లేదు.

**114. శ్రాద్ధం పెట్టే ప్రదేశాన్ని ఎలా ఎంచుకోవాలి?**

దక్షిణ దిక్కు పల్లంగా ఉండేలా చూసుకోవాలి. పరిశుభ్రమైన ప్రదేశంలో గోవు పేడతో అలకాలి. పరిసరాల్లో గడ్డి గాదా లేకుండా చూసుకోవాలి. శ్రాద్ధం ఇంట్లోపెడితే 8రెట్లు ఫలితం కనబడుతుంది. అలా కాకుండా పుణ్యక్షేత్రాల్లోనూ తీర్థాల్లోనూ పెట్టాలనుకుంటే కురుక్షేత్రము లోనూ, గయలోనూ, గంగాతీర పరిసర ప్రాంతల్లోనూ, సరస్వతీ తీర్థం లోనూ, ప్రభాస తీర్థమూ, పుష్కరక్షేత్రములు పెట్టవచ్చును.





**115. ఎలుక గణేశుని వాహనంగా ఎందుకు మారింది?**

క్రూరాతి క్రూరుడైన మూషికాసురడనే రాక్షసుడు మానవులనూ, ఋషులను, ఎన్నో బాధలు గురి చేస్తుండటంతో గణేశుడు ఆ రాక్షసుడ్ని నిర్బధించి ఎలుకగా మార్చి తన వాహనంగా చేసుకున్నాడు.

**116. మనంచేసే పాపాలకు యమలోకంలో ఏఏ శిక్షలుంటాయి?**

పరుల ధనాన్నీ, పరస్త్రీనీ ఆశిస్తే చీకటిలో వుంచి కర్రలతో బాదుతారు. స్త్రీలడబ్బును దొంగిలిస్తే కటిక చీకటిలో నరికిన చెట్లుమీద పడవేస్తారు, తల్లీ, తండ్రులను చూడనివాడిని, నిప్పులు చెరిగే సూర్యుడి క్రిందమాడి మసెయ్యేలా చిత్రవధ చేస్తారు. సంభోగించకూడని వారితో కూడా సంభోగిస్తే మండుతున్న ఇనుప మూర్తిని అనగా స్త్రీమూర్తిని స్త్రీ, పురుషమూర్తిని పురుషుడు కౌగిలించుకునేలా చేస్తారు. అబద్ధాలు ఆడిన వారిని నూరు ఆమడలగల పర్వతం పైనుంచి పడత్రోసి పచ్చడిచేస్తారు. ఇలా ఒక్కొక్క పాపానికి ఒక్కొక్క శిక్ష ఉంటుంది. ఇలా మొత్తం 84 లక్షల నరకాలుంటాయి. గరుడ పురాణం చదివితే మనంచేసే నిత్య కృత్యాల్లో ఎంత పాపం చేస్తున్నామో, మరింత పాపాన్ని మూటగట్టు కుంటున్నామో తేటతెల్లమవుతుంది.

**117. కలలో ఏమొస్తే ఏం లాభం, ఏం నష్టం?**

నగ్నంగా నడుస్తూ కలవస్తే ఆపద లేమీ రావు. గాలిలో ఎగిరినట్టు వస్తే ఆస్తి నష్టము. అలాగే దేవతలూ, గోవులూ, అగ్ని, సరస్సులూ, కన్యలూ, ఫలములూ, పర్వతములూ, నదులూ, సముద్రాలు దాటటం... వంటివన్నీ ధనాన్నీ, ఆరోగ్యాన్నీ పెంపొందించే సూచికలు. అలాగే తూర్పు, ఉత్తర దిక్కులకు పోయినట్టు కోరిన స్త్రీని పొందినట్టు, శవాన్ని చూసినట్టు వస్తే కష్టములు ముందున్నాయని సూచికలు.

**118. కోరిన కోరికలు తీరాలంటే ఏ మాసంలో ఏ అభిషేకం పరమేశ్వరునికి చేయాలి?**

చైత్రమాసము చెరుకురసంతో, వైశాఖ మాసము గంధంతో, జ్యేష్ట మాసము ఫలములతో, ఆషాఢమాసము క్షీరముతో, శ్రావణమాసము పంచ దారతో, భాద్రపద మాసము ఆవుపాలతో, ఆశ్వయుజ మాసము అన్నముతో, కార్తీక మాసము దీపాలతో (అలంకరణ), మార్గశిర మాసము నెయ్యితో, పుష్యమాసం తేనెతో, మాఘమాసము నీటితో, ఫాల్గుణ మాసము పెరుగుతో అభిషేకిస్తే స్వామి సంతృప్తుడై కోరిన కోర్కెలు తీరుస్తాడు.

MOHAN PUBLICATIONS.COM

## 119. తమలపాకు అంటే సకల దేవతల స్థానమా?

ఒకవిధంగా చెప్పాలంటే అవుననే చెప్పాలి. ప్రతి శుభకార్యానికి తమల పాకును తప్పని సరిగా వాడతారు. అందుకనే నాగవల్లి దళమనే తమలపాకు దేవతాదళము. తమల పాకు తొడిమలో లక్ష్మీదేవి, మధ్య భాగాన ఈశ్వరుని సతి పార్వతీ దేవి... కొన భాగంలో విద్యాలక్ష్మి అయిన సరస్వతీదేవి ఉంటారు. ఇంద్రుడూ, మన్మథుడూ, శ్రీమహావిష్ణువూ, పరమ శివుడు, బ్రహ్మ తమల పాకుపై సదా కొలువుంటారు.

## 120. కాకి అరిస్తే చుట్టాలొస్తారంటారు నిజమేనా?

పూర్వం రోజులలో రవాణా సదుపాయాలు, రేడియో కబుర్లు వుండేవికావు. అందుకని ఏవైనా అత్యవతసర వార్తలను చేరవేయటానికి పక్షులనే ఆధారంగా చేసుకునేవారు. ఓ కొత్త పక్షి తమ ప్రాంగణంలోనికి వస్తే దానినిచూసి మిగిలిన కాకులు అరుస్తాయి. దానితో ఏదోసందేశం ఎవ్వరికో పంపారని అర్థం చేసుకొనేవారు. అందుకనే ఇంటికి చుట్టాలొస్తున్నారని అనుకునేవారు.

## 121. సంతానం కలగకపోవటానికి శాపాలే కారణమా?

పెళ్ళై చాలాకాలమైన సంతానము కలుగకపోవటానికి తెలిసికాని తెలియకకాని చేసిన శాపములే ప్రధాన కారణమని అని జ్యోతిష్యశాస్త్రం ఘోషిస్తోంది. సర్పశాపము, పితృశాపము, మాతృశాపము. భ్రాతృశాపము, ప్రేత శాపము, బ్రాహ్మణ శాపము, మిత్ర శాపమువున్నాయి. కావున ఆయా శాంతులు చేయించి దేవుని సేవించటం ద్వారా స్వామివారి చల్లని దీవెనలతో సంతానము కలగవచ్చు. అలాగే సముద్ర స్నానము. అది కూడా రామేశ్వరం దగ్గర స్నానం చేస్తే మరింత ఫలితం కలుగుతుంది. సముద్రస్నానం ఎక్కడైనా ఒక్కటే కదా అని ఆలోచించకండి. ఒక్కో ప్రదేశంలో ఒక్కో శక్తి ఉంటుంది.

## 122. గోళ్ళు ఎందుకు కొరక్కూడదంటారు ఎందుకని?

గోళ్ళుకొరికే చర్య రాక్షసగుణాన్ని ప్రేరేపిస్తుంది. దానికి తోడు గోళ్ళలోని మట్టీ, క్రిమి కీటకాలూ మనలో ప్రవేశించి మనకు అశాంతిని కలగజేస్తాయి. అందుకని ధర్మశాస్త్రాలు గోళ్ళు కొరుక్కోవటం అనే అలవాటు దరిద్ర్యానికి ప్రతిరూపంఅని శెలవిస్తాయి.





## 123. గణపతిని నిమజ్జనం చేస్తారెందుకు?

శుక్లాంబరధరం విష్ణుమ్..అనే శ్లోకాన్ని వినని వాళ్లం ఉండం. ఈ శ్లోకం స్పష్టంగా ఆ వినాయకుడు విష్ణురూపమే అని తెలియజేస్తుంది. విష్ణువుకి ఉన్నపేరు నారాయణుడు అని. నారఅంటే నీళ్లని అర్థం. అయనుడు అంటే నివాసంగా కలిగినవాడు అని అర్థం. కాబట్టి నారాయణుడు అనే దానికి నీళ్లే నివాసంగా కలిగినవాడనేది భావం. ఈ వినాయకుడిని సాక్షాత్తు విష్ణువుగా భావిస్తున్నానని తెలియజేస్తూ ఆ వినాయకుణ్ణి నీళ్లలో నిమజ్జనం చేయాలి. అందుకే వినాయకుణ్ణి మట్టితోనే చేయాలని నిర్ణయించారు ప్రాచీనులు. వినాయకుడూ విష్ణువూ ఒక్కరే కాబట్టి, గణపతి తొడపై లక్ష్మీదేవి కూర్చుని కనిపిస్తూ లక్ష్మీగణపతి పేరిట పూజలని అందుకుంటూంటుంది. పెద్ద పెద్ద విగ్రహాలతో, రంగ రంగ వైభోగంగా వినాయకచవితిని తొమ్మిది రోజులు చేసి నదిలోనో, సరస్సులోనో నిమజ్జనం చేస్తారు. దానికి ప్రధాన కారణం పూజ చేసిన వినాయక విగ్రహానికి యంత్ర ప్రతిష్ఠాపన ఉండకపోవటము. అలాగే ఉంచితే కొన్నాళ్ళకి విగ్రహ రూపురేఖలు మారవచ్చు. అది దోషం.దానితో పాటు గణపతిని అలా వీధుల్లోనూ ఉంచి పూజించటానికి దేశభక్తికి సంబంధించిన విషయం ఒకటుంది. తొలుత బహిరంగంగా పూజలను చేసినవాడు బాలగంగాధర తిలక్. హిందువులందరిది ఒకే మాటగా ఎలుగెత్తి చాటాలని, స్వాతంత్రం కావాలని ఉద్యమం నడిపించి వినాయకచవితిని వాడవాడలా బహిరంగంగా చేయమని చెప్పి దాన్ని ఆచరణలోకి తెచ్చినవాడు స్వాతంత్ర్య సమర యోధుడు బాలగంగాధర తిలక్. అప్పట్నించి గణపతి ఉత్సవాలు భారతదేశమంతటా రంగ రంగ వైభవంగా జరుగుతున్నాయి.

## 124. ఎట్టి గ్రంథాలు చదవకూడదు?

కామా, క్రోథ,మోహా, మద, మాత్సర్యాలను పెంచే గ్రంథాలు చదవటంవల్ల అనర్థాలను కొని తెచ్చుకున్నట్టే అవుతుంది. శృంగార గ్రంథాలు చదవటవల్ల సిగ్గువదిలి స్త్రీ సాంగత్యముకోసం చెయ్యరాని పనులు ఎన్నో చేయాల్సివస్తుంది. అటువంటి ప్రవర్తన ద్వారా వచ్చేది అవమానమూ, తలవంపులు, దానితో మనిషి ప్రవర్తన వికృతంగా మారి నేరస్థుడవుతాడు. కనుక చెడుసాహిత్యం చదవటం వల్ల మిత్రులు శత్రువులవుతారు. అయిన వారు దూరమవుతారు.

MOHAN PUBLICATIONS.COM

**125. ఎవరైనా తుమ్మగానే 'చిరంజీవ' అని అంటారెందుకు?**

మన దేహం ఎన్నో సమస్యలు కలిగి ఉంటుంది. అనారోగ్యం గురించి, ముందుగ తుమ్ము మనకు అనేక సంకేతాలను పంపుతుంది.

ముఖ్యంగా పిల్లలు తుమ్ముతుంటే పెద్దలు 'చిరంజీవ' అని అంటారు. అంటే ఎక్కువకాలం జీవించమని దాని అర్థం. తుమ్ము అనారోగ్యానికి ప్రతిరూపం. మన తాత, ముత్తాతలు పిల్లల తుమ్మును బాగా పట్టించుకునేవారు. ఎన్నో జాగ్రత్తలు తీసుకునేవారు.

**126. తొలి ఏకాదశి విశిష్ఠత ఏమిటి ?**

ఆషాఢ శుక్ల ఏకాదశినే తొలి ఏకాదశి అని అంటారు. ఈ తొలి ఏకాదశినాడే శ్రీ మహావిష్ణువు యోగనిద్రకు ఉపక్రమించి, కార్తీక శుక్ల ఏకాదశి వరకూ యోగనిద్రలో ఉంటాడు అందుకే తొలి ఏకాదశికి అంతా ప్రాధాన్యమిస్తారు.

**127. షడ్రుచులంటే ఏవి?**

ఈ పేరు వినటమే గాని ఆ రుచులేమిటో చాలా మందికి తెలీదు. కొంత మందికి రెండు మూడు చెప్పి ఆ తర్వాత తెలీదంటారు. మనం తినే భోజనంలో ఈ ఆరు రుచులు ఉండాలి. షడ్రుచులు అనగా ఆరు రుచులు. ఒకటి మధురిమ, రెండు పులుపు, మూడు లవణము, నాలుగు కారం, అయిదు చేదు, ఆరు వగరు. ఈ ఆరు రుచులు అనేక అనారోగ్యాలను దూరం చేస్తాయి.

**128. బ్రాహ్మణులను భూలోక దేవతలంటారు నిజమేనా?**

అవును. వైదిక వృత్తిలోనున్నవారూ, ధర్మ, అర్థ, కామ, మోక్షాలను ఆయా కాలాల్లో నిర్వహించేవారూ, మంత్రాలతో పదిమందికీ శుభం కలిగించేవారూ అయిన బ్రహ్మణులు మాత్రమే భూలోక దేవతలుగా అర్హులు. అలాగే వేదమంత్రాలను ధనానికి కాకుండా పరులకూ, లోక కళ్యాణం కొరకూ ఉపయోగించేవారూ, ఆడంబరాలకు దూరంగా ఉండే వారూ, అసత్యమాడని వారూ, పరనిందలు వేయనివారూ, శాస్త్రాల సారాన్ని తెలుసుకున్నవారూ భూలోక దేవతా దూతలే.

**129. కొత్త దంపతులు ఆషాఢమాసంలో దూరంగా ఎందుకుండాలి?**

ఆషాడమాసం అనారోగ్యమాసం. ఆ మాసంలో విపరీత గాలుల వల్ల దుమ్ము, ధూళీ లేచి పరిసరాలనూ, నదీ తీర ప్రాంతాలనూ కలుషితం





చేస్తుంది. దానికి తోడు వ్యవసాయ పనులను ఈ నెలలోనే ప్రారంభిస్తారు. కొత్త పెళ్ళాంతో సుఖంగా ఇంట్లోనే ఉంటే ఆర్థిక పరిస్థితి దెబ్బ తింటుంది. అదే ఆడపిల్ల ఇంటికి అల్లుడొస్తే మర్యాదలతో పొలం పనులు కుంటు పడతాయి.

దానితో పాటు ఈ మాసంలో గర్భం ధరిస్తే ఆ బిడ్డ ఆరోగ్యంగా పుట్టదు. ఆషాఢమాసంలో గర్భం ధరిస్తే నెలలు నిండే సమాయానికి ఎండలు ముదురుతాయి. దానితో తల్లీ కడుపులో బిడ్డా అవస్థలు పడతారని ఆషాఢమాసం ఇద్దర్నీ దూరంగా ఉంచుతారు. కాన ఆషాఢమాసం భార్యకి దూరంగా ఉండటమే ఉత్తమం. అత్తా కోడళ్ళు ఓ గడప దాటకూడదనీ అంటారు. అందుకని భార్యని ఎత్తుకొని గడప దాటించేవారు ఉన్నారు. శాస్త్రం నియమం పెట్టింది ఆచరించమని అంతేగాని లొసుగుల వెతకమని కాదు.

**130. ఇంటిముందు వున్న గడపని తొక్కటం, గడపపై కూర్చోవటం చెయ్యకూడదని, అలాగే గడపకి పసుపు రాయటంలో పరమార్థం ఏమిటి?**

ప్రభాత సంధ్య వేళ శ్రీ మహావిష్ణువు నరశింహావతారం ఎత్తి ఉగ్రుడై హిరణ్యకశిపుడిని గడపపై సంహరించాడు. అట్టి గడప శ్రీమహావిష్ణువు స్థానం. దానికి తోడు గుమ్మం వద్ద వ్యతిరేక తరంగాలు ప్రసరిస్తుంటాయి. గడప అంటే లక్ష్మీదేవి కూడా! అందుకనే లక్ష్మిదేవికి ఇష్టమైన పసుపుతో గడపు అలుకుతారు. శుభప్రదమైన కుంకుమతోబొట్టు పెడతారు. పూర్వంలో రోజులలో పాములెక్కువ తిరుగుతుండేవి. కనుక రక్షణగా కూడా పసుపును గుమ్మాలకూ, గడపలకూ రాసేవారు. దాని ఘాటుకు పాములు మొదలగు ఇతర క్రిమి కీటకాలు లోపలికి వచ్చేవికావు.

**131. ప్రసూతి వైరాగ్యం అంటే ఏమిటి ?**

భార్య భర్త దగ్గరికి ప్రేమతోను, కోరికతోను దగ్గరకుచేరి గర్భం ధరిస్తుంది. గర్భం ధరించిన కొన్నాళ్ళకు నెలలు నిండుతాయి. బిడ్డను కంటున్నప్పుడూ, నెలలు నిండిన సమయంలో వచ్చే నొప్పులూ, బాధలు భరించలేక చచ్చినా మొగుడితో సంగమించకూడదని అనుకుంటుంది. బిడ్డను కనిన తర్వాత మళ్ళీ కథ మామూలే.

అలాగే శవాన్ని చూసినప్పుడు కూడా ఎవరికైనా కొంత విరక్తి వస్తుంది. ఎప్పటికైనా మనమూ ఇంతేగా అనిపిస్తుంది. శవం దాటగానే

MOHAN PUBLICATIONS.COM

స్నానం చెయ్యగానే మళ్ళీ కథమామూలే. దాన్నే ప్రసూతి వైరాగ్యమూ, శ్మశాన వైరాగ్యం అంటారు.

### 132. శ్రీశైల క్షేత్ర 'సాక్షి గణపతి' ని తప్పకుండా దర్శిస్తూ ఉంటారు ఎందుకు?

శ్రీశైలక్షేత్రాన్ని దర్శించిన వారంతా పునర్జన్మ నుంచి విముక్తి కలిగించే శిఖర దర్శనం చూడటంతోపాటు సాక్షిగణపతిని దర్శించి గోత్ర, నామాలు చెప్పుకుంటు ఉంటారు. అలా చెప్పటంలో అర్థము ఏమటంటే సాక్షి గణపతి కైలాసంలో ఈశ్వరునివద్ద శ్రీశైలాన్ని దర్శించిన భక్తుడూ, భక్తురాలి పేరుచెప్పి సాక్ష్యం ఇస్తాడు. ఆ పరమేశ్వరుని కృపకు పాత్రులను చేస్తాడు. అందుకే సాక్షిగణపతిని తప్పక దర్శించాలంటారు.

### 133. 'అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని' అనే సామెత వాడుకలోకి ఎలా వచ్చింది?

కొత్త పెళ్ళికొడుకు కోటిఆశలతో అత్తింటికి వస్తే ఇంకేముంది కొత్తల్లుడు, ఇల్లూ, హడావుడి రకరకాల పిండి వంటలు... ఘుమ ఘుమలు... పెళ్ళాం మురిపాలు, కబుర్లు.... పండుగ వాతవరణం. చుట్టు ప్రక్కల వారి పరామర్శలు. ఇంతలో క్రొత్త పెళ్ళికొడుకు పెళ్ళాం ఇంట్లోకి రాకూడదు. అప్పుడన్న మాట పెద్దల పెదవి విరుపు పలుకులే సామెతగా వాడుకగా వచ్చింది. చల్లగా విషయాన్ని పెళ్ళికొడుకుకీ తెలియచేశారు. దానితో సదరు పెళ్ళికొడుకు దిగులుగా కూలబడ్డాడు. 'అన్నీ ఉన్నా అల్లుడి నోట్ల శని ఉండుటమంటే ఇదే' అనుకున్నారంతా !

### 134. నీరు లేకుండా చేసే స్నానాలు ఏమిటి?

1. మంత్రస్నానము : మంత్రాలతో దేహాన్ని ఆవహించేలా చేసుకోవడం.
2. భౌమస్నానము: దేహానికి విభూది రాసుకోవటము.
3. ఆగ్నేయస్నానము:మంత్రాన్ని ఉచ్చరిస్తూ విభూది రాసుకోవటము.
4. వాయుస్నానము : ఆవుదెక్కలవల్ల ఏర్పడిని మట్టిని శరీరానికి పూసు కోవడం.
5. దివ్యస్నానము:ఉత్తరాయణ పుణ్యకాల సమయంలో ఎండలో నిలబడి వుండటము.
6. మానసికస్నానము : తడి వస్త్రాలతో శరీరం తుడుచుకోవటము.
7. ధ్యానస్నానము: తులసి చెట్టులోని జలాన్ని చల్లుకోవటము.

### 135. అక్షింతలు చల్లటంలో పరమార్థము ఏమిటి?

బ్రహ్మ రాతను నుదుటిపై వ్రాస్తాడు. కర్మఫలాలన్నీ తలపైనే వ్రాసి ఉంటాయి. ధర్మాత్ములు, పెద్దవారూ అక్షింతలు లేదా అక్షితలు తలపై వేసి





ఆశ్వీర్వదించటం ద్వారా తలరాత కొంతయినా మారుతుందని విశ్వా సము. పెద్దలు వేసిన అక్షితలు నేల రాలితే వాటిని ఎవ్వరూ త్రొక్కకుండా, వాటిని ఏరి ఎవరూ నడవని ప్రదేశంలో వేయాలి.

విభూతి, కుంకుమ నుదుట పెట్టుకొనవలెను. అక్షంతలు తలమీద వేసుకో వలెను. విధివ్రాతలన్నీ మన తలమీదే కదా వ్రాయబడి వున్నాయి. మనంచేసిన కర్మఫలములన్నీ బ్రహ్మదేవుడిచేత వ్రాయబడివున్నాయి. అందు వలననే బ్రహ్మకపాలము అనిచెప్తారు. ఇలావ్రాయబడ్డ విధి వ్రాతలు, కర్మలు క్షీణించుటకు తలమీద అక్షంతలు వేసే ఆచారం వచ్చింది. అది ఆశీర్వాదమై ఆ విధి వ్రాతల నన్నింటిని మార్చగల శక్తి కలిగి వాటిని నశింపచేయకలదు. పెద్దలు, మహాత్ములు వీరిచే వేయబడిన అక్షంతలు ఆశీర్వాదమువలె పనిచేసి విధి వ్రాతల నన్నిటిని మార్చగలవు అనే విశ్వాసము వలననే నేటికి పెద్దల వద్ద నుండి అక్షంతలు తీసుకుంటారు.

### 136. దేవునికి హారతినిచ్చేటప్పడు గంటెందుకు కొడతారు?

దేవాలయాల్లో గంటను అనేకసార్లు అనగా నైవేద్యము పెట్టే టప్పుడూ, మేలుకొలుపు పాడేటప్పుడూ, ఆలయం మూసేటప్పుడూ, హారతి నిచ్చేటపుడూ గంట కొడతారు. హారతినిచ్చేటప్పుడు కొట్టే గంటకు అర్థం దేవతలందరినీ ఆహ్వానిస్తున్నామని, ఏ దేవునికి హారతినిస్తున్నామో, ఆ దేవుడు మహాదైవాంశతో విగ్రహంలో చేరాలని, ఆ మహోత్తరమైన అంశ విగ్రహంలో చేరేటప్పుడు ఈ రూపాన్ని భక్తులు కనులారా వీక్షించేలా, హారతి వెలుగులో స్వామిని చూపటమే పరమార్థము. కనుక హారతి వేళ దైవాన్ని ప్రత్యక్షంగా చూసినట్టే.

మానవుడు ఆరాధించే దైవానికి వ్యతిరేకంగా ఎవరైనా మాట్లాడితే పూజకు భంగం కలుగుతుంది. కనుక నిరామయంగా పూజను జరుపుకోవ డమునకై గంటను మ్రోగిస్తారు. ఇది సామాన్యం. అయితే పూజకు ప్రారంభించేటపుడు దేవతలను ఆహ్వానించడమునకూ రాక్షసులను తరుము టకూ గుర్తుగా "ఆగమా ర్థంతు దేవానాం గమనార్థంతు దేవతార్చనకు ప్రారంభిచేటపుడు చెపుతారు.

'ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసామ్ ।
కురు ఘంటారావం తత్ర దేవతాహ్వానలాంచనమ్॥

ఇది గంట మ్రోగించేటపుడు పఠించవలసిన శ్లోకం. పూజచేసే ఈ సమయంలో దేవతలంతావచ్చి ఈ పూజకు రాక్షసులనుండిగాని, ఏ ఇతర

ములనుండిగానీ, ఏవిఘ్నం కలగకుండా చూడమని ఈ ఘంటానాదం చేస్తున్నాను. అని ఈ శ్లోకం అర్థం. ఈ విషయంలో దేవతలకు, రాక్షసులకు మధ్య కొన్ని ఒప్పందాలున్నాయి. ఎక్కడికి మేం రాకూడదో అక్కడ ఒక గంటను ఉంచండి. అది మీరు మరిస్తే మమ్మల్ని మీరు ఆహ్వానించినట్లే అనేది వారి నియమం. అందువల్ల ప్రతిదేవాలయంలోను కంచు మొదలైన పంచలోహములతో చేసిన గంటను ఉంచాలి. దాన్ని కొట్టినపుడు మాత్రమే ఓంకారనాద తరంగాలు మనచెవి నుంచి శరీరమంతా వ్యాపిస్తాయి. కనుక గంట మ్రోగి వెంటనే ఆగిపోతే దాని గంటానాదం అనకూడదు. 'అనుసరణ ధ్వని' అంటారు.

కనుక గంటని దేవాలయ గర్భగృహప్రదేశ వేళ ఒకసారి కొట్టాలి. ఆ ఓంకారధ్వని నిండుగా శరీరమంతా నింపుతూ దైవ దర్శనం చేయాలి. వెళ్లేటపుడు మళ్లీ కొట్టాలి. ఆనాదాన్ని శరీరంలో నింపుకుని వెళ్లాలి. అంటే దేవాలయానికి వెళ్ళినపుడు గంటను రెండుసార్లు మ్రోగించాలన్నమాట.

### 137. గుడిలో ప్రదక్షిణలు పద్ధతి?

ధ్వజస్థంభం నుంచి మళ్ళీ ధ్వజ స్థంభం వరకూ చేస్తే ఒక ప్రదక్షిణ అవుతుంది. అలాగే మందిరమయితే ముఖద్వారం వద్ద నుంచి ప్రారంభించి మళ్ళీ మందిర ముఖద్వారం వద్దకు వస్తే ఓ ప్రదక్షిణ పూర్తి అయినట్టు. హనుమంతునకు అయిదు ప్రదక్షిణలు ప్రీతి. ఏదైనా కోర్కె ఉంటే 11, 27,54,108 సంఖ్యలతో ప్రదక్షిణం చేస్తే ఫలితముంటుంది. నవగ్రహాలకి మూడుసార్లూ, లేదా తొమ్మిదిసార్లూ చేయచ్చు. అలాగే పదకొండూ, ఇరవై ఒకటీ, ఇరవై ఏడూ ఇలా బేసి సంఖ్యలో చేయవచ్చు.

### 138. సీతాదేవి గడ్డిపోచని అడ్డం పెట్టుకొని రావణుడితో మాట్లాడింది ఎందుకు?

రావణుడిని గడ్డి పోచగా భావించినందువల్ల. కాముకుడితో స్త్రీ నేరుగా మాట్లాడరాదు కాబట్టి. కులస్త్రీలూ, పతివ్రతలు పరాయి మగవాడితో మాట్లడరాదు గనుక. తనను కనులతో కూడా చూసే యోగ్యత రావణుడికి సిద్ధించకూడ దని. గతంలో శ్రీరాముడు గడ్డిపోచతోనే కాకిని నిరసించాడని తనూ అలాగే నిరసిస్తున్నానని. తనకి దగ్గరిగా ఉన్నాడు గాన, ఏదో ఒకటి అడ్డుగా ఉండాలని.

హనుమంతుడు సీతాన్వేషణకై లంకకుపోయి అశోకవనికలో ఆమెను చూస్తాడు. అతడామెతో కలసి మాటలాడకముందే ఆనాటి వేకువను రావణా





సురుడు సీత చెంతకు వచ్చి తన్ను వరించవలసినదిగా అభ్యర్థిస్తాడు. ఆ సంద ర్భంలో ఉన్న శ్లోకమిది.

దుఃఖార్తీ రుదతీ సీతా వేపమానా తపస్వినీ
చింతయంతీ వరారోహా పతిమేవ పతివ్రతా
తృణమంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా. (రామ 4-21-2)

రావణుని మాటలువిన్న సీత దుఃఖిస్తూ, భయంతో వణకుతూ, భర్తనే మనస్సులో భావిస్తూ ఒక గడ్డిపోచను రావణునికీ, తనకూ మధ్యలో వుంచి అతనికి సమాధానం చెప్పింది. అలా తృణాన్ని అడ్డుపెట్టుకోవడానికి వ్యాఖ్యాతలు అనేక కారణాలు చెప్పివున్నారు.

1. దుష్టుడైన రావణాసురునితో నేరుగా మాట్లాడడం తగదు. 2. పరపురుషుని ముఖం చూడరాదు. 3. రావణుణ్ణి ఆమె తృణంగా భావించింది. 4. నేను చెప్పేమాటను వీడు తృణీకరిస్తాడన్న భావన. 5. తన కటాక్షపాత యోగ్యత అతనికి సిద్ధించగూడదు. 6. రాముడు పూర్వం తృణంతో కాకిని నిరసించినాడు, అట్లే నేను వీణ్ణి నిరసిస్తునన్నభావన. 7. సమీపంలోవున్నా వానికీ, నాకూమధ్య ఏదో వ్యవధానంగా ఉండాలి. 8. పశుతుల్యుడైన అతనికి తృణమే భోగ్యం. 9. ఈ తృణాన్ని నేను ఛేధించినట్లే నిన్ను రాముడు ఛేదిస్తాడు. 10. అచేతనాన్ని చేతనం కావించిసంబోధించి మాట్లాడుతున్నానన్న భావన. ఇలా అనేకాంశాలు ఇందులో ఉన్నాయని వ్యాఖ్యాతలు విశదీకరించారు.

### 139. బ్రహ్మదేవునికి పూజలెందుకు చెయ్యరు?

త్రిమూర్తులు త్రిగుణాత్మకులు. సృష్టి, స్థితి, లయలకు అధిష్టాన దేవతలు. రక్షణ ఇచ్చే విష్ణువును పూజించటం ద్వారా భద్రతనూ, శ్రీమహాలక్ష్మి ఇచ్చే ధనం ద్వారా సుఖాలనూ పొందటానికి లక్ష్మీదేవిని ప్రార్థిస్తాము.

మహాశివుడు లయ కారకుడు. మరణమంటే మానవునికి భయము. అందుకే అట్టి మరణ భయాన్ని పోగొట్టి అనంతమైన దూరంలో మృత్యువుని ఉంచమని ప్రార్థిస్తాము శివుడ్ని. బ్రహ్మ సృష్టించేవాడు. మనల్ని ఎప్పుడో పుట్టించేశాడు. మళ్ళీ ఆయన్ని అడగటానికి ఆయన దగ్గరేముంది. అందుకే.... బ్రహ్మను పూజించటానికి ఎవరూ ముందుకు రారు. కాని మోక్షమనే పరబ్రహ్మ దర్శనము సిద్ధించేది బ్రహ్మవరం వల్లనే.

MOHAN PUBLICATIONS.COM

**140. ఏ దేవుని మాలలో ఏ దారాలు వాడాలి?**

విష్ణుమాలలో నల్లటి దారము పట్టుది గాని, నూలు దారం గాని వాడాలి. అమ్మవారికి ఎర్రటి పట్టుదారం మాలగానూ, పరమశివునకు పసుపు ఊలుదారమూ, సూర్యభగవానుడికి పట్టుదారముగాని నూలుదారం గాని, వినాయకునకు ఆకుపచ్చ పట్టుదారమూ, నూలు దారమూ వాడాలి. ధరించే వ్యక్తిగాని లేదా తన ఇంటి పేరుతో ఉన్నవారు గాని దారాన్ని చుట్టాలి. తనకోసం తనచుట్టింది ధరించటం అత్యంత శక్తివంతమైనవి. వేరే ఏవరైనా చుట్టిన మాలధరించే ముందు పంచగవ్యములతో శుద్ధిచేసి పూజించి ధరించాలి.

**141. చనిపోయినవార్ని ఊరేగించేటప్పుడు డబ్బులెందుకు చల్లుతారు?**

నేనెంతో ధనం సంపాదించాను. ఒక్కపైసా కూడా తీసుకెళ్ళటం లేదు. రేపు మీ ధనమయినా ఇంతే. కనుక ధర్మంగా న్యాయంగా, జీవిస్తూ పదిమందికీ సాయంచేసి పోవటమే అసలు మానవధర్మం. కనుక మీరయినా స్వార్థచింతనలకు దూరంగా ఉండి, పదిమందికి మేలు చెయ్యండి అని.

**142. కార్తీకమాసము ప్రత్యేకత ఏమిటి?**

ఈ మాసములో ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండి నిత్య మంత్ర జపం చేస్తూ ఉండేవారు సర్వ పాపాల నుంచి విముక్తులవుతారు. ఈ మాసంలో తులసి ఆకులతో స్వామిని పూజించాలి. ఉసిరి చెట్టు నీడలో పిండ ప్రదానము చేయాలి. ఉసిరి తినటముతోపాటు, మాలను ధరించిన ప్రశస్తం. విష్ణుమూర్తికి ప్రీతికరము.కార్తీక మాసములో స్తంభం పాతి దానికి ఓ పాత్రను వ్రేలాడ దీసి అందు ఎనిమిది దిక్కులకూ కనిపించేటట్టు దీపం పెట్టాలి. ఇలా చెయ్యటం వల్ల సమస్తదేవతలకి వందనము చేసిన ఫలము కూడా వస్తుంది.

**143. ఉప్పును ఎందుకు దొంగిలించ రాదు?**

ఉప్పును దొంగిలించడమే కాదు, కాళ్ళతో త్రొక్కరాదు. అలాగే చేబదులు కూడా తీసుకోరాదు. ఉప్పును చేతితో ఎవ్వరికీ ఇవ్వ కూడదు. ఉప్పు శనీశ్వరుని ప్రతిరూపము. పూర్వ ఉప్పు దొరికేదికాదు. ఎంతో కష్టం మీద సంపాదించిన ఉప్పును రక్షించుకోవటానికి శనీశ్వరుని అంశగానూ, యమధర్మరాజు ప్రతిరూపంగానూ చెప్పేవారు. అలా చెప్పటం వల్ల ఆ రోజులలో ఉప్పును చేబదులు అడిగేవారు కాదు. దొంగిలించేవారు కూడా కాదు.





**144. నిద్రలేవగానే ముందు ఎవర్ని చూడాలి ?**

విదావేత్తనూ... సుమంగళినీ... ఆవునూ... అగ్నిమండపం చూస్తే ఆరోజంతా మంచి ఫలితాలు కలుగుతాయి. నదినీ, సముద్రాన్నీ, సరస్సునూ చూస్తే ఉన్న దోషాలుతొలగి పోతాయి. పెరుగూ,నెయ్యి, ఆవాలూ, అద్దము వంటి వాటిని చూడరాదు. అలా చూస్తే అశుభం. అలాగే ముఖాన్ని నేతిలో చూస్తే చిరకాలం ఆరోగ్యంగా జీవిస్తారు.

**145. గోళ్ళను ఇంట్లో ఎందుకు కత్తిరించరాదు?**

మన దేహంలోని చేతులు,కాళ్ళకున్న గోళ్ళు చాలా విషపూరిత మైనవి. మనం ఆహారం తీసుకొనేప్పుడు పొరపాటున గోళ్ళు అన్నంద్వారా తింటే అవి జీర్ణంకావు. మన జీర్ణవ్యవస్థకి అంత శక్తిలేదు. విసర్జించేటప్పుడు ప్రేగులకి ప్రమాదం. అందుకే గోళ్ళు ఇంట్లో తియ్యకూడదు.

**146. ఉదయాన్నే నీరు తాగటం ఎందుకు?**

ఉదయాన్నే లేవగానే పది ద్రోసిళ్ళ నీరు త్రాగటం మంచిది. ఎంతో యవ్వనవంతంగా ఉంటారు. పెద్దలకీ, పిల్లలకీ ఉదయాన్నే నీళ్ళు త్రాగటం అలవాటు చేస్తే వారు జీవితాంతమూ అజీర్తి, మూత్రపిండాల వ్యాధులతో బాధపడకుండా ఉంటారు. రాగి చెంబుతో నీరు త్రాగితే ఎలాంటి మల బద్ధకమూ ఉండదని ఆయుర్వేదం చెబుతోంది.

**147. "ఎక్కడైనా బావగాని వంగతోట దగ్గర కాదు" అనే సామెత ఎందుకు వచ్చింది ?**

పురుషులకి పేరు ప్రతిష్టలు స్త్రీ వ్యామోహాలూ ఎక్కువ. ఈ రెండిటికి కావాల్సింది డబ్బు. సంపాదించిన డబ్బు ఎలాఅయినా ఎవరిష్టం వచ్చినట్టు వారు వృథాగా ఖర్చు చేస్తూంటారు. అదే వ్యాపారము దగ్గర, వ్యవహారం దగ్గర, డబ్బుదగ్గర మొహమాటం పనికిరాదు.

అలా మొహమాట పడితే అసలుకే ఎసరు రావచ్చు. ఎటువంటి వారైనా వ్యాపార, వ్యవహారాల్లో డబ్బువిషయాల్లో లొంగేది ఒక్క ఆడదాని దగ్గరే. అందుకనే ఎక్కడయినా బావ గాని వంగతోట దగ్గర బావకాదు అని అంటారు.

**148. శుభకార్యాలకీ, ముగ్గురెందుకు వెళ్ళకూడదంటారు?**

సాధారణంగా ఈ విషయాన్ని మనం చాలాసార్లు వింటూంటాం. ఏదైనా పనిమీద వెళ్తున్నప్పుడు ముగ్గురు వెళ్ళకూడదంటారు. ఓ శుభకార్యం

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

కోసమో, ప్రార్ధనస్థలానికో ముగ్గురు వెళితే మార్గమధ్యలో అభిప్రాయ భేదాలు రావచ్చు. ఒకరితో ఒకరు మాది సరయినదంటే మాది సరి అనివాదనకు రావచ్చు. అప్పుడు చేయవలసిన పనివదలి గొడవకి దిగుతారు. అదే ఇద్దరయితే వొకరికొకరు సర్ది చెప్పుకుంటూ వెళ్ళిన పనిని జయప్రధంగా చేసుకునివస్తారు.

**149. పురుషుడు వచ్చేజన్మలో స్త్రీగా పుట్టవచ్చా? స్త్రీ పురుషుడిగా జన్మించవచ్చా?**

స్త్రీ పురుషుడుగానూ, పురుషుడు స్త్రీగానూ జన్మించటమనేది వారి వారి కర్మలని బట్టి జరుగుతు ఉంటుంది. అకుంఠిత దీక్షతో కోరుకుంటే కావాల్సిన జన్మ వస్తుందనేది సత్యము. శ్రీరాముడు వనవాసం చేస్తూ అనేక మహర్షుల ఆశ్రమాలకి మునిసేవకై వెళ్ళేవాడు. ఆ సమయంలో శ్రీ రాముడి దివ్యమంగళ స్వరూపం చూసి కొంతమంది ఋషులకు శ్రీరాముని కౌగిలించు కోవాలిని అనిపించింది. అలా అనిపించిన వారంతా తర్వాత జన్మలో గోపికలుగా పుట్టి శ్రీకృష్ణుడి పవిత్ర ప్రేమకు పాత్రులయ్యారు.

**150. పాణిగ్రహణ మంత్రాలకి అర్థం?**

వరుడు వధువు కుడి చేయి పట్టుకొని అగ్ని సాక్షిగా మంత్రాన్ని చెబుతాడు...

పూషాత్వేతోనయతు హస్తగృహ్యాశ్వినౌత్వా
ప్రవహతాగ్ం రథేన। గృహాన్గచ్ఛగృమపత్నీ
యథా సోవశినీత్వం విథమావదాసి॥

ఓ నా సహధర్మచారిణీ, తర్వాత నిన్ను నా గృహానికి తీసుకువెళతాను. నా గృహానికి నీవే అధిపతివి. ఆధిపత్యము వహించి సర్వ విషయాల్లోనూ, యజ్ఞయాగాది క్రతు విషయాల్లో సర్వాదా, అనుకూల వతియై మెలుగుము.

**151. అప్పగింతల పరమార్థము ఏమిటి?**

పుత్రుని వలే అనేక సంవత్సరములు ఎంతో గారబంగా పెంచి నీ సుఖముకై, సేవకై అందిస్తున్నాము. మిత్రునిగా, ప్రియునిగా, భర్తగా మీరు ఈమెను పాలించుకోండి. లాలించుకోండి. బుజ్జగించుకోండి. ఆపై వధువుని వరుడి తరుపు వారందరికీ అనగా వరుడి తల్లీ, తండ్రీ, అక్కా, చెల్లెలు ఇత్యాదివారందరికి అప్పగిస్తారు.



**152. ఏ కలవస్తే ఏ వ్యాధి రావటానికి అవకాశం ఉంది?**

భూత ప్రేత పిశాచులు వస్తే జ్వరం రావటానికీ, ఎర్రని పూల దండలూ, వస్త్రాలలో స్త్రీ పురుషుల కానవస్తే రక్తసంబంధిత రోగాలూ, దున్నపోతూ, కుక్క గాడిదా, ఇట్టి వాటినెక్కి దక్షిణ దిక్కుగా వెళుతున్నట్లు కలవస్తే ఊపిరితిత్తుల సంబంధిత వ్యాధులూ, రాక్షసులతోనూ, నీటితోనూ ఈ రెంటితో సంబంధము వంటి కలలొస్తే పిచ్చిగా నిర్ణయాలు తీసుకోవాల్సిన పరిస్థితులూ వస్తాయి.

చంద్ర, సూర్య గ్రహణాలు వచ్చినట్టు కలవస్తే కంటి వ్యాధులు వస్తాయి. నల్లనిది, భయంకర ముఖాలు కలిగిన వారు కలలోకి వస్తే ఎంతో జాగ్రత్తగా ఉండమని హెచ్చరిక.

అనేక వంకరలు కలిగిన వారితో నూనె త్రాగినట్టు కలవస్తే తీపి వ్యాధి వస్తుందని సూచన. ఈ కలల రూపానికీ, వాస్తవానికీ మన జీవన ప్రవర్తనే కారణము. వచ్చే కలలన్నీ మన ఊహల్లో ఉన్నవే అని అర్థం చేసుకోవాలి.

**153. రోహిణికార్తెకి రోళ్ళు పగులుతాయా?**

రోహిణి కార్తెలో అనగా మే నెలలో సూర్యభగవానుడు మన నడినెత్తి మీదకొస్తాడు. అనగా మధ్యభాగానికి వస్తాడు. చంద్ర ప్రచండుడిగా మారతాడు. ఎండలు నిప్పులు కక్కుతూ భూమిని తాకుతాయి. దానితో భూమిలోని తేమ హరించుకుపోతుంది. రాళ్ళలో కూడా అంతో ఇంతో తేమ ఉంటుంది. తేమ శాతం ఇంకిపోగానే రోహిణిలో రోళ్ళు కూడా పగులుతాయి.

**154. పుణ్యప్రదేశాల్లో రాళ్ళు పేరిస్తే ఇల్లుకడతామా?**

దేవాలయాల పరిసరాల్లోని తీర్థాల్లో రాళ్ళు పేరుస్తారు.

ఎంత ఎత్తు రాళ్ళుపేరిస్తే అన్ని అంతస్థులు ఇల్లు కడతారని, ఆ ధనశక్తి అలా క్రిందకి పారే జలపాతంలా వచ్చేస్తుందని అంటారు. గూడు అనేది ప్రతివారికి అవసరం అంటారు. అది ఒక కల. అనేక వ్యాపకాలతో ఆ విషయాన్ని మరిచిపోతారు. వయసులో స్వంత ఇంటి గూర్చి అంత చింతన ఉండదని, వృద్ధాప్యం వస్తే స్వంత ఇల్లు అత్యవసరమన్నది తెలుస్తుందని, అందాక ఆ విషయాన్ని మరిచిపోవద్దని, స్వంత ఇంటి దిశగా ప్రయత్నం చేయమని అర్థం.



MOHAN PUBLICATIONS.COM

### 155. శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం ఏ పురాణంలో ఉన్నది?

శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం బ్రహ్మాండ పురాణంలో ఉంది. హయగ్రీవుడు అగస్త్య మహర్షికి ఈ సహస్రనామస్తోత్రం తెలియ చెప్పాడు. మహా త్రిపుర సుందరి వైభవమునకు ప్రతిరూపం శ్రీలలితా సహస్రనామము, కోరిన వెంటనే సిద్ధికలిగించేది శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము. ఇందులో మొత్తం వెయ్యి నామాలు వెయ్యి మంత్రాలుంటాయి.

కుండలినీ, యోగరహస్యమూ, సుగుణోపాసనా, శ్రీచక్రవర్ణనా, చతుష్షష్టియోగినీ విషయాలు గల లలితాంబికతత్త్వమూ శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం వశిన్యాది దేవతలు వ్యాస భగవానుని ద్వారా భూలోకానికి వ్యాప్తి చేశారు.

### 156. ఏ లక్షణములు గల సాలగ్రామములు మంచివి కావు?

| | |
|---|---|
| వంకర టింకర కలది | వంకర చక్రము |
| పక్కమూతి | విరిగిన చక్రము |
| పగిలిన చక్రము | ఎరుపు ముఖాలు గలవి |
| తలక్రింద చక్రము | లోపల పగులు కలది |
| మసక వన్నె | లోపల నీరు నిలిచివున్నది |
| వెచ్చగా వున్నది | మిక్కిలి గీతలు కలది |
| అస్పష్టమైనది | వేడి గుణం లేనిది |
| అనేక రంధ్రములు కలది | |

### 157. స్త్రీలు ధరించే నగల అర్థం ఏమిటి?

**వడ్డాణము:** గర్భకోశము కదలి లోపలున్న శిశువు వికారంగా పుట్టకుండా చేస్తుంది. అలాగే బంగారాన్ని అనేక మార్గాల ద్వారా ఆహారంగా తీసుకుంటే ఎంతో ఫలితం ఇస్తుంది. అలాగే బంగారాన్ని ఏ రూపంగా ధరించిన ఎంతో కొంత శక్తి శరీరానికి సంక్రమిస్తుంది. ముక్కరదీన్ని ధరించటం వల్ల మాట్లాడేటప్పుడు పై పెదవికి తగిలి వీలయినంత తక్కువ మాట్లాడమని చెబుతుంది. ముక్కర ధరించటం వల్ల ముక్కుకొనపై ఏదో విధంగా దృష్టి ఉంటుంది.

అలా దృష్టి ఉండటం ధ్యానంలో ఒక భాగం. అలాగే భార్యాభర్తలు కలుసుకున్న సమయాల్లో స్త్రీ వదిలిన గాలి పురుషునికి అనారోగ్యం. అలాంటి చెడుశ్వాస కలిగిన గాలిని బంగారు ముక్కర పవిత్రం చేస్తుంది.





**కాలికి మెట్టెలు:** గర్భకోశంలోనున్న నరాలకూ, కాలి వేళ్ళలో ఉన్న నరాలకు సంబంధం ఉంది. దానితోపాటు స్త్రీకామాన్ని అదుపులో ఉంచుకోవాలంటే కాలి వేలికి రాపిడి ఉండాలి. నేలనుతాకరాదు. కామాన్ని పెంచే నరాలు కుడికాలి వేళ్ళలో ఉన్నాయి.

**చంద్రవంక:** శిరోమధ్య ప్రదేశంలో ధరిస్తారు. ఆ ప్రాంతం నుంచే మన జీవనాధారమైన ప్రాణవాయువు బ్రహ్మరంధ్రం నుంచి హృదయంలోకి ప్రవేశిస్తాడు. అందుకే ఆ భాగాన్ని కప్పి ఉంచుతారు.

కంఠానికి వేసుకునే హారాలు: హృదయంలో పరమాత్ముడున్నాడు. ఆ విషయాన్ని గుర్తించామని చెబుతూ ధరించటము. తెలిసీ తెలియక చేసిన పాపాలను కూడా బంగారం పోగొడుతుంది. బంగారం ధరించటం ద్వారా చెడు కలలు రాకపోవటమే కాదు, గుండెల మీద బంగారం గుండెకి సంబంధించిన వ్యాధులను కూడా అరికడుతుంది. అలంకారానికి పెట్టుకునే వస్తువులే అవసరానికి ఆదుకుంటాయి. పూర్వం రాజులూ, చక్రవర్తులూ అతిసన్నని బంగారు రేకులు చేయించుకొని వేడి అన్నం మీద వేసేవారు. వెనువెంటనే బంగారు రేకు కరిగి అన్నంలో కలిసిపోయేది. అలా వారు బంగారాన్ని ఆహారంగా తీసుకునేవారు.

### 158. ఏ ఏ తిథిల్లో ఏం తినకూడదు?

పాడ్యమినాడు గుమ్మడికాయనూ, విదియనాడు వాకుడు కాయనూ, తదియనాడు పొట్లకాయనూ, చవితినాడు ముల్లంగినీ, పంచమినాడు మారేడునూ, షష్టినాడు వేమునూ, సప్తమినాడు కాయా, పండునూ.. అష్టమినాడు కొబ్బరి కాయనీ, నవమినాడు సొరకాయనూ, దశమినాడు తీగబచ్చలినీ, ద్వాదశినాడు మాంసమునూ, త్రయోదశినాడు ములక్కాయనూ... చతుర్దశినాడు మినుమూ తినరాదని శాస్త్రం చెబుతోంది.

### 159. ఏ పూలు దేనికి ప్రసిద్ధి ?

కలువపూవు శ్రీమహాలక్ష్మీకి నివాసము. కలవపూవును సింహ ద్వారము తలుపు మీద చెక్కిస్తే శుభాలు జరుగుతాయి. అవిసపూవుకి, అగస్త్య నక్షత్రానికి సంబంధం వుంది. ఈ పువ్వును పశ్చిమ భాగంలో పెంచితే దుష్టశక్తులు ఇంటిలోకి రావు. పారిజాతపువ్వులు శ్రీకృష్ణపరమాత్మ సత్యభామ కోరికపై భూమి మీదకు తెచ్చిన అద్భుతమైన పువ్వు. శ్రీ చక్రంపై ఈ పూలు చల్లి పూజిస్తే చక్కని ఫలతం వస్తుంది.

MOHAN PUBLICATIONS.COM

అలాగే మద్దిచెట్టు పూలలో 2రకాలుంటాయి. ఒకటి తెల్లమద్ది, రెండు నల్లమద్ది. ఈ 2రకాల్లో తెల్లమద్దికి ఔషధ గుణం ఉంది. ఆడవాళ్ళు దేవతా పూజల్లో వాటిని వాడటం వల్ల త్వరగా ఫలితం కనబడుతుంది. సంతానం కలిగించే పువ్వులు కూరదొండ. సంతానాన్ని ఆశించేవారు. దొండ తీగను పూజిస్తు ఉంటారు. కూరదొండ పూలను ధరిస్తే సంతానము కలుగుతుందని కొందరి ప్రగాఢ నమ్మకము.

### 160. ఏలాంటి దుస్తులు ధరించాలి?

పరిశుభ్రమైన నీటితో ఉతికిన బట్టలే ధరించాలి. నూతి వద్ద ఉతికినవి శ్రేష్ఠం. నదుల వద్ద ఉతికినవి బహు శ్రేష్ఠము. సరస్సుల వద్దా, కుంటల వద్దా ఉతికినవి అధమము. ధరించే దుస్తులు తేలికగా ఉండాలి. నూలు గుడ్డలతో నేసిన బట్టలు శ్రేష్ఠము. ఉతకటానికి కుదురని వాటిని ధరించటము అనారోగ్యమే.

### 161. దేవాలయాల్లో తల నీలాలెందుకు సమర్పిస్తారు?

జీవన పోరాటంలో మనం చెప్పే అబద్ధాలకూ, చిన్న చిన్న మోసాలకూ అసలు అంతే ఉండదు. మనిషి చేసే సర్వ కర్మల పాపఫలం తల వెంట్రుకలను చేరుతుంది. అందుకే పాపాలకి నిలయమైన తల వెంట్రుక లను దేవునికి సమర్పించి, ఓ భగవంతుడా ఇంతవరకూ నేను చేసిన పాపాలను వదిలేస్తున్నాను. ఇకపై మంచిగా, ధర్మంగా, న్యాయంగా నీతిగా ఉంటానని చెప్పటమే తల నీలాలు ఇవ్వడంలోని పరమార్థం.

### 162. జంతువుల నుంచి మనిషి ఏం నేర్చుకోవాలి?

"సింహాదేకం బకాదేకం షట్శున స్త్రీణి గర్దభాత్।
వాయసాత్పంచ శిక్షేచ్చత్వారి కుక్కటాత్॥"

సింహము నుంచి ఒక విషయాన్ని, కొంగ నుంచి రెండు విషయాలనీ, కుక్క నుంచి ఆరు విషయాలనీ, గాడిద నుంచి మూడు విషయాలనీ, కాకి నుంచి అయిదు విషయాలనీ, కోడి నుంచి నాలుగు విషయాలను నేర్చుకోవాలి. మృగాలను వేటాడేటప్పుడు సింహం సర్వశక్తులనూ ఉపయోగిస్తుంది. కొంగ తన ఆహారాన్ని దేశ వాతావరణ ప్రకారంగానూ కాలానుగుణంగానూ తీసుకుంటుంది. మనుజుడు కూడా కార్యాన్ని అలానే చేయాలి. అలాగే కుక్క అవసరమైనంత భుజించుట, అల్పసంతోషము, చక్కటి నిద్ర, తగు సమయమున నిద్రలేచుట, నమ్మిన బంటుగా ఉండుట, పరాక్రమాన్ని కలిగి ఉండుట చేస్తుంది. ఈ ఆరు గుణాలు కుక్క నుంచి నేర్చుకోవాలి.





అలాగే గాడిద మోయలేని బరువుని కూడా మోస్తుంది. వాతావరణాన్ని లెక్క చేయకపోవటం, బాగా పనిచేసి అలసి సొలసి సుఖంగా ఉండుట. ఈ మూడు గుణాలను గాడిద నుంచి నేర్చుకోవాలి. కాకి నుంచి అద్దుగల శృంగారమూ, కాఠిన్యమూ, ఇల్లు నిర్మించుకొనుటలో జాగురూకత, సోమరితనాన్ని లేకుండుట... ఇట్టివి నేర్చుకోవాలి. ఇక కోడి నుంచి మనిషి నేర్చుకోవాల్సింది. పోరాటంలో వెనుకకు తగ్గకుంటడుట, ఉదయాన్నే నిద్రలేవటమూ, బంధువులతో భుజించటమూ, ఆపదలప్పుడు స్త్రీలను (పెట్టను) రక్షించుకొనుట.... ఇటువంటివి కోడి నుండి తెలుసుకోవాలి.

### 163. తిరుమల తిరుపతి శ్రీవెంకటేశ్వర సుప్రభాతాన్ని ఎవరు రచించారు?

శ్రీవెంకటేశ్వరస్వామి సుప్రభాతాన్ని రచించినది శ్రీప్రతివాది భయంకర అణ్ణన్ ఆచార్యులవారు. శ్రీప్రతివాది భయంకర అణ్ణన్ అనే ఆయన మళయాళ మహామునుల శిష్యుల్లో ముఖ్యమైనవారు.

వీరు క్రీ.శ. 1361 నుంచి 1454 వరకూ జీవించి అనేక కృతులు రచించారు. సుప్రభాతాన్ని పుస్తకంగా ప్రచురించే వారు. ఇంకా అనేక సంగీత కార్యక్రమాలు నిర్వహించేవారు.

### 164. సరస్వతీ దేవి రాతి మీద ఎందుకు కూర్చుని ఉంటుంది?

సరస్వతీ దేవి ఏ పటంలోనైనా రాతిమీద వీణ పట్టుకునే కూర్చునే ఉంటుంది. లక్ష్మిదేవిలా నిలకడలేని తామరపువ్వులో తన స్థానముండదని చెప్పటమే ప్రధాన ఉద్దేశ్యము.

సిరిసంపదలు హరించుకుపోవచ్చు నేర్చుకున్న విద్య, విజ్ఞానం ఎక్కడికి పోలేనివని ఈ భంగిమకు అర్థం-పరమార్థం. సరస్వతిదేవి వాహనము హంస. హంస చాలా జ్ఞానము కలది. పాలు, నీళ్ళూ కలిపి దాని ముందు ఉంచితే పాలని మాత్రమే స్వీకరిస్తుంది. అలాగే విజ్ఞానం వల్ల ఏదైనా సాధించవచ్చునని మనం నేర్చుకోవచ్చు.

### 165. నాగుల చవితి రోజున పుట్టలో పాలు ఎందుకు పోస్తారు?

పాములు అసలు పుట్టలు పెట్టవు. చెద పురుగులు పుట్టలు పెడితే పాములు అందులో నివాసం ఉంటాయి. పామంటే అందరికీ భయమే కదా. పాములు అన్నీ మనిషిని చంపలేవు. అలాగే పగ కూడా పట్టవు. అటువంటి పాములు హఠాత్తుగా కనిపిస్తే, భయంతో గుండె ఆగి

MOHAN PUBLICATIONS.COM

చనిపోతారని, పాములుపట్ల భక్తి ఉంటే, ఆ భక్తితోనైనా పాముని చూడగానే దూరంగా జరిగి తమ ప్రాణాలూ, పాము ప్రాణాలు నిలపెడతారని పెద్దలు ఈ నియమాన్ని పెట్టారు. నిజానికి పుట్టలో పాలు పోస్తే పాములు ఆ పాలను త్రాగవు.

పాము కాటేస్తుందని మనం భ్రమిస్తాము. మనమేదైనా అపాయం చేస్తామని పాము భయపడుతుంది. అందుకని దాని భయాన్ని తగ్గించే ప్రయత్నమే పుట్టలో పాలు పోయటము.

### 166. బట్టలన్నీ విప్పి దిగంబరంగా ఎందుకు పడుకోకూడదు?

స్త్రీగానీ, పురుషుడుగానీ బట్టలు అన్నివిప్పి దిగంబరంగా పడు కోరాదని శాస్త్రాలు చెబుతున్నాయి. వంటిమీద బట్టలు లేకుండా పడుకోవడంవల్ల మన దేహంలో రసాయనిక చర్యజరిగి, శక్తిని హరించేలా చేస్తుందని ఆయుర్వేద శాస్త్రము చెబుతోంది. అలాగే స్త్రీలు బట్టలన్నీ విప్పుదీసి పడుకోవడం వల్ల రాత్రుళ్లు విహారంచేసే అనేక రాక్షస అంశగల వారు ఆవహించటమో, రహసంగా శీలాన్ని అపహరించడం జరుగుతుంది. అందుకనే కనీసం మర్మాంగాలపై వస్త్రాన్ని కప్పుకుని నిద్రించటం మంచిది.

### 167. తల్లి గర్భంలోని పిండం ఎలా పెరుగుతుంది?

అయిదు రోజులకు బుద్బుదాకారము, పదిరోజులకు రేగిపండంత పరిమాణంగా పెరుగుతుంది. ఒక నెలకి శిరస్సూ, రెండు నెలలకి భుజాలూ, మూడు నెలలకి గోళ్ళూ, రోమాలూ, చర్మమూ, గుహ్యాంగాలూ, నాలుగు నెలలకి సప్తధాతువులూ, ఐదు నెలలకి ఆకలిదప్పికలూ, ఆరు నెలలకి మాయతో కప్పపడి, ఏడవ నెలలో జ్ఞానం కలిగి అటూ ఇటూ కదులుతాడు. నెలలు నిండి జన్మించే వరకూ లోపల జీవి అనేక విధాలుగా, గత జన్మలో చేసిన పాపాలనూ, తప్పులనూ పునరాలోచించుకుని, ఈ జన్మలో అవి చెయ్యనని ఆ దేవదేవుడ్ని ప్రార్థిస్తూ భూమి మీద పడతాడు. అయితే పడీ పడగానే మాయ కమ్మేస్తుంది. అంతా మరిచిపోతాడు. మళ్ళీ మాములు పోరాటమే. ధన పోరాటము. స్త్రీ పోరాటము. కుటుంబ పోరాటము. కీర్తి పోరాటము.

### 168. భోజనము ఏ ఆకులో చేయాలి ?

వివాహాది శుభకార్యాల్లో పూర్వం విధిగా అరటి ఆకుల్లోనే భోజనాన్ని వడ్డించేవారు. పురాతనశాస్త్రాలు అరిటాకులోనే ఉత్తమమని చెబుతున్నాయి.



అరటి ఆకులో ఎన్నో ఔషధ గుణాలున్నాయి. అవి శరీరానికి ఎంతో మేలు చేస్తాయి. అలాగే రావి ఆకులో భోజనం ఆరగిస్తే జననేంద్రియ దోషాలు పోతాయి. చిన్న పిల్లలకి చక్కటి మాటలు వస్తాయి. మోదుగ విస్తరిలో భోజనం ఆరగిస్తే కంటిదోషాలు కనుమరుగవుతాయి. మర్రి ఆకులతో కుట్టిన విస్తరిలో భోజనం ఆరగిస్తే ఆరోగ్యము. పచ్చటి ఆకుల్లో భోజనము ఆరగించడం వల్ల ఆ ఆకులోని క్లోరోఫిల్‌వల్ల అనేక జబ్బులు, పేగుల్లోని క్రిములు తొలగిపోతాయి.

### 169. మృత్యుదేవత మానవుడ్ని హెచ్చరిస్తుందా?

మృత్యుదేవత మానవులకి అనేక విధాలుగా సంకేతాలిస్తుంది. ముందుగా తలవెంట్రుకలను రాలేలా చేస్తాడు. అదే మృత్యుదేవత కదలిక. ఆపై పళ్ళు వక్కొక్కటిగా ఊడిపోయ్యేలా చేస్తాడు. ఆ తర్వాత కనులకు దృష్టిని తగ్గిస్తాడు. తదుపరి కాళ్ళూ, చేతులూ వణికేలా చేస్తాడు.

అదే ఆయన చివరి హెచ్చరిక. జుట్టురాలటం ప్రారంభం కాగానే భగవంతున్ని ఆరాధించమని, పూర్తి కాలం నియమ నిష్టలతో ఉండి ఆయు ష్షును పెంచుకోమని ఇహం నందు చెయ్యాల్సిన సమస్త విధులూ సుఖాలూ పొందమని యమధర్మరాజు తన సంకేతాల ద్వారా తెలియచెబుతాడు.

### 170. బ్రహ్మ ముహూర్త సమయమంటే?

కశ్యపబ్రహ్మకూ, వినతాదేవికి జన్మించినవాడు అనూరుడు. అతడే సూర్యుడి సారథి. తల్లి వినతాదేవి పుత్రుడ్ని చూసుకోవాలనే కుతూహలంతో, ఆత్రుతతో పుట్టకముందే అండం పగలకొట్టడంతో సగం శరీరంతో జన్మించాడు.

బ్రహ్మ అతడ్ని సూర్యుడికి సారథిగా నియమించి, నీవు భూలోకాన ఉన్న సమయమే బ్రహ్మ కాలమని, ఆ కాల సమయమున చెడు అన్నది ఏ నక్షత్రాలూ, గ్రహాలు చెయ్యలేవని వరమిచ్చి సూర్యుడి సప్తాశ్వరథానికి సారథిగా నియమించాడు.

### 171. ఏయే దానాల వల్ల ఏయే ఫలితం వస్తుంది?

కన్యాదానం వల్ల బ్రహ్మలోకప్రాప్తి, బంగారాన్ని దానం చెయ్యటం ద్వారా విష్ణులోక ప్రాప్తి, గుర్రం దానం చేస్తే గంధర్వలోక ప్రాప్తి, ఏనుగుని దానంగా ఇస్తే శివలోక సాన్నిధ్యము, ఇల్లు దానం చేస్తే విష్ణు కరుణ, నాగలి దానం చేస్తే శ్రీకృష్ణుడి ప్రేమ, భూదానం శివలోక నివాసము,



MOHAN PUBLICATIONS.COM

ఎద్దుని దానంగా ఇస్తే మృత్యుంజయ లోకంలో జన్మ, గోవుని దానంగా ఇవ్వటం ద్వారా వైకుంఠ నివాసము.

### 172. అగ్ని హోత్రమంటే ఎలా చేయాలి?

సూర్యోదయ సూర్యాస్తమయాల సమయంలో రాగిపాత్రలో ఆవు పేడ పిడకలూ, జిల్లేడూ, మోదుగా, చంద్ర,దర్భ, గరికలాంటి వృక్షాల కట్టెలనువేసి అగ్ని వెలిగించి మంత్ర జపాన్ని చేయాలి. ఆవు నెయ్యి, గోధుమ రంగుగల అన్నమును హవిస్సుగా అగ్నిదేవునికి అర్పించాలి. మంత్ర శబ్దములు, రాగిపాత్రనుంచి వచ్చే హోమధూమము వల్ల చుట్టూ వాతావరణము పవిత్రంగా మారిపోతుంది.

### 173. పరిపూర్ణ ఆరోగ్యంగా జీవించాలంటే?

మధ్యాహ్నము ఎండనూ, శవాన్ని కాల్చినప్పుడు వచ్చే పొగనూ, వృద్ధ స్త్రీని, తనకన్నా వయసులో పెద్దదైన స్త్రీనీ, గట్టి పెరుగునూ, చీపురు ధూళినీ సేవించకూడదు. సేవించినచో ఆయుష్షు తగ్గును.

### 174. తిరుమల పాపనాశనమందు స్నానం చేస్తే?

తెలిసి చేసిన, తెలియక చేసిన సమస్త పాపములు పశ్చాత్తాపముతో మూడు రోజులు స్నానమాచరించిన సమస్త దోషాలు, పాపాలూ పోతాయని శ్రీవేంకటేశ్వర మహత్యంలో ఉంది. చిత్తా నక్షత్రాన చైత్ర పౌర్ణమి ఉదయం ఆకాశ గంగలో స్నానమాచరించిన, నీటితో కడిగిన మురికిలా పాపాలు పోతాయి.

### 175. వేటిని ఎన్నటికీ చెప్పకూడదు?

నేర్చుకున్న రహస్య మంత్ర ఔషధాలను, చేసిన దానధర్మములను ఇంటిలోని పోరును, కోరుకున్న స్త్రీతో కలయికను, భార్యతోగడిపిన సంగతులను, చెడువార్తలను, ఇటువంటివి వేటిని ఇతరులతో చెప్పరాదు.

### 176. ఓం శాంతి శాంతి శాంతిః అనగా....

మొదటిసారి శాంతి అనగానే.... మనకీ మన వారికీ, దుఃఖ బాధలు తొలగాలనీ, రెండవసారి శాంతి అనగానే మన చుట్టూ ఉన్న సమస్త ప్రాణి కోటి సుఖంగా ఉండాలనీ, మూడవసారి శాంతిః అనగానే ప్రకృతి పరంగా, గ్రహాల పరంగా ఏ ఉపద్రవాలూ భూమండలాన్ని తాకవద్దని కోరుకోవటము.





ఏ ప్రార్థన చివరిలోనంనా మనం ఓం శాంతి శ్శాంతి శాంతిః అని మూడుసార్లు ఉచ్చరిస్తుంటాం. ఆ విధంగా మూడుసార్లు అనడంద్వారా మూడు రకాలయినటువంటి తాపాలు (బాధలు) తొలగాలని భగవంతుడిని ప్రార్థించడ మన్నమాట.

ఓం శాంతిః (ఆధ్యాత్మిక తాపం చల్లారుగాక)

ఓం శాంతి (ఆది భౌతిక తాపం చల్లారుగాక)

ఓం శాంతిః (అధిదైవిక తాపం చల్లారుగాక)

1. ఆధ్యాత్మిక తాపం అంటే, శరీరానికి సంబంధించినటువంటి వివిధ రకాలయిన రుగ్మతలు (రోగాలు మొదలయినవి) తొలగాలని.

2. అదిభౌతిక తాపం అంటే, దొంగలు మొదలైన వారివల్ల కలిగే బాధలు, ప్రమాదాలు తొలగాలని.

3. అదిదైవిక తాపం అంటే, దైవవశంవల్ల కలిగే బాధలు, యక్షులు, రాక్షసులు మొదలైనవారివల్ల కలిగే ఊహకు కూడా అందని బాధలు, ప్రమాదాలు మొదలైనవి తొలగాలని ప్రార్థించడమన్నమాట.

'ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః' అని మూడుసార్లు చెప్పడంలో ఇంత అర్థం దాగివుంది.

### 177. మనిషిని రాక్షసునిగా చేసేవి ఏవి?

ధర్మ, అర్థాలతో జీవితాన్ని సాగిస్తున్న వ్యక్తి జూదము, మద్యము, మగువ వంటి వ్యసనాల పాలవుతే అతనిలో ధర్మ, సత్య గుణం నశించి ఎన్ని అబద్ధాలైనా, మరెన్ని నీచకార్యాలయినా చేయటానికి ఎట్టి స్థితిలోనూ సందేహించడు. కనుక వ్యసనములు ఎంతటి మహాత్ముడినయినా అధర్మ పద్ధతిలోకి తీసుకెళతాయి.

### 178. ఏ పని ఎప్పుడు చెయ్యాలో అప్పుడే చెయ్యాలి.... ఆ పనులేంటి?

వందపనులున్నా..... కోటి ధనం వస్తుందన్నా సమయానికి భోజనం చేయాలి. వెయ్యి పనులున్నా తగు సమయాన్ని వెచ్చించి స్నానముచేసి పూజాధికాలు చేయాలి. లక్ష సమస్యలున్నా దానము చేయాలనిపిస్తే వాయిదా వేసుకోకుండా చేసేయాలి. కోటి పనులున్నా వదలి శ్రీహరిని సమయానికి పూజించాలి. ఇవి చేయగలిగితే మీకన్నా సుఖవంతుడు ఉండరు.

MOHAN PUBLICATIONS.COM

**179. భార్య గర్భవతిగా ఉన్నప్పడు ఇల్లు ఎందుకు నిర్మించకూడదు?**

భార్య గర్భవతిగా ఉన్నప్పుడు కొత్త ఇంటిలోకి అడుగుపెట్టరాదు. అలాగే నూతన గృహం కూడా నిర్మించరాదు. జీవితాంతము నిలచివుండే ఇంటిపట్ల, వంశాన్ని ఉద్ధరించే పిల్లలపట్ల శ్రద్ధ చాలాఅవసరం. గర్భవతిగా ఉన్న భార్యని ఎంతో జాగ్రత్తగా కంటికి రెప్పలా చూసుకోవాలి. భార్య సంరక్షణ మరియు కొత్త ఇంటి నిర్మాణం ఈ రెండుపనులను ఒకేసారి ఎవరు సరైన రీతిలో చూసుకోలేరు. రెండిటికీ న్యాయం చెయ్యలేరు. అందుకే భార్య గర్భవతిగా ఉన్నప్పుడు ఇల్లు కట్టకూడదని పెద్దలుచెపుతారు.

**180. దసరా పండుగ రోజున ఏ పని ప్రారంభించినా విజయమవ్వటానికి కారణము ఏమిటి?**

ఆ రోజు విజయదశమి. అనగా శ్రవణా నక్షత్రం, దశమీ తిథి, సంధ్యా కాలము దాటిన తర్వాత సమయమే విజయకాలము. సంధ్యాకాలం దాటిన తర్వాత 48 నిముషాల వరకూ పరాశక్తి అనన్యశక్తి మంతురాలవు తుంది. కనుక ఆ సమయమున ఏపని ప్రారంభించినా, విజయపథంలో దూసుకుపోవచ్చు.

**181. పిల్లల్ని ఎలా పెంచాలి?**

అయిదు సంవత్సరాలు వచ్చే వరకూ పిల్లలని రాజకుమారుల్లా అతి గారబంగా పెంచాలి. ఆపై పదిహేను సంవత్సరాల వరకూ సేవకుడిలా ఆజ్ఞాపించి పెంచాలి. పదహారు సంవత్సరాల తర్వాత మిత్రునిలా భావించి పెంచాలి. అప్పుడే ప్రయోజకులవుతారు. పిల్లల్ని ప్రేమతో చూడటం వేరు గారాబంగా చూడటం వేరు. ప్రేమతో పెంచితే ప్రయోజకులవుతారు. గారాబంగా పెంచితే మీకూ దేశానికీ, కట్టుకున్న దానికీ సమస్య అవుతారు. చిన్నతనంలో మన తల్లీ, తండ్రీ నుంచి మనం ఏం కోల్పోయామో, ఏ విషయాల ద్వారా జీవితంలో ఈ స్థితికొచ్చామో, గమనించి ఆవే తప్పులు మళ్ళీ చేసి ఆపై చింతించకండి. పిల్లలు పెరిగి పెద్దయి ప్రయోజకులుగా మారి, మనల్ని ఉద్ధరించే స్థితిలో ఉండాలి. కాని మనమే వారిని చూసే పరిస్థితి వస్తే ఖచ్చితంగా మనం మన పిల్లలని సరైన దారిలో పెంచలేదని....

**182. రామాయణం, భారతం, భాగవతాలను ఎప్పడు చదవాలి?**

సూర్యోదయసమయమున మహాభారతాన్నీ, మధ్యాహ్న సమయ మున రామాయణాన్నీ, రాత్రి భాగవతాన్నీ చదివితే మంచి ఫలితం వస్తుంది.





**183. భగవంతునికి పెట్టే దీపం ఏ వైపుకి ఉండాలి?**

వెండి, పంచలోహాలు లేదా మట్టి ప్రమిదల్లో దీపం వెలిగించి దేవుని వైపుకి ఉంచాలి 2 వత్తులు మాత్రం ఖచ్చితంగా ఉండాలి. ఒకే వత్తితో దీపాన్ని ఎప్పుడూ వెలిగించరాదు. అలాచేయడం మహాదోషము. ఓసారి పూజకు వాడినవస్తువులను మళ్ళీ వాడరాదు. శివునికి ఎడమ వైపూ, విష్ణువుమూర్తికి కుడివైపు దీపాన్ని ఉంచాలి. అంతేకాని ఎదురుగా ఉంచరాదు.

నిత్య దీపారాధన చేసే వారికి మంచి భర్త వస్తాడు. స్త్రీలు సుమరళిగా ఉంటారు. సంతానవంతులవుతారు. దీపారాధ చేయడం అంటే సాక్షాత్తు ఆ జగన్మాతని ఆరాధించటమే.

**184. చెట్టు ముందా? విత్తు ముందా? ఏది ముందు ?**

చెట్టు కావాలంటే విత్తనం కావాలి. అలాగే విత్తనం కావాలంటే చెట్టూ కావాలి. అలా ఎంత పరిశోధించి చూసినా చెట్టు ముందు విత్తనం, విత్తనం ముందు చెట్టు ఇలా ఎన్నిసార్లు వెనక్కి వెళ్ళినా ఆది అంతం వుండదు. అంటే చెట్టు విత్తనం సంబంధం పెట్టినవాడే భగవంతుడు. ఆ భగవంతుడు అన్నింటా అందరికంటే ముందు అనేది అసలైన పరమార్థం. కానీ చెట్టు ముందా విత్తు ముందా? అంటే పురాణాఅఉ ఆధారంగా చెట్టే ముందు అని చెప్పాలి ఎందుకంటే క్షీరసాగర మథనంలో కల్పవృక్షమే పుట్టింది కానీ కల్పవిత్తనం పుట్టలేదు గనుక.

**185. శ్రీలక్ష్మీదేవి స్థానాలు ఏమిటి?**

గురుభక్తి, దైవభక్తి, మాతా పితృభక్తి గలవారికి శ్రీమహాలక్ష్మిదేవి తన కటాక్షాన్ని అందిస్తుంది. అతిగా నిద్రపోయేవారి ఇళ్ళల్లోనూ, ప్రాతః కాల సమయంలో పూజ చేయని వారి ఇంటిలోనూ లక్ష్మిదేవి ఉండదు. ఇల్లు పరిశుభ్రంగా లేకపోయినా, గడపకు పసుపు రాయక పోయినా, స్త్రీలకు నిషిద్ధమైన 4 రోజులు పూజమందిరానికి దూరంగా ఉండకపోయినా లక్ష్మిదేవి ఆ ఇంటి నుంచి వెళ్ళిపోతుంది. ముగ్గూ, పసుపూ, పువ్వులూ, పళ్ళూ, పాలూ, దీప, ధూప, మంగళద్రవ్యాలు లక్ష్మీదేవిస్థానాలు.

**186. ఇంద్రధనుస్సుని మరొకరికి చూపించవచ్చా? చూపించకూడదా?**

సుందరమైన ఇంద్రధనుస్సును చూడటం అంటూ జరిగితే ప్రత్యక్షంగా మీరు మాత్రమే చూడాలిగాని మరొకరికి చూపించకూడదన

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

టానికి ముఖ్యకారణం ఏమిటంటే ఇంద్రధనస్సు నుంచి వచ్చే నీలాలోహిత కిరణాలు కంటికి అపాయం కలిగిస్తాయి. అందుకే మరొకరికి చూపించ కూడదని చెప్పకూడదని పెద్దలు చెబుతారు.

### 187. పంచాంగము ఎప్పడు పుట్టింది?

సుమారు అయిదు వేల సంవత్సరాల నాటి క్రితం మహర్షులు సూర్యచంద్రుల గమనాన్ని ఆధారంగా చేసుకొని తిథీ, వారమూ, నక్షత్రమూ, యోగమూ, కరణమూ అను ఈ అయిదింటితో పంచాంగాన్ని వ్రాశారు.

### 188. ఆవు యొక్క పవిత్రత ఏమిటి ?

గోవు... గంగ... గాయత్రి... ఈ 3 పరమ పవిత్రమైనవి. అవుని పూజిస్తే 33 కోట్ల దేవతలని పూజించినట్లే! క్రిమి కీటకాలు లేకుండా చెయ్యటంలోనూ  ఇంకా అనేక నేత్ర, హృద్ రోగాలను పారద్రోలే శక్తి గోమయంలో వుందని వైద్య శాస్త్రంలో పేర్కొన్నారు. ఆవుని ముట్టుకున్నంతనే ఆయుష్షుపెరుగుతుంది. ఆవుకు నమస్కరిస్తే ముక్కోటి దేవతలకి నమస్కరించి నట్టే!

### 189. పంచాంగ ఫలమంటే?

బ్రహ్మ అయిదు ముఖాల నుంచి పుట్టినదే పంచాగము. తూర్పు ముఖాన్నుంచి తిథి, దక్షిణ ముఖాన్నుంచి వారమూ, పశ్చిమ ముఖం నుంచి నక్షత్రమూ, ఉత్తర ముఖం నుంచి యోగము, ఊర్ధ్వ ముఖం నుంచి కరణమూ... ఈ అయిదింటి కలయికే పంచాంగము. తిథి వల్ల ధనమూ, వారము వల్ల ఆయుష్షు పెరుగుతాయి. నక్షత్రం వల్ల పాపపరిహారమూ, యోగము వల్ల రోగాలు సమసిపోతాయి. కరణము వల్ల కార్యసిద్ధి కలుగుతుంది.

### 190. ఏఏ రోజుల్లో క్షుర కర్మ చేయించుకోవాలి?

బుధవారమూ, గురువారమూ, సోమవారమూ మంచిది. అదివా రమూ, శనివారమూ క్షురకర్మ వద్దు. మొదట గడ్డం గీయించుకుని ఆపై చంకలూ, ఆ తర్వాత తల క్షౌరం చేయించుకోవాలి. ఇలా చేయించుకోవటం వల్ల కుటుంబ వృద్ధని శాస్త్రాలు చెబుతున్నాయి.

గోళ్ళూ, మీసాలూ, రోమాలూ, ప్రతి అయిదు రోజులకొకసారి కత్తిరించుకోవాలి. ముక్కులోని వెంట్రుకలు కత్తిరించుకోకూడదు. దాని వల్ల కంటికి ఇబ్బంది. మనం పీల్చేగాలిలో అనేక విషక్రిములుంటాయి.





వాటిని పసిగట్టి ఆపి... మంచి గాలిని పంపించేవే ముక్కులోని వెంట్రుకలు. అలాంటి వాటిని అందం కోసం కత్తిరించ వద్దు. అలాగే క్షురకర్మ పాడ్యమీ, చవితీ, షష్ఠి, అష్టమీ, నవమీ, అమావాస్య, పౌర్ణమి తిథిలందు వలదు.

### 191. శనీశ్వరునకు నడకంటే ఇష్టమా?

శనీశ్వరునకు నడకంటే ఎంతో ప్రీతి. అందుకే అనేక ప్రదక్షిణాలు చేస్తారు. శనిని తమకనుగుణంగా ఆశీర్వదించమని వేడుకుంటారు. గతంలో మన రాష్ట్రముఖ్యమంత్రి కూడా అయిదారు నెలల పాటు నడకను సాగించే ముఖ్యమంత్రి అయ్యారు. ఇక నడక విషయానికొస్తే నడక శరీరంలో శక్తిని పెంచుతుంది. బుద్ధిని పెంచుతుంది. మనసుకి ఉత్తేజాన్నీ ఉత్సాహాన్నీ ఇచ్చి సమస్త కార్యాల్లో విజయాన్ని తెచ్చి పెడుతుంది.

### 192. '9' అంకె యొక్క విశిష్టత ఏమిటి ?

కృత, త్రేతా, ద్వాపర యుగాలను లెక్కేస్తే 9 సంఖ్య వస్తుంది. కృతయుగం 17,28,000. త్రేతా యుగము 12,96,000. అలాగే ద్వాపర యుగము 8,64,000.

మహాభారతములోని పర్వాలు 18, మహాభారత యుద్ధం జరిగింది కూడా 18 రోజులే. మహాభారతంలో పాల్గొన్న అక్షౌహిణులు18.  అలాగే భగవద్గీతలోని అధ్యాయాలు 18. వ్యాసమహర్షి రచించిన పురాణాలు 18 కలిపితే వచ్చేది 9. మానవ దేహంలో ఉన్న రంధ్రాలు 9. ఆఖరుకి మనం తల్లి గర్భంలో ఉండేది కూడా 270 రోజులు.అంటే వాటి మొత్తాన్ని కలిపితే వచ్చేది 9.

### 193. పెళ్ళిలో తలంబ్రాలు ఎందుకు పోసుకుంటారు?

వివాహంలో మొదటిసారిగా వధూవరులు ఇద్దరూ నాలుగైదు సార్లు ఒకరిపై ఒకరు తలంబ్రాలు పోసుకుని, ఆతరువాత పోటీపడి మరీ ఒకరిమీద ఒకరు సంతోషంగా తలంబ్రాలు పోసుకుంటారు. ఆ సమయమున ఉచ్చరించిన మంత్రాలకు అర్థము ఏమిటంటే సంతానము వృద్ధి చెందాలని వరుడు, ధనధాన్యాలు వృద్ధి చెందాలని వధువు ఇలాసకల సంపదలూ  సుఖసంతోషాలు కావాలని ఇద్దరూ కలసి దేవుడ్ని  కోరుకోవటమే తలంబ్రాల ముఖ్యఉద్దేశ్యము.

### 194. గర్భగుడిలోకి వెళ్ళేముందు గడపకు ఎందుకు నమస్కారము చేస్తారు?

ఇంట్లో ఉన్నట్లే చెక్కతో కాకుండా గుళ్ళలో గడపను రాతితో నిర్మిస్తారు. రాయి పర్వతానికి చెందినది.

భద్రుడు అనే ఋషి భద్రమనే పర్వతంగానూ, హిమవంతుడు అనే భక్తుడు హిమాలయముగానూ, నారాయణుడు అనే భక్తుడు నారాయణాద్రిగానూ అవతరించారని పురాణాలు చెబుతున్నాయి. దేవుడు ఆ భక్తుల కోసం ఆ కొండల మీదే కొలువై ఉన్నాడు. కనుక ఆ రాళ్ళ నుంచి వచ్చిన రాయినే గడపగామార్చి ఉంచుతారు. ప్రతిరోజు దేవుడ్ని దర్శించే ఆ గడప పుణ్యానికి నమస్కరిస్తూ అలాగే అంతటి మహాభక్తుడ్ని దాటుతున్నందుకు క్షమించమని వేడుకోవటమే గడపకు నమస్కరించడము లోని అంతరార్థము.

### 195. గయలో ఇష్టమైనదాన్ని వదలమంటారు ఎందుకని ?

ఎంతో ప్రీతికరమైన పండును లేదా కూరగాయనూ మరేదైనా వస్తువును గయలో వదలి వచ్చామంటారు. ఆ తర్వాత దానిని అసలు ముట్టనే ముట్టరు. అలా వదలటానికి ప్రధాన కారణము ఏమిటంటే కామక్రోధలోభ మోహాలని, మదమాత్సర్యాలు వదిలేసి వచ్చానని ఇకనుంచి నేను నా ఇంద్రియాలను అదుపులో ఉంచుకుంటున్నానని చెప్పటం.

### 196. ఆడపడుచు చేత పెళ్ళికొడుకును తయారు చేయించేదెందుకు?

స్త్రీ పుట్టింటి నుంచి అత్తగారింటికి వెళ్ళగానే తన పుట్టింటితో ఉన్న ఉన్న అనుబంధమూ, హక్కులూ పోయాయనీ, పుట్టింటికి తాను దూరమయ్యాయని బాధపడుతుంటారు. అటువంటిదేమీ లేదు. ఈ ఇంట్లో నీ హక్కు అలాగే ఉందని చెప్పి, పెళ్ళి సమయంలో తోడపుట్టిన వాడిని పెండ్లి కొడుకును చేయించటం దగ్గర్నించి ఆమెకు లాంఛనాలు ఇప్పించటం వరకూ తన ఇంటి పిల్లగా ప్రాధాన్యత కల్పిస్తారు. అలాగే తాము వెళ్ళిపోయిన తర్వాత ఆడపిల్లను మగ పిల్లలు పట్టించుకోరేమోనని జాగ్రత్తతో ముందు నుంచి ప్రతి శుభకార్యానికి ఆడపిల్ల తప్పని సరి అని, ఆమె చేతుల మీదగానే ఏదైన ప్రారంభించాలని చెప్పటమే ప్రధాన ఉద్దేశ్యము.

### 197. ఆదివారం ఉసిరికాయ తినవచ్చా ? తినకూడదా?

ఆదివారాన్ని రవివారమని కూడా అంటారు. జ్యోతిష్యరీత్యా రవి, శుక్రులకి శత్రుత్వము. ఉసిరికాయలోని ఆమ్ల గుణం శుక్రునికి సంబంధించినది.

ఇద్దరికీ పడదు కాబట్టి ఆరోజు ఉసిరికాయ తినకూడదని పెద్దలు చెబుతారు.





### 198. పండుగల రోజున వడపప్పు ఎందుకు చేస్తారు?

పర్వదినాలప్పుడు మనం ఎన్నో పిండివంటలు చేసుకుని తింటూం టాము. దానితో ఎన్నో అనారోగ్య సమస్యలు తలెత్తుతాయి. వడపప్పు, పానకం త్రాగడంవల్ల అరగని ఆహారపదార్థాలను అరిగేటట్లు చేస్తాయి. అందుకనే పండగలరోజున వడపప్పు, పానకం చేస్తారు.

### 199. సాలగ్రామాలు పగిలితే పూజకు పనికిరావా?

సాలగ్రామములు సాక్షాత్తు విష్ణుదేవునికి ప్రతీకలు.

**"స్ఫుటితం పుత్రహాని స్స్యాత్ భగ్నోష్ఠం బుద్ధిద నాశనమ్.**
**ఆస్థాన భంగదం భగ్నం దుర్దురం క్లేశ కారణమ్**
**భయావహం భగ్న శీర్షం అతిస్థూలం ధనాపహమ్**
**అతిహ్రస్వ మపూజార్హం త్రికోణం బంధునాశన్."**

పగిలిన సాలగ్రామము సంతానహానిని కలిగిస్తుంది. పెదవి విరిగిన సాలగ్రామము బుద్ధిని హరిస్తుంది. దద్దుర్లు కలిగిన సాలగ్రామము క్లేశ కారణమవుతుంది.

తల పగిలిన సాలగ్రామము భయాన్ని కలిగిస్తుంది. బాగా లావయిన సాలగ్రామము ధన నాశనాన్ని కలిగిస్తుంది. ఇక పొట్టి సాలగ్రామము అసలు పూజకే పనికి రాదు. చక్రంతో కూడి ఉన్న సాలగ్రామము పగిలినా, విరిగినా ఎలా వున్నా పనికి వస్తుంది.

### 200. కుడివైపు తిరిగి పడుకుంటే పిశాచాలు ఆవహిస్తాయా?

కుడివైపు తిరిగి పడుకుంటే ఎన్నో పీడకలలూ, కలత నిద్రావస్తుందని పెద్దలు చెప్తారు. కనుక ఎడమవైపు తిరిగి పడుకోవాలి. పెద్దలమాటల్లో ఎంతో ఆరోగ్యసత్యం కూడా దాగిఉంది మనిషికి ఎడమ పార్శ్వమున జఠరాగ్ని ఉంటుంది. తిన్న ఆహారము సరిగ్గా జీర్ణించటానికి ఎడమ వైపు తిరిగి పడుకోమని చెబితే వినరని కుడివైపు తిరిగి నిద్రిస్తే పిశాచాలు అవహిస్తాయని చెబుతారు.

### 201. కొత్తబట్టలకు నలుదిశలా పసుపు ఎందుకు రాస్తారు?

ఈ సంప్రదాయాన్ని మన పూర్వీకులు మన ఆరోగ్యం కోసమే పెట్టారు. వస్త్రాలను మగ్గాలపై నేస్తారు. అలా నేసే ముందు నూలుకు పిండితో తయారయిన గంజి పెడతారు. అలా గంజి పెట్టి నేయటం వల్ల అనేక సూక్ష్మక్రిములు వస్త్రాల్లో చేరతాయి. అటువంటి వస్త్రాలను ధరిస్తే

MOHAN PUBLICATIONS.COM

చర్మరోగాలు వస్తాయి. అందుకే ఆ సూక్ష్మ క్రిములను దూరం చేసే పసుపును కొత్తబట్టలకు నలుదిశలా రాసి ఆపై ధరించమని చెపుతారు. పసుపు శుభప్రదమునకు చిహ్నం కూడా.

## 202. సప్తపది అంటే ఏమిటి?

పెళ్ళికొడుకు పెళ్ళికూతురుని 7 అడుగులు నడిపిస్తూ నీవు నన్నే సదా అనుసరించు, ఆ ఈశ్వరుడు నీవు నాతో నడిచే అడుగుతో ఏకం చేయాలి. ఇంకా అన్నాన్నీ, శక్తినీ, బుద్ధినీ, సుఖాన్నీ, పశువృద్ధినీ, ఋతుసంపదనూ, ఋత్విక్ సంపదనూ కలుగచేయాలి. ఇద్దరమూ ధర్మ, మోక్ష, కార్యాలను కలిసి చేద్దాము. నేను సామవేదాన్ని, నీవు ఋగ్వేదానివి. వీర్యాన్ని ఉంచేవాడిని నేను. భరించే దానవు నీవు. వర్షపు నీటి చుక్కలు నేల మీద పడి పరమ ఔషధాలు మొలకెత్తినట్టు నీవు నాకు సంతానం కలుగచేయి. అలా మనం సంతోషంగా కలసిజీవిద్దాము అని అర్థం.

వివాహంలో సప్తపది కార్యక్రమం చాలముఖ్యమైనది. ఇది పూర్తయితేనే కాని వివాహం అయినట్లుకాదు. అప్పటి నుంచి వధువు ఇంటిపేరు, గోత్రము మారి వరుడి ఇంటిపేరు, గోత్రము వస్తాయి. అగ్నిహోత్రానికి ఉత్తరంగా ఒక పళ్ళెంలో బియ్యముపోసి ఏడు పసుపుకొమ్ములను బియ్యము పై పడమర నుంచి తూర్పుకు ఉంచి వరుడు వధువు చేయిపట్టుకుని ఆమె కుడిపాదంతో ఆమెను నడిపిస్తూ ఒక్కొక్క కొమ్మునే మంత్రయుక్తంగా తాకిస్తాడు. దీనినే సప్తపది అంటారు. ఆ మంత్రార్థాలు ఏమంటే –

మొదటి అడుగు అన్నము కొరకు, రెండవ అడుగు బలము కొరకు, మూడవ అడుగుధర్మాచరణ సామర్థ్యం కొరకు, నాల్గవ అడుగు కర్మ సంబంధమైన సుఖం కొరకు, ఐదవ అడుగు పశుసమృద్ధి కొరకు, ఆరవ అడుగు ఆరు ఋతువులలో వాతావరణ మార్పులను జీవులు ఎలా తట్టుకుంటాయో అట్లే సంసారంలో వచ్చే ఆటుపోట్లను తట్టుకునే శక్తికొరకు, ఏడవ అడుగు యజ్ఞము చేయుటకు కావలసిన ఏడుగురు ఋత్విక్కులను ప్రసాదించుటకు విష్ణుమూర్తిని ప్రార్థిస్తు వేయిస్తాడు. ఇక్కడ యజ్ఞమనగా భార్యాభర్తలిద్దరు సఖ్యముగా ఉండుట, ఎపుడు వియుక్తులు కాకుండుట, గృహస్థాశ్రమ ధర్మాలన్ని ఇరువురు ఆలోచించి చేయుట, ఒకరిపై ఇంకొకరం ప్రీతి కలవారై యుండుట, మంచి మనస్సు కలిగి వారికున్న సంపదను సమాన హక్కులతో అనుభవించుట, దేహేంద్రియ, అంతరేంద్రియ మూల పనులను సక్రమంగా చేయగలిగి యుండుట ఇవన్నీ యజ్ఞములే.





## 203. షోడశ మహాదానములన్న ఏవి?

గోవు, భూమి, తిలలు, హిరణ్యము, రత్నము, విద్య, కన్య, దాసి, శయ్య, గృహము, అగ్రహారం, రథము, గజము, అశ్వము, మేక, మహిషము.

## 204. పెళ్ళిలో అల్లుడి కాళ్ళు మామగారెందుకు కడుగుతారు?

'ఓ పెండ్లి కుమారుడా పంచ భూతాల సాక్షిగా చిన్న నాటి నుంచి అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేసిన నా పుత్రికను నా కన్యామణిని, ధర్మ, అర్థ, కామ, మోక్షాలకై నీకు అర్పిస్తున్నాను. దానమిస్తున్నాను. ఈ దానం వల్ల నాకు బ్రహ్మ లోకప్రాప్తి కలగాలని అడుగుతున్నాను.

'ఓ వరుడా! నీవు ఈ సమయాన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడివి... నా బిడ్డ లక్ష్మీదేవి. కాన అంతటి నీకు కాళ్ళు కడుగుతున్నాను' అని వధువు తండ్రి వరుని కాళ్ళు కడుగుతాడు. అందుకే అంతా వారిపై అక్షితలు వేసి, శ్రీలక్ష్మీనారాయణులుగా భావించి నమస్కరిస్తారు.

## 205. స్నానాలు ఎన్ని?

**1. మానసస్నానము:** విభూతిని దేహానికి రాసుకొని శంకరుని పూజించటము.

**2. ధ్యానస్నానము:** గంగ, సరస్వతి మొదలైన నదులను తలుచుకొని నీటితో స్నానము చేయుట.

**3. మంత్రస్నానము:** మంత్రాలను ఉచ్చరిసస్తూ స్నానము చెయ్యటము.

**4. మృత్తికాస్నానము...** పవిత్ర ప్రదేశాల నుంచి తెచ్చిన మట్టితో స్నానము చేయటము.

**5. దివ్యస్నానము :** ఉత్తరాయణమున ఎండతోపాటు, వాన కురుస్తుండగా బయటనిలబడి స్నానము చేయటము..

## 206. శివాలయంలో నందీశ్వరుని కొమ్ముల మధ్య నుంచి భగవంతుడ్ని ఎందుకు దర్శిస్తాము?

నంది వేద ధర్మ స్వరూపము. నంది మనలోని పశుత్వానికి నిదర్శనము. కొమ్ములు పట్టుకొని, వెనుక తోకవైపు చేయి పెట్టి కొమ్ముల మధ్య నుంచి భగవంతుని చూస్తూ, 'స్వామి... నేను నా పశుతత్త్వాన్ని అదుపులో పెట్టుకుంటాను. అందరికీ మంచి చేస్తాను. నీతిగా,న్యాయంగా ఉంటాను" అని ప్రమాణంచేసి భగవంతుని చూడటమే అసలైన పరమార్థం.

MOHAN PUBLICATIONS.COM

**207. పుట్టిన బిడ్డకి ఏం చేయాలి?**

శిశువుపుట్టిన 15 రోజుల్లోనే పేరు పెట్టాలి. నదుల పేర్లు, వృక్షముల పేర్లు పెట్టకూడదు. 4వ నెలలో సూర్యదర్శనము చేయించాలి. 6వనెలకు అన్నప్రాశన చేయించాలి. 1వ సంవత్సరము లేదా 3వ సంవత్సరం పుట్టువెంట్రుకలు తీయించి, చెవులు కుట్టించాలి.

**208. '108' సంఖ్యతో జపాన్నెందుకు చేస్తారు?**

108 నరములతో 108 కేంద్రాలతో మానవుడి మెదడు ఉంది. అందుకనే 108 సార్లు 108 జపమాలతో ఓ మంత్రాన్ని జపించమని ధర్మ శాస్త్రాలు శెలవిస్తున్నాయి. పగడాలతో జపిస్తే వేయింతల ఫలమూ, రత్నమాలతో జపిస్తే పదివేలరెట్లూ, దర్భముడిచేత నూరుకోట్ల రెట్లు, రుద్రాక్షాల ద్వారా అనంతమైన ఫలము లభిస్తుందని లింగపురాణము చెబుతోంది. వినపడేటట్టు, వినపడీ వినపడకుండా ఉండేటట్టు, మనసులో జపించటమూ ఇలా ఏ పద్ధతయినా ఉత్తమమే.

**209. శ్రీమహాలక్ష్మీదేవి ఎక్కడ ఉండదు?**

మాసిన బట్టలు ధరించిన వారి దగ్గరా, సంధ్యాకాలాల్లో నిద్రపోయే ఇంట్లోను శ్రీమహలక్ష్మి ఉండదు. ధనానికీ, ధాన్యానికీ, పుస్తకానికీ, పెద్దలకీ కాళ్ళు తగిలితే శ్రీమహలక్ష్మి దేవికి ఆగ్రహం వస్తుంది.

అన్నింటికన్నా మించి మహిళలు కన్నీరు పెట్టుకునే చోట ఆమె ఆ పరిసర ప్రాంతములో కూడా ఉండదు.

**210. పూసలను ఏ వ్రేలుతో మార్చాలి?**

బొటన వ్రేలితో పూసలను మారిస్తే మోక్షప్రాప్తి కలుగుతుంది. చూపుడు వ్రేలుతో పూసలని మారిస్తే మీ శత్రువులు నాశనమౌతారు. ఉంగరం వ్రేలుతో పూసలను శాంతి కర్మలప్పుడు మాత్రమే మార్చాలి. మధ్య వ్రేలుతో పూసలను మారిస్తే లక్ష్మీదేవి కటాక్షిస్తుంది. మరణం సంభవించినపుడు మాత్రమే చిటికెన వ్రేలును పూసలను మార్చడానికి ఉపయోగించాలి.

**211. ఏడ్చే మగవాడ్ని, నవ్వే ఆడదాన్ని నమ్మకూడదనే సామెత ఎందుకు వచ్చింది ?**

మగవాడు బలవంతుడు. సమాజంలో తిరగటం వల్ల, అందరితో పరిచయాలు ఏర్పడి ధైర్యం ఎక్కువగా ఉంటుంది. ఎంత కష్టం వచ్చినా



చలించని మనస్తత్వము మగవాడికి భగవంతుడిచ్చాడు. పైగా ధైర్యం చెప్పాల్సినవాడు. భార్యదగ్గర చుట్టుప్రక్కల వారి దగ్గర ధీమాగా ఉండాల్సినవాడు ఏడ్చాడంటే నమ్మరాదు. అటువంటి వాడుఏడిస్తే వాడు మోసకారి అయిఉంటాడు. స్వార్థంతో ఏదోఎత్తు వేస్తున్నాడని భావించవచ్చు. లేదా అసమర్థుడైన అయి ఉండాలి.

అదే స్త్రీ సున్నిత మనస్తత్వము కలిగి ఉంటుంది. చిన్న చిన్న బాధలకే, చిన్న చిన్న సమస్యలకే తలక్రిందులవుతుంది. ఎంత ఆనందాన్నయినా బాధఅయినా చిరునవ్వుతో తెలియచేసి భద్రంగా గుండెల్లో దాచుకుంటుంది. అటువంటి సృష్టి ధర్మాన్ని వదిలేసి అతిగా నవ్వుతూ మాట్లాడుతుంటే, ఆ స్త్రీ సరయినది కాదని అర్థం. ఆడది కారణంలేకుండా చీటికి మాటికి నవ్వుతూ వుంటే ఆ ఇంటి మగవాడి పరువు నవ్వుల పాలౌతుంది.

**212. ఇంటి ముందు తులసి కోటను పెట్టి ఎందుకు పూజిస్తారు ?**

శ్రీమహావిష్ణువుకు అత్యంత ప్రియమైన తులసి. తులసి కోట ఉన్న గృహము భూత, ప్రేత పిశాచాలురావు. తులసిఆకు గాలి సోకితే నే ఎన్నో సూక్ష్మక్రిములు నశిస్తాయి. దేవదానవుల క్షీరసాగరమథనంలో జన్మించిన వాటిల్లో కొన్ని భూలోకానికి వరాలుగా ఇచ్చారు. వాటిలో తులసి కూడా ఒకటి. తులసికోట ఉన్న చోట అశుభం విన్పించదు.

**213. శ్రీ వెంకటేశ్వరస్వామి వైభవానికి వాస్తు కూడా తోడయ్యిందా?**

శ్రీ వెంకటేశ్వరస్వామికి తూర్పున ఎత్తు, ఆలయ ప్రాకారంలో పూలబావి, ప్రాకారానికి వెలుపల ఈశాన్యంలో నీరు ఇలాంటి వన్నీ వైభోగానికి కారణమని వాస్తు పండితులు చెబుతారు. ఈ వాస్తు విషయాలు మానవుల వాస్తు ప్రకారం వ్యతిరేకమయినవి.

**214. దేవునికి పుష్పములతో పూజ ఎలా చేయాలి ?**

అయిదు వేళ్ళతో పూలు తీసుకొని భగవంతునిపై వేయకూడదు. మధ్యవేలికీ, ఉంగరపు వేలికి మధ్యన పూవులను తీసుకొని భక్తితో వినయంగా భగవంతునికి నమస్కరించి పూవులు వేయాలి. ముందు రోజు వాడిన పూలను దేవుని సన్నిధినుండి బొటనవేలితోను, చూపుడువేలితోను తియ్యాలి.

**215. సాలగ్రామములు ఎలా శక్తివంతమైనవి ?**

రేఖలు, రంధ్రాలు వున్న సాలగ్రామములు ఈ కలియు గంలో గండకీ నదీతీరంలో వున్న దామోదర గుండందగ్గర లభిస్తాయని శ్రీ దేవీ



MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

భాగ వతం ద్వారా తెలుస్తుంది. యజ్ఞ యాగాదులు, మంత్ర పూజలకన్నా మహోన్నతమైనది సాల(గ్రామపూజ.

ఈ సాల(గ్రామాలను కొనకూడదు. సాల(గ్రామములకి మించిన దానం మరేదీ లేదు. పూర్వం ఇంటికో సాల(గ్రామము రక్షణగా పెట్టుకునే వారు. సాల(గ్రామములు ఎక్కువగా లభించేది గండకీనదీ తీరంలోని ముక్తి నాథ్ క్షేత్రంలోను, తిరుమలలోనూ, శ్రీరంగంలోనూ !

## 216. ఉత్తరాయణం ఎందుకు పుణ్యకాలము?

ప్రకృతి పాత ఆకులను వదిలేసి చిగురులు వేసి, కొమ్మలు పెంచి మానవులకు మధుర ఫలాలనిచ్చే సమయం ఉత్తరాయణం, ఉత్తరాయణంలో ఎక్కువగా జననాలు జరుగుతుంటాయి. ఆడపిల్లలు పుష్పవతులయ్యేది ఈ కాలంలోనే. స్త్రీ పురుషులలో శృంగార భావాలు రేకెత్తించే కాలమూ ఇదే. లయకారుడు పరమేశ్వరుడు నిద్రలేచే సమయము ఉత్తరాయణ కాలం. అంతటి పవిత్రమైనది కాబట్టే భీష్ముడు అంపశయ్య మీదుండి కూడా ఉత్తరాయణం వచ్చాక భగవంతుడిలో లీనమయ్యాడు.

## 217. గంగానది పవిత్రత ఏమిటి ?

గంగానది శ్రీమన్నారాయణుని పాదాల దగ్గర జన్మించి, భగీరథుని వలన భూలోకానికి వచ్చి మనల్ని తరింప చేస్తుంది. గంగాదేవి విష్ణుపుత్రి, ఈశ్వర పత్ని. గంగకు మరో పేరే సురనది. గంగ మూడు లోకాల్లోనూ ప్రవహిస్తుంది. గంగాజలం దివ్య ఔషధుల సమ్మేళనం. గంగానదివల్లే కాశీకి అంత దివ్యశక్తి వచ్చిందని పెద్దలు చెపుతారు. గంగానది సజీవ నది.

## 218. ఉపవాసము ఎలా ఉండాలి ?

ఉపవాసమంటే, దేవుడ్ని నిత్యం స్మరిస్తూ ఆయన ధ్యాసలోనే ఉండాల్సిన సమయం. ఉపవాసం వలన శరీరంలోవున్న ఎన్నో మలినాలెన్నో తొలగి పోతాయి. ఉపవాసమంటే దేవునితో పాటు, మనదేహాన్ని కూడా పూజించటము. శాస్త్రాల్లో పొరపాట్లు చేసిన వారు ఉపవాసాలు చెయ్యాలనే ఉంది.

## 219. ఇంటికి సున్నం వేయటంలో అంతరార్థం ఏమిటి?

సున్నం వేయటం వల్ల, చక్కగా వెలుతురు వస్తుంది తెల్లరంగు పదే పదే చూడటం వల్ల మనసు ఉత్తేజాన్ని పొందుతుంది. ఆవేశం తగ్గి





ఆలోచన పెంచుతుంది. కళ్ళలో శక్తి క్షీణించకుండా ఉంటుంది. ఎండాకాలం ఎండనూ, శీతాకాలం చలిని రానివ్వదు. దాని వల్ల గృహంలోని వారికి ఆరోగ్యము. సున్నం వేసిన ఇంట్లో గడిపిన వారికి ఆయుర్దాయము ఎక్కువ.

## 220. వ్యసనం ఏడు గడపలని తొక్కిస్తుందా?

చెయ్యిచాపి అడిగేవారు కొందరుంటారు. ఎట్టి స్థితిలోనూ అడగ కూడనివారు కొందరుంటారు. వ్యసనం ఎవరి ముందు చెయ్యి చాపకూడదో వారందరి వద్దా చెయ్యి చాపేలా చేస్తుంది. గురువూ శత్రువూ, కూతురూ, వడ్డీవ్యాపారీ, ముఖపరిచయము ఉన్నవార్నీ, చెల్లెలూ, సేవకులనూ వీరందరి వద్దా ఆత్మాభిమానమూ, ధర్మమూ వదిలేసి హీనంగా అడిగేలా చేస్తుంది. అందుకే అంటారు వ్యసనం ఏడు గడపలనీ ఏడు ఊళ్ళనీ కూడా దాటిస్తుం దని.

## 221. దేవీ పూజలో ఏ రోజు ఏ నైవేద్యం పెట్టాలి?

ఆదివారము : పాయసము., సోమవారము : పాలు, మంగళవారము: అరటి పళ్ళు, బుధవారము :వేకుజామునే పెరుగును చిలికగా తీసిన వెన్న గురువారము : కండచక్కెర, శుక్రవారము :చక్కెర, శని వారము: ఆవుపాలని సమర్పించాలి.

## 222. తీర్థయాత్రల సమయంలో వేడినీటి కుండాల్లో ఎక్కువ సేపు స్నానం ఎందుకు చేయరాదు?

అత్యంత శీతలప్రదేశమైన కేదార్‌నాథ్, బదరీనాథ్ ప్రయాణాలలో అనేక చోట్ల ఉష్ణనీటి కుండాలు కనిపిస్తాయి.

అతిచల్లని మంచుప్రదేశంలో అంతటి వేడి నీరు కొండల్లోంచి రావ టానికి కారణము గంధకము. గంధకము కొండల గుండా ప్రవహించటం వల్లే నీరు అంత వేడిగా ఉంటుంది. ఎంతోమంది వైద్య నిపుణులు చేసిన పరిశోధనలు ఆధారంగా ఆ వేడి నీటి కుండల్లో స్నానం చెయ్యటం మంచిది కాదని తేల్చి మరీ చెప్పారు. అందుకనేవేడి నీటి కుండల్లో ఎక్కువ సేపు స్నానం చేయరాదు. అలాగే ఆ పవిత్ర పవిత్ర పుణ్యక్షేత్రాల్లో స్వచ్ఛమైన నీరు ప్రవహిస్తూ ఉంటుంది. కాలుష్యానికి ఆస్కారంలేని ప్రదేశమని భావించి మీరు ఆ నీటిని తొందర పడి త్రాగకండి. నీరు స్వచ్ఛమైనదే కాని ఆ నీరు మంచు కరిగిన నీరు కావచ్చు లేదా ఎన్నో విషశిలలు వృక్షాలునుంచి జాలువారిన నీరు కావచ్చు, ఏదైనా సరే త్రాగడం అంతమంచిదికాదు.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

### 223. దిష్టి బొమ్మను ఎందుకు పెడతారు ?

పంట చేలల్లో కొత్తగా కట్టే ఇళ్లముందు దిష్టి బొమ్మను ఉంచుతారు. నరదిష్టికి నాపరాయి కూడా పగులుతుందనటంలో సందేహం లేదు. అందుకే ఎవ్వరు చూసిన ఆ చూపు ముందు దిష్టి బొమ్మ మీద పడుతుంది. తద్వారా నరదిష్టి తగలకుండా గృహాలని, పొలాలనీ ఇంకా దొంగల బారినుంచి కాపాడుకోవచ్చు. పంటచేలాల్లో అయితే రాత్రి దొంగలూ, పక్షులూ మొదలైన వన్నీ మనిషి కాపలాగా ఉన్నాడని భ్రమించి చేనుజోలికి రావనీ ఓకారణము.

### 224. ఎలాంటి భోజనాన్ని తినకూడదు ?

ఆవు వాసన చూసిన భోజనాన్ని, వేశ్య వడ్డించు భోజనము, దొంగ లేదా వడ్డీవ్యాపారులు పెట్టే భోజనమూ, లోభీ, నేరస్తుడూ, ఆడంబరాలను చెపుతూ వడ్డించిన వారి భోజనమును ఎట్టి పరిస్థితులలో తినరాదు. అలాగే చద్ది అన్నమూ, దేవతలకి నైవేద్యం పెట్టని అన్నమూ, భర్త, కొడుకుల లేని వారి చేతి భోజనమూ, నాట్యము చేయువాని భోజనమూ, నపుంసకుడూ, రంకులాడీ, వేటగాడూ మొదలగు వారి నుంచి భోజనం స్వీకరించకూడదని ధర్మశాస్త్రం చెబుతుంది.

### 225. భర్తను భార్య పేరు పెట్టి పిలవచ్చా? పిలవకూడదా ?

ఏవండీ...మిమ్మల్నే, మీరు తమరూ... ఇలా భార్య భర్తను సంభోది స్తుండటం సహజం. కాని కొంతమంది వారి వారి పేర్లతోను పిలుస్తుంటారు. మనం ఏది ఆచరించినా, ఇతిహాసాలు, పురాణాలూ, ప్రకారమే సహజీవనం సాగిస్తుంటాము. భర్త భార్యను తండ్రి వంశంతో కూడా సంభోదిస్తుంటాడు. ఉదాహరణకు శ్రీరాముడు సీతను జనకరాజపుత్రీ అని కూడా పిలుస్తాడు. అలాగే భార్య కూడా పిలవచ్చు. సీతాదేవి శ్రీరాముడ్ని ఎన్నోసార్లు పేరు పెట్టి పిలిచింది. అది ఏకాంతంలో ఉన్నప్పుడు మాత్రమే. భర్తను పేరు పెట్టి పిలవడం మన హిందు సంప్రదాయం కానే కాదు. వినేవాళ్లకి ఆ భర్తమీద ఉండాల్సిన గౌరవము ఉండదు. అలాగే సాటి తోటి స్త్రీలలో కూడా ఆ స్త్రీ ఒకింత లోకువే అవుతుంది.

### 226. 18 రోజుల కురుక్షేత్ర యుద్ధంలోని ప్రముఖ వ్యూహాలు ఏమిటి?

**1. క్రౌంచారుణ వ్యూహం:** ధృష్టద్యుమ్నుడు క్రౌంచ పక్షి ఆకారంలో సైన్యాన్ని నిలుపుతాడు.





**2. గరుడవ్యూహం:** మూడవరోజున ఈ వ్యూహాన్ని భీష్ముడు నిర్మిం చాడు. దీనినే సువర్ణ వ్యూహం అని కూడా అంటారు.

**3. శకట వ్యూహం:** పదకొండవ రోజున ఈ వ్యూహాన్ని నిర్మించారు. బండిఆకారంలో ద్రోణాచార్యుడు సైన్యాన్ని నిలిపి కేంద్ర స్థానంలో ఉంటాడు.

**4. చక్రవ్యూహం:** పదమూడవ రోజు ఈ వ్యూహాన్ని నిర్మించారు. దీనిని పద్మ వ్యూహం అనికూడ అంటారు. ద్రోణాచార్యుడు ఈ వ్యూహాన్ని పన్ని అభిమన్యుడ్ని బలి తీసుకున్నాడు.

**5. మకర వ్యూహం :** ఐదవ రోజున భీష్ముడు ఈ వ్యూహాన్ని నిర్మించాడు.

**6. బార్హస్పత్య వ్యూహం:** పదిహేడవ రోజున బృహస్పతి సహకా రంతో కర్ణుడు ఈ వ్యూహాన్ని పన్నాడు.

**7. శృంగాటక వ్యూహం:** ఎనిమిదవ రోజు నిర్మించిన ఈ వ్యూహంలో త్రికోణాకారంలో సైన్యాన్ని నిలిపారు. ధృష్టద్యుమ్నుడు భీష్ముని వ్యూహానికి ప్రతిగా నిర్మించారు.

**8. శ్యేన వ్యూహం:** ఈ వ్యూహాన్ని ఐదవ రోజు నిర్మిచాడు. దీనినే డేగ వ్యూహం అని కూడా అంటారు. భీష్ముడి మకర వ్యూహానికి ప్రతిగా ధృష్టద్యుమ్నుడు ఈ వ్యూహాన్ని నిలిపాడు.

**9. అర్ధచంద్ర వ్యూహం:** మూడవ రోజు భీష్ముడు పన్నిన గరుడ వ్యూహానికి ప్రతిగా ధృష్టద్యుమ్నుడు అర్ధచంద్ర వ్యూహాన్ని నిలిపాడు.

**10. మండల వ్యూహం:** ఏడవ రోజున నిర్మించిన ఈ వ్యూహంలో భీష్మాచార్యుడు కురుసేనను మండలా కారంలో నిలిపాడు.

**11. మండలార్ధ వ్యూహం:** ద్రోణుడు పన్నెండో రోజు కురుసేనను గరుడ వ్యూహంలో నిలుపగా ధర్మరాజు పాండవ సైన్యంతో మండలార్ధ వ్యూహాన్ని రచించాడు.

**12. వజ్రవ్యూహం:** ఏడవ రోజున భీష్ముడు కురుసేనను మండల వ్యూహంతో నిరించగా ధర్మరాజు పాండవ సేనలను వజ్ర వ్యూహంతో నడిపించాడు.

**13. సూచీముఖ వ్యూహం:** ఆరవ రోజు ధృష్టద్యుమ్నుడు పాండవ సేనను మకర వ్యూహంతో నిలపగా దానికి ప్రతిగా భీష్ముడు క్రౌంచ వ్యూహంతో సైన్యాన్ని నడిపించాడు. రెండు వ్యూహాలు భంగపడటంతో అభిమాన్యుడు సూచీ ముఖ వ్యూహాన్ని పన్నాడు.

MOHAN PUBLICATIONS.COM

**14. వ్యాల వ్యూహం:** నాలుగవ రోజు భీష్ముడు కురుసేనను చుట్ట చుట్టుకున్న లేదా ముడివేసుకున్న పాములా నిలిపాడు. ఈ వ్యూహం ద్వారా సకల సైన్యాల స్థంభనను అంచనా వెయ్యటం కష్టము.

**15. సర్వతోభద్ర వ్యూహం:** తొమ్మిదవ రోజు కురుసేనతో ఈ సర్వతోభద్ర వ్యూహాన్ని రచించాడు భీష్ముడు.

**16. మహావ్యూహం:** రెండవ రోజు భీష్ముడు ఈ వ్యూహాన్ని అనేక విధాలుగా నిర్మించి అజేయుడై హడలు కొట్టించాడు.

**17. మహావ్యూహం:** ఎనిమిదోరోజు కూడా మహావ్యూహాన్ని నిర్మించాడు భీష్ముడు.

**18. మహావ్యూహం:** భీష్ముడు నిర్మించిన సర్వత్ భద్ర వ్యూహాన్ని ప్రతిగా ధృష్టద్యుమ్నుడు మహావ్యూహాన్ని నిర్మించాడు.

### 227. శివాలయంలో నందీశ్వరుని తోకను నిమిరేదెందుకు?

శివాలయంలో నంది ఎద్దు జాతికి చెందినది కాదు. అయినా తోక నిమిరితే ఎంతో ఆనందము. అలా నిమిరినప్పుడు నందీశ్వరుడు పరమానందభరితుడై పరమేశ్వరునికి నీ భక్తుడు నీ దర్శనానికి వచ్చాడని నివేదిస్తాడు. ఎద్దు ధర్మానికీ, గుర్రం శక్తికీ ప్రతీకలు. ధర్మానికి పురికొల్పు తున్నాం అని చెప్పటం కూడా తోక నిమరటంలో భాగం.

### 228. 'హనుమాన్ చాలీసా'ను మొట్టమొదటిసారిగా విన్నదెవ్వరు?

హనుమాన్ చాలీసాను మొట్ట మొదటిగా విన్నది స్వయంగా ఆంజనేయస్వామియే.... అది ఎలాఅంటే శ్రీరామచరిత మానస్ వ్రాసిన శ్రీరామభక్తాగ్రగణ్యుడు తులసీదాస గోస్వామి. తులసీదాసు శ్రీరామచరిత మానస్ గానం చేస్తే స్వయంగా హనుమంతుడే వచ్చేవాడు. ఎక్కడ శ్రీరామ సంకీర్తన జరిగిన అక్కడకి హనుమంతుడు వేంచేసేవాడు. ఒకసారి తులసీ దాస్ శ్రీరామచరిత మానస్ గానం చేశాక, అందరూ లేచి వెళ్ళిపోయారు. ఒక్కవృద్ధమూర్తి మాత్రం తన్మయంతో అలాగే ఉండిపోగా, తులసీదాసు ఆయన పాదాలకి నమస్కరించాడు. ఆ వృద్ధరూపంలో నున్న హనుమంతుడు తులసీదాసుకు తన దివ్యదర్శనాన్ని ఇచ్చాడు.

తులసీదాసు పరమానంద భరితుడై 40 పద్యములతో కూడిన స్తోత్రాన్ని చెప్పాడు. అదే హనుమాన్ చాలీసాగా రూపాంతరం చెందింది.





### 229. మరణించిన వారి పేరు ముందు 'స్వర్గీయ' అని వ్రాస్తారెందుకు?

మనిషి జన్మించివున్నప్పుడు చేసిన పనులను బట్టి మరణించిన ప్పుడు స్వర్గ, నరకాలకి వెళతాడు. ఈ మానవ నిత్య జీవిత కర్మల్లో ఎవ్వరూ ప్రత్యక్షంగా స్వర్గానికి వెళ్ళే అవకాశము లేదు. అలాగే చనిపోయిన వారి గురించి ఏ అశబ్ద దోషం వాడిన మహాపాపమే. అటువంటి పాపం అంటకుండా ఉండేందుకు 'స్వర్గీయ' అని సంబోధిస్తారు.

### 230. అయిదో తనమంటే?

ముత్తయిదవని అర్థం. స్త్రీ అయిదు అలంకరణలతో కళ కళ లాడుతుండాలి. పసుపు, కుంకుమ, గాజులు, మెట్టెలు, మాంగల్యము.

### 231. నవరసాలు అనగా?

నవరసాల్లో తొలిది శృంగారము, ఆ తర్వాత వరుసగా హాస్యమూ, కరుణా, రౌద్రమూ, వీర్యమూ, భయానకమూ, బీభత్సమూ, అద్భుతమూ, శాంతమూ... ఇవే నవరసాలు.

### 232. నిద్రపోయేటప్పుడు కలవరింత ఎలా కలుగుతుంది

ఎక్కువగా కలలు కనే సమయంలో మనం స్థూల శరీరాన్ని వదిలి ఇంద్రియ బుద్ధులతో కూడిన సూక్ష్మ శరీరంలో ఉంటాము. అప్పుడు కలిగే దీర్ఘ తీవ్రకలల వల్ల సంపూర్ణంగా లీనమై నోటికి తాకిడి వచ్చి మాట్లాడ తాము. ఆ సమయంలో మాట్లాడిన మాటలే కలవరింతలు. మన మనోనిశ్చ యాలూ, భయాలూ, కోరికలూ ఇత్యాది వాటికి ఇష్టానుసారంగా నోటిని కదల్చటమే కలవరింత.

### 233. చతుర్దశ విద్యలు అనగా?

ఋగ్వేదము, యజుర్వేదమూ, సామవేదమూ, అధర్వణ వేదమూ, శిక్ష,వ్యాకరణమూ, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము, మీమాంస, న్యాయ, పురాణ ధర్మ మహాశాస్త్రములు.

### 234. అన్నీ దానముల కన్నా విద్యాదానం గొప్పదా?

అన్నదానము గొప్పదంటారు. మనువు విద్యాదానము మహోన్నత మైన ఫలమని తెలియచెప్పాడు. నీరూ,అన్నమూ,గోవులూ,భూమీ, వస్త్ర ములూ, బంగారమూ దినసరిభత్యములూ వీటన్నింటి కన్నా విద్యాదానము గొప్పది. వస్తువులూ ధనమూ లాంటివి దానంగా ఇస్తే వారికే ఉపయోగ పడతాయి. అదే విద్యాదానం చేస్తే వారికీ, వారి కుటుంబమంత టకీ

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

ఉపయోగపడుతుంది. చేపలకూరతో అన్నం పెట్టడం కన్నా మంచి పని చేపలు పట్టడం నేర్పించటము.

**235. ఇంట్లో అరటి చెట్టు పెంచుతున్నారా?**

దక్షిణ దిక్కు అరటి చెట్టు పెంపకము వంశాన్నీ, పశ్చిమ దిశలో ధనాన్నీ పెంపొందిస్తుంది. ఇంటి ఆవరణ ఉత్తర దిశలో ధనహీనతా, ఇంటి ఆవరణ తూర్పు దిశలో గౌరవాన్నీ కలిగిస్తుంది. అరటి చెట్టు తూర్పున వెలిస్తే సకల శుభప్రదం. నైఋతి మూలన సంతానమూ, ఈశాన్నాన కీర్తీ కలుగుతాయి.

**236. అమావాస్య, పౌర్ణమిరోజుల్లో ప్రయాణం చేయకూడదంటారు ఎందుకని ?**

చంద్రుని సంపూర్ణత్వమూ, అసంపూర్ణత్వముల వల్ల ఆ రోజుల్లో మన దేహంలో కొంత శక్తి తగ్గుతుంది. అనారోగ్యంవున్న వారికయితే మరీ ఎక్కువ నీరసంగా ఉంటుంది. కనుక వెళ్లేకార్యం సమర్థవంతంగా చెయ్య లేకపోవచ్చు. అందుకనే ప్రయాణం చేయకూడదంటారు.

**237. వాస్తు శాస్త్రంలో ఏమి వున్నాయి ?**

ఇంటికి పునాది ఈశాన్యం వైపు వేయాలి. పునాదులు త్రవ్వే ముందు నాగుపాము కనిపిస్తే శుభం కాదు. ఇంటి స్థలము దక్షణ పడమర ఎత్తుగా ఉత్తరం, తూర్పు దిశలు పల్లంగా ఉంటే స్థల యజమానికి, కుటుంబ సభ్యులకీ తరతరాలకీ కావాల్సిన డబ్బు సమకూరుతుంది. కొత్త పొయ్యి కర్కాటక లగ్నంలో నిర్మించరాదు. అలాగే పొయ్యిలు చెడుదినములోను, శుభకార్యాలు మంచి రోజుల్లోనే చెయ్యాలి. శివ, విష్ణు, అమ్మవారి దేవాలయా లకు తగు దూరంలో ఇల్లు నిర్మించుకోవాలి. ఇంటిలో దేవుడికి తూర్పు తిరిగి పూజ చేయాలి. ఉత్తరం తిరిగి పూజచేయరాదు. అలాగే పడమర వైపున దేవుణ్ని ఉంచితే పడమర వైపు తిరిగి పూజ చేయాలి.

**238. స్త్రీ గర్భం పెద్దగా ఉంటే ఆడశిశువా?**

అవుననే చెబుతుంది శాస్త్రం. లింగనిర్ధారణ లేని కాలంలో స్త్రీ గర్భాన్ని బట్టి ఆడా, మగా అనేది చెప్పేవారు. ఆడశిశువు గర్భంలో ఉంటే గర్భం పెద్దగా ఉంటుంది. దానికి కారణం శిశువు చుట్టూ ద్రవం ఎక్కువగా ఉంటుంది. అదే మగశిశువు అయితే ద్రవం తక్కువగా ఉంటుంది. ఈ కారణంగా ఆడా, మగా అనే చెప్పేవారు ఆరోజుల్లో.





**239. వాడి పెళ్ళాం తాడు గట్టిదని అంటారు.... ఎందుకు?**

వివాహ సమయంలో పెండ్లికొడుకు పెళ్ళికూతురి మెడలో ఈ మంత్రం చదువుతూ ప్రేమగా, పెద్దలందరి సమక్షంలో తాళికడతాడు.

"మాంగల్య తంతునా నేన మమజీవన హేతునా।
కంఠే బధ్నామి, సుభగే త్వంజీవ శరదాం శతమ్॥"

అనే వేద మంత్రాల మధ్య మూడు మూళ్ళు వేస్తాడు. ఆ మంత్రానికి అర్థం... ఓ అదృష్టవంతురాలా. నేను నీతో చిరకాలం జీవించుటకు ఈ పవిత్రమైన మంగళసూత్రాన్ని నీ కంఠమందు బంధిస్తున్నాను. నీవు సుమంగళిగా నూరు సంవత్సరాలపైన జీవించు అని...మంగళసూత్ర శక్తి ఏపాటిదో పార్వతికి సంపూర్ణంగా తెలుసు. అందుకే అమృతంకోసం సముద్రాన్నిమథించే సమయంలో వచ్చిన కాలకూట విషాన్ని శివుణ్ని మ్రింగమని పార్వతే స్వయంగా చెప్పింది.

ఖరుడు కూడా ఆ భయంకర కాలకూట విషానికి బలి కావల్సింది. కాని పార్వతిదేవి మంగళ సూత్ర మహిమతో బ్రతికాడు.

**240. గుడి వెనుక భాగాన్ని ఎందుకు తాకరాదు?**

చాలా మంది భక్తులు గుడిలో ప్రదక్షిణలు చేస్తున్నప్పుడు గుడి వెనుక భాగాన్ని తాకుతూ నమస్కరిస్తుంటారు. అలా చేయకూడదు. ఆ వెనుక భాగంలో రాక్షసులుంటారు. అలాగే గుడికి గజం దూరం నుంచి ప్రదక్షిణ చేయాలి.

**241. శుక్ర, మంగళ వారాల్లో కొందరు డబ్బెందుకు ఇవ్వరు?**

మంగళ, శుక్రవారం లక్ష్మీదేవి ప్రతిరూపమని మహిళలు నమ్ముతారు. అందువల్లే ఆ రోజు ఎవ్వరికీ డబ్బు ఇవ్వరు. అలా చేస్తే ఆడ పిల్లను శుక్రవారం పంపినట్టేనని భావిస్తారు. పుట్టింటికి వచ్చిన ఆడపిల్లను కూడా మంగళ, శుక్రవారాలు అత్తవారింటికి పంపరు.

**242. ఏ స్త్రీ ఎన్ని వరాలు కోరుకోవాలి?**

బ్రాహ్మణ స్త్రీ మూడు వరాలూ, క్షత్రియ స్త్రీ రెండు వరాలూ, వైశ్య స్త్రీ రెండు వరాలూ, శూద్ర స్త్రీ మూడు వరాలు అడగాలి. మహాభారతగాథలో ద్రౌపది ధృతరాష్ట్రుడ్ని రెండు వరాలే అడుగుతుంది. మూడో వరం కోరుకోమన్నా కోరుకోదు. ధృతరాష్ట్రుడే ద్రౌపది ధర్మ నియమాలకి మెచ్చి మూడో వరం ఇస్తాడు.

MOHAN PUBLICATIONS.COM

### 243. శుభశకునాలు అంటే ఏమిటి ?

నెరజాణా, శవమూ, చేపలూ, అగ్నీ, సూద్రుడూ, మాంసమూ, నలుగురు వైశ్యులూ, ఇద్దరు ముత్తైదువులూ, ఈ శకునాలన్నీ శుభములే. బిందెతో నీరు తెస్తున్న స్త్రీ, ఇద్దరు బ్రాహ్మణులూ, స్త్రీ, కోడి, పాలపిట్ట ఇవన్నీ ఎడమవైపు నుంచి వస్తే మంచిది. మూడు అపశకునములు ఒక శుభశకునము.

### 244. పుణ్యం పోగొట్టేవి ఏవి?

గొర్రెల మందల మధ్యలో వెళ్ళటమూ, భార్యాభర్తల మధ్యా, గురుశిష్యుల మధ్యా ఇద్దరు బ్రాహ్మణుల మధ్యా మహర్షులమధ్యా, శివాలయంలో నంది, పరమేశ్వరుల మధ్యా వెళితే పుణ్యం సంగతి సరే సరి.... పాపంతో పాటు చేసిన పుణ్యమూ కరిగిపోతుంది.

### 245. ఇంటి ఆవరణలో జన్మ నక్షత్ర రీత్యా ఏ వృక్షాలు పెంచాలి?

అశ్వినీ నక్షత్రం వారు ముష్టి, భరణీ వారు ఉసిరి, కృత్తికవారు అత్తీ, రోహిణీ వారు నేరేడూ, మృగశిర వారూ చంద్రా, ఆరుద్ర వారు వనచంద్రా, పునర్వసు వారు వెదురూ,పుష్యమీ వారు రావీ, ఆశ్లేషా వారు నాగకేసరమూ, మఖ వారు మర్రీ, పుబ్బ వారు మోదుగా, ఉత్తర వారు జువ్వీ, హస్తవారు ములువేమూ, అనురాధ వారు పొగడా, జ్యేష్ఠ వారు నీరుల్లి, మూల వారు వేగీ, పూర్వాషాఢ వారు పనసా, ఉత్తరాషాఢ వారు కూడా పనసా, శ్రవణం వారు జిల్లేడూ, ధనిష్ఠ వారు కూడా పనసా, శ్రవణం వారు జిల్లేడూ, ధనిష్ఠ వారు నెమ్మీ, శతభిషం వారు కానుగా, పూర్వాభాద్ర వారు ఉత్తరాభాద్ర వారూ వేపా, రేవతి వారు ఇప్ప పెంచుట శుభం. ఆయా నక్షత్రాల వారికి అవి మిత్ర వృక్షాలు.

### 246. అష్టదిక్పాలకులు ఎవరు?

"ఇంద్రోవహ్నిః పితృపతిః నైరృతో వరుణోమరుత్,
కుబేర ఈశఃపతయః పూర్వాదీనాం దిశాంక్రమాత్."

ఇంద్రుడు (తూర్పు), అగ్ని (ఆగ్నేయం) యముడు (దక్షిణం), నిరృతి (నైఋతి), వరుణుడు (పశ్చిమం), వాయువు (వాయువ్యం), కుబేరుడు (ఉత్తరం), ఈశానుడు (ఈశాన్యం) మొదలైన దిక్కులనను పాలించే వారే అష్టదిక్పాలకులు.



### 247. చిరిగిన ఆకులో భోజనము చేయవచ్చా?

బంతిలో ఆకులు వేసేటప్పుడు కొన్ని చీలినవి వస్తాయి. అట్టి ఆకులో భోజనం చెయ్యటం వల్ల ఆకు క్రింద మలినం అన్నంలో కలిసి అనారోగ్యము ఏర్పడుతుంది. అలాగే అనేక చోట్ల తిరిగి తిరిగి వచ్చి ఆ వస్త్రాలతోనే భోజనం చేయరాదు. ముఖమూ, చేతులూ కడుక్కొని ప్రశాంతంగా మౌనంగా భోజనం చేయాలి.

### 248. శంఖములో పోస్తేనే తీర్థమా?

శంఖాల్లో దక్షిణావర్త శంఖము శ్రేష్ఠమైనది. శంఖము లక్ష్మీ స్వరూపము. శంఖము కాళ్ళియంకు సంబంధించినది, దాని ద్వారా తీర్థమును పుచ్చుకుంటే అనేక వ్యాధులు మటుమాయం అవుతాయి. అలాగే భగవంతునికి తీర్థ పూజ చేయుటకూ, అభిషేకించుటకు లక్ష్మికే అధికారం. కావున శంఖం ద్వారానే తీర్థమూ, అభిషేకమూ చేస్తారు.



### 249. ఇటుకతో గోడలు కట్టగానే సున్నపు బొట్లు పెట్టి 'శ్రీరామ' అని ఎందుకు రాస్తారు?

క్రొత్తగోడలు లేపగానే సున్నంతో పెద్ద పెద్ద బొట్లు పెట్టి పెద్దగా శ్రీరామ అని వ్రాస్తారు. దానికి కారణం ఏమిటంటే క్రొత్త గోడల్లో పురుగూ, పుట్రా ఉంటే ఆ సున్నం ఘాటుకి అవి నశించి భవిష్యత్తులో గోడకు ఎలాంటి బీటలూ, పగుళ్ళూ లేకుండా పటిష్టంగా ఉంటాయని.

### 250. జపాన్ని ఎలా చేయాలి?

జపమాలలో 108 పూజలుంటాయి. మాలలో లావు పూజ 'మేరువు'. ఈ లావు పూజ జప సంఖ్యని కొలవటానికి సంకేతకంగా పెట్టుకుంటారు. మాలను బొటన వ్రేలికి నడుమ వ్రేలికి మధ్య నిలిపి ఒక్కోపూసనూ ఒక్కొక్క జపానికి దాటవేస్తూ జపించాలి. చూపుడువ్రేలును వాడరాదు. చూపుడు వ్రేలు ఆకర్షణ శక్తి గలది. అందుకే జపాలల్లో ఉపయోగించరు.

### 251. ముగ్గుని ఎలా వేసుకోవాలి?

ఉదయం పూట వీధిలో నుంచి మీ ఇంటిలోకి, సాయంత్రం పూట ఇంట్లో నుంచి వీధిలోకి ముగ్గు లెయ్యాలి. కళ్ళాపి చల్లి ముగ్గు వెయ్యటం లక్ష్మీప్రదం.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

**252. పడుకున్నప్పుడు దుప్పటిని పూర్తిగా ఎందుకు కప్పకోకూడదు ?**

మనం ప్రాణవాయువుని పీల్చి బ్రతుకుతున్నాము. దుప్పటి పూర్తిగా కప్పుకునే అలవాటు ఎక్కువగా పిల్లల్లోనే ఉంటుంది.

దాని వల్ల ఎక్కువసార్లు ప్రాణవాయువు అందక అనారోగ్యాలు, సంభవించవచ్చు. అందుకే అలా పడుకోకూడదు. చిన్నపిల్లలు అలా పడుకుంటే వెంటనే సరిచేయటం కాకుండా పిల్లలకి అర్థం అయ్యేలా వివరించండి.

**253. ఏ రోజు తలస్నానం చేస్తే ఏ ఫలము కలుగుతుంది?**

ఆదివారం తలంటు పోసుకుంటే తాపం పోతుంది.
సోమవారం చేస్తే అందం పెరుగుతుంది.
మంగళవారం అమంగళము.
బుధవారం చేస్తే వ్యాపార, వ్యవహార అభివృద్ధి.
గురవారం ధననాశనము.
శుక్రవారం అనుకోని ఆపదలు కలుగుతాయి.
శనివారం మహాభోగములు కలిసి వస్తాయి.
ఈ స్నానం విధి పురుషులకే.

**254. మడి బట్టలతో పూజ ఎందుకు చేయాలి ?**

దేవునికి శుచీ, శుభ్రత అంటే ఎంతో ఇష్టం. నీ ఇష్టాన్ని గౌరవించి, నిన్ను పూజిస్తున్నాము అని భావన. మడి మీద పూజ చేస్తూ 'భగవంతుడా... అన్యులెవ్వరినీ తాకకుండా నీ కోసమే భక్తితో ఈ మడి ధరించాను. వస్త్రం ఆరే వరకూ నీసేవే, మడి వస్త్రంతో చేసే పూజ పరమార్థం అదే. అందుకే భక్తీ, శుభ్రతతోపాటు మడిబట్ట ధరించటంవల్ల శరీరంలోని వేడి బైటికి వెళ్ళదు.

**255. ఎవరెవరు ఎంత సమయం పడుకోవాలి ?**

ఎవ్వరికైనాసరే 8 గంటలు నిద్ర తప్పనిసరిగా వుండాలి. చిన్న పిల్లలకు 12 నుంచి 14గంటలు నిద్ర అవసరం. వృద్ధులకు 10గంటలు. గర్భిణీ స్త్రీలకూ, పాలిచ్చే తల్లులకూ వీలయినంత ఎక్కువగ నిద్ర అవసరం. నిద్ర మన ఆయుష్షునీ, శక్తినీ పెంచుతుంది. పగటినిద్ర కేవలం ఎండాకాలం మాత్రమే చేయాలి. 50 దాటినవారు మధ్యాహ్నంనిద్ర అరగంటచేస్తేచాలా మంచిది.





**256. ఏ దేవుణ్ణి దర్శించేటప్పుడు ఏ రంగు దుస్తులు ధరించాలి?**

సరస్వతీ దేవినీ, శ్రీమహాలక్ష్మీనీ, మహేశ్వరుడ్ని దర్శించటానికి వెళ్ళేటప్పుడు తెల్లని దుస్తులు ధరించాలి. పార్వతీ దేవినీ, ఆమె పుత్రుడైన వినాయకుడ్ని, సుబ్రహ్మణ్యస్వామి దర్శించటానికి వెళ్ళేటప్పుడు ఎరుపు బట్టలు ధరించాలి.

**257. రంగులూ, వారాలకి ఎంతో సంబంధము ఏమిటి ?**

ఎరుపు ఉత్తేజకారిణి, నారింజ శరీరంలోని శక్తిని కదల్చగలదు. పసుపు ఆధ్యాత్మిక జ్యోతి. ఆకుపచ్చ ఆందోళననూ, నీలిరంగు భౌతిక సౌఖ్యాన్నీ, గులాబి రంగు ప్రేమనూ, ఆప్యాయతనూ, బూడిదరంగు సంతృప్తినీ, వంకాయ రంగు కామాన్నీ వృద్ధిచెందేటట్టు చేస్తుంది. అలాగే ఏ వారం ఏరంగు తగినదంటే... ఆదివారం నారింజ, సోమవారం తెలుపు, మంగళవారము ఎరుపూ, బుధవారము ఆకుపచ్చా, గురువారం పసుపూ, శుక్రవారం బూడిదా లేదా వంకాయ రంగూ, శనివారం నలుపూ అంటే నవగ్రహాలకు ప్రీతి.

**258. అవసానదశలో తులసి తీర్థమెందుకు పోస్తారు?**

తులసి మహోన్నతమైన పవిత్రతోపాటు అనేక వందల అనారోగ్యాలను మటుమాయం చేస్తుంది. తులసికి దోషం లేదు. ఈ తులసిని అమావాస్య, అష్టమి, ద్వాదశి, మంగళ, శుక్రవారములందు కోయరాదు. తలపై ధరించరాదు. విష్ణు పాదాలచెంత ఉండాల్సిన ఈ తులసిలో ఎంతో శక్తి ఉంది కావున అవసాన దశలో తులసి తీర్థం పోస్తారు. తద్వారా జీవి శరీరంలో వేడి రగల్చి, శరీరం చల్లబడకుండా చేసి మరింత కాలం బ్రతికే అవకాశం ఎక్కువగా వుంది. అందుకే తులసి తీర్థం పోస్తారు.

**259. తల్లో నాలుకలా ఉండటమంటే?**

నోట్లో నాలుకలా అని కూడా అంటారు. నాలుక మెత్తనిది. సుతిమెత్తనైనది. అయినా రాక్షసుల్లాంటి ముప్పైరెండు పళ్ళ మధ్య ఎంతో చాకచక్యంగా వాటిని నిమురుతూ, తాకుతూ కదిలిస్తూ తన పని తాను చేసుకుపోతుంటుంది. ఏ రోజూ ఎప్పుడూ వాటి నుంచి ఎలాంటి ఇబ్బందిని ఎదుర్కోకుండా సౌమ్యంగా, సరళంగా హుందాగా సాగిపోతుంటుంది. అలా తల్లో నాలుకలా ఉంటాడని పరమార్థం.

MOHAN PUBLICATIONS.COM

### 260. తిరుపతి లడ్డుకు అంత రుచి ఎలా వస్తుంది?

ఎంతమంది చేసినా, ఎక్కడ చేసినా, లడ్డు యొక్క రుచినిబట్టి చూసి ఇది తిరుపతి లడ్డుకాదనీ, అదే ప్రసాదమయితే ఇది వెంకటేశ్వర స్వామి దివ్యమధుర ప్రసాదమని చెప్పగలము. తిరుపతి లడ్డుకి రుచి రావటానికి కారణం ఏమిటంటే స్వామికి నైవేద్యం పెట్టడం ప్రథమ కారణమయితే ఆలయంలోనున్న బంగారం బావినీటితో లడ్డూ, మిగితా నైవేద్యాలను తయారుచేయడం ద్వితీయకారణం. తిరుపతిలో ఎన్నో అద్భుత వనమూలికలున్నాయి. బంగారు బావి నీటితో చెయ్యటంవల్ల తిరుపతి లడ్డుకి రుచి వస్తుంది.

### 261. భగవద్గీతను 12వ అధ్యాయం నుంచి మాత్రమే ఎందుకు చదవమంటారు ?

భగవద్గీత మొదటి అధ్యాయము దుఃఖానికి సంబంధించిన అనేక విషయాలతో నిండి ఉంటుంది. అదే 12వ అధ్యాయంతో ప్రారంభించటం ద్వారా ఆ అధ్యాయంలో అమృతమైన వాక్కులను అవగాహన చేసుకొని, ఆ తరువాత ఎటువంటి దుఃఖసంబంధితమైనవి చదివిన మనోవికారము కలగదని పెద్దలు అలా చదవమంటారు.

### 262. ఆత్మహత్యకు ఆ లోకంలో, ఈలోకంలో శిక్ష ఏమిటి?

జీవుడు ఆత్మహత్య చేసుకొన్నచో చీమూ, నెత్తురూ నిండిన అంధకామిశ్రమను మహానరకంలో అరవై ఏండ్లు ఉండాలి.

ఆత్మహత్య చేసుకున్న వారి వారికి అశౌచనముండదు. అట్టివారికి తర్పణము లిచ్చినా ఫలం కలగదు. అగ్ని సంస్కారము చేయరాదు. దుఃఖించరాదు. మరుజన్మలో అల్పఆయుష్షులవుతారు.

### 263. ఏ పిలుపు దేని కొరకు ?

ఘంటానాదము దేవతలకి పిలుపు; శంఖారావము విజయానికి పిలుపు; ధనుష్టంకారము సమరానికి సిద్ధం;బిందెలు మ్రోగిస్తే భూతప్రేతాలకి ఆహ్వానము.

### 264. గర్భిణీ స్త్రీలు గ్రహణాన్ని చూడవచ్చా ? చూడకూడదా?

గర్భిణీస్త్రీలే కాదు ఎవ్వరూ ప్రత్యక్షంగా చూడకూడదు. స్త్రీ గర్భంలోని శిశువు ఎంతో సున్నితంగా పెరుగుతుంటాడు. ఏ చిన్న మార్పు అయినా ప్రభావం వెంటనే స్త్రీ శరీరం ద్వారా శిశువులోకి ప్రవేశిస్తుంది. గ్రహణ సమయంలో రాహుకేతువులతో, సూర్యచంద్రుల కాంతులు మిళితమయి





అనేక విషకిరణాలు ఉద్భవిస్తాయి అవి చాలా వరకూ మానవ నిర్మాణానికి ఇబ్బందులను కలిగిస్తాయి. అందుకనే గ్రహణం చూడకూడదంటారు.

### 265. ఏ రంగు ఏ ప్రభావాన్ని చూపిస్తుంది?

ఎరుపు ఉత్తేజాన్నీ, చురుకుదనాన్నీ, పసుపు ఆధ్యాత్మిక జ్ఞానాన్నీ, నారింజ శక్తినీ కలుగచేస్తాయి. నీలిరంగు అశుభాన్ని కలిగిస్తుంది. కనుక మరో రంగుతో కలిపి వాడాలి. ఆకుపచ్చ ఉల్లాసాన్ని అందిస్తుంది. బూడిద రంగు జ్ఞానాన్నీ, ఆలోచననూ, గులాబీరంగు కోరికలనూ పెంచుతుంది. నలుపు బాధలనూ, శోకాన్నీ కలిగిస్తుంది. వంకాయ రంగు ఇష్టపడేవారంటే డబ్బుపై అత్యంత మమకారాన్ని కలిగిఉన్నట్లే. తెలుపు స్వచ్ఛతను, ప్రశాంతతను ఇస్తుంది.

### 266. అసత్య దోషమెంతో తెలుసా?

సత్యం నూరు అశ్వమేధాలంత గొప్పది. అసత్య దోషానికి ఋషులు, మహర్షిలు కూడా భయకంపితులవుతారు. పురాణాల్లో మహాపతివ్రతలు సహితం భర్త మాటనైన జవదాటు తారుగానీ, అసత్యంపలకలేదు. సత్య ధర్మాన్ని పాటించిన వారే పుణ్యలోకప్రాప్తికి అర్హులు.

### 267. కాశిలో పోవాలని ఎందుకు కోరుకుంటారు?

కొంతమంది ఆ కోరికతో కాశి వెళ్ళి అక్కడే కాలం గడుపుతుంటారు. అవసాన దశలో వచ్చే మరణం కోసం వేచి వుంటారు. కాశిలో ప్రతిక్షణమూ ఉత్తరాయణమే. ఈ ఉత్తరాయణం కోసమే (సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పట్నించి మిధున రాశిలో ఉన్నంత కాలం) భీష్ముడు అంపశయ్యమీదుండి వేచి చూసింది. ఈ ఉత్తరాయణంలోనే దేవాలయమూ, బావీ ప్రతిష్టలు చేస్తారు.

### 268. అష్టభోగాలూ, అష్టమదములనగా?

అన్నమూ, వస్త్రమూ, గంధమూ, పుష్పమూ, పానుపూ, తాంబూలమూ, మగువ. సంగీతమూ అష్టభోగాలు. ఇక అష్టమదములు... అర్ధ మదము, స్త్రీ మదము, విద్యామదము, కులమదము, సౌందర్య మదము, ఉద్యోగ మదము, యవ్వన మదము, అన్న మదము.

### 269. అష్టపాశములంటే ఏవి?

అష్టపాశములు మానవుడ్ని బంధించి సంసార సాగరాన ఈదిస్తున్నాయి. దయ,శంక, భయం, లజ్జ, జుగుప్స, కులం, శీలం, జాతి.

MOHAN PUBLICATIONS.COM

### 270. నేలమీద ఏమి లేకుండా ఎందుకు కూర్చోకూడదంటారు?

కనీసం చిన్న గుడ్డముక్కయినా వేసుకుని కూర్చోవాలి. ఋషులు తపస్సు సమయంలోనూ, హోమాదిసమయాల్లోనూ నేలపై ఆశీనులవ్వరు. మానవునిశరీరంలో విద్యుత్ ఉంటుంది. అదే మనల్ని నడిపిస్తుంది. భూమికి ఆకర్షణ శక్తి ఎక్కువ.దానిలో శరీరంలోని విద్యుత్‌ను లాక్కుంటుంది. దానితో శరీరంలో శక్తీ, యుక్తీ సన్నగిల్లుతాయి. అందుకనే కటిక నేల మీద కూర్చొని భోజనం గానీ, నిద్రగానీ, పూజగానీ ఏదీ చేయరాదు.

### 271. తీర్థాన్ని మూడుసార్లు తీసుకుంటారెందుకు?

తొలి తీర్థము శరీర శుద్ధి, శుచికీ... రెండవ తీర్థం ధర్మ, న్యాయ ప్రవర్తనకూ.... మూడవ తీర్థము పవిత్రమైన పరమేశ్వరుని పరమ పదము కొరకు. ఓమ్ అచ్యుతాయనమః అని మొదటిసారి తీర్థము భక్తుడు తీసికొనినచో అతని ఆత్మ పవిత్రము అగును. ఓమ్ అనంతాయ నమః అని రెండవసారి తీర్థమును భక్తుడు తీసికొనినచో అతని ఆత్మ పవిత్రము అగును. ఓమ్ గోవిందాయనమః అని మూడవసారి తీర్థమును భక్తుడు తీసికొనినచో అతనికి మోక్షమునకు యోగ్యతలభించును. శ్రీమన్నారాయణుని అను గ్రహమువలన స్త్రీ బాల, వృద్ధులు అందరునూ విధిగా ముమ్మారు శ్రద్ధా భక్తులతో తీర్థ పరిగ్రహణము చేయవలెను.

**తీర్థమంత్రము:**

అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్।
సమస్త పాప శమనం విష్ణుపాదోదంకం శుభమ్॥

### 272. రావణుడి పదితలలు దేనికి ప్రతీకలు?

కామము, క్రోధము, లోభం, మోహం, అహంకారము, ఈర్ష్య అసూయా, ద్వేషం, సోమరితనం, నిర్లక్ష్యం, అతినిద్ర.

### 273. స్త్రీకి ఎడమకన్ను అదిరితే శుభమా? అశుభమా?

స్త్రీకి ఎడమకన్ను అదిరినా, జలదరించినా శుభమే జరుగుతుంది. అలాగే ఎర్రటి కనుకొలనులు పులకించినా శుభమే. సీతాన్వేషణ కోసం ఆంజనేయుడు లంకనుచేరి అశోకవనంచేరిన సమయాన సీతాదేవిని దర్శించే కొన్నిక్షణాల ముందు సీతాదేవికి శుభసూచికంగా ఈ శుభనిమిత్తాలు కలిగాయి. ఆ క్షణం తర్వాత సీతాదేవికి అన్నీ శుభాలే జరిగాయి. సకల సౌభాగ్యాలతో భర్తతో ఆ తరువాత ఎంతో సుఖపడింది సీతాదేవి.





### 274. పంచమహాపాతకములు ఏవి?

బంగారాన్ని దొంగలించటము, మద్యం సేవించటము, బ్రహ్మ హత్య, గురుపత్నితో సరసము, ఈ నాలుగు పాపాలను చేసేవారితో స్నేహం. ఇవి పంచమహాపాతకములు.

### 275. దేవతల వాహనములు ఏమిటి ?

గంగానదీ దేవికి మొసలి; యమునా నదీ దేవికి తాబేలు, ఇంద్రునకు ఐరావతము, చంద్రునకూ వాయుదేవునకూ లేడి. శివునకి వృషభము. సూర్యుడునకు ఏడు అశ్వాలు పూన్చిన రథం. శనికి కాకి, గ్రద్ధ. లక్ష్మీదేవికి గుడ్లగూబ. రతీ మన్మథులకు చిలుక, బ్రహ్మ, సరస్వతులకు హంస. పార్వతీదేవికి సింహము. అమ్మవారికి పెద్దపులి. హనుమంతునకు ఒంటె.

### 276. పెళ్ళయిన తర్వాత అరుంధతి నక్షత్రాన్ని ఎందుకు చూపిస్తారు?

అరుంధతి వశిష్ఠ మహర్షి ధర్మపత్ని, మహాపతివ్రత ఆకాశం వైపు పెళ్ళి సమయంలో చూపించి చెబుతారు బ్రాహ్మణులు. అలా చేస్తే మీ సంసార జీవనం సుఖమయంగా కొనసాగుతుందని పండితుల నమ్మకం. మాఘ మాసం, పంచమాసాలకాలం తప్ప ఈ నక్షత్రం సాయంత్రవేళ కనబడదు.

రాత్రిపూట చంద్రుడ్ని, నక్షత్రాలను చూడటంవల్ల కంటి శక్తి పెరుగుతుంది. అరుంధతి నక్షత్రం నుంచి వచ్చే కిరణాల వల్ల కంటి శక్తి మరింత బలపడుతుంది. అరుంధతి నక్షత్రం సప్తర్షిమండలంలో వుండే చిన్న నక్షత్రం. శిశిర, వసంత, గ్రీష్మఋతువులందు సాయంకాల సమయాన, మిగిలిన కాలాల్లో అర్థరాత్రి లేదా దాటిన తర్వాత తెల్లవారు జామున ఈ నక్షత్రం కనిపిస్తుంది. అరుంధతి నక్షత్రాన్ని చూడాలనుకుంటే జాగ్రత్తగా ఆకాశం వైపు చూడండి. '?' మార్కు ఆకారంలో నక్షత్రాలు ఉంటాయి. ఖచ్చితంగా కాకపోయినా దాదాపుగా ఆ ఆకారంలో ఉంటుంది.

### 277. పంచమాంగల్యాలు అంటే ఏమిటి ?

నుదుటన కుంకుమా, మెడలో మాంగల్యమూ, తలలో పూలూ, చేతులకు మట్టి గాజులూ, కాలికి మెట్టెలూ ఇవే పంచమాంగల్యాలు. ఈ అయిదు వివాహమైన స్త్రీ సర్వవేళలా ధరించాలి. భర్తకి ఇవన్నీ ధరించే కనిపించాలి.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

**278. నవగ్రహ ఆరాధన రహస్యా ఫలములు ఏమిటి ?**

సూర్యుడ్ని ఆరాధిస్తే అనేక అనారోగ్యములు తొలిగిపోతాయి.
చంద్రుడ్ని ఆరాధిస్తే మనోధైర్యము పెరుగుతుంది.
బుధ గ్రహాన్ని ఆరాదించటము ద్వారా చక్కటి విద్యా.
గురు గ్రహాన్ని సేవించటము ద్వారా శుభవార్తలనూ పొందుతారు.
శుక్రుడ్ని ఆరాధిస్తే సుఖాలు లభ్యమవుతాయి.
శనిని పూజిస్తే దీర్ఘాయువు కలిగి ఆరోగ్యంగా వెలిగిపోతాడు.
రాహుగ్రహాన్ని ఆరాధిస్తే తక్షణమే అనారోగ్యము తొలుగును.

**279. నల్లపూసలు ఎందుకు ధరిస్తారు ?**

మంగళసూత్రంతో పాటు నల్లపూసలను గొలుసుగా ధరించటం మన హిందూ సాంప్రదాయం. దుష్టశక్తులు తన మాంగళ్యం మీద పడకుండా వుండటానికి ముఖ్యంగా ధరిస్తారు. అంతే కాకుండా నల్లపూసలు సంతాన సాఫల్యానికీ, ధనానికీ, సుఖానికీ ప్రతిబింబాలు. నల్లపూసలు శుభప్రదమైన, సౌభాగ్యమైన ఆభరణము.

**280. పిల్లలు గెంతుతూ ఆడుతుంటే భూదేవికి కోపం వస్తుందని ఎందుకు అంటారు?**

పిల్లలు అలా నిరంతరం గెంతుతూ ఆడుతుంటే, మగపిల్లలకి వరిబీజము లాంటివి వస్తాయి. ఆడపిల్లలకి స్త్రీ సంబంధిత అనేక సమస్యలు ఉంటాయి. అవి వెనుకా, ముందూ రాకుండా సరయిన సమయంలోనే రావటానికి పెద్దలు పిల్లలని గెంతుతూ ఆడుకుంటే భూదేవికి కోపమొస్తుం దని చెప్పి మాన్పిస్తారు.

**281. మ్రొక్కుబడులు చెల్లించకుంటే భగవంతునికి కోపం వస్తుందా?**

తలిక్లి బిడ్డల మీద కోపం వస్తుందా? ఎప్పటికీ రాదు ఇదీఅంతే. దేవుడు ఆశించేది నీతి, న్యాయాలతో జీవితాన్ని గడపమని. మ్రొక్కులు తీసుకొని మన పాపాలని ఆయన స్వీకరించడు. మ్రొక్కుబడులివ్వలేదని కష్టాలు పెట్టడు. ఎవరుచేసిన కర్మలనుబట్టి వారు వారివారి పాపపుణ్యాలను అనుభ వించక తప్పదు. కష్టమొస్తే దేవుడికి మ్రొక్కుకొని, తీరిన తర్వాత మర్చిపోయినవారికి, మళ్ళీకష్టంలోనే ఆమ్రొక్కులు తీర్చుకుంటారు. భగవంతు డెప్పుడూ మాటమీద, సత్యం మీద నిలిచి ఉండమంటాడు. దాన్ని మీరితే అది మీ సమస్య, ఆయన సమస్యకాదు.





**282. సాలగ్రామములు - శక్తులు ఎటువంటివి ?**

సాలగ్రామశిల దగ్గరలో రామాయణ,భారత,భాగవతము చదవటం వల్ల మీ పిల్లలతోపాటు వారి పిల్లలకి కూడా డబ్బుతోపాటు కీర్తి లభిస్తుంది. సాలగ్రామ శిలపై శిలాత్యకమైనటువంటి కుంకుమనుగాని చందనముగాని రోజు పెట్టుకునేవారు ధన్యజీవులు. మోక్షమునకు అర్హులు. సాలగ్రామశిల పూజ తర్వాత అదే ప్రదేశంలో భాగవతము చదివితే భక్తి,ముక్తి, శక్తులతో అను కున్నది సాధించగలుగుతారు. సాలగ్రామ శిలపూజ ఫలితం బదరీనాథ్ దర్శించినంత పుణ్యఫలము.

గతజన్మపాపముల నుంచి విముక్తి.... ఈ కలియుగమున భగవం తుడు ఆ శ్రీమహావిష్ణువు మనకిచ్చిన వరం సాలగ్రామము. గృహ సంబంధిత దేవతార్చనలో సాలగ్రామ పూజ చేయుటవల్ల అనేక ఇంటి దోషాలు పోతాయి. తెలిసో తెలియక చేసిన తప్పులు పోతాయి.

**283. మానవుని ప్రవర్తన ఎలా ఉండాలి?**

కొండ చిలువ వలె లభించిన దానితో తృప్తి చెందాలి. సీతాకోక చిలుక వలే పరులను ఇబ్బందులు పెట్టకుండా మకరందాన్ని ఆస్వాదించాలి. తేనేటీగ తేనెని కూడబెట్టినట్టు ధర్మాన్ని కూడా బెట్టాలి. లేడిలా ఆకర్షణకు లోనుకారాదు. అత్యాశతో చేపల వలే గాలానికి చిక్కరాదు.

పసిపాపలా ఆకలి తీరగానే సంతృప్తి చెందాలి. శిల్పి విగ్రహం మీద ఏకాగ్రత పెట్టినట్టు ధర్మంపై, భగవంతునిపై మనస్సు నిలపాలి. సమాజ సేవ పరంగానూ, శ్రేయస్సు కోరి ప్రవర్తించాలి.

**284. శ్రీరామకోటి- కోటికన్నా తక్కువ వ్రాయవచ్చా?**

శ్రీరామకోటి వ్రాయటం ద్వారా మనసు ప్రశాంతమవుతుంది. ఏకగ్రాత పొందుతుంది. మంచిపని ఎంతచేస్తే అంతఫలితం ఉన్నట్టే. ఎంత శ్రీరామకోటిని రాస్తే అంత ఫలము భగవత్ప్రాప్తికి రామకోటి సులభదారి.

**285. నీరు విషమా, అమృతమా?**

ఆహారము జీర్ణం కానివారికి నీరు అమృతంలా పనిచేస్తుంది. అలాగే భోజన మధ్యలో కొద్ది నీరు అమృతమే. కాని భోజనం చేసిన తర్వాత త్రాగే నీరు విషంతో సమానము. కనీసం రెండు గంటలైనా విరామం ఉండాలి. అలాగే తింటూ త్రాగుతూ, త్రాగుతూ తింటే కూడా ఆ నీరు విషమే. కాకపోతే నెమ్మదిగా పని చెయ్యటం ప్రారంభిస్తుంది.

MOHAN PUBLICATIONS.COM

## 286. ఎవరి పాపాలు ఎవరికంటుతాయి?

ప్రజలు చేసిన పాపాలు రాజుకూ, రాజు చేసే పాపాలు పురోహితులకూ, భార్య చేసిన పాపాలు భర్తకూ, శిష్యుడు చేసిన పాపము గురువుకూ సంక్రమిస్తాయి. మగపిల్లాడు తప్పు చేస్తే తల్లీ, ఆడపిల్ల తప్పు చేస్తే తండ్రీ బాధ్యులు.

## 287. శుభకార్యాల్లో ఆడవాళ్ళ గొంతుకి చందనం పూస్తారు ఎందుకని?

భార్య భర్త ఇంటిలోని వారితో పాటు చుట్టాలూ, స్నేహితులూ.. ఇలా ఎందరినో అభిమానంతో పలకరించాలి. భర్తా, అత్తా, మామా వంటి వారితో ఎంతోఅభిమానంగా మాట్లాడాల్సి వచ్చినప్పుడు సరళంగా, సౌమ్యంగా మాట్లాడాలి. చందనం మెడకి వ్రాయటం ద్వారా గొంతు సరళంగావస్తుంది. సున్నితంగా సరళంగా తీయగా మాట్లాడటం వల్ల ఆమెపై గౌరవాభిమానాలు పెరుగుతాయి. ఒక్కోసారి చెప్పే విషయం వినయంగా ఉన్నా మాటగట్టిగా, కఠినంగా ఉంటే తమను ఎదురించేలా మాట్లాడుతుందని అనుకునే ప్రమాదం ఉంది. స్త్రీరూపానికి తగ్గట్టు స్వరమూ ఉండాలని చందనం రాస్తారు. చందనం శుభానికి సూచన కూడా.

## 288. రుద్రాక్షలు ఎవరికి ప్రతీకలు ?

ఏకముఖి రుద్రాక్ష పరమశివుడికి ప్రతీక
ద్విముఖి రుద్రాక్ష అర్థనారీశ్వర స్వరూపము.
త్రిముఖి రుద్రాక్ష అగ్నిదేవుడి స్వరూపము.
చతుర్ముఖి రుద్రాక్ష బ్రహ్మదేవుడి ప్రతీక.
పంచముఖి రుద్రాక్ష మహామృత్యుజ్వాల అనగా కాలాగ్ని స్వరూపిణి
షణ్ముఖి రుద్రాక్ష కార్తికేయుని ప్రతీక
సప్తముఖి రుద్రాక్ష సప్తస్వరాలు
అష్టముఖి రుద్రాక్ష మహాగణపతి
నవముఖి రుద్రాక్ష కనకదుర్గ.
దశముఖి రుద్రాక్ష శ్రీమహావిష్ణువు స్వరూపము.
ఏకాదశముఖి రుద్రాక్ష మహేంద్రుడి ప్రతిరూపము.
ద్వాదశ ముఖి రుద్రాక్ష ఇంద్రునికి ప్రతీక.
చతుర్దశ ముఖి రుద్రాక్ష చిరంజీవి హనుమకి ప్రతిరూపము.
ఇరవై రెండు ముఖాల రుద్రాక్షలు దొరుకుతాయని అంటారు. ఏ

MOHAN PUBLICATIONS.COM





రుద్రాక్ష ధరించినా, గంగా జలముతో శుద్ధి చేసి సంబంధిత మంత్ర జపము చేసి, సోమవారం ప్రాతఃకాలంలో ధరించండి.

## 289. మైలా, అంటూ లేని వస్తువులు ఏవి?

పసుపు, కుంకుమ, పూలు, పళ్ళు, వక్క, తమలపాకు, పాలు, పెరుగు, తేనె, తులసి, గంధం, చెక్క, నెయ్యి, కూరగాయలు. దేవాలయాల్లో పేరంటాల్లో ఇచ్చిన పసుపును ఏపరమార్థం కొరకుఇచ్చారో దానికే ఉపయోగించాలి. పసుపును కూరల్లోనూ, కుంకుమను దైవపూజకి వాడరాదు.

## 290. ఎలాంటిది పరిపూర్ణ దానమవుతుంది?

తను చేసే కర్మ ద్వారా ఇతరులు బాధపడతారని భావిస్తే చెయ్యకుండా ఉండేది ఉత్తమమైన దానము. ఇచ్చే దానం తీసుకునే వ్యక్తి అర్హుడా, కాడా అని ఆలోచించకుండా అపాత్రదానం చెయ్యరాదు. దానమంటే కీర్తి కోసం కాంక్షించి ఇచ్చేది కాదు. అది దానం క్రిందకిరాదు.

అన్నీ దానాల్లోకెల్లా అన్నదానమే ఉత్తమోత్తమము. రోగపీడితులకి ఆరోగ్యదానం చేస్తే వేలాది యాగాలు చేసిన ఫలం. కృతయుగంలో తపస్సు, త్రేతాయుగంలో జ్ఞానం, ద్వాపరంలో యజ్ఞం... ఈ కలియుగంలో దానం, ఈయుగాన దానం ద్వారా మూడు యుగాల్లో చేసిన తపస్సు, జ్ఞాన, యజ్ఞ ఫలాలన్నీ పొందగలము.

## 291. ఏ నక్షత్రాన పుష్పవతి అయితే ఏ ప్రభావము ఉంటుంది?

ఆడపిల్ల పుష్పవతి అవ్వగానే నక్షత్రం చూసుకుంటారు. ఆ నక్షత్రాలను బట్టి భవిష్యత్తులో జరగబోయే మంచీ, చెడూ జ్యోతిష్యశాస్త్రాల ద్వారా తెలుసుకోవచ్చు.

నక్షత్రం మంచిది కాకపోయినా, అశుభమైనా చింతించాల్సిన పనిలేదు. తగు విధంగా పూజలు, కర్మలు చేయిస్తే గ్రహణం విడిచినట్టు దోషం పోతుంది.

| | |
|---|---|
| అశ్విని నక్షత్రం | అపారమైన దుఃఖాలు |
| భరణి నక్షత్రం | సంతానమంతా ఆడపిల్లలే |
| కృత్తిక నక్షత్రం | మహాదరిద్రము |
| రోహిణి నక్షత్రం | చక్కటి దాంపత్యము |
| మృగశిర నక్షత్రం | అన్యోన్యమైన సుఖసంసారము |
| ఆర్ద్ర నక్షత్రం | పుత్రసంసారము |

| | |
|---|---|
| పునర్వసు నక్షత్రం | దుఃఖమైన జీవితము |
| పుష్యమీ నక్షత్రం | కుటుంబానికి వేదన |
| ఆశ్లేష నక్షత్రం | సకల శుభములు |
| మఘ నక్షత్రం | భర్తకి దూరమవ్వటము |
| పుబ్బ నక్షత్రము | మగ సంతానము |
| ఉత్తర ఫాల్గుణి నక్షత్రము | బాగా చూసుకునే పుత్రుడు |
| హస్త నక్షత్రము | అఖండ అదృష్టము |
| చిత్త నక్షత్రము | చక్కటి జీవితము |
| స్వాతి నక్షత్రము | భర్త ప్రేమ అపారమగా పొందుతుంది. |
| విశాఖ నక్షత్రము | నలుగురూ ఈర్ష్యపడే దాంపత్యము. |
| అనురాధనక్షత్రము | రోగాలమయము |
| జ్యేష్ఠ నక్షత్రము | ధన నష్టం, చపల చిత్తము |
| మూల నక్షత్రము | ఈతి బాధలు, ఆరోగ్య బాధ |
| పూర్వాషాఢ నక్షత్రము | కుటుంబానికి ఆవేదన |
| ఉత్తరాషాఢ నక్షత్రము | సంతోషకర జీవితము |
| శ్రవణా నక్షత్రము | అధికార ఆనందము |
| ధనిష్ఠ నక్షత్రము | ఆయురారోగ్యములు |
| శతభిషం | ఆకలి బాధలు |
| పూర్వాభాద్రపదం | శక్తిలేకపోవటము |
| ఉత్తర భాద్రపదం | పదిమంది మెచ్చుకునే జీవితము |
| రేవతి | సకల శుభములు |

### 292. తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించాలంటే ఏడు ద్వారములు దాటాలి... దానిలో అర్థం పరమార్థమేమి?

శ్రీస్వామి విగ్రహాన్ని దర్శించాలంటే ఆరు ద్వారములు దాటి ఆపై వచ్చే ఏడవ ద్వారం అవతల గర్భగుడిలోని శ్రీవేంకటేశ్వరుని దర్శిస్తున్నాము. దాని పరమార్థం మనలో ఉన్న బ్రహ్మనాడిలో ఏడు కేంద్రములున్నాయి. జీవుడు ఆత్మను చేరాలంటే ఏడవస్థానానికి చేరాలి.

అందుకే స్వామి నేను ఏడవగదిలో ఉన్నాను. నన్ను చేరాలంటే మీలో ఉన్న ఏడు ద్వారములు దాటండి. అప్పుడు నా రూపాన్నీ, అంతర్యాన్నీ చూడగలరు అనేది స్వామి దర్శనంలో పరమార్థం.

MOHAN PUBLICATIONS.COM





### 293. అమావాస్య, పౌర్ణమి రోజుల్లో రోగం తిరగబెడుతుందా?

రోగాలే కాదు పిచ్చి కూడా ముదురుతుంది అంటారు. చంద్రుడు జలకారకుడు. పౌర్ణమినాడు సూర్యచంద్రులు భూమికి రెండువైపులా ఒకేస్థాయి ఆకర్షణ కలిగి ఉంటారు. అలాగే అధికశక్తి, బలహీనం చంద్రునిలో ఆ రెండు రోజులు ఉంటాయి. మన శరీరంలో కూడా నీరు ఉంటుంది. చంద్రుడు నీటి కారకుడు కావున విపరీతంగా ఆకర్షిస్తాడు. అందువల్ల వ్యాధిగ్రస్తులు ఒకింత ఎక్కువ వేదనకు గురిఅవుతారు.

### 294. భగవద్గీతను చదవాలా? వినాలా?

గీత అనగా 'గీ' అంటే త్యాగం, 'త' అంటే తత్త్వము. ఈ రెంటిని బోధించేది భగవద్గీత. ఉపనిషత్తుల సమస్త సారాంశము ఇందులో ఇమిడి వుంది. భగవద్గీతను అర్జునుడికి శ్రీకృష్ణుడు మార్గశిర శుద్ధ ఏకాదశినాడు బోధించాడు. 'గ' ఆకారంలో కలిగిన వాటిలో గీతను చదవాలి. వినటం మధ్యమం. గీతను చదవటం, గంగా స్నానం, గాయత్రీ జపం, గోవింద నామస్మరణ... ఈ 4గింటిలో గీత గంగ కన్నా ఉత్తమమైనది. గాయత్రీ మంత్రం కన్నా చాలా గొప్పది.

### 295. పౌర్ణమి - అమావాస్యల్లో ప్రయాణించకూడదా?

నవమీ, పాడ్యముల్లో తూర్పు వైపుకూ, విదియ దశముల్లో ఉత్తరం వైపుకూ, తదియ ఏకాదశుల్లో ఆగ్నేయానికీ, అలాగే చవితి ద్వాదశులందు నైఋతి వైపుకీ, పూర్ణిమ సప్తములప్పుడు వాయువ్యానికీ, అమావాస్య అష్టమి రోజులలో ఈశాన్యానికీ ప్రయాణించకూడదని శాస్త్రం చెబుతుంది.అలా వెళ్ళాల్సి వస్తే దైవపూజ చేసుకుని వెళ్ళమని శాస్త్ర చెబుతోంది.

### 296. గయలో పిండ ప్రదానం చేస్తే ప్రతి సంవత్సరం చెయ్యక్కర్లేదా?

గయలోనేకాదు ఎక్కడ పిండ ప్రధానం చేసిన మళ్ళీయథావిధిగా తద్దినాలు పెట్టాల్సిందే. తద్దినాలుపెట్టేవారు అనగా వారసులూ,పుత్రులూ లేకపోతే గయలో పిండప్రదానంచేసుకుంటే పుణ్యలోకాలప్రాప్తికలుగు తుంది.

### 297. పెళ్ళిలో వధువును గంపలో ఉంచి ఎందుకు తెస్తారు?

పెళ్ళిసమయంతో నవవధూవరులు లక్ష్మీనారాయణులు. లక్ష్మి ఎప్పుడూ తామర పువ్వులో ఉంటుంది. అందుకే పెళ్ళికూతురుని కూడా తామరపువ్వులాంటి గంపలో అలంకరించి శ్రీమహావిష్ణువుంటి అల్లునికిచ్చి వివాహం చేస్తున్నామని అర్థం పరమార్థం.

MOHAN PUBLICATIONS.COM

**298. మహారుద్రునికి ఏ అభిషేకాలు ఇష్టం? ఏ ఫలం ఇస్తాడు?**

ఆవుపాలతో అభిషేకిస్తే సౌఖ్యమూ, ఆవు పెరుగుతో ఆరోగ్యమూ... ఆవునెయ్యితో ఐశ్వర్యమూ, తేనెతో తేజోవృద్ధీ ప్రసాదిస్తాడు. గంధోదకముతో పుత్రుడ్నీ, పుష్పోదకముతో భూమినీ అందిస్తాడు. అలాగే సువర్ణ పూలతో దరిద్రనాశనమూ, నువ్వులనూనెతో మృత్యుభయమూ లేకుండా చేస్తాడు. ద్రాక్షరస అభిషేకంతో కార్యసిద్ధి, పసుపునీళ్ళతో మంగళప్రదమైన శుభము లను వినేలా చేస్తాడు.

**299. అష్టగంధమంటే?**

కస్తూరీ, గోరోజనమూ, కుంకుమ పువ్వూ, దేవదారూ, పచ్చకర్పూ రమూ, గుగ్గిలం, శ్రీగంధమూ, రక్తచందనమూ...ఈ ఎనిమిదింటితో చేసేదే అష్టగంధము.

**300. తేనేతుట్టలు ఎక్కడపెడితే ఏం ఫలితం?**

| | | |
|---|---|---|
| ఇంటి మధ్యలో | – | అధిక ధన నష్టము |
| నైఋతి భాగంలో | – | మంచిది కాదు. |
| ఈశాన్యంలో | – | అనేక కష్టాలు |
| అగ్నేయంలో | – | పెద్దగా మంచి, చెడుల తేడాలుండవు. |
| తూర్పు భాగంలో | – | శత్రువులపై విజయం |
| ఉత్తరభాగంలో | – | అనేక సుఖాలు |
| వాయువ్యంలో | – | ధన, ధాన్య లాభాలు. |

**301. ఎంత ఎక్కువ మర్ధనము చేస్తే ఎంత సుఖము?**

చెరుకునూ, నువ్వులనూ, పనివారనూ, అందమైన భార్యనూ, బంగారాన్నీ, భూమినీ, పెరుగునూ, చందనమునూ, తాంబూలాన్నీ ఎంత చేతనైతే అంత మర్ధనము చేస్తే అంత గుణమూ, సుఖమూ వస్తాయి.

**302. మన్మథుడు ఆవహిస్తే వచ్చే అవస్థలు ఏమిటి?**

కనులతోచూసి మైమరుచుట, మనసుపడుట, సంకల్పించుట, నిద్ర పట్టకపొత్తిగిల్లుట, చిక్కిసగమవుట, విపరీతమైన విసుగు,సిగ్గు,బిడియం వదిలివేయటం, చిత్తభ్రమ నొందుట,మూర్ఛ,తుదకుఆత్మహత్యకు ప్రయత్నించుట.

**303. నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుందని అంటారెందుకు?**

నాలుక కొసన లక్ష్మీదేవి ఉంటుంది. జిహ్వాగ్రము వల్లే మిత్రులూ, శత్రువులూ ఏర్పడతారు. జిహ్వాగ్రము వలనే అన్ని కార్యాలకు మూలమైన





లక్ష్మీదేవి ధనరూపంలో వస్తుంది. అందుకనే నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుందని, కోరినవన్నీ చెంతకు వస్తాయని అంటారు.

**304. మంత్రాలూ, మూలికలకూ శాపముందా?**

అవును. మంత్రాలకూ, మూలికలకూ అగస్త్యుని శాపం ఉంది. అందుకే వీటిని గురుముఖతః నేర్చుకోవాలి. నేర్పించే గురువు మంత్ర తపో సిద్ధి కలిగి వుంటాడు. గురు ముఖతః కాకుండా నేర్చుకుంటే బ్రహ్మ హత్యాపాతకం చుట్టుకుంటుంది.

**305. వాల్మీకి రామాయణంలో ఏమి లేవు ?**

లక్ష్మణుడు లక్ష్మణరేఖ గీయటమూ, సీతా స్వయంవరానికి రావ ణుడు రావటమూ, ఊర్మిళ నిద్రా, అహల్యకు శ్రీరాముని పాదము తగిలి శాపవిమోచనం కలగటమూ, హనుమంతుడు శ్రీరాముడు వేసిన బాణాన్ని వాయుదేవుని సహాయంతో నాభిలో గుచ్చుకునేలా చెయ్యటమూ, జనకుడు సీతా స్వయంవరం ప్రకటించటమూ ఇవన్నీకూడా వాల్మీకి రామాయణంలో లేవు.

**306. 'రామ' నామ శబ్ద విశిష్ఠత ఏమిటి ?**

'రామ' ర, ఆ, మలు కలిసిన శబ్దం. 'ర' అక్షరము రుద్రుడ్ని 'అ' అక్షరము బ్రహ్మనూ 'మ' అక్షరము విష్ణువును సంభోదిస్తోంది. 'రామ' అని ఒక్కసారి అనినంతనే త్రిమూర్తులను పూజించిన ఫలం కలుగుతుంది. 'రామ' అన్న శబ్దం జీవాత్మపరమాత్మ స్వరూపమే.

రామ నామములో 'రా' అని పలికినప్పుడు ఆ శబ్దంలోంచి ఎన్నో జన్మల పాపాలు బైటికి పోతాయి. 'రా' అని చూడండి మీ పెదవులు విడి పోతాయి. ఆ వెంటనే 'మ' అని ఉచ్చరించటంతో బైటి పాపాలు మనలోకి ప్రవేశింపలేవు. 'మ' అనగానే పెదవులు కలసిపోతాయి.

**307. పసిపిల్లల తలపై ఎందుకు కొట్టరాదు?**

సరదాగానూ, ప్రేమగానూ పసిపిల్లల తలపై కొట్టరాదు. పుర్రెదగ్గర ఎముకలు మెత్తగా ఉంటాయి. కొంతమంది పిల్లలకి ఆరు సంవత్సరాలు వచ్చినా బలంగా తయారవ్వవు. కావున తలపై కొట్టడం వల్ల ప్రమాదమూ లేదా మానసిక స్థితిలో తేడారావచ్చు. పిల్లలోవయసుతోపాటు మెదడు పెరగక పోవచ్చు.

MOHAN PUBLICATIONS.COM

**308. రుద్రాభిషేకం చేయించేటప్పుడు తిథులుచూసుకోవాలా ? వద్దా?**

దీర్ఘవ్యాధులువారు తమ వ్యాధులు పోవాలనీ, మిగతవారు కోరికల తోనూ, భక్తితోనూ ఈశ్వరునికి రుద్రాభిషేకం చేయిస్తారు. ఇలాచెయ్యటం వల్ల మరణభయం పోతుందని పురాణాలు చెబుతున్నాయి. రుద్రాభిషేకం చేయించేవారు ఓముఖ్యవిషయం గుర్తుపెట్టుకోవాలి. అభిషేకం చేయించే ముందు రుద్రాభిషేకమును శివసంచారమును తెలుసుకొని చేయించాలి. పరమశివుడు శుభస్థానములోనున్నప్పుడు లెక్కించుకొని అభిషేకం చేయించుకోవాలి. శివపూజ చేసే తిథిని 10తో హెచ్చవేస్తే అనగా '0' చేర్చి ఏడుతో భాగిస్తే '1' వస్తే కైలాసము, '2' వస్తే పార్వతీదేవి వద్దా, '3' వస్తే వాహనుడై ఉన్నట్టు, '4' వస్తే కొలువు తీరినట్లు, '5'వస్తే నైవేద్యము స్వీకరిస్తున్నట్టు. '6' వస్తే ఆనందనాట్యము చేస్తున్న సమయముగా భావిం చాలి. '7'వస్తే స్మశానమున ఉన్నట్టు తెలుసుకోవాలి. 7-14 తిథులలో పూజ చేయకూడదు. ఈ వివరాలు తెలుసుకొని అభిషేకం చేయించుకోవాలి.

**309. సంధ్యావందనము ఏ సమయంలో చేయాలి?**

సూర్యోదయానికి అరగంట ముందు అంటే ఒకటిన్నర గడియల ముందు నక్షత్రములు సమాప్తమవుతాయి. కావున సూర్యోదయానికి అరగంట ముందు కాలంలోనే సంధ్యోపాసనం చేయాలి.

**310. భగవద్గీతను పారాయణం చేయుట వల్ల ఏ ఏ పుణ్యఫలితాలు వస్తాయి?**

అర్జున విషాద యోగ పారాయణ ద్వారా పాపాలు తొలుగుతాయి. పూర్వజన్మ స్మృతి కలుగుతుంది. సాంఖ్యయోగం ద్వారా ఆత్మ స్వరూపమును తెలుసుకొనగలుగుతారు. కర్మయోగం ద్వారా మీ చుట్టూ ఉన్న ప్రేతాత్మలు తొలిగిపోతాయి. జ్ఞానయోగ పారాయణం ద్వారా పశు, వృక్ష, పక్షు పాపాలు కూడా నశించి ఉత్తమమైన లోకాలని చేరుతాయి. తద్వార మీకు పుణ్యప్రాప్తి.

ఆత్మసంయము యోగం ద్వారా అనేక దానములు చేసిన పుణ్య ఫలం లభిస్తుంది. విజ్ఞాన యోగం ద్వారా జన్మరాహిత్యమూ, అక్షర పరబ్రహ్మ యోగం ద్వార సమస్త దుర్గుణాలూ నశిస్తాయి. రాజ, విద్యా, రాజ, గుహ్యయోగం ద్వారా పరుల సొత్తును అపహరించిన పాపములు పోతాయి. విభూతి యోగం ద్వారా సకల పాప విముక్తి కలుగుతుంది. భక్తి యోగం ద్వారా ఇష్టదేవతా దీవేనెలూ లభిస్తాయి.





క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం ద్వార సకల దోషాలూ, చెడూ తొలిగి పోతాయి. గుణత్రయ విభాగయోగం పారయణం ద్వారా అనేక స్త్రీలతో పోయిన పాపములు, స్త్రీ దోషాలు పోతాయి. పురుషోత్తమ ప్రాప్తి యోగం ద్వారా సర్వపాపాలూ పోయి ఉత్తమ మోక్షాలు సంక్రమిస్తాయి. భోజనానికి ముందు చదివితే మరింత మంచిది. దైవాసుర సంపద్విభాగయోగం ద్వారా అమితశక్తి వంతులవుతారు. శ్రద్ధాత్రయ విభాగయోగం పారాయణ ద్వారా అనేక దీర్ఘరోగములు నశించి క్షీణిస్తాయి. మోక్షసన్యాసయోగం పారాయణ ద్వారా అనేక యజ్ఞములు చేసిన ఫలములు కలుగును.

**311. ఏడు వారాల నగలు అంటే ఏమిటి ?**

ఏడువారాల నగలు అంటే పేరు వినటమే కాని అసలవి ఎలా ఉంటాయో చాలామందికి తెలియదు.

ఆదివారము : సూర్యునికిష్టమైన ఈ రోజున కెంపుల కమ్మల, హారాలు ధరించాలి.

సోమవారము : చంద్రునికిష్టమైన ఈ రోజున ముత్యాలహారాలూ, గాజులు పెట్టుకోవాలి.

మంగళవారము : కుజునికిష్టమైన ఈ రోజున పగడాలదండాలూ, ఉంగారాలు అలంకరించుకోవాలి.

బుధవారము : బుధునికిష్టమైన ఈ రోజున పచ్చల పతకాలూ, గాజులు వేసుకోవాలి.

గురువారము : బృహస్పతికిష్టమైన ఈ రోజున పుష్పరాగపు కమ్మలూ, ఉంగరము చేయించుకోవాలి.

శుక్రవారము : శుక్రునికిష్టమైన ఈ రోజున వజ్రాల హారములూ, ముక్కుపుడక ధరించి లక్ష్మీదేవిలా మీ వాళ్ళకి దర్శనమివ్వాలి.

శనివారము : శనికిష్టమైన ఈ రోజున నీలమణితో చేయించుకున్న కమ్మలూ, హారాలూ, ముక్కుపుడకా ధరించాలి.

ఇవీ ఏడు వారాల నగలు. ఆయా రోజుల్లో ఆయా నవరత్నములతో పాపిడి బిళ్ళ, వంకీలూ ఇలా ఎన్నయినా చేయించుకోవచ్చు. ఆ రోజు ఆ రత్నం సంబంధించినవి బంగారంతో చేయించి పెట్టుకోవటమంటే అంతకు మించిన వైభోగము ఇంకేమీ ఉండదు.

**312. యజ్ఞోపవీతము నందు 9 పోగులేమిటి?**

యజ్ఞోపవీతము తొమ్మిది పోగుల్లో తొమ్మిది దేవతలుంటారు. బ్రహ్మ, అగ్ని, అనంతుడు, చంద్రుడు, పితృదేవతలు, ప్రజాపతి, వాయువు, సూర్యుడు, సూర్యదేవతలు నివశిస్తారు.

**313. భోజనము చేసేటప్పుడు మాట్లాడకూడదంటారు ఎందుకని?**

తూర్పు దిశగా ముఖం పెట్టుకొని కూర్చొని భోజనం చెయ్యటం ఆచారం. ఆ దిశగా ప్రాణశక్తి ఎక్కువగా ఉంటుంది. అలాగే పితురులుండే దక్షిణ దిక్కువైపు అయినా భోజనం చేయవచ్చు. భోజనాన్ని ఎత్తైన దాని మీద కూర్చొని నోటికి ఎదురుగా విస్తరి పెట్టుకుని ఆరగిస్తే అనేక వ్యాధులు వచ్చే అవకాశం ఉంది. పీటా లేదా చాప ఇలాంటి వాటిపై కూర్చొని భుజించటం వల్ల కడుపుకి ఎంత కావాలో తెలుస్తుంది. అంతే తినగలుగు తారు. భోజనం చేస్తూ మాట్లాడుతుంటే నోటిలో లాలాజలం ఊరదు. దానితో ఆహారం జీర్ణమవ్వక అనేక రోగ సంబంధిత సమస్యలు వస్తాయి.

**314. స్త్రీలు అట్లతద్దిపండుగరోజు గోరింటాకు ఎందుకు పెట్టుకుంటారు?**

అరచేతులకీ, కాళ్ళకూ అన్ని శుభకార్యాల్లోనూ స్త్రీలు గోరింటాకును పెట్టుకుంటారు. దానికి మంగళకరమైన కారణమే కాకుండా, మరో కారణం కూడా ఉంది. స్త్రీలు రోజులో ఎక్కువ భాగం నీటిలోనే పని చేయాల్సిరావటం వల్ల కాళ్ళూ, చేతులూ పాచి పడతాయి. ఆ పాచీ, పగుళ్ళూ అనేక వ్యాధులకి కారణమవుతాయి. గోరింటాకు పెట్టుకోవటం వల్ల వాటిని అరికట్టడమే కాకుండా శరీరంలోని వేడిని కూడా తగ్గిస్తుంది.

**315. 'అతి సర్వత్ర వర్జయేత్' అనగా ?**

అద్భుత సౌందర్యము ఉండటంవల్ల సీతాదేవిని రావణుడు అపహరించాడు. అతిగర్వంవల్ల శ్రీరాముడిచేతిలో రావణుడు మరణించాడు.

అతి దానంవల్ల బలినష్టపోయాడు. అతిగా తింటే ముందే పోతాడు. అతిగా వాగితే చులకనవుతాడు. అతిగా ఆశపడితే వచ్చేది అన ర్థము. అందుకనే దేనికైనా అతి పనికి రాదని అంటారు.

**316. ఉల్లి చేసే మేలు తల్లి కూడా చెయ్యదు...అయినా ఎందుకు పూజలలో నిషిద్ధం?**

నిజమే. ఉల్లిచేసే మేలు తల్లికూడా చెయ్యదంటారు. తపస్సు అనగా దైవకార్యాలు, పూజలూ, వ్రతాలూ చేసేటప్పుడు ఉల్లి వద్దనటంలో అర్థం. తమోగుణం పెరిగి సాధనకు ఏకాగ్రత కుదురదు. అందుకే ఉల్లి నిషేధం.





**317. మహిళలు జుట్టు విరబోసుకుని ఎందుకు ఉండకూడదు?**

జుట్టు విరబోసుకోవడం అనేది భూత,ప్రేత, పిశాచాలకు ఆహ్వానం వంటిది. అనేక దుష్టగ్రహాలు ఆ సమయంలో ఆవహించి కల్లోల పరిచే శక్తి జుట్టు విరబోసుకున్నప్పుడే వాటికి వస్తుంది. దానికి తోడు విరబోసుకున్న స్త్రీని చూసిన పురుషుడుకి ఆ స్త్రీమీద కామం కలుగుతుంది. తద్వారా అనేక కుటుంబ సమస్యలు వస్తాయి.

**318. తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి అభయహస్తానికి అర్థం ఏమిటి?**

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి అభయహస్తంతో మనకి దర్శమిస్తాడు. స్వామి 5వేళ్ళు కలిపి మనకి చూపటంలో అర్థం ఏమిటంటే మన శరీరంలోవ్యాన, సమాన, ఉదాన, ప్రాణ, ఆపానములను వాయువు లుంటాయి. ఆ 5 వాయవులు నిలిచిన మనస్సు నిలకడగా ఉంటుంది. కనుక ఆ 5 వాయువులను ఒక్కటిగా చేసి ప్రార్థించు అని భావము.

**319. తాంబూలాలప్పుడు ఒకరివేలికి మరొకరు ఉంగరం తొడిగేదెందుకు?**

ఎంగేజ్‌మెంట్ ఫంక్షన్‌లో పెళ్ళికూతురూ, పెండ్లి కొడుకూ ఒకరి కొకరు ఉంగారాలు పెట్టుకోవటం ఓ కమ్మని తియ్యని క్షణాలు. వధూవరులు తమ జీవితాంతము గుర్తుంచుకునే మధురమైన క్షణాలు. ఈ ఉంగారాల్ని ఉంగరం వేలికి తొడగటంలో ఒక విషయం దాగి ఉంది. ఉంగరం వేలి నరానికి హృదయానికి అవినాభావ సంబంధము ఉంది. నా మనసనే నా ఈ ఉంగారాన్ని నీ వేలికి తొడుగుతున్నాను. ఉంగరం వేలుకి పెట్టినఉంగరం ద్వారా నీ హృదయాన్ని అంటిపెట్టుకున్నాను అని భావము.

**320. భక్తి చిహ్నాల అర్థపరమార్థాలేమిటి?**

ఓంకారము సమస్త విశ్వానికి ప్రతిరూపము. అందుకే అక్షరా భ్యాసంలో తొలుతగా 'ఓం' ని వ్రాయిస్తారు.

లక్ష్మీపాదాలను ఇంటి గోడలపై వేస్తారు. సకల శుభాలకి గుర్తు. సీమంతం చేసిన స్త్రీ కాలిని కుంకుమపై అద్దించి, ఆ పాదముద్రను ఇంటిలో పడేలా నడిపిస్తారు.

స్వస్తిక్ గుర్తు కూడా సకల శుభాలకోసమే. సూర్యదేవునికి ప్రతిరూపమే స్వస్తిక్ గుర్తు. వ్యాపార పుస్తకాల మీద ఇంటి గోడలపై అనేక వాటి మీద వ్రాసుకుంటారు. కమలము హిందువుల పవిత్ర చిహ్నాం. కమలం బురదలోనూ, ధూళిలోనూ ఉంటుంది. దాని అర్థం సమాజంలోని చెడూ,

MOHAN PUBLICATIONS.COM

కుట్రలూ, కుతంత్రాలు మధ్య నివశిస్తున్నా వాటికి అతీతంగా స్వచ్ఛందంగా కమలంలా విరాజిల్లుమని. పూర్ణకుంభము క్షీరసాగర మధనంలో ఉద్భవించిన అమృతకలశంతో సమానము. సంపూర్ణ సుఖ జీవితాన్ని ఇవ్వమని వేడుకోవటమే పూర్ణకుంభం పూజ.

### 321. శాస్త్ర ప్రకారము దధ్యోదనము ఎలా చేయాలి?

సన్న బియ్యంతో ముందుగా అన్నాన్ని సిద్ధం చేసుకోవాలి. దానిలో బాగా కాచిన పాలు (కేజీ బియ్యానికి శేరు పాలు, శేరు పెరుగు), పెరుగు, నెయ్యి కలిపి, తిరగమోత పెట్టుకోవాలి. తిరగమోతకు నెయ్యిమాత్రమే వాడాలి. ఎండుమిరపకాయలూ, ఆవాలూ, మినుములూ, సెనగపప్పు, కరివేపాకుతో తిరగమోతను పెట్టి కలపాలి. ఆపై మిరియాల పొడీ, అల్లం తురుమవేయాలి. నీళ్ళలో ఇంగువ కలిపి పెరుగు అన్నంపై చల్లి బాగా కలపాలి. నోరూరించే దధ్యోదనము సిద్ధం. కఫమూ, పైత్యాన్ని నివారించి, బలముతోపాటు. వీర్యబలమూ ఈ దధ్యోదనము ద్వారా కలుగుతాయి.

### 322. తిరుపతిలో శ్రీవేంకటేశ్వరస్వామికి అమ్మవారు కుడిపక్కనే ఎందుకుంటుంది ?

తిరుమలపై శ్రీమహావిష్ణువు మనుష్య రూపము దాల్చటము, ఆ తరువాత ఆకాశరాజు కుమార్తె పద్మావతిని వివాహం చేసుకోవటం అందరికీ తెలిసిందే. శ్రీవేంకటేశ్వరస్వామి, పద్మావతీదేవిల వివాహం గూర్చి సరిగ్గా సమయానికి లక్ష్మీదేవికి నారదుడు చెబుతాడు. దానితో శ్రీలక్ష్మీదేవి పద్మావతితోనూ, శ్రీనివాసునితోను గొడవకు దిగుతుంది. ఆ సమయాన శ్రీనివాసుడు పద్మావతి పూర్వగాథ శ్రీలక్ష్మిదేవికి చెప్పి, కుడి వక్షస్థలముపై పద్మావతినీ, లక్ష్మీదేవిని ఎడమ వక్షస్థలం పై ఉండమని కోరుతాడు. భర్త ఆదేశానుసారంగా ఇద్దరు అమ్మవార్లు స్వామికి ఇరువైపులా ఉంటారు.

### 323. శ్రాద్ధమందు భోజనం చేసే భోక్తలు ఎందుకు మాట్లాడరు?

శ్రాద్ధమందు భోజనసమయమున భోక్తలకి భోజనంవడ్డించి ఆ తరువాత వారు తింటున్నప్పుడు భోజనముబాగుందా? అనిఅడిగినా భోక్తులు మాట్లాడరు. భోజనంవేడిగా ఉన్నంతవరకూ, భోక్తలు మౌనంగా భుజించినంత వరకూ పితృదేవతలు భుజిస్తారు. మౌనభంగమైతే స్వీకరించరు. భోక్తల దక్షిణముఖంగా కూర్చొని భుజిస్తే ఆభోజనాన్ని రాక్షసులు స్వీకరిస్తారు. కావున వడ్డించేటప్పుడు ఈ విషయాన్ని జాగ్రత్తగా గుర్తుంచుకోండి.





### 324. మంచమ్మీద కూర్చొని కాళ్ళు ఎందుకు ఊపకూడదు?

మంచంమీద కూర్చొని కాళ్ళు ఊపు చర్య అరిష్టాన్ని సూచిస్తుంది. మన తెలియకుండానే అనారోగ్యంసంభవిస్తుంది. నరాల్లో బలహీనత వచ్చి వీర్యస్కలనము కూడా జరుగుతుటుంది. రేతస్సు బలహీనపడి సుఖసంసారం గాడి తప్పుతుంది. 10-15 రోజులైనా శృంగారపరమైన ఆలోచనరాదు. ఎప్పుడైతే శృంగారం పట్ల ఉత్సాహమూ, కోరికా తగ్గిపోతాయో శరీరంలో శక్తి సన్నగిల్లుతుంది. ఆలోచనలు వేదాంతపరమైన విషయాలపైకి వెళ్ళి అక్కడా కూడా ఇమడలేక నిరాశ వంటిది ఆవహిస్తుంది. తద్వార అనేక అపజయాలు ఎదురవుతాయి.

### 325. బియ్యం తింటే క్షయరోగం వస్తుందా ?

చిన్నపిల్లలు బియ్యం తినటం సాధారణం. చిరుతిళ్ళు దొరకనప్పుడు కాకతాళీయంగా బియ్యం తినే అలవాటు చేసుకుంటారు పిల్లలు. ఆ తర్వాతెప్పుడో గుర్తించిన తల్లి, 'బియ్యం తింటే క్షయ రోగం వస్తుందని" చెప్పి ఆ అలవాటును తగ్గిస్తుంది. ఇలా బియ్యం తినటం వల్ల అజీర్తి చేస్తుంది. తద్వారా ఎన్నో రోగాలు రావటం ఖాయం.

### 326. భర్త వెంట స్త్రీలు ఎలా నడవాలి?

అశుభానికి వెళ్ళేటప్పుడు స్త్రీ ముందు నడవాలి. శుభానికి వెళ్ళేటప్పుడు పురుషుడు వెనుక స్త్రీ నడవాలి. అలాగే భార్య చేసిన పాపంలో భర్తకు భాగముండదు. కానీ భర్త చేసిన పుణ్యంలో భార్యకి సగపాలు. అదే పాపం చేస్తే భార్యకేమాత్రం భాగం ఉండదు.

### 327. భర్త అసమర్థుడైన భార్య పతివ్రతగానే ఉండాలా?

పెళ్ళంటే సంతానోత్పాదన. స్త్రీ సంతానం ద్వారా పునీతురాలవుతుంది. ఏ కారణం వల్లనయినా భర్త పనికి రానప్పుడు, సంతాన సామర్థ్యశక్తి లేనప్పుడు స్త్రీ తన మాతృత్వ హక్కును నిర్భయంగా వాడుకోవచ్చు. ప్రేమాభిమానాలను నిర్లక్ష్యం చేయకుండా సంతానంకోసం మాత్రమే, కొన్ని ధర్మాలను ఆచరిస్తూ వరుసైన వారితో సంతానం పొందవచ్చు. మాతృత్వాన్ని పొందిన స్త్రీ మళ్ళీ ఆ ప్రయత్నాన్ని కొనసాగించ కూడదు. అలాచేస్తే ఆ సంబంధము అక్రమ సంబంధము క్రింద పరిగణించాల్సి వస్తుంది.

MOHAN PUBLICATIONS.COM

**328. నీటినీ, పాలనూ, మజ్జిగనూ ఏ సమయంలో త్రాగాలి?**

ఉదయం లేవగానే అనగా తెల్లవారుజామున నీటినీ, రాత్రిపూట పాలనూ, మధ్యాహం భోజనం చేశాక మజ్జిగా త్రాగాలి.

అలాగే భోజన సమయంలో మంచినీటిని కుడివైపు ఉంచుకోవాలి. భోజనం చేస్తున్నంతసేపు ముద్ద ముద్దకీ నీరుని త్రాగరాదు. మొత్తం భోజనంలో నీరు అయిదు నుంచి ఏనిమిది శాతం మాత్రమే తీసుకోవాలి.

**329. ధనత్రయోదశి రోజున పసిడి కొంటే లక్ష్మిదేవికి ఆహ్వానమా?**

'ధన్‌తేరస్' అనే పేరుతో ఉత్తరాదిన బాగా ప్రాచుర్యం పొందిన ఈ పండుగరోజు బంగారాన్ని కొనటం శుభమని, ఈ రోజుకొంటే సంవత్సరం పొడవునా బంగారం కొనే ఆర్థిక పరిస్థితిని శ్రీమహాలక్ష్మి దేవి కల్పిస్తుందని ఓ ప్రగాఢ నమ్మకం. ఈ పండుగ రోజు బంగారం కొనటానికి ఉత్సాహం చూపిస్తారు. మహిళలకు ముఖ్యంగా కావలసినవి మూడు. 1. చీరలు 2. నగలు 3. మొగుడు. ఏది ఏమయినా ఈ రోజున ఎవరికున్నంతలో వారు బంగారం కొనుక్కుంటారు.

అష్టైశ్వర్యాల పండగ అక్షయతృతీయ. ఈరోజే శ్రీమహాలక్ష్మి పాల కడలి నుంచి జన్మించింది. పాండవులు అక్షయపాత్రను పొందిన రోజు. కూడా ఈ రోజే. శ్రీకృష్ణుడు కుచేలునికి బంగారు పట్టణాన్ని ఇచ్చిన రోజుకూడా.

**330. పిల్లలకి పేరెలా నిర్ణయించాలి?**

బిడ్డపుట్టిన పదకొండవ రోజు లేదా మంచి రోజైన శుభముహూర్తం చూసుకొని జాతక కర్మ చేయాలి. వారివారి కులాచారము ప్రకారం అర్థం వచ్చేలా పేరు పెట్టుటవల్ల వారి ఆచారాలనూ, సంప్రదాయాలనూ గౌరవించే దిశగా ఎదుగుతారు బిడ్డలు. ఉదా:బ్రాహ్మణ బిడ్డకు శుభవాచక నామధేయమూ, వీరపుత్రనికి బలమైన వాచక నామమూ, వైశ్యునికి ధనవాచక నామధేయమూ పెట్టాలి. అప్పుడే మీ పూర్వ వంశీకులు హర్షిస్తారు. బిడ్డ పుట్టిన మూడు నెలలకి సూర్యదర్శనము చేయించాలి. ఆరో నెలలో అన్నప్రాశన చేయాలి.

**331. వినాయకుడి ముందు గుంజిళ్ళు తీసేదెందుకు?**

వినాయక చవితినాడు గుంజిళ్ళు అది కూడా ఇరవై ఏడు గుంజిళ్ళు తీయటంలో పరమార్థం ఉంది. ఇరవై ఏడు ఇళ్ళలో ఇరవై ఏడు గుంజిళ్ళు





తియ్యమని చెబుతారు. దాని వల్ల శరీర దోషాలు తొలగిపోతాయని పెద్దలు చెబుతారు. వారేకాదు ఖగోళానికి చెందిన అంశమని ఖగోళ శాస్త్రజ్ఞులూ అంగీకరిస్తారు. చిన్ననాటి నుంచే అందరితో సఖ్యతగా ఉండమని. సమాజ మంటే మనుష్యులనీ అందరితో కలిసి మెలిసి ఉంటే సుఖమని తెలియ చెప్పటమే మరో ఉద్దేశ్యము.

**332. ధర్భలకెందుకంత పవిత్రత?**

గరుత్మంతుడు తల్లి దాసీతనాన్ని తొలగించటానికి దేవలోకం నుంచి అమృత కలశం తెచ్చి, దర్భ మీద పెట్టి కద్రువ పుత్రులకి చూపించి, తన తల్లి దాసీ తనం నుంచి విముక్తి చేయండి అని చెబుతాడు. అలా అమృత భాండ స్పర్శవల్ల దర్భలు పవిత్రమయ్యాయి. అందువల్లే సమస్త మానవ దేవహోమాల్లో దర్భలు అంతటి ప్రాముఖ్యతనూ, అర్హతనూ పొందాయి.

**333. ప్రదక్షిణ చేసేటప్పుడు ఎలా నడవాలి?**

వింటి నుంచి వెలవడ్డ బాణంలా, వెనుకెవరో తరుముతున్నట్టు ప్రదక్షిణం చేయరాదు. నిండు గర్భిణీ నడిచినట్టు అడుగులో ఆడుగు వేస్తూ అడుగడుగునా దేవుడ్ని స్మరిస్తూ ప్రదక్షిణములు పూర్తి చేయాలి. అలాగే అర్థరాత్రీ, మధ్యాహ్నమూ దైవదర్శనము చేయరాదు.

**334. గృహవాస్తు యజమానిపైనే పని చేస్తుందా?**

ఆ గృహంలో అందరి మీద ఎంతోకొంత పని చేస్తుంది. ఎక్కువ శాతము యజమాని మీద పని చేస్తుంది. వాస్తుదోషాలు ఎన్నో ఇబ్బందులకు గురి చేస్తుంది. దివాలా తీయటమూ, అనారోగ్యమూ, పరాయిస్త్రీపై మమ కారమూ, అతిఖర్చూ, అభివృద్ధిలేకపోవటమూ, మోసపోవటమూ, అవ మానం చెందటమూ, మానసిక బాధలు... ఇలా అన్నీ ఇన్నీ కావు. వాస్తు అనేది నమ్మకమూ, ఆరోగ్యమూ ఈ రెంటితో పాటు శాస్రం కూడా.

ప్రతివారు నమ్మకమున్నా లేకపోయినా వాస్తు పాటించాలి. కారణం వాస్తు ఆరోగ్యం కూడా కాబట్టి. శ్రీరాముడు అరణ్యవాసాన పంచవటిలో ఆశ్రమాన్ని వాస్తు ప్రకారమే నిర్మించి వాస్తు పూజ చేసి గృహప్రవేశం చేశాడు.

**335. వివాహ పద్ధతులెన్ని?**

పెద్దల శాస్త్రాల ప్రకారం, దేవతా మంత్రాల సాక్షిగా, వధూవరులు ఒకరినొకరి హస్తాలు గ్రహించి చేసుకోవటం వివాహం.

కన్యను అలంకరించి వరునికి ఇచ్చి జరిపించే వివాహం బ్రహ్మ వివాహం. యజ్ఞం చేయటం కోసము ఋత్విక్కుకు కన్యని దక్షిణగా ఇవ్వటం దైవవివాహము. ఆవు,ఎద్దూ దానంచేసి ఆపై కన్యను ఇవ్వటం ఆర్షవివాహం. మహానుభావునికి ప్రియురాలిగా సహధర్మచారిణిగా ఉండమని ఆదేశించి కన్యను ఇవ్వటం ప్రాజపత్య వివాహము. తల్లి, తండ్రీ అనుమతి లేకుండా ఇరువురూ చేసుకోవటము గాంధర్వ వివాహము. షరతు పెట్టి వివాహం చేసుకోవటము అసుర వివాహం. కన్యను బలాత్కారంగా తీసుకెళ్ళి వివాహం చేసుకోవటం రాక్షస వివాహం. కన్య నిదురపోయేటప్పుడూ, ఏమరుపాటుగా ఉన్నప్పుడూ చేసుకున్న వివాహం పైశాచిక వివాహము.

### 336. ఎలాంటి స్థితిలో ఉన్నవారి వద్దకు వెళ్ళకూడదు?

రతి జరుపుకుంటున్న సమయంలోనూ, ఆలోచనలతో ఉన్న వారి దగ్గరికీ, హోమం చేసేటప్పుడూ, భోజనంచేస్తున్న వారి వద్దకూ వెళ్ళకూడదు. వస్తే వచ్చిన వార్ని అనుమానించాలి. వచ్చిన వారు మన హితులు కాదని తెలుసుకోవాలి.

### 337. నవరత్నాలు తొమ్మిది కదా.... అసలు రత్నాలు 22... అవి ఉన్నాయా?

ఉన్నాయనే పురాతన శాస్త్రాలూ, గ్రంధాలూ చెబుతున్నాయి. అవి వజ్రమూ, ఇంద్రనీలమూ, మరకతమూ, కర్కేధన, పద్మరాగము, రుద్రాక్ష, వైఢూర్యమూ, విపులా, విపులికా, రజమణీ, స్ఫటికమూ, సౌగంధికమూ, చంద్రకాంతమూ, గోమేధికమూ, సంగమూ, మహానీలమూ, పుష్యరాగమూ, బ్రహ్మమణీ, జ్యోతిరసా, సీసగము, ముత్యమూ, పగడము.

### 338. రాత్రిపూట చెట్ల క్రింద ఎందుకు పడుకోకూడదు?

పగటి పూట చెట్లు బొగ్గు పులుసువాయువును ప్రాణవాయువుని వదులుతాయి. రాత్రిపూట ప్రాణవాయువుని పీల్చుకొని బొగ్గుపులుసుని వదులుతాయి. బొగ్గు పులుసు వాయువు అనారోగ్యము. కనుక పగటి పూట చెట్లు క్రింద లాభం, రాత్రి పూట నష్టము.

### 339. వినాయక చవితి రోజు చంద్రుడ్ని చూస్తే నీలాపనిందలొస్తాయా?

దీనికి ప్రధాన కారణం ఆరోజు అనగా వినాయక చవితినాడు చంద్రుని నుంచి వచ్చే కిరణాల్లో మార్పు వుంటుంది. ఆ రోజు చంద్రుడ్ని చూడటం వల్ల కంటి చూపుకు ఇబ్బంది రావచ్చు. అందుకనే ఆ దోషాలను పోగొట్టేలా వివిధ ఆకులతో వినాయకుని పూజ చేసి వ్రత కథ చదివి





చంద్రుడ్ని చూడమంటారు. వినాయక పూజలోవాడే ఆకుల్లో చంద్రకిరణాల్లో ఉండే దోషాన్ని హరించే శక్తి ఉంది.

### 340. మహాభారత పర్వాలు ఎన్ని? అవి ఏమిటి?

భరతవంశ గాథను మూడేళ్ళ వ్రతాన్ని చేపట్టి వేదవ్యాసుడు జయ కావ్యాన్ని వ్రాశాడు. ఆపై వైశంపాయనుడు జనమేజయునకి జయకావ్యాల గూర్చి చెబుతున్నప్పుడు కలిగే సందేహాలనూ, సమాధానా లనూ వేదవ్యాసుడి ఆశీస్సులతో చెప్పినది కలిపి భారతము.

ఆపై ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో శౌనకాది మునులకు భారతాన్ని వివరిస్తూ, రమ్యంగా చెబుతూ ఉన్నప్పుడు కలిగిన సందేహాలనూ, సమాధానాలనూ వ్యాసుడి తాత్పర్యానికి అనుగుణంగా చెప్పిన దంతా కలిపినదే. అలా చెప్పిందే మహాభారతము.

మహాభారత పర్వాలు పద్దెనిమిది. ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ అను పద్దెనిమిది పర్వాలే మహాభారతము.

### 341. తెల్లవారు జామున ప్రయాణముచేస్తే వారశూల దోషముండదా?

తెల్లవారు జామున అనగా ఉదయం నాలుగు గంటల ముందు బైలుదేరితే (సూర్యోదయం ముందు) ఏ దోషమూ లేదు. ఏ దిక్కుకైనా ప్రయాణించవచ్చు. వారశూల దోషాలతో సంబంధము లేదు. అయితే ఈ విషయం కేవలం ప్రయాణానికి మాత్రమే అని గుర్తుంచుకోవాలి.

### 342. అరుంధతికి ఉపదేశించిన అయిదు వత్తుల దీపారాధన ఫలం ఏమిటి?

శ్రీ మహాలక్ష్మీ, శ్రీగౌరీ, మహా సరస్వతులైన ముగ్గురమ్మల జ్యోతిర్యోపాసనను అరుంధతికి ఉపదేశించారు. అయిదువత్తుల దీపారాధన చేయటం వల్ల తొలి వత్తి భర్త సమస్త కోరికలు తీరుటకూ, రెండవ వత్తి సంతాన యోగక్షేమాల కోసమూ, మూడవ వత్తి పుట్టింటి మరియు అత్తింటి క్షేమము కొరకూ, నాలుగవ వత్తి కీర్తి, గౌరవము కొరకు, ఐదవ వత్తి సకల అరిష్టాలను పోగొట్టుటకూ, దుఃఖము నుంచి విముక్తి కొరకూ. ఒక వత్తి దీపారాధన చేయవలదు.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

### 343. పెళ్ళి చేసుకోకపోతే స్వర్గప్రాప్తి ఉండదా?

స్త్రీ పురుషులెవ్వరైనా వివాహం కానిదే స్వర్గ ప్రవేశం చేయలేరు. కాని భగవంతునిపై అపారభక్తితో వివాహ విషయాన్ని వదిలేసి అనంతమైన భక్తి ప్రపత్తులతో ఆ దేవుడ్నికొలిస్తే స్వర్గానికి వెళ్ళవచ్చు. ధర్మ, అర్థాలతో, న్యాయాలతో సంపాదించిన పుణ్యంతో స్వర్గాన్ని చేరలేరు. స్వర్గాన్నీ, మోక్షాన్నీ పొందాలంటే భక్తి తప్పనిసరి.

### 344. గుళ్ళోహనుమంతునికి ఒళ్ళంతా సింధూరము ఎందుకు రాస్తారు?

ఓసారి సీతాదేవిని ఆంజనేయుడు 'తల్లీ, నీ నుదుట సింధూర తిలకమునకు అర్థమేమిటి' అని అడిగాడు. దానికి సీతాదేవి 'నాయనా! హనుమా ! స్త్రీకి బొట్టు మంగళప్రదం, సౌభాగ్యదాయకం, నేనిలా బొట్టు పెట్టుకొంటుంటే నాస్వామి అయిన శ్రీరామచంద్రుని ఆయువు రోజూ పెరుగు తుంటుంది' అని చెప్పింది. దానికి హనుమంతుడు సీతమ్మ నుదుటన అంత సింధూరపు బొట్టు పెట్టుకుంటేనే శ్రీరాముని ఆయువు పెరిగితే, నేను ఒళ్ళంతా స్వామి పేరు చెప్పి సింధూరాన్ని అద్దుకుంటే ఇంకెంతో ఆయువు పెరుగుతుందో అని ఒళ్ళంతా సింధూరం పులుముకొని సీతమ్మకి చూపించి 'అమ్మా, నేనింక జీవితాంతమూ, ఒళ్ళంతా నా స్వామి కోసం సింధూరము పూసుకుంటాను' అని చెప్పాడు. అందుకే ఆంజనేయస్వామి విగ్రహానికి సింధూరాన్ని రాస్తారు.

### 345. సంవత్సరంలో ఒక్కసారయినా నేరేడుపళ్ళు తినమంటారు ఎందుకని ?

నేరేడు పళ్ళకు చక్కెర వ్యాధిని తగ్గించే లక్షణం వుంది. కడుపులోని ప్రేవులకు అంటుకొని ఉన్న అనేక సూక్ష్మక్రిములు విసర్జించబడతాయి. నాలుక మొద్దుబారి రుచి తెలియకుండా ఉన్నప్పుడు నేరేడుపళ్ళు తినడం వల్ల రుచి స్పష్టంగా తెలుస్తుంది. ఇవన్నీ చెబితే వింటారో వినరోనని సంవత్సరకాలంలో ఒక్కసారన్నా నేరేడు పళ్ళను తినమని పెద్దలు చెబుతారు.

### 346. 'రామ' అనే రెండక్షరాలు శివునివి!?

వాల్మీకి రామాయణ శ్లోకాలు ఇరవై నాలుగు వేలు. అయితే శివుని వద్ద మరింత విపులంగా వంద కోట్ల శ్లోకాలు గల రామయణం ఉందట. ఆ వంద కోట్ల శ్లోకాలు దేవతలకి, మహర్షులకు, రాక్షసులకూ అందరికీ ఇచ్చాడట. తుదకు ఓ శ్లోకం మాత్రమే మిగిలింది.





మిగిలిన శ్లోకాన్ని పదిమందికి పది అక్షరాలు పంచగా రెండే అక్షరాలు మిగిలాయి. ఆ రెండక్షరాలే 'రామ' మహాశివుడు ఆ అక్షరాలను రెంటినే ఎవ్వరికీ ఇవ్వనని తనే ఉంచుకున్నాడట.

### 347. కైకను వివాహం చేసుకున్నప్పుడు ఆమె బిడ్డకే పట్టం కడతానని దశరథుడు మాట ఇచ్చాడా?

ఇచ్చాడు. అయితే కైకకు కాదు. ఆమె తండ్రి కైకయ మహారాజుకు. పట్టాభిషేక సమయంలో నీవు వచ్చి అడుగుతే నీవు చెప్పినట్టు నీ బిడ్డ పుత్రునికే పట్టం కడతానని చెబుతాడు. అందుకే దశరథుడు వశిష్ఠ మహర్షిని కూడా సంప్రదించకుండా హడవుడిగా పట్టాభిషేకం నిర్ణయిస్తాడు. కైకయ రాజుకి కూడా శ్రీరాముడే పట్టాభిషిక్తుడవ్వాలని ఉండటంతో ఏ రోజు తన వరం గుర్తుచేయ్యలేదు. అందుకే కైక తన తండ్రి వచ్చి అడగడని, దేవసుర యుద్ధంలో ఇచ్చిన కోరికలను అడుగుతుంది.

### 348. భోజనాన్ని ఎలా తీసుకోవాలి?

భోజనాన్ని ఆచమనం చేసిన తర్వాత తీసుకోవాలి. అన్నమునకు నమస్కరించి ఆహారపదార్థాలను చూసి చిరాకు పడరాదు. వండిన వార్ని ప్రశంసించాలి. అప్పుడే బలాన్నీ, ఇస్తుంది. లేకపోతే వికటిస్తుంది.

భోజనం మధ్యలో లేవటమూ, మాట్లాడటమూ చేయకూడదు. ఎంగిలి అన్నాన్ని ఇతరులకు పెట్టకూడదు. పదార్థాలు బాగున్నాయని అతిగా తింటే ఆయుష్షు క్షీణిస్తుంది. భోజనానంతరము కూడా ఆచమనం చేయాలి. ఆచమన విధానం తెలియనప్పుడు దేవుని స్మరించి ఆ తరువాత తినాలి. విస్తరిలో ఏమీ మిగల్చకూడదు. అవసరమైనంత వడ్డించుకోవాలి. ఇష్టం లేని పదార్థాలను ముందుగానే చెప్పాలి.

### 349. అతిగా తింటే నిద్ర ఎందుకు ముంచుకు వస్తుంది?

తినగానే నిద్ర మంచిది కాదు. పూర్వకాలంలోని వారు భోజనం చేశాక కాస్త దూరం నడిచేవారు. సత్రాల్లో భోజనం చేసినవారు ఎట్టి పరిస్థితుల్లో నిద్రపోయేవారు కాదు. తమ తమ ధనాన్ని దొంగలూ, స్వార్థ పరులూ కొల్లగొట్టే ప్రమాదం ఉందని. ఆకారణంగానూ, ఆరోగ్య పరంగానూ నిద్ర మంచిది కాదు. భోజనంచేసినపుడు జీర్ణవ్యవస్థలో రక్తప్రసారం జరిగి పోషకాలను స్వీకరిస్తుంది. ఆసమయంలో ఎక్కువ రక్తం అవసరం అవ్వ టంతో శరీరంలోని మిగతా భాగాల్లో రక్తప్రసరణ తగ్గి మగతగా మత్తుగా

MOHAN PUBLICATIONS.COM

అనిపిస్తుంది. నలభై అయిదు దాటినవారు భోజనం అయ్యాక ఓ పావు గంట ఆగి నిదురించటం మంచిది.

### 350. ఆవు పేడలో అపారశక్తులు!

మన భారతీయులే కాక విదేశీయుల సైతం ఆవుపేడ అద్భుతమైనదని చెబుతారు. ఆవుపేడను అలికిన ఇంట్లో సూక్ష్మక్రిములు రావు.

పవిత్రమైన యజ్ఞయాగాదులకు ఆవుపేడనే ఉపయోగిస్తారు. ఆవుపేడ వాసన వలన మలేరియా సోకదు. అత్యంత వేడిని నియంత్రించే శక్తి కూడా ఆవు పేడలో ఉంది. ఇంటిని ఊడ్చినపుడూ, వాకిలి ఊడ్చినపుడు అనేక రోగక్రిములు గాలిలోకి లేస్తాయి. అలాంటి వాటికి విరుగుడుగా ఆవుపేడను నీటిలో కలిపి కళ్ళాపు చల్లటం, అలకటం ద్వారా వాటిని నివారించవచ్చు.

### 351. స్త్రీకి శ్రీమంతము చేస్తే పుత్రుడు జన్మిస్తాడా?

పున్నామ నరకం నుంచి రక్షించువాడు పుత్రుడు. తల్లీ, తండ్రికి ఉత్తర క్రియలు చేయుటకై వృద్ధాప్యంలో చూసుకోవటం కొరకు పుత్రుడ్ని కనాలి. తొలి పుత్రసంతానం కోసం స్త్రీ గర్భవతి అవగానే పుష్యమీ నక్షత్రాన సీమంతము చేస్తారు.

### 352. ఈశాన్యములో దేవుడ్ని పెట్టే వీలు లేకపోతే ఏం చేయాలి ?

మారిన జీవన పరిణామాల దృష్ట్యా, ఉద్యోగ నిర్వహణల వల్ల ఎక్కడెక్కడికో వెళ్ళవల్సి వస్తుంది. అటువంటప్పుడు భగవంతుడ్ని ఈశాన్య దిక్కున పెట్టుకునే సదుపాయం ఉండకపోవచ్చు. అలాంటప్పుడు దేవుడు పశ్చిమాన్ని చూసేలా ఏర్పాటు చేసుకోవాలి.

### 353. ఏ సంఖ్యకు ఎవరు అధిపతి?

ఒకటవ సంఖ్యకు సూర్యగ్రహమూ, రెండవ సంఖ్యకు చంద్రుడూ, మూడవ సంఖ్యకు గురువూ, నాల్గవ సంఖ్యకు రాహువూ, అయిదవ సంఖ్యకు బుధగ్రహమూ, ఆరవ సంఖ్యకు శుక్రుడూ, ఏడవ సంఖ్యకు కేతువు ఏనిమిదో సంఖ్యకు శనీ, తొమ్మిదో సంఖ్యకు కుజుడు అధిపతులు.

### 354. పారిజాత పూలతో పూజ చేయవచ్చా?

కొంతమంది పారిజాత పూలతో పూజ చేయకూడదని... భగవంతునికి ఇష్టం లేని పూలని చెబుతుంటారు. తెలిసీ తెలియక చేసిన ప్రసంగాలను





పట్టించుకోనక్కర్లేదు. పారిజాత పూలతో భగవంతునికి ప్రీతికరంగా పూజ చేయవచ్చును.

### 355. మహాభారతాన్ని వినాయకుడు ఎక్కడ వ్రాశాడు?

వ్యాసుడు చెబుతుంటే వినాయకుడు ఘంటం ఎత్తకుండా వ్రాసింది, మన భారతదేశ చివర గ్రామమైన 'మాన'లో. హిమాలయాల్లో ఉంది ఈ గ్రామం. బదరీనాథ్ వెళ్ళిన వారు తప్పని సరిగా ఈ గ్రామాన్ని దర్శిస్తారు.

'జయ' కావ్యమనే మహాభారతాన్ని వినాయకుడు వ్యాసుని పలుకు ప్రకారం రాస్తుంటే ప్రక్కన ప్రవహిస్తున్న సరస్వతీ నది తన పరుగుల ఉరుకల శబ్దాలకి అంతరాయం కలగకూడదని మౌనం వహించి ప్రవహిస్తుంది.

ఆ అద్భుతాన్ని ఇప్పుడు కూడా బదరీనాథ్ వెళ్లిన వారు చూడవచ్చు. నింపాదిగా ఆగి గమనిస్తే సరస్వతీ నది భారతాన్ని రాసిన చోట శబ్దం లేకుండా ప్రవహిస్తుంది. ఆ ప్రదేశాన్ని దాటగానే మళ్ళీ గలగలలు.

### 356. ఎలాంటి పురుషుడ్ని వివాహమాడాలి?

ధైర్యమున్నవాడూ, మంచిగుణములు కలవాడూ, శుభలక్షణ సంపన్నుడూ, విద్యాపారంగతుడూ, తనకన్నా పొడవైన వాడూ, సంపూర్ణ ఆరోగ్యవంతుడూ, స్త్రీ వ్యసనములూ, జూదవ్యసనములూ లేనివాడూ, మద్యాన్ని ఇష్టపడని వాడూ, అందగాడూ, పలువరుస చక్కగా ఉన్నవాడూ, తల మీద నిండైన జుట్టు కలవాడూ అయిన పురుషుడ్ని స్త్రీ కోరుకోవాలి.

### 357. బ్రహ్మ ముడి బ్రహ్మదేముడే వేస్తాడా?

వివాహ సమయంలో వధూవరులిరువురి చెంగులకూ ముడి వేసి ఆశీర్వదిస్తారు. ఈ ముడి సాక్షత్తు బ్రహ్మదేవుడే మంత్రోచ్చారణతో వేస్తాడు. జీవితాంతము ఇరువురూ కలిసి మెలిసి ఉండాలని బ్రహ్మదేవుడిచే వెయ్యబడిన ముడే బ్రహ్మముడి. ఒకరి చేయి ఒకరు పట్టుకొని అగ్ని చుట్టూ ప్రదక్షిణం చేసి కలిసి మెలిసి సుఖంగా ఉంటామని ముమ్మారు ప్రదక్షిణ చేయటమే పాణిగ్రహణము.

### 358. వసెక్కువ పోశారంటారు?

సంస్కృతంలో 'వచ' లేదా 'ఉపగ్రంధ' అంటారు. తేమగా ఉన్న ప్రదేశంలో పెరుగుతుంది. పసితనంలో తొందరగా మాటలు రావటానికి పసకొమ్మును అరగ దీసి తేనెతో కలిపి పోస్తారు. అలాపోస్తే వాక్కు స్పష్టంగా

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

చక్కగా త్వరగా వస్తుందని అలా పోస్తారు. సమతూకంగా వసపొయ్యకుండా ఎక్కువ పోస్తే గలగల మాట్లాడ తారు. అలాంటి వాళ్ళని సంబోధించి వీడికి వసెక్కువ పోశారంటారు. ఆయుర్వేదంలో వాపును కూడా ఈ వస చెట్టు వేళ్ళ రసం తగ్గిస్తుందని ఉన్నది.

### 359. చతుఃషష్టి కళలు అనగా ఏవి?

64కళలుఅని అనేక సంధర్భాల్లో వినిఉంటారు. ఆ64కళలు ఇవి

1.అష్టాదశలిపిబోధ 2. తల్లేఖనము 3. శీఘ్రవాచనము 4. బహువిధ భాషా జ్ఞానము 5. తత్తత్ భాషా కవితా కథనము 6. ద్యూతము 7. ఋగ్వేదము 8. యజుర్వేదము. 9. సామవేదము 13. ధనుర్వేదము 14. గాంధర్వవేదము 15. శిక్ష 16 వ్యాకరణము 17. ఛందస్సు 18. నిరుక్తము 19. జ్యోతిషము 20, కల్పము 21. మీమాంసా 22. న్యాయశాస్త్రము 23. పురాణము 24 ధర్మశాస్త్రము 25. రాజ్యాంగము 26. పంచాంగము 27. తంత్రము 28. పురాణకథనము 29. స్మృతి 30. కావ్యములు 31. అలంకారము 32. నాటకము 33. శాంతి 34. విశ్వ 35. ఆకర్షణ 36. విద్వేష 37. ఉచ్చాటన 38. మారణ 39. గతి 40. జల 41. అగ్ని 42. దృష్టి 43. ఆయుధ 44. వాక్ 45. రేతస్ 46. గజ 47. హయ 48. రథ 49. శిక్షణ 50 సాముద్రిక 51. మల్లయుద్ధము 52. పాచకత్వము 53. గారుడవిద్య 54 సుషిన 55. అనర్ధ 56. ఘనా 57. ఇంద్రజాల 58. నృత్య 59. గీత 60. రసవాద 61. రత్నపరిక్ష 62. చౌర్య 63. ధాతుపరిక్ష 64. అదృశ్యత్వము.

### 360. కటిక నేల మీద పెట్టకూడనివి?

బంగారమూ, రత్నములూ, దీపము, శివలింగము, శంఖమూ, సాలగ్రామమూ, జలమూ, పుష్పమూ, తులసిదళాలూ, జపమాలలూ, కర్పూరమూ, రుద్రాక్షమాలా, కుశమూలములూ (గరిక), పుస్తకమూ, యజ్ఞోపవీతమూ, ఆవుపంచితమూ, నెయ్యీ, తమలపాకులూ, పండ్లూ, వీటిని నేలపై ఉంచరాదు.

### 361. ఆశ్వీయుజ మాసములో ఏ ఏ పండుగలు ఉన్నాయి ?

ఆశ్వీయుజ మాస ప్రారంభంలో శరన్నవరాత్రులు ప్రారంభము. నవరాత్రి పూజలను 9 రోజులు ఘనంగా జరుపుకుంటారు. దుర్గాష్టమీ పండుగల్లో కల్ల పెద్ద పండుగ. అమ్మవారిని 9 రోజులూ 9 రూపాలతో





భక్తితో వైభోవపేతంగా పూజిస్తారు. విజయ దశమీ, దసరా అని పిలిచే ఈ పండుగ నెల అంతా భక్తిమయం, శక్తిమయం.

### 362. ఆశ్వీయుజ బహుళ చతుర్దశి

ఈ పండుగే పిల్లలకు అసలు సిసలైన ఆనందోత్సాహాల పండుగ. శ్రీమహలక్ష్మిని కొలిచి, ప్రసన్నం చేసుకునే దివ్యమైనపండుగ. పాతాళం నుంచి బలిచక్రవర్తి ఈరోజే భూమిపైకి వచ్చాడనీ, అదేరోజు వామనావ తారంలో బలిని పాతాళంలోకి అణగదొక్కాడనీ పురాణాలు చెబుతున్నాయి. ఈ రోజున తిలతైలంతో తలస్నానం చేస్తారు. దానికి కారణము దీపావళీ పర్వ పవిత్ర రోజుల్లో లక్ష్మీదేవి తిలతైలంలో ఉంటుంది. నరకచతుర్దశి రోజున నువ్వులతో చేసిన వంటకాలు ఇష్టంగా తింటారు. నరక చతుర్దశి పండుగకి వెనకున్న గాథ ఏమిటంటే పూర్వం నరకాసురుడు ఇంద్రుడి తల్లి అదితి కర్ణాభరణాలనూ, దేవతా పుత్రికలు పదహారు వేలమందినీ బలవంతంగా తీసుకు వెళ్తాడు. అది తెలుసుకున్న సత్యభామ తన భర్త శ్రీకృష్ణుడితో కలిసి నరకాసురుని పైకి యుద్ధానికి వెళ్ళి శ్రీకృష్ణుడిచే చంపిస్తుంది. దానికి ప్రతీకగా నరక చతుర్దశిని ప్రజలు ఆనందంగా జరుపుకుంటారు. దీపావళిరోజు అమావాస్య. ఆ రోజున లక్ష్మీపూజ విశేషంగా చేస్తారు.

### 363. తీర్థం సేవించిన తర్వాత చేతిని తలకు రాసుకోవచ్చా?

తీర్థం తీసుకోవటానికి చేతిని గోకర్ణభంగిమలో ఉంచి తీసుకుం టాము. ఆపై అనాలోచితంగా మనం ఆ చేతిని తలపై రాసుకుంటాము. అలా చెయ్యటం తగదు.

తీర్థం పంచామృతంతో చేస్తారు. అందులో తేనె, పంచాదార వంటివి జుట్టుకు మంచివికాదు. అలాగే తులసీ తీర్థం తీసుకొన్నా తలపై రాసుకోకూడదు. తీర్థం తీసుకోవటంవల్ల చేయి ఎంగిలవుతుంది. ఎంగిలి చేతిని తలపై రాసుకోకూడదు.

ఏ తీర్థం తీసుకున్నా చేతిని సాధారణ నీటితో శుభ్రం చేసుకోవాలి. వైష్ణవ సంప్రదాయంలో గంగ జలంతో అభిషేకం చేసిన తీర్థాన్ని మాత్రమే తల వెనుక రాసుకోవాలిని ఉంది.

### 364. చైత్రమాసంలో ఏ పండుగలొస్తాయి?

సంవత్సరారంభము అనగా ఉగాది. ఈ రోజున బ్రహ్మదేవుణ్ని ప్రార్థిస్తే సకల శుభాలు జరుగుతాయి. బ్రహ్మను ప్రార్థించాల్సిన ఏకైక

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

పండుగ ఈ ఉగాదే. డోలా గౌరీ వ్రతమూ, సౌభాగ్య శయన వ్రతాలు పాటించాలి. శ్రీమహావిష్ణువు మత్స్యావతారమెత్తి సోముకు డ్నించి వేదాలను రక్షించి బ్రహ్మకిచ్చిన ఈ ఉగాది.

చైత్రశుద్ధనవమి శ్రీరామనవమి. సీతారాముల కళ్యాణమూ, శ్రీరాముడు రావణుడ్ని వధించి లంక నుంచి అయోధ్యకు వచ్చిన రోజూ ఇదే. శ్రీరామనవమి రోజు ఉపవాసాదులు చేయుట శుభం. ఈ పండుగ రోజు రఘుకుల తిలకుడైన శ్రీరామచంద్రుడి ప్రతిమను అదియును ఎడమ తొడ మీద సీతాదేవి ఉన్న ప్రతిమను దానం చేయుటము శుభకరం.

### 365. పూజ సమయాల్లో చెయ్యకూడనివి, చెయ్యాల్సినవి

సూర్యుడు ఉదయించడానికి ముందే లేవాలి. అస్తమించిన తర్వాత నిదురించాలి. నోములూ, వ్రతాలూ చేసే రోజు తలకు నూనె పెట్టడం, దువ్వటం చేయరాదు. శని, ఆది, మంగళవారలలో కొత్త వస్తువుని కొనరాదు. స్నానం చెయ్యకుండా పొయ్యి వెలిగించవద్దు. శుక్రవారాలు ప్రయాణాలు చెయ్యరాదు. తొలుతగా ముందు మీరు బొట్టు పెట్టుకొని ఆపై ఇతరులకు బొట్టు పెట్టాలి. పూజ సమయరోజుల్లో మంచి నీళ్ళు, మజ్జిగా మీ చేతులతో వడ్డించొద్దు. ఇతరుల నుంచి ఉప్పు, నూనె తీసుకోరాదు. గడపని కాలితో తొక్కకుండా జాగ్రత్త వహించండి. గడప బయట నుంచి లోపల వస్తువుని బయటకు తీసుకురారాదు. అలాగే బయట వస్తువులని గడప అవతల పెట్టరాదు. రాత్రి భోజనంలో పెరుగుని ఎట్టి పరిస్థితులలో తీసుకోవద్దు.

### 366. కుక్కలు మూలిగినా, ఏడ్చినా ఆపద సంభవిస్తున్నట్టా?

కుక్కలు మూలిగినా, ఏడ్చినా యమధర్మరాజు వస్తున్నట్లు భావిస్తారు. కుక్కలు వాసన చూసి ఎలా చోరులని గుర్తిస్తాయో, అలానే మానవులకి కనిపించని అనేక దివ్య, దుష్టశక్తులు కుక్కలకి కన్పిస్తాయి. కుక్కలు అలా ప్రవర్తించినప్పుడు చాలాసార్లు చాల చోట్ల మరణాలు సంభవించాయి. ప్రకృతిని, భగవంతుడి ఉనికిని తెలుసుకోవటానికి ఎన్ని జన్మలైనా చాలవు.

కానీ పశు... పక్ష్యాదుల్లో కొన్ని అతీత శక్తులున్నాయి. మానవుడు గుర్తించలేని వాటిని ఎన్నో అవి గుర్తిస్తాయి. చెప్పటానికి కుక్కలకి మాట లేదు. ఆ మాటే కుక్కలకి ఉంటే ఈ భూమ్మీద మానవుడు ఉండేవాడు కాదు. కుక్కలకే కాదు ఏ జీవికి మాట్లాడే శక్తి ఉన్నా మనిషి ఈ భూమిని





శాసించలేడు. అందుకే భగవంతుడు అన్నీ జంతువులకంటే తక్కువ అర్హతలతో మనిషిని పుట్టించి 'మాట' అనేది ఇచ్చి అందరికంటే ఎక్కువ చేశాడు.

### 367. మార్గశిరమాసములో ఏ పండుగలు వస్తాయి ?

మార్గశిర మాసములో దత్తాత్రేయ జయింతి. మార్గశిర పౌర్ణమి నాడే దత్తాత్రేయ జయంతి. తనకు తానుగా పుత్రరూపాన్ని ఇచ్చి దత్త నామధేయుడయ్యాడు శ్రీమహావిష్ణువు. ఈ నెలలోనే ధనుస్సంక్రాంతి. తిరుప్పావై పారాయణము ప్రారంభమయ్యే మంగళకరమైన రోజు. సూర్యుడు ధనురాశిలో ప్రవేశించే పుణ్యఘడియ అప్పటి నుంచే ధనుర్మాసం మొదలు.

### 368. పుష్కరాలు ఎలా ఏర్పడ్డాయి?

పుష్కరుడనే భక్తుడు మహేశ్వరుని గూర్చి ఘోర తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై ఏం వరం కావాలో కోరుకోమన్నాడు. అందుకు పుష్కరుడు. 'స్వామీ నదులన్నీ జీవులు చేసిన పాపాలు నిండిపోయాయి.

ఆ నదులని పునీతము చేయుటకై నీ జలమైన శరీరమును నా కిమ్ము, నీ స్పర్శతో నదులన్నీ పునీతమవుతాయని' కోరాడు. ఆ తర్వాత బృహస్పతి కూడా శివుని తనువుని పుష్కరుని వలే పొంది సర్వులకూ ఆహారము కావాలని తపము చేశాడు.

బృహస్పతి తపస్సుకు మెచ్చి శివుడు తనకిచ్చిన వరాన్ని బృహస్పతి కివ్వటానికి పుష్కరుడు వప్పుకోలేదు. ఆపై బ్రహ్మ గూర్చి గరుడు తపస్సు చేసి తన కోరిక తెలియచెప్పాడు. అప్పుడు బ్రహ్మపన్నెండు జీవనదులలో సంవత్సరానికొక్కసారి పన్నెండు రోజులు పుష్కరుడుండునట్టు, గరుడొక్క రాశిలో సంచారము బట్టి జరుగుతుందని చెప్పి ఇద్దర్నీ శాంతపరిచాడు.

పుష్కర స్నానంవల్ల, ఆహల్యను భంగం చేసిన దోషాన్ని ఇంద్రుడు పోగొట్టుకున్నాడు. బ్రహ్మ శిరస్సు ఖండించిన దోషం వలన పొందిన బ్రహ్మహత్యా పాపం నుంచి శివుడు విముక్తుడయ్యాడు.

### 369. పిల్లలు లేనివారు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని ఎందుకు పూజిస్తారు?

పార్వతీ పరమేశ్వరులను దర్శించటానికి ఎంతో మంది ఋషులు కైలాసానికి వచ్చారట. అందులో దిగంబర ఋషులూ ఉండటంతో సుబ్రహ్మ ణ్యేశ్వరస్వామి హేళనగా నవ్వాడు. దానికి పార్వతిదేవి కొడుకుని మంద

MOHAN PUBLICATIONS.COM

లించి, మర్మాంగాలు సృష్టివృద్ధి కోసం సృష్టించినవి, జాతికి జన్మస్థానాలని తెలియ చెప్పింది. తల్లి జ్ఞానబోధతో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి సర్పరూపం దాల్చాడు జీవకణాలు పాముల్లా ఉంటాయని మనకి తెలిసిందే. ఆ తర్వాతవాటికి అధిపతి అయ్యాడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, దానివల్లే జీవకణాల అధిపతియైన సుబ్రహ్మణ్యేశ్వరుని పూజిస్తే పిల్లలు పుట్టని దంపతులకు సంతానం కల్గుతుంది.

### 370. లలితా సహస్రనామం ఏ రోజు చదివితే ఎంత ఫలితం వస్తుంది?

ప్రతిరోజు లలితా సహస్రనామం చదవటంవలన మహాఫలితం వస్తుంది. అలా చదవటం వీలుకాని వారు ప్రతిశుక్రవారం లలితా స్తోత్రం చదవాలి. అలాగే పుణ్యఘడియల్లో ఈ స్తోత్రం చదివితే ఫలితం ఎన్నో రెట్లు ఎక్కువగా ఉంటుంది. అలాగే కుటుంబసభ్యుల జన్మ నక్షత్ర సమయాల్లో చదివితే కుటుంబశాంతి. పౌర్ణమి నాడు చంద్రుని చూస్తూ చదవటం వల్ల సాక్ష్యాత్తు లలితాదేవి ఎదురుగానే పఠించినట్టే. లలితాదేవికి కలువలూ, మారేడు దళాలు, తులసీదళాలూ, మల్లెపూవులూ ఎంతో ఇష్టం. అలాగే నైవేద్యంగా పాయసమూ, పులగమూ, చిత్రాన్నమూ, దానిమ్మ, బూడిద గుమ్మడికాయా ప్రీతి. దక్షిణా వృత శంఖము మొదలైనవన్నీ ప్రీతికరములు.

### 371. ఆబ్ధికమునాడు భోక్తలకు ఎలా వడ్డించాలి?

తొలుత అన్నాన్ని వడ్డించాలి. భోక్త కుడివైపుగా పప్పు వేసి ఆపై తీపి వడ్డించాలి. ఆజ్యపాత్ర ఉంచాలి. భోక్త ఎడమవైపు పూర్ణములూ, లేదా అలాంటి భక్షములుంచాలి.

అన్నాన్నీ, కూరలనీ, లవణమునీ గరిటెతో భోక్తకి వడ్డించాలి. పండ్లు వడ్డిస్తే వొలిచి వడ్డించాలి. భోక్త వద్దన కావల్సివస్తే సైగలతోనే చెప్పాలి. భోక్తలను ఒకరినొకరు తాకకుండా కూర్చోబెట్టాలి.

### 372. వివాహ సమయంలో పదహారు ఆజ్యహోమములకి అర్థమేమిటి?

తొలి హోమము వధువుని తొలుత పొందిన చంద్రునకు ఆహుతి దత్తము చేస్తారు. ఆపై గంధర్వునకూ, అగ్నిహోత్రునకూ ఆహుతి దత్తము చేస్తారు.

నాలుగో హోమము పితృగృహం నుంచి భర్త గృహముకు పోవుటకై కన్యకా దీక్షను వదలివేసినందుకు ఆపై హోమం పితృకులం వదలేసినట్టు భర్త కులాన్ని వదలకుండా ఉండేందుకు. ఆరవహోమము ఇంద్రునికై,





సౌభాగ్యవతిగా సుపుత్రవతిగా చేయమని. ఆపై ఏడో హోమము అగ్నిదేవుడి గూర్చి వధువుకి కలిగిన సంతానాన్ని మృత్యువు నుంచి సదా రక్షించమని వధువుకి భవిష్యత్తులో పుత్రశోకం కలగనీయవద్దని.

ఎనిమిదో అజ్యహోమం, కలిగిన సంతానానికి సంపూర్ణ ఆయుష్షు నిచ్చి ఈమెను సంతోషంగా ఉంచమని. తొమ్మిదో ఆజ్యహోమము శోకం దరిచేరకుండా, కన్నీరు కార్చకుండా భర్త, బిడ్డలనూ చూసుకుంటూ పరిపూర్ణ సంతోషం పొందాలని. పదవహోమము వధువు మెడను నింగీ, వాయు దేవుడు, ఊరువులనూ, ఎదను ఆశ్వనీదేవతలూ, పుట్టబోయే సంతానాన్ని భానుడూ, ధరించిన వస్త్రములను బృహస్పతీ, వెనుక భాగాన్ని దేవతలూ రక్షించాలని.

పదకొండవ ఆజ్యహోమము తెలిసీ తెలియక చేసిన పాపాలను క్షమించమని, వాటి నుంచి కలుగు దుఃఖమును దేవతలు పోగొట్టమని. పన్నెండవ హోమము వరుణదేవుడి కోసం, చల్లగా కాపాడమని, పదమూడో హోమము వరుణుడ్ని ప్రార్థించటము.... సమస్త కుటుంబ ఆయుర్ధాయ మును భంగపరచకుండా, కోపం లేకుండా ప్రార్ధనలని వినమని.

పధ్నాలుగో ఆజ్యహోమము అగ్ని హోత్రుడికై, వరుణ దేవుడి కోపాన్ని పోగొట్టి మమ్ముసంతోష పరచమని, మాపై శత్రువుల చర్యలను ఆదిలోనే వ్యర్థం చేయమని. పదిహేనవ హోమము దేవతలలో తొలి వాడయిన అగ్నిదేవుడ్ని మా యజ్ఞయాగాదులందు హవిస్సుభుజించి, ఆపై మా కోరికలు తీర్చమని. పదహారవ హోమము అగ్నిహోత్రునికి మనసా వాచా ధ్యానించి పూజించి నమస్కరించటము.

### 373. హనుమంతునకూ, సువర్చలకు పెళ్ళి జరిగిందా?

కొన్ని దేవాలయాల్లో హనుమంతునకు, సువర్చలకు ఏకంగా పెళ్ళి జరిపిస్తున్నారు. హనుమంతుడు బ్రహ్మచారి. సూర్యుని కుమార్తెపేరు సువర్చల. ఆంజనేయుడు సూర్యుని వద్ద విద్యాభ్యాసం చేశాడు. ఆ సమయం లోనే సువర్చల హనుమంతుని ఇష్టపడింది. విషయం తెలిసిన సూర్యుడు విద్యాభ్యాసం అనంతరం హనుమంతుని గురుదక్షిణగా సువర్చలను పరిణయమాడమన్నాడు. హనుమంతుడు కలియుగాంతం అయ్యే వరకూ ఆగమన్నాడు. ఆతర్వాత పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చాడు. కనుక సువర్చ లను హను మంతుడు కలియుగాంతం తర్వాతే వివాహం చేసుకుంటాడు.

MOHAN PUBLICATIONS.COM

## 374. నరకాసురుడ్ని వధించింది శ్రీకృష్ణుడా? సత్యభామా?

నరకాసురుణ్ణి వధించింది చాలామంది సత్యభామ అనుకుంటారు. తల్లి చేతిలో మరణమని అందుకే సత్యభామను యుద్ధానికి శ్రీకృష్ణుడు తీ తీసుకువచ్చేలా చేశాడని అనుకుంటారు. కానీ అది నిజం కాదు. సత్యభామే భూదేవి.

శ్రీమహాలక్ష్మి పొందుతున్న వైభోగాల గూర్చి చెప్పి, తన వ్యధల గూర్చి భూభారం గూర్చి చెబుతుంది. అప్పుడే శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవి ఇంత వరకూ ఎన్నిభోగాలు అనుభవించిందో అవన్నీ ఒక్క జన్మలోనే సత్యభామగా అనుభవిస్తావని చెబుతాడు. ఆ సమయంలోనే బిడ్డల కోసం అడుగుతుంది. అడిగిన సమయం విష ఘడియలు కావటంతో రాక్షసులు జన్మిస్తారనీ, తానే వార్ని చంపక తప్పదని చెబుతాడు.

భూదేవి కడుపు తీపితో నీవు సంహరించవద్దని 'వరం' శ్రీమహావిష్ణు వును అడుగుతుంది. అప్పుడు శ్రీమహావిష్ణువు నీకు నీవుగా చంపమన్న ప్పుడే సంహరిస్తానని అభయం ఇస్తాడు. నరకాసురుడిపై యుద్ధానికి వెళ్ళి నప్పుడు సత్యభామనుచూసి నరకుడు స్త్రీ అగ్నిలా మారే ప్రసంగము చేస్తాడు.

తల్లిలాంటి నాపైనే కారుకూతలు కూస్తాడా సంహరించు 'వెధవను' అని సత్యభామ అంటుంది. శ్రీకృష్ణుడు చక్రాయుధం వదిలేలా చేస్తుంది సత్యభామ.

## 375. బ్రహ్మ ఆయువు ఎంత?

ఒక కాల్పక కాలం బ్రహ్మదేవుడికి పగటికాలం. మరొక కాల్పకం రాత్రి. అలా పగలూ, రాత్రి కలిసిన అనేక కల్పకాల సమయమే బ్రహ్మదేవుడి ఆయువు. ఒక కల్పకాంతం ఆయ్యాకే మార్కండేయుడు వటపత్రశాయిని రావి ఆకుపై చూశాడు.

## 376. అన్నపూర్ణా దేవి శివునికెందుకు భిక్షం వేస్తుంది?

దక్షయజ్ఞము అయిన తరువాత సతీదేవి పార్వతిదేవిగా జన్మిస్తుంది. పెద్దయ్యాక ఈశ్వరుడ్ని పెళ్ళి చేసుకోవాలని కోరుకుంటుంది. పరమశివుడు హిమాలయాల్లో ఘోరతపస్సు చేస్తుంటాడు. ఆసంగతి తెలుసుకున్న పార్వతి హిమాలయాల్లో తపస్సు చేసుకుంటున్న ఈశ్వరుడ్ని ఆరాధిస్తుంది. దాంతో శివుడు చలించకపోవటంతో మన్మథుడు శివునిపై బాణాన్ని వేస్తాడు. దానితో ఈశ్వరుడు ఉగ్రుడవుతాడు. మూడో కన్నుతో మన్మథుడిని భస్మం చేస్తాడు.





ఆతరువాత మరో ప్రదేశానికి తపస్సు కోసం వెళతాడు. పార్వతికి ఏం చేయ్యాలో తెలియదు. అప్పుడు నారదుడు పార్వతిదేవితో చెపుతాడు.

'తల్లీ పరమశివుడు భిక్షాటనకై సంచారం చేస్తున్నాడు కావున నీవు పవిత్ర కాశీ క్షేత్రం వెళ్ళి ప్రతి భక్తునికి అన్నదానం చేస్తూ అన్నపూర్ణగా మన్ననలను అందుకో సరైనసమయంలో ఆ ఈశ్వరుడు నీ దగ్గరకి వస్తాడు భిక్ష అర్థిస్తాడు అని చెప్పాడు.

నారదుడు చెప్పినట్టు పార్వతీదేవి అన్నదానం చేస్తూ అన్నపూర్ణగా భక్తులతో ఆరాధింపబడుతున్న సమయంలో మహాశివుడు భిక్షకై అన్నపూర్ణ ముందుకు వచ్చాడు. పార్వతిదేవి భర్తను గుర్తుపట్టి చేయిపట్టుకుంది. దానితో మహాశివునికి సర్వమూ అర్థమై పార్వతీదేవియే అన్నపూర్ణ అని తెలుసుకుని ఆమెను స్వీకరించాడు. అప్పట్నించి పార్వతీ దేవి కాశీక్షేత్రంలో అన్నపూర్ణగా వెలిసింది. కాశీ విశ్వేశ్వరుడిగా మహాశివుడు వెలిశాడు.

## 377. ఏ నామాన్ని జపిస్తే ఏ ఫలితం వస్తుంది?

శ్రీరామ నామాన్ని జపిస్తే జయం
దామోదరుడ్ని జపిస్తే సకల బంధముల నుంచి విముక్తి
కేశవా అని స్మరిస్తే అనేక నేత్ర వ్యాధులు మటుమాయం.
నారాయణా అని జపిస్తే సకల సర్వ గ్రహాల దోషాలు సమశిపోతాయి.
మాధవా అని స్మరిస్తే అనుకున్న పనులు నెరవేరుతాయి.
ఆచ్చుతా అని స్మరిస్తే తీసుకున్న ఆహారమే ఔషధంగా పనిచేస్తుంది.
నరశింహా అని స్మరిస్తే మీ శత్రువులపై మీదే విజయం.
అదే నారసింహా అని స్మరిస్తే సకల భయాల నుంచి విముక్తి.
గోవిందా అని స్మరిస్తే సకల పాపాలనుంచి విముక్తి.
శ్రీమహాలక్ష్మి విష్ణువులనూ స్మరిస్తే సకల సంపదలతో
మీ గృహం కళకళలాడుతుంది.
సర్వేశ్వరా అని స్మరిస్తే చేపట్టిన కార్యం సత్వరమే జరుగుతుంది.
విజయం కలుగుతుంది.
జగన్మాతా అని స్మరిస్తే సకల అరిష్టాల నుంచి విముక్తి.
జగజ్జననీ అని స్మరిస్తే సర్వభయాలు తీరి ప్రశాంతత వస్తుంది.
కృష్ణ కృష్ణ అని స్మరిస్తే కష్టాలు తొలుగుతాయి.
శివ శివ అని స్మరిస్తే సకలమూ దరిచేరుతాయి.

MOHAN PUBLICATIONS.COM

### 378. కార్తీకమాసములో పండుగలు ఏమిటి?

కార్తీక మాసంలో శ్రీమహావిష్ణువును దామోదర నామంతో భక్తులు పూజిస్తారు. ఎవరికి వీలున్న పరిస్థితినిబట్టి వారు నదీ, నూతి స్నానమునూ భక్తితో ఆచరిస్తారు. కార్తీక మాసమును మించిన మాసం లేదని అత్రి మహర్షి తెలియజేసాడు. భక్తులు కార్తీక మాసములో కార్తీకమహాత్మ్యము చదువుతూ, పరమశివుడ్ని కొలుస్తూ ఉసిరిచెట్టుక్రింద పూజలూ, భోజనాలూ, వనాల్లో విహారములూ ఇలా అనేక ఆరాధనలుచేస్తూ పరమానందంగా గడుపుతారు. కార్తీక సోమవారాలు విధిగా ఆచరిస్తారు. కార్తీకదీపాలు వెలిగిస్తారు. ఈ కార్తీకమాసం చాలాశుభ ప్రదమైనది... స్త్రీలకు ఐదవతనమును వృద్ధి చేస్తుంది.

గుడులలో, తులసీ వనాల్లో స్త్రీలు విశేషంగా అరటి దొప్పల్లో నూనె పోసి దీపాలని వెలిగిస్తారు. ఉసిరికాయపై వత్తిని పెట్టి వెలిగించి విష్ణు దీవెనలను పొందుతారు. ఈ మాసంలో శివునికి అభిషేకాలు చేస్తారు.

### 379. మాఘమాసములో పండుగలు ఏమిటి ?

మాఘమాసంలో సుప్రభాతవేళ స్నానం చేస్తే కుటుంబానికంతటికీ ఎంతో శుభము. ఢుండి గణపతి పూజలు చేస్తారు. ఈశ్వరుడ్ని మల్లెపూలతో ఆరాధిస్తారు. కొన్ని ప్రాంతాల్లో 'శ్రీపంచమి' పండుగ జరుపుకుంటారు. సరస్వతీ దేవిని పూజిస్తారు. అలాగే రథసప్తమిని మాఘశుద్ధ సప్తమినాడు ఆచరిస్తారు. రథసప్తమి సూర్యభగవానుడ్ని పూజించే పండుగ. మాఘ శుద్ధ అష్టమి భీష్మాష్టమి. మహాశివుడ్ని అభిషేకాలతో, బిల్వపత్రాలతో తమ్మి పూలతో భక్తిగా పూజించే పండుగ. చతుర్ధశి రోజున మహాశివునికి ప్రీతి అయిన కాలమే మాసశివరాత్రి. మాఘబహుళ చతుర్ధశి అనగా అమావాస్యకు ముందు వచ్చేది కావున మహాశివరాత్రి. ఈ శివరాత్రి మంగళవారమొస్తే ఎంతో పుణ్యప్రదము. శివరాత్రి పగలు ఉపవాసము చేయాలి. రాత్రి జాగరణ చేయాలి. రుద్రాభిషేకం చేసేవారి హస్తం అమృతమయమే అవుతుంది.

### 380. ఆస్తీ, ఐశ్వర్యాలు నాలుగో తరంలో నిలబడవంటారు నిజమేనా?

తరతరాలూ తిన్నా తరగని ఆస్తి సంపాదించారని అంటూ ఉంటారు. కానీ నిజానికి ఆ తరతరాల సంపాదన నాలుగో తరం వచ్చేసరికి మాయమై పోతుంది. లక్ష్మిదేవి నిలకడలేనిదే అయినా, అలా ఆస్తి పోవటానికి కారణం, వారివారి పుత్రుల ప్రవర్తనే కారణం.





డబ్బు విలువ తెలియక, నమ్మాల్సిన వారిని నమ్మక, నమ్మకూడని వారిని నమ్మి మొత్తం పోగొట్టుకుంటారు. నడిరోడ్డు మీద మళ్ళీ కష్టపడుతుంటారు. ఇలా కావటానికి డబ్బున్నదనే ఆహమూ, మదమాత్సర్యాలే కారణము. ప్రేమలనూ, అప్యాయతలనూ, ధర్మాన్నీ, న్యాయాన్నీ మరచిపోవటము వలనే వారికా దుస్థితి పడుతుంది.

### 381. ఆషాఢమాసము పండులు లేమిటి?

జగన్నాథక్షేత్రంలో రథయాత్ర జరుగుతుంది. ఇదే మాసంలోనే తొలి ఏకాదశి. శ్రీమహావిష్ణువు శంఖగదా చక్రాలు ధరించి ఆదిశేషునిపై శయనించి ఉండగా శ్రీమహాలక్ష్మీదేవి పాదములు వత్తుతుండే ప్రతిమను పూజించాలి. ఈ రోజు నుంచే చాతుర్మాస్య వ్రతాన్ని పడతారు. వ్యాస పుర్ణిమా, శివ శయనోత్సవము ఈ మాసములోనే వస్తాయి.

### 382. గృహారంభము ఎప్పుడు ప్రారంభించకూడదు? ఎప్పుడు ప్రారంభించాలి?

వైశాఖమూ, ఫాల్గుణమూ, పుష్యమూ, శ్రావణమూ, ఈ మాసములందు ముగ్గువేయాలని బాదరాయణుడు శెలవిచ్చాడు. అదే నారదుడు ఫాల్గుణం, వైశాఖం, శ్రావణం, కార్తికములందు గృహ నిర్మాణమునకు శ్రీకారం చుట్టమని చెప్పాడు. ఈ మాసములలో గృహరంభము చేస్తే ధన, కనక, పుత్ర, ఆరోగ్యములు వృద్ధి చెందుతాయని తెలియజేశాడు. కారణ తంత్రంలో స్థిరమాసమూ, స్థిరరాశీ, స్థిర అంశము ఇందు గృహానికి శంకుస్థాపన చేయుట మంచిదని చెప్పాడు. ప్రధాన గృహనిర్మాణం పుష్య, ఆషాఢ మాసములలో వద్దని చెప్పాడు. దైవజ్ఞవల్లభుడు, చైత్రమాసంలో గృహారంభము శోకమనీ, వైశాఖంలో శుభమనీ, జ్యేష్ఠంలో మహాభయంకర శోకమనీ, ఆషాఢంలో పశువుల క్షీణతనీ, శ్రావణము ధనకారకమనీ, భాద్రపదము దరిద్రమనీ, ఆశ్వీయుజము గొడవలనీ, కార్తీకము భృత్యనాశనమనీ, మార్గశిరము ధనప్రాప్తిఅనీ, పుష్యం లక్ష్మీప్రాప్తిఅనీ మాఘమాసము అగ్ని భయమనీ ఫాల్గుణం సకల ఐశ్వర్యప్రాప్తి అని శెలవిచ్చాడు.

### 383. దేవుని తీర్థం ఎంత ఆరోగ్యము?

భగవంతుడ్ని దర్శించి తీసుకునే తీర్థంలో ఎన్నో ఆరోగ్య సుగుణాలుంటాయి. శ్రీ గంధం, తులసీ, పచ్చ కర్పూరమూ, కేసరి మొదలగు వాటిని భగవంతుని తీర్థంలో కలుపుతారు. ఈ తీర్థం క్రిమిసంహారకంతో పాటు, రోగనివారక గుణం కలిగి ఉంటుంది. అందుకే భగవంతుడ్ని దర్శించాక తీర్థం తీసుకుంటే ఆధ్యాత్మిక భావనతోపాటు ఆరోగ్యం కూడా కలుగుతుంది.

MOHAN PUBLICATIONS.COM

**384. ఫాల్గుణమాసములో వచ్చే పండుగలు ఏమిటి ?**

ఫాల్గుణ మాసం విష్ణువుకెంతో ప్రీతికరమైనది. ఈ మాసంలో శ్రీ మహావిష్ణువుకు క్షీరాన్ని నివేదించే ప్రసాదంగా స్వీకరించే వ్రతం ఆచరిస్తారు. అలాగే పుత్ర గణపతివ్రతం చేయటం ద్వారా పుత్రప్రాప్తి కలుగుతుందని శాస్త్రాలు చెబుతున్నాయి.

సూర్యుడు మీనరాశిలో ప్రవేశించే సమయంలో చేసే పూజలూ, జపాలు ఎంతో ఫలితాన్నిస్తాయి. ఫాల్గుణ పౌర్ణమి రోజున హోళీ పండుగ చేస్తారు. 'హోళికా' అనే శక్తి దేవతను ఆరాధిస్తారు. శ్రీకృష్ణుడ్ని ఉయ్యాలలో వేసి 'డోలోత్సవం' చేస్తారు. పరమశివుడు తన మూడో కన్ను తెరిచి కాముడ్ని దహించింది ఫాల్గుణ పౌర్ణమి రోజే. రంగు నీళ్ళును చల్లుకుని ఆనందించే వసంతోత్సవమూ ఈ మాసంలోనే.

**385. జ్యేష్ఠమాసంలో వచ్చే పండుగలు ఏమిటి ?**

సూర్యుడు మిధునరాశిలో ప్రవేశిస్తాడు. సంక్రమణ ప్రవేశమునకు ముందు పదహారు ఘడియలు పుణ్యకాలం. గంగాదేవిని భగీరథుడు నచ్చచెప్పి భూలోకానికి తెచ్చిన మాసము. ఈ మాసంలోనే వట సావిత్రి వ్రతాన్ని స్త్రీలు సౌభాగ్యము కోసం ఆచరిస్తారు. ఈ వ్రతంలో వట వృక్షాన్ని పూజిస్తారు. త్రిమూర్తుల ప్రతిరూపమే వటవృక్షము. వేళ్ళు బ్రహ్మ, కాండము విష్ణువూ, కొమ్మలు, శివుడూ. అలాగే జ్యేష్ఠ పౌర్ణమి, ఏరువాక పున్నమీ వస్తాయి. వర్షాకాల ప్రారంభమాసము.

**386. అమృతాన్ని దేవతలకి మాత్రమే పంచి పెట్టడం న్యాయమేనా?**

క్షీరసాగర మధనంలో ధన్వంతరి అమృత కలశముతో ప్రత్యక్షమవ్వ గానే రాక్షసులు పరుగున వెళ్ళి, ధన్వంతరి హస్తాల్లోంచి అమృతాన్ని బలవంతంగా లాక్కొని తమ నిజస్థానాలకి వెళ్ళిపోయారు.

ఇద్దరు కలిసి పనిచేసినప్పుడు ఫలితం సరిసమానంగా ఉండాలని శ్రీమహావిష్ణువ చెప్పినా వినలేదు. ధన్వంతరిని గౌరవించలేదు.

తప్పనిసరి పరిస్థితుల్లో శ్రీమహావిష్ణువు మోహినీ అవతారం ఎత్తి రాక్షసులకు మోహం కల్గించాడు. అమృతాన్ని వదిలి మోహిని వెంటపడ్డారు.

పెద్దలను గౌరవించక, మాటకు కట్టుబడక, అధర్మంగా ప్రవర్తించి అమృతాన్ని తెచ్చుకున్నా, స్త్రీ వ్యామోహంతో అమృతాన్ని పోగొట్టుకున్నారు.





అందుకే వారు రాక్షసులయ్యారు. అధర్మంగా అమృతాన్ని అపహరించి తామొక్కరే చిరంజీవులవ్వాలన్న స్వార్థమే రాక్షసులకి శాపమయ్యింది. అమృతం దూరమయ్యింది.

**387. తెలుగు నెలలకి ఆ పేర్లేలా వచ్చాయి?**

చిత్తా నక్షత్రములో పౌర్ణమి రావటం వల్ల చైత్ర మాసమనీ, విశాఖ నక్షత్రములో పౌర్ణమి రావటంవల్ల వైశాఖమాసమనీ, జ్యేష్ఠానక్షత్రంలో పున్నమి చంద్రుడు రావటంవల్ల జ్యేష్ఠమాసమనీ, పూర్వషాఢ నక్షత్రంలో పౌర్ణమి రావటంతో ఆషాఢమనీ, శ్రవణంలో పౌర్ణమి రావటంవల్ల భాద్రపద మాసమనీ, అలాగే అశ్వనీ, పుష్యమీ నక్షత్రాల్లో పౌర్ణమి రావటంవల్ల కార్తీక, పుష్యమాసములనీ మఖ నక్షత్రంలో పౌర్ణమి రావటం వల్ల మాఘమాసమనీ, పూర్వఫల్గుణి నక్షత్రంలో పౌర్ణమి రావటంవల్ల ఫాల్గుణ మాసమని మన పూర్వీకులైన మహాఋషులు నామధేయములేర్పరిచారు.

**388. చిన్ముద్ర అంటే ఏమిటి?**

మీ బొటనవ్రేలుని చూపుడు వ్రేలుచివరలతో మిగతామూడు వ్రేళ్ళను నిటరుగాఉంచటమే చిన్ముద్ర. ధ్యానం,తపస్సు సమయాల్లో మహోత్తరమైన శక్తి మీ నుంచి బయటకు ప్రసరించకుండా ఈ ముద్ర నియంత్రిస్తుంది.

**389. వైశాఖ మాసంలో ఏ పండుగలొస్తాయి?**

ఈ వైశాఖ మాసంలో పుణ్య తీర్థాలలో స్నానం పుణ్య ఫలితం వస్తుంది. వైశాఖంలో సూర్యుడు మేషరాశి సంక్రమణంలో ఉండగా ప్రాతః స్నానం చేస్తే అద్భుత ఫలితం కనబడుతుంది. వైశాఖంలో చలి వేంద్రాలు నిర్మిస్తే శ్రీమహావిష్ణువు, శివుడు, ప్రీతులవుతారు. ఈ మాసంలోనే అక్షయ తృతీయ వస్తుంది.

పరుశురాముని జయంతీ ఈ వైశాఖ మాసంలోనే! వైశాఖ శుద్ధ సప్తమినాడే గంగాదేవి జన్మించిది. హనుమజ్జయింతీ, నృసింహ జయంతీ ఈ మాసంలోనే! వైశాఖశుద్ధ చతుర్దశినాడు సాయం సమయమున హిరణ్యకశిపుని చంపేందుకు శ్రీ మహావిష్ణువు ఉగ్రనరశింహుడై అవిర్భవించాడు.

**390. శ్రావణమాసములో వచ్చే పండుగలు ఏమిటి ?**

ఈ మాసంలో నదీ స్నానంచేయరాదు. నదులన్నీ రజస్వలలు. సముద్రంలో కలిసే నదులకు పై నియమము వర్తించదు. నాగపంచమీ, దధి వ్రతమూ, వరలక్ష్మీ వ్రతమూ వస్తాయి.

వృషభాలు ఎవరికీ నిగ్రహింపవీలుగాక జనులను బాధించేవి. మిథిలా పాలకుడు "ఆ యెద్దులను పట్టిఉంచు, నగరంపై విడువవద్దు" అని కుంభ కుణ్ణి శాసించాడు. కాని అతడు కూడా వాటిని బంధింపలేక పోయాడు. ఎవరు ఆ యెద్దులను లొంగదీసుకొంటారో, వారికి తన కుమార్తెనిచ్చి పెండ్లి చేస్తానని కుంభకుడు ప్రకటించాడు. శ్రీకృష్ణుడు వచ్చి ఆ వృషభాలను నిర్జించి నీలను పరిణయం చేసుకొన్నాడు.

### 427. షోడశ గణపతులలో లక్ష్మిగణపతి ఎన్నోవాడు? లక్ష్మిగణపతి ఎలా ఉంటాడు ?

ముద్గల పురాణంలో గణపతి స్వరూపాలు ముప్పది రెండు విధాలుగా పేర్కొనబడి వున్నాయి. అందులో షోడశగణపతులు ప్రసిద్ధమైనవారు.

గణేశషోడశం నామప్రయతః ప్రాతరుత్థితః
సంస్మరేత్ సర్వకుశలం స ప్రయాతి స సంశయః

అన్నట్లు ప్రాతఃకాలంలో లేచి పదునారు విధాల గణేశులను స్మరించాలి. అలా స్మరించే వాడు సకలశుభాలు పొందుతాడు. ఈ పదునారు గణపతులలో పండ్రెండవ వాడు లక్ష్మీగణపతి. ఈ దేవుని స్వరూపం ఇలా వర్ణింపబడింది.

బిభ్రాణః శుకబీజపూరక మిళాన్మణిక్య కుంభాంకుశాన్
పాశం కల్పలతాంచ ఖడ్గవిలస, జ్జ్యోతిస్సుధానిర్ఘరః
శ్యామేనాత్త సరోరుహేణ సహితం దేవీ ద్వయం చాంతికే
గౌరాంగో వదాన హస్త సహితో లక్ష్మీగణేశోऽ వతాత్.

ఇది లక్ష్మీగణపతి ప్రార్థన శ్లోకము జపవిధిలో ఈ శ్లోకాన్ని ముఖ్యంగా పఠించాలి. దీని తాత్పర్యమిది."వరదముద్ర, అభయముద్ర, చిలుక, దానిమ్మ పండు, మాణిక్య కుంభం, అంకుశం, పాశం, కల్పలత, ఖడ్గం, అమృతం, పద్మాలు, రెండు తొడలపై ఇద్దరు దేవేరులు గల్గి గౌరవర్ణంతో వుండే లక్ష్మీగణపతి మమ్ము రక్షించుగాక!"

### 428. శ్రీ వేంకటేశ్వర జపం ఉన్నదా? ఏవిధముగా చేయాలి ?

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ రచించిన 'శ్రీవేంకటాచల మాహాత్మ్యం' అన్న గ్రంథంలోని తృతీయాశ్వాసంలో 177వ పుటలో శ్రీ వేంకటేశాష్టాక్షరీ మంత్రజపం ప్రస్తావింపబడింది. 'శ్రీవేంకటేశాయ నమః' అనేది అష్టాక్షరీ మంత్రం. దీన్ని ఓంకార పూర్వకంగా జపించవచ్చు. అంగన్యాస కరన్యాసాదులతో జపంచేసి ధ్యానం, ఆవాహనం, అర్ఘ్యం, పాద్యం ఇత్యాది



షోడశోపచారాలు కావించాలి. 108 సార్లు 'శ్రీవేంకటేశాయనమః' అని ఉచ్చరించి పాదాలు మొదలు శిరఃపర్యంతం సర్వాంగాలనూ అర్చించాలి. ధూపదీపనైవేద్యాదులు సమర్పించాలి. లక్షల జపముచేస్తే పునశ్చరణ అవుతుంది. కర్పూరనీరాజనం కావించి మంత్రపుష్ప ప్రదక్షిణ నమస్కారాలు సమర్పించాలి. ధ్యానంచేయాలి. అలా చేస్తే శ్రీవేంకటేశ్వరస్వామి అనుగ్రహం సిద్ధిస్తుంది. శ్రద్ధా భక్తులతో, గురువిశ్వాసంతో గురుముఖంగా మంత్రం గ్రహించి జపిస్తే కృతార్థత సిద్ధిస్తుంది. కేవల నామజపం కూడా తగిన ఫలం కల్గిస్తుంది.



### 429. ఉపపాండవులు పేర్లు ఏమిటి ?

ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి,శతానీకుడు, శ్రుతసేనుడు అనునవి ఉపపాండవుల పేర్లు. వీరు క్రమంగా ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు అనే పంచపాండవులకు ద్రౌపదియందు పుట్టినవారు. వీరు వివాహితులుకారు. వీరు భారత యుద్ధంలో పాల్గొన్నారు. వివాహం జరుగకముందే భారతయుద్ధం ముగిసిన తరువాత వీరురాత్రివేళ అశ్వత్థామచే నిహతులయ్యారు.

### 430. అష్టాదశ పీఠాలు, పంచారామములు, జ్యోతిర్లింగాలు ఎక్కడెక్కడ ఉన్నాయి ?

**అష్టాదశ పీఠాలు - వాటి స్థానాలు :**

1. మహాలక్ష్మి–కొల్హాపురం 2. మహాదేవి – జాలంధరం 3. కుబ్జ – కన్య కుబ్జం 4. సింహిక – సింహళం 5.మణికర్ణేశ్వరి–చక్రవాపి 6. పూర్ణికా దేవి – పూర్ణిక్షేత్రం 7. పార్వతి–పర్వతం 8. వింధ్యవాసినీ– వింధ్యాద్రి 9. మహాకాళేశ్వరి–మహాకాళక్షేత్రం 10.యోగావళి– యోగినీపురం 11. హైమావతి–హిమాచలం 12. పద్మవాసిని–శ్వేతదీపం 13. సుప్రభ–సుమను 14.భ్రమరాంబిక–శ్రీశైలం 15. అన్నపూర్ణ–కాశి 16. కాళరాత్రి–ధర్మస్థలం 17. శారద–శృంగేరి 18. లలిత–లంబిక.

### 431. వేదాలలో శ్రీవేంకటేశ్వరస్వామిని గురించిన ప్రసక్తి ఉన్నదా ?

శ్రీ వేంకటేశ్వరస్వామిని గురించిన ప్రసక్తి ఋగ్వేదంలో ఉన్నదని ఈ క్రింది మంత్రాన్ని ప్రమాణంగా ఉదాహరిస్తారు.

అరాయి కాణే వికటే గిరింగచ్ఛ సదాన్వే
శిరింబిరస్య.........(ఋక్సంహిత10–155–1)

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

దీనిభావం “ఓ నిర్ధనుడా ! (పరలోకజ్ఞానంలేని వాడా!) అంధుడా! (పరమార్థజ్ఞానం లేనివాడా!) క్లిష్టపరిస్థితి సంభవించినపుడు, దానవులు ఆక్ర మించినప్పుడు (లౌకికవిషయాలు అననుకూలంగా మారినప్పుడు) శ్రీనివాసునికొండకు పొమ్ము” నిర్ధనులు, కష్టదశలో ఉన్నవారు శ్రీవేంకటేశ్వర స్వామిని ఆపదమ్రొక్కులవానిగా భావించి సేవించడం నేటికీ కలదు. పై మంత్రానికి సాయణభాష్యంలో ఈఅర్థం చెప్పబడలేదు. అయినా అతిపురా తన కాలంనుండీ ఈ అర్థాన్ని కొందరు అంగీకరించినారని భవిష్యోత్తర పురాణంనుండి తెలుస్తున్నది. ఆ పురాణంలో ఈ వేదమంత్రానికి వేంకటాద్రి పరంగా అర్థం అంగీ కరింపబడింది.

ఏవం శ్రీకృష్ణరూపేణ క్రీడితో వేంకటాచలే,
అరాయికాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః
ఏవం వేదమయ స్సాక్షాత్ గిరీంద్రః పన్నగాచలః
ఛన్న వల్మీక దేహోఢ్యో వైకుంఠాదధికోహ్యభూత్. (భవి. 4-21,22

## 432. పంచారామాలు వాటి స్థానాలు ?

1. అమరారామము-అమరావతి 2. కుమారారామము-గునుపూడి 3. క్షీరారామము-పాలకొల్లు 4. భీమారామము-భీమవరం 5. దాక్షారామము- ద్రాక్షారామము.

## 433. నిగమము, ఆగమము అనగా నేమి? ప్రస్థానత్రయము అంటే ఏమిటి ?

‘నిగమము’ అనే పదానికి వేదం, అంగడివీథి, మార్గం, పట్టణం అని నాలుగు అర్థాలున్నాయి. నియతం గమ్యత ఇతి నిగమః అనగా నియతంగా పొందబడునది అని అర్థం.

‘ఆగమ’మనగా వివిధ దేవతలపూజా పద్ధతులను, వాటికి సంబంధిం చిన ఇతర విషయాలను తెలిపే శాస్త్రమని అర్థం. దేవతలు అధిక సంఖ్యలో ఉన్నారు. కాన వారి పూజలను వివరించే ఆగమాలు కూడా అధికసంఖ్యలో ఉన్నాయి. ఒకేమతంలో సంప్రదాయభేదాన్నిబట్టి పాంచరాత్రం, వైఖానసం మున్నగు ఆగమాలు వెలిశాయి. కామికము, యోగజము మొదలైన 28 ఆగమాలు రుద్రపరంగా ప్రసిద్ధి పొందినవి కలవు. ‘ఆగమం’అంటే రాక అని కూడా అర్థం. ప్రస్థానత్రయం అనగా మూడు ప్రస్థానాలు అని అర్థం. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత అనేవి ప్రస్థానత్రయంగా ప్రసిద్ధి





పొందాయి. ఇందులో జీవుడు, దేవుడు, ప్రకృతి, ఈ మూడింటికి చెందిన స్వరూప స్వభావాలు వివరింపబడివున్నాయి.

## 434. శ్రీరాముని తరువాత లవకుశల వంశం ఉండినదా? అంతరించి పోయినదా ?

శ్రీరాముని తరువాత లవకుశల వంశం అంతరించలేదు. కుశావతీ నగరానికి అధిపతిగా ఉండిన కుశుడు అయోధ్యకు తిరిగివచ్చాడు. లవుడు శరావతీ నగరానికి పాలకుడుగా పరిపాలన సాగించాడు. కుశుడు కుముదుని పుత్రిక అయిన కుముద్వతిని పరిణయమాడాడు. అతనికి ‘అతిథి’ అనే కుమారుడు జన్మించాడు. ఆపై యించుమించు 20తరాల వారు వారి వంశంలో జన్మించి రాజ్యం చేసినట్లు మహాకవి కాళిదాసు రఘువంశంలో వర్ణించాడు. తదుపరి ఆ వంశానికి చెందిన అగ్నివర్ణుడు క్షయవ్యాధిగ్రస్తుడై చనిపోగా గర్భవతి అయిన అతనిభార్య పట్టాభిషిక్తురాలయినట్లు ఆ కావ్యం చివరిసర్గలో ఉన్నది. లవుని వివరాలక్కడ లేవు.

## 435. నవనారసింహ క్షేత్రాలు, పంచద్వారకల పేర్లు ఏమిటి?

నవ నారసింహక్షేత్రాలు అంటే తొమ్మిది నరసింహస్వామి క్షేత్రాలు అని అర్థం. వీటిని నిర్ణయించడంలో మూడు పక్షాలు ఉన్నాయి. వాటిని క్రమంగా ఈ క్రింద పేర్కొనడమయింది.

అ. 1. మంగళగిరి 2. అహోబలం 3. సింహాచలం 4. అంతర్వేది 5. వేదాద్రి 6. యాదవాద్రి 7. కదిరి 8. ఆకిరిపల్లి 9. నగరి.

ఆ. 1. కదిరి 2. వేంకటాద్రి 3. నగరి 4. వేదాద్రి 5. భార్గపూటు 6. మట్టెమళ్ళ 7. కానుగమాను 8. అహోబలం 9. కోరుకొండ.

ఇ. 1. అహోబలం 2. కదిరి 3. పెన్నాహోబలం 4. కోరుకొండ 5. సింహాచలం 6. వేదాద్రి 7. మంగళగిరి 9. సింగరాయకొండ 9. ధర్మపురి.

ఈ మూడు పక్షాలలోనూ అనేక క్షేత్రాలపేర్లు పునరుక్తమైన విషయం గమనార్హం.

ఇక పంచద్వారకలు : 1.గోమతి 2. భేటి 3. కాకడి 4. శ్రీనాథం 5. మోక్షద్వారక.

## 436. పంచమహాపాతకములు అంటే ఏమిటి ?

1. బంగారం దొంగిలించడం 2. సురాపానం 3. బ్రహ్మహత్య 4. గురుపత్నితో సంగమం 5.ఈ పాపాలుచేసినవారితో మైత్రి అనేవి

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

పంచమహాపాతకాలు. మరొక విధానాన్ననుసరించి 1. బ్రహ్మహత్య 2. భ్రూణహత్య 3. బాలహత్య 4. గోహత్య మరియు 5. స్త్రీహత్య అనేవి పంచమహాపాతకాలుగా పరిగణింపబడుతున్నాయి.

### 437. ప్రసాదం అంటే ఏమిటి? ప్రసాదాన్ని విక్రయించడం ధర్మమా?

ప్రసాదం అంటే అనుగ్రహం అని అర్థం. దేవాలయాలలో దేవునికి నివేదించిన భోజ్యపదార్థాలను గూడా భక్తులకిచ్చేటప్పుడు ప్రసాదం అంటారు. సాధారణ పరిస్థితులలో అయితే ప్రసాదాలను విక్రయించడం తగదు. కాని అసాధారణ పరిస్థితులలో ధర్మాధర్మాలు కొంత మార్పుకులోను కాక తప్పదు. వేలు, లక్షలసంఖ్యలో భక్తులు గుడికివచ్చి ప్రసాదం కావాలనీ, అదికూడా తమ బంధుమిత్రులకు పంచడానికి సైతం సరిపడేటట్లు ఎక్కువ పరిమాణంలో కావాలనీ కోరుకునేటప్పుడు కోట్లు వెచ్చించి ఉచితంగా ప్రసాదం పంచడం సాధ్యం కానిపని. అట్టి పరిస్థితులలో భక్తుల కోరిక మేరకు చేసే ప్రసాద విక్రయం ధర్మమనే భావించాలి.

### 438. జాంబవతి వివాహకథ, వినాయకచవితివ్రతకథ; నిజమేనా?

జాంబవతి జాంబవంతుని పుత్రిక, ఒకసారి శ్రీకృష్ణుడు కనిపించ కుండా పోయిన శ్యమంతకమణిని అన్వేషిస్తూ వెళ్ళి జాంబవంతుని గుహలో దాన్ని కనుగొన్నాడు. ఆ మణివిషయమై జాంబవంతునికీ, కృష్ణునికీ పోరు సంభవించింది. జాంబవంతుడు ఓడిపోయాడు. ఆపై అతడు తన పుత్రిక జాంబవతిని శ్రీకృష్ణునికిచ్చి పరిణయం చేశాడు. శ్యమంతకమణిని కట్నంగా ఇచ్చాడు. కృష్ణుడు జాంబవతీ సమేతంగా ద్వారకకు తిరిగివచ్చాడు. (వినాయకవ్రతకథ) ఈమె వివాహకథ మనకు వినాయకచవితి వ్రతకథలో వస్తుంది.

మొదట జాంబవతికి సంతానం కలుగలేదు. సంతతి అనుగ్రహించ మని ఆమెభర్తను ప్రార్థించింది. కృష్ణుడు ఉపమన్యుడు తపస్సు చేస్తున్న కొండకు వెళ్ళి అతని సలహా ప్రకారం అక్కడ శివుణ్ణిగూర్చి తీవ్రతపస్సు చేశాడు. ఆరునెలల తపస్సు తరువాత శివుడు ప్రత్యక్షమై కృష్ణుని భార్యలందరూ పదేసిమంది చొప్పున సంతానంకనేటట్లువరమిచ్చాడు. ఆరీతిగా జాంబవతికి పుట్టిన మొదటి సంతానమే సాంబుడు. యాదవకులాన్ని నశింపజేసిన ముసలం పుట్టడానికి ముఖ్యకారణం ఈ సాంబుడే.





### 439. కల్కి ఎవరికి ఎక్కడ జన్మిస్తాడు ?

శ్రీమహావిష్ణువుయొక్క పది అవతారాలలో కల్కి చివరి అవతారం. కలిని సంహరించుటకు అవతరించే విష్ణువే కల్కి.

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః।
రామో రామశ్చ రామశ్చ(కృష్ణశ్చ) బుద్ధః కల్కిరేవచ ॥

అన్న శ్లోకంలో చివరపేర్కొనబడిన అవతారమిది. కలియుగంలో లోకం మిక్కిలి కాలుష్యభూయిష్ఠమవుతుంది. ఆదుస్థితిని తొలగించడానికి కల్కి అవతరిస్తాడని పురాణాలు వివరిస్తున్నాయి. 'శంబళపురం'అనే జనపదంలో సుమతీ విష్ణుయశులనే దంపతుల కుమారుడై కల్కి అవతరిస్తాడట! పరశు రామునివద్ద విద్యనభ్యసించియుద్ధంలో నిపుణుడవుతాడు. ఇతని భక్తికిమెచ్చి శివుడు ఇతనికి కత్తినీ, గుర్రాన్నీ ప్రసాదిస్తాడు. ఆ గుర్రము నధిష్ఠించి కల్కి కలినీ, అతని పరివారాన్నీ హతమారుస్తాడు. ఇతని అవతారకృత్యం పూర్తి కాగానే మళ్ళీ కాలచక్రపరివర్తనంలో కృతయుగం మొదలవుతుంది.

### 440. పార్వతీదేవి యొక్క తొమ్మిది రూపాలు, పేర్లు ఏమిటి ?

దేవీనవరాత్రుల కాలంలో దుర్గాదేవిని తొమ్మిది దినాలు తొమ్మిది రూపాలతో అలంకరించి అర్చిస్తారు. అప్పుడు ఒక్కొకరోజు ఒక్కొక్క పేరుచొప్పున దేవికి తొమ్మిది పేర్లు వాడుకలో ఉంటాయి. వాటిక్రమమిది.

1. శైలపుత్రి : ఈమె వృషభవాహనం అధిష్ఠించి వుంటుంది. ఈమెకు రెండు చేతులుంటాయి. కుడిచేత త్రిశూలం,ఎడమచేత కమలం ధరించి వుంటుంది. అర్థచంద్రాభరణం శిరస్సుపై ఉంటుంది.

2. బ్రహ్మచారిణి : ఈమె జ్యోతి స్వరూపిణి. కుడిచేత జపమాల, ఎడమ చేత కమండలము ధరించివుంటుంది.

3. చంద్రఘంట : ఈమెకు పదిచేతులు, పలు అస్త్రలుధరించి స్వర్ణకాంతితో భాసిస్తూవుంటుంది. ఈమె వాహనం పులి.

4. కూష్మాండ : ఈమె అష్టభుజాలతో కమండలము, ధనుస్సు, బాణం, కమలం, అమృతకలశం, చక్రం,గద,జపమాల వీటిని పట్టుకొని వుంటుంది. వాహనంపులి.

5. స్కందమాత : ఈమెకు చతుర్భుజాలు,అభయముద్ర, రెండుచేతుల్లో కమలాలు కల్గివుంటుంది. శ్వేతవర్ణం కల్గి భాసిస్తుంది. వాహనం సింహం.

MOHAN PUBLICATIONS.COM

6. కాత్యాయిని : ఈమెకు నాల్గు భుజాలు, అభయముద్ర, వరముద్ర, ఖడ్గం,పద్మం ధరించి దివ్యతేజస్సుతోభాసిస్తూ సింహాన్నిఅధిష్ఠించి వుంటుంది.

7. కాళరాత్రి : ఈమె శరీరం కాంతి నలుపు, నేత్రాలు భీకరంగా వుంటాయి. నాల్గుభుజాలతో అభయవరముద్రలు, ఖడ్గంధరించి, గాడిద వాహనాన్ని కల్గివుంటుంది.

8. మహాగౌరి : నాల్గుభుజాలు కలిగి అభయవరముద్రలు త్రిశూలం, డమరుకం చేతబూని వుంటుంది. వాహనం వృషభం.

9. సిద్ధిధాత్రి : నాల్గుచేతులలో శంఖచక్రగదాకమలాలు ధరించి విద్యుత్తు లాగా విరాజమానురాలై వుంటుంది. సిద్ధులు, గంధర్వులు,యక్షులు మున్నగు వారు ఈమెను సేవిస్తుంటారు. కమలాసనంపై వుంటుంది.

పైన చెప్పిన రూపాలేకాక 1.బాలాత్రిపురసుందరి 2.లలిత 3. అన్నపూర్ణ 4. మహాలక్ష్మి 5. గాయత్రి 6. సరస్వతి 7. మహిషాసురమర్దని 8. దుర్గ 9. రాజరాజేశ్వరి అని తొమ్మిది రూపాలతో తొమ్మిది రోజులు దేవిని అర్చించే సంప్రదాయంకూడ ఉన్నది. ఈరూపాల కన్నింటికీ వేరు వేరుగా ప్రార్థనా శ్లోకాలు ప్రచారంలో ఉన్నాయి.

### 441. వినాయకుని వివాహం ఎలా జరిగినది ? భార్యలు ఎవరు ?

వినాయకుడు, కుమారస్వామి పార్వతీపరమేశ్వరుల పుత్రులు. యుక్త వయస్సు రాగానే ఇద్దరూ వివాహంకొరకై త్వరపడ్డారు. అప్పుడు శివుడు "మీ యిద్దరిలో ఎవరు మొత్తం ప్రపంచం చుట్టూ తిరిగిముందు వస్తారో వారికిముందు పెండ్లిచేస్తాము అనిచెప్పాడు. కుమారస్వామి తన వాహనమైన నెమలి నెక్కి విశ్వంచుట్టి రావటానికి పోయాడు. కాని వినాయకు డలా చేయలేక పోయాడు. ఒక్కక్షణం ఆలోచించి అతడు తన తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరుల చుట్టూ ప్రదక్షిణంగా తిరిగాడు. ఎందుకిలా చేశావు అని ప్రశ్నించగా ప్రపంచమంతా మీలోనే ఉంది. మీకు ప్రదక్షిణంచేస్తే విశ్వానికి ప్రదక్షిణం చేసినట్లే కదా" అని సమాధానం చెప్పాడు.

అందుకుసంతోషించి సిద్ధి,బుద్ధి అనే ఇరువురు కన్యలనిచ్చి తల్లిదండ్రులు వినాయకునికి ముందుగా వివాహం చేశారు.

### 442. బేడి ఆంజనేయస్వామి అనగా ఎవరు ? ఆయనకు ఎందుకు సంకెళ్లు వేశారు ?

శ్రీ వేంకటేశ్వరాలయానికి ఎదురుగా సన్నిధివీధిలో స్వామికి అభిముఖంగా అంజలిబద్ధుడై ఉన్న ఆంజనేయుడే బేడిఆంజనేయస్వామి. కాళ్లకు,





చేతులకు బేడీలు తగిలించిన మూర్తిగాన ఈయనకు ఆ పేరు వచ్చింది. ఆంజనేయుడు అంజనాదేవి పుత్రుడు. తిరుమలలో తపస్సు చేసి ఆమె ఈ కుమారుని కన్నది. బాల్యంలో కోతిచేష్టలు, అల్లరిపనులు చేస్తూ తిరుగుతున్న కుమారుణ్ని కట్టడి చేయడానికై అంజనాదేవియే బేడీలువేసి ఆ వేంకటేశ్వర స్వామికి ఎదురుగా నిలబెట్టిందని ఐతిహ్యం. పూర్వం దేవస్థానానికి పాలకులైన మహంతులు పూరీ జగన్నాథంలోని సంప్రదాయం ప్రకారం బేడీ ఆంజనేయమూర్తిని స్వామి కెదురుగా నిలిపినారని కూడా చెబుతారు.

### 443. అష్టాదశపురాణాలలో గరుడ పురాణం చదువకూడదంటారు ? నిజమేనా

గరుడపురాణం విషయానికివస్తే గరుత్మంతుడు అడిగిన ప్రశ్నలకు మహావిష్ణువు చెప్పిన సమాధానాలు ఈ పురాణంలో వున్నాయి. ఇందలి పూర్వ ఖండంలో మనం తెలుసుకోదగిన అనేకాంశాలు వివరించబడ్డాయి. అవి అందరూ ఎల్లవేళలా చదువదగినది. గరుడపురాణంలోని ఉత్తరఖండాన్ని ప్రేత కల్పమంటారు. మరణానంతరం జీవుని స్థితిగతులను వివరించే ఖండమిది. అంచేత శ్రాద్ధసమయంలో ఈ భాగాన్ని చదివే సంప్రదాయం ఏర్పడింది.

ఇందులో యమలోక వార్తలున్నాయి. కాబట్టి దీనిని చదువరాదనే అపోహ కల్గిఉండవచ్చు. కాని అది అపోహ మాత్రమే. మరణానంతరం జీవుడేమవు తాడు? అన్న విషయం వివరించే కఠోపనిషత్తును శ్రాద్ధకాలంలోనూ, ఇతర సమయాలలో గూడా పఠిస్తారు. ఈ పద్ధతిని గరుడపురాణానికి కూడా సమన్వ యించుకోవచ్చు. ఒక గ్రంథాన్ని చదువరాదు అంటే ఇక దానిని రచించడమే వ్యర్థంకదా! వ్యాసభగవానుడు అంత వ్యర్థమైనపని ఎందుకు చేస్తాడు? హీనమైన విషయాలుగల గ్రంథాలను చదువరాదు కాని మునిప్రోక్త స్తోత్రగ్రంథాలను చదవడం దోషంకాదు.?

### 444. భగవద్గీత పఠించేటప్పుడు ఏ అధ్యాయం నుండిప్రారంభించాలి?

ఏ గ్రంథమైనా మొదటి నుండీ చదవడం సంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని పాటిస్తే గీతను ప్రథమాధ్యాయం నుండే పఠించాలి. కాని గీతకు ఆంధ్రావనిలో అనన్య సామాన్యప్రచారంకల్గించిన శ్రీ మలయాళ స్వాములవారు తమ 'శ్రీకృష్ణాశయము' అన్న గ్రంథంలో ద్వాదశాధ్యాయమైన భక్తియోగాన్ని వివరిస్తూ "గీతాపారాయణం చేసేవారు మొదటినుండి ప్రారంభిచక పండ్రెండవ అధ్యాయం నుండి మొదలుపెట్టుట మంచిదని

MOHAN PUBLICATIONS.COM

పెద్దలు చెప్పుదురు."అని వ్రాసారు. అది పరంపరాధర్మమని కూడా తెలిపి నారు. అలా చేస్తే విఘ్నాలు కలుగవని కూడా వివరించారు.

అందుకు కారణాలు తెలుపుతూ ఆ స్వాములవారు ఇంకా ఇలా నిర్దేశించారు. 1.ఈ 12వ అధ్యాయంలో అమృతసమమైన వాక్కులు కలవు. 2. ఈ అధ్యాయశ్లోకాలు చాలా చిన్నవి. అనుష్టుప్ ఛందస్సులో 20 మాత్రమే ఉన్నవి. 3. మొదటి అధ్యాయం దుఃఖవార్తలతో కూడినది. అందులో 47 శ్లోకాలున్నాయి. యుద్ధంవల్ల కలిగే క్లేశం అందులో వివరింపబడింది. అందువల్ల మొదటి అధ్యాయానికి బదులు భక్తితత్త్వాన్ని వివరించే ద్వాదశాధ్యాయంతో గీతాపారా యణం ప్రారంభించడం యుక్తమని పెద్దలు భావించియుందురు."కాని గీతాపారాయణపరులందరూ ఈ సంప్రదాయాన్ని పాటించడం లేదు.

## 445. శుభకార్యాలు దర్భతో జరిపిస్తారు ? దాని ఆంతర్యమేమిటి ?

పూర్వం గరుత్మంతుడు తన తల్లి వినతకు సవతితల్లి కద్రువ వద్ద సంభ వించిన దాస్యం తొలగించడానికి కద్రువ కొడుకులు కోరినట్లు అమృతభాండం అపహరించుకొనిపోతున్న గరుడునితో పోరాడి దేవేంద్రుడు గూడా పరాజితు డయ్యాడు.ఆ పై అమృతం కద్రువ కొడుకులైన సర్పాలు త్రాగకుండా వుండేటట్లు ఇంద్రునితో సమాలోచనజరిపి అమృతభాండంతో సహా కద్రువ కొడుకుల చెంతకువచ్చాడు. ఆ భాండాన్ని దర్భలపై ఉంచాడు. మీరు స్నానం, అలంకరణం చేసుకొని వచ్చి ఈ అమృతం సేవించండి అని వారితో చెప్పాడు.

ఆ సర్పాలు అమృతపాన కుతూహలంతో స్నానానికి పోయాయి. ఇంతలో ప్రచ్ఛన్నంగా దాగివుండిన ఇంద్రుడు భాండం తీసుకొని అమరావతి చేరు కొన్నాడు. స్నానం చేసివచ్చిన కాద్రవేయులకు భాండం కనిపించలేదు. భాండం ఉంచిన దర్భలను నాకగా వారి నాలుకలు రెండుగా చీలిపోయాయి. అమృత భాండస్పర్శవల్ల దర్భలు పవిత్రాలయ్యాయి. అట్టి దర్భలను శుభకార్యాలలో వాడుతున్నాం.

## 446. విమాన వేంకటేశ్వరస్వామి ఎవరు ?

శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంపై ఉన్న ఆనంద నిలయం జగత్ప్రసిద్ధం. ఆ విమానంపై విలసిల్లే ఆ వేంకటేశ్వరమూర్తినే విమాన వేంకటేశ్వరస్వామి అంటారు. విమానంపై వాయువ్యదిశలో మకరతోరణంచే అలంకరింపబడిన





ఒక చిన్నమందిరం కనిపిస్తుంది. అందులో ఉన్న మూర్తియే 'విమాన వేంకటేశ్వర స్వామి'. ఇది మూలవిరాణ్మూర్తిని పోలి వుంటుంది.

తత ఆనందనిలయే తొండమాన్ నృపనిర్మితే
విమానాగ్రే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః

అన్న ప్రమాణాన్నిబట్టి తొండమాన్ రాజు ఈ మూర్తిని విమానంపై ఏర్పాటు చేశాడని వేంకటాచల మాహాత్మ్యం నిర్దేశిస్తున్నది. మూలవిరాట్టును దర్శించినంత ఫలం ఈ మూర్తిని దర్శిస్తే సిద్ధిస్తుందని భక్తుల విశ్వాసం.

విమానం సర్వపాపఘ్నం విష్ణునాధిష్ఠితం సదా
పశ్యతాం సర్వభూతానాం ఆహ్లాదజనకం శుభమ్.

అన్నట్లు విమాన వేంకటేశ్వర దర్శనం ప్రాణులకు సర్వపాపనివారకమై, శుభకరమై, ఆహ్లాదం కల్గిస్తుంది.

## 447. ఉపేంద్రుడు, (శ్రీకృష్ణుడు) దేవేంద్రుడు అన్నదమ్ములంటారు. అది ఎలా ?

ఉపేంద్ర ఇంద్రావరజః చక్రపాణి శ్చతుర్భుజః

అని అమరకోశం. ఇవి విష్ణుదేవుని చెప్పే పర్యాయ పదాలు. ఇంద్ర మను గతః అనుజత్వా దుపేంద్రః అనే నిర్వచనాన్నిబట్టి ఇంద్రుని తమ్ముడు గాన విష్ణువు ఉపేంద్రుడనబడుతున్నాడు.

ఇంద్రుని రక్షణకై అతని సమీపంలో ఉండేవాడనీ, ఇంద్రలోకంలో ఉండేవాడనీ కూడా అమరకోశ వ్యాఖ్యాతలు 'ఉపేంద్ర' శబ్దాన్ని నిర్వచించారు. దేవతలు అదితిపుత్రులు. ఇంద్రుడు వారిలో ఒకడు. రాక్షసులు దితి పుత్రులు. బలిచక్రవర్తి వారిలో ఒకడు. రెండు జాతులకూ తండ్రి కశ్యపప్రజాపతియే. ఒకసారి బలిచక్రవర్తి బలపరాక్రమ ప్రభావంతో దేవతలు సురరాజ్యా నికి దూరమైపోయారు. దేవతలను మళ్ళీ అమరలోకంలో ప్రతిష్ఠించడానికై విష్ణువు అదితి గర్భంలో వామనుడై జన్మించాడు. బలిని మూడడుగుల భూమిని దాన మడిగి అతణ్ణి నిగ్రహించి దేవతలకు రాజ్యం కట్టబెట్టాడు. ఇది భాగవతంలో ప్రసిద్ధమైన కథ. అదితికి ఇంద్రుని తరువాత కుమారుడుగా జన్మించినాడు కాన వామనుడు ఇంద్రుని తమ్ముడయ్యాడు. అతడే ఉపేంద్రుడు.

## 448. బ్రహ్మా హత్యాపాతకం అంటే ఏమిటి ? అది ఎలా పోతుంది?

బ్రాహ్మణుడు లేదా బ్రహ్మనిష్ఠుడు అయినవాణ్ణి చంపడం బ్రహ్మహత్య అనబడుతుంది. ఇది ప్రాచీనకాలంలో ఇతరులను హత్య చేయడంకంటే

MOHAN PUBLICATIONS.COM

ఘోరమైన నేరంగా భావింపబడింది. ఈ పాపకార్యం చేసినవారు పాపవిముక్తి పొంద డానికి కొన్ని మార్గాలు నిర్దేశింపబడివున్నాయి. అడవిలో ఒక పర్ణశాల నిర్మించు కొని పంద్రెండు సంవత్సరాలు అందులో ఉంటూ తపస్సు చేయాలి. లేదా 'శివశిరోధ్వజం' అన్న భిక్షాపాత్రను తయారు చేసుకొని భిక్ష అర్థిస్తూ పర్యటిం చాలి. లేదా అశ్వమేధం, స్వర్జిద్యాగం, లేక గోసవనం అనే మూడు యాగాలలో ఒకటి అనుష్ఠించాలి.

ఇదేదీ సాధ్యం కాకపోతే తన యావదాస్తినీ వేదవిదుడైన విప్రునికివ్వాలి. ఇట్టి ప్రాయశ్చిత్తాలలో ఏదైనా ఒకటి చేసినవాడు బ్రహ్మహత్యాపాపం నుండి విముక్తుడవుతాడని పురాణాలలో చెప్పబడి వున్నది. తరువాతికాలంలో ఈ పాప నివృత్తికి నానా ప్రాయశ్చిత్తాలు పేర్కొనబడి వున్నాయి.

### 449. ద్వాదశ జ్యోతిర్లింగాలు వాటిస్థానాలు ?

1. సోమనాథుడు-సౌరాష్ట్రం 2. మల్లికార్జునుడు-శ్రీశైలం 3.మహా కాలుడు - ఉజ్జయిని 4.అమరేశ్వరుడు-ఓంకారక్షేత్రం 5. కేదారేశ్వరుడు-హిమాలయం 6. భీమశంకరుడు-ఢాకిని 7. విశ్వేశ్వరుడు - కాశి 8. త్ర్యంబకుడు - గౌతమీతీరం 9. వైద్యనాథుడు - చితాభూమి 10. నాగేశ్వరుడు - దారువనం 11. రామేశ్వరుడు-సేతుబంధనం 12. ఘృషేశ్వరుడు- శివాలయం.

### 450. శ్రీశైలంలోలాగా శ్రీకాళహస్తిలో శివలింగమును ఎందుకు తాకనివ్వరు?

ఒక శ్రీశైలముననేకాదు. ఉత్తర భారతములోని అనేక దేవాలయాలలో మూలవిరాట్టును తాకి నమస్కారముచేసే అలవాటు చాలాకాలంగా ఉంది. శ్రీశైలంలోనేకాదు, కాశీలో కూడా శివలింగానికి మనం అభిషేకంచేసి పూజచేసే సంప్రదాయంఉంది. శ్రీకాళహస్తిలో శివునకు ప్రతిభక్తుడూ తాకి అభిషేకం చేసే సంప్రదాయంలేదు. అందరికి ప్రతినిధిగా అర్చకులే అభిషేకం చేస్తారు. ఇది ఆయా ప్రాంతాలలోని సంప్రదాయంగా ఉంది.

### 451. అసలు భగవంతుని అవతారములు ఎన్ని ?

ప్రసిద్ధిమైన భగవంతుని అవతారాలు పది. అవి :

మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కలికి రేవచ.

అని పేర్కొనబడ్డాయి. మత్స్యం, కూర్మం, వరాహం, నృసింహుడు, వామనుడు, పరశురాముడు, శ్రీరాముడు, బలరాముడు లేక కృష్ణుడు,





బుద్ధుడు,కల్కి, బలరామకృష్ణుల అవతారాలను వేరువేరుగా గ్రహించే వారు బుద్ధుని లెక్కింపరు. బుద్ధుని లెక్కించేవారు బలరామకృష్ణులను ఒకే అవతారం క్రింద యుగళావతరాంగా లెక్కిస్తారు.

ఇక భాగవతంలోని ద్వితీయ స్కంధంలో ఇరువది నాల్గు అవతారాలు చెప్పబడినాయి. 1. వరాహం 2. సుయజ్ఞుడు 3. కపిలుడు 4. దత్తాత్రేయుడు 5. సనకాదులు 6. నరనారాయణులు 7. ధ్రువుడు 8. పృధువు 9. ఋషభుడు 10.హయగ్రీవుడు 11. మత్స్యము 12. కూర్మము 13. నృసింహుడు 14. ఆది మూలావతారం (గజరక్షకుడు) 15. వామనుడు 16. హంస 17. మనువు 18. ధన్వంతరి 19. పరశురాముడు 20. శ్రీరాముడు 21. బలరామకృష్ణులు 22. వ్యాసుడు 23. బుద్ధుడు మరియు 24. కల్కి. ఇందులో దశావతారాలూ ఉన్నాయి. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు పరిపూర్ణావ తారాలుగా కీర్తింపబడ్డారు. కొందరు శ్రీకృష్ణుడొక్కడే పరిపూర్ణావతార మంటారు. 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్' అనే భాగవత వచనాన్ని ఇందుకు ప్రమాణంగా చూపుతారు. తక్కిన అవతారా లన్నీ అంశావతారాలే. ఐశ్వర్యం, ధర్మం, యశస్సు, సిరి, జ్ఞానం, వైరాగ్యం, ఇవి షడ్గుణాలు. జ్ఞానం, బలం, ఐశ్వర్యం, వీర్యం,శక్తి, తేజస్సు, అనేవి షడ్గుణాలు కొందరు. ఈ గుణాలన్నీ పరిపూర్ణంగా కల శ్రీరామ శ్రీకృష్ణులు పరిపూర్ణావతా రాలుకాగా, కొన్ని గుణాలను మాత్రమే కల్గిన తదితరావతారాలను అంశావతారా లుగా భావించాలి.

"యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా
తత్త దేవా వగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్"

అని గీతావచనం. దీనినిబట్టి అసాధారణమైన విబూతి,సిరి, ఊర్జి తత్వం కలవారినందరినీ భగవదంశ సంభూతులుగా పరిగణించాలి.

### 452. త్రేతాయుగంలో శ్రీరామ లక్ష్మణులు కలియుగంలోని వేంకటా చలం దర్శించారని సప్తగిరిలో ఉంది. అది ఎట్లు ? ఆ యుగంలో కూడ వేంకటాచలం ఉందా ?

వేంకటాచల కృతయుగారంభం నుండీ ఉన్నది. ప్రళయకాలం పూర్తి కాగానే విష్ణువు వరాహావతారందాల్చి హిరణ్యక్షుణ్ణి సంహరించి భూమిని పాతాళం నుండి ఉద్ధరించాడు. బ్రహ్మదేవుడు సృష్టికార్యక్రమం నిర్వర్తించాడు. అది కృతయుగారంభ సమయం.

MOHAN PUBLICATIONS.COM

అప్పుడు భూదేవి అందచందాలు చూచి ఆకర్షితుడైన వరాహస్వామి గరుడుని పిలిచి వైకుంఠం నుండి తన క్రీడాద్రిని తెచ్చి భూమిపై స్థాపించవలసి నదిగా ఆదేశించాడు. గరుడుడు 'వేంకటాద్రి' అనే క్రీడాద్రిని వైకుంఠం నుండి తెచ్చి సువర్ణముఖీ తీరాన నిలిపినాడు. వరాహస్వామి ఆ వేంకటాచలంపై నాటి నుండి నివసించాడు.

వైకుంఠ లోకా ద్గరుడేన విష్ణోః క్రీడాచలో వేంకట నామధేయః
ఆనీయ చ స్వర్ణ ముఖీ సమీపే సంస్థాపితో విష్ణు నివాస హేతోః

అన్నపురాణ వచనంపై విషయానికి ప్రమాణం. అందుచేత కృత యుగం నుండీ వేంకటాచలం ఉన్నది. ఆపై శ్రీనివాసుడు అర్చామూర్తిగా అవతరించి కలియుగ ప్రత్యక్షదైవంగా ఆరాధింపబడతాడు. వేంకటాచలం గూడా కలి యుగంలో ప్రశస్తి కెక్కింది.

## 453. 100 మందికౌరవుల పేర్లు ఏమిటి ?

ధృతరాష్ట్రునికి గాంధారి యందు దుర్యోధనుడు మొదలైన వారు 101 మంది సంతానం కలిగారు. అందులో ఒకరు స్త్రీ. ఆమెపేరు దుశ్శల.

మిగిలిన కౌరవులు పేర్లు వరుసగా :- 1. దుర్యోధనుడు 2. దుశ్శాసనుడు 3. దుస్సహుడు 4. దుశ్శలుడు 5. జలసంధుడు 6. సముడు 7. సహుడు 8. విందుడు 9. దుర్ధర్షుడు 10. సుబాహుడు 11. దుష్ప్రధర్షణుడు 12. దుర్మర్షణుడు 13. దుష్కర్ణుడు 15. కర్ణుడు 16. వివింశతి 17. వికర్ణుడు 18. శలుడు 19. సత్త్వుడు 20. సులోచనులు 21. చిత్రుడు 22. ఉపచిత్రుడు 23. చిత్రాక్షుడు 24. చారుచిత్రుడు 25. శరాసనుడు 26. దుర్మదుడు 27. దుర్విగాహుడు 28. వివిత్సుడు 29. వికటాననుడు 30. ఊర్ణనాభుడు 31. సునాభుడు 32. నందుడు 33. ఉపనంద కుడు 34. చిత్రబాణుడు 35. చిత్రవర్మ 36. సువర్మ 37. దుర్విమోచనుడు 38. అయోబాహుడు 39. మహా బాహుడు 40. చిత్రాంగుడు 41. చిత్రకుండలుడు 42. భీమవేగుడు 43. భీమబలుడు 44. బలాకి 45. బలవర్ధనుడు 46. ఉగ్రాయుధుడు 47. సుషేణుడు 48. కుండధారుడు 49. మహోదరుడు 50. చిత్రాయు ధుడు 51. నిషంగి 52. పాశి 53. బృందారకుడు 54. దృఢవర్మ 55. దృఢక్షత్రుడు 56. సోమకీర్తి 57. అనూదరుడు 58. దృఢసంధుడు 59. జరాసంధుడు 60. సరుడు 61. సువాక్కు 62. ఉగ్రశ్రవుడు 63. ఉగ్ర సేనుడు 64. సేనాని





65. దుష్పరాజయుడు 66. అపరాజితుడు 67. కుండశాయి 68. విశాలాక్షుడు 69. దురాధరుడు 70. దుర్జయుడు 71. దృఢహస్తుడు 73. వాతవేగుడు 74. సువర్చుడు 75. ఆదిత్యకేతువు 76. బహ్వాశి 77. నాగదత్తుడు 78. అగ్రయాయి 79. కవచి 80. క్రోధనుడు 81. కుండి 82. ధనుర్ధరుడు 83. ఉగ్రుడు 84. భీమరథుడు 85. వీర బాహుడు 86. అలోలుపుడు 87. అభయుడు 88. రౌద్రకర్మ 89. దృఢథా శ్రయుడు 90. అనాదృష్యుడు 91. కుండభేది 92. విరాలి 93. ప్రమథుడు 94. ప్రమాథి 95. దీర్ఘరోముడు 96. దీర్ఘబాహువు 97. వ్యూఢోరుడు 98. కనకధ్వజుడు 99. కుండాశి 100. విరాజసుడు 101. యుయుత్సుడు (వైశ్యస్త్రీయందు పుట్టినవాడు). యుయుత్సు నితో కలుపుకుంటే కౌరవులు మొత్తం 101 మందిఅవుతారు.

## 454. వటపత్రశాయి ఎవరు ?

వటపత్రశాయి అంటే మర్రి ఆకుమీద శయనించిన భగవంతుడు అని అర్థం. శ్రీమహావిష్ణువు వటపత్రంపై బాలరూపంలో శయనించిన వృత్తాంతం మార్కండేయ మహర్షి చరిత్రలో ఉన్నది.

మృకండు మహర్షి పుత్రుడు మార్కండేయుడు. ఇతడు వేదాధ్యయన సంపన్నుడు, మహాతపస్వి. చాలాకాలం విష్ణువు నారాధించి మృత్యుంజయు డయ్యాడు. మార్కండేయుడు ఆరు మన్వంతరాలకాలం దేవుణ్ణి ధ్యానించాడు. ఏడవ మన్వంతరంలో ఇంద్రుడితని తపస్సుకు భంగం కల్గించేందుకు ప్రయత్నించి అప్సరసలను వినియోగించాడు కాని మార్కండేయుడు చలించలేదు. అప్పుడు నరనారాయణ రూపంలోవున్న భగవంతుడు ప్రత్యక్షమై వరం కోరుకో అన్నాడు. అందుకా ఆమహర్షి నాకు వేరే కోరికలులేవు నీ మాయను చూడాలనిఉంది చూపించు అనివేడుకొన్నాడు. భగవవంతుడు సరే అని అంతర్ధానం అయ్యాడు. ఆ తరువాత మహర్షి ఆ దేవున్ని పూజిస్తూ కొంతకాలం గడిపాడు. ఒకసారి పెద్దగాలి వీచింది. ఎడతెగని కుండపోతగా వర్షం కురిసింది. 4 సముద్రాలు పొంగాయి. భూమి నీట మునిగిపోయింది. మార్కండేయుడు భయపడ్డాడు. మోహాశోకాలు అతణ్ణి ఆవరించాయి. విష్ణు మాయకు లోనై అతడలా అనేక సంవత్సరాలు నీటిపై పరిభ్రమించాడు. అలా తిరుగుతూ తిరుగుతూ ఒకచోట లేత మర్రిచెట్టును చూచాడు. ఆ చెట్టు ఆకుపై శయనించిన ఒక బాలుడు అతనికి గోచరించాడు.

MOHAN PUBLICATIONS.COM

**ప్రాగుత్తరస్యాం శాఖాయం తస్యాపి దదృశే శిశుమ్**
**శయానం పర్ణపుటకే గ్రసన్తం ప్రభయా తమః**
**చార్వంగుళిభ్యాం పాణిభ్యా మున్నీయ చరణాంబుజమ్**
**ముఖే నిధాయ విప్రేంద్రో ధయన్తం వీక్ష్య విస్మితః** –భాగవతం

అన్నట్లు ఆ బాలుడు తన తేజస్సుతో తపస్సును గ్రహిస్తూ చేతి వ్రేళ్లతో పట్టుకొన్న కాలిని నోట ఉంచుకొని చీకుతూ కనిపించాడు. ఇతడే వటపత్ర శాయి అయిన ముకుందుడు.

**కరీర విందేన పదారవిందం ముఖారవిందే వినికేశయన్తమ్**
**వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసాస్మరామి.**

ఆ తరువాత మహర్షి ఆ ముఖుందుడిని సమీపించి ఆయన శ్వాసద్వారా శరీరంలోనికి ప్రవేశించాడు. అక్కడ చిత్ర విచిత్రమైన విశాల విశ్వాన్ని వీక్షించాడు. భగవంతుడు తన మాయను ఉపసంహరించి వరం కోరు కొమ్మంటే భగవద్భక్తినే వరంగా ఆ మహనీయుడు కోరుకొన్నాడు.

## 455. సీతరాములు వనవాస కాలంలో శాకాహారులా ? మాంసాహారులా ?

శ్రీరాముడు అరణ్యావాసానికి పోవడానికి ముందు కౌసల్యతో..

చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే
కందమూలఫలై ర్జీవన్ హిత్వా మునివదామిషమ్
–అయోధ్యాకాండఅని అంటారు.

"నేను పదునాలుగు సంవత్సరాలు జన రహితమైన వనంలో మునిలాగా ఆమిషాన్ని(మాంసాన్ని) వదలి కందమూలఫలాలతో జీవిస్తూ నివసించ గలను" అని పై శ్లోకానికి తాత్పర్యం. దీనినిబట్టి వనవాసకాలంలో సీతా రాములు శాకాహారులే అని తెలుస్తున్నది. కాని అయోధ్యా కాండంలోనే 96వ సర్గంలోని రెండవ శ్లోకం ఇలా ఉన్నది.

నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛందయన్
ఇదం మేధ్యమిదం స్వాదు నిష్టప్త మిద మగ్నినా దీనిభావమిది.

"రాముడు గిరిప్రస్తమునందు ఇది శుద్ధమైనది, ఇది రసవంతమైనది, ఇది నిప్పులో కాలినది" అంటూ సీతను మాంసంతో వశీకరించుకొన్నవాడై విశ్రమించెను. దీనినిబట్టి వారు వనవాససమయంలో మాంసభక్షణ చేసినట్లు స్పష్టమవుతున్నది. పరస్పర విరుద్ధంగా వున్న మాటలకు పరిష్కారం గోవింద రాజీయ వ్యాఖ్యలో ఇలా కనిపిస్తున్నది. ఇందలి మొదటి శ్లోకాన్ని వివరిస్తూ





వ్యాఖ్యాత "అత్ర ఆమిషశబ్దేన సూదైః సంస్కృతం మాంసముచ్యతే. కేవల మాంస స్వీకార స్యోత్తర త్రవక్ష్య మాణత్వాత్ "ఇదం మేధ్య మిదం స్వాదు నిష్టప్తమిద మగ్నినా ఇతి"

"ఇక్కడ ఆ మిష శబ్దంచే వంట వారిచే (ఆయా ద్రవ్యాలతో) సంస్కరింప బడిన మాంసం చెప్పబడుతున్నది. "ఇదం మేధ్య మిత్యాదివచనాలచే సంస్కారహితమైన కేవల మాంసాన్ని (వారు) స్వీకరించినట్లు పైన చెప్పబడు తున్న కారణం వల్ల" అని గోవిందరాజు వివరణ కర్థం.

ఈ వివరణనుబట్టి సీతారాములు అరణ్యావాసకాలంలో క్షత్రియ యోగ్యమైన మాంసాహారాన్ని గ్రహించారనే చెప్పవలసివస్తున్నది. అయితే నగరంలో వున్నపుడు సంస్కరింపబడిన మాంసాన్ని, అడవిలో అట్టి సంస్కారం లేని మాంసాన్ని స్వీకరించారని తెలిసికోవాలి.

## 456. సాలగ్రామాలు పగిలితే పనికివస్తాయా ?

సాలగ్రామాలు విష్ణుదేవునికి ప్రతీకలుగా పూజింప బడుతున్నవి. సాలగ్రామ శాస్త్రంలో వీటి ఆకారఫలం ఈ క్రింది విధంగా చెప్పబడింది.

స్ఫుటితం పుత్రహాని స్స్యాత్ భగ్నోష్ఠం బుద్ధినాశనమ్
ఆస్థాన భంగదం భగ్నం దుర్దరం క్లేశ కారణమ్.
భయావహం భగ్నశీర్షం అతిస్థూలం ధనాపహమ్
అతిహ్రస్వ మపూజార్హం త్రికోణం బంధునాశన్.

(–శ్రీకపిలవాయి లింగమూర్తి సంపాదిత సాలగ్రామ శాస్త్రం 80వపుట)

పగులుగల సాలగ్రామం పుత్రహాని కల్గిస్తుంది. పెదవి విరిగినది బుద్ధిని నశింపజేస్తుంది. పూర్తిగా పగిలినది స్థానభంగం కల్గిస్తుంది. దర్దుర్లుగలది క్లేశ కారకమవుతుంది. తలపగిలినది భయాన్నీ, మిక్కిలి లావైనది ధననాశాన్నీ కలిగిస్తుంది. మిక్కిలి పొట్టిది పూజకు పనికిరాదు. మూడు మూలలు గలది బంధు నాశకమవుతుంది. పై వివరణనుబట్టి సాలగ్రామం పగలకుండా, విరగ కుండా ఉండాలని స్పష్టమవుతున్నది. అయితే ఆ శాస్త్రంలోనే 88వ పుటలో–

సాలగ్రామ శిలాభగ్నా పూజనీయా సచక్రికా
ఖండితా స్ఫుటితావాపి సాలగ్రామ శిలా శుభా.

అని ఉన్నది. అనగా సాలగ్రామ శిల విరిగినా, పగిలినా చక్రంతోకూడి ఉంటే శుభమే కల్గిస్తుంది. దానిని పూజింపవచ్చు అని భావం. బహుశః

MOHAN PUBLICATIONS.COM

ఈ సంగతిని దృష్టిలో పెట్టుకొనే సాలగ్రామం పగిలి భాగమైయున్నను, భిన్నమైయున్నను దానిని పూజించిన దోషములేదుఅని శివ కవచం అన్న గ్రంథం 585వ పుటలో చెప్పడమయింది.

### 457. వేదములు ఎన్ని ? పంచమ వేదమేది ?

వేదములు నాలుగు అవి 1. ఋగ్వేదం 2. యజుర్వేదం 3. సామవేదం 4. అధర్వణ వేదం. వ్యాసరచితమైన మహాభారతం పంచమ వేదంగా ప్రసిద్ధి పొందింది.

### 458. షోడశ మహాదానములు ఏవి ?

1. గోవు 2. భూమి 3. తిలలు 4. హిరణ్యం 5. రత్నం 6. విద్య 7. కన్య 8. దాసి 9.శయ్య 10.గృహం 11.అగ్రహారం 12.రథం 13. గజం 14. అశ్వం 15. మేక 16.మహిషం. వీటిదానాలే షోడశమహాదానాలు.

### 459. ఉపదేశము గురువు మాత్రమే చెయ్యాలా ? తండ్రి చెయ్యకూడదా?

గురువు శిష్యునికి ఉపదేశం చేయడం సంప్రదాయసిద్ధం. శస్త్రచికిత్సలో నిపుణుడైన ఒక వైద్యుడు తన కుమారుడికి మరొక వైద్యునిచే చికిత్సచేయించ డం కద్దు. అట్లే ఉపదేశ నిపుణుడైన ఒకతండ్రి తన కుమారుడికి మరొక గురు వుచే ఉపదేశం చేయించడం జరుగుతుంది. అంతేకాని తండ్రి కుమారు డికి ఉపదేశం చేయకూడదన్న నిషేధం లేదు. అలా చేసినవారు ఉన్నారు.

### 460. వినాయకుని విగ్రహాలను పూజానంతరం ఎందుకు నీటిలో కలపాలి ?

వినాయకుని విగ్రహాలను మట్టితోగాని మట్టికి రూపాంతరాలైన మృదు పదార్థాలతోగానీ రూపొందిస్తారు. పూజానంతరం ఉద్వాసన సమయంలో ఆ విగ్రహాలను నీటిలో కలుపుతారు. శిలా లోహవిగ్రహాలను అలా కలిపే సంప్రదాయంలేదు. పృథివీ పదార్థమైన మట్టి జలం నుండి కల్గింది. 'అద్భ్యః పృథివీ' అని వేద వచనం. జలం నుండి పృథివి పుట్టినదని అర్థం. అందుచేత పృథివీరూపమైన విగ్రహాన్ని దాని మూలస్థానమైన జలంలో కలపడం జరుగుతున్నది. ఈ జీవులందరూ పరమాత్మనుండి వచ్చారు. అందుచేత జీవాత్మలన్నీ తమ ఉత్పత్తి స్తానమైన పరమాత్మలో లీనం కావాలి అని వేదాంత సిద్ధాంతం. ఈ రహస్యాన్నే పై చర్య నిరూపిస్తున్నది. నీటిలో కలిపినప్పుడు విగ్రహం తన రూపనామాలను కోల్పోతుంది. నామరూపాలతో గూడిన పదార్థాలన్నీ చివరికి నామరూప రహితమైన స్థితిని పొందుతున్న తత్త్వాన్ని ఇది తెలియ జేస్తున్నది.





### 461. దాన ధర్మాలు అంటే ఏమిటి ?

దానధర్మాలు అన్న సమానం దానం, ధర్మం అన్నరెండు పదాల కలయికతో ఏర్పడింది. దానము యొక్క ధర్మాలు అన్న షష్ఠీ తత్పురుష సమాసంగా గూడా దీనిని గ్రహించవచ్చు. ఒకవ్యక్తి తన్ను యాచించినప్పుడు ఇచ్చేది దాన మనీ, అతడు యాచించకనే అతని అవసరం గుర్తించి దాత ఇచ్చేది ధర్మమనీ పెద్దలు చెప్పడంకద్దు. దానం సాత్త్వికం, రాజసం, తామసం అని మూడు విధాలుగా ఉంటుందని భగవద్గీత వివరిస్తున్నది. దానము యొక్క ధర్మాన్ని పాటించేవారు దేశకాల పాత్రతలను గుర్తించి దానం చేయాలి. ధర్మ శబ్దం అతి విస్తృతమైన అర్థంకల్గి ఉన్నది. దానం కూడా అందులో ఒక భాగమే.

### 462. ప్రదక్షిణలు ఎందుకు చేయాలి ? ప్రయోజనం ఏమి ?

గుడిచుట్టూ లేదా గుడిలో భగవంతుని చుట్టూ ప్రదక్షిణం చేయడం కద్దు. అలా చేసే సమయంలో –

యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ
తాని సర్వాణి నశ్యంతి ప్రదక్షిణ పదే పదే

అని ఉచ్చరిస్తారు. పూర్వజన్మలోకానీ, ఈ జన్మలోకానీ చేసినపాపాలన్నీ ప్రదక్షిణం చేస్తే నశిస్తాయని పై శ్లోకానికి భావం. ఇందులో ప్రదక్షిణంవల్ల కలిగే ప్రయోజనం చెప్పబడింది.

ఆత్మ ప్రదక్షిణం అంటే తన చుట్టూ తాను తిరగడం కూడా ప్రదక్షిణమే. ప్రతి జీవికీ తనలో అంతర్యామిగా భగవంతుడున్నాడు. 'ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి' అని గీత. అంటేసమస్త ప్రాణుల హృదయ ప్రదేశంలో ఈశ్వరు దున్నాడని తాత్పర్యం. ఆత్మప్రదక్షిణం అంటే తనలోని భగవంతుని చుట్టూ తాను తిరగడన్నమాట. గుడిచుట్టూ లేక భగవంతుని చుట్టూ ప్రదక్షిణం చేయ డంలో "ఓ దేవా! నేను అన్నివైపులనుండీ నిన్నే అనుసరిస్తున్నాను. నిన్ను వీడి పోవడం లేదు. కాన నన్ను కరుణించు" అన్న ప్రార్థన అంతర్భూతమై ఉన్నది.

భగవంతు వలగొను పదములు పదములు అని భాగవతం. దేవునికి ప్రదక్షిణం కావించే పాదాలే ప్రశస్తమైన పాదాలు అని చెప్పింది. పూర్వం వినాయకుడు తన తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరుల చుట్టూ ప్రదక్షిణం చేసి సమస్త విశ్వానికీ ప్రదక్షిణం చేసిన ఫలితం పొందాడని పురాణాలు

MOHAN PUBLICATIONS.COM

చెబు తున్నాయి. అందువల్ల భగవత్ప్రదక్షిణం విశ్వప్రదక్షిణం కూడా అవుతుంది. తిరువణ్ణామలలో గిరి ప్రదక్షిణం ప్రసిద్ధం. శ్రీరమణ మహర్షి 'ప్రదక్షిణం'అన్న పదాన్ని విశ్లేషించి ఇలా చెప్పారు. 'ప్ర'అనే అక్షరం సమస్త పాపాల వినాశానికి సూచకం. 'ద'అంటే కోరికలన్నీ తీరడమని భావం. 'క్షి'అన్న వర్ణం రాబోయే జన్మల క్షయాన్ని సూచిస్తుంది. 'న'అంటే అజ్ఞానం నుండి విముక్తి ప్రాప్తి అని గ్రహించాలి. ఇది ప్రదక్షిణంలోని రహస్యం.

### 463. హనుమ వాయునందనుడా ? కేసరి నందనుడా ?

హనుమంతుడు అంజనాదేవి కుమారుడు. అంజనాదేవి కేసరి భార్య. కేసరి సంసార విరక్తుడై వాయుదేవుని సేవిస్తూ ఉండమని అంజనకు చెప్పి తాను తపస్సు చేయడానికి వెళ్లాడు. అంజన తనపై చూపిన భక్తి ప్రపత్తులకు మెచ్చి వాయుదేవుడు తన గర్భంలోని శివుని వీర్యాన్ని ఆమెకు ప్రసాదించాడు. దానితో ఆమె గర్భం ధరించి పుత్రుని కన్నది. ఆ కుమారుడే హనుమంతుడు. అంజన విహారంలో ఉండగా వాయుదేవుడు ఆమెనుచూచి కామించి నీకు కామ రూపుడు, మహాబలవంతుడైన కుమారుడు కలుగగలడు. నీ పాతివ్రత్యానికి భంగం కలుగదు. అని చెప్పి ఆమెను సమ్మతింప జేసినాడనీ, వారి కలయికవల్ల కలిగినవాడే అంజనేయుడనీ కూడా పురాణాలు వివరించాయి. అందువల్ల హనుమ కేసరికీ, వాయుదేవుడికిఈ ఇరువురికీనందనుడే!

### 464. చిరంజీవులు ఎవరు ? వారి వృత్తాంతం ఏమిటి ?

అశ్వత్థామా బలిర్వ్యాసో హనుమాంశ్చవిభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః

అనే ప్రమాణాన్నిబట్టి 1. అశ్వత్థామ 2. బలిచక్రవర్తి 3. వ్యాసుడు 4. హనుమంతుడు 5. విభీషణుడు 6. కృపాచార్యుడు 7.పరశురాముడు అనువారు ఏడుగురు చిరంజీవులుగా ప్రసిద్ధి పొందియున్నారు.

1. అశ్వత్థామ : ఇతడు కృపికీ, ద్రోణునికీ జన్మించిన కుమారుడు. భారతయుద్ధంలో తండ్రితోపాటు కౌరవుల పక్షంలో నిల్చి పోరాడాడు. యుద్ధం చివరిరోజున రాత్రిపూట పాండవుల శిబిరంలో దూరి నిద్రిస్తున్న ఉపపాండవు లను క్రూరంగా హతమార్చాడు. ఇతడు ప్రయోగించిన అస్త్రంచే ఉత్తరాగర్భస్థు డగు పరీక్షిత్తు దహింపబడుతుండగా శ్రీకృష్ణుడు పాండవ వంశాన్నిరక్షించాడు. బాలవధ చేసినందుకు వ్యాసుడు అశ్వత్థామను దుర్గంధ శరీరుడగునట్లు శపించాడు.





2. బలిచక్రవర్తి : ఇతడు ప్రహ్లాదుని మనుమడు, విరోచనుని కుమారుడు. దేవతలను జయించి స్వర్గలోకం ఆక్రమించినవాడు విష్ణువు వామనుడై అవతరించి బలి యజ్ఞవాటికకు పోయి మూడడగుల నేలను యాచించినాడు. వామనుని కాపట్యం తెలిసి కూడా బలి మహాదాతృత్వంతో ఆయన కోరినట్లే సర్వస్వం దానం చేశాడు. విష్ణువు బలిని బంధించి పాతాళానికి పంపి తాను గూడా అతని వాకిట కావలివాడయ్యాడు.

3. వ్యాసుడు : ఈయన సత్యవతీ పరాశరుల పుత్రుడు. అన్యోన్య విభాగం లేకుండా కలిసిపోయిన వేదాలను విభజించి వేదవ్యాసు డయ్యాడు. లక్ష శ్లోకాలుగల మహాభారతం రచించాడు. నాలుగు లక్షల శ్లోకాలతో పదునెనిమిది పురాణాలు రచించాడు. ఇతని కుమారుడు శుకుడు.

4. హనుమంతుడు : వానరజాతిలో కేసరికి, అంజనాదేవికీ వాయు దేవతాంశంలో పుట్టినవాడు హనుమంతుడు. ఇతడు శ్రీరాముని భక్తులలో అగ్రగణ్యుడు. మహాబలశాలి. సీతను అన్వేషించడానికిపోయి ఆమెను చూడడమేకాక లంకానగరాన్ని గూడా దహించివచ్చి శ్రీరామునికి సీతావృత్తాంతం తెలియజేసినవాడు ఇతడే.

5. విభీషణుడు : విశ్రవసునికి కైకసి యందు మూడవ కుమారుడుగా జన్మించిన వాడితడు. రావణాసురుని తమ్ముడు, సచ్ఛీలుడు. సీతను అపహరించి తెచ్చుట తప్పు అని అన్నతో విన్నవించి అతనిచే అవమానింపబడి వచ్చి రామునికి శరణాగతుడయ్యాడు. రావణ మరణానంతరం లంకానగరానికి పరిపాలకుడైనాడు.

6. కృపాచార్యుడు : ఇతడు సత్యధృతి కుమారుడు. కృపి ఇతని సోదరి. ద్రోణుడు హస్తినా నగరానికి రాకముందు కౌరవులకు కృపుడే ఆచార్యుడుగా ఉండినాడు. ఇతని సోదరినే ద్రోణుడు పరిణయమాడినాడు. ఏకదాశ రుద్రల అంశంలో జన్మించినవాడు కృపుడంటారు. గౌతముని వంశంలో జన్మించినవాడు కాన గౌతముడు అని కూడా వ్యవహరింపబడి నాడు. భారతయుద్ధంలో కౌరవుల పక్షాన పోరాడినవాడు.

7. పరశురాముడు : దశావతారాలలో ఒక అవతారమైన పరశురాముడు రేణుకా జమదగ్నుల కుమారుడు. ఇతడు తన తండ్రని చంపిన కార్తావీర్యార్జునుని పుత్రులపై పగబూని ఇరువదియొక్క సార్లు రాజులపై దండెత్తి వారిని హతమార్చి నాడు. చివరికి శ్రీరాముని ముందు తనతేజం కోల్పోయాడు. అస్త్రవిద్యలో మేటి అయిన పరశురాముడు భీష్ముడు మున్నగు వారికి అస్త్రవిద్యా రహస్యాలు నేర్పినాడు.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

## 465. శ్రీకృష్ణుడు అష్టభార్యలను ఎప్పుడు ఎలా వివాహమాడినాడు?

1. రుక్మిణి : కుండిన నగరమునకురాజైన భీష్మకుని కూతురు. ఈమె సోదరుడగు రుక్మి ఈమెను చేదిదేశాధీశ్వరుడైన శిశుపాలునకిచ్చి వివాహము సేయతలచినాడు. ఈమె తండ్రియైన భీష్మకుడామెకు స్వయంవర మును చాటినాడు. నానాదేశాగతులగు రాజులువచ్చినారు. అదివరకే శ్రీకృష్ణుని గూర్చి విని యున్న ఈమె తానాతని వలచినట్లు అగ్నిద్యోతనుని మూలమున సందేశమంపి నది. శ్రీకృష్ణుడు కుండినపురమునకు వచ్చి రుక్మిణిని “రాక్షస వివాహమున” తీసికొనిపోయి వివాహమాడినాడు.

2. సత్యభామ : సత్రాజిత్తు కూతురు. సత్రాజిత్తు శ్యమంతకమణిని శ్రీ కృష్ణుకిచ్చి తన కుమార్తెయగు సత్యభామనుకూడ ఇచ్చి వివాహము కావించినాడు. నరకాసురుని జయించుటలో సత్యభామ శ్రీ కృష్ణునకు సర్వ విధాల సహకరించినది.

3. నీళ : మిథిలా నగరమునందలి కుంభకుడనే గొల్లవాని కూతురు. అందగత్తె ఒకనాడు నారదుడు వీరి యింటికివచ్చి నందుని కుమారుడగు శ్రీకృష్ణుని వర్ణించినాడు. అపుడు నీలయటు వచ్చినది. ఆమె తన కూతురనీ, తగిన భర్తకై వెదకుచున్నానని కుంభకుడు చెప్పినాడు. నీలకు కృష్ణుని మీద వలపు గలిగినది. కుంభకునింటిలో కాలనేమి పుత్రులు వృషభములై పుట్టినారు. ఆ ఎద్దులను ఎవ్వరును పట్టలేక వానివలన బాధలనుభవిస్తుండి నారు. ఆ వృషభములను పంటలను నాశము చేస్తుండినవి. వానిని పట్టి యుంచవలసి నదిగా మిథిలాధీశుడు కుంభకుని ఆజ్ఞాపించినాడు. వానికది సాధ్యముకాలేదు. ఎవడా వృషభములను లొంగదీయునో వానికి తన కూతురునిచ్చి వివాహము కావించెదనని కుంభకుడు చాటించినాడు. శ్రీకృష్ణుడా వృషభములను లొంగ దీసినాడు. సంహరించినాడు. కుంభకుడు తన కూతురు నీలను శ్రీకృష్ణునకిచ్చి వివాహము కావించినాడు.

4. జాంబవతి : జాంబవంతుని కుమారి. శ్యమంతకమణిని వెదకు చున్న శ్రీకృష్ణుడామె పడుకొనియున్న తొట్టెకు ఆటబొమ్మగా కట్టియున్న మణిని చూచి దానిని తీసుకొన్నాడు. ఆ సమయమున జాంబవంతునితో కొన్నాళ్లపోరు సాగించినాడు. తనతో పోరాడినవాడు శ్రీకృష్ణుడని తెలిసి ఆ మణిని తన కూతురగు జాంబవతిని కూడ నొసగినాడు. శ్రీకృష్ణుడు జాంబవతిని పరిణయ మాడినాడు.





5. భద్ర : శ్రీకృష్ణుని అష్టభార్యలలోనొక్కతె. ఈమె కేకయరాజు ధృష్ట కేతునకు శ్రుతకీర్తికి కూతురు. వసుదేవుని తోబుట్టువు శ్రుతకీర్తి. శ్రీకృష్ణుడు మేనత్త కూతురిని వివాహమాడినట్లు తెలియుచున్నది.

6. మిత్రవింద : అవంతి రాజులగు విందాను విందులకు చెల్లెలు. శ్రీకృష్ణుని మేనత్తయగు రాజాధిదేవి కూతురు. శ్రీకృష్ణుడామెను స్వయం వరమున వివాహమాడినాడు.

7. నాగ్నజితి : కోసల దేశాధీశుడగు నాగ్నజిత్ కూతురు. ఈ రాజు రాచనగరులోని వృషభములు ప్రజలను బాధించుచు ఎవరికిని పట్ట సాధ్యము కాకుండినది. వానిని పట్టిన వానికి తన కూతురు నిత్తునని నగ్నజిత్తు చాటించినాడు. ఆ పొగరుబోతు ఎద్దులను హతమార్చి శ్రీకృష్ణుడు నగ్నజితిని వివాహ మాడినాడు.

8. లక్ష్మణ : బృహత్సేనుని కూతురు. చిన్ననాటినుండి ఈమెకు శ్రీకృష్ణుని మీద మనసుండినది. అతనినే వివాహమాడతలచినది. తన మనసున తండ్రికి తెల్పినది. అతడొక మత్స్య యంత్రమును కల్పించినాడు. అయితే ఆ యంత్రము పైకి కనపబడదు. క్రింద నీటిలోమాత్రం కన్పడును. దానిని కొట్టుటకై ఒక పెద్ద ధనస్సు నచ్చట వుంచినాడు. ఆ ధనస్సుతో నా మత్స్య యంత్రమును గొట్టిన వానికి తన కూతురునిచ్చి వివాహము కావింతునని చాటినాడు. ఎందరో రాజకుమారులు ప్రయత్నించి విఫలులై నారు. శ్రీకృష్ణుడాయంత్రమునుగొట్టి లక్షణను తన రథముపై ఎక్కించి ద్వారకకు తీసికొనివచ్చినాడు. అడ్డు వచ్చిన రాజలోకము నోడించినాడు. తరువాత బృహత్సేనుడు ద్వారకకువచ్చి ‘లక్షణ శ్రీకృష్ణులకు వివాహమును కావించినాడు.

## 466. బ్రహ్మ కడిగినపాదము, బ్రహ్మ ఎప్పుడు విష్ణుపాదాలు కడిగినాడు?

మహావిష్ణువు వామనావతారమున బలిచక్రవర్తిని మూడడుగుల స్థలమును దానమడిగినాడు. బలి వామనుని అభ్యర్థనమును మన్నించి యాతని కోర్కెమయి యా స్థలమును దానమొసగినాడు. విష్ణువు తొలిపాదముతో భూభాగ మంతయు నాక్రమించినాడు. రెండవపాదముతో ఆకాశ ప్రాంతమంతటినీ ఆక్రమించినాడు. ఆ యాక్రమణమునకు దేవతలందరునూ, సంభ్రమాశ్చర్యము లకు లోనైనారు. అటువంటి సమయంలో జగములంతటినీ దాటివచ్చిన త్రివిక్రముని పాద పద్మముల కాంతిని జూచి బ్రహ్మ –

MOHAN PUBLICATIONS.COM

తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుడుం దన్నాభిపం కేరుహం
బు నిరీక్షించినటించి యున్నతపదంబుజూచి తత్పాద పే
చనముంజేసే గమండలూదక ములం జల్లించి తత్తోయముల్
విను వీధిం బ్రవహించి దేవ నది నా విశ్వాత్మకీర్తి ప్రభన్.
–పోతన భాగవతం

కనుక పదకవితా పితామహుడు తాళ్లపాక అన్నమాచార్యుడు "బ్రహ్మ కడిగిన పాదము బ్రహ్మముతానె నీపాదము బలితలమోపిన పాదము తలకక గగనము తన్నినపాదము" ఇత్యాది కీర్తనమునుజేసినాడు. మహావిష్ణువు త్రివిక్రమస్వరూపుడైన సమయమున బ్రహ్మ యాతనిపాదములనుకడిగినాడు.

## 467. గణపతిని తులసితో పూజించవచ్చునా ?

మనకు భారతీయులకు వినాయక వ్రతమును పూజను జరిపే పద్ధతి ఉంది. గణపతిని పూజించేటప్పుడు ఏకవింశతి (ఇరవైఒక్క) ఆకులతో పూజించే పద్ధతి ఉంది. ఆ పద్ధతిలో "గజకర్ణాయ నమః తులసీపత్రం పూజయామి"అని చెప్పియున్నారు. వ్రతకల్పంలో చెప్పినట్లు మనము తులసితో "గణపతిని" పూజించ వచ్చును. ఆనాడు తప్ప మిగాతారోజుల్లో తులసిని గణపతిపూజలో వాడరాదు.

## 468. భగవంతునికి తలనీలాలు సమర్పించడం సరియైనదేనా ? దాని వెనుక గల రహస్యం ఏమిటి ?

మానవునకు తలనీలాలు అందాన్ని అందించే ఆజన్మ విశేషం. దానిని సమర్పించడం అంటే తన సర్వస్వాన్ని త్యాగం చేసినట్లు అని మనవారు భావిస్తారు. ఈ ఆచారం మనదేశంలో చాలా కాలంగా అలవాటులో ఉంది. దీనినే మహాకవి, యోగి అయిన కీ॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తిరుమల స్వామిని ప్రార్థిస్తూ "తలవెంద్రుకలనూడ్చి తరలించుటిదియేమి ? పాపమ్ములు హరించు భావమొక్కో" అని అన్నారు. ఈ విధానం ఆత్మార్పణం చేసినట్లు భావించే వారూ ఉన్నారు.

## 469. స్త్రీలు వేదాలు చదువకూడదా ?

సనాతనులు, సంప్రదాయవాదులు "స్త్రీలు వేదాలు చదువకూడదు" అనే అంటారు. ఇందుకు ప్రమాణంగా "స్త్రీ శూద్రౌ నాధీయతాం" అన్న శ్రుతిని చూపుతారు. స్మృతులలో కూడా స్త్రీలకూ, ద్విజేతరులకూ వేదాధ్యయనాధికారం లేదు అనే స్పష్టంగా చెప్పబడివున్నది. అందుకే వారి కోసం పురాణాలు వ్రాయ బడినాయని కూడా సంప్రదాయవాదులంటారు.





కాని వేదకాలంలో ఉపనిషత్కాల ములో ఈ నిషేధం ఉన్నట్లు కనిపించదు. ఉపనిషత్తులు వేదాలచివరిభాగాలు. అందులో 'గార్గి'మొదలైన బ్రహ్మవాదిను లగు స్త్రీలప్రస్తావం ఉన్నది. వారు మహాసభలలో జరిగిన బ్రహ్మతత్త్వ చర్చల్లో పాల్గొని వాదించి వున్నారు. ఉదాహరణకు బృహదారన్యకంలోని గార్గీయాజ్ఞ వల్క్యుల సంవాదంచూడవచ్చు. పైగా వేదమంత్రాలను దర్శించిన కొందరు స్త్రీలు గూడా ఉన్నారు.

చూడాల, సులభ మొదలైన యోగినీమణులు బ్రహ్మవిద్యలో ఆతితేరి నట్లు యోగవాసిష్ఠం, భారతం మొదలైన గ్రంథాలనుండి తెలుస్తున్నది. వారికి వేదాధికారం లేకపోతే వారెలా అంతటి బ్రహ్మవిద్యావైదుష్యం కల వారయ్యారు? అందువల్ల ఆదికాలంలో ఈ నిషేధంలేదని ఊహించవచ్చు. "స్త్రీ శూద్రౌనాధీయతాం" అనే శ్రుతి వచనం కల్పితం కావచ్చు. అలా కల్పితవచనాలెన్నో మన ప్రాచీన గ్రంథాలలో ప్రవేశించాయని శ్రీదయా నందస్వామి మొదలగువారు నిరూపించినారు.

ఆధునిక యుగంలో హిందూమతసంస్కర్తలైన శ్రీదయానందస్వామి మొదలైనవారు స్త్రీలకు వేదాధ్యయనాధికారం కలదని అనేక ప్రమాణాలతో నిరూపించారు. "యథేమాం వాచంకల్యాణీ మావదాని జనేభ్యః బ్రహ్మరా జాన్యా భ్యాం శూద్రాయ చార్యాయ స్వాయ చారణాయ" ఇత్యాది శ్రుతి వచనాలనూ, "ఇమం మంత్రం పత్నీ పఠేత్" ఇత్యాది సూత్ర వచనాలనూ నిర్దేశించి వారు స్త్రీలు వేదం చదువవచ్చు అని చెప్పారు. అందుకై కన్యా గురుకులాలను కూడా వారు స్థాపించారు. సమజాంలో ఏకారణంతోనో ఒకఆచారం ఏర్పడిన తర్వాత, అది అనుచితమైనదైనా సరే, దానిని తొలగించడం కష్టసాధ్యం. అది మహాపురుష లకే సాధ్యం అవుతుంది. అస్పృశ్యతాది దురాచారాలు ఎంతగా ప్రయత్నించినా ఇంకా సమాజంలో అక్కడక్కడా పాటింపబడుతుండడం అనుభవంలో ఉన్న విషయమే. అందు వల్ల స్త్రీలు వేదం చదువ కూడదన్న మూఢవిశ్వాసాన్ని కూడా క్రమంగా ప్రయత్నంతో తొలగించి వైదికమతాన్ని పునరుద్ధరించుకోవాలి.

## 470. శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ముడుపు ఏవిధంగా కట్టాలి ? ఎలా చెల్లించాలి. వీటికి నియమ నిబంధనలు ఏమైనా ఉన్నాయా ?

సామాన్యముగా శ్రీవేంకటేశ్వరస్వామి వారికి భక్తితత్పరతతో ముడుపు కట్టే సంప్రదాయము మనవారికందరికినీ అలవాటుగా ఉంది. స్నానముచేసి

MOHAN PUBLICATIONS.COM

స్వామివారికి దీపమును వెలిగించి ఒకచిన్న పసుపుగుడ్డలో తమశక్తికి తోచినంత డబ్బును ఒక చిన్న మూటాగాకట్టి తమకున్న ఆధి వ్యాధులను తొలగించమని ప్రార్థనా పూర్వకముగా ఆ మూటను ఎత్తిపెట్టి తాము కానీ తమవారు కానీ తిరుమలకు వెళ్లినపుడు ఆ మూటను స్వామివారి హుండీలో వేస్తూ ఉంటారు. కొందరు ఒక హుండీ వంటిదానిలో అపుడప్పుడు డబ్బును వేసి ఆ దాచిన డబ్బునుకూడ స్వామివారి హుండీలో వేస్తూ ఉంటారు.

## 471. దశవిధ నాడులు ఏవి ?

మనుష్యుని శరీరాంతర్భాగమున గలవు.వీనినే నాడీ దశకమని పిలిచెదరు. వాని వివరములు ఈవిధంగా చెప్పియున్నారు.

1. పింగళనాడి ముక్కునకు కుడిభాగము ఉండును. సూర్యుడు, విష్ణువు అధిదేవత.
2. ఇడనాడి ముక్కునకు ఎడమభాగమున ఉండును. చంద్రనాడి శివుడధి దేవత.
3. గాంధారినాడి కుడికన్నునందుండును. ఇంద్రుడధిపతి.
4. ఆస్తిని నాడి – నాలుకయందుండును. వరుణుడధిదేవత.
5. పూషానాడి – కుడి చెవియందుండును. దిగ్దేవత అధిపతి.
6. పయస్వినినాడి – ఎడమ చెవియందుండును. బ్రహ్మఅధిదేవత.
7. అలంబసనాడి – పురుషావయముస్థానము. అగ్ని అధిదేవత.
8. లకుహనాడి– గుదస్థానముననుండును. భూమి అధిదేవత.
9. సుషుమ్ననాడి – ముక్కుమధ్యనుండును. అధిదేవత బ్రహ్మ.
10. శంఖినినాడి – బొద్దునందుండును చంద్రుడధిదేవత.

మానవుని శరీరమునందలి ముఖ్యమగు నాడులివి. ఈ నాడులే కాక దాదాపు 700 నాడులు మానవునిలో శరీరాంతర్భాగములో ఉన్నవని తపస్వులు పేర్కొన్నారు. వానిని నాడీశాస్త్రాధ్యయనం ద్వారా గుర్తింపవచ్చును.

## 472. వినాయకుడు ఏకదంతుడు ఎలా అయ్యాడు ?

బ్రహ్మాండపురాణమున వినాయకుడు ఏకదంతుడగుటకు కారణమును తెలిపే కథ ఉన్నది. పరశురాముడు కార్తవీర్యుని సంహరించిన తరువాత శివుని చూచుటకై వచ్చినాడు. ఆ సమయము, పార్వతీ పరమేశ్వరులు ఏకాంతముగా నుండినారు. వాకిటిలో నున్న విఘ్నేశ్వరుడు లోనికేగుటకు అది సమయము కాదని చెప్పగా, తన్నడ్డుకొనుటకు నీవెవ్వడవని పరశురాముడు ధిక్కరించి శివ పార్వతులున్నచోటునకు వెళ్లుటకై దూకుడుగా పోబోగా వారిర్వురకును సంఘర్షణ మేర్పడినది. అపుడు విఘ్నేశ్వరుడు తన తొండముతోచుట్టి పరశురాముని పైకెత్తినాడు. ఊర్ధ్వలోకములు ఏడును పరశురామునకు కనుపించి ఆతడు భయకంపితుడగునట్లు చేసినది. ఆ సమయమందు పరశురాముడు తన గండ్ర గొడ్డలితో కొట్టగా వినాయకుని దంతమొక్కటి. విరిగిపడినది. ఆనాటినుండి వినాయకుడు ఏకదంతుడైనాడు.





## 473. మన మతంలో ఇందరు దేవుళ్ళు ఎందుకున్నారు ?

మతమనే పదానికి ఆచార వ్యవహారాదులకు సంబంధించిన విషయంగా చెప్పుకోవచ్చును. ఉదా. మనది సతానమైన వైదికమతమను కొందాము. వేదంలో ఎందరినో పేర్కొన్నారు. వారికంతా దైవత్త్వమును ఆరోపించినారు. ఒకే దైవ మును ఆరాధించేవారు కూడా సహస్రనామాలతో ఆ దైవాన్ని పూజించడము ఎటువంటిదో లోతుగా ఊహిస్తే అన్నీ ఒకే తత్త్వమనే విషయం బోధపడుతుంది. వేర్వేరు పంథాలలో పూజించే వారి వారి అభీష్టాల కొద్దీ ఏర్పరచుకొన్నదే కాని మరేమికాదు. అని తాత్త్వికులంటారు. ప్రధానంగా త్రిమూర్తులను మనవారు పేర్కొంటారు. దీనికి కారణం త్రిగుణాత్మకమైన మానవుని వ్యక్తిత్వము (సత్త్వ రజస్తమోగుణము) ఈ మూడు రూపాలని భావించడమే మన ప్రాచీనుల తత్త్వము. ఇక ఇందరు దేవుళ్ళంటేనా ఇటీవలి ఆ కాలంలో మన కళ్ళముందే గతించినవారికి కూడా దేవాలయాలు కడుతూ ఉన్నారు. మానవుని మనస్తత్త్వపు స్థితి దీనిని తెల్పుతూ ఉంది.

## 474. మరణించినవారికి శ్రాద్ధకర్మలు నిర్వహించడంలోని అసలు రహస్యం ఏమిటి ? కర్మకాండ జరుపకపోతే ఏమి జరుగుతుంది ?

మనిషిపుట్టిన నాటినుండి గిట్టేదాకా (చనిపోయేదాకా) ఎన్నో కార్యకలాపాలు జరుపుతూ ఉంటారు. మనదేశంలో ఆచరించే కర్మకలాపాలు ఎన్నో విధాలుగా ఉన్నవి. ఒక కుటుంబంలో మనిషి పుట్టుకకు కారణమైన తల్లినీ, తండ్రినీ మరచిపోనివారు కొందరూ, మరచిపోయేవారు కొందరూ ఉన్నారు. వేద ధర్మముననుసరించి మానవుడు తన సంతానంలో తన ప్రతిబింబాన్ని చూస్తాడు. అందుకే ఆత్మావై పుత్రనామాసి అని అన్నారు. మనవారి నమ్మకం ప్రకారం ప్రతిప్రాణికీ తల్లికడుపున ఉన్నప్పటినుండి మరణించేదాకా అనేక రకాలైన సంస్కారాలు చెప్పియున్నారు. వానిని

ఆచరించేవారు కొందరూ ఆచరించకపోతే ఏమనేవారు కొందరూఉన్నారు. అయితే ఆత్మ తృప్తి కోసమై కార్యకలాపాలు జరుపుతున్నామనువారు కూడా ఉన్నారు. అసలు 'శ్రాద్ధకర్మను' శ్రద్ధగా చేయవలెనంటారు శ్రద్ధతో చేయక పోతే ఏమవుతుందంటే మనిషి స్నానంచేయకపోతే ఏమవుతుందని ప్రశ్నించి నట్లవుతుంది. శరీరముమీద ఉండే కర్మలమగు స్థితిని పోగొట్టు కోవడమునకై స్నానంచేసి శుభ్రంగా వుండడము ఎంత ముఖ్యమో మన జన్మకారకులను తలచుకొని చేసే కర్మకూడా అంతే ముఖ్యము. కాదంటారా ఆయా వ్యక్తుల నమ్మకమని వదలవలసిందే. మరొక్క విషయం కూడా గమనించండి. చనిపోయినవారు మరల జన్మించేటప్పుడు పూర్వ జన్మసుకృతం కారణంగా మన మధ్యనే జన్మిస్తారనే నమ్మకం కూడా ఇది ఉపయుక్తమవుతుందని నమ్మకం కూడా మనవారి కుంది.

## 475. నారాయణకవచ ప్రాశస్త్యము ఏమిటి ?

శ్రీమద్భాగవతంలోని ఆరవ స్కంధంలో ఎనిమిదవ అధ్యాయంలో వున్న ప్రార్థనా పద్యాల సముచ్చయమే 'నారాయణకవచం'

ఒకసారి ఇంద్రుడు దేవతల గురువైన బృహస్పతిని అవమానించాడు. మనస్తాపం చెందిన దేవ గురువు దేవలోకం వదలి ఎక్కడికో పోయాడు. అప్పుడు దేవతలు 'విశ్వరూపుడు' అనేవాణ్ణి పురోహితుడుగా స్వీకరించారు. ఇంద్రుని ప్రార్థన ననుసరించి విశ్వరూపుడు అతనికి నారాయణకవచం ఉపదేశించాడు. భయావమైన పరిస్థితి సంభవిస్తే నారాయణరూపమైన కవచాన్ని రక్షణగా ధరిం చాలి. "ఓం నమో నారాయణాయ" "ఓం నమో వాసుదేవాయ" ఓం విష్ణవే నమః అనే మంత్రాలను అంగన్యాస కరన్యాసాదు లలో వినియోగించాలి. ఇలా న్యాసం చేసిన వ్యక్తి మంత్ర స్వరూపుడవుతాడని 'నారాయణకవచం' చెబుతున్నది. ఆపై పరమాత్మను ధ్యానించాలి. 'ఓం హరి ర్విదధ్యాన్మమ సర్వరక్షాం' (6-8-12) మొదలు 'స్వతేజసాగ్రస్త సమస్త తేజః'(6-8-34) వరకూ ప్రార్థనా శ్లోకాలను పఠించాలి. ఈమంత్రభాగమే నారాయణకవచ మనబడుతున్నది. ఇందులో 23 శ్లోకాలున్నాయి. ఈ ప్రార్థనలో శ్రీమహావిష్ణువు,వామనుడు, నృసింహుడు, వరాహమూర్తి, పరశు రాముడు, శ్రీరాముడు, దత్తాత్రేయుడు, కపిలుడు, సనత్కు మారుడు, హయ గ్రీవుడు, నారదుడు ఇత్యాదులు ప్రస్తుతింపబడ్డారు. ఈ స్తుతితో భయం తొలగుతుంది. ఇంద్రుడు దీనిని పఠించి అసురులను జయించి త్రైలోక్య లక్ష్మిని పొందాడని భాగవతం చెబుతున్నది.



## 476. గురువు ఎవరు ? నిజమైన గురువును ఎలా గుర్తించాలి?

గు శబ్ద స్త్వంధ కారః స్యాత్ రు శబ్ద స్తన్నిరోధకః
అంధకార నిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే

అని అద్వయతారకోపనిషత్తు 'గురు'శబ్దానికి అర్థాన్ని వివరించింది.

'గు'అనగా అజ్ఞానమనే అంధకారం 'రు' అంటే దానిని నిరోధించేవాడు అని అర్థం. అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానబోధ కావించేవాడు 'గురువు' అని భావం. గుణ రూపాలకు అతీతుడైనవాడు 'గురువు'అనికూడా గురు శబ్దానికి నిర్వచనం చెప్పడం కద్దు. కపటవేషధారులైన గురువుల కూడా సమాజంలో వుంటారు. కాబట్టి నిజమైన గరువును గుర్తించడంలో జాగరూకతతో వహించాలి. చాతుర్యం కలవాడు, వివేకవంతుడు, ఆత్మజ్ఞానం కలవాడు, బాహ్యశుద్ధి అంతర శుద్ధి కలవాడు, నిర్మలచిత్తుడు, శాంతాత్ముడు, సాధుస్వభావుడు , మితభాషి, కామక్రోధాదులు లేనివాడు, సదాచారవంతుడు, ఇంద్రియ నిగ్రహం కలవాడు, వేదవిజ్ఞాన సంపన్నుడు, అహింసా సత్యాది గుణాలు కలవాడు, జపధ్యాన పరాయణుడు, నిరహంకారుడు, శాస్త్రజ్ఞుడు, బ్రహ్మవిష్ణుడు అయినవాడు నిజమైన గురువు అని శాస్త్రాలు వర్ణించాయి. ఈ లక్షణాలను బట్టి గురువును గుర్తించాలి.

## 477. దక్షునకు సంతానం ఎంతమంది ? వారెవరు ?

దక్షప్రజాపతి సృష్టి వికాసం అభిలషించి మొదట హర్యశ్వు లనబడే పదివేల మంది పుత్రులను కన్నాడు. వారందరూ నారదుని బోధతో సంసారా నికి దూరమై తపోమార్గం అనుసరించారు. దక్షుడు మరలవెయ్యి మంది పుత్రులను కన్నాడు. వారికి 'శబాలాశ్వు'లనిపేరు. వారు కూడా నారదుని బోధకులోనై అగ్రజులమార్గం అనుసరించారు. అంతట కోపించిన దక్షుడు 'దేశద్రిమ్మరివికమ్ము' అని నారదుణ్ణి శపించి మరల అరువది మంది పుత్రిక లను కన్నాడు. వారిపేర్లు 1. భానువు 2. లంబ 3. కకుప్ 4. జామి 5. విశ్వ 6. సాధ్య 7. మరుత్వతి 8. వసువు 9. ముహుర్త 10. సంకల్ప ఈ పదిమందిని ధర్మునకిచ్చి వివాహం చేశాడు.

11. అశ్విని 12. భరణి 13. కృత్తిక 14. రోహిణి 15. మృగశిర 16. ఆర్ద్ర 17. పునర్వసు 18. పుష్యమి 19. ఆశ్లేష 20. మఘ 21. పుబ్బ 22. ఉత్తర 23. హస్త 24. చిత్త 25. స్వాతి 26. విశాఖ 27. అనూరాధ 28. జ్యేష్ఠ 29. మూల 30. పూర్వషాడ 31. ఉత్తరాషాడ 32. శ్రవణ 33. ధనిష్ఠ 34. శతభిష 35. పూర్వభాద్ర 36. ఉత్తరాభాద్ర 37. రేవతి వీరందరినీ చంద్రునికిచ్చాడు.



MOHAN PUBLICATIONS.COM

38. అదితి 39. దితి 40. దనువు 41. కాష్ఠ 42. అరిష్ఠ 43. సురస 44. అల 45. ముని 46. క్రోధవశ 47. తామ్ర 48. సురభి 49. సరమ 50. తిమి అనే పదముగ్గురిని కశ్యపుని కిచ్చి పరిణయం చేశాడు. 51. సరూప 52. భూత అనే ఇద్దరిని రుద్రుని కిచ్చాడు. 53. స్వధ 54. సతి అనే ఇద్దరిని అంగీరసుని కిచ్చాడు. 55. అర్చి 56. ధిషణ వీరిని కృశాశ్వనికిచ్చి వివాహం చేశాడు. తక్కిన 57. వినత 58. కద్రువ 59. పతంగి 60. యామిని అనే నల్గురిని తార్ర్యుని కిచ్చి పరిణయం కావించాడు. వీరిలో చంద్రుని భార్యలకు సంతతిలేదు. తక్కిన వారందరూ సంతాన వంతులై దక్షుని ప్రజాపతిత్వాన్ని సార్థకం కావించారు.

### 478. కర్ణుని జన్మరహస్యం భీష్మ పితామహులకు తెలుసునా ?

భీష్మునికి కర్ణుని జన్మరహస్యం తెలుసు. భారతయుద్ధంలో కౌరవ సేనకు ఆధిపత్యం వహించిన భీష్ముడు పదిరోజులు యుద్ధంచేసి శరశయ్యా గతుడవు తాడు. అంతవరకూ భీష్మునిమీది రోషంతో యుద్ధంలో పాల్గొనని కర్ణుడు అప్పుడు భీష్మునివద్దకు వచ్చి పాద నమస్కారం చేస్తాడు. భీష్ముడు కర్ణుణ్ణి ఒక్క చేతితో కౌగలించుకొని అక్కడ ఉన్న రక్షక భటులను దూరంగా పొమ్మంటాడు. అతనిపై తనకు కోపం లేదంటాడు. తరువాత –

నీయుదయము దైవిక గ ర్భాయుత్తము నీకు మర్త్యుల్య సదృక్షులు గేం
తేయుడవు గాని విను రాధేయుడవు గావు నీవు ధీర విచారా !
–భారతం–భీష్మ 3–444

కర్ణుని జన్మ రహస్యాన్ని ప్రకటిస్తాడు. ఈ విషయం వ్యాసుని ద్వారా తనకు తెలిసిందంటాడు. అతని తేజో విశేషంవల్ల తాను గూడా సంగతి గ్రహించానంటాడు. ఆపై పాండవులతో కలుసుకొమ్మని సలహా ఇస్తాడు. కర్ణుడు మెత్తగా అందుకు కాదంటాడు. అందువల్ల భీష్మ పితామహునికి కర్ణుని జన్మరహస్యం తెలుసునని వ్యక్తమవుతున్నది.

### 479. దశరథునకు ఋష్యశృంగుడు అల్లుడెలా అయ్యాడు ?

ఋష్యశృంగుడు విభాండకుడను మునియొక్క పుత్రుడు. బాల్యంలో ఆశ్ర మంలో జీవిస్తూ స్త్రీ ముఖం చూచినవాడుకాడు. వేదాధ్యయనం, వైదిక క్రియలతో కాలం గడిపి ప్రభావ సంపన్నుడైనాడు. దశరథునకు 'సురభి' అనుగ్రహంతో శాంత అనే పుత్రిక జన్మించింది. రోమపాదుడనే రాజునకు సంతానం లేకపోతే అతనికి పెంపుడు కూతురుగా దశరథుడు





శాంతను సమర్పించాడు. రోమపాదుని రాజ్యంలో వర్షాలు లేకపోవడంవల్ల ఋష్యశృంగుణ్ణి ఆ రాజు తన రాజ్యానికి పిలిపించుకున్నాడు. అతని రాకతో వర్షలు కురిశాయి. రోమపాదుడు అతనికి శాంతనిచ్చి పెండ్లిచేశాడు. ఈ రీతిగా ఋష్యశృంగుడు దశరథునికి, రోమపాదు నికీ అల్లుడైనాడు. ప్రభావ సంపన్నుడు కాబట్టి పుత్రకామేష్టికి ఆహ్వానమందు కొన్నాడు.

### 480. ప్రహ్లాదునికి సంతానం ఉన్నదా ?

ప్రహ్లాదునికి దేవి అను వనితతో వివాహమయింది. అతనికి ఆయుష్మం తుడు. శిబి, విరోచనుడు, కుంభుడు, నికుంభుడు అన్న అయిదు మంది పుత్రులు జన్మించారు.

### 481. వానప్రస్థానికీ, సన్న్యాసానికీ తేడా ఏమిటి ?

సనాతన ధర్మానికి చెందిన సంప్రదాయంలో బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం మరియు సన్న్యాసమని నాలుగు ఆశ్రమాలు ఉన్నాయి. ఇందులో చివరిదైన సన్న్యాసాశ్రమం మహోత్తమమైనది. తక్కిన మూడాశ్రమాలూ దానికి సోపానాలవంటివి. కొందరు గృహస్థ వానప్రస్థాశ్రమాలను పరిగ్రహించకుండా నేరుగా సన్న్యాసం స్వీకరిస్తారు. యదహరేవ విరజేత్, తదహరేవ ప్రవ్రజేత్ ఏ రోజున విరక్తి తీవ్రమవుతుందో ఆరోజుననే సన్న్యసించాలి. అన్న ప్రమాణాన్ని బట్టి అలా చేయడం కూడా శాస్త్రసిద్ధమే. అధిక సంఖ్యాకులు నాలుగాశ్రమాలనూ క్రమపద్ధతిలో పాటిస్తారు.

చతుర్థమాయుషోభాగం ఉషిత్వాఽఽద్యం గురవిహ
ద్వితీయమాయుషోభాగం కృతదారో గృహేవసేత్.
ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః
వనే వసేత్తునియమాత్ యథావ ద్విజితేంద్రియః
వనేషుతు విహృత్యైవం తృతీయం భాగమాయుషః
చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగా స్పరివ్రజేత్.

అనేవి ఇక్కడప్రమాణ శ్లోకాలు. మన జీవితకాలం ఆయుర్వర్షశతం మితం అన్నట్లు నూరు సంవత్సరాలు. అందులో మొదటి 25 సంవత్సరాల కాలాన్ని గురుకులంలో ఉంటూ బ్రహ్మచర్యాశ్రమంలో గడపాలి. రెండవ భాగాన్ని 26 నుండి 50 సంవత్సరాలవరకూ గృహస్థాశ్రమంలో ఉండాలి. ఆపై ఇంద్రియ నిగ్రహపరుడై 25 సంవత్సరాల కాలం వనంలో నివసిం

MOHAN PUBLICATIONS.COM

చాలి. అప్పటికి 75 సంవత్సరాలు నిండుతాయి. తక్కిన ఆయుర్భాగాన్ని సర్వసంగ పరిత్యాగపూర్వక మైన సన్న్యాసాశ్రమంలో గడపాలి.

వానప్రస్థాశ్రమకాలంలో భార్యను పుత్రుల సంరక్షణలో ఉంచాలి. అలాకాక ఆమె ఇష్టపడితే తనవద్దే ఉంచుకోవచ్చు. సన్న్యాసాశ్రమ సమయంలో మాత్రం భార్యాపుత్రాదులతో ఎట్టిసంబంధం ఉండరాదు. తపస్సుచే సమస్త పాపాలూ నశిస్తే మనస్సు పరిపక్వమవుతుంది. అప్పుడు సన్న్యాసం యోగికి స్వయంగానే సిద్ధిస్తుంది. అయినా శాస్త్రోక్తంగా సన్న్యాస దీక్షను మరొక గురువు నుండి పరిగ్రహించడం ఉచితం. సన్న్యాస స్వీకారానికి తగిన యోగ్యతను వాన ప్రస్థాశ్రమంలో సాధకుడు సాధించాలి. అందుచేత సన్న్యాసంపై మెట్టు కాగా వానప్రస్థం క్రిందిమెట్టు అవుతుంది. సన్న్యాసంలో కుటీచక, బహూచక, హంస, పరమహంస అని నాలుగు భేదాలున్నాయి. నారద పరివ్రాజకోపనిష త్తులో తురీయాతీతుడు, అవధూత అని ఇంకా రెండు భేదాలు పేర్కొనబడ్డాయి. ఇలాంటి భేదాలు వానప్రస్థులలో లేవు.

ఆత్మజ్ఞాన సంపాదనకై గృహారామాదులు వదలి వనానికో, ఆశ్రమానికో వెళ్ళిశాంత చిత్తుడై ఉండే స్థితినే వానప్రస్థం అంటారు. విఖనస ముని బోధించిన ధర్మాన్ని ఆచరించేవాడు కాన వానప్రస్థుని వైఖానసుడు అని కూడా అంటారు. వాన ప్రస్థుడు సాయంప్రాతః కాలాలలో అరణ్యంలో లభించే కందమూల, ఫలాదులతోనే హోమం, పంచమహాయజ్ఞాలు చేయాలి. సన్న్యాసికి యజ్ఞవిధి లేదు. నారద పరివ్రాజకోపనిషత్తు మొదలైన గ్రంథాలలో సన్న్యాసలక్షణాలు చాలా వివరంగా ప్రతిపాదింపబడివున్నాయి.

### 482. ముని, ఋషి, యోగి, సాధువు అంతా ఒకటేనా?

1. మన్యతే ఇతి మునిః అను వ్యుత్పత్తినిబట్టి 'ముని' అనే శబ్దం ఏర్పడింది. 'మనజ్ఞానే' అని ధాతువు. జ్ఞానం కలవాడు అని ఆ శబ్దానికి అర్థం. మౌనవ్రతం పాటించేవాని పేరుగా అమరకోశం పేర్కొన్నది.

2. ఋషి : 'జ్ఞానస్య పారమగాత్ ఇతి ఋషిః' అను వ్యుత్పత్తి ప్రకారం జ్ఞానముయొక్క ఆవలిగట్టును చేరినవాడు 'ఋషి' అవుతాడు. సత్యవాక్కు (సత్యం చెప్పేవాడు) అనునది దీని పర్యాయపదం.

3. యోగి : యోగః అస్యాస్తతియోగీ యోగం కలవాడు యోగి అనబడతాడు. యోగ శబ్దానికి అనేక అర్థాలున్నాయి. యోగశ్చిత్త వృత్తినిరోధః అని పతంజలి యోగసూత్రము ననుసరించి మనోవృత్తిని నిరోధించడం





యోగం. కర్మయోగం, భక్తియోగం, జ్ఞానయోగం అన్న వ్యవహారం కూడా ప్రసిద్ధం. కాబట్టి ఆయా యోగాలను అనుష్ఠించేవాడు 'యోగి' అవుతాడు.

4. సాధువు : 'సాధ్నోతీతి సాదుః' (సాధ సంసిద్ధౌ అని ధాతువు) కార్యాన్ని సాధించేవాడు సాధువు. 'సజ్జనుడు' అనే అర్థంలో కూడా ఈ శబ్దాన్ని ప్రయోగిస్తారు.

### 483. ఏకాదశరుద్రులు ఎవరు ?

శివోమహేశ్వరః శంభుః శ్రీకంఠో భవ ఈశ్వరః
మహాదేవః పశుపతిః నీలకంఠో వృషధ్వజః
పరమేశ ఇమే రుద్రా ఏకాదశ సమీరితాః

అని శివతత్త్వ రత్నాకరం. దీనినిబట్టి 1.శివుడు 2. మహేశ్వరుడు 3. శంభుడు 4. శ్రీకంఠుడు 5. భవుడు 6. ఈశ్వరుడు 7. మహాదేవుడు 8. పశుపతి 9. నీలకంఠుడు 10. వృషధ్వజుడు మరియు 11. పరమేశుడు అనువారు ఏకాదశరుద్రులు.

మరొక పక్షము ననుసరించి –

1. అజుడు 2. ఏకపాదుడు 3. అహిర్బుధ్న్యుడు 3. శంభుడు 4. త్వష్ట 5. రుద్రుడు 6. హరుడు 7. శంభుడు 8. త్ర్యంబకుడు 9. అపరాజితుడు 10. ఈశానుడు మరియు 11. త్రిభువనుడు అనువారు ఏకాదశ రుద్రులుగా పేర్కొనబడినారు. ఇంకా కొన్ని మతభేదాలు ఉన్నాయి. వాటి ప్రకారం పై పేర్లలో కొన్నింటికి బదులు వృషాకపి, కపర్ది, శర్వుడు మొదలైన పేర్లు వినబడు తున్నాయి.

### 484. ద్వాదశాదిత్యులు ఎవరు ?

ద్వాదశాదిత్యులు అన్న విషయంలో కూడా మతభేదాలు కానవస్తున్నాయి. ఒకమతాన్ని అనుసరించి మహాభారతం చెప్పినట్లు ఈ క్రింది వారు ద్వాదశాదిత్యులవుతారు.

1.ధాత 2. మిత్రుడు 3. అర్యముడు 4. శుక్రుడు 5. వరుణుడు 6. అంశుడు 7. భగుడు 8. వివస్వంతుడు 9. పుంషుడు 10. సవిత 11. త్వష్ట మరియు 12. విష్ణువు. మరొక పక్షంలో వీటిలోకొన్ని పేర్లకు బదులు–

1. జయంతుడు 2. భాస్కరుడు 3. భానుడు 4. హిరణ్యగర్భుడు 5. ఆదిత్యుడు ఇత్యాదిగా కల నామాలు పేర్కొనబడివున్నాయి.

MOHAN PUBLICATIONS.COM

**485. ఆవబృథ స్నానం అంటే ఏమిటి ?**

ఆవబృథము అనే మాటకు యజ్ఞాంతము లేక యజ్ఞం పూర్తి అయిన తరువాత అనే అర్ధం వాడుకలో ఉంది. యజ్ఞము కడపట అంటే యజ్ఞము పూర్తిఅయిన తరువాత న్యూనాతిరిక్త దోషపరిహారార్థము చేయుకర్మ. (అనగా యజ్ఞము చేసేటపుడు ఏవైనా హెచ్చు తగ్గులు జరిగియుంటే ఆ దోషము పోవుటకై చేసే శాంతి ప్రక్రియ) యజ్ఞమును చేయు కర్త యజ్ఞపరికరములు మంత్రపూర్వకముగా స్నానముచేసి శుద్ధిపొందు పద్ధతి. యజ్ఞమును చేయు నాతడు తాను తన ఇల్లాలు (ధర్మపత్ని) అభ్యంజన స్నానాదులుచేసి శుద్ధ సంకల్పముతో యజ్ఞమునకు కంకణ ధారులుగా దీక్షతో చేసేవారు. యజ్ఞాంతరమున దోషాపనోదముగా కంకణ విసర్జనముచేసి కర్త భార్యా సమేతుడుగా సమంత్రకముగా కావించు స్నానము.అనగా వారికి ప్రత్యేక ముగా ఒకపవిత్రత ఏర్పడినదనిపేరు.

మహాభారతంలో ధర్మజుడు ద్రౌపదీ సమేతంగా ఈ విధంగా చేసినాడు. ఇంకను హరిశ్చంద్రాదులు కూడా యజ్ఞాంతమున ఆవబృథ స్నానము చేసినట్లున్నది. ద్రౌపది ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణునితో రాయబారమును పంపు సమయంలో తనకు జరిగిన అవమానమును గూర్చి చెపుతూ "ఒకండు రాజసూ యావభృథంనందు శుచియై పెనుపొందినవేణిపట్ట అని అంటుంది. అంటే రాజసూయ యజ్ఞాంతమున మంత్రపూర్వక స్నానము కావించిన తలవెంట్రుకలనుపట్టి లాగి అవమానించినాడు. అని పవిత్రమైన తనవేణిని లాగినాడని.

**486. మహావిష్ణువుకు భూదేవి భార్య ఎలా అయింది ?**

హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు సోదరులు, తొలి హిరణ్యాక్షుడు శాపవశ మున విష్ణుని ఎదరించినాడు. ఆ సమయమున ఆ రక్కసుని ఆగడములకు అంతు లేకుండినది. విష్ణుని హతమార్చుటకై చాల ప్రయత్నము చేసినాడు. భూమిని గోళముగా చేసి తన గుప్పిటలో ఉంచు కొనుటకు ప్రయత్నము చేసినాడు. ఆ సమయమున మహావిష్ణువు ఆది వరాహమూర్తిగా రాక్షసుని చెరనుండి భూదేవికి విముక్తి కల్గించినాడు.

**487. సత్యనారాయణస్వామి వ్రతము ప్రాముఖ్యం ఏమిటి ?**

మానవులు జన్మాంతరాలలోను, ఈ జన్మంలోనూ తమ కోరికలు తీరు టకూ సకల సౌఖ్యాలతో సంతోష జీవితమును గడపే తుదకు మోక్ష సామ్రాజ్య మునకు చేరుకోవడమునకు జప, తపములు, వ్రతములూ చేస్తూ ఉంటారు. ప్రాచీనకాలంలో త్రిలోక సంచారి అయిన నారదుడు ఒక పర్యాయము వైకుంఠమునకు వెళ్లి వైకుంఠనాథునకు నమస్కారముచేసి తండ్రీ మానవులు నానావిద వ్యసనాలకూ అలవాటుపడి ఎన్నో బాధలు అనుభవిస్తున్నారు. వారి బాధలు తొలగి వారంతా సుఖముగా ఉండుటకు మార్గమేది. ఏ దైవమును ఆరాధించినవారి వ్యథలు తొలగును. అని ప్రశ్నించినాడట. దానికి విష్ణువు నారదా! పదునాల్గు లోకాలలో ప్రస్తుతము సేయుచుండు వ్రతములలో ఉత్తమ వ్రత మొక్కటి యున్నది. దాని పేరు 'సత్యనారాయణస్వామి వ్రతము' విధి నిర్దిష్ట విధానంగా ఆ వ్రతమునుచేస్తే సమస్త అరిష్టాలు తొలగి సుఖములు కల్గును.

ఒక పుణ్యక్షేత్రములో మానవుడు భక్తిశ్రద్ధా గరిష్ఠుడుగా ప్రదోష కాలము నందనుష్ఠానముతో ఈ వ్రతమును చేయవలెను. పూజానంతరము స్వామి ప్రసాదమును స్వీకరింపవలెను. ఈ పూజా విధానము వలన మానవులకు కోరికలు తీరగలవు. కలియుగంలో 'సత్యనారాయణవ్రతము' ఇష్టఫలసిద్ధికి లఘూయము. అని మహావిష్ణువు నారదుడునకు చెప్పినట్లు పురాణములలో నున్నది. ఈ వ్రతమును గూర్చిన గాథలు విశిష్టముగా ఉన్నవి. వివరములు ప్రతికల్పములో స్పష్టముగా ఉన్నవి. కోరికలు తీరుటకై కావించే వ్రతమిది. కథలలో నానావిధ జీవనములవారు పొందిన అనుభవములను వివరించి యున్నారు. కనుక ఆ కథలను చదువుట అవసరము.

**488. తిరుమలలో శ్రీవారి ఆలయంఎదురుగా ఉన్న గొల్లభామ మండపం యొక్క ప్రాముఖ్యత ఏమి ?**

తిరుమలస్వామి మహాద్వారానికి ఎదురుగా ఉన్న వీధిని సన్నిధి వీధి అంటారు. నేరుగా వెళ్లి చూస్తే ఎదురుగా బేడి ఆంజనేయస్వామి ఉన్నారు. గుడికి ఎదురుగా ఉట్లమెట్లను ఎక్కితే నాల్గు రాతి స్తంభాలతో పై ఒక్క కలశం ఉండే మంటపం మనము దాటుకొని వెళ్లవలసి ఉంది. ఆ మంటప మునే 'గొల్లభామ' మంటపం అంటారు. వెనుకటికి గొల్లభామ ఒకతె పాలు, పెరుగు ఆ ప్రాంతంలో భక్తులకు అమ్మేదట. కానీ శ్రీవైష్ణవ ఆచార్య పురుషులకు మాత్రం ఆరాధనా భావంతో ఉచితంగా ఇచ్చేదట ఆ గోపిక. ఆమె కూర్చున్న ఆచోట నిర్మితమైన మంటపం గనుక ఆ గోపికను తలపునకు తెచ్చేగాథను తలచు కొంటూ దానికి గొల్లభామ మంటపమనిపేరు వచ్చినదని పెద్దలు చెబుతారు.

### 489. వకుళాదేవి వంటసాల ఎక్కడ ఉన్నది ?

తిరుమలేశుని వంటసాలను పోటు వకుళమాలిక లేక వకుళాదేవి అని పిలువబడే ఆమె శ్రీవేంకటేశ్వరస్వామికి తల్లిగా పిలువ బడుతూ ఉంది. ఆమె విగ్రహంవాకిటికి దగ్గరలోనే ఉంది. ఈమెను వకుళాదేవి, పచనలక్ష్మి, మదపల్లి నాచ్చియార్ అని కూడా పిలుస్తుంటారు. ఈ సందర్భంలో ఒక ఐతిహ్యం చెపుతూ ఉన్నారు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణుని పెంచి పెద్దచేసిన నందగోపుని ఇల్లాలు యశోద శ్రీకృష్ణునకు వివాహాదికములు జరుపలేకపోయి నందులకు చింతించిందట. శ్రీకృష్ణుడామెను ఓదారుస్తూ కలియుగంలో తాను శ్రీనివాసావ తారం దాల్చినపుడు ఆమె వకుళమాతగా తనకు పెండ్లిచేయించే అదృష్టం కలుగుతుందని వరమిచ్చినాడట. కనుక ద్వాపరయుగంలో నందగోపుని ఇల్లాలైన యశోద కలియుగంలో వకుళమాతయై తన కోర్కె తీర్చుకున్నదని పురాణగాథ.

### 490. జపము ఏవిధముగా చేయాలి ?

భగవత్ప్రీతికి మానసిక వికాసానికీ జపతపాదులు చేస్తారు. తాను ఉపదేశము పొందిన మంత్రమును నిశ్చలమగు మనసుతో అంతరాత్మావ లోకనతత్పరతతో ఏకాగ్ర మనస్కుడుగా అన్యచింతన లేకుండా తనలో తాను తలచుకొంటూ చేసే దైవధ్యానము జపము, కనుక 'జపము'అనే మాటకు సరియైన అర్థమును తెలిసికొనవలసియుంది. అంగన్యాస కరన్యాసాది విధితో ధ్యానమంత్రమునుచెప్పి నిశ్చలమనముతో వెలికి తెలియ రాని విధంగా ప్రశాం తంగా చేసే దైవ ధ్యానమే జపము.

### 491. మలయప్పస్వామి అన్నపేరు ఎలా వచ్చింది ? అన్ని ఆలయాలలోను ఉత్సవర్లకు పేర్లు ఉంటాయా ?

తమిళంలో మలై అంటే కొండ కనుక కొండమీది ఆరాధ్యమూర్తిని మలయప్ప అని పిలచుట కలదు. అందువల్ల ఆ పేరు వచ్చింది. ప్రతి ఆలయంలోని ఉత్సవమూర్తులకూ ఆయాస్థలవిశేషాలనుబట్టి పేర్లుంటున్నవి.

### 492. చంపక ప్రదక్షిణ విధి విధానాలు ఏమిటి ?

చంపక మనగా సంపెంగ. ఇది తీగగాను, ద్రుమమునుండి కూడ చిగుర్చు పూవు. ఏ మంగళకార్యానికైనా మనవారు ప్రదక్షిణముగా కార్యారంభము కావించే వారు. కనుక చంపక వృక్షమునకు ప్రదక్షిణము చేయుటకు ప్రత్యేక విధులుం డవు. ఉదా. తులసి, బిల్వము మొదలగు చెట్లకు కూడ ప్రదక్షిణగానే వచ్చి పూజలు చేసే ఆచారము ఉన్నది.





### 493. నవనాథులు ఎవరు ?

నవనాథులు వీరశైవ మతమునకు సంబంధించినవారు తాంత్రికులు కూడ. నవనాథులు యోగసిద్ధికలవారుగా మాత్రమేకాదు. వ్యాసులు కూడాను, గౌరన అనే కవీశ్వరుడు నవనాథ చరిత్రను ద్విపద కావ్యముగా రచించినాడు. ఈ నవనాథ సిద్ధులనుగూర్చి మహారాష్ట్ర, హిందీలలో చాలా కథ లున్నవి. "గోన నవనాథచరిత్ర రచనాకాలము క్రీ.శ. 5వ శతాబ్దము నాటిది. ఆ కావ్యము ననుసరించి ఆదినాథుడు పరమశివుడు. పరమశివుని అనుగ్రహ మున మీన నాధుడనబడు మత్స్యేంద్రనాథుడు ఆధ్యాత్మిక విద్యను పొంది పరమశివుని యాదేశమున తీర్థయాత్రలు కావించి కళింగ, బంగాళ మొద లగు దేశములు పర్యటించుచు చౌరంగి మొదలగు ఎనిమిది మందిని శిష్యులుగా స్వీకరించినాడు. తన శిష్యులతో కలసి వెరశి తొమ్మిది మంది నవనాథులని లోకంలో ప్రసిద్ధి నందినారు. నవనాథ సిద్ధులు ప్రజలకు మేలు చేకూరుస్తూ ఉండేవారు. క్రీ.శ. 9,10 శతాబ్దాలలో నేపాలు ప్రాంత మున శైవ, బౌద్ధమతముల నుండి ఈ నాథసిద్ధుల సంప్రదాయము మొదలై నట్లు చరిత్ర చెపుతూఉన్నది. ఈ సిద్ధ సంప్రదాయము హిమాలయము నుండి సేతువుదాకా భారతదేశమున వ్యాపించినది. ఈ నవనాథుల పేర్లు సంకేత పదకోశమున నిట్లున్నది.

1. సత్యనాథుడు 2. సలోకనాథుడు 3. ఆదినాథుడు 4. అనాది నాథుడు 5. అకుళితనాథుడు 6. మాతంగ నాథుడు 7. మత్స్యేంద్రనాథుడు 8. ఘటియాత్ర నాథుడు 9. గోరక్షనాథుడు అని పేర్కొన్నట్లు తెలియుచున్నది.

### 494. ఊర్ధ్వ పుండ్రములు ఎందుకు ధరిస్తారు ? వాటి ప్రభావమేమి ?

ఆర్యమతంలో ముఖధారణం (బొట్టు)ఒక ఆర్షసంప్రదాయంగా ఏర్ప డింది. అది త్రిపుండ్రము, ఊర్ధ్వ పుండ్రాలు అని ముఖ్యంగా రెండు రకాలు, వైష్ణవులు ఊర్ధ్వ పుండ్రాలు ధరిస్తారు. స్త్రీలు తిలకధారణ చేస్తారు. తిరుమణిని నిలువున మూడురేఖలుగా ధరించడాన్నే ఊర్ధ్వ పుండ్రధారణ మంటారు. ఈ మూడురేఖలు అకార,ఉకార,మకార స్వరూపమైనప్రణవాన్ని సూచిస్తాయి. అకారం సత్త్వ స్వరూపుడైన విష్ణువునూ, ఉకారం చిత్త్వ స్వరూపిణి అయిన మహాలక్ష్మిని మకారం భగవద్భక్తులైన భాగవతులనూ తెలియజేస్తాయని చెబుతారు. శైవులు భస్మాన్ని మూడుఅడ్డరేఖలుగా నుదుటధరిస్తారు. తిరు మణి మట్టి (మృత్)కి సంబంధించినది. కావున అది మట్టినుండి కల్గిన

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

ఈ శరీరం చివరికి మట్టిలోనే కలిసిపోతుందని సూచిస్తు న్నది. ఇందువల్ల వైరాగ్యం కలుగుతుంది. ముక్తికోరే వానికి వైరాగ్యం చాలా ముఖ్యం. విబూది ధారణ కూడా ఈశరీరం చివరికి బూడిదఅయ్యేదే అనే తత్త్వాన్ని నిర్దేశిస్తుంది. ముఖధారణ లేకుండా చేసే సత్కర్మలు నిరర్ధకాలని ఆగమాలు పేర్కొన్నాయి.

ద్వాదశ (12) ఊర్ధ్వ పుండ్రాలు ధరించడం కూడా కద్దు. నాడులు, హృదయం మొదలైన శరీరభాగాలను చల్లబరచుటకు కూడా ఆయా స్థానాలలో ఊర్ధ్వపుండ్రధారణ అవసరమని వైజ్ఞానికంగా విశ్లేషణ చేసి కొందరు వివరిస్తున్నారు. ఊర్ధ్వపుండ్రంలో ఉపయోగించే వస్తువులకు చల్లదనం కల్గించే లక్షణం ఉన్నది.

### 495. వాల్మీకి రామాయాణాన్ని ఎప్పుడు వ్రాశాడు ? రాముడి జననానికి ముందా ? లేక తరువాత ?

వాల్మీకి త్రేతాయుగంలో రాముడు జీవించివున్న కాలంలోనే రామాయణాన్ని రచించినట్లు రామాయణం నుండే తెలుస్తున్నది. ఆ మహర్షి ఒకనాటి మధ్యాహ్నం తమసా నదికి స్నానానికై వెళ్ళాడు. అక్కడ బోయవాడొకడు క్రౌంచ పక్షుల జంటలో ఒకపక్షిని బాణంతో కొట్టి చంపాడు. అదిచూచి శోకానికి గురి అయిన వాల్మీకి అతణ్ణి శపించాడు. ఆ శాపవచనం ఛందోబద్ధంగా ఆయన నుండి వెలువడింది. ఆశ్రమానికి పోయి దానిని గురించి ఆలోచిస్తూ వుండగా బ్రహ్మ ప్రత్యక్షమై "ఋషీ! నీకు శబ్దబ్రహ్మం స్వాధీన మయింది. ఆర్ష దృష్టితో నీవు రాముని చరిత్రను చెప్పు"అని చెప్పి అంతర్ధాన మయ్యాడు.

తరువాత నారదుడు వాల్మీకి చెంతకు వచ్చాడు. వాల్మీకి "ఈ లోకంలో ఇప్పుడు గుణవంతుడూ, వీర్యవంతుడూ, ధర్మజ్ఞుడూ, కృతజ్ఞుడూ" ఇత్యాదిగా పదునారు గుణాలు కల్గినవాడు ఎవడు? అని ప్రశ్నించాడు. నారదుడు అట్టి వాడు అయోధ్యాధిపతి శ్రీరాముడే అని చెప్పి రామకథను సంగ్రహంగా వివ రించాడు. ఈలోకంలో ఇప్పుడు ప్రశ్నించడాన్నిబట్టి అప్పుడు రాముడు రాజ్యం చేస్తున్నట్లు స్పష్టమవుతున్నది. అందుచేత వాల్మీకి రామాయణాన్ని రాముని జననానంతరమే వ్రాశాడనేది స్పష్టం.

### 496. ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి ఎవరి కుమార్తెలు ?

మాండవి, శ్రుతకీర్తి జనకుని సోదరుడగు కుశధ్వజుని పుత్రికలనడంలో ఎలాంటి సంశయమూలేదు. ఊర్మిళ గూడ కుశధ్వజుని పుత్రికయే యని





పూర్వ గాథాలహరి పేర్కొంటున్నది. కంబరామాయణము గూడ ఊర్మిళను కుశధ్వజుని కూతురునియే నిర్దేశిస్తున్నది.

కంబ రామాయణం (బాలకాండం 139వపుట) శ్రీ పూతలపట్టువారి అనువాదము. దీనినిబట్టి సీతారాముల పెండ్లి తరువాత జరిగిన ముగ్గురు సోద రుల వివాహములో ఊర్మిళ మున్నగు ముగ్గురు కుశధ్వజుని కుమార్తెలనీ వారిని లక్ష్మణాదులు చేపట్టారని తెలుస్తున్నది. కంబకవి ఏ రామాయణము నాధార ముగా గొని ఇలా వ్రాశాడో తెలియదు. ఇట్టి విషయాలలో మనకు ప్రమాణం వాల్మీకి రామాయణమే.

భ్రాతా యవీయాన్ ధర్మజ్ఞ ఏషరాజా కుశధ్వజః
అస్యధర్మాత్మనో రాజన్ రూపేణాప్రతిమం భువి
సుతాద్వయం నరశ్రేష్ఠ పత్న్యర్థం పరయామహే
భరతస్య కుమారస్య శత్రుఘ్నస్య చ ధీమతః

కుశధ్వజుని ఇరువురు పుత్రికలను భరత శత్రుఘ్నుల కిమ్మని విశ్వామిత్రుడు జనకుని కోరినాడు. జనకుడందు కంగీకరించాడు.

వసిష్ఠుడు జనకునితో రామలక్ష్మణయో రర్థే
త్వత్సుతే వరయే నృప సదృశాభ్యాం నరశ్రేష్ఠ
సదృశే ధాతుమర్హసి.

అని చెప్పాడు. నీ పుత్రికల లిరువురినీ రామలక్ష్మణులకిమ్మని తాత్పర్యం. "ఊర్మిళాజనకస్య ఔరసపుత్రీ"అని గోవిందరాజు వ్యాఖ్య. ఊర్మిళ జనకుని సొంతకూతురు అని దాని అర్థం. ఇందువల్ల వాల్మీకి రామాయణాన్ని ప్రమాణంగా గ్రహించి ఊర్మిళ జనకుని కూతురే అని గ్రహించాలి.

### 497. మానవునికి ఎన్ని జన్మలు వుంటాయి ?

"జీవులెనుబది నాల్గు లక్షల చావు పుట్టుకలిక్కిడ" అని చెప్పినట్లు 84 లక్షల జీవరాసులున్నాయంటారు. అందులో మానవ జన్మ చివరిది. దుర్లభమైన మానవ జన్మకు వచ్చిన తరువాత మళ్ళీ జన్మలు ఉంటాయా? అనేది ప్రశ్న. ఇందుకు ఆ జన్మలో మానవుని ప్రవర్తనను, లేదా స్థితిగతులను బట్టి ఆపై జన్మలు వుండవచ్చు లేదా లేకపోవచ్చు అని జవాబు చెప్పవలసి వస్తుంది. ఆత్మ జ్ఞానం కలిగేవరకూ మోక్షంరాదు. మోక్షం వచ్చేవరకూ జన్మలు తప్పవు. ఉత్తమ మైన సంస్కారం కలవారికి ఉత్తమజన్మలు, నీచసంస్కారం కలవారికి నీచజన్మలు సంభవిస్తాయని శాస్త్రాలు చెబు

MOHAN PUBLICATIONS.COM

తున్నాయి. అందువల్ల జ్ఞానంకల్గిమోక్షం సిద్ధించే టంతవరకూ ఎన్ని జన్మలైనా కలుగవచ్చు. ఆ జన్మలు ఇన్ని అని చెప్పడం సాధ్యంకాదు. అంతేగాక ఆ రానున్నజన్మలు మానవజన్మలుగానే ఉంటాయి. అనిగూడా చెప్పలేము. జడ భరతుడు మొదలైనవారి చరిత్రలు మానవులు తిరిగి పశుపక్ష్యాదులుగా గూడ పుట్టవచ్చుఅని నిరూపిస్తున్నాయి.

## 498. పంచభూతలింగాలు ఏవి ? ఎక్కడ ఉన్నాయి ? వాటి ప్రాశస్త్యం

పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనేవి పంచభూతాలు. శివుడు ఈ పంచభూతాల స్వరూపాలైన లింగరూపాలతో ఐదు క్షేత్రాలలో ప్రతిష్ఠితుడై ఉన్నాడు. 1. పృథ్వీలింగం-కంచి 2. జలలింగం-జంబుకేశ్వరం 3. తేజోలింగం-తిరువణ్ణామలై 4.వాయులింగం-శ్రీకాళహస్తి 5. ఆకాశ లింగం - చిదంబరం. ఇందులో కంచి, జంబుకేశ్వరం, తిరువణ్ణామలై, చిదంబరం అనే క్షేత్రాలు తమిళనాడులో ఉన్నాయి. శ్రీకాళహస్తి తిరుపతికి సమీపంలోఉన్నది.

కంచిలోని ఏకామ్రేశ్వరుడు పృథ్వీలింగరూపమై ఉన్నాడు. ఇక్కడి ఏకఫల మైన మామిడిచెట్టు కారణంగా ఈ దేవుడు ఏకామ్రేశ్వరుడయ్యాడు. కంచి ఏడు ముక్తిదాయక క్షేత్రాలలో ఒకటి. రామేశ్వరంలోని సైకతలింగంకూడా పృథ్వీలింగమే. జంబుకేశ్వరంలోని జలలింగం జలమయమై వుంటుంది. శివునకు జలం చాలాఇష్టం. ఆ దేవుడు అభిషేకప్రియుడు ఈక్షేత్రం తమిళ నాడులోని తిరుచినాపల్లివద్ద ఉన్నది. దక్షహింసవల్ల కల్గినపాపాన్ని తొల గించుకోవడానికి శివుడు జంబుకేశ్వరంలో తపస్సు చేశాడని పురాణగాథ.

తమిళనాడులోని అరుణాచలం తేజోలింగనిలయం. అరుణాచలం చుట్టూ చేసే ప్రదక్షిణం మహాపుణ్య ప్రదమంటారు. శ్రీరమణమహర్షి ఈ క్షేత్రంలో తపోనిష్టుడై వుండి జ్ఞానమార్గోపదేశంతో ప్రసిద్ధి పొందాడు. శ్రీకాళహస్తిని దక్షిణ కైలాసమంటారు. ఇక్కడ వాయులింగ ప్రతిష్ఠితమైనది. సాలెపురుగు, పాము, ఏనుగు అనే తిర్యగ్జంతువులు ఇక్కడి శివలింగాన్ని సేవించి ముక్తి పొందాయని శివపురాణం చెబుతున్నది. అందువల్లనే శ్రీకాళహస్తిగా ఈక్షేత్రం ప్రశస్తి కెక్కింది. ఆకాశలింగం చిదరంబరంలో ఉన్నది. ఇక్కడ ఏవిధమైన లింగాకారమూ కనిపించక నిరాకారమైన అంత రాళమే కానవస్తుంది. ఇది రూప రహితలింగం. అందువల్లనే ఆకాశ లింగంగా ప్రసిద్ధిగాంచింది. ఆకాశంలాగా శివుడు లేక ఆత్మసర్వవ్యాపి



అని దీనివల్ల తెలుస్తుంది. ఈ క్షేత్రం నిర్వికల్ప సమాధికి దోహదకారి. ఇలా పంచభూతాలకు ప్రతీకలైన ఈ లింగాలు పాంచభౌతికమైన జగమంతా దైవస్వరూపమే అనిచాటుతున్నాయి.

## 499. లలితా సహస్రనామ విశిష్టత ఏమిటి ?

శ్రీ విష్ణుసహస్రనామాలను పారాయణం చేసినట్లే అనేకులు భక్తిశ్రద్ధలతో లలితా సహస్రనామాలను పారాయణం చేస్తున్నారు. ఈ సహస్రనామ స్తోత్రం బ్రహ్మాండ పురాణంలో ఉన్నది. శ్రీ హయగ్రీవుడు అగస్త్య మహర్షికి ఈ నామాలను విశదీకరిస్తాడు. హయగ్రీవుడు జ్ఞానానందమయుడైన అవతార స్వరూపుడు. అగస్త్యుడు ఋషులలో శ్రేష్ఠుడు. వీరిరువురి సంవాదం కావడమే శ్రీలలితా సహస్రనామ ప్రాశస్త్యాన్ని వెల్లడిస్తున్నది.

శ్రీ విద్యారూపిణి, జగత్తును ధరించేది, సృష్టి స్థితిలయాలకు అధీశ్వరి అయిన మహాత్రిపురసుందరి యొక్క వైభవాన్ని ఈ స్తోత్రం కీర్తిస్తున్నది. ఇందులో ప్రతిపాదింపబడే దేవియొక్క మహిమ అనంతం కావడంవల్ల ఈ స్తోత్రానికి ఎంతో ప్రాధాన్యం కల్గింది. వెనువెంటనే సిద్ధికల్గించే తంత్ర గ్రంథాలకు చెందిన నామసహస్రాలలో ఇది చాలాముఖ్యమైనది. ఈ స్తోత్ర పారాయణం ద్వారా భక్తులు పరమాత్మను దేవీ రూపంలో ఉపాసించిన వారవుతారు. ఇందలి వెయ్యి నామాలు వెయ్యి మంత్రాలుగా భావింపబడు తున్నాయి. వీటికి అతి విస్తృతమైన భాష్యాలు వెలువడ్డాయి. శ్రీ విద్యా రణ్యులు, శ్రీశంకరులు, శ్రీభాస్కరరాయాదులు వ్రాసిన భాష్యాలు సుప్ర సిద్ధాలు. అందులో ఇందలి నామాలప్రాశస్త్యం వివరింప బడివున్నది. వశిన్యాది దేవతలు వ్యాసభగవానుని ద్వారా ఈ పవిత్ర నామావళిని పలికించారనే ప్రతీతి కద్దు. కుండలినీ యోగ రహస్యం, నిర్గుణోపాసన, సగుణోపాసన, శ్రీచక్రవర్ణన, చతుష్షష్టి యోగినీ విశేషాలు, లలితాంబికా తత్త్వం మున్నగు అనేక విశిష్ఠ విషయాలు ఈ సహస్రనామావళిలో కనిపిస్తాయి.

అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా

"అంతర్ముఖులైన వారిచే ఆరాధింపదగినది, బహిర్ముఖులకు మిక్కిలి దుర్లభ" అని ఇక్కడ దేవి కీర్తింపబడింది. ఈ మాటలు.

కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్ ఆ వృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్.

"ఒకానొక ధీరుడు అమృతత్వం కోరిచూపును అంతర్ముఖంచేసి ప్రత్య గాత్మను చూచాడు" అన్న కఠోపనిషత్తులోని మాటలతో సామ్యంకల్గి



MOHAN PUBLICATIONS.COM

వున్నాయి. అందుచేత ఉపనిషత్తత్త్వం ఈ నామావళిలో ఉన్నదని గ్రహించ వచ్చు. లలితాదేవి ఈ నామాలను పఠిస్తే మిక్కిలి ప్రీతి చెందుతుంది.

మత్ప్రీత్యా సకలాన్ కామాన్ లభతే నాత్ర సంశయః

అని చెప్పిన దేవి మాటలనుబట్టి ఈ స్తోత్రం సమస్తాభీష్టాలను సిద్ధింప జేస్తుందని తెలియవస్తున్నది. అంచేత ఈనామాలు మిక్కిలి ముఖ్యమైనవని గ్రహించాలి.

## 500. వేదవ్యాసుడు ఎవరు ?

శ్రీమన్నారాయణుడు 'అపాంతరతముడు' అనే మానవపుత్రుణ్ణి సృష్టించాడు. వేదాలను విభజించమని అతణ్ణి నియోగించాడు. బ్రహ్మ అతణ్ణి చూచి నాయనా! రావోబు కాలములో వశిష్ఠుని మనుమడైన పరాశరుని పుత్రుడవై పుట్టుదవుగాక అని చెప్పాడు.

బ్రహ్మదేవుడు చెప్పినట్లే వశిష్ఠునికి మనుమడూ, శక్తికి పుత్రుడూ అయిన పరాశరునకు సత్యవతియందు పుట్టినవాడు వేదవ్యాసుడు. ఇతడు మాతృ గర్భము నుండి పుట్టినవెంటనే 'తల్లీ! నాతో నీకు పని కల్గినప్పుడు నన్ను స్మరించు. వెంటనే నేను వస్తాను'అని చెప్పి వెళ్ళిపోయాడు.

వేదవ్యాసుడు జన్మించినపద్ధతి ఇది-పరాశరుడు ఒకసారి తీర్థయాత్రకై పోతూ యమునానదినిదాటవలసి వచ్చింది. అక్కడ పడవ నడుపుతూ వుండిన మత్స్యగంధిని చూచిఅతడు కామ పరవశుడయ్యాడు. ఆమె తన కన్యాత్వం దూషిత మవుతుందని భయపడింది. పరాశరుడు ఆమె కన్యాత్వం దూషితం కాకుండా వుండేటట్లు వరమిచ్చాడు. యమునా నదీతీరంలో చీకటిని సృష్టించాడు. ఆమెను పరిగ్రహించాడు. అప్పుడు మత్స్యగంధికీ, పరాశరునికీ పుట్టినవాడే వేదవ్యాసుడు. మత్స్యగంధికే సత్యవతి అనిపేరు. అందుకే వ్యాసుడుసాత్యవతేయుడయ్యాడు. ఈ వ్యాసుడు భారతాన్నీ, అష్టాదశ పురాణాలనూ, భాగవతాన్నీ, బ్రహ్మ సూత్రాలనూ రచించిన మహామహుడు. వ్యాసుడు ఒకడుకాడనీ, యుగ భేదాన్నిఅనుసరించి పెక్కుమంది వ్యాసులు ఉన్నారనీ కొన్ని గ్రంథాలు చెబుతున్నాయి.

## 501. శ్రావణకుమారుని తల్లిదండ్రుల నామధేయములు ఏమి? అతని వృత్తాంతము ఏమిటి?

శ్రావణకుమారుని తల్లిపేరు కుండ. తండ్రిపేరు శ్రవణుడు. శ్రావణ కుమారుడు వృద్ధులూ, గ్రుడ్డివారూ అయిన తల్లిదండ్రులను మిక్కిలి భక్తిశ్రద్ధలతో సేవిస్తూ వుండినాడు. ఒకసారి తల్లిదండ్రులకు నీరు తేవడానికై





అతడు ఒక నదికి వెళ్ళాడు. నీటిలో కుండను ముంచుతున్నప్పుడు బుడబుడమనే శబ్దం వచ్చింది. ఆ ప్రాంతానికి వేటకై వచ్చిన దశరథమహారాజు ఆ శబ్దంవిని ఏనుగు తొండంతో నీరు గ్రహించే శబ్దంగా భావించి శబ్దవేధి బాణం ఆవైపు ప్రయోగించాడు. ఆ బాణం మునికుమారునికి తగిలింది. అతడు ఆర్తనాదం చేశాడు. అదివిని దశరథుడు తన తప్పు గ్రహించి అతని చెంతకు వెళ్ళాడు. మునికుమారుడు తన తల్లిదండ్రుల స్థితి ఎరిగించి వారికి తన సంగతి తెలుప వలసినదిగా రాజును ప్రార్థించి ప్రాణం వదిలాడు. దశరథుడు విషణ్ణుడై అంధులైన అతని తల్లితండ్రులకు జరిగిన వృత్తాంతం వివరించాడు. అప్పుడు శ్రవణముని "నావలె నీవును పుత్రశోకంతో మరణింతువు"అని శపించి శరీరపరిత్యాగం చేశాడు. దశరథుడు శ్రీరాముడు వనవాసానికి వెళ్ళినపుడు కౌసల్యతో ఈ సంగతి చెప్పినట్లు రామాయణంలో ఉన్నది.

## 502. దశరథ మహారాజు పూర్వజన్మలో ఎవరు ?

దశరథుడు సూర్యవంశపురాజు. ఇతడు ఇందుమతి, అజమహారాజుల కుమారుడు. శ్రీరాముడు అరణ్యానికి పోయినప్పుడు ఇతడు పుత్రశోకంతో మరణించాడు. మరణానికి ముందు కౌసల్యతో తన పూర్వవృత్తాంతం చెప్పుకొన్నాడు. ఇక ఆధ్యాత్మ రామాయణాన్ని పరిశీలిస్తే దశరథుడు పూర్వం కశ్యప ప్రజాపతి అని తెలియవస్తున్నది. కశ్యపుడు తపస్సుచేసి మహావిష్ణువును తనకు కుమారుడుగా జన్మించమని ప్రార్థించాడు. విష్ణుదేవుడందు అంగీకరించాడు. కశ్యపుడు దశరథుడుగా జన్మించాడు. అదితి కౌసల్యగా పుట్టింది. విష్ణువు శ్రీరాముడుగా అవతరించాడు.

'యాచితః పుత్రభావాయ తథేత్యంగీ కృతంమయా
స ఇదానీం దశరథో భూత్వా తిష్ఠతి భూతలే'

అని విష్ణువు బ్రహ్మతో చెప్పినట్లు ఆధ్యాత్మ రామాయణంలో ఉన్నది. రావణుని సంహరించవలసినదిగా బ్రహ్మ విష్ణువును కోరినప్పుడు విష్ణువలా బ్రహ్మకు చెప్పాడు. కాన దశరథుడు పూర్వం కశ్యపుడుఅనిగ్రహించాలి.

## 503. మంచిగురువును ఎంచుకోవటం ఎలా ?

మంచిగురువును ఎంచుకొనే ముందు తాను మంచి శిష్యుడై ఉండాలి. గురువులకున్నట్లే శిష్యులకు గూడా మంచిలక్షణాలు నిర్దేశింపబడిఉన్నాయి. గురు శబ్దానికి అజ్ఞానమనే చీకటిని తొలగించేవాడు అనిఅర్థం.

MOHAN PUBLICATIONS.COM

అవిద్యాహృదయగ్రంధి బంధమోక్షో భవేద్యతః
తమేవ గురురిత్యాహుః గురుశబ్దార్ధ వేదినః

'అవిద్య' అనే హృదయంలోని ముడిని విప్పివేయువాడే గురువని గురు శబ్దానికి అర్ధం తెలిసిన వారు చెప్పారు. గురులక్షణాలు శాస్త్రాలలో ఇలా చెప్పబడి ఉన్నాయి.

చాతుర్యవాన్ వివేకీచ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే.
గురవో నిర్మలా శ్శాంతాః సాధవో మితభాషిణః
కామక్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః
ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః
యోగజ్ఞో యోగనిష్టశ్చ సదా యోగాత్మకః శుచిః

చాతుర్యం, వివేకం, ఆధ్యాత్మజ్ఞానం, నిర్మలచిత్తం, బహిరంతరశుద్ధి కలవాడు గురువుగా రాణిస్తాడు. నిర్మలులు, శాంతులు, సాధువులు, మిత భాషులు, కామక్రోధాది దుర్గుణాలు లేనివారు, మంచి ఆచారం పాలించేవారు. ఇంద్రియాలను జయించినవారు మంచి గురువులు.

మిథ్యాచారులు, కపట ప్రవృత్తిగల శుష్కవేదాంతులు కూడా కొందరు గురువేషధారులై ఉండడంకద్దు. అంచేత గురువులను ఎంచుకొనే ముందు నిశితంగా వారి యోగ్యతలను పరీక్షించి నమ్మకం కుదిరిన తరువాతనే వారి శిష్యత్వాన్ని అంగీకరించాలి. పురాణపురుషులలో ఎందరో గురువులున్నారు. వారిని గురించిన ప్రస్తావనపురాణ గ్రంధాలలో ఉన్నది. రామాయణంలో వసిష్ఠ వాసుదేవ భరద్వాజాదులు ఉత్తమ గురువులు. అట్లే గురుపరంపరలోని వ్యాస శుకాదులు గూడా గురూత్తములే. ఈ విషయం ఇంకా వివరంగా తెలియగోరే వారు గురుగీత, శుష్కవేదాంత తమోభాస్కరం మున్నగు గ్రంథాలు చూడండి.

### 504. అణిమాదులైన సిద్ధులు ఏవి ? ఎలా లభిస్తాయి ?

అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథాప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టసిద్ధయః 1. అణిమ 2. మహిమ 3. గరమి 4. లఘిమ 5. ప్రాప్తి 6.ప్రకామ్యం 7. ఈశత్వం 8. వశిత్వం అనేవి అష్టసిద్ధులు.

1.అణిమ : యోగసాధకులు స్థూల శరీరులైన అణుపరిమాణం కలవారు కావడమే అణిమ 2. మహిమ : సాధకుడు అల్పపరిమాణం





కలవాడైనా గగనం వలె విశాలస్వరూపుడు కావడమే. 3. గరిమ-సాధకుడు తేలికైన వాడైనను మిక్కిలి బరువుగలవాడుగా ఉండగలగడం. గరిమ. 4. లఘిమ - బరువైనవాడు గూడా దూదిపింజలాగా తేలికై ఆకాశంలో చరించడం లఘిమ. 5. ప్రాప్తి - భూమిపై ఉన్నవాడు తన వ్రేలికొనచే చంద్రుణ్ణి సైతం స్పృశించగలగడం ప్రాప్తి. ఇతనికి సమస్త పదార్థాలు అందుబాటులోకి వస్తాయి. 6. ప్రాకామ్యం-తన సంకల్పానికి ఏ విధమైన ఆటంకం లేకుండా ఉండడమే ప్రాకామ్యం. ఇతని సంకల్పాలన్నీ నెరవేరుతాయి. ఈసిద్ధి గలిగితే పంచభూతాలవల్ల నిరోధముండదు. 7. ఈశత్వం-భూత భౌతిక వస్తువుల ఉత్పత్తి వినాశాలను చేయగలగడం.ఈశత్వం. 8. వశిత్వం-పంచభూతాలను, ఘటాదులైన వస్తువులను తనవశంలో ఉంచుకోవడమే వశిత్వం. పతంజలి యోగశాస్త్రంలోని విభూతి పాదంలో 44వ సూత్రం భూతజయం అనే సిద్ధిని వివరిస్తున్నది. ఆ సిద్ధి ద్వారా అణిమాది సిద్ధులు కల్గుతాయి.

స్థూలస్వరూప సూక్ష్మాన్వయార్థ సత్త్వసంయమాత్ భూతజయం(3-44)
తతోఽణిమాది ప్రాదుర్భావఃకాయసంపత్తద్ధర్మానభిఘాతశ్చ (3-45)

ఇది యోగశాస్త్రానికి సంబంధించిన విషయం. ఆ శాస్త్రం ద్వారానే దీనిని గ్రహించాలి. ఊహః శబ్దోధ్యయనం దుఃఖ విఘాతాస్త్రయః సుహృత్ప్రాప్తిః దానంచ సిద్ధయోష్టౌ (సాంఖ్యకారిక) మరొక సంప్రదాయం ప్రకారం 1.ఊహము 2. శబ్దము 3.అధ్యయనం 4. ఆధ్యాత్మిక దుఃఖవిఘాతము 5. ఆధిభౌతిక దుఃఖవిఘాతము 6. ఆధిదైవిక దుఃఖవిఘాతము 7. సుహృత్ప్రాప్తి 8. దానం అనేవి అష్టసిద్ధులుగా పేర్కొనబడివున్నాయి.

### 505. యోగం ద్వారా మనిషి గాలిలోనికి లేవవచ్చునా ?

అష్టిసిద్ధులలో లఘిమ అనే సిద్ధిని సాధించిన సాధకుడు గాలిలోకి లేవగలడని యోగశాస్త్రం చెబుతున్నది.

### 506. ధర్మాన్ని నమ్ముకొని శ్రీరాముడు, పాండవులు చివరి వరకు కష్టపడ్డారు. దీనివలన ధర్మాన్ని ఎంత వరకు అనుసరించగలరు?

ఈ ప్రశ్న చాలా ఆసక్తిదాయకమైనది. సావధానంగా దీనికి సమాధానం గ్రహించాలి. ధర్మాత్ములు కష్టాల పాలయినట్లు పురాణకథలు వివరిస్తున్నాయి. 'రామోవిగ్రహవాన్ ధర్మః'రాముడు మూర్తీభవించిన ధర్మంగా ప్రసిద్ధి వహించాడు.అట్టి రామునికి కష్టాలు ఎందుకు వచ్చాయి అన్నది సందేహం.

MOHAN PUBLICATIONS.COM

ఒకవేళ రాముడు దేవుడు కాబట్టి బుద్ధిపూర్వకంగానే కష్టాల పాలయ్యాడు. అంటే ధర్మ రాజదులైన ఇతరుల సంగతి ఏమిటి? వారు ధర్మమయులుగా వర్ణింపబడినారు గదా! ఒకవ్యక్తి ఏ కష్టంలేకుండా జీవితమంతా హాయిగా గడిపితే అతని ధర్మ నిష్ఠ ఎట్టిదో లోకం గుర్తించదు. అలాంటివారెందరో కాలగర్భంలో కలసి పోయారు.

కష్టాలలో ధైర్యం కోల్పోక ధర్మం విడనాడక ఉన్నవారే మహనీయులుగా చరిత్రలో నిల్చిపోయారు. రాముడు పితృవాక్య పరిపాలన అనే ధర్మం ఆచరించ కుండా తండ్రిపై తిరుగుబాటుచేసి అయోధ్యానగరాన్ని చేజిక్కించు కొనివుంటే మన మీనాడు ఆయనను దేవునిగా పూజిస్తామా? హరిశ్చంద్రుడు ఎట్టి పరిస్థితులలోనూ సత్యం తప్పలేదు కాబట్టే ఈరోజు గాంధీ వంటి మహాత్ములకు ఆదర్శమైనాడు. ప్రహ్లాదుడు తండ్రిచే పెక్కు కష్టాలు పడడం వల్లనే భక్తాగ్రేసరు డుగా ప్రశస్తికెక్కాడు. సీత, సావిత్రి, దమయంతి మున్నగువారి చరిత్రలు ఇట్టివే. అందుచే ధర్మాత్ములకు బాధేసౌఖ్యమనే భావన ఉంటుంది. ఆపదల్లో ధైర్యం వీడని వాడే ధీరుడు. భాగవతంలో విష్ణువు బ్రహ్మతో ఇలా అంటాడు. ఎవ్వని గరుణింప నిచ్చించితినివాని, యఖిలవిత్తంబు నేనపహరింతు అంటే ధర్మాత్ముడైన భక్తుణ్ణి ధనహీనుణ్ణిచేసి భగవంతుడు పరీక్షిస్తాడు. ఆ పరీక్షలో నెగ్గడమే ధర్మ రహస్యం.

ధర్మాత్ములు తాత్కాలికంగా బాధపడినా చివరికి ఇహరపలోకాలలో తరగని ప్రతిష్ఠను ఆర్జిస్తారు. ఈ సత్యాన్ని పురాణకథలు మనకు బోధిస్తు న్నాయి. కష్ట పడడం కూడా ధర్మాచరణమానవాళికి ఎప్పటికీ అనుసరణీయం గానే ఉంటుంది. ఇందులో మరొక రహస్యమున్నది. ధర్మాత్ముడైనవాడు ఎంత పుణ్యం చేసినా, అతడు పూర్వకర్మ ఫలితంగా దుఃఖం పూర్తిగా అనుభవించే వరకూ పుణ్యఫల మైన సుఖం కలుగదు. పాపాత్ములు చేసిన పాపం వెంటనే దుష్ఫలం ఇవ్వకున్నా కాలక్రమంలో అతని పుత్రులు, పౌత్రులు మున్నగువారిలో ఆ ఫలం కనిపించ వచ్చు. భారతం శాంతి పర్వంలో ఈ సంగతి వివరించబడివున్నది.

కదాచిత్సుకృతం తాత ! కూటస్థమివ తిష్ఠతి
మజ్జమానస్య సంసారే యావద్దుఃఖా ద్విముచ్యతే
పాపంకర్మ కృతం కించిత్ యది తస్మి న్నదృశ్యతే
నృపతే! తస్యపుత్రేషు పౌత్రేష్వపిచ నప్తృషు. (భారతం 12-137-19)





ఈ వివరణను బట్టి ధర్మాత్ములు కొంతకాలం కష్టపడడం, అధర్మపరులు సుఖపడడం సంభవిస్తాయని స్పష్టమవుతున్నది. ఈ విషయం సూక్ష్మదృష్టితో నిశితంగా చూచిన వారు సత్యం గ్రహించగలరు.

### 507. స్వయం ప్రభ ఎవరు? ఆమె వృత్తాంతమేమి ?

రామాయణంలోని కిష్కింధాకాండలో స్వయం ప్రభావృత్తాంతం ఉన్నది. ఆమె మేరుసావర్ణియొక్క పుత్రిక. అతిలోకసౌందర్యవతి. హేమయొక్క చెలికత్తె అయిన ఈమె హేమతో సహా మయుడు నిర్మించిన ఋక్షబిలంలో ఉండేది.

కిష్కింధాపాలకుడైన సుగ్రీవుడు సీతాన్వేషణకై హనుమంతుడు మున్నగు వానరులను దక్షిణదిశకు పంపాడు. వారు సీతను కనుగొనలేక అలసట చెంది దప్పికతో వచ్చి ఆ బిలంలో ప్రవేశించారు. అక్కడ స్వయంప్రభను చూచి ఆమె వృత్తాంతం తెలుసుకొని అక్కడే నిలిచారు. సుగ్రీవుడు విధించిన గడువు సమీ పిస్తుండడంవల్ల ఆ బిలం నుండి వెళ్ళడానికి ప్రయత్నించి గూడా అందుండి వెలికి రాలేకపోయారు. అప్పుడు స్వయంప్రభ వారిని కనులు మూసుకొండని చెప్పి తిరిగి కనులు తెరిచే లోపల బిలం నుండి వెలుపలికి తీసుకుపోయింది. ఈ రీతిగా ఆమె వానరులకు దారిచూపి సీతాన్వేషణలో వారికి సహకరించింది.

### 508. శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని ఎన్నిసార్లు ఎక్కడెక్కడ ప్రదర్శించాడు?

శ్రీకృష్ణుడు బాలుడుగా వ్రేపల్లెలో పెరిగే రోజులలో ఒకనాడు బల రాముడు మున్నగువారు 'కృష్ణుడుమన్నుదిన్నాడు' అని యశోదతో చెబుతారు. ఆమె మన్ను ఎందుకు తిన్నావు? అని కృష్ణుణ్ణి గద్దిస్తుంది. కృష్ణుడు తాను మన్నుతిన లేదంటాడు. తనమాట ఋజువు చేయడానికి నోరు తెరచి చూపుతాడు. అప్పుడు యశోదకు అతనినోట బ్రహ్మాండమంతా కనిపిస్తుంది. ఇదొక విశ్వరూపప్రదర్శన. శ్రీకృష్ణుడు పెరిగి పెద్దవాడయ్యాక కౌరవ పాండవులమధ్యపొందు కుదర్చడానికి రాయబారిగా హస్తినా నగరానికి పోతాడు. అతని హితోపదేశం కౌరవుల చెవి కెక్కదు. పైగా వారు కృష్ణుణ్ణి బంధించడానికి కుట్రపన్నుతారు. అది గ్రహించి కృష్ణుడు అక్కడ తన విశ్వరూపం చూపుతాడు. నారదాది మునులు, భీష్ముడు, ద్రోణుడు, విదు రుడు, సంజయుడు వీరికి భగవంతుడు విశ్వరూప దర్శనం అనుగ్రహిస్తారు.

ధృతరాష్ట్రుని ప్రార్థన మేరకు అతనికి గూడా ఆ భాగ్యం కల్గిస్తాడు. ఇది రెండవ విశ్వరూపం. ఆపై భారతయుద్ధ ప్రారంభదినాన అర్జునుడు

MOHAN PUBLICATIONS.COM

శోకమోహ గ్రస్తుడైయుద్ధం చేయజాలనంటాడు. భగవంతుడతనికి ఆత్మతత్త్వం వివరిస్తూ గీతోపదేశంచేస్తాడు. అనంతమైన విభూతులను గీత పదవ అధ్యాయంలో వివరి స్తాడు. అర్జునుడు కనులారా ఆ విభూతులను చూడాలని కోరుకుంటాడు. కృష్ణుడతనికి దివ్య దృష్టి ప్రసాదించి విశ్వరూపం చూపుతాడు. గీతలోని పద కొండవ అధ్యాయంలో ఈ విశ్వరూపవర్ణన అద్భుతంగా వున్నది. ఇది మూడవ ప్రదర్శన.

భారతయుద్ధంపూర్తి అయిన తరువాత శ్రీకృష్ణుడు తిరిగి ద్వారకానగరానికి ప్రయాణమవుతాడు. దారిలో ఉదంకముని ఆశ్రమానికి పోతాడు. ఉదంకుడు ఉచిత రీతిని ఆయనను సత్కరించి యుద్ధనిర్వహణలో కృష్ణుడు నిర్వహించిన పాత్రనునిందాగర్భంగా పేర్కొంటాడు. అప్పుడు కృష్ణుడు యుద్ధం అనివార్యమైన పరిస్థితుల్లో జరిగిందంటాడు. అందుకు ఆ ముని సమర్థుడవై ఉండి కూడా నీవు యుద్ధం నివారించలేకపోయావు. ఈ పాపానికి ఫలంగా నీకు శాపమిస్తా నంటాడు. శాపంతో నీ తపస్సును వ్యర్థం చేసుకోవద్దంటూ కృష్ణుడు తన సకలదేవతా స్వరూప విశిష్టతను వివరించి చెబుతాడు.

అప్పుడు ఉదంకుడు "నేను నీ దయకు అర్హుడనైతే నాకు నీ విశ్వరూపం చూపు అని ప్రార్థిస్తాడు. అంతట కృష్ణుడతనికి తన విశ్వరూపం చూపుతాడు. ఉదంకుడు ధన్యుడై నమః పురుషోత్తమాయతే అని నమస్కరిస్తాడు. భగవంతుడు కోరిన వరం ప్రసాదిస్తాడు. ఇది నాల్గవ విశ్వరూప ప్రదర్శన.

దేవకీపుత్రుడై కారాగారంలో పుట్టినప్పుడు కూడా తల్లిదండ్రులకు తన మహా విష్ణు స్వరూపం ప్రదర్శిస్తాడు. మరొకసారి బ్రహ్మ కృష్ణుడు గోకులంలో పెరిగే సమయంలో లేగలను, గోపబాలురను గుహలో దాచేస్తాడు. కృష్ణుడది గ్రహించి తానే లేగలుగా, గోపబాలురుగా రూపధారచేసి పరిమిత స్థాయిలో విశ్వరూపం చూపించి బ్రహ్మకు గుణపాఠం నేర్పుతాడు.

మరొకసారి కంసుని ఆహ్వానం మేరకు అక్రూరునితో మధురానగరికి పోతూ యమునానదిలో స్నానం చేస్తున్న అక్రూరునికి కూడా ఆ నది నీట తన విశిష్ట రూపాన్ని చూపుతాడు. ఇలా పరిమిత స్థాయిలోనూ, అపరిమిత స్థాయి లోనూ పలుపర్యాయాలు కృష్ణుడు విశ్వరూపం చూపినట్లు భారత భాగవతాది గ్రంథాలు తెలుపుతున్నాయి.





## 509. నవద్వీపాలు అంటారు ? అవి ఎక్కడ ఉన్నాయి?

'నవ' అనగా 'తొమ్మిది' అని అర్థం. తొమ్మిది ద్వీపాలే నవద్వీపాలుగా ప్రసిద్ధి కెక్కాయి. 1.అంతర్ద్వీపము 2. సీమంతద్వీపము 3. గోద్రుమ ద్వీపము 4. మధ్య ద్వీపము 5. కోలద్వీపము 6. రుద్రద్వీపము 7. జహ్నోద్వీపము 8. మోదద్రుమ ద్వీపము 9. రుద్ర ద్వీపము అనునవే నవద్వీపాలు.

ఇప్పుడు ఈ ద్వీపాలు శ్రీ మద్రామాయాపురం, సిమూలియా, గాధిగాచ మాజోదియా, నవద్వీపట్టణం, చంపాహటి, జాన్నగరం, మాంగాఛి మరియు రుద్రపాదా అనే పేర్లతో వ్యవహారంలో ఉన్నాయి. వీటన్నిటి సముదాయాన్నే నవద్వీప నగరమంటారు. ప్రాచీన నవద్వీప నగరం 32 మైళ్లవైశాల్యం కల్గి యుండెదట! గంగాతీరమందలి ఈ నవద్వీప నగరములో అంతర్భాగమైన మాయా పరురంలోనే క్రీ.శ.1486లో శ్రీకృష్ణ చైతన్యులు జన్మించారు. అందుకే నవ ద్వీపాలు పవిత్ర యాత్రా స్థానాలుగా ప్రసిద్ధిచెందాయి.

## 510. బ్రహ్మ చతుర్ముఖుడు ఎలా అయ్యాడు ?

బ్రహ్మదేవునికి మొదట ఐదుముఖాలు ఉండేవి. బ్రహ్మ విష్ణువు లిరువురిలో ఉండేవి. ఎవరుఅధికులు? అన్నప్రశ్న వచ్చినప్పుడు శివుడు లింగాకారం ధరించి విష్ణువును తనమూలం చూచిరమ్మని, బ్రహ్మను అగ్రభాగం చూచిరమ్మనీ చెప్పి పంపాడు. చూచి వచ్చిన తరువాత ఎవరు అధికులో నిర్ణయిస్తానన్నాడు. విష్ణువు వరాహరూపంతో క్రిందికి వెళ్లి లింగమూలం చూడజాలక తిరిగివచ్చి నిజం చెప్పాడు. బ్రహ్మ హంసరూపుడై పైకిపోయి అగ్రభాగం చూడలేకున్నా తిరిగివచ్చి చూచానని అబద్ధం చెప్పాడు. అసత్య దోషం వల్ల అతని ముఖం ఒకటి గాడిద ముఖంగా మారిపోయింది.

బ్రహ్మ తాను అధికుడనని గర్వించి గర్వం తగదని శివుడు చెప్పినా వినలేదు. పైగా తన గాడిద ముఖంతో శివుణ్ణి తీవ్రంగా దూషించాడు. శివుడు కాలభైరవుణ్ణి సృష్టించి తన్ను దూషించిన బ్రహ్మ శిరస్సును ఖండించమన్నాడు. భైరవుడు శివుని ఆదేశం మేరకు ఆ తలను ఖండించాడు. అలా ఖండింపబడిన బ్రహ్మ శిరస్సుకు చెందిన కపాలం చేతబట్టి శివుడు భిక్షాటనం చేస్తున్నట్లు పురాణాలు చెబుతున్నాయి.

## 511. పురూరవ చక్రవర్తి షట్చక్రవర్తులలో ఒకరా ?

పురూరవుడు షట్చక్రవర్తులలో ఒకడు.
హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః
నగరః కార్తవీర్యశ్చ షడేతౌ చక్రవర్తినః అని ఇందుకు ప్రమాణ శ్లోకం

MOHAN PUBLICATIONS.COM

ఇలా బుధులు పురూరవుని తల్లిదండ్రులు. ఇతని భార్య పేరు కౌసల్య. జనమేజయుడితని కుమారుడు. ఒకసందర్భంలో పురూరవుడు విప్రుల ధన మపహరించాడు. సనత్కుమారుడు మున్నగు కొందరు తనకు హితం చెప్పడానికి రాగా వారికి దర్శనం నిరాకరించాడు. వారందరు కుపితులై నీవు ఉన్మత్తుడవు కమ్ము అని శపించారు.

పురూరవుడొకసారి ఊర్వశిని చూచి మోహించాడు. ఆమె 'నీ ఉరణక ములు (పొట్టేళ్లు) పోయినా నీవు నగ్నుడవై కనిపించినా నిన్నువదలి వెళ్ళి పోతాను' అని షరతు విధించి అతనిలో కలసి మెలసి వుండింది. శ్రుతా యువు మొదలైన పలువురు పుత్రులు ఆమె యందా చక్రవర్తికి కలిగారు. ఒకసారి విశ్వావసుడనే గంధర్వుడు ఊర్వశి ఉరణకాలను అపహరించాడు. అప్పుడు దిగంబరుడై మంచంపై ఉండిన పురూరవుడు ఉన్నవాడున్నట్లే ఆ గంధర్వుని వెంట పరు గెత్తాడు. ఆ దృశ్యం ఊర్వశి కంటబడింది. వెంటనే ఆమె అతణ్ణివదలి వెళ్ళింది. పురూరవుడు ఉన్మత్తుడై ఊర్వశిని అన్వేషిస్తూ పోయాడు. కురుక్షేత్రంలో ఆమెను చూచాడు. తనతో రమ్మని అర్థించాడు. ఆమె సూచనమేరకు గంధర్వులను ప్రార్థించాడు. గంధర్వులు అతనికి ఊర్వశికి బదులు అగ్నిస్థాలిని ఇచ్చారు. అతడు దానిని అరణ్యంలో వదలి ఊర్వశినే కలవరిస్తూ ఉండి పోయాడు.

ఇంతలో త్రేతాయుగంవచ్చింది. పురూరవుని దృష్టికి కర్మ బోధకాలైన వేదాలు మూడు మార్గాలుగా తోచాయి. అతడు అశ్వత్థాన్ని అరకులుగా చేసి మంత్ర పఠనం కావించాడు. అప్పుడు 'జాతవేదు'డనే అగ్ని జనించింది. అది అతని పుత్రరూపమై ఆహవనీయాగ్ని అయింది. అగ్నిని పురూరవుడు మూడు భాగాలుగా చేయడంవల్ల నాటినుండి అగ్ని త్రేతాగ్నులుగా మారింది. ఆ అగ్నులతో యాగంచేసి చక్రవర్తి గంధర్వుల అనుగ్రహం పొందాడు. వాయుదేవుడు పురూరవునికి రాజధర్మాలు బోధించాడు. ఒకసారి పురూర వుడు నైమిశారణ్యానికి పోయాడు. అక్కడ మునులు యజ్ఞం చేస్తున్నారు. ఆ యజ్ఞవాటికమంతా స్వర్ణమయమై భాసించింది. దాని నెల్లాగైనా అపహరిం చాలనే దుష్ట సంకల్పం పురూర వునికి కల్గింది. అది గ్రహించిన మునులు అతణ్ణి వజ్రంతో కొట్టారు. ఆ దెబ్బకు అతడు అసువులు వదలాడు.

## 512. తురీయ ఆశ్రమం అంటే ఏమిటి ?

'తురీయ' మనే పదానికి నాల్గవది అని అర్థం. మన సంప్రదాయంలో బ్రహ్మచర్యం,గార్హస్థ్యం,వానప్రస్థం,సన్యాసం అని నాలుగాశ్రమాలు ఉన్నాయి.





వీటిని క్రమంగా పాటించాలని విధి. అందువల్ల ఇవి క్రమముగా ప్రథమా శ్రమం, చతుర్థాశ్రమం లేదా తురీయాశ్రమం అని వ్యవహరింప బడు తున్నాయి. అంచేత 'తురీయాశ్రమం' అంటే సన్న్యాసాశ్రమ మని అర్థం.

## 513. హిందువులకు ప్రామాణిక గ్రంథం ఏది ?

హిందువులకు వేదమే ప్రామాణిక గ్రంథం, వేదం ఋగ్వేదం, యజుర్వే దం, సామవేదం మరియు అథర్వణవేదం అని నాలుగు భాగాలుగా ఉన్నది. అందువల్ల ఈ నాలుగు వేదాలూ హిందూసమాజానికి ప్రామాణికమైన గ్రంథాలే. వేదాల తరువాతనే వేదసారమైన భగవద్గీత మొదలైన గ్రంథాలు ప్రామాణికంగా పేర్కొనబడుతాయి. ప్రామాణికత్వంలో మొదటి స్థానం మాత్రం వేదానిదే.

## 514. బలరామ అవతారములో విశిష్టత ఏమిటి ?

బలరాముడు శ్రీమహావిష్ణువు యొక్క పది అవతారాలలో ఒక అవతారం. పూర్ణావతారమైన శ్రీకృష్ణునికి ఈయన అగ్రజుడు. శ్రీకృష్ణుడు దుష్టశిక్షణకూ, శిష్ట రక్షణకూ తాను భూమిపై అవతరించి నప్పుడు తనకు తగిన సహాయం చేయడానికి శేషుణ్ణి అవతరించవలసిందిగా కోరాడు. శేషుడే దేవకి గర్భంలో ఏడవ శిశువుగా ఆవిర్భవించాడు. భగవదాజ్ఞ మేరకు మాయాదేవి దేవకి గర్భం నుండి బలరాముణ్ణి తొలగించి వసుదేవుని మరొక భార్యయైన రోహిణి గర్భంలో నిలిపింది. లోకులు దేవకి గర్భంజారి పోయిందనుకొన్నారు. రోహిణి బల రాముణ్ణి ప్రసవించింది. ఇలా ఇద్దరు తల్లుల బిడ్డగా అవతరించిన బలరాముడు సంకర్షణుడు, రౌహిణేయుడు అన్నపేర్లు కలవాడయ్యాడు.

బలరాముని శరీరచ్ఛాయ తెలుపు, శ్రీకృష్ణుని రంగు నలుపు. శ్రీమహా విష్ణువు తలనుండి ఒకతెల్లని వెంట్రుకరోహిణీ గర్భంలో ప్రవేశించి బలరాము డుగా జన్మించిందనీ, మరొక నల్లని వెంట్రుకదేవకి గర్భంలో ప్రవేశించి కృష్ణుడుగా రూపొందిందనీ పురాణాలు పేర్కొంటున్నాయి. కుశస్థలీ పరిపాల కుడైన రేహతుని కుమార్తె రేవతిని బలరాముడు ధర్మపత్నిగా చేపట్టాడు. కురుక్షేత్రంలో కౌరవులకూ, పాండవులకూ యుద్ధం జరిగినప్పుడు బల రాముడు అందులో పాల్గొనలేదు.

పురాణకథా ప్రవీణుడైన సూతుణ్ణి అనాలోచితంగా చంపినందుకు ప్రాయశ్చిత్తంగా బలరాముడు తీర్థయాత్రలు చేశాడు. భారతయుద్ధం చివర

MOHAN PUBLICATIONS.COM

భీమదుర్యోధనులు గదాయుద్ధం చేసేటప్పుడు బలరాముడు అక్కడికి వచ్చాడు. భీముని అధర్మయుద్ధాన్ని నిరసించాడు. పాండవ పక్షపాతి అయిన కృష్ణుని చూచి చేసేది లేక ఊరకుంటాడు. ప్రలంబాసురుడు, ధేనుకాసురుడు మొ॥ రక్కసులను బలరాముడు హతమార్చాడు. భారతయుద్ధానంతరం 36 సంవత్సరాల తరువాత బలరాముడు ప్రభాసతీర్థంలో తన అవతారం చాలించి సర్పరూపంతో వెళ్ళి పోయాడు.

## 515. కొడుకులు ఎన్నిరకములుగా ఉంటారు ?

మనుస్మృతిలో కొడుకులు పంద్రెండు విధాలుగా పేర్కొనబడ్డారు. 1. ఔరసుడు 2. క్షేత్రజుడు 3. దత్తుడు 4. కృత్రిముడు 5. గూఢోత్పన్నుడు 6. అపవిద్ధుడు 7. కానీనుడు 8. సహోఢుడు 9. క్రీతుడు 10.పునర్భవుడు 11. స్వయందత్తుడు మరియు 12.శౌద్రుడు. వీరిలో మొదటి ఆరుగురు దాయాదులు మరియు బాంధవులుకాగా తక్కిన ఆరుగురు దాయాదులు కాని బంధువులు. మొదటివర్గం వారికి పిండోదకాలు ఇచ్చే అధికారమేకాక ఆస్తిలోభాగం కూడా ఉంటుంది. తక్కినవారు పిండోదకాలు ఇవ్వడానికి అధికారులేకాని ఆస్తిలో వాటా పొందటానికి అర్హులుకారు. ఔరశపుత్రుని కంటె క్షేత్రజుడు మున్నగువారిని తక్కువస్థాయి వారిగా పరిగణించడం జరిగింది.

1. ఔరసుడు:విధిపూర్వక వివాహంతో చేపట్టినభార్యయందు పుట్టిన వాడు.

2. క్షేత్రజుడు : నియోగవిధితో తన భార్యఆకని స్త్రీయందు పుట్టినవాడు.

3. దత్తడు : దత్తతతో స్వీకరింపబడినవాడు.

4. కృత్రిముడు : గుణదోషాది విచక్షణ జ్ఞానంకల మరొకని పుత్రుని తన పుత్రునిగా గ్రహింపబడువాడు.

5. గూఢుడు : ఎవరి కుమారుడో లోకానికి తెలియకుండా గూఢంగా పుట్టినవాడు.

6. అపవిద్ధుడు : తల్లిదండ్రులచే త్యజించబడి మరొకరిచే స్వీకరింప బడినవాడు.

7. కానీనుడు : కన్యకు పుట్టినవాడు.

8. సహోఢుడు : గర్భవతి అయిన కన్యకకు వివాహమైన తర్వాత పుట్టినవాడు.

9. క్రీతుడు : తల్లి దండ్రులకు ధనమిచ్చి మరొకరిచే స్త్రీకి పుట్టినవాడు.

10. పునర్భవుడు : భర్త విడిచిన, లేదా విధ అయిన స్త్రీకి పుట్టినవాడు.

11. స్వయందత్తుడు : తల్లిదండ్రులు మరణించి లేదా వారిచే అకార ణంగా విడువబడి తనకు తానుగా మరొకరికి కుమారుడుగా సమర్పించు కొన్నవాడు.

122



12. శౌద్రుడు : బ్రాహ్మణునికి శూద్రస్త్రీయందు పుట్టినవాడు.

ఇతర వివరాలు మనస్మృతిలో చూడవచ్చు. ఆస్తి పంపకం మొదలైన విషయాలు ఇప్పుడు మనుస్మృతి ననుసరించి జరగడంలేదు. నేటి చట్టాల స్వరూపం వేరుగా ఉన్నది.

## 516. అష్టోత్తర శతనామాల వలన ప్రయోజనము ఉన్నదా?

భగవంతుణ్ణి అష్టోత్తర శతనామాలతో పూజిస్తారు. ఇందుకు పలు వివరణలు ప్రచారంలోఉన్నాయి. ఒకటి, రెండు ముఖ్య వివరణలు చూడండి. మన శరీరంలో 72వేలనాడులున్నాయి. అందులో 108 ముఖ్యమైన నాడులు హృదయంలో వున్నాయి. “ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున!తిష్ఠతి” అన్న గీతావచనాన్ని అనుసరించి హృదయమే భగవంతుని నివాసస్థానం. అంచేత భగవంతుణ్ణి పూజించేటప్పుడు 108 సంఖ్య ననుసరించి నామాన్నిఉచ్ఛరిం చడం, 108 సార్లు మంత్రజపం చేయడం అన్న సంప్రదాయం ఏర్పడిందని పెద్దలం టారు. జపమాలలో 108 పూజలు ఉండడానికి కూడా కారణమిదే. మరొకవివరణ 108లో మొదటి ఒకటిపరమాత్మకు సంకేతం చివరి ఎనిమిది అష్టప్రకృతులకు సంకేతం. మధ్యలోనిసున్న జీవాత్మను సూచిస్తుంది. జీవా త్మకు ఒకప్రక్క పరమాత్మ, మరొకప్రక్క పృథివ్యాదులైన అష్టప్రకృతులు ఉన్నాయనిఅర్థం. ప్రకృతికిదూరమై పరమాత్మకుసన్నిహితంకావడమే జీవుని లక్ష్యం. ఇందుకుసంకేతంగానే108సార్లుభగవదర్శన ఏర్పాటయిందంటారు.

## 517. శ్రీ వేంకటేశ్వరునికి, శ్రీ గోవిందరాజస్వామికి సంబంధం ఉన్నదా? అని ఏమిటి ?

శ్రీ గోవిందరాజస్వామివారు ఆదిశేషుని అవతారమని ప్రసిద్ధి. ఈ స్వామిని శ్రీవేంకటేశ్వరుని అన్నగా భక్తులు భావిస్తారు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణుని అగ్రజునిగా, ఆదిశేషుని అవతార రూపంలో బలరాముడు ప్రసిద్ధుడు. కలియుగంలో ఆయనే శ్రీగోవిందరాజస్వామి అయ్యాడని భక్తుల విశ్వాసం. శ్రీ వేంకటేశ్వరుడు తన పెండ్లి సమయంలో కుబేరునివద్ద అప్పు తీసుకున్నాడు. దీనికి సంబంధించిన వడ్డీని కొలుస్తూ అలసట చెందిన శ్రీ గోవిందరాజస్వామి కుంచాన్ని తలక్రింద పెట్టుకొని నిద్రిస్తున్న రీతిలో భక్తులకు దర్శనమిస్తున్నాడు. తిరుమలలో శ్రీవేంకటేశ్వరమూర్తిని విష్ణు స్వరూపంగా నిరూపించిన శ్రీ భగవద్రా మానుజులే తిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామిని ప్రతిష్ఠించారు. “గోవింద” శబ్దం ఇద్దరు దేవతలకూ ప్రసిద్ధనామంగా వ్యవహారంలో వున్నది.

MOHAN PUBLICATIONS.COM

## 518. నవబ్రహ్మలు ఎవరు ? వారి ఆలయము ఎక్కడ ఉన్నది ?

సృష్టికి కర్త బ్రహ్మ దేవుడు. ఈయన సృష్టి కార్యాన్ని కొనసాగించడానికై పెక్కుమంది మానసపుత్రులను సృష్టించాడు. అలా కలిగిన బ్రహ్మ మానసపుత్రు లలో తొమ్మిదిమంది ప్రజాసృష్టికి కారణభూతులయ్యారు. వారే నవబ్రహ్మలు. వీరిని ప్రజాపతులని కూడా వ్యవహరిస్తారు. వారు 1. అత్రి 2. అంగీరసుడు 3. పులస్త్యుడు 4.పులహుడు 5. క్రతువు 6. భృగువు 7. వశిష్ఠుడు 8. దక్షుడు మరియు 9. మరీచిఅనువారు. వీరిలో సప్తఋషులు కూడ అంతర్భూ తులై వున్నారు. మానసపుత్రులలో తక్కినవారైన సనక సనందనాదులు సృష్టి కార్యానికి అంగీకరించిన ఊర్ధ్వ రేతస్కులై జ్ఞాను లయ్యారు. బ్రహ్మయొక్క కన్నుల నుండి అత్రి, ముఖము నుండి అంగీరసుడు, కర్ణము నుండి పులస్త్యుడు, నాభి నుండి పులహుడు, హస్తమునుండి క్రతువు, చర్మము నుండి భృగువు, ప్రాణము నుండి వశిష్ఠుడు, బొటనవ్రేలు నుండి దక్షుడు, మనస్సు నుండి మరీచి అనే ప్రజాపతులు పుట్టారని భాగవతాది గ్రంధాలు నిరూపిస్తున్నాయి. వీరు కావించిన సృష్టి కార్యక్రమం పురాణాలలో వివరించబడి వున్నది. వీరి ఆలయము మహ బూబ్‌నగర్ జిల్లాలో ఉన్నది. దానినే బ్రహ్మేశ్వర ఆలయం అని అంటారు.

మరొకవిధంగా కూడా నవబ్రహ్మలను పరిగణించడం కద్దు. 1. బాల బ్రహ్మ 2. కుముద బ్రహ్మ 3. అర్కబ్రహ్మ 4. వీరబ్రహ్మ 5. విశ్వబ్రహ్మ 6. తారక బ్రహ్మ 7. గరుడ బ్రహ్మ 8. స్వర్గబ్రహ్మ 9. పదబ్రహ్మ.

## 519. శ్రీ వేంకటేశ్వరస్వామితిరుమలకొండమీదే ఎందుకు వెలిశాడు ?

శ్రీ వేంకటేశ్వరస్వామి కలియుగాదిలో తిరుమలపై నెలకొన్నాడని ప్రతీతి. ఆ దేవుణ్ణి కలియుగ ప్రత్యక్ష దైవం అంటారు. శ్రీ మహావిష్ణువుయొక్క అర్చావ తారమే శ్రీవేంకటేశ్వరుడు. తిరుమల కలియుగంలోనే కాక సృష్ట్యాది నుండీ అంటే కృతయుగాది నుండీ పవిత్ర క్షేత్రంగానే ప్రసిద్ధిచెందింది. ప్రళయకాలంలో భూమిసముద్రంలో మునిగిపోయి పాతాళానికి జారి పోయింది. శ్రీమహావిష్ణువు శ్వేత వరాహరూపంతో పాతాళానికి పోయాడు. అక్కడ హిరణ్యాక్షుణ్ణి సంహరించాడు. భూమిని ఉద్ధరించాడు. ఆపై భూదేవితో కూడి ఇక్కడే వుండాలని ఆ దేవుడు సంకల్పించాడు. గరుత్మంతుణ్ణి పిలిచి వైకుంఠంలోని తన క్రీడాద్రిని భూమిపైకి తెమ్మన్నాడు. గరుడుడు వెంటనే వైకుంఠంలోని క్రీడాద్రిని తీసుకు వచ్చి తూర్పు సముద్రానికి ఐదు





యోజనాలదూరంలో సువర్ణముఖీతీరములో నిలిపాడు. ఆ క్రీడాద్రి తిరుమల కొండ. వరాహస్వామి ఆ కొండపై అలా కృతయుగాదిలోనే నెలకొన్నాడు.

వైకుంఠలోకాద్గరుడేన విష్ణోః క్రీడాచలో వేంకటనామధేయః

ఆనీయచ స్వర్ణముకీ సమీపే సంస్థాపితో విష్ణు నివాసహేతోః

ఇత్యాది పురాణవచనాలే ఇందుకు ప్రమాణాలు. అలా వరాహక్షేత్రంగా పేరుపొందిన తిరుమలపైనే కలియుగాదిలో శ్రీహరి అపరావతారమైన శ్రీ వేంక టేశ్వరస్వామి నెలకొన్నారు.

వైకుంఠాత్పరమోహ్యేష వేంకటాభ్యో నగోత్తమః

అత్రైవ నివసామ్యేవ శ్రీభూమి సహితోన్వహమ్.

ఈ వేంకటాద్రి వైకుంఠంకంటే శ్రేష్ఠమైనది. నేను శ్రీభూదేవీ సహితుడనై నిత్యం ఇక్కడే నివసిస్తాను" అని ఆనాడు వరాహస్వామి చేసుకొన్న నిర్ణయమే ఆ దేవుని మరోరూపమైన శ్రీవేంకటేశ్వరుని నివాసంగా తిరుమల రూపొంద డానికి కారణమైంది.

## 520. ఉద్దాలక మహర్షి అతని భార్య చండిక జైమిని భారతములో కనిపిస్తారు ?

ఉద్దాలకుడు ఒక విప్రుడు. ఇతని భార్యపేరు చండిక. ఆమె మిక్కిలి గయ్యాళి. భర్తచెప్పిన మాటకు విరుద్ధంగా చేయడం ఆమె స్వభావం. అందు వల్ల అతనికి సంసారంలో సుఖశాంతులు కరువయ్యాయి. ఒకనాడు తన దురవస్థను అతడు కౌండిన్యమునితో చెప్పుకొన్నాడు. ఆ ముని అతనితో 'నీవు చెప్పినదానికి ఆమె విరుద్ధంగా చేస్తున్నదంటున్నావు. సరే ఇప్పటినుండి నీవు నీకు ఏమికావాలో దానికి విరుద్ధంగా ఆమెతో చెప్పడం అలవాటు చేసుకో, నీ పని నెరవేరుతుంది అని చెప్పాడు. ఈ ఉపాయం బాగా పని చేసింది. ఉద్దాలకుడు తన అభీష్టానికి విరుద్ధంగా మాట్లాడుతూ భార్యచేత తన పని నెరవేర్చుకొనేవాడు. ఒకనాడు పితృకార్యం చేయవలసి వచ్చింది. 'నీవు అశుచివై వంట చేయాలి అని అతడు భార్యతో అన్నాడు. ఆమె చాలా శుచిగా వుండి వంట చేసింది. బ్రాహ్మణులకు నీవు అన్నం వడ్డించవద్దు అని అతడు చెప్పగా ఆమె ఎంతో శ్రద్ధగా వారికి వడ్డనలు కావించింది. అతడు లోలోన సంతోషించేవాడు.

ఒకనాడు సంతోషాతిశయంతో అసలు సంగతి మరచి ఇక్కడ పారణ మున్నది. జాగ్రత్తగా తీసిపెట్టు అని చెప్పాడు. దాని నామె పెంట కుప్పపై పారవేసింది. అందుకోపించి ఆ విప్రుడు వింధ్య పర్వతంలో శిలవై పడివుండు

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

అని ఆమెను శపించాడు. ధర్మజుని యాగాశ్వం ఆశిలను త్రొక్కినప్పుడు నీకు శాపవిముక్తి కల్గుతుంది. అని కూడా అన్నాడు. ఈ కథను జైమిని భారతంలో చూడవచ్చు.

## 521. మొగలిపువ్వు పూజకు ఎందుకు పనికిరాదు ?

బ్రహ్మ,విష్ణువు, శివుడు వీరిని త్రిమూర్తులంటారు. సృష్టి, స్థితి, లయకార కులు ఈ త్రిమూర్తులే. ఒకసారి బ్రహ్మకూ,విష్ణువుకూ వారిద్దరిలో ఎవరు అధికులు అన్న అంశంపై తగాదా వచ్చింది. శివుడువారికి తీర్పు చెప్పవలసిన పరిస్థితి ఏర్పడింది. శివుని ప్రభావంతో వారి ఎదుట ఒక దివ్యలింగం ఆవిర్భవించింది. ఆలింగమూలస్థానాన్ని చూచిరమ్మని విష్ణు వునూ, లింగం కొసను చూచిరమ్మని బ్రహ్మనూ శివుడు నియోగించాడు. వారిలో ఎవరు ముందు చూచి వస్తారో వారు గొప్పవారు అన్న నిర్ణయం జరిగింది.

బ్రహ్మహంసరూపంలో పైకి వెళ్ళాడు. విష్ణువు వరాహరూపంతో క్రిందికి పోయాడు. అందులో ఎవరూ తుదముట్టా వెళ్ళలేక పోయారు. లింగం అనంతమై కనిపించింది. విష్ణువు తిరిగివచ్చి లింగమూల దర్శనం కాలేదని నిజం చెప్పాడు. బ్రహ్మమాత్రం లింగశిరోభాగాన్ని తానుచూచి వచ్చానని అబద్ధమాడాడు. ఒక మొగలిపూవును తానుచూచి వచ్చినందుకు సాక్ష్యం చెప్పమన్నాడు. ఆ పూవు అందుకంగీకరించి అసత్యం పలికింది. సత్యం గ్రహించిన శివుడు బ్రహ్మకు ఆలయాలూ, పూజలూ లేకుండా పోయేటట్లు శపించాడు. మొగలిపూవు కూడా పూజలకు పనికిరాదన్నారు. శివపురాణాది గ్రంథాలలో ఈ వృత్తాంతం లభిస్తుంది.

## 522. వేదపతి ఎవరు ?

వేదవతి మాలావతీ కృశధ్వజుల పుత్రిక. ఈమె గురించి వాల్మీకి రామాయణంలో లేదు. బ్రహ్మ వైవర్తపురాణంలో ఈ క్రింది రీతిగా ఉన్నది. తండ్రి వేదం పఠిస్తుండగా ఈమె జన్మించింది కాబట్టి వేదవతి అని ఈమెకు నామకరణం చేయబడింది. విష్ణుమూర్తికి ఈమె నిచ్చి వివాహం చేయాలని తండ్రి సంకల్పించాడు. వేదవతి కూడా విష్ణువునే పతిగా ఎన్నుకొన్నది.

ఒక్కరక్కసుడు ఆమెను కామించి తనకు కన్యాదానం చేయమని కృశ ధ్వజుణ్ణి అడిగాడు. కృశధ్వజుడు అందుకు తిరస్కరించాడు. అందుకు కోపించిన ఆ రాక్షసుడా విప్రుణ్ణి హతమార్చాడు. మాలావతి సహగమనం చేసింది.



శోకించిన వేదవతి చివరికి తపస్సుకు పూనుకొన్నది. రావణాసురుడు డామెను చూచి తన్ను పరిణయమాడమన్నాడు. ఆమె తిరస్కరించింది. రావణు డామెను స్పృశించాడు. శ్రీహరిపై లగ్నమైవుంటే నేను అయోనిజగా జన్మించి ఆ దేవుణ్ణి పరిణయమాడి నిన్ను సమూలంగా నాశనం చేస్తాను. అనిశపథంపూని యోగాగ్నిలో తనశరీరాన్ని దగ్ధం చేసుకొన్నది. ఆమె మరు జన్మలో లంకలో ఒకపద్మంలో పుట్టింది. ఆమె పుట్టుక అరిష్ట సూచకమని జ్యోతిష్కులన్నారు. ఆరవణుడా బిడ్డనొకపెట్టెలో పెట్టి సముద్రంలో వదిలాడు. ఆ పెట్టె మిథిలా నగరంచేరి జనకునికి లభించింది. ఆమెయే సీతాదేవి.

124

## 523. ద్రోణుడు, ద్రుపదుడు ఇరువురు ఒకే గురువు వద్ద విద్యాభ్యాసం చేశారు. ఆ గురువుపేరేమిటి ?

భరద్వాజ మహర్షి ఘృతాచి అనే అప్సరసను చూచిన వెంటనే ఆయనకు చిత్తం కామాయత్తమై రేతస్సుపతనమైంది. ఆ రేతస్సు నుండి పుట్టినవాడు ద్రోణుడు. వృషతుడనే రాజు తపస్సు చేస్తున్నాడు. అతని సమీప ప్రదేశంలో మేనక అనబడే అప్సరస పూవులేరుకొంటున్నది. ఆమెను చూడగానే ఆయన కామోద్రేకం చెందాడు. అతనికి వీర్యస్ఖలనం జరిగింది. దానిని తన పాదంతో కప్పి ఉంచినాడు. అందు జన్మించినవాడు ద్రుపదుడు. వృషతుడా బాలుని భరద్వాజాశ్రమంలో విడిచి వెళ్లాడు. అలా ఒక్కచోట కలసికొనిన ద్రోణ, ద్రుపదలు అగ్నివేశుడనే మునివలన ధనుర్వేదమభ్యసించారు. అగ్నివేశుడు వారి గురువు.

## 524. మునేశ్వర స్వామి వృత్తాంతం ఏమిటి?

మునీశ్వర శబ్దం ప్రజల నాలుకలతో మునేశ్వరుడుగా మారింది. ఇక దేవాలయ విషయాలలో వైరిసమాసాలు సామాన్యం. గర్భగుడి వంటివి. అలా ఏర్పడిందే మునేశ్వరగుడి. ఈ సంప్రదాయం తమిళనాట ఎక్కువగా ఉంది. ఆంధ్రదేశంలో కన్పించదు. ఋగ్వేదకాలం నుండి గ్రామదేవతా పూజలు ప్రకృత్యారాధనలు ప్రచురంగా ఉన్నాయి. ఋగ్వేదకాలంలో అమ్మ తల్లిని ఎక్కువగా ఆరా ధించినట్లు నిదర్శనాలున్నాయి. ప్రతి గ్రామరక్షణక, ఒక అధిష్ఠాన దేవత ఏర్పాట య్యింది. శ్రీకృష్ణునికి మారుగా యోగమాయ, కంసునకు చిక్కి వానిచే వధింపబడక వానికి బుద్ధి చెప్పి అదృశ్యురాలైంది. అపుడు మహావిష్ణువామెకు ప్రతిగ్రామంలో తొలిపూజలందుకొనే వర మిచ్చాడు. ఆ దేవతల దేవాలయాలు గ్రామలకు బయట ఉండేవి. కొలువుల

MOHAN PUBLICATIONS.COM

సమయంలో ఆ దేవతలను, గొఱ్ఱెలు, దున్నలు, పొట్టేళ్లు, మేకలు, కోళ్లు, మొదలైన వాటిని బలి సమర్పించేవారు. కాళి, మారెమ్మ, నాంచారమ్మ, తాటెమ్మ, నూకాలమ్మ, గంగానమ్మ ఈదులమ్మవంటి పేర్లతో ఈ క్షుద్రదేవతలు పూజలందుకొంటున్నారు. వీరికి సాత్త్వికపూజలు కూడ చెల్లిస్తారు. ఈ స్త్రీ దేవతాపూజలు సాగుతుండగా ఆర్య సంస్కృతి తొంగి చూచింది. వారు పురుషదైవాలకు ప్రాధాన్యమిచ్చారు. వెంటనే క్షుద్రదేవత లందరికి ఒక తమ్ముడు పోతురాజు అనేదైవం తెరపైకివచ్చాడు. ప్రతి గ్రామంలో పోతురాజు విగ్రహాలు ప్రత్యక్షమైనాయి. ఆర్యులు యుద్ధానికి వెళ్లేముందు పురుష దేవతలను పూజించేవారు. ఎన్నోజంతువులను బలిచ్చేవారు. ఆ దేవతలే విజయమిస్తారని నమ్మేవారు. అందుకే మునేశ్వరుని గుడికడ గుఱ్ఱాలనధిరోహించిన వీరుల విగ్రహాలుంటాయి. వీరవైశం వ్యాప్తిలోనికి వచ్చింతర్వాత గ్రామ రక్షకులుగా వీరభద్రుడు, కాలబైరవుడు, మొదలైనవారి విగ్రహాలను గ్రామాలకుముందు ప్రతిష్ఠించి వానికి పూజలు నిర్వహించేవారు. కాశీకి కూడా కాలభైరవుడు రక్షకునిగా కీర్తింపబడుతున్నాడు. వైష్ణవం వచ్చిన తర్వాత హనుమంతుడు గ్రామ రక్షకునిగా నియమింపబడినాడు.

ఈ విధంగాచూస్తే ఆ పాతకాలానికి చెందిన అవశేషాలే గ్రామదేవతల పూజలు, మునేశ్వర గుడిపూజలు అని భావించవలసి వస్తుంది. ఇవి ఆచార వ్యవహారాలకు సంబంధించిన విషయాలేగాని వీనికొక ప్రత్యేక చరిత్ర కన్పించదు.

**525. శ్రీరామచంద్రుడు అయోధ్యానగరాన్ని ఎన్ని సంవత్సరాలు పరి పాలించాడు ?**

కావ్యేతిహాసపురాణాలలో అతిశయోక్తులుండటం సత్యం. వాటినన్నింటిని యథాతథంగా స్వీకరించటమే కర్తవ్యం. దానిలోని సత్యాసత్యాలను నిర్ణయించ టం సాధ్యంకాని పని. మనపురాణాలు, యుగాల్ని అనుసరించి ఆయుఃప్రమా ణం, శరీర ప్రమాణం నిర్ణయించింది. వాని ప్రకారం మనం అర్థం చేసుకోవాలి. కావ్యేతిహాస పురాణాలలో యుద్ధంలో పాల్గొన్న సైనికుల సంఖ్యకు, తుదకు మరణించిన వారి సంఖ్యకు, ఏకత్వం కుదరదు. ఇక రామాయణం విషయం వివరిస్తాను. సీతాపరిత్యాగానంతరం రాముడు పరిపాలిస్తున్నాడు. తన కొలువు కూటానికి వెలుపల లక్ష్మణుని కాపలా ఉంచాడు. ఒకనాడు రాముడు కొలువులో ఉన్నాడు. యమధర్మరాజు మహర్షి వేషంలోవచ్చి "నీతో ఏకాంతంగా మాట్లా డాలి. అందరినీ బయటకు పంపవలసింది. నేను నీతో భాషించే సమయంలో ఎవడు లోపలికి వచ్చినా,



అతని శిరశ్ఛేదం చేయవలసిందని రాముని ఒప్పించాడు. అపుడాతడు రామునితో 'రామా! నేను యముడను. నీవు శ్రీమహా విష్ణుమూర్తివి. నీవు భూలోకంలో అవతరించి పదునొకందు(11)వేల సంవత్సరాలైంది. రావణాది దుష్టసంహారం పూర్తిఅయింది. కనుక అవతార పరిసమాప్తి కావించవలసింది అని చెబుతుండగా లక్ష్మణుడు లోపలకు వచ్చాడు. యముడ దృశ్యమైనాడు. అన్నమాట ప్రకారం తమ్ముని శిరశ్ఛేదం చేయలేక రాజ్య బహిష్కృతుని చేశాడు. లక్ష్మణుడు సరయూనదిలో మునిగి అవతారం చాలించాడు. వెంటనే రాముడు కూడ సరయూనదిలోదిగి అవతారం చాలించాడు. కనుక దీని ప్రకారంచూస్తే రాముడు పదివేల సంవత్సరాలకు పైగా రాజ్య పరిపాలన చేశాడు.



**526. తిరుమలలో యాత్రికులు చేయవలసినవి**

తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి. శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీవరాహస్వామిని పూజించండి. స్నానంచేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి. ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం వుంచండి. ఆలయంలోపూర్తిగా నిశ్శబ్దాన్నిపాటిస్తూ "ఓం శ్రీవేంకటేశాయనమః" అని మీలోమీరు శ్రీవారిని స్మరించండి. తిరుమల సమీపంలో వున్న ఆకాశగంగ, పాపనాశనం తీర్థాలలో స్నానంచేయండి. తిరుమలలో ఉన్న పుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగాపాటించండి. సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తిభవాలు పెంపొందించండి. మీకానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి. శ్రీవారిఆలయంలో మీరు జరిపించదలచిన పూజలకుగాని, మీకు కావలసిన సమాచారం కోసంగాని తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.

**527. తిరుమలలో చేయకూడనివి...**

విలువైన ఆభరణాలు, ఎక్కువడబ్బు మీ వద్ద వుంచుకోకండి. మాంసాహారాన్ని భుజించకండి. ఏవిధమైన మత్తుపదార్థాలు సేవించకండి. పొగత్రాగకండి. ఆలయపరిసరాల్లో పాదరక్షలు ధరించకండి. శ్రీవారి దర్శనంకోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశాలతో తిరుమలకు రాకండి. ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయటం వంటి అసహ్యకరమైన పనులు చేయకండి. ఆచార వ్యవ

MOHAN PUBLICATIONS.COM

హోరాల ప్రకారం ఆలయార్హతలేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి. తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారిపూజకే. పరిసరాలను అపరి శుభ్రం చేయకండి.

**528. కలియుగం ఎన్ని పాదాలు ? మనం ఏపాదంలో ఉన్నాము ? అంతం ఎప్పుడు ?**

ఒక్కొక్కయుగానికి నాలుగు పాదాలుంటాయి. కలియుగానికి కూడా అంతే. కలియుగం అంతం కావటానికి నాల్గు లక్షలా ముప్పది రెండు వేల సంవత్సరాలు గడవాలి. ఇప్పటికి ఈ యుగంలో 5,103 సంవత్సరాలు మాత్రం గడిచాయని మన పంచాంగాలు చెబుతున్నాయి. కాన మనం కలియుగం ప్రథమ పాదంలో వున్నాం. "కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే" ఇత్యాదిగా సంకల్పం చెప్పడం తెలిసిందేకదా !

**529. నిత్యపూజలో కలశారాధన ప్రాముఖ్యం ఏమిటి?**

షోడశోపచార పూజకు అంగంగా కలశారాధన చేస్తారు. ఈ ఆరాధనా విధానం ఇలా వుంటుంది.

"తదంగత్వేన కలశారాధనం కరిష్యే కలశం గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాః స్మృతాః కుక్షేతు సాగరాస్సర్వే కలశాంబు సమాశ్రితాః గంగే చ యమునే కృష్ణే గోదావరి సరస్వతి నర్మదే సింధో కావేరి జలేస్మిన్ సన్నిధింకురు కలశోదకేన దేవమాత్మానం పూజాద్రవ్యాణిచ సంప్రోక్ష్య" దీని అర్థమిది.

నేనుచేసే పూజకు అంగంగా కలశారాధనచేస్తున్నాను అని చెప్పి అక్షతలు, నీళ్లువదలాలి. నీటితో నిండిన కలశాన్ని గంధకుసుమ పుష్పాక్షత లతో అలంకరించాలి. పుష్పం లోపల నిల్పి కుడిచేయి మూతగాచేసి 'కలశస్య ముఖే'ఇత్యాది మంత్రాన్ని పఠించాలి. "కలశముయొక్క ముఖంలో విష్ణువు. కంఠంలో రుద్రుడు, మూలంలో బ్రహ్మ, మధ్యలో మాతృగణాలు ఉంటారు. లోపలి నీటిలో సాగరా లన్నీ వున్నాయి. మరియు ఈ కలశంలో ఓ గంగా! యమునా ! సరస్వతీ! కృష్ణవేణీ! గోదావరీ ! నర్మదా ! సింధూ! కావేరీ ! మీరందరూ సాన్నిధ్యం చేయండి." ఇలా చెప్పి కలశోదకాన్ని పూలతో దేవునిపై చల్లాలి. తనపై కూడా చల్లుకోవాలి. ఆపై పూజాద్రవ్యాలపై చల్లాలి."

పై మంత్రాన్ని బట్టి కలశారాధన ప్రాముఖ్యాన్ని గ్రహించవచ్చు. దేవతా ర్చనచేసే భక్తులు చిత్తశుద్ధి గలవాడైతే అతని సంకల్ప బలంతో ఆయా





దేవతలు, సాగరాలు, నదులు కలశంలో సాన్నిధ్యం వహిస్తాయి. అలాంటి కలశజలం పరమ పావనమైనది. ఆ జలాన్ని తనపైనా, పూజాద్రవ్యాలపైనా చల్లడం వల్ల తనకూ, ఆ ద్రవ్యాలకూ పవిత్రత సిద్ధిస్తుంది. తద్వారా పూజ ఫల ప్రధమవుతుంది.

**530. కార్యవీర్యార్జునుడు దత్త భక్తుడా కాదా ?**

కృతవీర్యుడనువాని కుమారుడు కార్తవీర్యుడు. అతడే కార్తవీర్యార్జునుడు. ఇతడు హైహయవంశానికి చెందినవాడు. మహిష్మతీ పురం ఇతని రాజధాని. ఈ రాజు దత్తాత్రేయుని భక్తుడు. ఆ అవతారమూర్తిని సదా సేవించేవాడు. ఒకసారి దత్తాత్రేయుని అపాన వాయువునుండి పుట్టిన అగ్నివల్ల అతని బాహువులు దగ్ధమయ్యాయి. అయినా భక్తివదలక స్వామిని ఆరాధించాడు. అతని సేవకు సంప్రీతుడైన దత్తాత్రేయుడు వరం కోరుకొమ్మన్నాడు. తనకు వేయిబాహువులు కలిగేటట్లు, యుద్ధంలో సదా విజయం సిద్ధించేటట్లు అనుగ్రహించమని కార్తవీర్యుడు కోరుకొన్నాడు. స్వామి అట్లే అనుగ్రహించాడు. ఒకసారి అగ్ని దేవుడు కార్తవీర్యుని అనుమతితో గిరి నగరారణ్యాన్ని భక్షించాడు. అప్పుడు ఆ అడవిలోని మైత్రావరుణుని ఆశ్రమం కూడా తగలబడిపోయింది. అందుకా ఋషి కోపించి కార్తవీర్యుని బాహువులను పరశురాముడు ఖండించుగాక! అని శపించాడు. కార్తవీర్యార్జునుడు మహా బలవంతుడని విని రావణుడతనితో యుద్ధం చేయడానికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన సమరంలో రావణుణ్ణి జయించి కార్తవీర్యుడతణ్ణి బంధించాడు. ఆపై పులస్త్యుని ప్రార్థనతో విడిచి పెట్టాడు.

ఒకసారి కార్తవీర్యుడు వేటకు పోయి జమదగ్నిచే సత్కారం పొందాడు. అతని కామధేనువు నర్థించాడు. ముని తిరస్కరించాడు. అందుకు కోపించి జమదగ్నిని కార్తవీర్యుడు హతమార్చినాడు. అది తెలిసి పరశురాముడు కార్త వీర్యునిపై దండెత్తి అతణ్ణి వధించాడు.

**531. ధనుర్మాసంలో శ్రీవారికి సుప్రభాతానికి బదులు తిరుప్పావై ఎందుకు చదువుతారు ?**

ధనుర్మాసంలో తిరుప్పావై సంకీర్తన గానం చేయడం శ్రీ భగవద్రామానుజులు చేసిన ఏర్పాటు ననుసరించి జరుగుతున్నది. పూర్వం గోపికలు కాత్యాయనీ వ్రతంతో శ్రీకృష్ణుణ్ణి సేవించారు. గోదాదేవి కూడా వారి మార్గాన్ని అనుసరించి ధనుర్మాసంలో ఆ వ్రతాన్ని అనుష్ఠిస్తూ రోజుకొక్క పాశురం

MOHAN PUBLICATIONS.COM

చొప్పున ముప్పది పాశురాలు గానంచేసింది. ఆమెచేసిన వ్రతాన్నే 'తిరుప్పావై' వ్రతమన్నారు. శ్రీరామానుజులవారు తిరుమల ఆలయంలో పూజా విధానాలను క్రమబద్ధంచేస్తూ ధనుర్మాసంలో నిత్యం 'తిరుప్పావై' పఠించేటట్లు కట్టడి చేశారు. భక్తాగ్రేసులు తిరుప్పావైని వేదసారమని భావిస్తారు. ధనుర్మాసంలో శ్రీవేంకటేశ్వరస్వామి శ్రీకృష్ణుడుగా పూజింపబడ తాడు. ఆ దేవుణ్ణి ఆరాధించేవారు గోపికలకు ప్రతీకలు. గోదాదేవి శ్రీలక్ష్మీదేవియొక్క మరు రూపము. అందువల్ల ఆమెపాడిన పాటలను ధనుర్మాసంలో పాడడం సంప్రదాయమయింది.

### 532. అష్టపాశము అననేమి ?

అష్టాపాశములు అనగా ఎనిమిది పాశములు అని అర్థం. పాశమనగా త్రాడు. అది బంధించడానికి ఉపయోగింపబడుతుంది. అట్లే అష్టాపాశాలు జీవుని స్వాతంత్ర్యం హరించి బంధించే లక్షణం కల్గిఉన్నాయి. 1. దయ 2. శంక 3. భయం 4. లజ్జ 5. జుగుప్స 6. కులం 7. శీలం 8. జాతి అనేది అష్టపాశాలు. తగనిచోట కలిగే దయ, సందేహం, భయపడడం, సిగ్గుపడడం, రోత జెందడం, కులాభిమానం, శీలవంతుడననే అభిమానం, జాత్యభిమానం ఇవి పాశాలవలె మనుజులను బంధించే స్వభావం కలిగి వున్నాయి. ఉదాహరణకు 'కృపయా పరయాఽఽవిష్టః' అని గీతలో చెప్పినట్లు అర్జునుడు యుద్ధారంభంలో తగనిచోట దయజూపి కర్తవ్య విముఖుడైనాడు. ఇతర పాశాలను గూడా ఇట్లే సమన్వయించుకోవాలి.

1. పవుపాశం 2.భవపాశం 3. బంధపాశం 4. మోహపాశం 5. ఆశాపాశం 6. కర్మపాశం 7. దుఃఖపాశం 8. క్లేశపాశం అని మరొకరీతిగా కూడా అష్టపాశాలను వివరిస్తారు.

### 533. సాత్యకి, సుభద్ర, శ్రీకృష్ణుల మధ్య గలభాంధవ్యం ఏమిటి ? సుభద్ర తల్లిదండ్రులెవరు ? శ్రీకృష్ణుడు సుభద్రకు అన్న ఎలాఅవుతాడు?

వసుదేవునకు దేవకివలె రోహిణి యను మరొకభార్య కలదు. దేవకీ పుత్రుడు కృష్ణుడుకాగా, రోహిణికి బలరాముడు, సుభద్ర జన్మించారు. అందుచేత సుభద్రకు కృష్ణుడు అన్న అవుతాడు. సాత్యకి యదువంశానికి చెందిన శనియొక్క కుమారుడు ఇతడు అర్జునుడు శిష్యుడు. 'యుయుధాసుడు' అను మరొకపేరు గూడ ఇతనికి కలదు. ఇతడు కృష్ణునికి అత్యంత సన్నిహితుడై యుండేవాడు. ఇతడు భారతయుద్ధంలో నిపుణుడై అతిరథుడుగా





ప్రసిద్ధి వహించాడు. శ్రీకృష్ణుడు రాయబారమునకు పోయినపుడు సాత్యకిని తన రథంలో కూర్చోబెట్టుకొని వెళ్ళాడు.

### 534. ఓంకారోపాసన ఎలా చేయాలి ? ఎవరెవరు చేయవచ్చు ?

'తస్యవాచకః ప్రణవః' అని పతంజలి చెప్పినట్లు ప్రణవం, అనగా ఓం కారం అంటే 'పరమాత్మ' అని అర్థం ఉపనిషత్తులు, భగవద్గీత మున్నగు గ్రంథాలు ఓంకారోపాసనను ప్రబోధిస్తున్నాయి. అందుచేత ఓంకారోపాసన అనగా పర బ్రహ్మమును ఉపాసించడమే. గీత ఎనిమిదవ అధ్యాయంలో ఓంకారోపాసనా విధానం ఇలా చెప్పబడింది.

సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ ఆస్థితో యోగధాణామ్॥
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిమ్॥
–(గీత 8–12,13)

"ఎవడు ఇంద్రియాలనన్నింటినీ నిగ్రహించి మనస్సును హృదయంలో నిల్పి ప్రాణవాయువును శిరస్సులో ఆరోహణం కావించి యోగధారణతో పర బ్రహ్మకు వాచకమైన 'ఓం' అనే ఏకాక్షరాన్ని ఉచ్చరిస్తూ పరమాత్మనైన నన్ను ధ్యానిస్తూ దేహాన్ని త్యజిస్తాడో వాడు సర్వోత్కృష్టమైన మోక్షం పొందుతాడు" అని భగవంతుడు చెప్పాడు.

దీన్నిబట్టి ఓంకారోపాసకులు ఇంద్రియనిగ్రహం, మనోనిరోధం కల్గియుండాలి. యోగాన్ని శీలించి భగవంతుణ్ణి స్మరిస్తూ ఓంకారాన్ని ఉచ్చరించాలి. 'తజ్జపస్తదర్థభావనమ్'అన్న యోగదర్శన సూత్రం ప్రకారం ఏమంత్రమైనా జపించే సమయంలో దాని అర్థాన్ని భావించాలి. ఓంకారానికి అర్థం పరమాత్మ అంచేత పరమాత్ముణ్ణి స్మరించాలి. "అవసానకాలంలో నిన్ను ఎలా తెలుసు కోవాలి?" అని అర్జునుడడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతూ భగవంతుడు ప్రాణ ప్రయాణకాలంలో అని చెప్పాడు. ఆ సమయంలో ఈ స్మరణ కలగాలంటే అంతకుముందే ఇది అలవాటులో ఉండాలి. కావున అంతిమ సమయం రాక ముందే ప్రణవాన్ని పై జెప్పిన రీతిలో ఉపాసించడం అభ్యసించాలి.

"యః=ఎవడైతే, సః=వాడు" అని చెప్పడంవల్ల ఈ ఉపాసన ఎవరు చేస్తారో వారంతా తరిస్తారు అని గ్రహించాలి. భగవంతునికి వాచకమైన

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

ప్రణవాన్ని ఉపాసించడానికి భగవంతుని సంతానమైనమనుజు లందరికీ అధికారమున్నది. ఇందులో జాతి,కుల,లింగాదిభేదాలు పాటించ రాదు. ఈవిషయం ఇంకా స్పష్టంగా తెలుసుకోగోరేవారు “శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి”లో మూడవసంపుటం “ఓంకారం”అనేగ్రంధం చూడండి.

## 535. ఇంద్రుడు వ్యక్తి నామమా ? పదవీ నామమా ?

అష్టదిక్పాలకులలో ఒకడుగా ఇంద్రుడు ప్రసిద్ధుడు. ఇతడు తూర్పు దిక్కు నకు అధిపతి, స్వర్గానికి ప్రభువు. ఇంద్రుడనునది వ్యక్తి నామంకాదు, పదవీ నామం. ఇంద్రపదవి నధిష్ఠించిన ప్రతివాడూ ఇంద్రుడే. నూరుక్రతువులు నిర్వ ఘ్నంగా చేసినవాడు ఇంద్రపదవి నధిష్ఠిస్తాడని పురాణ కథనం.

## 536. శ్రీవారి ఆయుధాలలో ‘శార్గ్గం’ అంటే అర్థమేమి ?

చాపః శార్ఙ్గం మురారేస్తు అని నిఘంటువు. మహావిష్ణువు (శ్రీవారు) యొక్క ధనుస్సు పేరు శార్ఙ్గం. శృంగస్య వికారః శార్ఙ్గం-శృంగము (కొమ్ము) యొక్క వికారమైనది, అనగా కొమ్ముతో తయారు చేయబడినది. కాన అది ‘శార్ఙ్గ’ మనబడింది.

## 537. విశ్వకర్మకు శ్రీనివాసునికీ గల సంబంధమేమి ?

విశ్వకర్మ దేవశిల్పి, ఇతని తండ్రి ప్రభావసుడనే వసువు. తల్లి యోగసిద్ధి. ఈ శిల్పి భార్యపేరు ప్రహ్లాదిని. సంజ్ఞ ఈయన పుత్రిక. విశ్వకర్మ దేవతల కనువైన ప్రాసాదాలు, పట్టణాలు, రథాలు, ఆయుధాలు మొదలైనవి నిర్మించి ఇస్తూ ఉంటాడు. సూర్యుడు విశ్వకర్మ పుత్రికయైన సంజ్ఞను భార్యగా స్వీకరించాడు. కాని ఆమె సూర్యుని తేజస్సును సహించలేక పోయింది. అప్పుడు విశ్వకర్మ తేజస్సును తగ్గించడానికై సూర్యుణ్ణి సానపట్టాడు. ఆ సందర్భంలో రాలిన చూర్ణముతోనే సుదర్శన చక్రం రూపొందింది.

శ్రీనివాసుడు సుదర్శన చక్రాన్ని ఆయుధంగా స్వీకరించాడు. ఆ రీతిగా శ్రీనివాసునికి దివ్యమైన చక్రాయుధాన్ని తయారు చేయడంలో విశ్వకర్మ భగ వానుడు ప్రముఖపాత్ర వహించాడు. మరియు పద్మావతీ శ్రీనివాసులకు వివాహం నిర్ణయమైన పురానికిపోయి ఒకపెద్ద భవనం నిర్మింపజేయమన్నాడు. అట్లే పోయి ఇంద్రుడు విశ్వకర్మచే మరకతమణి తోరణాలు గల ఒక కనక మందిరం నిర్మింపజేశాడు. ఇలా శ్రీనివాసుని వివాహ భవనాన్ని నిర్మించినవాడు విశ్వకర్మయే.





## 538. మానసిక పూజ అంటే ఏమిటి ?

మనస్సుతోనే నిర్వహించే పూజకు మానసపూజ అనిపేరు. స్నానాదులచే శౌచంపాటించి ఏకాంత ప్రదేశంలోకూర్చుండి ఈ పూజను అనుసరించాలి. ఇందుకు ఇంద్రియనిగ్రహం చాలాముఖ్యం. మందిరం, విగ్రహం, పూజా సామగ్రి వగైరాలు మానసపూజలో ఉండవు. మనస్సులోనే పూజ చేసేవాడు వీటిని కల్పించుకొంటాడు. మానసికంగా కల్పించుకొన్న మందిరంలోని గర్భగృహంలో రత్నఖచితమైన అష్టదళపీఠంలో ఇష్టదేవతను ఆవాహనం చేసుకోవాలి. సిద్ధాసనస్థుడై దేవతామూర్తిపై చిత్తం నిలిపి శాంత సుందర కరుణామూర్తిగా ఆ స్వరూపాన్ని భావించాలి. పూజాసామగ్రినికూడా మనస్సుతోనే కల్పించుకొని అభిషేకాదులను మానసికంగా నిర్వహించాలి.

పూజాకాలంలో మంత్రస్మరణ తప్పక చేయాలి. ధూపదీప హారతులు మున్నగు క్రియలన్నీ మనస్సులోనే జరపాలి. నైవేద్యం సమర్పించిన తరువాత దేవతామూర్తిని తదేకనిష్ఠతో ధ్యానించాలి. ఇష్టదేవత తన ఎదుట ప్రత్యక్షమైనట్లు భావించాలి. వైరాగ్యం, భక్తి, విశ్వాసం కల్గినవారు ఏ స్థలంలో ఉన్నప్పుడైనా ఈ మానసపూజను నిర్వహించవచ్చు. ఎటుచూచినా దేవతామూర్తి ప్రత్యక్షమయ్యే పర్యంతం ఈ పూజను భక్తిశ్రద్ధలతో చేసి పూజ సిద్ధించినట్లు తలంచాలి. మానసపూజలో మరొకప్రక్రియ కూడా కలదు. శరీరం క్షేత్రమనీ, ఆత్మ క్షేత్రజ్ఞుడనీ గీతపేర్కొన్నది. విజన ప్రదేశంలో ఇంద్రియాలను నిగ్రహించి సుఖాసనంలో కూర్చొని ధ్యానించడమే ఈ పూజావిధానం. మానసపూజలో లాగా ఇక్కడ మందిర నిర్మాణంతో పనిలేదు. హృదయమధ్యంలో సహస్రదళాలుగల తామరపువ్వును భావించుకోవాలి. మనస్సును అంతర్ముఖం చేయాలి. భక్తినే అభిషేకజలంగా, శాంతిశమదమాదులను పువ్వులుగా, విశ్వాసాన్ని ధూపంగా, సత్యాన్ని దీపంగా, ఆత్మసమర్పణను నైవేద్యంగా భావించాలి. శరీరాంతర్యామినే భగవంతుడని తలంచాలి. హృదయంలో భగవంతుని ఉనికి గోచరించేటంత వరకూ నిష్ఠ కొనసాగించాలి. ఇది సిద్ధిస్తే సర్వత్రా ఇష్టదేవత సాక్షాత్కరిస్తుంది. దీనివల్లదుఃఖనివృత్తి ఆనందప్రాప్తి కల్గుతాయి.

## 539. వాలికి ఉన్న వరం ఏమిటి ?

వాలికి నేరుగా తన్నెదిరించిన శత్రువుయొక్క బలం సగం క్షీణిస్తుందని బ్రహ్మదేవుడు వరమిచ్చినట్లు ఈ క్రింది శ్లోకాన్ని బట్టి తెలుస్తున్నది.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

ఆహూయ వాలినం బ్రహ్మా దదౌ వరమనుత్తమమ్ ।
ప్రతీపవర్తినో భూయా దర్ధం బల మరిందమ॥

అనగా బ్రహ్మ వాలిని పిలిచి ఎదురుగా నిల్చి నిన్నెదిరించిన వాని బలం సగం తరిగిపోతుంది అన్న శ్రేష్ఠమైన వరమిచ్చినాడని భావం. దీనిని బట్టియే రాముడు వాలిని ఎదురుగావచ్చి వధింపక చాటుననుండి వధించినా డంటారు. కాని పై శ్లోకం వాల్మీకి రామాయణంలోలేదు. 'ఉమాసంహిత' అనే గ్రంధంలో ఉన్నది. క్షీరసాగరమథనకాలంలో పైవరాన్ని 'బ్రహ్మ వాలికి ఇచ్చినాడట ! కాని ఆ కాలానికి వాలి జన్మించనే లేదు కాన పై వృత్తాంతం సంశయాస్పదమని కొందరి భావన (శ్రీరామాయణ వైజయంతి 185పుట) పురాణాలలో ఇట్టి విరుద్ధాంశాలు తరచు వస్తుంటాయి. యుగాంతరంలో అలా జరిగివుండవచ్చు అని కొందరు సమర్థిస్తారు. వాలిని రాముడు అభిముఖంగా వచ్చి వధించక పోవడానికి కారణం, వాలి మెడలో ధరించిన 'కాంచనమాల'అని కూడా చెప్పడం కద్దు. ఇంద్రుడు తన కుమారుడైన వాలికి ఇచ్చిన మాల ఇది.

దత్వా తు కాంచనీం మాలాం వాసరేంద్రస్య వాలినః।
అక్షయ్యాం గుణ సంపూర్ణాం శక్రస్తత్ర దివంయయౌ॥ (ఉత్తరకాండ)

అక్షయమై, గుణసంభరితమైన కాంచనమాలను వాలికిచ్చి ఇంద్రుడు స్వర్గానికి వెళ్లాడని భావం. కిష్కింధాకాండలో ఇంద్రుడిచ్చిన వజ్రభూషితమైన మాల వాలి ప్రాణాలను, తేజమును, శోభను ధరించిందని చెప్పడమైనది.

శక్రదత్త వరా మాలా కాంచనీ వజ్ర భూషితా।
దధార హరిముఖ్యస్య ప్రాణాంస్తేజః శ్రియం చ సా॥ (కిష్కింధకాండ)

చివరిదశలో వాలి ఈ మాలను సుగ్రీవుని కిచ్చినాడు. వాలి ప్రాణాలను గూడా మాలధరించిందని చెప్పడంవల్ల వాలికి ఇంద్రుడిచ్చిన ప్రాణరక్షకమైన వరంగా దాన్ని భావించడమైనది. ఇలాంటి విషయాలలో వాల్మీకిరామాయణాన్నే ప్రమాణంగా తీసుకోవాలి. తదితరములకు అంతప్రాముఖ్యమివ్వరాదు.

### 540. శివపంచాక్షరి, నారాయణ, మహామృత్యుంజయ మంత్రాలను గురూపదేశం లేకుండా పఠించవచ్చా ?

శివపంచాక్షరి మున్నగు మంత్రాలను గురూపదేశం ద్వారా పొంది జపించడమే శ్రేష్ఠమైనమార్గం. ఇట్టి మంత్రాలను బోధించే గురువును బోధక





గురువు అంటారు. ఆ గురువు మంత్రసిద్ధికల్గి ఉంటాడు. అట్టివారినుండి పొందే మంత్రం సిద్ధిప్రదమవుతుంది. పుస్తకంలో వ్రాసిన మంత్రాలను తానుగా గ్రహించి జపిస్తే బ్రహ్మహత్యాపాతకం వస్తుందని ఒక హెచ్చరిక ఉన్నది.

పుస్తకే లిఖితాన్ మంత్రాన్ ఆలోక్య ప్రజపంతి యే।
బ్రహ్మహత్యా సమం తేషాం పాతకం పరికీర్తితమ్॥

స్వయంగా మంత్రాలు గ్రహించడం తగదని చెప్పడానికే ఈ విధంగా హెచ్చరించడమయింది.

భవేద్వీర్యవతీ విద్యా గురువక్త్ర సముద్భవా ।
అన్యథా ఫలహీనా స్యాత్ నిర్వీర్యాప్యతిదుఃఖదా॥

అని కూడా చెప్పారు. అంటే గురుముఖతః వచ్చిన విద్య శక్తిమంతంగా ఉంటుంది లేకుంటే అది నిర్వీర్యమై దుఃఖప్రదమవుతుందని భావం. మంత్రాలకూ, మూలికలకూ అగస్త్యుని శాపమున్నదనీ, గురుముఖతః వాటిని గ్రహిస్తే ఆ శాపం పనిచేయదనీ పెద్దలంటారు.

### 541. పంచమహాపాతకాలు అంటే ఏమిటి ?

1. బంగారం దొంగిలించడం 2. సురాపానం 3. బ్రహ్మహత్య 4. గురుపత్నితో సంగమం 5. ఈ పాపాలు చేసిన వారితో మైత్రి అనేవి పంచమహాపాతకాలు. మరొక విధానాన్ననుసరించి 1.బ్రహ్మహత్య 2. భ్రూణహత్య 3. బాలహత్య 4. గోహత్య మరియు 5.స్త్రీ హత్య అనేవి పంచమహాపాతకాలుగా పరిగణింపబడుతున్నాయి.

### 542. త్రయంబకు డనగా ఎవరు ?

త్రయంబకు డనగా పరమశివుడు. అంబక మంటే నేత్ర మని అర్థం. మూడునేత్రాలుగల దేవుడు త్రయంబకుడు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని అనే మూడు తేజస్సులు మూడు నేత్రాలుగా వెలసిన దేవుడు. ఫాలభాగంలోని మూడవ నేత్రమే అగ్నినేత్రం. మన్మథుణ్ణి ఈ నేత్రాగ్నితోనే శివుడు భస్మం చేశాడని పురాణాల కథనం. 'అంబక' శబ్దానికి 'తండ్రి'అనే అర్థం కూడా ఉన్నది. స్వర్గం, ఆకాశం, భూమి అనే మూడు స్థానాలకు సంరక్షకుడైన తండ్రి శివుడు అని కూడా త్రయంబక శబ్దాన్ని వివరిస్తారు. త్రయంబకం అని కూడా త్రయంబక శబ్దాన్ని వివరిస్తారు. త్రయంబకం యజమాహే సుగంధిం పుష్టివర్ధనమ్ ఇత్యా దిగా గల మృత్యుంజయ మహామంత్రంతో

MOHAN PUBLICATIONS.COM

మృత్యువునుండి విడుదల చేయుమని భక్తులు శివుణ్ణి ప్రార్థిస్తారు. త్రయంబకేశ్వరస్వామి ఆవిర్భావాన్ని శివపురాణం వివరించింది. ఈ దేవుడు గోదావరీ తటంలో త్రయంబకుడుగా ఆవిర్భవించాడు. గంగానది యొక్క మారు రూపమే గోదావరి. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన త్రయంబకేశ్వర లింగం దర్శనమాత్రంతో సకల పాపాలను పరిహరింపజేస్తుందని స్తోత్ర గ్రంథాలు చెబుతున్నాయి.

ఒకసారి తీవ్రమైన దుర్భిక్షం ఏర్పడింది. ప్రజలు క్షామపీడితులయ్యారు. అప్పుడు అహల్యా గౌతములు వరుణుని ఉద్దేశించి తీవ్రతపస్సు చేశారు. ఆ దేవుడు ప్రత్యక్షమై ఒకచిన్న గుంటలో అక్షయజలం ఆవిర్భవిస్తుందని వర మిచ్చాడు. ఆ జలమే తరువాత గౌతమీనదిగా రూపొందింది. ప్రజలకు క్షామబాధ తీరింది. అహల్యా గౌతముల కీర్తి నలుదెసలా వ్యాపించింది. ఇదిచూచి ఓర్వలేని కొందరు మునులు ఒక మాయాగోవును సృష్టించి గౌతముని పంటపొలాలలోనికి తోలారు. గౌతముడు గడ్డి పరకతో గోవును అదలించాడు. అది మరణించింది. గోహత్యాపాపం గౌతమునికి కల్గిందనీ, అతని ముఖం చూస్తే పాపమనీ మునులు గౌతముణ్ణి నిందించారు. గౌతముడు ప్రాయశ్చిత్తం చెప్పండని ఆ మునులను వేడుకొన్నాడు. వారు చెప్పినట్లు బ్రహ్మగిరి ప్రదక్షిణం చేశాడు. కోటిలింగాల నారాధించాడు. అందుకు సంతసించిన శివుడు ప్రత్యక్షమై మునుల కాపట్యాన్ని తెలియజేసి గోహత్యాపాపాన్ని తొలగించాడు. గౌతముని ప్రార్థనమేరకు గంగా శంకరులు నెలకొన్న క్షేత్రమే నాసిక్. అలా ఉదయించిన గంగయే గోదావరి. ఆ లింగమే త్రయంబకేశ్వరుడు. ఈ దేవుని ఆరాధన అభీష్టాలు చివరికి ముక్తి నిస్తుందని భక్తులు విశ్వసిస్తారు.

### 543. శివలింగానికి, నందీశ్వరునికి మధ్య మనుష్యులు నడవకూడదా ఎందుకు?

శివలింగానికీ, నందీశ్వరునికీ మధ్య మనుజులు నడువరాదనడం సంప్రదాయసిద్ధమైన ఆచారం.

అజయోర్ద్వియోర్మధ్యే నంది శంకర యోరపి అనే ప్రమాణాన్ని బట్టి మేకపోతుల నడుమ, ద్విజుల నడుమ, నంది శంకరుల నడుమ నడువరాదంటారు. ఇందుకు కారణాన్ని పెద్దలిలా వివరిస్తారు. శివుడు భక్తానుగ్రహతత్పరుడు. నంది శివభక్తులలో అగ్రగణ్యుడు, శివునికి వాహనమైనవాడు శివుని





పాదపద్మా లను ఎడతెగకుండా నందీశ్వరుడు దర్శిస్తుంటాడు. శంకరుడు గూడా అవిచ్ఛి న్నంగా భక్తాగ్రగణ్యుడైన నందీశ్వరునిపై అనుగ్రహ దృష్టిని ప్రసరింపజేస్తుంటాడు. వీరిరువురి మధ్య మానవులు నడిస్తే వారి పరస్పర దృష్టిప్రసారానికి విచ్ఛేదం ఏర్పడుతుంది. అందువల్ల ఇరువురికీ అడ్డుదగిలిన వారిపై కోపంరావచ్చు. అంచేత శివలింగ నందీశ్వరుల మధ్య నడువరాదంటారు.

### 544. పంచప్రేతములెవరు? పంచబ్రహ్మలెరు?

లలితాసహస్రనామ స్తోత్రములో 'పంచప్రేతాసనాసీనా' 'పంచబ్రహ్మ స్వరూపిణీ'అని 249,250 సంఖ్యగల నామాలను పఠిస్తాము. ఐదుప్రేతములపై ఆసీనురాలైనది. పంచబ్రహ్మలు స్వరూపంగా కలది అని ఈ నామాలకు అర్థం. మహేశ్వరుడు కల్పాంత సమయంలో ప్రళయతాండవం చేస్తాడు. అప్పుడు పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలకు అధిపతులైన బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు అనేవారు శక్తిని కోల్పోయి పంచభూతాలలో లీనమైపోతారు. అంటే ప్రేతత్వం పొందుతారు. ఆ ప్రేతాసనం అధిష్ఠించి దేవి ప్రళయతాండవం వీక్షిస్తుంది. అందువల్ల ఆమె 'పంచప్రేతాస నాసీన' అని వర్ణింపబడింది. మరల ఆ దేవి చిరునవ్వు నవ్వగానే పంచబ్రహ్మలైన బ్రహ్మ మొదలైన ఐదుగురు చైతన్యవంతులై దేవి నుండి ఉద్భవిస్తారు. పంచభూతా లకు నాయకులైన బ్రహ్మాదులు దేవీ స్వరూపులే. అందువల్ల పంచబ్రహ్మలను తనలో ఉదయింపజేసిన దేవి పంచబ్రహ్మ స్వరూపిణిగా కీర్తింపబడింది.

### 545. పార్వతి మహావిష్ణువు సోదరి ఎలా అయింది ?

లలితా సహస్రనామాలలో 'పద్మనాభసహోదరీ, నారాయణీ' అని పార్వతీ దేవి పేర్కొనబడింది.

'శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణీ! నమోస్తుతే' ఇత్యాది స్తుతులలో కూడా పార్వతి నారాయణిగా కీర్తింపబడుతున్నది. ఒకసారి దేవతలు రాక్షస సంహారా ర్థమై యజ్ఞం చేశారు. దేవికరుణచే ఆ హోమకుండం నుండి ఒక అండం ఆవిర్భవించింది. అండము యొక్క అర్ధభాగం నుండి విష్ణువు, తక్కిన సగం నుండి పార్వతి ఉద్భవించారు. ఇలా ఏకాండ సంభవులు కావడంవల్ల పార్వతి మహావిష్ణువు సోదరి అయింది. ఇందుకు మరొక వివరణ కూడా ఉన్నది. బ్రహ్మ యొక్క సంకల్పం వల్ల ప్రకృతి పురుషులు

MOHAN PUBLICATIONS.COM

ఉద్భవించారు. వీరిద్దరూ కర్తవ్యం తెలియక విచారంతో ఉండగా ఆకాశవాణి "నీటిలో తపస్సు చేయండి. మీకు కర్తవ్యం స్ఫురిస్తుంది" అని అంటుంది. ఆపై వారిరువురూ నీటిలో తపస్సు చేసి కర్తవ్యం గ్రహిస్తారు.

'అపో నారా ఇతి ప్రోక్తాః' అన్నట్లు నీటికి 'నారములు' అనిపేరు. నారములవల్ల అయినమును, అనగా కర్తవ్యమును గ్రహించారు గాన పార్వతి నారాయణిగా, విష్ణువు, నారాయణుడుగా రూపొందారని శివపురాణం వివరిస్తు న్నది. నారములు అయనంగా (నివాసంగా) ఉండి తపస్సు చేసినవారు అని కూడా వివరించవచ్చు.

### 546. క్రతువు, యాగము, యజ్ఞము, వీటికిగల తేడా ఏమి ?

యాజ్ఞస్సవో ధ్వరో యాగః సప్తతంతుర్మఖాః క్రతుః–అని అమరకోశం, యజ్ఞం, సవం, అధ్వరం, యాగం, సప్తతంతువు, మఖం, క్రతువు ఈ ఏడు పదాలు యజ్ఞం అనే అర్థంలోనే ప్రయోగింపబడుతున్నాయి.

'యజదేవపూజా సంగతి కరణదానేషు' అనే ధాతువు నుండే యజ్ఞం. యాగం అనే రెండు శబ్దాలూవచ్చాయి. అందువల్ల యజ్ఞమన్నా, యాగమన్నా యజనక్రియను బోధించే శబ్దాలే. క్రియతే బ్రాహ్మణాదిభి రితి క్రతుః అన్న వ్యుత్పత్తినిబట్టి ద్విజులచే చేయబడునది క్రతువు. ఇది కూడా యజన క్రియయే. అందుచేత నిఘంటువును బట్టి చూస్తే యజ్ఞ, యాగ, క్రతు శబ్దాలకు ఒకే అర్థం సిద్ధిస్తుంది. ఐనా యూపంతో (కట్టుకంబం) కూడిన సోమసాధ్యమైన యజ్ఞము క్రతువనీ, మంత్రపూర్వకంగా అగ్నియందు దేవతల నుద్దేశించి హవిస్సు నర్పించుట యాగమనీ, వేదాధ్యాపనాదులు యజ్ఞాలనీ వివరణ వాచస్పత్యంలో చూడవచ్చు.

### 547. రామాయణంలోని శ్రీరామునికి గుహుడు ఏమి చేసినాడు ?

గుహుడు ఒకబోయరాజు. ఈతడి నివాసము శృంగి బేరము అనే నగరము అరణ్యవాసమునకు పోవుచున్న శ్రీరామాదులను గంగానదిని దాటించినాడు. శ్రీరామచంద్రునియెడ మిక్కిలి భక్తికలవాడు. శృంగిబేర పురము గంగాతీరము నందలి ఒక పట్టణము, శ్రీరాముని అయోధ్యకు తీసికొని వెళ్ళవలెనని వచ్చే భరతుని అనుమానించి వానిపై కత్తికట్టుటకు సిద్ధమైనాడు. కాని నిజము తెలిసి కొని భరతుని రాముని యొద్దకు పోవుటకు గంగను దాటుటకు అనుమతించినాడు.



### 548. ఆలయములవద్ద అమ్మే నల్లదారాల ఉపయోగమేమి ?

ఆలయాలవద్ద అమ్మే నల్లదారానికి సామాన్యంగా మనవారు ఆయా వ్రతాలలో పూజచేసి చేతికి కట్టుకొనే తోరము అని పిలిచేదారము యొక్క స్థితిని కల్గించినారు. ఈ దారాన్ని చేతికి కట్టుకోవడంగానీ, మెడలో దండగా వేసుకోవడంగానీ, ఒక్క ఆచారంగా అలవాటు చేసికొన్నారు. దేవాలయాల వద్ద దీనిని తీసికోవడము, అమ్మడము ఒక పవిత్రమైన కార్యంగా భావిస్తారు. మొదట దీనికి కాశీదారం లేదా తోరము అనే పేరుండేది. ఇపుడు ప్రతి గుడిముందూ దీనిని అమ్ముతున్నారు.



### 549. దీపారాధనకు ప్రస్తుతంలభించే పామాయిల్ సన్‌ఫ్లవర్ ఆయిల్‌ను ఉపయోగించవచ్చా ?

దీపారాధనకు ప్రాచీనంగా ఆవునేతిని మాత్రమే వాడేవారు. తరువాత కాలక్రమంలో నూగల నూనెను వాడటం ప్రసిద్ధంగా ఉంది. అయితే ఏవిధంగా ఉత్పత్తి అయ్యే నూనైనా వాడవచ్చా అంటే..అసలు దీపారాధన చేయకుండా ఉండటముకంటే ఏదో విధంగా దేవతారాధనం చేయడం మేలే.

### 550. శివుడు అభిషేక ప్రియుడు అంటారు ఎందుకు ?

విష్ణువు అలంకారప్రియుడైనట్లే శివుడు అభిషేక ప్రియుడయ్యాడు. శివుడు అభిషేకాన్ని చాలాప్రియంగా భావిస్తాడు కాబట్టి అభిషేకప్రియుడన బడుతున్నాడు. ఎడతెగని జలధారతో శివలింగాన్ని అభిషేకిస్తారు. శివుడు గంగాధరుడు. ఆయన శిరస్సుపై గంగ ఉంటుంది. అందువల్ల శివర్చానలో అభిషేకం ముఖ్యమయింది. గంగ జలరూపమైనది. జలం పంచభూతాల లోనూ, శివుని అష్టమూర్తులలోనూ ఒకటి. అప ఏవ ససర్జాదౌ అన్న ప్రమాణాన్నిబట్టి బ్రహ్మ మొదట జలాగ్నే సృష్టించాడు. ప్రాణుల కన్నింటికీ ప్రాణాధారం నీరే.

మంత్రపుష్పంలోని "యోపా మాయతనంవేద" ఇత్యాది మంత్రాలలో నీటి ప్రాముఖ్యం విశదీకరించబడివున్నది. అందుచేత శివపూజలో జలాభిషేకానికి ఎంతో ప్రాముఖ్యం ఏర్పడింది. భగవంతుణ్ణి 16 ఉపచారాలలో పూజిస్తారు. అందులో మాత్రం ఇతరోపచారాలకంటే జలాభిషేక రూపమైన స్నానమనే ఉపచారమే ప్రధానమైనది.

ప్రజపన్ శతరుద్రీయం అభిషేకం సమాచరేత్.

MOHAN PUBLICATIONS.COM

అన్నప్రమాణాన్ని అనుసరించి శతరుద్రీయంపఠిస్తూ అభిషేకంచేయాలి.

పూజాయా అభికోహోమో హోమాత్తర్పణ ముత్తమమ్

తర్పణాచ్చ జపః శ్రేష్ఠో హ్యభిషేకః పరో జపాత్

పూజకంటే హోమము, హోమం కంటే తర్పణమూ, తర్పణం కంటే జపమూ, జపం కంటే అభిషేకమూ ఉత్తరోత్తరం శ్రేష్ఠాలని పేర్కొనబడ్డాయి.

## 551. సంజయుడు ఎవరు ?

సంజయుడు గవాల్గనుడనే సూతుని (రథచోదకుని) కుమారుడు. ఇతడు సకల సద్గుణ సంపన్నుడు. ఇతని యోగ్యతను వ్యాసుడు, ధృతరాష్ట్రుడు, ధర్మరాజు మొదలైనవారు చక్కగా గుర్తించినట్లు భారతం నుండి తెలుస్తున్నది. సంజయుడు అనే శబ్దానికి ఇంద్రియాలను చక్కగా జయించినవాడు అని అర్థం.

కౌరవ పక్షంనుండి ధృతరాష్ట్రుని ఆదేశంతో పాండవులవద్దకు మొదట రాయబారిగా పోయినవాడు సంజయుడే. ఇతడు అంధుడైన ధృతరాష్ట్రుని వద్ద ఉండి ఆ మహారాజును సేవించేవాడు. మహాభారతయుద్ధం జరిగిన తీరుతెన్నులను భగవద్గీతతోసహా ఆ రాజుకు వివరించి చెప్పినవాడు ఇతడే. యుద్ధభూమిలో ఎక్కడ తిరిగినా ఇతనికి ఏవిధమైన ప్రమాదమూ కలగకుండా ఉండునట్లూ, యోధుల మాటలూ, అభిప్రాయాలూ గోచరించే టట్లూ వ్యాసమహర్షి ఇతనికి దివ్యశక్తి ప్రసాదించాడు. అందువల్లనే ఇతడు ధృతరాష్ట్రునికి యుద్ధ వృత్తాంతాన్ని పూస గుచ్చినట్లు వివరించగలిగాడు. పదునెనిమిదవరోజు భారతయుద్ధభూమిలో సాత్యకి ఇతన్ని పట్టుకొని వధించబోగావ్యాసుడు కాపాడినాడు చివరి దినాలలో ధృతరాష్ట్రునితో గూడా ఇతడు తపోవనానికి వెళ్ళాడు. ధృతరాష్ట్రుని మరణానంతరం హిమాలయా నికి పోయాడు.

## 552. ఏ మంత్రాన్ని అయినా ఎన్నిసార్లు జపించాలి ?

మంత్రజపానికి జపమాలను వినియోగిస్తారు. సాధారణంగా జపమాలలో 108 పూసలుంటాయి. అందువల్ల మంత్రజపం కనీసం 108సార్లు చేయాలని గ్రహించాలి. ఒక ఆవృత్తి (108) పూర్తి అయిన తరువాత మరల మొదటి పూసనుండి ప్రారంభించి జపం కొనసాగించ వచ్చు. ఇలా ఎన్నిసార్లైనా అవకా శాన్నిబట్టి చేయవచ్చు. మంత్రాలను అక్షర లక్షలుగా జపించాలని కూడా చెబు తాడు. దానివల్ల హానిలేదు.



"అనునిత్యం పదిహేను ఇరవైవేలసార్లు జపంచేస్తే మనస్సు ఇష్టదైవం మీద నెలకొంటుంది" అని శ్రీశారదాదేవి చెప్పివున్నది (మంత్రదీక్ష – 34 పుట) కొన్ని మంత్రాలకు ఇన్నిసార్లు జపించాలి అని విధి వుంటుంది. అలా జపించకపోతే సిద్ధి కల్గకపోవచ్చు. కాని ఎక్కువ జపించడంవల్ల ప్రమాదం లేదు. ఇతరులకు హాని కల్గించే ఉద్దేశంతో మాత్రం జపం చేయరాదు. జప సమయంలో కేవలం లెక్కమీదనే మనస్సు ఉంచితే అది ఇష్టదైవం మీద లగ్నంకాదు. కాన లెక్కనుపట్టించుకోకుండా జపం కొనసాగించాలని మహనీయులంటారు.

132

## 553. ఓం నమోభగవతే వాసుదేవాయ అనే దివ్యమంత్రం ఎలా ఏర్పడింది ?

ఓం నమోభగవతే వాసుదేవాయ అనునది ద్వాదశాక్షరీ మంత్రం. నారదుడు ధ్రువునికి ఉపదేశించినది. వాసుదేవుడనగా వసుదేవుని కుమారుడైన కృష్ణుడు. అట్టి ద్వాపరయుగానికి చెందిన వాసుదేవుణ్ణి జపించే మంత్రం కృతయుగంలో ఎలా ప్రచారం పొందింది అన్న ప్రశ్న అడిగిన వారి సందేహమని వాసుదేవుడు అనే శబ్దానికి వసుదేవుని కుమారుడు అని మాత్రమేకాక విశిష్టమైన అర్థం కూడా ఉన్నది.

వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్.

సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తుతే.

అని భారతంలోని శ్లోకం. ముల్లోకాలలోనూ నివసించేవాడూ, సర్వప్రాణులకూ నివాసమైనవాడూ ఎవడో అతడే వాసుదేవుడు.

ఎల్లయందును దావసియించుటెల్ల

యదియు దనయందు వసియించుటంద్రు వాసు

దేవు డను పేరి కర్థంబు – అని ఆంధ్రమహాభారతంలో కూడా వాసుదేవ శబ్దం ఈ అర్థం కలదిగా వివరించబడింది.

సర్వత్రాస సమస్తం చ వసత్యత్రేతి వై యతః

తతస్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే.

అన్న విష్ణుపురాణ వచనం కూడా ఇందుకు ప్రమాణం. కాన మత్స్యా ద్యవతారాలు కృతయుగకాలంనుండీ తాల్చిన శ్రీమన్నారాయణుడే వాసు దేవుడు. ఆ దేవుడు ఒక యుగానికి చెందినవాడు కాదు. సర్వకాల సర్వదేశ సర్వావస్థలలో ఉండేవాడు. అందుచేత ద్వాదశాక్షరీ మంత్రం అన్ని కాలా లకూ అనువర్తిస్తుంది.

MOHAN PUBLICATIONS.COM

### 554. సాలగ్రామాన్ని ప్రతి నిత్యము నైవేద్యము నుంచవలెనందురు. ఇది నిజమేనా ?

మూర్తి పూజావిధానంలో సాలగ్రామ శిలా పూజ కూడా ఉన్నది. దేవతా మూర్తులు రెండురకాలు. ఆవాహనం ద్వారా దేవతా సాన్నిధ్యం కలమూర్తులు ఒకరకం. కాగా సహజంగానేదేవతా సాన్నిధ్యం కలవి రెండవ తెగకు చెందుతాయి. మొదటి తెగవి గుడిలోని దేవతా విగ్రహాలు, రెండవ తెగకు చెందినవి సాలగ్రామాలు. కాన సాలగ్రామాలలో నిత్యం దేవతలు సన్నిహితులై ఉంటారు. గండకీనదిలో లభించే సాలగ్రామాలు ప్రధానంగా విష్ణుస్థానాలై ఉంటాయి. ఈ మూర్తులను పూజించే వారు ధ్యానావాహనాది క్రమంలో చేసే పూజల్లో నిత్యం నైవేద్యం కూడా తప్పక సమర్పించాలి.

సర్వభక్ష్యై శ్చ భోజ్యైశ్చ రసై ష్షడ్భిస్సమన్వితమ్
నైవేద్యంఒ చ మయా ఒ నీతం గృహాణ పురుషోత్తమ.

–అని పఠిస్తూ నైవేద్యం సమర్పించాలి. మరొక విశేషం నైవేద్యం నామ మాత్రంగా పెట్టడమేకాక చాలినంతగా పెట్టాలి అని కూడా పెద్దలు చెప్పారు. ఒకసారి పంచాయతన పూజచేసే భక్తుడొకడు తాను కష్టాలలో ఉన్నట్లు శృంగేరీ పీఠాధిపతులకు విన్నవించుకొన్నాడు. ఆ స్వామి వారు అతడు పూజించే మూర్తిని చూచి "ఈ సాలగ్రామానికి నైవేద్యం సరిపోవడం లేదు. ప్రతిదినం పాయసం నివేదనచెయ్యి" అని చెప్పారట! అలా చేయగా అతని కష్టాలు తీరాయట!

ఈ విషయాన్ని శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు సంపాదించి ప్రకటించిన సాలగ్రామ శాస్త్రానికి తాము వ్రాసిన పరిచయ వచనాలలో సుప్రసిద్ధ విద్వాంసులు ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు ఉటంకించారు. (పుట 8)

### 555. సప్తఋషులు అనగా ఎవరు ?

మరీచి రంగిరాశ్చాత్రిః పులస్త్యః పులహః క్రతుః
వసిష్ఠ ఇతి సప్తైతే మనసా నిర్మితా హి తే
ఏతే వేదవిదో ముఖ్యా వేదాచార్యాశ్చ కల్పితాః
ప్రవృత్తి ధర్మిణశ్చైవ ప్రాజాపత్యే చ కల్పితాః

అని మహాభారతంలోని శాంతి పర్వం సప్తర్షులనూ, వారి ధర్మాన్నీ పేర్కొన్నది. మరీచి, అంగిరసుడు, అత్రి,పులస్త్యుడు, పులహుడు, క్రతువు,

MOHAN PUBLICATIONS.COM

133



వసిష్ఠుడు అనువారే సప్తర్షులు, వీరు వేదవేత్తలు, వేదాచార్యులు, లోకంలో ప్రవృత్తి ధర్మాన్ని నిర్వహిస్తూ ప్రజాపతులుగా కూడా తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తారు. వారి జన్మ విషయం భగవద్గీతలో–

మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః

అని చెప్పబడింది. "ఏడుగురు మహర్షులు, సనకాదులు, మనువులు నామనస్సంకల్పం వల్ల జన్మించారు. వారి నుండి ప్రజలు ఉద్భవించారు"అని భగవంతుడన్నాడు. ఇందువల్ల సప్తర్షులు మహావిష్ణువు సంకల్పంతో జన్మించారని తెలియవస్తున్నది. ఐతే భారతంలో పరమ పురుషుడు బ్రహ్మతో 'సప్తైతేమనసా నిర్మితాహితే' అని చెప్పడంవల్ల బ్రహ్మ యొక్క మానస పుత్రులుగా సప్తర్షులు పేర్కొనబడినారు. ఈ వైరుధ్యం ఎలాపరిష్కరించడం ? బ్రహ్మ విష్ణుదేవుని కుమారుడే కాన 'ఆత్మావై పుత్రనామాసి' అన్న ప్రమాణాన్ని బట్టి బ్రహ్మ విష్ణువులకు భేదంలేదు. అంచేత బ్రహ్మమానస పుత్రులన్నా, పురుషోత్తముని సంకల్పంతో జన్మించారన్నా వైరుధ్యం లేదని గ్రహించాలి.

పైన పేర్కొన్న మరీచి మున్నగుసప్తర్షులు మొదటిదైన స్వాయం భువ మన్వంతరానికి చెందినవారు. విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, గౌత ముడు మున్నగు ఇప్పటి మన్వంతరానికి చెందిన ఋషులు గీతలో పేర్కొనబడినవారుకారని గీతా వ్యాఖ్యాతలు వివరించారు.

### 556. జపము, ధ్యానము వీనికి గల తేడా ఏమి ?

జప=వ్యక్తాయాం వాచి అనేధాతువు నుండి జప శబ్దం పుట్టింది. వ్యక్తమైన మాట, జపం అనబడుతుంది. ఈ పదం ముఖ్యంగా మంత్రాలను జపించడంలో ఉపయోగింపబడుతున్నది. ముముక్షువులు, అనగా మోక్షాన్ని అభిలషించేవారు తమ మనస్సును నిగ్రహించడానికి జపాన్ని సాధనంగా గ్రహిస్తారు. సప్తకోటి మహామంత్రాలలో ఏమంత్రమునైనా జపించవచ్చు. మననం చేసేవారిని రక్షించేదే మంత్రం. అందులో రామతారకం, శివపంచాక్షరి, నారాయణాష్టాక్షరి, ప్రణవం, ఇవి ముఖ్యాతి ముఖ్యమైన మంత్రాలు. ప్రణవ జపాన్ని వివరిస్తూ పతంజలి 'తజ్జపస్త దర్థభావనమ్' అని చెప్పాడు. పరమాత్మకు వాచకమైన ఓంకారంను జపించే సమయంలో ఓంకారాని కర్థమైన పరమాత్మను గూడా భావించాలి. ఇతర మంత్రాల జపంలో కూడా ఈ పద్ధతిని పాటించాలి. జపవాచికం, ఉపాంశు, మానసం అని మూడురకాలు.

విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః
ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః

అని మనుస్మృతి. విధిపూర్వకమైన యజ్ఞం కంటే ప్రణవాదుల వాచిక జపరూపమైన యజ్ఞం పదిరెట్లు మేలైనది. ఉపాంశు జపం నూరురెట్లు శ్రేష్ఠమైనది. మానజపం వెయ్యిరెట్లు మేలైనది.

పైకి వినబడేటట్లు ఉచ్చరిస్తూ చేసే జపం వాచికం. పెదవుల కదలికతో కూడి మిక్కిలి తక్కువ స్వరంతో చేసేది ఉపాంశు జపం. మనస్సుతో చేసేది మానస జపమని గ్రహించాలి. 'జప్యేనైవ తు సంసిద్ధ్యేత్' అను ప్రమాణాన్ని బట్టి సాధకుడు జపంతోనే సిద్ధిని పొందుతాడు. మానసజపం ఉత్తమం. ఉపాంశు జపం మధ్యమం, వాచికం జపం అధమమని శాస్త్రాలు చెప్పాయి.

ఇక ధ్యానం విషయానికివస్తే జపకోటి సమం ధ్యానం అన్న ఉత్తరగీతా వచనాన్నిబట్టి కోటి మంత్రజపం ఒక్క ధ్యానంతో సమానమని తెలుసుకోవాలి. ధ్యై=చింతాయాం అన్న ధాతువు నుండి ధ్యానం అనే శబ్దం జనించింది.

తత్రప్రత్యయైకతానతా ధ్యానం అని యోగశాస్త్రం ధ్యానాన్ని నిర్వచించింది. ఏదైనా ఒకచోట ఇతర విషయాలతో సంబంధం లేకుండా చిత్తం సంలగ్నం కావడాన్ని ధ్యానమంటారు. ధ్యానం నిర్విషయం మనః అనుటకు బట్టి విషయ చింతనలేని మనఃస్థితి ధ్యానమవుతుంది. ధ్యేయ విషయాన్నిబట్టి ఈ ధ్యానం మేలైనది. శ్వాసమీద మాత్రమే ధ్యాస నిలిపే ప్రక్రియను గూడా ధ్యానమంటారు. ప్రాణాపానస్మృతి (ఆనాపానసతి) రూపమైన ధ్యానమిది.

నాస్తి ధ్యానసమో యజ్ఞః నాస్తి ధ్యాన సమం తపః
నాస్తి ధ్యానసమం తీర్థం తస్మాద్ధ్యానం సమాచరేత్.

ధ్యానంతో సమమైన యజ్ఞం, తపస్సు, తీర్థం లేవుకాన ధ్యానం ఆచరించా లని శాస్త్రాలు బోధించాయి.

ధ్యానంతో సమమైన సగుణమనీ, నిర్గుణమనీ ప్రధానంగా రెండు విధాలు. నిర్గుణమైన పరమాత్మను ధ్యానించడం కష్టం. కాన సగుణ ధ్యానంచేసి అది పరిపక్వత పొందిన తరువాత నిర్గుణ ధ్యానం చేయవచ్చు. సగుణ ధ్యానహీనస్య, నహి నిర్గుణవేదనమ్ అనుటలోని అంతర్యమిదే. భగవద్గీత ఆరవఅధ్యాయం ఆత్మసంయమయోగంలో ధ్యానవిధానం బోధించబడింది. యోగశాస్త్రం కూడా ధ్యానాన్ని నిరూపించింది.





## 557. బలరాముడు, కృష్ణుడు అన్నదమ్ములు ఎలా అయ్యారు ?

యదువంశానికి చెందిన వసుదేవునికి చాలామందిభార్యలున్నారు. వారిలో దేవకి, రోహిణి అనేవారు ముఖ్యమైనవారు. దేవకీదేవికి అష్టమగర్భములో కారాగారములో పుట్టినవాడు కృష్ణుడు. ఇతణ్ణివసుదేవుడు కంసునికి భయపడి ప్రచ్ఛన్నంగా నందగోకులం చేర్చాడు. అక్కడ యశోద పెంచింది. ఆదిశేషుని అవతారమైన బలరాముడు మొదట దేవకియొక్క సప్తమగర్భంలో పెరిగినవాడు. కంసుని నుండి ప్రమాదం గుర్తించి గర్భపిండాన్ని తీసి యోగ మాయ రోహిణి గర్భంలో ప్రవేశపెట్టింది. అందుచేత రోహిణి కుమారుడుగా బలరాముడు ప్రసిద్ధుడైనాడు. ఈ రీతిగా బలరాముడు, కృష్ణుడూ ఇరువురూ వసుదేవుని కుమారులేగాన అన్నదమ్ములయ్యారు. దశావతారాలలో వీరిని సప్తమ, అష్టమ అవతారాలుగా పరిగణిస్తారు.

## 558. పాండవులలోని సహదేవుని వృత్తాంతము ఏమి ?

సహదేవుడు పాండురాజు కుమారుడు. మాద్రి యందు అశ్వినీదేవతల అంశంలో నకుల సహదేవులిద్దరూ జన్మించారు. మాద్రి భర్తతో సహగమనం చేసింది. నకుల సహదేవులను కుంతీదేవి ధర్మజాదులతో సహా పెంచింది. స్వయంవరంలో సహదేవునికి లభించిన భార్యపేరు విజయ. ఆమెయందు అతనికి పుట్టిన కుమారుని పేరు సుహోమత్రుడు. ద్రౌపదియందు అతనికి పుట్టిన వాడు శ్రుతసేనుడు.

సహదేవుడు పాండవులలో చివరివాడు, చాలా సుకుమారుడు. అందుచేత అరణ్యవాసానికి పోయే సమయంలో కుంతి ఎంతో దుఃఖించి "కడుపసిబ్డి వీడొకటి గావుతా నెఱుగండు" అని అతని స్వభావాన్ని ద్రౌపదికి వివరించి జాగ్రత్తగా చూచుకొమ్మని చెప్పింది.

రాజసూయ యాగానికి ముందు సహదేవుడు దక్షిణ దిక్కులోని రాజులను జయించాడు. యాగంలో శిశుపాలుడు కృష్ణునిపూజను ఆక్షేపించినపుడు ఇతడు ఆగ్రహించి "అలా ఆక్షేపించిన వారితలపై నా కాలు మోపుతాను"అంటూ కాలు పైకెత్తాడు. అప్పుడు సదస్సులు భయపడ్డారు. కురుక్షేత్ర యుద్ధంలో ఇతడు ఉలూకుడు మొదలైన కౌరవపక్షీయులను సంహరించాడు. ఇతడు ప్రాయంలో చిన్నవాడైనా ప్రజ్ఞావంతుడు. నేను ప్రజ్ఞావంతుడను అన్న గర్వం కూడా ఇతనికి ఉండేది. మహాప్రస్థాన సమయంలో ఇతడు ప్రాణరహితుడై పడిపోయినప్పుడు ధర్మారాజు–"వీడు దనకంటె ప్రాజ్ఞుండు

MOHAN PUBLICATIONS.COM

లేదు జగతి నెందునని సంతతమ్ము దానెడ్డ దలచు దాననిట్లయ్యె" అని చెప్పాడు. ఆ గర్వమే అతనిలో ఉన్నదోషం.

## 559. ఉపనిషత్తులు-ఇతిహాసాలు తేడా ఏమిటి ?

బ్రహ్మవిద్యను బోధించేవి ఉపనిషత్తులు 'ధర్మేరహస్యుపనిషత్'అన్న నిఘంటువచనం ప్రకారం 'ధర్మం' లేదా'రహస్యం' కూడా ఉపనిషత్తు అని చెప్పబడుతుంది. అయితే 'సర్వేఽర్థాః ఉపనిషీధంతి అస్యామితి ఉప నిషత్' అన్న నిర్వచనాన్ననుసరించి అన్ని అర్థాలూ దేనిలో ఉన్నవో, అది ఉపనిషత్తు అన్న వివరణ ముఖ్యమైనది. సంసారబీజాన్ని నశింపజేసేది, మోక్షం కోరే వారిని పరబ్రహ్మం వద్దకు చేర్చేది, అవిద్య మున్నగు సంసార కారణాలను తొలగించేది ఉపనిషత్తు అని భాష్యకర్తలు విశదీకరించారు.

గురువు సన్నిధిలో ఏకాంతంలో కూర్చొని శిష్యులు ఆయన నుండి గ్రహించే తత్త్వమే ఉపనిషత్తు అనినవీనులన్నారు. అందులో మేలైన శ్రేయస్సు ఉపనిషణ్ణమై (కూర్చొని) ఉన్నదిగాన దానికి ఉపనిషత్తు అని వ్యవహారం అని గూడా వివరించడం కద్దు. ఉపనిషత్తు అనగా బ్రహ్మవిద్య, దానిని ప్రతిపాదించే గ్రంథాలను గూడా ఉపనిషత్తులనవచ్చును.

జీవుడు, దేవుడు, ప్రకృతి మున్నగు విషయములను ఉపనిషత్తులు వివరిస్తాయి. దీనిని వివరించే కొన్నికథలు గూడా వాటిలోఉంటాయి. 'ఈశా వ్యాసం' మొదలైనవి ఉపనిషత్తులు. ఇతిహాసం అనే పదాన్ని 'ఇతి-హ-ఆస' అని విడ గొట్టాలి. ఇట్లు ఉండెను గదా అని దాని అర్థం. పూర్వమెప్పుడో జరిగిన చరిత్రను ఇలా జరిగిందని వివరించేవే ఇతిహాసాలు. ఉదాహరణకు భారతం ఒకఇతిహాసం. ఇందులో పూర్వం జరిగిన కౌరవపాండవుల చరిత్ర, దానికి సంబంధించిన ఇతరాంశాలు వివరించబడి వున్నాయి.

ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్

అన్నమాటనుబట్టి వేదార్థాలను వివరించడానికే ఇతిహాసాలూ, పురాణాలూ ఆవిర్భవించాయని గ్రహించాలి.అందుచేత ఉపనిషత్తులు తత్త్వ ప్రధానమైనవికాగా, ఇతిహాసాలు పూర్వచరిత్ర ప్రధానమైనవని స్పష్టమయింది.

## 560. గోవింద నామానికి గల అర్థాలు ఏమిటి ?

'గో' శబ్దానికి అనేకార్థాలున్నాయి.

స్వర్గేషు పశువాగ్వజ్ర, దిఙ్నేత్రఘృణి భూజలే





-అని అమరకోశం, స్వర్గం,బాణం,పశువు, వాక్కు,వజ్రాయుధం, దిక్కు, నేత్రం, కిరణం, భూమి,నీరు అని పలు అర్థాలను 'గో'శబ్దానికి చెబుతారు. పై అర్థాలలో కొన్ని 'గోవింద' నామంలోని 'గో' శబ్దానికి అన్వయిస్తాయి.

"త్వం గవామింద్రతాం గతః। గోవింద ఇతి లోకాస్త్వాం

స్తోష్యంతి భువి శాశ్వతమ్" అన్న ప్రమాణాన్నిబట్టి గోవులకు ప్రభువైన కృష్ణుడు గోవిందుడయ్యాడు. గోవులను కాపాడేవాడు అని కూడా చెప్పవచ్చు.

గోభిరేవయతో వాచ్యో గోవింద స్స ఉదాహృతః

అని మరొకప్రమాణాన్ని అనుసరించివేదవాక్కులచే ప్రతిపాదింపబడే వాడు గోవిందుడు.

వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః అని భగవద్గీత కూడా ఈ విషయాన్నే చెప్పింది. హిరణ్యాక్షునిచే అపహరింపబడిన భూదేవిని తిరిగి పొందినవాడు గాన గోవిందుడు. ఈ రీతిగా ఆవులు, వేదవాక్కులు, భూమి ఇత్యాదిగా కల అర్థాలను గ్రహించి గోవింద శబ్దాన్ని అర్థం చేసుకోవాలి. 'కిరణం' అనే అర్థాన్ని గ్రహించి తేజోమూర్తి అని కూడా వివరించవచ్చు.

## 561. ఆకాశరాజు పుత్రిక పద్మావతీదేవి, పద్మసరోవరములో అవత రించిన పద్మావతీదేవి ఒకరేనా ?

ఒక్కరే. వీరిద్దరు లక్ష్మీదేవి అంశతో పుట్టినవారే. గోదాదేవి కూడా తులసి వనంలో దొరికింది. వీరందరు ఒక్కరే.

## 562. అసలు శ్రీలలితాదేవికి చరిత్ర ఉన్నదా ?

లలితాదేవిగానీ, త్రిపురసుందరి బాల, శ్యామల, రాజేశ్వరి ఇత్యాదిగా పిలువబడే స్త్రీ దేవతలందరు, పార్వతీదేవియొక్క సత్త్వ,రాజస స్వరూపాలు. కాళి,చండి, ఇత్యాది రూపాలన్నీ ఆమె తామస రూపాలుగా పురాణాలు చెబు తున్నాయి. ఈశ్వరీసర్వభూతాం, సర్వకరాణ కారణం, సర్వకామార్థదా శాంతా సుఖసేవ్యా దయాన్వితా అని దేవీ భాగవతంలో దేవిని గురించి వివరింపబడింది. మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి ఆమెయే. ఆదిపరా శక్తి కూడా ఆమెయే.

శ్రీకృష్ణుడు శ్యామలారూపుడని, శ్రీరాముడు లలితా స్వరూపమని, శాక్తేయులు చెబుతారు. 'శ్రీకృష్ణఃశ్యామలాదేవీ శ్రీరామో లలితాంబికా' అని శివ పురాణంలో ఉన్నది. మీరడిగిన ప్రశ్నలో లలితాదేవివేరు. త్రిపురసుందరి వేరు. బాలాత్రిపుర సుందరివేరు. పూర్వం మహిషాసురుని సంహరించటానికి

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

త్రిమూర్తులు, దేవతా సహితులై ఆతని మీదికి యుద్ధానికి వెళ్ళారు. కాని బ్రహ్మ దత్త వర ప్రభావంచేవాడు పురుషులచే మరణింపడు. వారికీ విషయం తెలిసి ఎలావధించవలెనని,ధ్యానమగ్నులైయుండగా వారి అందరి శరీరముల నుండి ఒక మహాతేజస్సు బయలువెడలి క్రమంగా ఏకమై ఆకాశంలో వారి ఎదుటముఖము శ్వేతపుండరీకములువలె విష్ణుముఖమువలె నొప్పింది. శివుని ప్రభావమున ఆమెకు మూడు నేత్రములు కల్గినవి. ఒక కన్ను ఎఱ్ఱగా ఒక కన్నునల్లగా ఒక కన్నుతెల్లగా భాసించాయి. ఆ మూడు నేత్రముల యందగ్ని ఆవహించింది. వాయుతేజంతో చెవులు, సంధ్యాతేజంతో నల్లనైన వెంట్రుకలతో ధనుస్సును బోలిన కనుబొమలు, కుబేరుని తేజస్సుతో నువ్వు పువ్వువంటి నాసిక, బ్రహ్మతేజమున మల్లెమొగ్గలవంటి నాసిక, బ్రహ్మతేజ మున మల్లె మొగ్గల వంటి దంతములు, సూర్యతేజస్సు వలన క్రిందిపెదవి, మహావిష్ణుంశమున బాహువులు, వసువుల అంశమున ఆమెవ్రేళులు, చంద్రు నంశమున స్తనములు, ఇంద్రాంశతో త్రివళీయుతమైన నడుము, భూమి అంశమున కటిప్రదేశంతో ఆమె ఆవిర్భవించింది. దేవతలు తమ తమ ఆయుధాల నన్నింటినీ ప్రసాదించారు. ఆమె సౌందర్యం గురించి విని మహిషుడామెను పట్టమహిషిగా పొందాలని భావించి, మంత్రి సేనా సము దయ సమన్వితంగా ఆమెచే చంపబడినాడు. దేవతలందరు ఆమెను త్రిలోక సుందరిగా ఆరాధించిరి. ఆమెనే త్రిపురసుందరిగా వివిధ నామాలతో నేటికీ అర్చిస్తున్నారు. ఈమె పేరులోని త్రిపురశబ్దానికి ఎన్నో అర్థాలున్నాయి. పురమంటే శరీరం. కన్ను, శిరస్సు, హృదయం లేక సూర్య, చంద్ర, అగ్ని అనే మండలాలకు వాగ్భటకూడ, కామకూట, శక్తికూటాల కామె అధీశ్వరి కనుక ఆమెకు త్రిపురేశ్వరి అనిపేరు వచ్చింది. పంచాక్షరీమంత్రం లోని మూడుభాగాలను, ఆమె శరీరంలోని మూడుభాగాలుగా కొందరు భావిం చారు. మొదటిభాగం శిరస్సు, రెండవభాగమక్కడ నుండి నాభివరకు, అక్కడ నుండి క్రిందిభాగం మూడవభాగంగా భావించారు. ఇవి వరుసగా వాగ్భట, శక్తి,కామ కూటాలకు నిలయాలు. శంకరాచార్యులవారు సౌందర్యలహరిలో త్రిపురాసుందరి వర్ణనం ఎంతో గొప్పగా కావించారు.

కాళికాదేవి యొక్క సౌందర్య స్వరూపం లలితాదేవి. అష్టాదశ మహాశక్తి పీఠాలలో ప్రయాగలో లలితాపీఠం ఉన్నది. ఔత్తరాహులలో లలితోపాసన చాల తక్కువ. లలితాదేవి ఒకమంచముపై కూర్చుండి ఉంటుంది. ఆ మంచానికి రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ, ఈశ్వరుడు నలుగురు నాలుగుకోళ్లు.





సదాశివుడు ఆ మంచంపై పరుపు. ఆయన మీద ఆమె కూర్చుండి ఉం టుంది. భైరవయామిళ మనే శాక్తేయ గ్రంథంలో–

శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే
మృతకాశ్చచతుష్పాదాః కశిపుశ్చ సదాశివః
తత్ర శేతే మహేశానీ మహాత్రిపురసుందరీ

ఇక్కడ లలితా, త్రిపురసుందరులొకటిగా భావించాడు కవి.

“శివాకారే మంచే పరమశివపర్యంక నిలయాం” లలితాదేవికి శివాకార మైన మంచం–పరమశివుడు శయ్య. ఆమెశయ్యను చూడండి. సదాశివుడు మంచపు పలక. మహేశుడు తలగడదిండు. పరమశివుడు ప్రక్కమీద పరచిన దుప్పటి. దానిమీద లలితాదేవి కూర్చుండి ఉంటుంది. ఆమెను ఉపాసిస్తే సర్వ కామ్యములు తీరుస్తుంది. స్త్రీ దేవతలందరిలో లలితాదేవిని మించిన సౌందర్యవతిలేదని దార్శనికుల అభిప్రాయం. సౌందర్యలహరిలో శంకరుల వారు త్రిపుర సుందరిని మించిన సౌందర్యవతి లేదన్నారు. ఇక ఆమె కాళ్ళక్రింద శివుడుండ టానికి చండీసప్తశతిలో ఒక కథఉన్నది. మహాప్రళయ సమయంలో సంహార శక్తి కాళికాదేవి కరతాళతాండవం చేస్తున్నది. ఆమె పాదఘాతాలకు బ్రహ్మాండ భాండం దద్దరిల్లుతున్నది. దిక్పాలకులు దేవతలు భయభ్రాంతులై శంకరుని శరణుజొచ్చినారు. పరమశివుడు లోకాలను రక్షించాలనే తలంపుతో ఆమెతో “లోకాలన్నీ ఛిన్నాభిన్నమౌతున్నాయి. నా దేహాన్ని నీకర్పించుకొంటున్నాను. ఈ శరీరంమీద కాలు మోపవలసింద న్నాడు. ఆమె అంగీకరించి శివుని దేహంపై నిలువ బడింది. అందువలన ఆమెకు శివారూఢ అనిపేరు వచ్చింది.

### 563. శివుని అంశతో పుట్టిన ఆంజనేయుడు విష్ణు (రామ) భక్తుడుగా ఎందుకు మారదు.

విష్ణువు హృదయం శివుడు. శివుని హృదయం విష్ణువు అని శాస్త్రాలు చెబుతున్నాయి. శివుడు రామభక్తుడు. పార్వతీ దేవికి ‘శ్రీరామ రామ రమేతి, రమే రామే మనోరమే’ సహస్రనామ తత్తుల్యం, రామనావరాననే అని రామ తత్త్వాన్ని శివుడే చెప్పాడు. కాశీలో మరణించిన ప్రాణులకుడిచెవిలో విశ్వేశ్వరుడు రామతారకమంత్రం చెబుతాడట.

హనుమత్సంహితలో శంకరుడే రామసేవాకాంక్షతో హనుమంతునిగా జన్మించాడని చెప్పబడింది. పార్వతీదేవితో శివుడు ‘దేవీ! రావణుడు తన

MOHAN PUBLICATIONS.COM

పదితలలుకోసి అగ్నిలో వ్రేల్చిదశరుద్రుల కరుణకు పాత్రుడైనాడు. ఏకాదశ రుద్రుని ఉపేక్షించినాడు. నా అంతరంగిక భక్తుడైన నందీశ్వరుని రావణుడు హేళనచేశాడు. కావున రావణుని శిక్షించడానికి ఏకాదశరుద్రాంశతో నేనే రామభక్తుడైన హనుమంతునిగాపుట్టి రావణుని శిక్షించెదను. నన్ను అవ మానించినను భరిస్తానుగాని, నా భక్తుని అవమానిస్తే భరించలేను. అని శంకరుడే హనుమద్రూపంతో జన్మించాడు. అకారఉకార మకరాలు కలిస్తే ఓంకారమనే ప్రణవమేర్పడు తుంది. అందు 'అకారోవిష్ణు' అని చెప్పబడింది. శ్రీకృష్ణుడు 'అక్షరాణాం' 'అ' కారోస్మి అన్నారు. అంటే 'అ'విష్ణుబీజం. 'మకా రాక్షరసంభూతఃశివస్తు హనుమాన్ స్మృతః' అని తారసారోపనిషత్తు చెబు తుంది. కనుక శివవిష్ణువులిద్దరు ఓంకార స్వరూపులే అని అర్థం చేసుకోవాలి.

## 564. ఆదిత్య హృదయం ఫలశ్రుతి ఏమి ?

ఆదిత్యహృదయం రామరావణయుద్ధ సమయంలో అగస్త్య మహర్షి రాము నకు ఉపదేశించాడు.

దైవతశ్చసమాగమ్య ద్రష్టుమభ్యాగతోరణమ్
ఉపగమ్యాబ్రవీద్రామ మగస్త్యో భగవానృషిః
అనే శ్లోకంపై విషయాన్నే తెలుపుతున్నది.
ఆదిత్యహృదయం పుణ్యం – సర్వశత్రువినాశనమ్
జయావహం జపేన్నిత్యం – అక్షయ్యం పరమం శుభమ్
సర్వమంగల మాంగల్యం – సర్వపాపప్రణాశనమ్
చింతాశోకప్రశమనం – ఆయుర్వర్ధనముత్తమమ్.

ఆదిత్యహృదం పుణ్యప్రదం, కామక్రోధాది అంతశ్శత్రువులను బహిశ్శత్రు వులను నాశనం చేస్తుంది. ప్రతినిత్యం జపిస్తే విజయం లభిస్తుంది. అక్షయత్వాన్ని కల్పిస్తుంది. శ్రేష్ఠమైన శుభాలనిస్తుంది. పాపము లన్నింటినీ నాశనం చేస్తుంది. చింతలు దుఃఖముల నుండి ఉపశమనం కల్పిస్తుంది. ఆయువును పెంపొంది స్తుంది. ఈ విధంగా ఎన్నో ఫలములు చెప్పబడ్డాయి.

## 565. తన పూర్వజన్మ గూర్చి తెలుసుకోవటానికి హిందూ ధర్మశాస్త్రాలలో ప్రత్యేకమైన గ్రంథాలు గాని, యోగసాధనాలుగాని ఉన్నాయా?

అలాంటి గ్రంథాలుగాని, శాస్త్రాలుగాని లేవు. పూర్వజన్మను గురించి చెప్పినా వాటికి ఆధారాలుండవు. కొందరు పూర్వజన్మ కృతపుణ్య విశేషంతో





పూర్వజన్మ విశేషాలు తెలిసిపుడతారని అంటారు. దానికి విశ్వాసమే మూలం.

## 566. గోవిందరాజస్వామి దేవేరులపేర్లేమిటి?

ఏకంసత్ విప్రాః బహుధావదంతి వేదవాక్యం. గోవిందరాజ స్వామి అన్నా, వేంకటేశ్వరుడన్నా, రంగనాథుడన్నా సుందరబాహుస్వామి అన్నా, రాము డన్నా, కృష్ణుడన్నా ఒకేదైవం. విష్ణువే. ఇక రామాకృష్ణాద్యవతారాలలో వారి దేవేరులు వేరు. వారి దేవేరుల పేరులేవైనా లక్ష్మీస్వరూపాలే. ఒక్కొక్క స్థలంలో స్వామికొకపేరు. ఆయన దేవేరులకు ప్రత్యేకమైన పేర్లుంటాయి. తిరుపతిలోని గోవిందరాజస్వామివారి దేవేరిపేరు పుష్పవల్లీ తాయారు. గోదాఅమ్మవారు కూడా అదే ఆలయంలో ఉన్నది. వారాయన భార్యలని వేరేచెప్పాలా? ఒకేదైవానికి ఇన్ని రూపాలు, ఇన్నిపేర్లెందుకని ప్రశ్నిస్తే అదే హిందూమతం ప్రత్యేకత. దీనినే రుచిభేదం అంటారు. ఏ వ్యక్తిఅయినా, తనకునచ్చిన రూపాన్ని, తనకు నచ్చిన నామాన్ని అర్చించి జపించే అవకాశం ఒక్క హిందూమతంలోనే ఉన్నది.

## 567. శబరి ఎవరు ?

శబరి మతంగ మహర్షి శిష్యురాలు. ఒకబోయ వనిత. వృద్ధురాలు. పంపానదీ తీరాశ్రమంలో నివసించింది.

స చాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్
శ్రమణీం ధర్మ నిపుణామభిగచ్ఛేతి రాఘవ అని శబరిని గూర్చి వాల్మీకి మహర్షి బాలకాండలో వ్రాశాడు. ఆమెధర్మచారిణి, ధర్మనిపుణ. ఆమె కడకు వెళ్ళాడు రాముడు లక్ష్మణ సహితుడై. విశ్వనాథ ఈమెనుతపో హింసిగా అభివర్ణించాడు.

బీభత్సూనాం సయుజం హింసమాహు, రపాం దివ్యానాం సఖ్యేచరం తం అని ఋగ్వేదం చెబుతున్నది. కలతచెంది బీభత్సంగా ఉన్న ద్వి నదీజలానికి నెమ్మదిని కల్గించే పక్షికి ప్రతిరూపం హంస. సీతావియోగంతో కలతచెంది సంక్షుభితమై వేదనా నదిలో కొట్టుకొనిపోతున్న రామునకు, తన పరిచర్యలతో కలతతీర్చిన యోగహంసి ఆమె.

రామాయణం ఆమె జన్మవృత్తాంతాన్ని ఎక్కడా పేర్కొనలేదు. రాముని కాలంలో బోయకాంతలు కూడ తపస్సిద్ధిని పొందారనటానికి ఈమె సాక్షి. రాముడు చిత్రకూటానికి వచ్చిన వేళలోనే మతంగ మహర్షి బ్రహ్మలోకానికి వెళ్లాడు. వెళుతూ వెళుతూ శబరితో 'శబరీ! రాముడు అరణ్యవాసకాలంలో

MOHAN PUBLICATIONS.COM

మన ఆశ్రమానికి వస్తాడు. నీవిక్కడే ఉండి ఆయనకు అతిథి మర్యాదలాచరించి అపుడు బ్రహ్మలోకానికి రావలసిందని శాసించి వెళ్ళాడు. అప్పటి నుండి రాము డాశ్రమానికి వచ్చేవరకామె ప్రతినిత్యమాయన కొరకు నిరీక్షిస్తూనే ఉన్నది. సీతాన్వేషణ కొరకై రామలక్ష్మణులు దండకారణ్యంలో వస్తూ కబంధని సంహరించారు. ఆతడు కూడ శబరిఆశ్రమం దర్శించి వెళ్ళవలసిందని చెప్పాడు. రాముడు లక్ష్మణసహితుడై ఆశ్రమానికి వెళ్ళాడు. ఆమె రాముని పాదాలకు నమస్కరించి ముద్దాడి, తన గురువైన మతంగమహర్షి మాహాత్మ్యన్ని వర్ణించి, ఆయన అనుజ్ఞ గ్రహించి యోగమాయను కల్పించి, యోగాగ్నిలో దగ్ధమై బ్రహ్మలోకానికి పోయింది.

శబరి ప్రతిదినం అడవిలోనికి పోయి మంచి ఫలాలనేరికోసి, వానిని కొరికి రుచిచూచి, తీయని ఫలాలను రామునికొరకై ఉంచేదట. పుల్లనివి పారవేసేది. అలా ఆమె రాముడరణ్యవాసానికి వచ్చినదినం మొదలు తమ ఆశ్రమానికి వచ్చేవరకు, ప్రతిదినం చేసేది. ఆ సాయంకాలానికి వాటిని పార వేసేది. మళ్ళీ ఉదయం క్రొత్తఫలాలు తెచ్చేది. రామలక్ష్మణులు రాగానే వారికా ఎంగిలి ఫలాలిచ్చిందట. రాముడెంతో ఆప్యాయతతో వాటిని భక్షించాడట. 'భక్తి ప్రియోమాధవః' భక్తినే గ్రహిస్తాడు దైవం. ఈ విషయం చెప్పినవారు ఆళ్వారులు. రాముడు శబరి ఎంగిలిపండ్లు తిన్నట్లు రామదాసు గారు దాశరథీ శతకంలోవర్ణించారు. ఎన్నో వైష్ణవగ్రంథాలలో కూడా ఉన్నది.

## 568. పుణ్యనదులు ఇపుడున్నాయా?

పుణ్యనదులు కొన్నిఎండిపోవచ్చు. కొన్ని మార్గాలను మార్చుకోవచ్చు. ఒక్కోనది ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కోపేరుతో ఉండవచ్చు. కృష్ణానది తన మార్గాన్ని మార్చుకొన్నట్లెన్నో ఆధారాలున్నాయి. ఏవైనా భూకంపాదుల వంటి ప్రమాదా లేర్పడినపుడు నదులు మార్గాలను మార్చుకొంటాయి. ఎడారి ప్రాంతాలుగా మారినపుడు నదులింకిపోతాయి. బలరాముడు యమునానదీ గమన మార్గాన్ని మార్చినట్లు పౌరాణిక గాథలున్నాయి. సరస్వతీదేవి, ఇపుడు ప్రయాగ దగ్గర అంతర్వాహినిగా ఉన్నదని చెబుతారు. అందుకే దాన్ని త్రివేణీ సంగమం ప్రదేశ మంటారు. గోదాశబరి, క్రమంగా గోదాబరి, గోదావరి, గోదారిగా మారినట్లు భాషాశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. పూర్వ కాలంలో ఉన్నపుణ్యనదులు నేడు కూడా ఉన్నాయి. దాదాపు మన పురాణాలలో పేర్కొనబడిన నదులన్నీ ఇపుడుకూడ ఉన్నాయి. శుక్తిమతి, స్వర్ణముఖి, చిత్రావతి, పాలేరు వంటివి పెద్దపెద్ద వాగులు. నదులుగా చెప్పుకొంటాం.





వానికొక దేవతా సంబంధ కథ కల్పించి చెప్పి, వానికి ప్రశస్తి కల్పించటానికి, ఆయా ప్రాంతాలలోపుట్టిన రచయితలు, కవులు ప్రయత్నించారనేది సత్యం. వానినే స్థలపురాణాలంటరు.

## 569. వసుదేవునకు భార్యలు, సోదరీమణులు పేర్లు ఏమిటి?

వసుదేవుడు జన్మించినపుడు ఆకాశంలో దేవదుందుభులు మ్రోగాయి. అందువలన ఆయనకు, ఆనకదుందుభిఅనే పేరు వచ్చింది. ఈయనకు దేవ భాగుడు, సృంజయుడు, అనకుడు మొదలైన తొమ్మిదిమంది సోదరులున్నారు. పృథ(కుంతీదేవి) శ్రుతదేవ, రాజాధిదేవి మొదలైన ఐదుమంది సోదరీమణు లున్నారు. దేవకుని కుమార్తెలు దేవకి, శాంతిదేవ, ధృతదేవ మొదలైన పేరులు గలవారు ఏడుగురున్నారు. ఆ ఏడుగురిని వసుదేవుడే పెండ్లి చేసికొనినాడు. వీరుకాక,రోహిణి, కౌసల్య పౌరవిమొదలైన భార్యలున్నారు. రోహిణియను భార్యయందు బలరాముడు,గదుడు, సారణుడు అనే కుమారులు జన్మించినారు. పౌరవియందు సుభద్రుడు పుట్టినాడు. మదిర అనే భార్యయందు నందుడు, ఉపనందుడు, దేవరక్షిత అనే భార్యకు గదుడు, దేవకి వలన కీర్తిమంతుడు, సుషేణుడు, భద్రసేనుడు, ఋజువు,సమదనుడు, భద్రుడు, అష్టమగర్భంలో శ్రీకృష్ణుడు జన్మించాడు. 7వ గర్భంలో ప్రవేశించిన బలరాముని యోగమాయ బయటకు లాగబడి రోహిణీ గర్భంలోప్రవేశపెట్టబడింది. గనుక ఆయనకు సంకర్షణుడను పేరు వచ్చింది.

## 570. పంచకన్యలు ఎవరు ?

అహల్యా ద్రౌపదీ కుంతీ (తారా) తారామండోదరీ తథా
పంచకన్యాః స్మరేన్నిత్యం మహాపాతక నాశనమ్.

అన్నశ్లోకం ప్రసిద్ధం. అహల్య,ద్రౌపది,కుంతి,(లేకతార),తార, మండోదరి అనే పంచకన్యలను నిత్యమూ స్మరించాలి. ఆస్మరణ మహాపాత కాలను నశింపజేస్తుంది అని భావం. శ్లోకంలో కుంతికి బదులు తారపేరు రెండుసార్లు కొందరు పేర్కొంటారు. ఒకతార బృహస్పతిభార్య, కాగా మరొకతార వాలి భార్య అనిగ్రహించాలి. కుంతిని గ్రహిస్తే ఒకతారనే చెప్పాలి. అహల్య గౌతమునిభార్య, ద్రౌపది పంచపాండవుల ధర్మపత్ని, కుంతి పాండురాజు భార్య, మండోదరి రావణుని భార్య.

ఈ పంచకన్యలూ మహాపతివ్రతలు. అద్భుతమైన అంద చందాలు కలవారు. వీరిని బ్రహ్మ విశిష్టమైన దివ్యలక్షణాలతో సృష్టించాడు. సౌందర్యం,

MOHAN PUBLICATIONS.COM

సౌకుమార్యం, సౌశీల్యంవంటి సుగుణాలు వీరందరిలోనూ సమృద్ధిగా ఉన్నాయి. ఒకసారి వివాహితలైనా, సంతతికల్గివున్నా వీరి కన్యాత్వానికి భంగంలేదు. మరణించేవరకూ వీరు నిత్యయువతులుగా వుంటారు. నిత్యకన్యలవలె శోభిల్లుతారు. సృష్టికర్త వీరికి ప్రసాదించిన వరమది. గౌతమ ముని భార్య అహల్య ఇంద్రుణ్ణి ప్రేమించింది. కుంతి కన్యగా ఉంటూనే సూర్యుణ్ణి వరించింది. కర్ణునికి తల్లి అయింది. ద్రౌపది పంచభర్తృక. బృహ స్పతి భార్య చంద్రునికి గూడా గృహిణి అయింది. మరొక తార వాలిసుగ్రీవు లిరువురికీ భిన్న భిన్న కాలాలలో పత్నిగా వ్యవహరించింది. మండోదరి కృత్స్నమదుడు మంత్రించిన పాలుత్రాగి గర్భవతి అయింది. కన్యను ప్రసవించింది. ఈ రీతిగాపరిశీలిస్తే ఈ ఐదుగురూ ఒక్కొక్క పద్ధతిలో చరిత్ర సృష్టించిన నారీమణులే. భారత రామాయణాది విశిష్ట గ్రంథాలు వీరిని విశిష్ట వనితలుగా వర్ణించాయి.

### 571. భూతప్రేత పిశాచాలకు అధిపతి శివుడా ?

శివుడు సృష్టిస్థితిలయకర్తలైన త్రిమూర్తులలో ఒకడు. ఈ విశ్వానికి లయకర్త. క్రూరప్రవృత్తిగల భూతపిశాచాదులు ప్రజలను బాధించే స్వభావం కలిగి వుండేవి. సృష్టికర్త అయిన బ్రహ్మావాటి దుశ్చర్యలకు ప్రతీకారం చేయవలసిందిగా శివుని ప్రార్థించాడు. అందుకంగీకరించి శివుడు జనసంచారంలేని చోటు తనకు కావాలనీ, అక్కడ ఉండి భూతప్రేత పిశాచాలను నిగ్రహించగలననీ చెప్పాడు. ఆపై శివుడు జనసంచారంలేని శ్మశాన వాటికలో నివసించే ఏర్పాటు జరిగింది. అక్కడ ఉండి శివుడు భూతాదులను నిగ్రహిస్తూ ఉన్నాడు. కానవాటికి అధిపతి అయ్యాడు. స్కాందపురాణంలోని బ్రహ్మోత్తరఖండంలో శివకవచస్తోత్ర ప్రభావం చెప్పబడింది. ఆ ప్రభావ వర్ణనలో –

"కూష్మాండభూత బేతాళ మారీగణ బ్రహ్మ రాక్షసగణాన్ సంత్రాసయ, సంత్రాసయ" ఇత్యాదిగా భూతాదులను నిగ్రహించే మంత్రాలు శివుణ్ణి ఉద్దేశించి పై కారణం వల్లనే ఉచ్చరింపబడుతున్నాయి.

### 572. భగవద్గీతలో శ్లోకాలు ఎన్ని ?

శ్రీ శంకరభగవత్పాదులు గీతాభాష్య రచనకు ఉపక్రమిస్తూ "తం ధర్మం భగవతాయథోపదిష్టం వేదవ్యాసః సర్వజ్ఞోభగవాన్ గీతాఖ్యైః సప్తభిః శ్లోకశతైః ఉపనిబబంధ" అని వ్రాశారు. దీని తాత్పర్యమిది "భగవంతుడు ఉపదేశించిన రీతిగా ధర్మమును సర్వజ్ఞుడూ, భగవంతుడూ అయిన





వేదవ్యాసుడు ఏడు వందల శ్లోకాలతో సమకూర్చాడు". ఇలా ఆచార్యులు కంఠోక్తిగా గీతలో 700 శ్లోకాలున్నాయని పేర్కొన్నారు. అనేక గీతాప్రతులలో ఇప్పుడు 700 శ్లోకాలే కనిపిస్తున్నాయి. కాని గీతలోని పదమూడవ అధ్యాయమైన క్షేత్ర క్షేత్రజ్ఞవిభాగ యోగంలో మొదటి శ్లోకంగా ఈ క్రింది శ్లోకం అధికంగా కనిపిస్తున్నది.

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేజ్ఞమేవచ
ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ

దీనితో కలిపితే గీతలో 701 శ్లోకాలవుతాయి. ఈ శ్లోకానికి అనేకులు వ్యాఖ్య వ్రాయలేదు. ఇందులో ఆరు ప్రశ్నలున్నాయి. అర్జునుడడిగిన ఈ ప్రశ్నలకు తరువాత కృష్ణుడు సమాధానం చెప్పాడు. ఈ శ్లోకం ప్రక్షిప్తమని కొందరు భావిస్తారు. శ్రీకృష్ణుని సమాధానాలకు అనుగుణంగా ప్రశ్నలు సమకూర్చి ఎవరో ఈ శ్లోకంవ్రాసివుంటారని వారి అభిప్రాయం. శిష్యుడు ప్రశ్నించకున్నా సద్గురువు ఆత్మ తత్త్వాన్ని వివరించడం సముచితమే. ఈ శ్లోకంలేకున్నా నష్టంలేదు. అధికపాఠమైన ఈ శ్లోకాన్ని గూడ లెక్కిస్తే గీతలో శ్లోకసంఖ్య 701అవుతుంది.

### 573. వాల్మీకి పూర్వనామధేయమేమి ?

వాల్మీకి మొదటిపేరు 'ఋక్షుడు' ప్రచేతసుని కుమారుడు కాబట్టి ప్రాచేతసు డని కూడా వ్యవహరిస్తారు. బ్రహ్మ శాపంచే ఇతడు బోయజాతి వారితో కలసి పోయినప్పుడు 'రత్నాకరుడు' అన్నపేరుతో ప్రసిద్ధికెక్కాడు. ఋషుల ఉపదేశంతో 'రామ' నామోచ్చారణ కావించి వల్మీకం నుండి వెలువడుట వల్ల 'వాల్మీకి' అయ్యాడు.

### 574. గురువుకూ, సద్గురువుకూ తేడా ఏమిటి ?

గురువుపదాన్ని సామాన్య అర్థంలోవాడితే గురువుకూ, సద్గురువుకూ భేదం ఉంది. ఉదాహరణకు ఒకరు ఏ వ్యక్తి వద్దనైనా కొత్త విషయాలు జీవనో పాధికై నేర్చుకొంటే ఆ విద్య చెప్పిన వ్యక్తిని గురువని పిలవచ్చు. పాఠశాల, కళాశాలల్లోని చదువు విషయంలోనూ, మిగతా అన్ని రంగాల్లోనూ గురువు పదాన్ని సామాన్య అర్థంలో తీసుకొంటున్నాం. కానీ, 'సద్గురువు' అంటే సాధకునికి భగవద్దర్శనం చేయించగలిగినవ్యక్తి. అవతార పురుషులు ఈ సద్గురువుల కోవకు వస్తారు. సద్గురువులే ఉత్తమమైన గురువులు. వారు శిష్యుల హృదయతాపాన్ని తొలగిస్తారు. వీరిని బోధ గురువులంటారు.

MOHAN PUBLICATIONS.COM

కుహానా గురువులైతే శిష్యులవిత్తాన్ని (ధనాన్ని) ఆశిస్తారు. వీరు బాధ గురువులు!

### 575. దేని ఎరుకతో సమస్తమును గ్రహించగలమో అది ఏది ?

అదే పరబ్రహ్మ. మట్టిని గురించి తెలుసుకొంటే, మట్టితోచేసిన వస్తువు లన్నీ తెలుస్తాయి. అంటే కుండ,దాక, బాన ఇలా! కాగా, ఈ సృష్టిఅంతా ఆ బ్రహ్మం నుంచి వచ్చింది. కాబట్టి ఆ బ్రహ్మాన్ని తెలుసుకొంటే సృష్టి రహస్యమంతా తెలుస్తుంది.

### 576. సాధువులు, చేతిలో దండం (కర్ర) చివర కాషాయ జెండా ఉంటుంది. ఎందుకు?

స్వామీజీలు సర్వసంగ పరిత్యాగం చేస్తారు. సన్న్యాస స్వీకరా సమ యంలో కాషాయ వస్త్రాలతోపాటు దండంచేతబట్టాలి. అదికాయక, వాచిక, మానసిక నియంత్రణకు చిహ్నం. అంటే మనస్సు, వాక్కు (మాటలు) చేతలు అదుపులో ఉంచుకొని లక్ష్యం చేరాలి. భగవత్సాక్షాత్కారమే లక్ష్యం. దీన్ని ఎప్పుడూ గుర్తుంచుకోవడానికే దండస్వీకరణ.

మనిషి పంచభూతాల సమ్మేళనమే కాబట్టి యతులు ఐదడుగుల పొడవైన కర్రను పట్టుకుని ఉంటారు. ఈ కర్రలలో ఏకదండి, ద్విదండి, త్రిదండి అనిభేదాలున్నా అద్వైత సిద్ధాంతులు ఒకే ఒక కర్రను చేత ధరిస్తారు. రెండు కర్రలను కలిపి ఒకటిగా కట్టిచేత ధరించి బోధనలు చేసేవారు, ద్వైతసిద్ధాంతం గలవారు. మూడుకర్రలను ఒకేకట్టగా భుజాన తగిలించు కునేవారు కూడ ఉన్నారు.

### 577. కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుందంటారు. నిజమేనా?

అనాదిగా కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుందని చెబుతారు. అదిఅవిముక్త క్షేత్రం. విశ్వనాథుడెప్పుడూ కాశీక్షేత్రాన్ని వదలడు. శ్రీరామ కృష్ణులు కూడా అక్కడ అనుభూతి పొందారు. అక్కడ మరణించిన జీవుల్ని అమ్మవారు తన హస్తంతో తీయడం, శివుడు తారకమంత్రోపదేశం చేయడం ప్రత్యక్షంగాచూశారు. 'జ్ఞానాదేవతు కైవల్యం' అనే మాటజ్ఞానులకు వర్తిస్తుంది. అది వేదోక్తి. కాశీలో మరణిస్తే విశ్వనాథుడు తారక మంత్రోపదేశం చేస్తాడనే అచంచల విశ్వాసం ఉంటే, అదే'జ్ఞానంగా' భావించాలి. ఆ జ్ఞానంతో ముక్తి లభిస్తుంది. శ్రీ శారదా దేవి విశ్వాసం కూడా అదే. 'శ్రీరామకృష్ణ కథామృతం' శ్రీశారదాదేవి వచనా మృతం చదివితే తెలుస్తుంది.





### 578. లక్ష్మణ భరత శత్రుఘ్నులకు సంతానం ఉన్నదా ?

లక్ష్మణ భరతశత్రుఘ్నులకు సంతానం వున్నది. వారు ఒక్కొక్కరూ ఇద్దరేసి కుమారులను కన్నారు. అంగదుడ, చంద్రకేతుడు అనువారు లక్ష్మణుని కుమారులు. వీరు కారీపథ దేశానికి ప్రభువులయ్యారు. తక్షుడు, పుష్కలుడు, అనే వారు భరతుని పుత్రులు. వీరు తక్షశిల, పుష్కలావతీనగరా లకు పరిపాలకు లయ్యారు. శత్రుఘాతి, సుబాహుడు, అనువారు శత్రుఘ్నుని సంతానం. ఇందులో మొదటివాడు మధురానగరాన్నీ రెండవవాడు విదిశానగ రాన్ని పాలించారు.

### 579. కాకాసురుడు ఎవరు ?

కాకాసురవృత్తాంతం రామాయణంలోని సుందరకాండలో ఉన్నది. హనుమంతుడు అశోకవనిలో సీతను దర్శించి కృతకృత్యుడయ్యాడు. సీత క్షేమంగా ఉన్నదన్నవార్తను శ్రీరామునికి తెలియజేయడానికి తిరిగివేళ్లేముందు తాను ఆమెనుచూచి వచ్చినందుకు గుర్తుగా ఏదైనా శ్రేష్ఠమైన అభిజ్ఞానం చెప్పుమని సీతాదేవిని అడిగాడు. అప్పుడామె పూర్వం చిత్రకూటంలో జరిగిన కాకాసుర వృత్తాంతం రామునికి చెప్పవలసినదిగా హనుమంతునికి చెబుతుంది. చిత్రకూటంలో నివసించేటప్పుడు మందాకినీ తీరంలో సీత రాముని అంకంలో కూర్చుని వుండగా మాంసంపై ఆసక్తికల ఒకకాకి వచ్చి ఆమెను స్తనమధ్యంలో పొడుస్తుంది. ఆమె మట్టిపెళ్ళ విసిరి దానిని నివారించడానికి ప్రయత్నిస్తుంది. అయినా ఆ కాకి ఆమెను పొడవడం మానలేదు. రాముడది చూచి ఆమెను కాస్త పరిహసిస్తాడు. మళ్లీకాకి రక్తం స్రవించేటట్లు ఆ దేవిని పొడుస్తుంది. అంతట రాముడది చూచి కోపించి ఒక దర్భపోచను తీసుకొని బ్రహ్మాస్త్రంతో దానిని సంయోజనం చేసి కాకిపై ప్రయోగిస్తాడు. అందుకు భయపడి కాకి పలుదిశలకు ఎగిరిపోతుంది. కాని దర్భపోచ దానిని వదలకుండా వెన్నంటు తుంది. ముల్లోకాలూ తిరిగి ఎక్కడా రక్షణ పొందలేక మరలివచ్చి వాయసం తుదకు రాముణ్ణే శరణువేడు తుంది. అప్పుడు రాముడు దానిపై దయదలచి దాని ప్రాణాలు తీయకుండా కుడికన్నును మాత్రం హరిస్తాడు. కాకి రామునికి నమస్కరించి తన ఆవాసా నికి వెళ్ళిపోతుంది. ఇది కాకాసురవృత్తాంతం. పూర్వం జరిగిన ఈ వృత్తాంతాన్ని సీత హనుమంతునికి చెబుతూ "పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః" (4-32-28) అని కాకిని నిర్దేశిస్తుంది. ఇంద్రుని పుత్రుడైన జయంతుడే అలావాయసరూపంలో వచ్చాడని ఇక్కడ కొందరు వివరించారు.

MOHAN PUBLICATIONS.COM

కాకరూపుడైన మరొక పుత్రుడని, జయంతుడి కాదనీ మరికొందరి అభిప్రాయం.

## 580. రావణాసురుడి పుట్టు పూర్వోత్తరాలు ఏమిటి ?

కైకసికీ, విశ్వవోబ్రహ్మకూ పుట్టిన జ్యేష్ఠపుత్రుడు రావణాసురుడు. కైకసి సంతానాపేక్షతో అనుచితసమయంలో భర్తనుచేరిన కారణాన ఆమె సంతానం రాక్షసులు కావలసివచ్చింది. నరసింహమూర్తి హిరణ్యకశిపుణ్ణి సంహరించే సమయంలో "నీవు నన్ను ఇరువది గోళ్ళతో చంపావు. నీ పౌరుషమింతేనా?" అని ఆక్షేపించాడట! అందుకు స్వామి "రాబోవు జన్మలో నీకు ఇరువది చేతులు, పది తలలు ఉండగలవు. నేను సామాన్య మానవుడనై నిన్ను సంహరిస్తాను." అని చెప్పాడట! అందువల్ల రావణుడు పది తలలతో, ఇరవై చేతులతో పుట్టాడని పురాణగాథ.

వైకుంఠంలో విష్ణువు యొక్క ద్వారపాలకులైన జయవిజయులు తమను లోనికిపోనీకుండా అడ్డుకోవడం వల్ల ఆగ్రహించిన సనకసనందనాదులు వారిని రాక్షసులుగా జన్మించండని శపించారు. అంచేత తరువాతి మూడు జన్మలలో జయవిజయులు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, రావణ కుంభకర్ణులుగా, శిశుపాల దంతవక్త్రులుగా జన్మించారు. క్రమంగా నరసింహస్వామి, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు వీరిని సంహరించారు. మరల వారు విష్ణుసాన్నిధ్యం చేరుకున్నారు.

## 581. జరాసంధుని శ్రీకృష్ణుడే ఎందుకు చంపలేదు ?

జరాసంధుడు మహాబలవంతుడు. పలుపర్యాయాలు యాదవులపై దండెత్తి శ్రీకృష్ణుని జయించినవాడు. అయినా ఒకసారి ఇతనితో ఏర్పడిన తీవ్ర యుద్ధంలో ఇతనిసైన్యం క్షీణించింది. బలరాముని చేతికతడు చిక్కాడు. అతణ్ణి చంపడానికి బలరాముడు ఉద్యుక్తుడై నప్పుడు శ్రీకృష్ణుడు –

బధ్యమానం హతరాతిం పాశైర్వారుణమానుషైః
వారయామాస గోవిందః తేన కార్యచికీర్షయా.

అని భాగవతంలో చెప్పినట్లు భవిష్యత్కార్యాన్ని దృష్టిలో పెట్టుకొని చంప కుండా వివరించాడు. భీమునిచే జరాసంధుణ్ణి సంహరింపజేయాలనీ, అలాచేస్తే అతనిచెరలో ఉన్నరాజులు విముక్తులై రానున్న కురుక్షేత్రయుద్ధంలో పాండవుల పక్షాన చేరగలరనీ కృష్ణుడు దూరంగా ఆలోచించి ఈపనిచేశాడు.





కృష్ణుడు, భీముడు,అర్జునుడు, విప్రవేషాలతో పోయి జరాసంధుణ్ణి పోరాటానికి పురికొల్పారు. 'మాలో ఎవరన్నా ఒకరితో యుద్ధంచేయి' అని కోరితే జరాసంధుడు–

నత్వయా భీరుణా యోత్స్యే యుధి విక్లవ చేతసా

అని పిరికి పందవైన నీతో యుద్ధం చేయనని కృష్ణునితో అంటాడు. భీమునితో తలపడి మరణిస్తాడు. త్రికాలజ్ఞుడైన కృష్ణునికి ఇది ఇలా జరుగుతుందని తెలుసు. అందుచే కృష్ణుడు తానుగా అతణ్ణి చంపలేదు.

## 582. జ్ఞానం విజ్ఞానం వీటి భేదం ఏమిటి ?

జ్ఞానం విజ్ఞాన సహిత మిదం వక్ష్యా మ్యశేషతః।
యద్ జ్ఞాత్వా నేహ భూయోన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే ॥

భగవద్గీతలో దీనికి సమాధానం ఉంది. జ్ఞానం అంటే ఒక విషయాన్ని గురించి తెలిసి ఉండడం. (జ్ఞా అవబోధనే) వి+జ్ఞానమంటే ఆ తెలిసిందాన్ని ఆచరణలో పెట్టడం. ఉదాహరణకి మనందరికీ చీకటివచ్చినప్పుడు వత్తీనూనె ఓ ప్రమిదలో వెలిగించడంద్వారా వెలుగుని పొందవచ్చని తెలుసు. ఇది జ్ఞానం. చీకటిపడినప్పుడు దీపం దీపం అంటూ అరిస్తే ఆ చీకటిని ఛేదించ లేం వెలుతురుని తేలేం. మరి ఈ చీకటిని భేదించడంకోసం ఓ ప్రమిదని తెచ్చి నూనెనిపోసి వత్తిని వెలిగించడం అనేది ఏదుందో అది విజ్ఞానం. అందుకే ప్రతి విషయాన్నీ దివ్యదృష్టితో దర్శించిన నాటి మహర్షులంతా జ్ఞానులు, అంటే ఇది ఇలా ఉండాలి. ఉంటుందని తెలిసినవాళ్ళు. ఇక నేడు ఆనాటి మహర్షుల జ్ఞానాన్ని ఆచరణలోపెడుతూ నీళ్లలో నిప్పుంటుందని నిరూపిస్తూ, నిప్పునించి నీరొస్తుం దని రుజువుచేస్తూ కన్పింపచేస్తున్నవాళ్లు విజ్ఞానులు. అందుకే నాటివాళ్లది జ్ఞాన శాస్త్రమైతే నేటిది విజ్ఞాన శాస్త్రం. వచ్చిన ఇబ్బందేమంటే విజ్ఞానం కారణంగా వినయం నేటివాళ్లకి వినయానికి మారుగా అహంకారం పెరిగి, అజ్ఞానమౌతున్నారు. కలి ప్రభావానికి పెద్దలంటారు మరి.

## 583. ఉత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలం అంటే ఏమిటి ?

సంవత్సరానికి పన్నెండుమాసాలు. సూర్యుడు ఒక్కొక్కరాశిలో ప్రవేశించ డాన్ని సంక్రమణం అంటారు. సూర్యసంక్రమణంలేని మాసాన్ని అధికమాసం అంటారు. పన్నెండు రాశులలో కర్కాటక రాశిలోకి సూర్యుడు ప్రవేశిస్తే

MOHAN PUBLICATIONS.COM

భూమి మీద దక్షిణభాగంలోకి సూర్యకిరణాలు తొందరగా ప్రవేశిస్తాయి. సూర్యుడు దక్షిణ భాగంలో ప్రవేశించడాన్ని దక్షిణాయనం అంటారు. సూర్యుడు మకర రాశిలో ప్రవేశించినపుడు దానిని ఉత్తరార్ధంగా గ్రహించి ఉత్తరాయణం అంటారు. సంవత్సరానికి రెండు అయనాలుగా చెప్పి ఒకటి దక్షిణాయనం, మరొకటి ఉత్తరాయణంగా గుర్తించి నిర్ధారించారు మన పూర్వీకులు. సూర్యుడు కర్కాటకలో ప్రవేశించే కాలాన్ని దక్షిణాయన పుణ్యకాలంఅనీ, సూర్యుడు మకరంలోకి ప్రవే శించే కాలాన్ని ఉత్తరాయణ పుణ్యకాలం అనీ అంటారు. పుణ్యకాలం అంటే పితృదేవతలకు తర్పణలు విడిచే అత్యంత పవిత్రమైన కాలం అని అర్థం.

### 584. వసుదేవుని భార్య రోహిణి రేపల్లెలోనే ఎందుకు ఉంది ?

వసుదేవునికి దేవకి, రోహిణి అనే ఇద్దరు భార్యలున్నారనేది యథార్థం. ఆ ఇద్దరికీ సంతానంలేని కారణంగా ఒకరికి ఒకరిని మించిన వ్రతాలనీ, తపస్సులనీ, తమతమ స్థాయికి తగినట్టు చేయప్రారంభించారు. అయితే, దేవకి రోహిణిలా సామాన్యురాలు కాదు. ఆమె మొదటి జన్మలో పృశ్ని. రెండవ జన్మలో అదితి. మూడవ జన్మలో కశ్యపుని ద్వారా వామనుణ్ణి కంది. మూడవ జన్మలో వసుదేవుని ద్వారా కృష్ణుణ్ణి కనడానికి కంస రాజ్యంలో ఉంది. రోహిణికి ఇన్ని జన్మలూ, సంతానమూ అప్పటికి లేవు.

### 585. బ్రహ్మచారి అనగా ఎవరు ?

మనం సాధారణంగా ఉపనయనము (ఒడుగు) అయిన వారిని బ్రహ్మ చారి అంటుంటాం. కానీ, అది సరికాదు. గృహస్థులలో కూడ బ్రహ్మచారులు ఉన్నారు. ఎవరిని బ్రహ్మచారి అంటారో చూద్దాం !

1. గాయత్రుడు : ఉపనయనం అయిన దగ్గనుండి కారం, ఉప్పు లేకుండా భోజనం చేసినవాడు. 2. బ్రాహ్మదు – వేదము పూర్తిగా నేర్చుకునే వరకు బ్రహ్మచర్యం పాటించేవాడు. 3.ప్రాజాపత్యుడు–తన భార్యను ఋతు కాల మందు మాత్రమే సంభోగిస్తూ ఎల్లవేళలా పరస్త్రీ విముఖుడుగా ఉండే వాడు. 4. బృహత్తుడు–చనిపోయే వరకు గురుకులంలోనే ఉంటూ, నైష్ఠికు డుగా ఉండేవాడు.

### 586. జడ భరతుడు భరతునికి ఏమౌతాడు ?

పురాణాలలో ముగ్గురు భరతులు కనిపిస్తారు. ఒకరు శ్రీమద్రామాయ ణంలో కనిపించే కైకమ్మ పుత్రుడు. ఆయనకీ జడ భరతునికీ సంబంధంలేనే లేదు. ఇకరెండోవాడు భారతంలోనివాడు. విశ్వామిత్రుని తపఃకాలంలో





మేనక ఆయనని ఓడించగా పుట్టిన శకుంతలకి పుత్రుడు. ఈయన పేరిట మనదేశం భారతదేశం అయ్యింటుందని అందరి అభిప్రాయం. కానీ అది సరికాదు. ఈయనకి దేశంలోని సకల ప్రాంతాల పరిస్థితులూ సంపూర్ణంగా తెలుసు. ఆ తల్లి కోరిక మీద జడ భరతుని పేరిట ఏర్పాటైన మనదేశం నిజానికి జడభరత దేశం. అదేక్రమంగా భారతదేశం అయింది.

### 587. సుభద్ర ఎవరిని వివాహము చేసుకొన్నది ?

పురాణాలని సరిగా అర్థం చేసుకోకపోతే వచ్చేచిక్కులివే. అర్జునుడు తీర్థయాత్రలకి బయల్దేరినవేళ, సన్యాస రూపంలో కొలువుతీరినవేళ పరిచర్య చేయడానికి వచ్చిన దాసి సుభద్ర. పాండవులు ఐదుగురూ ఒకనియమాన్ని చేసుకున్నారు. దాని ప్రకారం ఒక్కొక్క సంవత్సరకాలం పాటు తీర్థయాత్రలు చేయాలి. ఆ దోషం అర్జునుడికి పట్టింది. ఆ కాలంలో అర్జునుని భార్యగా వచ్చింది సుభద్ర.

### 588. మకరకుండలాలు ఎలా ఉంటాయి ? అవి ఎవరు ధరిస్తారు ?

మకరం అంటే మొసలి అని అర్థం. కుండలం అనేది చెవికి ధరించే ఆభరణం. ఈ మకరాన్ని ఆ కుండలంతో కలిపి మకర కుండలం అనేది ఒక ఆభరణం అన్నారు పెద్దలు. నిజానికి కుండలాలేవీ మొసలి ఆకారంలో ఉండవు. కుండలం చెవికి ధరించే ఆభరణం. సంస్కృతంలో చెవి అనే దానిని శ్రవణం అంటారు. అందుచేత శ్రీహరిని చూస్తూనే ఈయన శ్రవణా నక్షత్రంలో పుట్టాడని ఆ శ్రవణానక్షత్రం మకరరాశికి చెందినదనీ గ్రహించారే తప్ప, చెవికి మొసలి ఆకారపు కుండలాలేవీ కన్పించడం లేదే అనుకోరాదు. పండితోత్తములు మకరకుండలాలు ధరిస్తారు.

### 589. శఠగోపంలోని అంతరార్థం ఏమిటి ?

శరీరంలో పది విధాలైన వాయువులుంటాయి. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, కృకర, ధనంజయ, శఠ, అని వాటి పేర్లు. వీటిలో శఠ అని పేరు కలిగిన వాయువు తల్లి గర్భంలో పిండం ఉన్నప్పుడు పిండానికి హాని కలిగించడం కోసం ఆమె గర్భసంచిచుట్టూ ఉండి ఉంటుంది. ఆ శఠమనే పేరుగల వాయువు నుండి గోపనం=రక్షించడం ఏది చేస్తుందో దానిని శఠగోపం లేదా శఠగోపనం అన్నారు. శఠ అనే పేరు గలిగిన ఈ వాయువుకి అరి=శత్రు వుల పనిచేసేది ఏది ఉందో ఆ కారణంగా దీన్ని శఠారి అని కూడ పిలుస్తారు.

MOHAN PUBLICATIONS.COM

## 590. సూర్యునికి ఉదయాస్తమయాలు లేవా ?

ఈ ప్రశ్నమనకేకాదు మహామహిమాత్ములైన మహర్షులకూ వచ్చింది. ఒకసారి వ్యాసభగవానుడు వారికి పురాణకథలను బోధిస్తున్నాడు. సూర్యుడు ఉదయాద్రిపై ఉదయించి, హస్త్రాద్రిపై అస్తమిస్తాడా? అనిమునులు అడిగారు. దానికి ఆయన చక్కని సమాధానం చెప్పారు. సూర్యునికి నిజంగా ఉదయాస్త మయాలు లేవు. అది నిత్య ప్రకాశబింబం. అందుకే సూర్యుణ్ణి బ్రహ్మపదార్థా నికి ప్రతీకగా భావిస్తారు. తెల్లవారినప్పుడు మనదృష్టికి ఆ బింబం ఏ బిందువు మీద నిలిచి ఉన్నట్లు కనిపిస్తుందో, అస్తమిస్తుందో, ఆ బిందువు చలించదు కనుక అచలం అన్నారు. అందుకే ఉదయాచలం, అస్తాచలం అనే పేర్లు వచ్చాయి అని వివరించారు.

## 591. జ్ఞానేంద్రియాలలో ఏది శుభం ?

జ్ఞానేంద్రియాలు అయిదింటిలో (చూడడం, వినడం, రుచి చూడటం, వాసనచూడటం, స్పర్శద్వారా తెలుసుకోవడం) మోక్షజ్ఞానాన్ని అందించేవి మొదటి రెండు. కన్నుద్వారా చూడగా, చెవి ద్వారా వినగా కలిగేది మాత్రమే తాత్త్వక జ్ఞానం. మిగిలిన మూడింటిలో దేనివల్లా ఇది సాధ్యంకాదు. అవి కేవలం భోగానికే కాబట్టి జ్ఞానేంద్రియాలు అయిదింటిలో తాత్త్విక జ్ఞానాన్ని అందించే కన్ను, చెవి, శుభప్రదమైనవి అయ్యాయి. మిగిలిన మూడు ఎందుకు అశుభప్రదం అంటే అవి మోక్షాన్ని దూరంచేసి బంధాన్ని కలిగించే చర్యల్లో పాల్గొంటున్నాయి కనుక.

## 592. బ్రహ్మకి మూడు తలలా ?

బ్రహ్మకి ఒకప్పుడు ఐదు తలలుండేవి. ఆ ఐదూపైన అనుకున్న తీరుగా పంచభూతాలకీ సంకేతాలే. అయితే ఆకాశమనేది తన ఆధీనంలో ఉండాల్సిందే ననే అభిప్రాయంతో శంకరుడు ఐదవ తలని (ఆకాశాన్ని) తాను తీసుకుంటే దాన్నే నరకడంగా అభివర్ణించింది కథ. కాబట్టి బ్రహ్మ నాలుగు ముఖాలవాడే. చతుర్ముఖుడని గదా ఆయనపేరు.

## 593. దిష్టి అంటే ఏమిటి ?

దృష్టి దోషము అనేది మానసిక శరీరానికి సంబంధించిన ఒక చెడు భావన. కొందరి ఆశీర్వాదానికి బలము ఉన్నట్లేకొందరి దృష్టికి బలము ఉంటుంది. ముఖ్యంగా అనుమానాలు ఉన్నవాళ్ళు ఎదుటివారిని శంకించే వారు, దెయ్యాలు భూతాలను గురించి ఆలోచించేవాళ్ళు ఈ దిష్టిదోషం





బారిన పడతారు. నమ్మనివాళ్ళమీద, వాళ్ళ జంతువులమీద పనిచేయవు. నిత్యపూజ, వేదాధ్యయనము, జపహోమాలు దైవకార్యాలు చేసేవాళ్ళకు ఏ దోషం అంటదు.

## 594. ఇల్లు ఇరకాటం ఆలి మర్కటంలా ఉండాలా ?

ఎవరి ఇల్లయినా ఇరకాటంగానే (సరిపోనిదిగా) ఉండాలిట. అలాగే ఆలి (ఇల్లాలు) మర్కటంలా (కోతిలా) ఉండాలిట ఇదీ ఈ సామెతకి పైన కన్పించే అర్థం. ఒకసామెత సరిగా పలకలేని వాళ్లెవరైనా అదోలా పల్కితే, అలా పలికిన వాళ్లకారణంగా మొత్తం భాషంతా భ్రష్టమైపోతోంది. ఒకసారి భ్రష్టమైనంత మాత్రాన ఏమౌతుందనుకోకూడదు. ఆ ఉచ్చారణ సరిలేని కారణంగా చిత్రవిచిత్రాలు దానికి అర్థంగా కన్పిస్తూ సంప్రదాయాన్ని చెడగొడ తాయి. ఇల్లు 'ఇరకాటం'కాదు. 'ఇరుకవాటం'గా ఉండాలి. అంటే ఇటు ఒక కిటికీ దానికి ఎదురు దిశలో మరొక కిటికీని ఉంచాలి. అప్పుడా ఇల్లు ఇరుకు వాటం (రెండు తలుపులున్నదే ఔతుంది) అవుతుంది. ఇటు నుండి గాలి అటు నుంచి వెళ్తూ అనారోగ్యాన్ని కల్గించదు. ఇక ఆలి (భార్య) మర్కటంలాకాదు. 'మరకతం' లాగా ఉండాలిట. 'మరకత మాణిక్య గోమేధిక పుష్యరాగా...లంటూ నవరత్నాలని చెప్పాల్సి వచ్చినపుడు ముందుగా కన్పించేది మరకతమే. అలా ప్రకాశవంతంగా అన్నిటా మరకతం ఎలా కన్పిస్తోందో అదేతీరుగా అన్నిటా ఇంటి ఇల్లాలు కన్పించడం కన్పించగలగ డం ఓ అదృష్టం. అందుచేత ఈ సామెత ఇల్లు ఇరుకువాటం–ఇల్లాలు మరకతంలా చూడాలనేది భావమన్నమాట.

## 595. పశుపతి అనగా ఎవరు ?

పాశం అంటే తాడు. ఆ పాశంచేత కట్టబడేది ఏదుందో దాన్ని పశువు అంటారు. పశువు అనగానే మనకి ఎద్దులూ, దున్నపోతులూ ఇంకా ఇలా నాలుగుకాళ్ల జంతువులే కళ్ళముందు మెదులుతాయి. నిజమే! వాటిని పాశం (నారతో పేనినతాడు) తో కట్టేసే మాట నిజమే. దాన్ని కట్టినపుడు అది మననించి ఎక్కడికో తిండి దొరికే చోటికి వెళ్ళిపోయే మాట నిజమే! అంత మాత్రాన పశువులంటే నాలుగుకాళ్ల జంతువులు మాత్రమేకాదు. మానవజాతిలోఉన్న మనం కూడ పశువులమే. ఎలాగ?

ఇది నాఇల్లు–ఇదొక పాశం. ఇది నా ధనం ఇదొక పాశం, ఈమె నా భార్య. ఇదొకపాశం, వీడు నా పుత్రుడు. ఇదొకపాశం, ఫలాని వానికి

న్యాయం చెయ్యాలి. ఇదొకపాశం, దీనిపేరు రాగం, ఫలాని వారికి ద్రోహాన్ని తలపెట్టాలి. ఇదొక పాశం, దీనిపేరు ద్వేషం, ఇలాటి పాశాలన్నిటితోనూ కట్టబడి ఉన్నవాళ్లం మనం. పైన అనుకున్నట్లు యజమాని పశువుల్ని ఎలా ఒకస్తంభానికి కట్టివేస్తాడో అలా పశువులమైన మనని ఇందాక అనుకున్న చిత్రవిచిత్ర పాశాలతో కట్టేసే వాడు శంకరుడు. ఎవరు పాశంతో కట్టేస్తే ఆ పశువుకి ఆ కట్టేసినవాడు యజమాని (పతి) అవుతున్నాడో అలా ఈ పాశాలతో మనవి కట్టేసిన శంకరుడు మన పాలిటి పశుపతి.

### 596. "మహా" అన్న పదము ఈశ్వరునికే ఎందుకు ఉన్నది?

మహా+ఈశ్వరుడు=మహేశ్వరుడు

'మహా' అనేపదం ఎక్కడైనా వచ్చిందంటే ఆ మహా శబ్దంలేనివి కొన్ని ఉన్నాయనీ, అలాంటి కొన్నింటి కంటె గొప్పది ఈ మహాపదంతో కన్పింస్తుం దనీ అర్థం చేసుకోవాలి. ప్రతి బహుళ చతుర్దశీ శివరాత్రి అయితే మాఘ బహుళ చతుర్ధశి మహాశివరాత్రి అయినట్లు. ఇంట్లో జరిగే బాలసారె, నామకరణం, పుట్టినరోజు పండుగ, ఉపనయనం వంటివన్నీ ఉత్సవాలే. అయితే కల్యాణం మాత్రం మహోత్సవం. సరే !

సృష్టికి ఈశ్వరుడు బ్రహ్మ. స్థితికి ఈశ్వరుడు విష్ణువు. విద్యలకి ఈశ్వరుడు వినాయకుడు. సంగీతానికి ఈశ్వరి సరస్వతి. ధనాలకి ఈశ్వరుడు కుబేరుడు. అందరూ ఈశ్వరులకూ ఈశ్వరుడు అంటే ఇందరినీ తన వశంలో ఉంచు కున్నవాడు మహా+ఈశ్వరుడూ మహేశ్వరుడు. (ఈశ్వరుడనే మాటకి అధికారి ప్రభువూ అని అర్థం. మహేశ్వరుడనే మాటకి సర్వాధికారీ మహా ప్రభువూ అని అర్థం. 'మహాప్రభో! అనే సంబోధనం ఒకప్పుడు సంప్రదాయంలో ఉంటుండేది.)

### 597. మహామృత్యుంజయ హోమం చేయిస్తే మృత్యువు ఆగిపోతుందా?

మృత్యుంజయుడు అనగా మృత్యువుని జయించినవాడని అర్థం. పుట్టడం ఎప్పుడో ఆ విషయాన్ని తెలుసుకోలేం మనం. అలాగే మరణించేది ఎప్పుడో ఆ విషయాన్ని కూడ తెలుసుకోలేని వాళ్లం మనమే. ఈ రెంటినీ తనవద్ద సరహస్యంగా ఉంచుకునే వాడు భగవంతుడు అలాటి రెంటిలో మృత్యువుని జయించాలంటే ఈయన్ని ఆశ్రయించాలని ఈ మృత్యుంజయ అనేపదం మనకి చెప్తోంది. అలా మృత్యువుకి పోవలసిన వాళ్లంతా ఈయన్ని ఆశ్రయిస్తే ఇక ఎవరికీ చావే రాక ఉండక అసలు ప్రపంచంలో లయమనే



కార్యక్రమమే ఆగిపోతుంది. కాబట్టి మృత్యువుని జయించినవాడనే మాటకి అర్థం ఇదికాదు.

తాత్కాలికంగా మనకి చావుతో సమానంగా వచ్చిపడే ఆపదని అప మృత్యువు అంటారు. ఇలాకాక మరణించే కాలంలో వచ్చిన ఆపదని మృత్యువు అంటారు ఈ రెంటిలోనూ మనకి తెలియకుండా వచ్చిన చావుతో సమానమైన పరిస్థితిని (అపమృత్యువుని) జయించగల (దాటగల) శక్తిని మనకిచ్చేవాడు (మృత్యుంజయు'డని అర్థం. అందుకే చావు సమీపిస్తూన్న దనిపించినపుడు మహామృత్యుంజయ జపం, హోమం, వంటివి చేయించు కుంటుంటాం. చేయించుకున్నా మరణం వచ్చిందంటే ఆ కాలం అపమృత్యు కాలం కాదు మృత్యుకాలమే అని అర్థమన్నమాట !

### 598. 108 శక్తిపీఠాలు వివరాలు ?

1. విశాలాక్షి–కాశీ 2.లింగధారిణి–నైమిశారణ్యము 3. లలిత–ప్రయాగ, 4.కామాక్షి–గంధమాదవం 5. కుముద–మానససరో వరము 6. విశ్వకాయ–అంబర్ 7.గోమతి–గోమంతపర్వము 8. కామ చారిణి–మందరపర్వతము 9.మదోత్కట–చైత్రరథవనము 10. జయంతి– హస్తినా పురము 11. గౌరి–కన్యా కుబ్జము 12. రంభ–మలయపర్వతము 13. కీర్తిమతి–ఏకామరక్షేత్రం 14. విశ్వేశ్వరి–విశ్వము 15. పురుహూత–పుష్కరము 16. మార్గదాయిని–కేదారము 17. నంద–హిమవంతము 18. భద్రకర్ణిక–గోకర్ణము19. భవానీ–స్థానేశ్వరము 20. బిల్వపత్రిక–బిల్వకము 21. మాధవి–శ్రీశైలము 22. భద్ర–భద్రేశ్వరము 23. జయ–వరాహశైలము 24. కమల–తిరువారూర్ 25. రుద్రాణి–రుద్రకోటి 26. కాళి–కాళంజరపర్వతము 27. కపిల–మహాలింగము 28. ముకుటేశ్వరి – మర్కోటము 29. మహాదేవి–సాలగ్రామము 30. జలప్రియ–శివలింగము 31. కుమారి–హరి ద్వారము 32. లలిత–సంతానక్షేత్రము 33. ఉత్పలాక్షి–సహ స్రాక్షము 34. మహోత్పల–కమలాక్షము 35. మంగళ–గంగాతటము 36. విమల–పురుషోత్తమక్షేత్రము 37.అమోఘాక్షి–విపాశాతీరము 38. పాటల– పుండ వర్ధనము 39.నారాయణి–చినుపార్శ్వము 40. భద్రసుందరి– వికూ టము 41. విపులేశ్వరి–విపులము 42. కల్యాణీ – మలయాచలము 43. కోటవి–కోటితీర్థము 44. సుగంధ–మాధవనము 45. త్రిసంధ్య–హృషీ కేశము 46. రతి ప్రియ–గంగాద్వారము 47. సునంద–శివకుండము 48. నందిని–

MOHAN PUBLICATIONS.COM

దివికా తటము49. రుక్షిణి-ద్వారక 50. రాధ-బృందావనము 51. దేవిక-మధుర 52. పరమేశ్వరి-పాతాళ 53. సీత-చిత్రకూటము 54. వింధ్యవాసిని -వింధ్యాచలము 55. ఏకవీర-సహ్యపర్వతము 56. చంద్రిక-హరిశ్చం ద్రము 57. రమణ-రామతీర్థము 58. మృగావతీ- యమునాతటము 59. మహలక్ష్మీ-కొల్హాపురము 60. ఉమాదేవి-వలి నాయకక్షేత్రము 61. ఆరోగ్య-వైద్యనాథము 62. మహేశ్వరి-మహాకాళము 63. అభయ-ఉష్ణ తీర్థము 64. అమృత-వింధ్య కందరము 65. మాండలి-మాండవ్యము 66. స్వాహ-మహిష్మతి 67. ప్రచండ-ఛాగలాండము 68. చండిక-మకరందము 69. వరారోహ-సోమేశ్వరము 70. పుర్రావతి-ప్రభాసము 71. దేవమాత-సరస్వతీ సముద్రసంగమము 72. సింహిక-తృతశౌచము 73. యశస్కరి-కార్తికేయక్షేత్రము 74.లోల-ఉత్పలావర్తనము 75. సుభద్ర-శోణగంగాసంగమము 76.లక్ష్మీదేవి-సిద్ధపురము 77. అంగన-భరతా శ్రమము 78. విశ్వముఖి-జాలాంధరము 79. తార-కిష్కింధ పర్వతము 80. పుష్టి-దేవదారువనము 81. మేధ-కాశ్మీరమండలము 82. భీమాదేవి -హిమాద్రి 83. పుష్టి-విశ్వేశ్వరము 84. శుది-కపాలమోచనము 85. మాత-కాయవరోహణము 86. ధ్వని-శంఖోద్ధారము 87.ధృతి-పిండార కము 88. కాల-చంద్రభాగాతీరము 89. శివకారిణి-అచ్ఛోదము 90. అమృత-వేణీటము 91. ఊర్వశి-బదరీవనము 92. ఓషధి-ఉత్తరకురు భూమి 93. కుశోదక-కుశద్వీపము 94.మన్మథ-హేమకూటము 95. సత్యవాదిని-ముకుటము 96.వందనీయ-అశ్వత్థము 97. నిధి-అలకా పురము 98. గాయత్రి-వేదములు 99.పార్వతి-శివసన్నిధి 100. ఇంద్రాణి -దేవలోకము 101.సరస్వతి-బ్రహ్మముఖము 102. ప్రభ-సూర్యమండ లము 103. వైష్ణవి-మాతృకలు 104. అరుంధతి-పతివ్రతలు 105. తిలోత్తమ-రమణులు 106.బ్రహ్మకళ-చిత్త 107.శక్తి-జీవ శరీరము.108.

## 599. ప్రసాదాలెందుకు ?

వండుకొన్నది స్వామికి నివేదనచేస్తే అదే ప్రసాదం. లేకపోతే వట్టి అన్నం. ఆలయాలలో అన్నమే కాకుండా అనేక వస్తువులను నివేదనచేస్తారు. అవిభక్తులకు రకరకాలైన రోగాలను పోగొట్టుకుంటూ ఉంటారు.

గురువయూర్ దేవాలయంలో (కేరళ) కృష్ణవిగ్రహంఉంది. కొన్నాళ్ళక్కడ ఉండి కృష్ణునికి అభిషేకంచేసిన నూనెను కొద్దిగా లోపలకు తీసుకొంటే కీళ్ళ నొప్పులు పోతాయని నమ్మకం. నారాయణభట్టారికి అట్లాపోయిందని,





ఆ వెనుక నారాయణీయం అనేగ్రంథాన్ని రచించాడని, ఆ గ్రంథాన్ని కేరళలో కొన్నివేలమందినిత్యం పారాయణచేస్తారని విన్నాము. పాతాళ అంజనం అనే రాతితో ఆ విగ్రహం నుంచబడిందట.

కేరళలోనే షెర్‌తల్లి తాలుకాలో తిరువిఝా అనే గ్రామం ఉంది. ప్రేగుల బాధలు తదితర బాధలతో కూడిన జనం ఇక్కడకు వస్తూంటారు. పూజారి గుడిచుట్టూ మొలిచే ఓషధిని తీసికొనివచ్చి ఆవుపాలలో ఆ రసాన్నిపోసి స్వామికి నివేదనచేస్తాడు. భక్తులు ఖాళీకడుపుతో ఉండి ఆ రసాన్నిత్రాగి, గుడిచుట్టూ ప్రదక్షిణం చేస్తారు. మూడవ ప్రదక్షిణం పూర్తయ్యేలోగా కక్కుం టారు. తరువాత వారికి అన్నం పెడతారు.

థకఝీ అనే గ్రామం అంబలపూఝా తాలూకాలో ఉంది. అక్కడ ఒక నూనెను తయారుచేస్తారు. అది కీళ్ళనొప్పులు, క్షయ, రక్తదోషాన్ని పోగొడుతుం దట. సంవత్సరానికి ఒకమాటే తయారుచేస్తారు. అందరూ ఓషధులు తీసుకొని వస్తారు. వాటిని దంచి, ఆ రసాన్ని నూనెలోపోసి మరగకాస్తారు. అదేసమ యంలో పాయసాన్ని వండుతారు. పాయసం పైన తెట్టు కట్టినపుడు ఆ నూనె కూడా కాగిందని నమ్మి, దానిని వడబోసి నూనెను భక్తులకు అందిస్తారు. ఎట్టుమనూర్ దేవాలయం ఒకపెద్ద దీపస్తంభం ఉంది. దానిపై పళ్ళేన్ని ఉంచి కాటుకనుచేసి కంటిరోగాలకు వాడతారు.మూర్ఛతో బాధపడేవారు కూడా ఇక్కడ కొన్నాళ్ళుండి ప్రసాదాలు తింటూ రోగాలను పోగొట్టుకుంటారట.

వైద్యనాథదేవాలయంలో ఒక మండలం రోజులు (40రోజులు) భక్తు లుండి అక్కడున్న నీళ్ళను త్రాగుతూ దేవాలయంలో ఇచ్చే విభూతి ప్రసాదాన్ని ఒంటికి పూసుకొని, కొంతనోట్లో వేసుకొని తమ చర్మరోగాలను పోగొట్టు కుంటూ ఉంటారట. ఇలా తీర్థప్రసాదాలకు అంతటి మహిమ ఉందిమరి.

## 600. పుట్టిన రోజున ఏమి చేయాలి ?

ఉగ్రం, వీరం, మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం
నృసింహం భీషణం భద్రం, మృత్యోర్మృత్యుర్నమామ్యహం ।
మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే
అమృతేశాయ సర్వాయ మహాదేవాయ తే నమః॥

పదకొండువందలసార్లు పై శ్లోకాన్ని ఉచ్చరించి పుట్టినరోజునాడు వీరిని పూజించి, పాలు, నువ్వులు, బెల్లం నివేదించి ప్రసాదం స్వీకరించాలి.

MOHAN PUBLICATIONS.COM

**601. ఆంజనేయునికి తమలపాకులతోనే ఆకు పూజని ఎందుకు చేస్తారు?**

ఆంజనేయుడు వనఫలప్రియుడు అంటే అడవిలో ఉండే చెట్లకి కాసిన ఫలాలని తినడంఇష్టంగా కలిగిన వాడని అర్థం. ఆంజనేయుడు శాఖాచరుడు (చెట్ల కొమ్మల మీదనించి, కొమ్మల మీదికి దూకి నివసించే లక్షణం కలిగినవాడు) కాబట్టి, అడవి తీగెలూ, అడవి ఆకులూ ఆయనకి మరింత ఇష్టం. తమలపాకు అనేది తీగగా పెరిగే జాతికి చెందినమొక్క. ఇది సహ జంగా గృహాలలో ఉండదు. వనాలలోనే ఉంటుంది. కాళిదాస మహాకవి రఘువంశ కావ్యంలో తాంబూలపు చెట్లు గురించి ఓ వర్ణనకూడా చేసాడు. (తాంబూలీనాం దలైస్తత్ర...)

**602. శంతనుడి భార్య పేరు గంగ, శివుని భార్య కూడ గంగే ఒకరు కాదా?**

గంగమూడుచోట్ల ప్రవహిస్తోంది. స్వర్గంలో ఉండే గంగపేరు ఆకాశగంగ. మర్త్య(మానవ)లోకంలో ఉండే గంగ పేరు గంగ. పాతాళ లోకంలోఉన్న గంగ పేరు పాతాళగంగ. శంకరుని తలమీద ఉన్నది ఆకాశ గంగమ్మ. శంతనునిభార్య అయిన ఆమె భూలోకగంగ. కాబట్టి గంగలన్నీ ఒకటికావు. భర్తలందరికీ ఏవిధమైన సంబంధములేదు.

**603. భూమికన్నా బరువైనదేది ?**

భూమికన్నా బరువైనది తల్లి. సృష్టిలోని చరాచర వస్తువు లన్నింటిలోనూ దైవత్వాన్ని చూడడం మనసంప్రదాయం. మనం నిలబడడానికీ, జీవించ డానికీ ఆధారమైన భూమినికూడా మనం దేవతలాగే భావించి ఆరాధిస్తాం. మానవులు, పశుపక్ష్యాదులతో సహా ఈ నేలమీది సమస్త జీవరాసుల ఉనికి, పోషణ అంతా భూమిమీదే ఆధారపడి ఉంది. పుణ్యాకార్యాలు, పాపాలు, ఘోరాలు, నేరాలుఅన్నీ ఈభూమిమీద జరిగిపోతుంటాయి. జీవులవల్ల కలిగే రకరకాల హింసలను భూదేవి మౌనంగా భరిస్తూ సహిస్తూ ఉంటుంది. అందుకే ఓర్పుకి, క్షమాగుణానికీ భూమినీ సంకేతంగా చెబుతారు. సహ నమూ శాంతమూ మూర్తీభవించిన భూమి కన్నా కూడా బరువైనది తల్లి అని ధర్మరాజు సమాధానం చెప్పాడు. ఓర్పులో క్షమాగుణంలో కన్న తల్లి భూదేవితో సమానంగా ఉండడమేకాదు. ఒకటి రెండుసార్లు హెచ్చుగా కూడా ఉంటుంది. మనం నిలవడానికి ఆధారమైనభూమి కూడా ఒక్కొక్కసారి కంపించి జీవుల్ని పొట్టన పెట్టుకుంటుందిగానీ, తల్లిమాత్రం తన కన్న బిడ్డల్ని ఎటువంటి పరిస్థితిలోనూ చంపుకోదు. అందుకే కొడుకు





(కుపుత్రో జాయేత్క్వచిదపి కుమాతా నభవతి) ఆర్యోక్తి. మన సంప్ర దాయంలో తల్లికే ప్రథమస్థానం. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అనేది మన ఆరాధనాక్రమం. తల్లిదండ్రులు అంటాంగానీ, తండ్రి తల్లులు అనం. దేశాలనూ, భూమినీ కూడా మనం స్త్రీరూపాలుగా, మాతృరూపాలుగానే భావిస్తాం. దేవుడికన్నా కూడా తల్లిదండ్రులు గొప్పవారని, పూజనీయులని మహాక్తుడు పుండరీకుడు రుజువుచేసాడు. ఒకసారి పాండురంగ విఠలుడు పుండరీకుని ఇంటికివచ్చినప్పుడు, ఇప్పుడు తల్లిదండ్రులసేవలో ఉన్నాని, తర్వాత వచ్చి మాట్లాడతాననీ ఆయనకుచెప్పి కుటీరం వెలుపల ఒక ఇటుక ఉంచి, దానిమీద నిలబడమని చెప్పి పుండరీకుడు లోపలికి వెళ్ళిపోతాడు. తల్లిదండ్రుల సేవ ముగించుకుని అతడు వచ్చేవరకు విఠలుడు అలాగే నిలబడి నిరీక్షిస్తాడు. భూమికన్నా బరువైనది తల్లేనని ధర్మరాజు మాటవరసకు చెప్పలేదు. అందులో ఇంకాలోతైన అర్థంఉంది. ఇంతవరకూ ఆయన తపస్సు, మనోనిగ్రహం, ప్రాణాయామాది ప్రక్రియలు, యజ్ఞం మొదలైన మోక్షసాధనాలగురించి చెప్పాడు. ప్రకృతిలోనే దైవత్వాన్ని ఎలా దర్శించాలో చెప్పాడు. ఇవేవీ సాధ్యంకానివారు తరించే సులభోపాయం ఇప్పుడు చెబు తున్నాడు. నువ్వు ఏ జపతపాలు, యోగ సాదనలూ, యజ్ఞయాగాదులు చేయకపోయినాసరే, ఒక్కటి హృదయపూర్వకంగా చేస్తేచాలు. అదే తల్లి దండ్రులసేవఅని ఈ జవాబుద్వారా సూచిస్తున్నాడు. లోతుగా తరచిచూడని వారికి మన ఆధ్యాత్మికప్రక్రియ ఎంతో క్లిష్టంగానూ, అందరికీ అందుబాలులో లేనిదిగానూ కనిపిస్తుంది. నిజానికి మన ఆధ్యాత్మిక సంప్రదాయం ఎంత సంక్లిష్టంగా, ఎంత జటిలంగా కనిపిస్తుందో అంతసరళంగా, సులభ సాధ్యంగా ఉంటుంది. అది సమాజంలోని అన్నితరగతుల వారికీ, వారి వారిస్థాయినిబట్టి, సౌలభ్యాన్నిబట్టి, మానసిక పరిణతినిబట్టి వేర్వేరు మోక్ష మార్గాలను సూచించింది. నువ్వు ఏంచేసినా చేయకపోయినా కనీసం సజీవదేవతలైన నీ తల్లిదండ్రులను భక్తి, శ్రద్ధలతో సేవించుకో, తరిస్తా వని చెప్పడం ఈ జవాబులోని అంతర్యం. తల్లిదండ్రులను నిర్లక్ష్యంచేసి ఎటువంటి సాధనచేసినా వ్యర్థమే.

**604. ఆకాశం కన్నా ఎత్తైనదెవరు?**

ఆకాశంకన్నా ఎత్తైనవారు తండ్రి. తల్లి తర్వాత ఇందులో తండ్రి ప్రాధా న్యం చెబుతున్నాడు. లోకంలో ఎత్తైన వాటిలో ఆకాశాన్నిమించినదిలేదు.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

కానీ తండ్రి ఆకాశంకన్నా ఎత్తైనవాడని ధర్మరాజు అంటాడు. జన్మకారకుడే కాదు, తొలి గురువు. పోషకుడు కూడా తండ్రే. ప్రపంచంలోకి తొంగిచూడ డానికి బిడ్డకు ఉపయోగపడే కిటికీలాంటివాడు తండ్రి. లోకజ్ఞానంలో ఓనమాలు తండ్రి దగ్గరే దిద్దుకుంటాడు. జీవనగమనంలో నడక నేర్పించే, తప్పటడుగులు సరిదిద్దే ప్రథమసహచరుడు తండ్రే. పెరిగి పెద్దయిన తర్వాత నీ తండ్రిని మించిన విద్యావంతులు, విజ్ఞానవంతులు, ధనవంతులు, అధికారవంతులు ఎందరో నీకు మిత్రులు కావచ్చు. కానీ వారెవరూ తండ్రికి సాటిరారు. ఎందుకంటే నీకు ఎంతటి గొప్పమిత్రులుఉన్నా, వారు ఎల్లవేళలా నీకు ఉత్తమమైన సలహాలే ఇస్తారన్న నమ్మకంలేదు. కానీ తండ్రి ఇచ్చే సలహాలలో మాత్రం ఎటువంటి కల్తీఉండదు. దాని వెనుక ఎటువంటి స్వార్థమూ ఉండదు. సలహా చేదుగా ఉన్నప్పటికీ ఇవ్వడానికి తండ్రి సందే హించడు. కానీ ఇతర మిత్రులు సందేహించవచ్చు. పితృవాక్యపాలనకన్నా ఉత్తమఆదర్శంలేదని చాటిచెప్పాడు శ్రీరామచంద్రుడు. తండ్రిపట్ల అటువంటి అచంచల భక్తిశ్రద్ధలు కూడా ఆధ్యాత్మిక ప్రగతికి సాయిపడతాయి.

## 605. గాలి కన్నా వేగంగా పయనించేది ఏది ?

గాలికన్నా వేగంగాపయనించేది మనస్సు. అత్యంత వేగంగా పయనించే వాటిలో మొట్టమొదటిది కాంతిఅనీ, రెండవది గాలిఅనీ చెబుతారు. గాలికన్నా కూడా వేగంగా పయనించేది మనస్సు అని ధర్మరాజు జవాబు చెబుతున్నాడు. కాంతివేగమూ, వాయువు వేగమూ కొలతకు అందుతుంది. కానీ, మనోవేగం ఎటువంటి కొలతలకూ అందదు. అరక్షణంలో అన్ని ఖండాలను చుట్టిరాగల శక్తి మన్సుకు ఉంటుంది. ఈ మనస్సు అనే పదార్థం భగవంతుడు మనమెడకు తగిలించిన గుదిబండ. జన్మకూ మోక్షానికీ మధ్య పెద్దఅడ్డుగోడ మనస్సు. బంధాలలో చిక్కుకోడానికీ, బంధాలనుంచి బయట పడడానికీ కూడా మూలం మనస్సే. ఆధ్యాత్మిక సాధనలన్నింటికీ ఏకైక లక్ష్యం మనస్సును జయించడమే. అదే ముక్తి. దీనినే మనోలయం, మనోజయం అంటారు. మనిషి మరణించినా మనసు మరణించదు. రకరకాల కోరికలను, వాసనలను, పుణ్యపాపాలనూ మోసు కుంటూ మరోజన్మకు సిద్ధంచేస్తుంది. ప్రారబ్దాన్ని జన్మనుంచి జన్మకు భద్రంగా రవాణా చేస్తూ ఆటంతా ఆడిస్తూ ఉంటుంది. మాయఅంటే మరేదో కాదు. మనస్సే మాయ. గొప్పగొప్ప ఋషులు, జ్ఞానులుకూడా ఈ మనసనే మాయముందు





చిత్తయిపోయారు. ఇంద్రియాలను తన చెప్పుచేతల్లో ఉంచు కుని మనస్సు మనమీద ఎప్పుడూస్వారీ చేస్తూనేఉంటుంది. మనసు దేనిమీద నైనా గాఢంగా లగ్నమైందంటే, దానికోసం విధిగా మరోజన్మ ఎత్తవలసిందే. లేడిని గాఢంగా ప్రేమించి మరుజన్మలో లేడిగా పుట్టిన జడభరతుని కథే ఇందుకు ఉదాహరణ. ఇలా మనపై ప్రతిక్షణం స్వారీ చేసే మనస్సు వేగాన్ని నియంత్రించ గలిగితే నిజమైన ఆనందాన్ని పొందగలుగుతామని సూచన.

## 606. ఉపవాసం దేనికి ?

ఆయుర్వేదం ప్రకారం ప్రతి మనిషి శరీరంలో వాతం, పిత్తం, కఫం అనే మూడుదోషాలు ఉంటాయి. వీటిలో ఏ ఒక్కటి ఎక్కువైనా అది రోగానికి దారి తీయిస్తుంది. ఈ మూడు దోషాలూ సమతుల్యంగా ఉంటేనే ఆరోగ్యం. శీతాకాలంలో కపం పెరుగుతుంది. దానిని తగ్గించడానికే ఉపవాసం విధిం చారు. ఉపవాసంవల్ల శరీరంలో చేరిన విషపదార్థాలు అంతరించి, శరీరం శక్తిని పుంజు కుంటుంది.

## 607. భగవచ్ఛింతన దేనికి ?

మనస్సు భగవద్ధ్యానంలో నిమగ్నమైనప్పుడు రజస్తమోగుణాలను అధిగ మించి సత్త్వగుణాన్ని పొందుతుంది. అప్పుడు ప్రపంచవస్తువులమీద వ్యామో హం తొలగుతుంది. కోరికలు అణగిపోయి హృదయం సమస్థితినీ శాంతినీ పొందుతుంది. కట్టెలు వేయడం ఆపివేస్తే మంట ఎలానిశ్చలంగా వెలుగు తుందో హృదయం అలాగే నిశ్చలస్థితిని పొందుతుంది.

## 608. రథసప్తమినాడు ఏం చేయాలి ?

రథసప్తమికి ముందురోజున రాత్రి ఉపవాసంచేసి, మరునాడు అరుణో దయంతోనే స్నానంచేస్తే ఏడుజన్మలలోని పాపాలు అంతరిస్తాయి. స్నానానికి ముందు ప్రమిదలో దీపం వెలిగించి దానిని నెత్తిమీద పెట్టుకుని, సూర్యుని ధ్యానించి దీపాన్ని నీళ్లలో వదలి స్నానంచేయాలి. స్నానం చేసేటప్పుడు జిల్లేడు ఆకులు, చిక్కుడు ఆకులు, రేగుపళ్ళు నెత్తిమీదపెట్టుకుని స్నానం చేయాలి. స్నానానంతరం "జననీ త్వంహి లోకానాం సప్తమీ సప్త సప్తికే సప్తమ్యా హ్యాదితే దేవి నమస్తే సూర్యమాతృకే" అన్నశ్లోకం చదివి సూర్యునికి అర్ఘ్యమిచ్చి ధ్యానం చేయాలి.తర్వాత పితృతర్పణంచేసి (తల్లితండ్రులు లేనివారు) చిమ్మిలిని దానం ఇవ్వాలి.

వ్రతానికి మాఘ శుద్ధ షష్ఠినాడు అంటే రథసప్తమి ముందురోజున తెల్ల నువ్వుల పిండితో నలుగుపెట్టుకుని స్నానం చేయాలి. బంధువులతో కలసి నూనెలేని వంటకాలతో భోజనంచేయాలి. రాత్రి ఉపవాసముండాలి. వేదపండితులను సూర్యరూపులుగా భావించి సత్కరించాలి. రాత్రి నేలమీద నిద్రించాలి. గురువుకు ఎర్రని వస్త్రాలు దానంచేయాలి. ఈ వ్రతంవల్ల సూర్యగ్రహ దోషాలు అంతరిస్తాయి. జీర్ణకోశ, నేత్ర,దంత, ఉష్ణ సంబంధమైన రుగ్మతలు, రక్తపోటు వంటివి తగ్గుతాయి.

**609. 108 అంకె ప్రాధాన్యత, 11 కూడా. ఈ సంఖ్యల విశేషాలేమిటి?**

మూడు అంటే బహువచనం. "త్రిత్వే బహుత్వసిద్ధిః" అని. అంటే మూడుసార్లు అంటే చాలా సార్లని. అందుకే ముమ్మాటికి చెబుతున్నానని, త్రికరణశుద్ధి, మనసా,వాచా,కర్మణా అని, మూడుఅంకెను వాడడంలో చాలా సార్లు నొక్కిచెప్పినట్లవుతుంది. అట్లే 108. సంస్కృతంలో సంఖ్యలను కుడి నుంచి ప్రారంభించి పలుకుట ఆచారం. నూట ఎనిమిది అంటే అష్టోత్తర శతమని, 18ని అష్టాదశ అని చెబుతారు. అష్టోత్తరశతమంటే ఎనిమిదితో కూడిన వందయని, అష్టాదశ అంటే ఎనిమిదితో కూడితే పదియని, (100+8,10+8) ఈ సంఖ్యలలోని సున్నాలకు స్థానాన్నిబట్టి విలువేగాని వస్తుతః విలువలేదు. కనుక సున్నాలను లెక్కలోకి తీసుకోకుండావేస్తే 1+8, అవుతుంది. అంటే 9 అవుతుంది. 9 పూర్ణసంఖ్య. తరువాతివన్నీ మరల మరల వాడబడే అంకెలేగదా! ఆ విధంగా అష్టోత్తరశతమన్నా, అష్టాదశ అన్నా తొమ్మిదే అవుతుంది. 9 అంటే పూర్ణమైనదని అర్థం. కనుక నూట ఎనిమిదిసార్లు జపం చేయమంటే పూర్ణంగా చేయమని. ఇక 11 ఏకాదశి రుద్రులకు చిహ్నం.

**610. ధ్యానము చేసేటప్పుడు ఏమి జపము చేయాలి ?**

ధ్యానం చేయడానికి ఏదో ఒక ఆలంబన కావాలి. అది ఓం కావచ్చు. వాసుదేవ కావచ్చును. రామనామం కావచ్చు. తన ఇష్టదైవం యొక్క నామ మేదైనా కావచ్చు. అయితే ఈ నామం ధ్యానం నిలపడానికి వాడుకునే సాధనం మాత్రమే. ప్రారంభంలో వీటిని వాడుకుంటూ చివరకు వాటిని కూడా విడనాడి ఆత్మను పరమాత్మతత్వంతో ఏకాగ్రత పొందించడం జరగాలి. అప్పుడప్పుడు ధ్యానం నిలువనప్పుడు ఆ ఇష్టదైవనామాన్ని బిగ్గరగా ఉచ్చరిస్తూ మనసును కుదుటికి తెచ్చుకోవాలి. యోగమంటే జ్ఞానేంద్రియా





లను, మనస్సును బంధించి జీవునికి, ఈశ్వరునికీ అభేదాన్ని సాధించే సాధనం. నామజపం కూడా యోగ సాధనకు సాధనమే. ఆ జపం, ముందు బిగ్గరగా, తరువాత నెమ్మదిగా పెదవులు కదుపుతూ, తరువాత మనసులో సాగుతూ చివరకు మనప్రయత్నమే లేకుండా దానంతట అదే సాగే స్థాయికి జేరాలి. దానికే ఆ జపాజప స్థితి అనిపేరు.

**611. శ్రీ చక్రం విశిష్టత ఏమిటి ?**

శ్రీచక్రాలంటే అమ్మవారికి సంబంధించినదే. అమ్మవారి దేవాలయాల లోనే వాటిని అర్చించడం జరుగుతుంది. వివిధ దేవతలకు భిన్న భిన్నములైన యంత్రాలుంటాయి. వాటిని ఆయాదేవతలకు సంబంధించిన దేవాలయా లలో ప్రతిష్ఠిస్తారు. శ్రీచక్రానికి, వాటికి సంబంధంలేదు. శ్రీచక్రాన్ని అమ్మ వారికి ప్రతీకగా అర్చించడం జరుగుతుంది. దానికి నవావరణపూజ ఇత్యా దులు శ్రీవిద్యోపాసకులు చేస్తారు. ఆదిశంకరులు కూడా దేవీ ఆలయాలలోనే శ్రీచక్రాలను ప్రతిష్ఠించి దానినర్చించే వ్యవస్థ చేశారు. మరి వేంకటేశ్వర స్వామి ఆలయంలో శ్రీచక్రముంది కదా అని మీరడగవచ్చు. అందుకు కారణం వేంకటేశ్వరస్వామి బాలాజీ, బాలా త్రిపురసుందరి అని, ఒకప్పుడు వామాచారపద్ధతిలో అక్కడ అమ్మవారు పూజింప బడేదనీ, ఆ పద్ధతిని మార్చి వైదికపద్ధతిలో అక్కడ పూజలేర్పాటు చేసి శ్రీచక్రాన్ని కూడా ఆదిశంక రులు ప్రతిష్ఠించారని పెద్దలంటున్నారు.

**612. పరమేశ్వరుని కంఠాభరణమైన నాగసర్పం, విష్ణువు శయనించే ఆదిశేషుడు ఒకేజాతిసర్పాలా ?**

అన్నీ ఒకజాతికి చెందినవే. మనుష్యజాతి వాసుకి మొదలైన అయినా ఉచ్చనీచాలున్నట్లే వాటిలోను వాసుకి మొదలైన ఉచ్చజాతి సర్పాలు కూడా ఉంటాయి. సర్పానికి కాలమన్న పేరుంది కదా ! కాలమంటే మనమనుకునే టైమే. ఆ కాలాన్ని పక్కగా చేసుకుని వాడుకుంటాడు విష్ణుపరమాత్మ. కంఠంలో ఆభరణంగా ధరిస్తాడు పరమశివుడు. అంటే కాలం వాళ్ళ స్వాధీనంలో ఉంటుంది. మనం కాలంయొక్క అధీనంలో ఉంటాం.

**613. మంగళ, శుక్రవారాలు, క్షౌరం, గోళ్లు కత్తిరించుకోవడం వంటివి చేస్తే దరిద్రమంటారు. ఇవన్నీ ఎంతవరకు నిజం ?**

ధర్మం కన్న ఆచారం బలీయమన్నమాటకు అర్థం మూఢాచారమని కాదు. ధర్మం కళ్లకు కనబడదు. అమూర్తం, ఆచారం కనబడుతుంది.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

ఆచారాలు కూడా దేశాచారం, ప్రాంతీయ, పారివారిక ఆచారాలు ఇత్యాదులుంటాయి. ఆచారం విషయంలో "మహాజనో ఏనగతఃసపస్థా" అంటే నిస్వార్థపరులైన మహాజనులు ఏమార్గంలో నడిస్తే అదే మనమందరం నడువవలసిన మార్గమన్నారు. ఆచారంయొక్క అసలు స్వరూపాన్ని, ఆంతర్యాన్ని సామాన్య వ్యక్తులు అర్థం చేసుకోలేరు కనుక విజ్ఞులయినవారు ఆచరించినట్లు ఆచరిస్తూ పోతారు. అంతమాత్రంతో అది మూఢాచారమనుకోనక్కరలేదు.

ఇక క్షౌరాదుల విషయంలో చేసుకోదగినరోజు, కూడని రోజులను నిర్ధి ష్టంగా ధర్మశాస్త్రాలు పేర్కొన్నాయి. ఆయా దినాలలో ఆయా గ్రహగతుల ప్రభా వాలు, వాతావరణంలోని పరిస్థితుల ప్రభావాలు మనమీద ఉంటాయి. కనుక ప్రతి పనికి కొన్ని నిర్ధిష్ట దినాల నేర్పాటు చేయడం జరిగింది. వాటిని మూఢనమ్మకాలనుకోక్కరలేదు. ఇక మడి,తడి ఇత్యాదుల విషయంలో కూడా శుచి,శుభ్రతల ప్రభావం కేవలము శరీరం మీదేగాక మనసు మీద కూడా ఉంటుందిగదా! ఏదైనా అతిపనికిరాదు గాని అసలు పనికి రాదనలేం.

## 614. కంటికి కనిపించని శత్రువులు ?

మనకు శత్రువులు బయట ఎక్కడో ఉన్నారనుకుంటాం. కానీ నిజానికి నీలోనే ఒకరుకాదు, ఆరుగురు శత్రువులు ఉన్నారని పెద్దలు చెబుతారు. అవి కంటికి కనిపించని శత్రువులు. మనకు తెలియకుండా అవి మన మనసులోనే నక్కి ఉండి, మన జీవితాలను చిన్నాభిన్నం చేస్తాయి. అవి కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం. హిరణ్యకశిపుడు మదంవల్ల నాశన మయ్యాడు. రావణుడు కామంవల్ల పతనమయ్యాడు. హిరణ్యాక్షుడు లోభంవల్ల మట్టికరిచాడు. భస్మాసురుడు మోహంవల్ల దగ్ధమయ్యాడు. దుర్యోధనుడు మాత్సర్యం వల్ల నేల కూలాడు. ఈ ఆరుదుర్గుణాలు ఒకదానితో ఒకటి సంబంధ మున్నవి. ఒకటి ఉంటే మిగిలినవి కూడా ప్రవేశిస్తాయి. వీటిని తప్పించుకున్న వాడే తపస్వి, యశస్వి.

## 615. పంచవిధ గురువులు ?

1. గూఢుడు : అనగా తాను ఆత్మజ్ఞాన సంపన్నుడైనా, అది ప్రకటితం కాకుండా, ఏకాంతాన్ని కోరుకుంటూ తననుకోరి వచ్చిన వారికి మాత్రమే తత్త్వాన్ని బోధించేవాడు. 2. ధృఢుడు : అంటే పరిపూర్ణ జ్ఞానియై అంతటితో తృప్తి పొందక, సంచారంచేస్తూ, పదిమందికీ తత్త్వబోధచేసేవాడు. 3.





ప్రీతుడుఅంటే, సర్వం త్యజించి, జగత్తుతో సంబంధం లేకుండా ఈ జత్తంతా ఒక నాటకరంగమనే స్పృహకలిగి, దృష్టి మాత్రంతో శిష్యులను తరింపచేయగలిగినవాడు. 4. మౌని – నిశ్చల చిత్తంతో అద్వైతామృత పానంచేస్తూ, ధ్యానబలిమితో ఆశ్రితులను తరింపచేసేవాడు. 5. సకృత్‌కామగతుడు– మహా సంకల్పశక్తి కలిగినవాడై, తనను ఆశ్రయించినవారిని అఖండ జ్ఞాన సంపన్ను లను చేసేవాడు.

## 616. ఉపావాసానికి, మోక్షానికి గల సంబంధమేమిటి ?

మనస్సును తిండిమీదగాక, భగవంతుని సన్నిధిలో నిలపడానికి ఉపవాసమనిపేరు. ఉదయ,సాయంకాలాలలో దైవానికి నిత్యమూ పూజచేసి, తరువాత భోజనంచేయవచ్చు. ఏకాదశినాడు, మీరు నియమంగా పెట్టుకున్న మరొక రోజున ఉపవాసం విధిగా చేయాలి. దైవపూజ, వ్రతాదులు భోజనానికి ముందే చేసి తరువాత భోజనంచేయవచ్చు. భోజనంచేసిన తరువాత పూజ చేసేవారుంటారా? ఉపవాసానికి, మోక్షానికి సంబంధమేమి టని అడుగుతున్నారు. సమస్తకర్మలను వదిలి ఆత్మను పరమాత్మలో లీనం చేయగలిగితేనే మోక్షం. ఇంద్రియాలను, మనస్సును,బుద్ధిని,భోజన పదార్థాల మీద, వాటి రుచుల మీదా లగ్నంచేస్తే అవి భగవంతునిపైకి మళ్లవుగదా! కందమూలాలను, చెట్ల ఆకులను తింటూ చివరకు అవి కూడా వదిలి, పంచాగ్ని మధ్యంలో కూర్చుని ఋషి, మహర్షులు తపస్సులు చేసి మోక్షాన్ని పొందారు.

## 617. పెళ్లిలో అరుంధతీ నక్షత్రాన్ని చూపిస్తారెందుకు ?

వశిష్ఠుడు గొప్ప తపస్సంపన్నుడు. ధర్మవేత్త. ఆయన పత్ని అరుంధతి మహాపతివ్రత. వారిది అన్నివిధాలా ఆదర్శ దాంపత్యం. వారిని ఆదర్శంగా పెట్టుకొమ్మని ప్రబోధించడానికే నక్షత్రరూపంలో అరుంధతిని నూతన దంపతలులకు చూపించడం సంప్రదాయం.

## 618. మూలమంత్రమంటే ఏమిటి?

మనధర్మంలోగల ప్రతిదేవీ దేవతలకు ఆయా ప్రత్యేక లక్షణాలు, శక్తి మొదలైనవి ఉంటాయి. వాటిని వ్యక్తపరిచే మంత్రం ఆ దేవతలకు సంబంధించిన మూల మంత్రం. దానిని జపించడం వలన ఆయా దేవతల అనుగ్రహం, శక్తులు మనకు లభిస్తాయి.

MOHAN PUBLICATIONS.COM

**619. బీజాక్షరాలంటే ఏమిటి ?**

ప్రతి అక్షరమూ బీజాక్షరమే. ఉదాహరణకు 'అ'అంటే విష్ణువు. 'మ' అన్నది శివమంత్రానికి బీజం, రా మాధవమంత్రానికి బీజంం. ఆ మంత్రా లలో ఆ అక్షరాలు లేకుంటే వ్యతిరేకమైన అర్థాలు వస్తాయి.

**620. దీపారాధనకు నిన్నటి వత్తి ఇవాళ వెలిగించవచ్చా ? అక్షతలు, ఎప్పటికప్పుడు కలుపుకోవాలా?**

నిన్నవెలిగించిన వత్తినే మళ్లీ వెలిగించరాదు. కొత్తవత్తి వెలిగించాలి. అక్షతలు ఒక్కసారిగా కలిపి పెట్టుకుని రోజూ వాడుకోవచ్చు. అక్షతలంటే విరిగిపోని బియ్యపు గింజలు.

**621. బాహ్మణాలంటే ఏమిటి ?**

వేదమంత్రాలు నాలుగు రకాలుగా ఉంటాయి. అవి సంహితలు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులన్నవి. వీటిలో బ్రాహ్మణములు, యజ్ఞయాగాదులను నిర్వహించుటకు వాడే మంత్రాలు.

**622. కొత్తబట్టలకు పసుపు ఎందుకు రాయాలి ?**

పసుపు మంగళప్రదం. ప్రతి రంగునకు కొన్ని గుణాలుంటాయి. తెలుపు సత్త్వగుణానికి, ఎరుపు రజోగుణానికి, ఆకుపచ్చ సస్యసమృద్ధికి చిహ్నాలు. అదేవిధంగా పసుపు రంగు శుభానికి సూచకమైనరంగు.

**623. పెద్దలు చనిపోయినప్పుడు దేవాలయంలో ఒకరాత్రి, భార్య పుట్టింట్లో ఒకరాత్రి గడపనిదే ఇతరుల ఇళ్లకు వెళ్లరాదంటారు ఎందుకు?**

తల్లిదండ్రులు చనిపోయినప్పుడు దుఃఖం కలుగుట సహజం. దుఃఖ శాంతికై దేవాలయంలో భగవంతుని ధ్యానిస్తూ, ఒకరాత్రి గడపాలి. అత్తమామలు తల్లిదండ్రులతో సమానం.కావున వారితో ఒకరోజు గడిపి చిత్తశాంతిని కలిగించు కోవడానికి పెట్టినది ఈ ఆచారం.

**624. కార్తీకమాసంలో ఆచరించాల్సిన విధులు ?**

**1. స్నానవిధి :–** కార్తీకమాసంలో ప్రతిరోజూ కృత్తికానక్షత్రం అస్తమించే లోగా, అంటే,తెల్లవారుఝామున స్నానం చేయవలెను. నదీస్నానం ఉత్తమం. లేనటువంటి స్థితిలో కాలువలు, చెరువులు, బావులలోనైనా చేయవచ్చు. తులా మాసంలో గోవు పాదమంత జలప్రదేశంలో కూడా శ్రీమహావిష్ణువు వుంటాడని ప్రతీతి.





"తులారాశింగతే సూర్యేగంగా త్రైలోక్యపావనీ
సర్వత్రా ద్రవరూపేణ సా సంపూర్ణా భవేత్తదా"

అనే శ్లోకాన్ని పఠించి స్నానం చేయవలెను. అనంతరం సూర్యభగవాను డికి అర్ఘ్యం ఇవ్వడంతోపాటూ ఇష్టం దేవతలను పూజించవలెను.

**2. దీపవిధి :–** కార్తీకంలో దీపాలు వెలిగించడం, దీపదానం చేయడం వంటివి చేయవలెను. కార్తీకమాసంలో సాయంకాలం శివాలయంలోగానీ, వైష్ణ వాలయంలోగానీ, దీపాలు వెలిగించవలెను. ముఖ్యంగా కార్తీక పున్నమినాడు తప్పక వెలిగించవలెను. ఉసిరిక కాయపైన వత్తులనుంచి దీపం వెలిగించ వచ్చు. నదులలో దీపాలను వదలడంతోపాటూ, పండితుడికి దీపదానం ఇవ్వ వలెను.

**3. ఉపవాసవిధి :–** కార్తీకమాసంలో శివుడికి ప్రియమైన సోమవారం నాడు, ఉపవాస వ్రతాన్ని ఆచరించడం మంచిది.

**4. వనభోజనం :–** కార్తీకమాసంలో వనభోజనాలు చేయాలని శాస్త్రవచ నం. పలుజాతుల వృక్షాలున్న వనంలో ఉసిరిక చెట్టును పూజించ వలెను. ఉసిరిక చెట్టు క్రింద కూర్చుని పనస ఆకులో భోజనం చేయడం ఉత్తమం.

**కార్తీకమాసంలో చేయకూడని పనులు :** కార్తీకమాసంలో వేడినీటి స్నానం, పగటినిద్ర, కంచు పళ్ళెంలో భోజనం, మాంసభక్షణం, ఇతరుల ఎంగిలి తినడం, వెల్లుల్లి, నీరుల్లి తినడం, ఇంట్లో స్నానం చేయడం వంటివి చేయరాదని శాస్త్రాలు చెబుతున్నాయి.

**625. లక్ష్మీదేవి వుండే చోటు ?**

లక్ష్మీదేవి అంటే కేవలం ధనం అనేకాదు. ఆమె యొక్క అనంత దివ్య విభూతుల్లో ధనంఒకటి మాత్రమే. న్యాయార్జితమైన సంపదే లక్ష్మీస్వరూపాల్లో ఒకటి, ఉత్సాహం, కాంతి, సౌందర్యం, శుచి, శుభ్రత, ఇటువంటి ఉత్తమ లక్షణాలు, గుణాలు, లక్ష్మీదేవి స్వరూపాలు. లక్ష్మీదేవి ఎక్కడవుంటుందో, ఆ తల్లే ఇంద్రుడితో ఇలా చెప్పింది.

గురుభక్తికలవారూ, దేవపూజా, పితృపూజ చేసేవారూ, నిజం చెప్పే వారూ, దానగుణం కలవారూ, పరధనాన్ని పరభార్యల్నీ కోరనివారూ, పగలు నిద్రపోని వారూ, శుచిమంతులూ, అతిథిసేవా పరులూ, వీరు నేను మెచ్చే జనులు. వీరి వెంట నేను వుంటాను. వృద్ధుల్నీ, దుర్బలుల్నీ, పేదల్నీ, స్త్రీలనీ దయచూపే వారి యందూ వుంటాను.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

గర్వాంధులు, అధర్మపరులు, కామక్రోధాల్లో మునిగితేలుతున్నవారూ, పరులకేమీ ఇవ్వనివారూ, పరుషంగా మాట్లాడేవారూ, క్రూర చరిత్రులూ, అసూయాపరులూ, వీరిపై నా అనుగ్రహదృష్టి పడదు. వారిని నేను మెచ్చను. బుద్ధీ, ధృతీ, నీతీ, శ్రద్ధా, ఓర్పూ, శాంతీ, సమ్మతీ ఈ ఏడుగురు దేవతలూ నాకుసన్నిహితులు. దృఢమైనశీలం,సత్యం,కారుణ్యం ఉన్నవారింట నేనుంటాను. నేనులేనిచోట అంతా నీరసమే. నేనున్నచోటే సరసత్వం. నేనున్నవాడే కలవాడు, శాంతి, నిర్మలత్వం, బాహ్యాభ్యం తర శుద్ధి ఉన్నచోటే నా నివాసం.

### 626. ఆత్మకు, పరమాత్మకు తేడా లేదా ?

ఆత్మ అంటే పరమాత్మయొక్క అంశమే. దానికి చావు, పుట్టుకలులేవు. శస్త్రాలు దానిని ఛేదించలేవు. నీరు తడుపలేదు,నిప్పుకాల్చలేదు. గాలి ఎగరగొట్ట లేదు. పరమాత్మకున్న లక్షణాలు కూడా యివే గదా ! పరమాత్మ పెద్ద రేడియో ఐతే, ఆత్మ ట్రాన్సిస్టర్ రేడియో.

### 627. 'త్రిపుండ్రధారణ' అనగానేమి?

విభూతిని నీటితో తడిపినుదుటిమీద మూడురేఖలు ఒకదానికొకటి తగుల కుండా, విడివిడిగా ఉండేటట్లుగా అడ్డంగా పెట్టుకోవడానికి త్రిపుండ్ర ధారణ మంటారు. తిరుమణితో వైష్ణవులు మూడుగీతలు నుదుటిమీద నిలువుగా పెట్టుకుంటే దానిని ఊర్ధ్వపుండ్రమంటారు. అట్లే మధ్వాచార్య సంప్రదాయినికి చెందిన ద్వైతులు, గోపీచందనాన్ని ధరించి దాని మధ్యలో అంగారాన్ని ధరిస్తారు. ఇక, విభూతిని ధరించేటప్పుడు కుడిచేతో విభూతి తీసుకుని ఎడమచేతిలో పోసుకుని దానిని తడిపి, "ఓం అగ్నిరితిభస్మ, ఓం వాయురితి భస్మ, ఓం ఖిమితి భస్మ, ఓం జలమితి భస్మ, ఓం స్థలమితి భస్మ. ఓం వ్యోమేతి భస్మ. ఓం సర్వగ్ంహవా ఇదం భస్మ. ఓం మనపితాని చక్షుంసి భస్మానీతి" అన్న మంత్రంతో ఏడుమార్లు అభిమంత్రించాలి. తరువాత "ఓం త్ర్యాయుషం జమదగ్నేరితి శిరసి (తలమీద) ఓం కశ్యపస్య త్రాయుషం ఇతిలలాటే (నొసలు) ఓం యద్దేవానాం త్రాయుషం ఇతి వక్షస్థలే (రొమ్ము) ఓంతన్మే అస్తు త్ర్యాయుషం ఇతి స్కంథేషు (భుజములమీద) అని ఆయాచోట్ల మూడు రేఖలుగా ధరించాలి. అట్లే వైష్ణవులు చేసే ఊర్ధ్వపుండ్ర ధారణ సమయంలో కేశాదినామాలను స్మరిస్తూ ధరించాలి. లేదా స్మృతే సకల కళ్యాణ, భాజనం యత్ర జాయతే పురుషత మజం నిత్యం వ్రజామి శరణం హరిమ్"అంటూ హరిని స్మరిస్తూ ధరించాలి.





### 628. ఏ లింగాన్ని పూజిస్తే ఏ ఫలితం ?

ఒక్కొక్క లింగాన్ని పూజించి అభిషేకించడం వల్ల,ఒక్కొక్క ఫలితం ఉంటుందని లింగపురాణం ఇలా పేర్కొంది. రత్నమయమైన లింగం సంపదలను ఇస్తుంది. రాతితో చేసిన లింగం సర్వసిద్ధులను ఇస్తుంది. ధాతువుల నుంచి, అంటే పాదరసం వంటి వాటితోతయారైన లింగం ధనమిస్తుంది. కొయ్యతో తయారుచేసిన లింగం సర్వభోగాలను కలిగిస్తుంది. మట్టితో చేసిన లింగం, అంటే పార్థివలింగం అణిమాది సిద్ధులను ఇస్తుంది. శివలింగాలన్నింటిలో రాతిలింగం అభిషేకానికి పూజకు ఉత్తమమైనదనీ, ధాతులింగం మధ్యమ మైనదనీ, లింగపురాణం చెబుతోంది.

1.గంధలింగము : రెండు భాగాలు కస్తూరి, నాలుగు భాగాలు చందనము మూడు భాగాలుగా కలిపి గంధ లింగమును తయారుచేయుదురు. దీనికి పూజచేసిన శివసాయుజ్యం కలుగుతుంది. 2.పుష్పలింగము : దీనిని అన్ని రకాల పూలతో నిర్మిస్తారు. ఈ విధంగడా నానావిధాలైన సువాసనలు గల పూలతో నిర్మించిన పుష్పలింగాన్ని పూజించినచో రాజ్యాధిపత్యము కలుగును. 3.గోమయ లింగము : స్వచ్ఛమైన కపిల గోమయమును తెచ్చి లింగమును చేసి పూజచేసినచో దానివల్ల ఐశ్వర్యము చేకూరును. దీనికి నేలపైన మట్టిలోనపడిన పేడపనికారాదు. 4.రజోమయలింగము : పుప్పొడితో తయారుచేసిన లింగమును పూజించినచో విద్యాధరత్వము సిద్ధించును. ఆపైన శివసాయుజ్యము పొందవచ్చును. 5. యవగోధుమ, శాలిజలింగము: దీనిని యవ, గోధుమలు, తండులపిష్టముచేత తయారుచేస్తారు. దీనికి పూజచేసినచో సకల సంపదలు కలుగును. పుత్రసంతానం కలుగును. 6. తిలపిష్టలింగము: దీనిని నువ్వులపిండితో తయారుచేస్తారు. దీనిని పూజించినచో ఇష్టసిద్ధి కలుగును. 7.లవణలింగము : దీనినిహరిదళము, త్రికటుకాలు మెత్తగా పొడిచేసి ఉప్పుతో కలిపి లింగముగా చేస్తారు. దీనిని పూజించిన వశీకరణ ఏర్పడును. 8. తపోత్థలింగము : దీనిని పూజించిన శత్రువులు నశింతురు. 9. భస్మమయ లింగము : దీనిని పూజించిన సమస్త ఫలితాలు చేకూరును. 10. గుదోత్థలింగము : దీనికి పూజచేసిన ప్రీతిని కలిగించును. 11.శర్కరామయలింగము : దీనికి పూజచేసిన అన్నిసుఖాలు కలుగజేయును. 12. దూర్వాకాండ లింగము : దీనిని గరిక కాడలతో చేస్తారు. దీనిని పూజించిన అపమృత్యువు నశించును.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

### 629. సీతాదేవి నగలమూట ఎలా జారవిడిచింది ?

సీతాదేవి ముత్తైదువు. ముత్తైదువంటే ఐదు ముత్యాలను ఎప్పుడూ ధరించి యుండు స్త్రీ అని అర్థం. వనవాసానికి వెళ్లేటప్పుడు, కైక ఆమె కట్టుకున్న పట్టుచీరలు విప్పించి, నారబట్టలు కట్టించింది. అందంకోసం ధరించిన ఆభరణాలను తీయించిందిగానీ, ముత్తయిదువుకుండ వలసిన కాలిమట్టెలు, కడియాలు, చేతుల కుండే గాజులు, చెవులకు, ముక్కుకుండే దుద్దులు, ముక్కుపుడకలు, మెడలోని మంగళసూత్రం, నల్లపూసలు తీయించలేదు. సీతమ్మ వాటిలోంచి కొన్నింటిని తీసి మూటకట్టిపడవేసింది.

### 630. తిథిద్వయమంటే ఏమిటి ?

తిథిద్వయమంటే రెండు తిథులు ఒకేరోజున రావడం. కాలగణనంలో ఒక్కొక్కసారి ఆ విధంగా వస్తాయి. అదేవిధంగా ఒకతిథిపూర్తై మరియొక తిథి ప్రారంభమవడానికి మధ్యలో కొంత వ్యవధి ఏర్పడితే, దానికి శూన్యతిథి అని పేరు. అట్లాగే శూన్యమాసం. తిథులు, మాసాలు గ్రహగతిని బట్టి లెక్కగట్టడం జరుగుతుంది. జనవరి, ఫిబ్రవరి మొదలైన ఇంగ్లీషు నెలలో కూడా ఒక నెలకు 31 రోజులు, ఒకనెలకు 30 రోజులు రావడంలేదా?

### 631. మనిషి చనిపోగానే వాని ఆత్మ వేరే శరీరంలో ప్రవేశిస్తుందా ?

నజాయతే, మియతేవా కదాచిత్ ఆత్మకు చావు పుట్టుకలు లేవు. అది సర్వవ్యాపకమైనతత్వం. శరీరంలో ప్రవేశించేది, వదిలివేసేది జీవుడు. జీవు డంటే సంస్కారముల యొక్క సాముదాయిక స్వరూపం. ఉదాహరణకు విద్యుత్తు బల్బులోని ఫిలిమెంటుతో కలిపినప్పుడు కాంతివస్తుంది. ఆ కాంతి వంటిది జీవుడంటే ఆ బల్బు శరీరము, విద్యుత్తు ఆత్మ. విద్యుత్తు బల్బుల కలయికవలన కాంతి పుట్టినట్లే ఆత్మ. శరీరాల సంయోగం వలన జీవుడేర్ప తాడు. బల్బు మాడిపోతే విద్యుత్తుపోదు. కాంతి మాత్రమే పోతుంది.

శరీరాన్ని వదిలిన జీవుడు తన సంస్కారాలకు అనుగుణంమైన మరొక శరీరంలో ప్రవేశించడానికి ఆకాశంలో తిరుగుతూ ఉంటాడు. తనకనుకూల మైన శరీరం లభించగానే అందులో ప్రవేశించి మరలా పుడతాడు.

ఇందుకు ఉదాహరణగా రేడియో తరంగాలను చెప్పుకోవచ్చు. దేశంలోని వివిధ రేడియో స్టేషన్‌ల నుండి రేడియో తరంగాలు పంపబడ తాయి. అవి అన్ని ఆకాశంలో తిరుగుతూ ఉంటాయి. మన ఇంటిలోని రేడియోలోగల ముల్లును ఒకమీటర్ మీదికి త్రిప్పగానే దానికి సంబంధించిన





రేడియో కేంద్రం నుంచి పంపబడిన రేడియో తరంగం అందులో ప్రవేశించి మనకు శబ్దరూపంగా వినబడుతుంది. టీవిలో దృశ్యంగా కనబడుతుంది. మనం పెట్టేమాసికాలు, తద్దినాలు కూడా ఇదే ప్రక్రియకు సంబంధించినవి. వ్యక్తి చనిపోయిన తరువాత ఒక సంవత్సరం వరకు మాసికాలు పెడతాము. చనిపోయిన వ్యక్తి పెద్దకుమారుడు ఆ మాసికం పెట్టాలి. చనిపోయిన వ్యక్తి యొక్క సంస్కార స్వభావాలు పెద్ద కుమారునికే ఎక్కువ తెలిసి ఉంటాయి. ఇందులోచేసే పిండప్రదానానికి అర్థం శరీరరదానమని, పిండమంటే శరీరమే.ఈ ప్రక్రియ అంతా చనిపోయిన వ్యక్తి తన గర్భవాసంలోనికి ప్రవేశించమని కోరడమే. ఎటొచ్చీ ఈ విధంగా ప్రవేశించడానికి ఎంతకాలం పడుతుంది? అన్న ప్రశ్నకుసమాధానంగా గడ్డిపురుగు ఉదాహరణ చెప్పబడింది. గడ్డి పురుగు తనముందు కాళ్లను ఒక గడ్డిపరక మీద పెట్టిన తరువాతనే వెనుక కాళ్లు తన దగ్గరకు తీసుకుంటుంది. ఆవిధంగా తీసుకోవడానికి ఒక్క క్షణం పట్టవచ్చు లేదా ఒక సంవత్సరం పట్టవచ్చు. కాలమన్నది సాపేక్షం కావడం వలన క్షణమన్నా, సంవత్సరమన్నా ఒక్కటే. పైగా ఆ గడ్డి పురుగుకు ముందు కాళ్లు పెట్టుకోవడానికి కావలసిన గడ్డిపరక కనిపించాలికదా !

### 632. కంచి గరుడసేవ అంటే ఏమిటి ?

కంచిలో గరుత్మంతుని విగ్రహమొకటి ఆరుబైట చేతులు జోడించి ఉండేది. పరమాత్మ సేవకు నిరంతరం సిద్ధంగా ఉండేది. దానిని బట్టి కంచి గరుడసేవ అన్న నానుడి ఏర్పడింది.

### 633. మంత్రపుష్పం అంటే ఏమిటి ?

దేవునికి చేసే పూజలో పదహారు ఉపచారములుంటాయి. చిట్టచివర మంత్రపుష్పముంటుంది. వేదంలోని ప్రధాన పంచ సూక్తాలలో నారాయణ సూక్త మన్నది ఒకటి.ఆ మంత్రాలను చదువుతూ మంత్రపుష్పమును సమర్పించడం జరుగుతుంది.

### 634. గర్భిణీస్త్రీకి ఏడవనెల ప్రవేశించిన తరువాత ఇంట్లోగాని, దేవాలయంలోగాని అర్చన,పూజలు,వ్రతాలు ఆమె, ఆమెభర్తచేయకూడదంటారు నిజమేనా?

నిజానికి ఐదవనెలనుంచే పనికిరాదు. గర్భస్థశిశువుకు సంపూర్ణ స్వరూపం ఏర్పడే సమయమది కావున గర్భిణి విశ్రాంతి తీసుకోవాలి. భర్త కూడా చేయరాదనడంలోని ఆంతర్యం, పురుషుడు ఏధర్మకార్యం చేయవలెనన్నా ధర్మపత్నీ సహితుడై చేయాలి.

**635. ప్రసవమైన తరువాత ఆ ఇంటిపేరు గలవారు, పూజ, వ్రతాలలోను, శుభకార్యాలలోను పాల్గొన కూడదంటారు నిజమా ?**

మనకు రెండు విధాలైన అశౌచములు, మైలలు ఉన్నాయి. ఒకటి మృతా శౌచము, అనగా దగ్గర బంధువులు చనిపోతే పాటించ వలసినమైల. రెండవది జాతశౌచము, అంటే పురిటిమైల. ఈ రెండు అశౌచములలో మీరు తెలిపినపూజలు, వ్రతాదులు పనికిరాదు. ఇందుకు ప్రమాణాగ్రంథాలు మన యాజ్ఞవల్క్య పరాశరాది స్మృతులు.

**636. భర్త ఒక్కడే పూజచేస్తున్నప్పుడు ధర్మపత్నీ సమేత అని చెప్పి ధర్మపత్ని పేరు, గోత్రం కూడా చెప్పాలా ?**

వివాహం తరువాత భార్యభర్తలది ఒకే గోత్రమవుతుంది. పూజాదులలో "ధర్మపత్నీసమేతస్య"అనిచెబితేచాలు. ఆమెపేరు కూడా చెప్పేఅవసరం లేదు.

**637. భోగినాడు పేరంటాళ్లకు బొట్టుపెట్టి, తాంబూలంతో వేయించిన నువ్వులు, వేయించిన వేరు శనగపప్పులు, నువ్వులు, బెల్లము కలపి ఇవ్వడం మంచిదా ?**

పేరంటాళ్లకు మీరు తెలిపినవన్నీ నువ్వులతో సహా వేయించి బెల్లం కలిపి ఇవ్వడమే ఆచారము. వాయనంవేరు. దానం వేరు. దానమిచ్చే టప్పుడు పచ్చినువ్వులే దానం చేయాలి. దానికే తిలదానమనిపేరు. ఇక్కడ పేరంటాళ్ళ కిచ్చేది వాయనం. ఈ వాయనంలో మరొకరహస్యముంది. నువ్వులనూనె వస్తుంది. నూనెకు స్నేహమనిపేరు. ఆనువ్వులను, వేరుశనగ పప్పులను వేయించి, వాటిలో బెల్లం కలిపి నూరి ఉండలు చేసి పేరంటాళ్లకు ఇవ్వడం జరుగుతుంది. ఆఉండలు తియ్యగా వుంటాయి. అంటే మధురమైన స్నేహాన్ని అందరికీ పంచడమని అర్థం.

**638. కాశీయాత్రానంతరము ప్రతిసారీ కాలభైరవ సూర్యారాధన, కాశీ సమారాధన జరుపవలెనా ?**

యాత్రగా వెళ్లివచ్చిన తరువాత మాత్రమే జరుపుకుంటే చాలు. పూర్వ కాలంలో కాశీవంటి పుణ్యక్షేత్రాలను జీవితంలో ఒక్కసారి మాత్రమే దర్శిం చుట జరిగేది. కారణం ఆరోజుల్లో ప్రయాణసౌకర్యాలు అంతగా ఉండేవి కావు. ఇప్పుడు ప్రయాణసాధనాలు పెరిగాయి. కావున, ఎన్నిసార్లయినా, ఏదో ఒక లౌకిక ప్రయోజనము కోసము ప్రయాణాలు చేయడం జరుగు తోంది. అటువంటి ప్రయాణాలు యాత్రక్రిందికిరావు. ఇదే పద్ధతిలో గయలో ప్రతిసారీ ఫలము, కూరలు వదలాల్సినవసరంలేదు.





**639. రుద్రాక్షలెందుకు ధరిస్తారు ?**

రుద్రాక్షమాలలు, తులసీమాలలు, పిండికట్లు, ఇవన్నీ భక్తుడని చాటుకోవడానికి వేసే వేషాలని కొంతమంది వేళాకోళంచేస్తారు. ఆ వేసు కున్నవాణ్ణి చూస్తే మనం కూడ ధరించాలనే భావంపుడుతుంది. అవన్నీ అడుగడుగునా పరమేశ్వరుణ్ణి గుర్తుచేస్తున్నాయి. రుద్రాక్షలు అమల త్వాన్ని, ఉష్ణత్వాన్ని కలిగిస్తుందని క్రిములను పోగొడుతుందని, విషానికి విరుగుడని పోషకమని (రుచ్యత్వ) నీచభావాలు దగ్గరకు రావని ఆయుర్వేదం అంటోంది. దేవుడు, దెయ్యమని నమ్మేవాళ్ళకు నాలుగుమాటలు. విభూతిని రుద్రాక్షను ధరించకుండా చేసే శివపూజ నిష్ఫలమని లింగపురాణం. త్రిపురాసురులను సంహరించే సందర్భంలో ఈశ్వరుని కంటి నుండి కారిన దయా బిందువులే రుద్రాక్షలుగామారాయని పురాణాలంటున్నాయి. రుద్రాక్ష ఎంత పెద్దదైతే అంత మంచిదని, నర్మదలో దొరికేసాలగ్రామం ఎంత చిన్నదైతే అంత మంచిదని మేరుతంత్రం అంటోంది. సమస్త పాపాలు పోతాయని యోగ సారం అంటోంది.

**640. దేవుడికి ప్రతి ఏటా పెళ్ళేమిటి ?**

ప్రతి ఏటా ఏతిథినాడు వివాహమైనదో, ఆనాడు వివాహోత్సవం జరుపుకోవాలని గృహ్యసూత్రాలలో ఉంది. కాని ఈనియమం దేవతలపట్ల లేదు. ఉదా.రాముడు పుట్టినరోజునే పెళ్ళిచేస్తారు. విష్ణువుయొక్క అవతార మైన రాముడు అవతరించినపుడే అమ్మవారు కూడాఅవతరిస్తుంది. వారిద్దరు సూర్యుడు, సూర్యకాంతి; పువ్వు దాని పరిమళం, రత్నం దాని కాంతివంటి విడదీయరాని సంబంధంకలవారు. రామాయణంలో "అనన్యా రాఘవేణా హం భాస్కరేణ యథాప్రభ" అనే శ్లోకం పైమాటనే స్థిరపరుస్తుంది. రాముడు పుట్టిన వెంటనే సీత పుట్టినట్లు లేదు. ఆయనకు, ఆమెకు 7 సంవత్సరాల అంతరం ఉందికదా అనిశంక. లోకంలో పురుషుని వయస్సు ఎక్కువ, స్త్రీ వయస్సు తక్కువగా ఉన్నపుడే వారిద్దరికి పెళ్ళని ఉండడంచేత సీతరామునితో అవతరించినా చిన్నదిగా ఉన్నట్లే ఉంటుంది. ఇది ఋషులవంటి వారికే తెలుస్తుంది. ప్రకృతి, పురుషుడు కలసి ఉంటారనే సత్యాన్ని తెలియపర్చడం కోసం పుట్టిననాడే పెళ్ళి చేయాలనే ఆచారం పుట్టింది. వారి జయంతులనాడే వివాహ ఉత్సవాలు జరిపించాలని కామికాగమంలో ఉందని పెద్దలు చెప్పగా వింటున్నాం. రాతిబొమ్మలకు పెళ్ళేమిటి? ఆయనకు పెళ్ళిచేసినా, చేయక పోయినా ఏమనదు. అది మనకోసం. ప్రతిబింబంలో బొట్టు కనపడాలంటే

MOHAN PUBLICATIONS.COM

బింబానికి (లేదా ముఖానికి) బొట్టు పెట్టాలికదా! ఆయన బింబం. మనం ప్రతిబింబాలం. నీలోనిజీవుణ్ణి సంతోషపెట్టాలనుకుంటే నరహరిని పూజింపుమని శంకరాచార్యులవారన్నారు.

"త్వత్ప్రభుజీవ ప్రియమిచ్ఛసి చేన్నరహరి పూజాం కురు సతతం
ప్రతిబింబాలంకృతి ధృతికుశలో బింబాలంకృతి మాతనుతే"॥

**641. ఆత్మతో అన్నివేళలా భగవన్నామస్మరణ చేసుకోవచ్చుగా?**

ఆత్మకుమడి, తడులంటూలేవు. శాస్త్రాలు ఛేదించలేని, నిప్పు కాల్చలేని, నీరుతడుపలేని, గాలి ఇరగగొట్టలేనిది ఆత్మ. శుచి,శుభ్రతలు శరీరానికేకావాలి. భగవంతుని కీర్తించడం, భౌతికమైన శరీరానికే కావాలి. భగవంతుని కీర్తించడం భౌతికమైన పెదవులతో చేసేపని. అందులోనికి మళ్లించుకుని మనస్సుతో స్మరించాలి. ఆస్మరణ నిరంతరం దానంతట అది, మన ప్రయత్నంలేకుండా మనస్సులో కొనసాగాలి. దానికే అజపాజపస్థితి అని పేరు. ఈవిధంగా ఒకమెట్టునుంచి మరొకమెట్టుకి సాధన సాగుతుండాలి.

**642. మధురమీనాక్షిదేవి చేతిలో చిలుక ఉంటుంది. ఎందుకు ?**

దేవీదేవల చేతులలోనున్న వాటికన్నింటికీ, వాటి నామధేయాలకు, వారి లీలలకు వెనుక అంతర్నిగూఢమైన అర్థాలున్నాయి. పైనతెలిపినట్లుగా ఆ వర్ణనలన్నీ అలంకరాఇకాలు. మీనాక్షి చేతిలోనిచిలుక జీవునికి, జీవుని ప్రాణానికి లేక మనస్సుకు ప్రతీక. అలాగే ఆమెకు మీనాక్షి చేపలవంటి కళ్ళు కలదనిపేరు. ఆ పేరు వెనుక ఒక రహస్యముంది. చేపలు గ్రుడ్లుపెట్టి, వాటిని పొదుగుతాయి. వాటి నుండి పిల్లలువస్తాయి. వెంటనే ఆకలితో అలమటిస్తాయి. చేప సస్తన ప్రాణికాదు. వాటికి పాలివ్వలేదు. వాటి ఆకలి తీర్చడానికి తల్లిచేప వాటి కళ్ళు విప్పి చూస్తుంది. ఆ చూపుతో వాటికడుపు నిండుతుంది. అదేవిధంగా విష్ణువు చేతిలోని చక్రం మన మనస్సే, మనస్సు చక్రం వంటిది. ప్రపంచమంతా తిరిగివస్తుంది. దానిని పరమాత్మ పరంచేస్తే విష్ణు చక్రమవుతుంది. ఆయనచేతిలోని గద మన బుద్ధి. గదకు ప్రతిదానిని చితగ్గొట్టే గుణమున్నట్లే. మన బుద్ధికి ప్రతివిషయాన్ని తర్కంతో విశ్లేషించే గుణంఉంటుంది. దానిని భగవత్పరంచేస్తే భగవదర్పితబుద్ధిగా మారుతుంది.

**643. పితృకర్మలలోపెసరపప్పు, దైవకర్మలలోకందిపప్పువండాలని నియమముందా ?**

అదొక ఆచారం. పితృకర్మలలో పెసరపప్పు, మినపప్పు, వాడతారు. ఆ రెండు పితృదేవతలకు ప్రీతిపాత్రములని భావించడం ఒక ఆచారంగా





వస్తోంది. వంకాయ,సొరకాయ,గోంగూర,మునగ,టమోటా,క్యాబేజీ వంటివి వాడ కూడదు. మనపెద్దలు చెప్పిన ప్రతిదానికి ఓ అంతరార్థం ఉంటుంది.

**644. వైతరణీ నది ఎక్కడ ఉన్నది?**

చనిపోయిన జీవుడు యమపురానికి వెళ్లేమార్గంలో వైతరణీనది వస్తుంది. ఈనది నూరుఆమడల దూరం ప్రవహిస్తుంది. దీని ఒడ్డున ఎముకలగుట్టలు, దానిలోపల చీము, నెత్తుటి ప్రవాహాలు, మాంసం బురదగాను, వెంట్రుకలు నాచుగాను ఉంటాయి. దీనిలో ఎంతో ప్రమాదకరమైన జలపక్షులు విహరిస్తుంటాయి. దానిలోనున్న మొసళ్ళు పాపాత్ములైన జీవులను చూడగానే, వారిపైకి ఉరుకుతాయి. దానిలోని పురుగులకు సూదుల వంటి ముక్కులుంటాయి. బొంత కాకులు, గద్దలు, నీటికోతులు, జలగలు, చేపలు, తాబేళ్ళతో నిండిన భయంకర మైన నది వైతరణి.

**645. కాకికి, గోవుకు పితృకార్యాల్లో ప్రాముఖ్యత ఉన్నదా ?**

గోవు ముక్కోటి దేవతల సాముదాయిక రూపం. పైగా ఆవు సూర్యుని కుమార్తె. అతి పవిత్రమైనది. కాకి పితృదేవతలకు ప్రతినిధి. అందుకే పితృకార్యాలలో వాయసపిండాన్ని సమర్పిస్తాం. బంధువులరాకను ముందుగా తెలిపేది కాకే గదా !

**646. భగీరథ ప్రయత్నం అని అంటారు ఏమిటి ?**

పూర్వం భూలోకంలో అయోధ్యను సగరుడు పరిపాలిస్తున్న సమయం. సగరునికి ఇద్దరు భార్యలు, కేశిని, సుమతి. కేశినివల్ల 'అసమంజనుడు' అనే కొడుకు, సుమతివల్ల అరవైవేలమంది కొడుకులు కలిగారు. పేరుకు తగినట్లు అసమంజనుడు దుర్మార్గుడు. అతణ్ని సగరుడు రాజ్యం నుంచి వెళ్లగొట్టాడు. మిగిలిన అరవైవేలమంది కొడుకులు కూడా అతనికేమీ తీసిపోరు. ఒకసారి సగరుడు ఏడుఅశ్వమేధయాగాలు చేయతలపెట్టి గుఱ్ఱాన్ని విడిచి దానివెంట తన అరవైవేలమంది పుత్రులను పంపించాడు. గుర్రం వెళ్ళి వెళ్ళి సముద్రంలోకి ప్రవేశించింది. అప్పుడు ఇంద్రుడు చెప్పగా వాయువు ఆ గుర్రాన్ని తీసుకెళ్ళి రసాతంలో కపిల మహాముని ఆశ్రమందగ్గర కట్టేశాడు. ఎంత వెదికినా గుర్రం కనబడక సగరపుత్రులు రాజ్యానికి తిరిగి వెళ్ళి తండ్రితో చెప్పారు. గుర్రాన్ని తీసుకొస్తే తప్ప, ఇంటికి రావడానికి వీల్లేదని సగరుడు కోపించాడు. సగరపుత్రులు తిరిగివెళ్ళి సముద్రాన్ని తవ్వి రసాతలంలోకి వెళ్ళి కపిల మహర్షి ఆశ్రమంలో కట్టివున్న గుర్రాన్ని చూశారు.

MOHAN PUBLICATIONS.COM

కపిలుడే అశ్వన్ని దొంగిలించాడనుకుని ఆయనను దూషించారు. ఆ మునికోపంతో కనులు తెరవగా ఆకోపాగ్నికి వారు భస్మమైపోయారు. ఇక్కడ అయోధ్యలో సగరుడు తన పెద్దకొడుకు అసమంజసుని కుమారుడైన అంశు మంతునికి రాజ్యమప్పగించాడు. అంశుమంతుని కుమారుడే భగీరథుడు. అతడు తన పెదతండ్రులు కపిలుని కోపాగ్నికి బూడిదయ్యారని తెలిసి బాధపడ్డాడు. వారు భస్మమైనచోట దివ్య గంగాజలాన్ని ప్రవహింపజేస్తే తప్ప, వారికి పుణ్యగతులు కలగవని తెలిసి భగీరథుడు గంగను గురించి తపస్సు చేశాడు. గంగ ప్రత్యక్షమై, నీ కోరిక తీరుస్తాను కానీ, నేను కిందికి ప్రవహిస్తున్నప్పుడు నా దూకుడును భరించగలశక్తి శివునికే ఉంది. కనుక భరిస్తాడేమో అడగమని సూచించింది. అప్పుడు భగీరథుడు శివుని గురించి తపస్సు చేశాడు. శివుడు గంగను భరించడానికి ఒప్పుకున్నాడు.

ఆవిధంగా గంగ భూమికి దిగివచ్చింది. అంతటితో ఆటంకాలు తొలగ లేదు. భగీరథుని వెంట వస్తున్న గంగ, దారిలో జహ్నువు అనే ముని తపస్సు చేసు కుంటున్న ఆశ్రమ ప్రాంతాన్ని ముంచేసింది. ఆ మునికి కోపంవచ్చి గంగను తాగేశాడు. అప్పుడు భగీరథుడు ఆ మునిని ప్రార్థించగా, అతడు కరుణించి తన చెవులనుండి గంగనువిడిచి పెట్టాడు. భగీరథుని ప్రయత్నంవల్ల భూమికి దిగింది. చివరకు సగరపుత్రుల భస్మం మీదుగా గంగ ప్రవహించగా వారికి ఉత్తమగతులు కలిగాయి. మొత్తానికి భగీరథ ప్రయత్నం ఇలాఫలించింది. అసాధ్యమనుకున్న పనులను సుసాధ్యం చేసేం దుకై చేయు ప్రయత్నాలను భగీరథ ప్రయత్నాలనలంటారు.

## 647. కృష్ణుని నామాల్లో బ్రహ్మచారిణే నమః అని పిలుస్తారు, ఎందుకు?

బ్రహ్మచారి అనేపదానికి అవివాహితుడనేది అర్థంకాదు. బ్రహ్మణి చరతి, ఈ ప్రపంచం అంతా బ్రహ్మపదార్థమే కనిపించేది ఏదీసత్యంకాదు. అంతా నశించేదే అనేఅభిప్రాయంతో ఉండేవాడనిఅర్థం. కృష్ణుడు బ్రహ్మచారి అన డానికి కారణం, ఆయన భగవద్గీత నిండుగా బోధించిన సత్యం ఇదే కాబట్టి.

## 648. వినాయకుణ్ణి తులసి దళాలతో పూజించకూడదని అంటారు. నిజమేనా ?

శుక్లాంబరధరం విష్ణుమ్.. అనే శ్లోకాన్ని మనం వినున్నాం. వినయా కుడు సాక్షాత్తు విష్ణు స్వరూపుడని దీనిఅర్థం. కాబట్టే లక్ష్మీగణపతి పేరిట





ఆమెని తన యెడమ తొడపై కూర్చోబెట్టుకున్న ఓ విగ్రహం లోకానికొచ్చింది. ఇంతేకాక విష్ణువు నార (నీళ్లలో) అయనః (నిద్రించిఏవాడు లేదా ఉండేవాడు) కాబట్టే నారాయణుడయ్యాడు. ఆ కారణంగానే అంటే వినాయకుడు విష్ణు స్వరూపుడు కాబట్టే గణపతి ఉత్సవాల చివరి రోజున ఆయనని నీళ్లలోనే నిమజ్జనం చేస్తున్నాం. ఇలా ఎన్నోఆధారాలు, వినాయకుడికీ, విష్ణువుకీ భేదం లేదనీ ఇరువురూ ఒకరేననీ నిరూపించేం దుకు కన్పిస్తున్నాయి. విష్ణువు తులసీదళదాముడు అంటే తులసి పత్రాలతో చేసిన మాలికలని మెడలో ధరించి ఉండేవాడని అర్థం. విష్ణువూ, వినాయ కుడూ ఒకరైనప్పుడు విష్ణువు కిష్టమైన తులసిమాల లేదా తులసీదళపూజ, వినాయకుడికి ఎందుకు సరిపడదో ఆ విషయానికి ఆధారంలేనేలేదు, కాబట్టి తులసిపూజ తప్పుకాదు.

## 649. రాముడూ, కృష్ణుడూ ఇద్దరూ దేవుళ్లే కదా ?

రాముడు, కృష్ణుడు అనే ఇద్దరూ కూడా శ్రీహరి రూపులే. రాముడు తన శ్రీమద్రామాయణంలో సంపూర్ణంగా మానవునిగానే కార్యనిర్వహణాన్ని చేసాడు. ఎక్కడకూడా తానుదేవుణ్ణని చెప్పుకోలేదు. దైవలీలల్ని ప్రదర్శించనూ లేదు. అయితే కృష్ణుడు మాత్రం, పుట్టుకలోనే నాలుగు భుజాలవాడుగా కన్పించి, యముననిదాటి, నోటిలో విశ్వరూపాన్ని చూపి, ఇలా అన్నీ అమా నుష కృత్యాలుచేసి దైవంగానే నటించాడు భారతంలో భాగవతం లోనూ కూడ. అందుకే ఈయన కృష్ణభగవానుడుగానూ, ఆయన మానవుడు కాబట్టి దశరథపుత్రుడై దాశరథిగానూ అయ్యారు.

## 650. సముద్రస్నానం ఎందుకు చేయాలి ?

శరీరం మీద ఉండే స్వేద గ్రంథులు రోమాలవల్ల మూసుకుని ఉంటాయి. ప్రతినిత్యం మనం శరీరాన్ని రుద్దుకుని ఆ స్వేదగ్రంథులు పూర్తిగా తెరుచుకో బడవు. ఆకారణంగా ప్రాచీనులు వైద్యపరమైన ఒకనిర్ణయాన్నిచేస్తూ ప్రతి వ్యక్తీ ఏడాదిలో నాలుగుమార్లు సముద్రంలో స్నానంచేయాలి అనే నియమాన్ని ఏర్పాటుచేసారు (ఆషాడ,కార్తిక,మాఘ,వైశాఖ,పూర్ణిమలలో) సముద్రంలో మునిగి, కొంతసేపు స్నానంచేస్తే ఆ నీటిలో ఉప్పు శరీరానికిపట్టి, శరీరంలో ఉన్న అనవసరం పదార్థం స్వేద రూపంగా బైటికి విజర్జింపబడుతుంది. కాబట్టి సముద్ర స్నానమనేది ఆధ్యాత్మికంగానే కాకండా వైద్యపరంగా కూడ ఏర్పాటు చేయబడిందే.

MOHAN PUBLICATIONS.COM

ఆ–కా–మా–వై అనే నాలుగు నెలల్లో అంటే ఆషాఢం,కార్తికం, మాఘం, వైశాఖం అనే నాలుగు నెలల్లోనూ వచ్చే పూర్ణిమనాడుసముద్ర స్నానాన్ని చేయా లని శాస్త్రం చెప్తున్నమాట. ఈ నాల్గింటిని వ్యాసపూర్ణిమ ఉత్సవాలుగా అందుకే చెప్పారు. సముద్ర స్నానం అంటే పూర్తిగా శరీరాన్ని శిరోజాలతో సహా సముద్రంలో మునిచి స్నానం చేయడం అన్నమాట. అలాచేస్తే శరీరం లోని రోమకూ పాలు తెరుచుకుని శరీరంలో అనవసరంగా ఉండే స్వేదం మొదలైన వ్యర్థ పదార్థాలు బయటికి నెట్టబడతాయి.

అదేకాక శరీరానికి తగినంత ఉప్పదనం పట్టే కారణంగా చర్మవ్యాధులు దరిచేరవు. ఏ హాని కలిగించే రోగక్రిములు శరీరానికి బాహిరభాగంలో (చర్మం పైభాగంలో, శిరోజాల్లో, శరీరపు సందుల్లో, రెండు అవయవాలు కలిసేచోటుల్లో) ఉన్నాయో అవి అన్నీ ఈ సముద్రజంలోని ఉప్పదనం కారణంగా పూర్తిగా మరణించి శరీరానికి సౌఖ్యాన్ని చేకూరుస్తాయి.

### 651. శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానం ఉన్న అన్ని చోట్లా వరాహస్వామి గుడి ఎందుకు ఉండదు ?

హిరణ్యాక్షుణ్ణి చంపిన వరాహస్వామి నేరుగా సొరంగ మార్గాన భూమికి చేరింది తిరుమలక్షేత్రంలోనే. ఆ కారణంగా తిరుమల క్షేత్రపు భూమి మొత్తం వరాహస్వామిదే. అందుకే ఆయనకి నివేదన అయ్యాక వేంకటేశ్వరునికి నివేదన సాగుతుంది. మిగిలిన ఆలయాలలో వరాహస్వామి లేకపోవటానికి కారణం వరాహస్వామి తిరుమలకి మాత్రమే చేరాడు.

### 652. ఆకాశదీపం ప్రాముఖ్యత, దాని అంతరార్థం ఏమిటి?

ఆశ్వయుజ అమావాస్యనే దీపావళిగా వ్యవహరిస్తుంటారు. నిజానికి దీపావళి నాటి అర్ధరాత్రి లక్ష్మీపూజచేయాలి. పగటిపూట పితృదేవతలకి తర్పణాలని విడవాలి. అమరుసటి రోజునించి ప్రారంభమయ్యేదే కార్తిక మాసం. ఆ కార్తిక శుద్ధపాడ్యమి నించి పితృదేవతలంతా ఆకాశమార్గం గుండా తమతమ లోకాలకి ప్రయాణిస్తుంటారు. ఆ కాలంలోవారికి త్రోవ చూపేందుకుగాను ఒక దీపం మనవైపు నుండి ఏర్పాటు చేయడం ఏదుందో అదే ఆకాశదీపం. అంటే ఈ దీపం భూమిమీదివారికి వెలుగునీయడానికి ఉద్దేశించిందికాదనీ, పితృ దేవతలకి మాత్రమే త్రోవచూపేదనీ అర్థంచేయడం కోసమే దానిని శివాలయా లలో ధ్వజస్తంభం పై భాగంలో ఏర్పాటుచేస్తారు.





అది కూడ కొండెక్కిపోకండా ఉండడం కోసం చిల్లులున్న గుండ్రని పాత్రలో నిక్షిప్తం చేస్తారు.

### 653. సర్వేశ్వరుడిని ఎవరు సృష్టించారు ?

న తస్య ప్రతిమా అస్తి–న స్త్రీ నపుమాన్.. అని భగవంతునికి సంబంధిం చిన నిర్వచనం. భగవంతుడు స్త్రీకాదు. పురుషుడుకాదు. అలాగని ఏ మరోతీరువాడూకాడు. ఆయనకు ఒకరూపమే లేదు. ఈ విషయాన్ని ప్రతి ఆగమశాస్త్రమూ తెలియజేసింది. కాబట్టి, భగవంతుడు బ్రహ్మపదార్థంగా రూపము, రంగూ,ధర్మమూ,ఆకారమూ, ఇలాంటివారు లేకుండా శక్తి రూపంగా(జగన్మాత)ఉంటాడు. ఆరూపం అంటే బ్రహ్మపదార్థం ఈ ప్రపం చపు నడకకోసం సృష్టి స్థితిలయాల నిమిత్తం త్రిమూర్తులని సృష్టించింది.

### 654. అష్టమి కష్టాలు; నవమి నష్టాలు నిజమేనా ?

ప్రతిరోజూ సంకల్పంలో శుభే శోభనే ముహూర్తే పర్వదినే అని చెబుతాం. నిజానికి నెలలోని ముప్పై రోజులూ మంచివే. అయితే, జీవితంలో మొదటిసారిగా ఒకపనిని ప్రారంభించేటపుడు అష్టమి సరికాదని, అలాగే నవమి కూడ సరికాదని జ్యోతిషశాస్త్రం తెలియజేస్తుంది. అంతేకాదు. తిథి సరిలేకపోయినా, నక్షత్రం దీని కంటె గొప్పదయితే అంటే తిథి దోషాన్ని తొలగించేదయితే, అష్టమి, నవమిలు కూడ మంచివే అవుతాయి. పంచాం గాల్లో ముహూర్త చక్రం అని ఒకటి కనిపిస్తుంది. దానిని చూస్తే అష్టమినాడు, నవమినాడు కూడ వివాహముహూర్తాలు కనిపిస్తాయి. అందుచేత, అష్టమి కష్టాలు, నవమినష్టాలులాంటి మాటలు, తీరుబడిగా వున్నవారు కల్పించినవి తప్ప, శాస్త్రవిధానానికి నిలబడేవికావు.

### 655. కర్మఫలం అనుభవింపక తప్పనపుడు ఇక దేవుడిని పూజించి లాభమేమిటి ?

దురదృష్టవశాత్తు మనకొక వ్యాధి వచ్చిందనుకుందాం. అది మరణాం తకమైన వ్యాధి. అంటే చచ్చేంతవరకూ తగ్గనివ్యాధి. అంతేకాదు. బాధనిపెడు తుండే వ్యాధి. వ్యాధి బాధ తగ్గేందుకూ, తాత్కాలికంగా ఉపశమనాన్ని పొందేందుకు ఔషధాన్ని క్రమం తప్పకుండా వాడుతున్నాము. అదే తీరుగా కచ్చితంగా కర్మఫలం ప్రతివ్యక్తీ తన జీవితంలో అనుభవించి తీరాల్చిందే. అది నిశ్చయం. అలా అనుభవిం చాడా లేదా అని పరిశీలించే సాక్షి కూడా భగవంతుడే. అటువంటి పరమేశ్వ రుణ్ణి సేవించేది కేవలం సాంత్వన,

MOHAN PUBLICATIONS.COM

ఉపశమనం, తాత్కాలిక బాధా నివారణం కోసమే తప్ప కర్మఫలాన్నిదాటగల శక్తి శ్రీహరికి కూడ లేదు.

### 656. పూజానంతరము పసుపు గణపతిని ఏమిచేయాలి?

ప్రధమపూజ శ్రీ విఘ్నేశ్వరునికి తప్పకచేయాలి. పశుపుతో గణపతిని చేసి తమలపాకుపై ఉంచి నూతనపాత్రలో బియ్యంపోసి అందులో గణపతిని ఉంచి ఆవాహనచేసి షోడశోపచార పూజచేయాలి. పూజానంత రము "వక్ర తుండమహాకాయ సూర్యకోటిసమప్రభ నిర్విఘ్నం కురుమేదేవ సర్వ కార్యేషు సర్వదా"అంటూ స్వామిని నమస్కార విధానముతో శుభార్థే శోభనార్థే పునరా గమనాయచ అంటూ స్వాహా మీ పూజ ముగించాం మరల మావల్ల జరిగే శుభకార్యములో మీపూజచేస్తాము. అని మనస్సులోభావిస్తూ స్వామికి ఉద్వాసనగా స్వామిని ఉంచిన తమలపాకును తూర్పుదిశగా కదిలించాలి. పూజానంతరము ఆ హరిద్ర గణపతిని ప్రసాదంగా భావిస్తూ ఇంటిలో ఉంచుకోవాలి. తదుపరి ఆ పసుపుతో ఇంట్లోని స్త్రీలు స్నానసమయములో నుదురుకు, వివాహితులైనచో మంగళ సూత్రములకు పూనుకొనవలెను. అది శుభప్రదం. సౌభాగ్యప్రదం. వంటికి రాయరాదు. పాదములకు రాయ కూడదు. అలా ఉపయోగించలేనప్పుడు గృహములోని బావిలో లేదా పూల చెట్లవద్ద స్వామిని ఉంచవచ్చు. బావిలో వేయవచ్చును.

### 657. దిష్టితీయటం అంటే ఏమిటి ?

దిష్టిదోషపరిహారార్థం గృహములకు, వ్యాపారస్థులకు బూడిదగుమ్మడి కాయ పూజించి బుధవారంరోజు వుట్టిలోవుంచి కట్టవలెను. గోత్రనామము లతో గుమ్మడికాయకు పూజచేయవలెను. అలంకారంగా పసుపురాసి కుంకు మతో అలంకరించవలెను. వీలైతే దగ్గరలోని దేవాలయంలోని అర్చక స్వామితో లేదా తెలిసిన పురోహితులతో పూజచేయించుకోవచ్చు. బయట వైపుగా కట్టవలెను.

గుమ్మడికాయ కట్టడంద్వారా దిష్టితొలగును. శత్రుబాధ నివారింప బడును. కట్టిన గుమ్మడికాయ ఎండిపోయినచో తిరిగి కొత్తది కట్టవలెను. కుళ్లికాయనుండి రసమువలె కారినచో అరిష్టము వెంటనే ఆ కుళ్లినకాయను తీసివేసి కొత్త గుమ్మడికాయను తీసుకువచ్చి పూజించికట్టవలెను. కొన్ని ప్రాంత ములలో గుమ్మడికాయ దొరకనప్పుడు కొబ్బరికాయ పీచుతోసహా కడుతుంటారు. దిష్టి నివారణకు నిమ్మకాయలు కట్టేటప్పుడు 3,5,9,11

MOHAN PUBLICATIONS.COM





ఈ సంఖ్యలో నిమ్మ కాయలు కట్టాలి ప్రధాన ద్వారమునకు పైన కట్టితేసరిపో తుంది. వీలైతే తక్కిన గుమ్మములకు కూడా కట్టవచ్చును. వారమునకు ఒకసారి నిమ్మకాయలు మార్చాలి. నిమ్మకాయలు సగానికి కోసి ద్వారము నకు అటుఇటు వుంచిన ఎడల దిష్టితొలగును. కోసిన నిమ్మకాయను కుంకు మలో ముంచవలెను. అపసవ్యములు కుడిభాగము ఎడమకు, ఎడమ భాగము కుడికిపెట్టవలెను. మంచి గుమ్మడికాయపై కర్పూరమును వెలిగించి మూడుసార్లు సవ్యముగా మూడుసార్లు అపసవ్యముగా త్రిప్పి పగులగొట్ట వలెను. దీనివలన దిష్టితొలగును. గుమ్మడికాయ దొరకనప్పుడు కొబ్బరి కాయతో అదేవిధముగా దిష్టి తీయవచ్చును.

### 658. దర్భముడి ఉంగరాలు అందరూ ధరించవచ్చునా ?

కర్మలను ఆచరించేటపుడు దర్భలతో ఒక ప్రత్యేకమైన ముడితో పవిత్రం తయారుచేస్తారు. దీనినిధరించి ఆయాకర్మలను ఆచరించాలని శాస్త్రం చెబు తున్నది. ముఖ్యంగా పితృకర్మలను ఆచరించే సమయంలో వీటిని ధరించాలి. అయితే అదే ముడి కలిగివుండేటట్లు బంగారంతోకాని వెండితోకాని ఉంగరం తయారు చేయించి ధరించే సంప్రదాయం వున్నది. దీనిని యెవరు యెవరికి ఇచ్చేవికావు. స్వయంగా తయారుచేయించి ధరించేవి. అయితే తండ్రి మరణించిన తర్వాత జ్యేష్ఠకుమారుడు వారసత్వంగా పితృకర్మ ఆదచరించ డానికి తాను తీసుకుని పితృకర్మలను అచరించే ఆచారం వున్నది.

### 659. సంధ్యావందనం మధ్యలో ఆటంకమువస్తే ఏమిచేయాలి ?

సంధ్య, పూజ, ధ్యానం చేసేటపుడు యెవరైనా వస్తే ఆ దైవకార్యం పూర్తయేవరకు వచ్చినవారు పూజాదులకు భంగం కలిగించకుండా ఎదురు చూచి అవి పూర్తి అయిన తరువాత వారి పనిని ప్రస్తావించాలి. ధ్యానాదులు పూర్తి తర్వాత యిష్టం వచ్చినంతసేపు మాట్లాడవచ్చును. పూజాదులకు భంగం కలుగకుండా చూచుకోవాలిగాని భంగం జరిగితే మళ్ళీ ధ్యానాదులు ప్రారంభించే అకాశం వుండదు.

### 660. నవగ్రహములకు ప్రదక్షిణాలు చేసిన తర్వాత తప్పనిసరిగా కాళ్ళు కడుగుకోవాలా?

దేవాలయంలో వున్న నవగ్రహాలకు ప్రదక్షిణాలు చేసిన తర్వాత కాళ్ళు కడుక్కోకపోతే యేదో పీడ కలుగుతందనే అభిప్రాయం చాలామందిలో వున్నది. కలిగినపీడను వదిలించుకోవడానికేగదా ప్రదక్షిణాలు చేసేది. గ్రహ

MOHAN PUBLICATIONS.COM

పీడానివృత్తిని నవగ్రహములకు ప్రదక్షిణాలుచేసేది. గ్రహపీడానివృత్తిని నవ గ్రహములకు ప్రదక్షిణగా చేయాలిఅన్నది శాస్త్రవచనం. తర్వాత కాళ్ళు కడుక్కోమని ఎక్కడాలేదు. నవగ్రహాలయమైనా మరోదేవాలయమైనా అన్నీ పవిత్రమైనవే పవిత్రమైన ప్రదేశంలో చేసిన సత్కర్మ వ్యక్తిని పవిత్రుణ్ణి చేస్తుంది. కాని అపవిత్రత అంటదు. పవిత్రప్రదేశంలో పవిత్రకర్మను ఆచరించి అపవి త్రతను భావించడమే పెద్దదోషం. కొంతమంది నవగ్రహ ప్రదక్షిణ చేసిన తరువాతకాళ్లు కడుకొని తరువాత మాత్రమే శివాలయ ప్రవేశము చేస్తారు.

కొన్ని ఆచారాలు ప్రాంతీయభేదాలతో ఉంటాయి. వీటికెలాంటి శాస్త్రాలు ఉండవు. వీటికి సంప్రదాయం ముఖ్యం. పూర్వం శివాలయాలను శ్మశాన భూములుగా భావించారు. అందుకే కాశీని మహాశ్మశానమన్నారు. శివసన్నిధిలో పూర్వం ఏప్రసాదం స్వీకరించేవారుకాదు. సామాన్యంగా శివాలయాలలోనే నవగ్రహ ప్రతిష్ఠ చేస్తారు. అక్కడి శన్యాదిగ్రహాలకు ప్రదక్షిన చేసి పాదప్రక్షాళనం చేసేవారు. వీరశైవులు దానిని వ్యతిరేకించారు. ఈనాడు ఏ ప్రాంతంలోను ఈ సంప్రదాయాన్ని పూర్తిగా పాటించటంలేదు.

**661. నవగ్రహమంటపమునకు ప్రతిరోజు ప్రదక్షిణాలు చేయవచ్చునా?**

శివాలయంలో ప్రతిష్ఠచేసినా మరోచోట ప్రతిష్ఠచేసినా నవగ్రహములకు ప్రదక్షిణం చేయటందోషంకాదు. అయితే దోషనివృత్తికోసం చేసే ప్రదక్షిణాలు దానివిధానం తెలుసుకొనిచేయాలి. మామూలుగాఅయితే ఆలయంలో వున్న దేవతలందరికి (నవగ్రహాలనుకూడాకలుపుకుని) కలిపి ప్రదక్షిణం చేయాలి.

**662. నవగ్రహ ప్రదక్షిణ చేసేటపుడు ఏ గ్రహం నుండి ప్రారంభించి చేయాలి?**

ఆదిత్యాయ చ సోమాయ అని గ్రహములలో మొదటి గ్రహం సూర్య గ్రహం సూర్యగ్రహంమధ్యలో తూర్పుముఖంగా ప్రతిష్ఠచేస్తారు. కనుక తూర్పు నుండి ప్రారంభించి ప్రారంభించిన చోటువరకు చేస్తే ప్రదక్షిణ పూర్తవుతుంది.

**663. నవగ్రహాలకు ఎన్ని ప్రదక్షిణాలు చేయాలి ?**

ప్రదక్షిణాలు నవగ్రహాలకు మూడుసార్లు చేయవచ్చు. తొమ్మిది గ్రహాలు కనుక తొమ్మిదిసార్లు చేయవచ్చు లేదా పదకొండు 21,27 యిలా బేసి సంఖ్య వచ్చేలా చేయడం సంప్రదాయం.

**664. ఊర్ధ్వ పుండ్రములు ఎందుకు ధరిస్తారు ? వాటి ప్రభావమేమి ?**

ఆర్యమతంలో ముఖధారణం (బొట్టు) ఒక ఆర్ష సంప్రదదాయంగా ఏర్పడింది. అది త్రిపుండ్రము, ఊర్ధ్వ పుండ్రాలు అని ముఖ్యంగా రెండు





రకాలు. వైష్ణవులు ఊర్ధ్వపుండ్రాలు ధరిస్తారు. స్త్రీలు తిలకధారణ చేస్తారు. తిరుమణిని నిలువున మూడురేఖలుగా ధరించడాన్నే ఊర్ధ్వ పుండ్ర ధారణ మంటారు. ఈ మూడురేఖలు అకార,ఉకార,మకార స్వరూప మైన ప్రణవాన్ని సూచిస్తాయి. అకారం సత్త్వ స్వరూపుడైన విష్ణువునూ, ఉకారం చిత్త్వ స్వరూపిణి అయిన మహాలక్ష్మిని, మకారం భగవద్భక్తులైన భాగవతు లనూ తెలియజేస్తాయని చెబుతారు. శైవులు భస్మాని మూడు అడ్డరేకలుగా నుదుట ధరిస్తారు.

తిరుమణిమట్టి (మృత్) కి సంబంధించినది. కావున అది మట్టినుండి కల్గిన ఈశరీరం చివరికి మట్టిలోనే కలిసిపోతుందని సూచిస్తున్నది. ఇందువల్ల వైరాగ్యంకలుగుతుంది. ముక్తికోరే వానికి వైరాగ్యం చాలాముఖ్యం. విబూదిధారణ కూడా ఈ శరీరం చివరికి బూడిద అయ్యేదే అనే తత్త్వాన్ని నిర్దేస్తుంది. ముఖధారణలేకుండా చేసే సత్కర్మలు నిరర్ధకాలని ఆగమాలు పేర్కొన్నాయి.

ద్వాదశ (12) ఊర్ధ్వ పుండ్రాలు ధరించడం కూడా కద్దు. నాడులు, హృదయం మొదలైన శరీరభాగాలను చల్లబరచుటకు కూడా ఆయా స్థానాలలో ఊర్ధ్వపుండ్రధారణ అవసరమని వైజ్ఞానికంగా విశ్లేషణ చేసి కొందరు వివరిస్తున్నారు. ఊర్ధ్వ పుండ్రంలో ఉపయోగించే వస్తువులకు చల్లదనం కల్గించే లక్షణం వున్నది.

**665. వాల్మీకి రామాయాణాన్ని ఎప్పుడు వ్రాశాడు ?**

వాల్మీకి త్రేతాయుగంలో రాముడు జీవించివున్న కాంలోనే రామాయ ణాన్ని రచించినట్లు రామాయణం నుండే తెలుస్తున్నది.

ఆ మహర్షి ఒకనాటి మధ్యాహ్నం తమసా నదికి స్నానానికై వెళ్ళాడు. అక్కడ బోయవాడొకడు క్రౌంచ పక్షుల జంటలో ఒక పక్షిని బాణంతో కొట్టి చంపాడు. అదిచూచి శోకానికి గురిఅయిన వాల్మీకి అతణ్ని శపించాడు. ఆ శాపవచనం ఛందోబద్ధంగా ఆయన నుండి వెలువడింది. ఆశ్రమానికి పోయి దానిని గురించి ఆలోచిస్తూ వుండగా బ్రహ్మ ప్రత్యక్షమై "ఋషీ! నీకు శబ్ద బ్రహ్మం స్వాధీనమయింది. ఆర్ష దృష్టితో నీవు రాముని చరిత్రను చెప్పు" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

తరువాత నారదుడు వాల్మీకి చెంతకు వచ్చాడు. వాల్మీకి "ఈలోకంలో ఇప్పుడు గుణవంతుడూ, వీర్యవంతుడూ, ధర్మజ్ఞుడూ, కృతజ్ఞుడూ" ఇత్యాదిగా

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

పదునారు గుణాలు కల్గినవాడు ఎవడు? అని ప్రశ్నించాడు. నారదుడు అట్టివాడు అయోధ్యాధిపతి శ్రీరాముడే అని చెప్పి రామకథను సంగ్రహంగా వివరించాడు. ఈలోకంలో ఇప్పుడు ప్రశ్నించాడాన్ని బట్టి అప్పుడు రాముడు రాజ్యం చేస్తున్నట్లు స్పష్టమవుతున్నది. అందుచేత వాల్మీకి రామాయణాన్ని రాముని జననానంతరమే వ్రాశాడనేది స్పష్టం.

## 666. జగన్మాత అనగా ఎవరు ?

జగతః మాతా – జగత్తుకు తల్లి అన్న అర్థంలో జగన్మాత అనే శబ్దాన్ని వాడుతున్నాం. పరమాత్ముడు లోకానికి తండ్రికాగా, జగన్మాత తల్లి అవుతున్నది. లక్ష్మీనారాయణులు లోకానికి తల్లిదండ్రులు. అట్లే పార్వతీ పరమేశ్వరులను గూడ తల్లిదండ్రులని భావించడం కద్దు. "జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" అని కాళిదాసుజగత్తుకు మాతాపితరులుగా పార్వతీ పరమేశ్వరులను వర్ణించాడు.

'ఈశానాం జగతోస్య' అనే లక్ష్మీ ప్రార్థనలో వందే జగన్మాతరం అని జగన్మాతగా లక్ష్మికి నమస్కరిస్తున్నాము. ఆది కాలంలో పరమాత్మయొక్క వామ భాగం నుండి లక్ష్మీదేవి జన్మించింది. ఆ తరువాత ఎన్నో రూపాలతో అవతరించింది. సీత, రుక్మిణి మున్నగునవి ఆమె రూపాలే. విష్ణువు భిన్న భిన్నావతారాలు దాల్చినప్పుడు ఆమె గూడా వేరువేరుగా అవతరించి ఆ దేవునికి నిత్యానపాయిని అయిన పత్నిగా విరాజిల్లింది.

శ్రీలక్ష్మి శ్రీక్షీరసాగరంలో జన్మించినట్లు, పార్వతి హిమవంతుని కుమార్తెగా జనించినట్లు, అంతకు ముందటి జన్మలో ఆమె దక్షుని పుత్రిక యైన సతీదేవిగా ప్రభవించినట్లు పురాణాలలో చెప్పడమయింది. నిఘంటువులుగూడ 'ఇందిరాలోకమాతా' భార్గవీ లోకజననీ అని లక్ష్మీదేవిని జగన్మాతగా పేర్కొన్నాయి. భక్తులు తాము భక్తి శ్రద్ధలతో ఏ స్త్రీ దేవతనైనా జగన్మాతగానే భావించి సేవిస్తూ ఉంటారు.

## 667. విష్ణు సహస్రనామాలు ఎప్పుడు చదువు కోవాలి?

విష్ణు సహస్రనామాలను ఏవో కొన్ని దినాలలోనే చదవాలన్న నియమమేదీ లేదు. నిత్యమూ చదువవచ్చు.

తమేవ చార్చయన్ నిత్యం భక్త్యా పురుష మవ్యయమ్
ధ్యాయన్ స్తువన్ సమస్యంప్చ యజమాన స్తమేవ చ.





అని సహస్రనామ స్తోత్ర ప్రారంభంలో అర్చన ధ్యాన స్తోత్రాదులు నిత్యమూ చేయవచ్చు అని చెప్పడమయింది. మరియు 'యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చే న్నర స్సదా' అని చెప్పడంవల్ల నిత్యమూ, ఎల్లవేళలా భగవన్నామస్తుతి చేయవచ్చు అని నిర్దేశించడమయింది. భగవద్గీతలో కూడా 'సతతం కీర్త యన్తో మాం యతంతశ్చ దృఢవ్రతాః అని భగవానుడు సతతమూ భగవన్నామ కీర్తన చేయదగునని చెప్పాడు. అయితే పారాయణ చేసేవారికి భక్తి, చిత్తశుద్ధి ఉండాలి.

భక్తిమాన్ యస్సదోత్థాయ శుచి స్తద్గతమానసః
సహస్రం వాసుదేవస్య నామ్నా మేత త్ప్రకీర్తయేత్.

ఆర్తులు, విషణ్ణులు, భయగ్రస్తులు, ఘోరవ్యాధుల పాలైన వారు కూడా నారాయణ నామకీర్తనలతో దుఃఖరహితులవుతారని ఫలశ్రుతి. అయితే నియమం కోసం ఉదయం సాయంవేళల్లో స్నానానంతరం, విష్ణ్వాల యాలకు పోయినప్పుడు, మకర సంక్రమణాది పుణ్యకాలాలలో నామ పారాయణ విశేషఫలప్రదంగా ఉంటుంది. తక్కిన వేళల్లో కూడా పారాయ ణం చేయడం ఫలప్రదమే.

## 668. హయగ్రీవావతార వైశిష్ట్యం ఏమిటి ?

విష్ణుమూర్తి అవతారం. దానవులతో యుద్ధంచేసిన అలసి తన ధనస్సుపై తలపెట్టుకుని నిద్రపోతుండగా, యజ్ఞభాగములను అర్పించుటకు వచ్చిన దేవతలు విష్ణుమూర్తి నిద్రలేపడానికి సంశయించగాలి శివుని ఉపాయముచే బ్రహ్మ అనుజ్ఞచేత వమ్రి అనే కీటకము ఆ ధనస్సుయొక్క నారిని కొరికింది. ఎక్కుపెట్టిఉన్న ధనస్సు త్రుళ్ళి విష్ణువు తల తెగిపడుతుంది. (దీనికి లక్ష్మీదేవి శాపంకూడా ఉంది). దేవి అనుజ్ఞచేత హయము(గుఱ్ఱము) తల విష్ణువు శరీరానికి అంటించారు. అందువల్ల ఆయన హయగ్రీవుడైనట్లు చెప్పబడింది.

హయగ్రీవుడనే రాక్షసుడు 'హయగ్రీవుడు' అనే వానివల్ల మరణం పొందేట్లు దేవినుండి వరం పొందడం జరిగింది. ఆ వరగర్వ ప్రభావముతో దేవతలను బాధపెట్టడంతో వీనిని సంహరించడానికి విష్ణువు హయగ్రీవుని అవతారం ఎత్తాడని దేవీభాగవతంలో చెప్పబడింది.

బ్రహ్మచే సృజించబడిన వేదములను హరించిన మధుకైటభులు వానిని రసాతలములో బంధించారు. వేదములు లేక సృష్టి ఆగిపోవడంతో

MOHAN PUBLICATIONS.COM

దేవతల ప్రార్ధన మేరకు విష్ణువు హయశిరస్సుడై మధుకైటభులను వధించి వేదములను రక్షించడంతో తిరిగి సృష్టి ప్రారంభమైనట్లు చెప్పబడింది.

జ్ఞానం, ఆనందం స్వరూపంగా గలవాడు, స్వచ్ఛమైన స్ఫటికంవంటి ఆకృతిగలవాడు, సమస్తవిద్యలకు ఆధార మైనవాడు అయిన హయగ్రీవుణ్ణి ఉపాసిస్తున్నాము అని ప్రార్థనకుతాత్పర్యం. ఇందలి వర్ణనవల్లనే హయగ్రీవ స్వామియొక్క స్వరూప స్వభావాలు కొంతవరకు గ్రహించవచ్చు. దుష్టశిక్ష ణకు, శిష్టరక్షణకు భగవంతుడు ఎన్నో అవతారాలు దాల్చాడు. అందులో హయగ్రీవావతారం ఒకటి. వేదోద్ధరణకు, జ్ఞానం, సదాచారం నశించకుండా నిరంతరంగా కొనసాగునట్లు అనుగ్రహించడానికి ఈ స్వామి అవతరిం చాడు. శ్రీ వేదాంత దేశికులు హయగ్రీవుణ్ణి ప్రథమావతారంగా వర్ణించి ఉన్నారు. అందుచే కృతయుగాదిలోనే మొదటి మనువు కాలంలోనే ఈ అవతారం సంభవించినట్లు గ్రహించాలి. బ్రహ్మ నిర్వహించిన యజ్ఞంలో హయగ్రీవస్వామి జన్మించినట్లు పురాణాలు చెబుతున్నాయి. మధుకైటభులను సంహరించి హయగ్రీవుడు వేదాలను ఉద్ధరించాడు. విష్ణు సహస్రనామంలో "గురుః,ఉత్తర,గోపతిః గోప్తా, జ్ఞానగమ్యః పురాతనః శరీరభూతభృక్, భోక్తా" అన్న ఎనిమిది నామాలు హయగ్రీవ వైభవాన్ని ప్రకటిస్తున్నాయని శ్రీ పరాశర భట్టరువారు తెలిపారు. 'శుక్లాంబరధరం' అన్న ప్రసిద్ధస్తోత్రం హయగ్రీవ స్తుతి పరమని కొందరి భావన. వైదికమతాలలోనే కాక అవైదికములైన మతాలలో గూడా హయగ్రీవారాధన ఉన్నట్లు పరిశోధకులు తెలిపారు.

శ్రీ వేదాంత దేశికులకు గరుడుడు ప్రత్యక్షమై హయగ్రీవ మంత్రం ఉపదేశించాడనీ, ఆ మంత్రాన్ని శ్రీదేశికస్వామి భక్తిశ్రద్ధలతో జపించి హయగ్రీవానుగ్రహం పొంది మహాకవి పండితులుగా రూపొందారనీ పెద్దలు చెప్పారు. వారు రచించిన హయగ్రీవ స్తోత్రం సుప్రసిద్ధం.

## 669. వైఖానసులు ఎవరు ? వీరిని గురించి తెలపండి ?

దేవాలయం అర్చకులలో ఒక తెగకు చెందినవారు వైఖానసులు. వీరు కృష్ణయజుర్వేదంలోని తైత్తిరీయశాఖకు చెందినవారు, వేదవిహిత ధర్మం పాటించే వారు. 'వైఖానస' శబ్దానికి అనేక విధాల నిర్వచనాలున్నాయి. విఖనా వై విష్ణుః తజ్జా వైఖానసాః స్మృతాఃఅనగా విఖనుడే విష్ణువు, ఆయన వంశస్థులే వైఖాన సులు. మనస్సును విశేషంగా ఖననంచేసి (తపస్సుచేసి) విష్ణువు సుతుడు (బ్రహ్మ) విఖనుడైనాడు. ఆయన మునులలో మొదటివాడు.



విఖనా ఇతిహి ప్రోక్తో మనసః ఖననాత్సుతతః
బ్రహ్మణః సు విశేషేణ మునీనాం ప్రథమో మునిః

అంతర్గమైన వేదాలను త్రవ్వి పైకి తీయడం వల్ల ఆ ప్రభువు విఖను డయ్యాడు. ఆయనే పితామహుడు వైఖానసుడు.

అంతర్హితానాం ఖననాత్ వేదానాం తు విశేషతః
స విఖః ప్రోచ్యతే సర్వైః విఖనా బ్రహ్మవాదిభిః
వైఖానసశ్చ భగవాన్ ప్రోచ్యతే స పితామహః

అంతేకాక వానప్రస్థుణ్ణి గూడా వైఖానసుడంటారు. ఈ రీతిగా విష్ణువు,



బ్రహ్మ, విష్ణుమానసపుత్రుడు, వైఖానసవంశకర్త, వానప్రస్థుడైన ముని అని వైఖానసపదానికి అనేకార్థాలు చెబుతారు. కశ్యపుడు, అత్రి, మరీచి, వసిష్ఠుడు, అంగిరసుడు, భృగువు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు ఈ తొమ్మిదిమంది విఖనసుని శిష్యులు. వీరు వైఖానస సంప్రదాయ వ్యాప్తి కల్గించారు. ముక్తికి భక్తి ఒక్కటే చాలదనీ, మూర్తి పూజ కూడ చేయాలనీ వైఖానసులంటారు. వీరు తమ పూజావిధిని వేదమంత్రాలతో నిర్వహిస్తారు. తమిళ ప్రబంధాలకు అందులో స్థానంలేదు. తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంలో అర్చ కులు వైఖానసులు.

## 670. కొబ్బరికాయ ప్రాముఖ్యం ఏమి ?

భక్తులు తమ హృదయాన్ని భగవంతుని కర్పించాలని శాస్త్రాలు చెబు తున్నాయి. నిజంగా హృదయ సమర్పణం సాధ్యం కానివని, దానికి ప్రతీకగా టెంకాయను సమర్పించడమనే విధానం ఏర్పడింది.

నైవేద్యమిడ మాకు నారికేళము లేదు
హృదయమే చేతి కందీయనుంటి

అన్నభక్త కవి మాటలలో ఈభావమే ప్రకారాంతరంగా వ్యక్తమవు తున్నది. మనకు స్థూల సూక్ష్మ కారణాలనే మూడు శరీరాలున్నాయని వేదాంతశాస్త్రం నిరూపిస్తున్నది. ఈ శరీరాలను వదిలించుకొంటేనే ముక్తి. టెంకాయపై బెరడు స్థూలశరీరాన్ని, కొబ్బరి సూక్ష్మశరీరాన్నీ, నీరు కారణశరీ రాన్నీ సూచిస్తాయి. జీవత్వం పొందడానికి సంకేతంగా మూడు ఆవరణలతో ఉన్న టెంకాయను దేవునికి అర్పిస్తున్నట్లు భావించాలి.

కాయపై నున్నపిలక అహంకారానికి సంకేతమని కొందరూ, అఖండ జ్ఞానానికి సూచకమని మరికొందరూ చెబుతారు. నీరుచంచలమైన మన

MOHAN PUBLICATIONS.COM

స్సుకు సూచకమని గూడా వివరిస్తారు. పిలకను తొలగించడం అహంకార నిర్మూలనాన్ని సూచిస్తుంది. లేదా చివరివరకూ, అంటే శరీరత్రయం నశించి జ్ఞేయంలో లీనమయ్యే వరకూ, జ్ఞానరూప శిఖను అట్లే వుంచి తరువాత దాన్ని తొలగించాలని గూడా వివరిస్తారు.

టెంకాయను దేవతలకు సమర్పించడాన్ని గురించి ఒక ఐతిహ్యం కద్దు. వినాయకుడు ఒకసారి శివుణ్ణి "నీ తలను నాకు బలిగా ఇమ్మ"న్నాడట! తల ఇవ్వడం కుదరదు కానీ తలతో సరితూగే వస్తువునివ్వవలసి వచ్చింది. మూడు కన్నులవేల్పు తలకు బదులు మూడు కన్నులున్న నారికేళం వినాయకుడికిచ్చి తృప్తి పరిచారు. ఆ తరువాత దేవతల కందరికీ టెంకాయలు సమర్పించే సంప్రదాయం ఏర్పడింది.

### 671. అవతార లక్ష్యం ఏమిటి ?

దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఇది ప్రతి అవతారంలోని లక్ష్యం. ధర్మాన్ని తిరిగి నెలకొల్పటానికి పదే పదే నారాయణుడు జన్మిస్తాడు. అవతారపురుషుడు మానవ రూపంలో కనిపించినా, మానవులకు అంటే గుణ, కర్మలకు అతీతంగా వ్యవహరిస్తాడు. నారాయణుడు సద్గుణసంప న్నుడు. సర్వశక్తి సంపన్నుడు. అయినా తన శక్తులను వృథాగా ప్రదర్శించడు. చివరిక్షణం వరకు సహనం ప్రదర్శిస్తాడు. మార్పుచెందే అవకాశాలు ఇస్తాడు. అవతార పురుషుడి మంచిని అసమర్థతగా, పిరికితనంగా భావించి రాక్షసత్వం మరింతగా ప్రదర్శించినపుడు సంహారంచేస్తాడు. హిరణ్యకశిపుడు భగవంతుని ఉనికిని ప్రశ్నించి, గర్వంగా అడిగేసరికి స్తంభంలో నుండి నారసింహ రూపంలోవచ్చి రాక్షస సంహారం చేశాడు. అలాగే ఆంజనేయుని బాణాలతో హింసించినపుడే శ్రీరామచంద్రుడు ఆగ్రహంతో రామబాణం సంధించాడు. అది అవతాపురుషుని గుణం. చివరిక్షణం వరకు అవతలి వ్యక్తిలో సహజ మార్పును తెచ్చే యత్నంచేస్తాడు.

### 672. నదీస్నాన మహిమ ఏమిటి ?

ఈ భూమిని, భూమిపై నివసించే ప్రజల్ని తరింపజేయడానికి ఆ మహాశివుడు నదులను, అక్కడక్కడ తన క్షేత్రాలను సృష్టించాడు. కొన్ని క్షేత్రాలు స్వయంభువాలు, మరికొన్ని క్షేత్రాలు ఋష్యనుష్ఠితాలు ఇంకొన్ని దేవతావందితాలు. నదీసముద్రతీరాలలో అనేక క్షేత్రాలున్నాయి. గంగా తీరాన కాశీ మొదలైన క్షేత్రాలు విరాజిల్లుతున్నాయి. నర్మదానదిలో స్నానం





చేసి దానాలుఇస్తే విష్ణులోకం సిద్ధిస్తుంది. శోణ,భద్రానదిలో స్నానంచేసి అక్కడేవుండి ఒక రోజు ఉపవాస ముంటే వారికి వినాయకపదం లభిస్తుంది. అన్నిటికంటే పుణ్యప్రదమైనది గోదావరి. ఆ నదీస్మరణచాలు అన్ని పాపాలూ తొలగిపోతయాయి.

కాశీక్షేత్రంవల్ల గంగకు పేరువచ్చింది. గోదావరి నదివల్ల ఇక్కడి క్షేత్రాలకు పేరొచ్చింది. ఒక్క గోదావరి స్నానం వంద సంధ్యావందనాల పెట్టు. వంద గోదావరీ స్నానాలు యోగాభ్యాసానికి తొలిమెట్టు. నిత్యగౌతమీ స్నానంకాని, పర్వదినాలలో గౌతమీస్నానంకాని ఇచ్చే పుణ్యం అంతా ఇంతా అని చెప్పనలవి కాదు. బృహస్పతి సింహరాశిలో వున్నప్పుడు గోదావరి (పుష్కర) స్నానంచేసిన వారికి, శివలోకం తప్పదని చెప్పాడు శివుడు. ఎవరు శివభక్తుడో, ఎవరు శివలోకానికి పోవాలనుకుంటాడో ఆ శైవుడు గోదావరీ స్నానం చేయాలి. శివ లోకాన్ని ప్రసాదించే మహత్తు గోదావరికి వుంది.

ఇక కృష్ణానది విష్ణులోకప్రాప్తిని ప్రసాదిస్తుంది. తుంగభద్రను ఆరాధించిన వాళ్ళు బ్రహ్మలోకానికి వెళతారు. ఎవరైతే ఏ పుణ్యం వలనో బ్రహ్మలోకం చేరి అక్కడ తిరిగి భూమిపై పుట్టవలసివస్తే వారంతా ఖచ్చితంగా సువర్ణముఖీ నదీతీరాన్నే జన్మిస్తారని అంటారు పెద్దలు. కనుక అటువంటి దివ్యనదీనద తీర్థస్థ క్షేత్రాలు ముముక్షువులకు సదా నివాసయోగ్యాలు.

### 673. సుందరకాండ వచనం పారాయణం చేయవచ్చునా?

పారాయణం చేసేవారు శ్లోకాలలో బీజాక్షరాలున్నాయని విశ్వసించి చేస్తున్నారు. అలాకాక మానవజీవితానికి సుందరకాండలో లభించే సందేశం తెలుసుకోవాలనుకున్న వారు వచనం చదువుకోవచ్చు. దేనికైనా మనస్సు ప్రధానం. ప్రస్తుతము సుందరకాండ వచనరూపములో పుస్తకములు లభిస్తున్నాయి. వీటిని ఎవరైనా చదువుకొనవచ్చును.

### 674. యక్షప్రశ్నలు అంటే ఏమిటి ?

మహాభారతంలో అరణ్యపర్వం ఓపాండవులు అరణ్యావాసంలో ఉన్నప్పుడు ఒకబ్రాహ్మణుడు పాండువలవద్దకువచ్చి తన ఆరణి లేడికొమ్ములలో ఇరుక్కు పోయిందని, దానిని తెచ్చి ఇవ్వాల్సిందిగా కోరతాడు. ధర్మరాజు తన నలుగురు తమ్ములతో కలసి లేడిని పట్టుకోవడానికి అక్కడకు బయలు దేరతాడు. కొద్దిసేపటికి ఆ లేడి మాయం అవుతుంది. వెతికి వెతికి అలసట చెంది మంచి నీళ్ళు తేవడానికి నకులుడిని పంపుతారు. అలాగే అర్జునుడు, భీముడు కూడా వెళ్తారు. ఎవ్వరూ తిరిగిరారు. చివరకు ధర్మరాజు బయలు

MOHAN PUBLICATIONS.COM

దేరతాడు. మంచినీటి కొలను పక్కనగల నలుగురు తమ్ముళ్ళను చూసి బాధపడతుంటాడు. అంతలో అదృష్టవాణి పలుకుతుంది. తాను యక్షుడినని, ఈ సరస్సు తన అధీనంలో ఉందని, తానడిగిన ప్రశ్నలకు సమాధానంచెప్పి, దాహం తీర్చుకోబోయి నందువల్లే ఈ దుస్థితి కలిగిందని, ధర్మరాజు అయినా తన ప్రశ్నలకు సమాధానం చెప్పి, దాహం తీర్చుకోమని యక్షుడు చెప్తాడు. దానికి సరేనంటాడు ధర్మరాజు. ఆప్రశ్నలనే యక్షప్రశ్నలు అంటారు. ధర్మ రాజును పరీక్షించేందుకు యమధర్మరాజు యక్షుడి రూపంలో 72 చిక్కు ప్రశ్నలువేస్తాడు. వాటికి ధర్మరాజు సమాధానలు చెప్తాడు.

## 675. కూష్మాండ దానం అనగా ఏమి ?

ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమయ్యే శుభవేళ రాబోయే వేసవికి శుభసూచకం. సృష్టిమొత్తం కూడా శిశిరంలో బోసిపోయి మళ్ళీకొత్తచిగురు తొడగడానికి అనువైన కాలం వచ్చిందుకు పులకించిపోయే సమయంలో వచ్చే పండుగ ఈ మకర సంక్రాంతి.

పురాణాల్లో సంక్రాంతి గురించి అనేక కథలున్నాయి. వాటిలో ఒకకథ తెలుసుకోండి. కల్పం ఆరంభంలో ప్రళయంవచ్చి భూమి సముద్రంలో మునిగిపోయిన సమయంలో శ్రీహరి ఆదివారాహరూపం ఎత్తి భూమిని ఈ రోజునే ఉద్ధరించాడు. హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు భూమిని పాతాళానికి తీసుకువెళ్తూ సముద్రంలో దూకుతున్న అతనిని శ్రీమన్నారాయణుడు వరాహ రూపం ఎత్తిసంహరించాడు. భూమిని ఉద్ధరించాడు. అందుకనే వరాహ స్వామిని ప్రార్థిస్తే కష్టాలు ఉండవు. అన్ని సంతోషాలు చేకూరతాయి.

వరాహస్వామి భూమిని ఉద్ధరించినందుకు సంకేతంగా గుమ్మడి పండు దానం చేస్తారు. దీనినే "కూష్మాండదానం" అనిఅంటారు. ఈ దానం చేయ డంవల్ల సమస్త బ్రహ్మాండాన్ని విష్ణువుకు సమర్పించినట్లు అవుతుందన్నది విశ్వాసం.

## 676. పదమూడు పూల పూజ ?

భోగి అంటే భోగం. శ్రీరంగనాథుడే నా భర్త అన్న గోదాదేవి పరిణయం ఆడిన రోజు భోగిపండుగ. ఇది భోగిపండుగ భోగం. ఆయనని అత్యంత ప్రీతి కరంగా స్పందింపచేసిన గోదాదేవి భోగం. ఆ భోగంలోని ఆనందాన్ని తన తోటి చెలికాండ్రకే కాకుండా ఇరుగు పొరుగున గల గ్రామాలవారికి అందరికీ కల్పించింది ఆ మహాతల్లి గోదాదేవి. అందుకే మనందరం.





యాదృశాకించన త్రాకా బుద్ధకంకణపాణియే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమే

అంటూ మంగళవచనాలతో తరించాలి. గోమయంతో ఇంటిముందు అలికి ముగ్గులుపెట్టి తామరపువ్వుతో సహా 13 రకాల పూలతో పూజకు సిద్ధం కావాలి. పూజలో మొదటిపువ్వు భక్తినీ, రెండో పువ్వు జ్ఞానాన్ని, మూడో పువ్వు ఐదోతనాన్ని, నాలుగోపువ్వు సౌందర్యాన్ని, ఐదోపువ్వు భక్తినీ, ఆరోపువ్వు ఆనం దాన్ని ఏడో పువ్వు సత్సంతనాన్ని, ఎనిమిదోపువ్వు సహకార సౌభాగ్యాన్ని, తొమ్మిదో పువ్వు మంచిగుణాన్ని, పదోపువ్వు కీర్తి ప్రతిష్టల్ని, పదకొండో పువ్వు మంచి పొరుగునూ, పన్నెండోపువ్వు పార్వతీ అనుగ్రహాన్నీ పదమూడో పువ్వు పరమ సుఖాన్నీ ప్రసాదిస్తాయి. దీనినే 13 పూల పూజ అంటారు. ధనుర్మాసంలో ముగ్గులుపెట్టి, పూజలుచేసేవారు ధన్యతపొందు తారు. 108 పువ్వులతో విష్ణు, లక్ష్మీపూజలు చేసే ఆడవారికి ఎటువంటి లోటూ రాదు.

## 677. ఉత్తర దిక్కు ప్రాధాన్యం ఎందుకు?

మకర సంక్రమణం రోజునుండి సూర్యుడు ఉత్తర దిక్కుగా ప్రయాణం ప్రారంభిస్తాడు. దీనిని ఉత్తరాయణ మహాపుణ్యకాలం అంటారు. కురుక్షేత్రంలో అంపశయ్యపై పడిన భీష్మాచార్యులు ఈ ఉత్తరాయణందాకా మరణం కోసం వేచి చూశాడంటే దీని ప్రాధాన్యం మనకు అర్థం కాగలదు. ఉత్తరాయణం పరమాత్మ నిలయం. అందుచేతనే ముక్కోటి దేవతలూ ఉత్తర దిక్కునే నివసిస్తారన్నది పెద్దలమాట. ఉత్తరదిక్కు ఉత్తరాయణం బహుపుణ్య ప్రదమన్నది మన విశ్వాసం. ఎందుకంటే ఉత్తర దిక్కునే పవిత్ర గంగానది పుట్టింది. బదరికాది పుణ్యభూములలో నరనారాయణులు ఉద్భవించారు. నారదుడు, మౌద్గల్యుడు, గౌతముడు మొదలైన ఋషులు ఎందరో హిమా లయాల్లో తపస్సుచేసి మంత్రద్రష్టలుఅయ్యారు. పూర్వము కురు మహా రాజులు ఉత్తర భూములనుదున్ని కురుక్షేత్రాన్ని ధర్మక్షేత్రంగా మార్చారు.

## 678. ఉపనిషత్తులు ఎన్ని ? అవి ఏవో చెప్పండి ?

ఉపనిషత్తులకు మరో పేరు వేదాంతములు. ఒకప్పుడు మహాఋషులు ఋషిపుత్రులను ఒకచోటచేర్చి ఆత్మ అంటే ఏమిటి? అనాత్మఅంటే ఏమిటి? జీవుడుఎవరు? జీవుల,ఈశ్వరుల నడుమ సంబంధం ఎటువంటిది? ఎక్కడికి పోతాము? అన్న ప్రశ్నల్ని గురించి చర్చలు జరపగా వచ్చిన

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

జవాబులే ఉపనిషత్తులు. వీటిసంఖ్య108. వీటిలో పదిఉపనిషత్తులు మాత్రం శంకరా చార్యుల కాలంలో సర్వాంగీకరాం పొందినట్లు చెప్తారు. ఆ పది. ఈశా వ్యాపోపనిషత్, కేశోపనిషత్, కఠోపనిషత్, ప్రశ్నోపనిషత్, ముండకోపనిషత్, మాండూక్య ఉపనిషత్, తైత్తిరీయోపనిషత్, ఐతరేయోప నిషత్, ఛాందోగ్యోప నిషత్, బృహదారణ్య కోపనిషత్.

### 679. తగిన గురువును ఎంచుకోవడం ఎలా ?

అసలు గురువును నువ్వు ఎంచుకోవద్దు. నువ్వు ఎంచుకునే 'గురువు' నీవుకోరుకునేది చెప్పేవారుగా ఉంటాడు. కాని నిజమైన గురువు నిన్ను వేధిస్తాడు. నువ్వు నువ్వు కాకుండా చేస్తాడు. పూర్తిగా నిన్నుమార్చివేసి, నేను అనే అహం వదిలించి, నాకు ఎటువంటి శక్తిలేదు. ఇంతవరకు అంతా అజ్ఞానంలో ఉన్నాను అని అంగీకరింపచేయగలిగిన వాడే అసలైన గురువు. అటువంటి గురువు నిన్ను వెతుక్కుంటూవచ్చి నిన్ను శిష్యుడిగా స్వీకరిస్తాడు. నీఅంతట నువ్వుగా వెతుక్కుంటూ వెళితే నువ్వు ఎంచుకునే గురువు విషయంలో తప్పక పొరపాటు జరుగుతుంది.

### 680. శ్రీరామచంద్రుడు ద్వారా మనము నేర్చుకున్న గుణపాఠం ఏమిటి ?

ఒక్కభార్యతో హాయిగా సంసారం చేయడం, అలా ఉండకపోతే తన తండ్రిలా ప్రాణాలు పోగొట్టుకుంటారనీ, రావణునివలె సర్వనాశనం అవుతా రనీ నేర్పాడు లోకానికి.

### 681. భగవంతుడు మనిషిగా పుడతాడు, మనిషి భగవంతుడు కాడా?

భగవంతుడు మనిషిగా అవతరించడంలీల, మనిషి భగవంతుడు కావాలంటే తనలోని ఆత్మను సాక్షాత్కరింపచేసుకుంటే చాలు.

### 682. అక్ష హృదయం అంటే ?

జూదంలో మన ఇష్టం వచ్చినట్టు పాచికలు నడపడం. ఇందులో నలుడు ఆరితేరినవాడే, శకుని అందెవేసిన చెయ్యి.

### 683. ద్వైత సిద్ధాంతాల గురించి తెలియజేయండి.

అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము అనే మూడు సిద్ధాంతాలు ఉన్నాయి. **అద్వైతము :** ఈ సిద్ధాంతాన్ని బోధించినది ఆదిశంకరాచార్యులు. జీవుడికి,బ్రహ్మమునకు భేదములేదని, బ్రహ్మమొక్కటే సత్యము తప్ప మిగతాది అంతామిథ్య అనిపేర్కొన్నారు. జీవుడు ఆత్మజ్ఞానాన్ని పొందినపుడు

163



బ్రహ్మమును పొందుతాడని, అదేమోక్షమని ఆయన చెప్పారు. **విశిష్టాద్వైతము:** ప్రవక్త శ్రీరామానుజాచార్యులు, జీవుడు,ప్రకృతి,ఈశ్వరుడు, మూడు సత్యాలే నని చెప్పారు. ఈశ్వరుడులేనిదే జీవుడు, ప్రకృతి ఉండజాలవని, శరరీంలో జీవుడు ఉన్నట్లే ఈశ్వరుడు ఉన్నాడని, ఆయణ్ణి భక్తిప్రపత్తులతో పూజిస్తే మోక్షము పొందగలమని ఈ సిద్ధాంతంలో వివరించారు. **ద్వైతము:** ప్రవక్త శ్రీమధ్వా చార్యులు దేవునికి, జీవునికిగల సంబంధం యజమానికి, సేవకు డికి మధ్యగల సంబంధంవంటిదని, దేవునికి సేవచేయడమే జీవిత పరమార్థ మని ఈ సిద్ధాంతంలో చెప్పారు.

### 684. స్వార్థరహితంగా ఉండటం ఎలా ?

స్వార్థంలేకుండా ఏ జీవిఅయినా ఉండగలదా! స్వార్థం లేకుంటే జీవి బ్రతకలేదు. నేను, నా సంసారం, నా పిల్లలు అనేస్వార్థం లేకుండా ఉంటే కుటుంబ వ్యవస్థ నిలబడుతుందా?కుటుంబాలు కూలితే సమాజం ఉండదు. నేను ఆనందంగా ఉండాలి, నాతోటివారు ఆనందంతో ఉండాలి. మొత్తం లోకమంతా ఆనందంగా ఉండాలి అనే ఆలోచనచేయండి. దీనివలన మీలో స్వార్థంపాలు తగ్గుతుంది. కాబట్టి స్వార్థం పూర్తిగా వదలాలన్న ఆలోచనను ముందుగా పక్కన పెట్టండి. పరిమిత స్వార్థం తప్పని సరి అని గుర్తించండి.

### 685. ఆధ్యాత్మికం 12 మార్గాలు ?

1. జీవితంలో ఎలా ఎదుగుతున్నా, ఎంత వేగంగా లక్ష్యంవైపు పరుగులు తీస్తున్నా, తాను ప్రాథమికంగా మనిషినని, మానవత్వం మనిషి ముఖ్యగుణమనే విషయం మరువకూడదు. శారీరక, మానసిక ఆరోగ్యం, ప్రశాంతతను అందిం చేది వాస్తవానికి దగ్గరగా బ్రతకగలిగిన నేర్పు.

2. తమ తమ వృత్తులలో బిజీబిజీగా గడిపే చాలా మందికి మానసిక ప్రశాంతత కరువవటానికి కారణం తమ తోటివారికి దూరంగా జరగటమే. భౌతికంగాకాక, మానసికంగా ఏర్పడుతున్న ఎడంవలన ఒంటరివారవుతున్నారు. ప్రకృతికి, తోటిమానవులు, జంతువులకి మనిషికి విడదీయలేని బంధముంది. అది ఎన్నటికి వదలకూడదని చెప్పేందుకు ప్రతిజీవిలో ఉన్న ఆత్మ ఒక్కటేనన్న విశేష ఆలోచనను పెద్దలు మనకు అందించారు.

3. ఈ అనంతవిశ్వాన్ని ఒక మహత్తరశక్తి నడిపిస్తోంది. అది భగవంతుడో లేక మరొకటో అనవసరం. అయితే ప్రతిఉదయం ప్రశాంత ఉదయంగా అందిస్తున్న ఆ శక్తికి నమస్కరించి రోజును మొదలు పెట్టండి.

MOHAN PUBLICATIONS.COM

అదే విధంగా ప్రతిరాత్రి పడుకునే ముందు ఆ రోజులోజరిగిన సంఘటనలను తలచుకుని వాటిని విజయవంతంగా నడిపింపచేసిన ఆ శక్తికి కృతజ్ఞతా వందనం చేయండి.

4. ప్రభాత కాలంలో 20 నిమిషాలపాటు చల్లని, ప్రశాంత వాయువులను పీలుస్తూ అటుఇటు నడవాలి. ముఖంమీద చిరునవ్వులు చిందిస్తుండాలి. నవ్వుఅంతర్గతంగా ఎన్నోలోపాలను సరిదిద్దుతుంది. మనసును ప్రశాంతపరచ గలిగినశక్తి నవ్వుకుంది. దానిని ఉపయోగించుకోవటం మన చేతిలో పని.

5. ఆహార నియమాలు పాటించాలి. ఏదితిన్నా అది తాజాగా వండినదై ఉండాలి. అది కూడా పూర్తిగా ఉడికించినది కాక, ఓ మోస్తరు తక్కువగా ఉడికించినదై ఉండాలి. మసాలా దినుసుల వాడకం తగ్గించాలి. మనం సృష్టించే మానసిక శక్తికి మూలం ఆహారం అందించేశక్తి, ఈ మూల పదార్థం మెరుగ్గా ఉంటే శక్తి కూడా చక్కనిదై ఉంటుంది.

6. ఆహారపు నియమంతోపాటు నిద్రకి నియమం అవసరం. ప్రతిరోజు నిర్ణీత సమయంలో పడుకుని వేకువ జామునే లేవటం అలవాటుచేసుకోవాలి. అనంత విశ్వంలో మీరు ఒకభాగం. ఆ అనంతవిశ్వంలోని మిగిలిన అంశాలతో మీకు సంబంధం ఉంటుంది. ఆబంధాన్ని బలపరచేది ఆధ్యాత్మిక చింతన. ప్రతి ఉదయం ప్రశాంత వాతావరణంలో, శుభ్రంగా స్నానంచేసి ఆధ్యాత్మిక చింతనను పెంచేగ్రంథాలను పఠించండి. అవి మరతపరమైనవైనా లేదా మహానుభావుల ప్రవచనాలైనా ఎటువంటివైనా పరవాలేదు.

7. ప్రకృతితో మీఅనుబంధం మరింతగా పెంచుకోండి. ప్రకృతి మూలాల నుండే జీవంపుట్టింది. అందులోనే మళ్ళీ జీవులు కలిసిపోతాయి. తాత్కాలికంగా లభించిన ఆలోచనలు, వియాలను చూసుకుని ప్రకృతికి వ్యతిరేకంగా ఎవ్వరూ తయారుకాకూడదు. ఉదయంవేళ మొక్కలతో సమయం గడపండి. మొక్కలతోపాటు చుట్టూకనిపించే చిన్న,పెద్ద జంతువులను గమనిస్తూ,వాటికి ఆహారం అందిస్తూ, మానసికప్రశాంతత అందుకోవడానికి ప్రయత్నించండి?

8. ధ్యానంకున్న శక్తిని మనుషులు మధ్యలో మరచి పోయారు. ప్రతిరోజు ఉదయం ధ్యానంతో రోజువారి పనులను ప్రారంభించటం ఎంతో మేలు చేస్తుంది. మనసుపడుతున్న ఒత్తిడిని పక్కకు నెట్టివేయగలిగిన శక్తి





ధ్యానానికి ఉంది. ముఖ్యంగా నేటి ఉద్యోగాలలో ఒత్తిడి భాగమైంది. ఈ ఒత్తిడిలో కొంత సహజమైంది.

9. ప్రతిరోజు ఉదయం, సాయంత్రం ప్రార్థనచేయటం అవసరం. ప్రార్థన అనగానే ఏదో ఒక మతపరమైన అంశంగా పరిగణించకూడదు. ప్రార్థనలు మనసును తేలికపరిచే సాధనాలు. మనం ఎంత వద్దనుకున్నా ఏదోఒకరకమైన ఒత్తిడికి గురవుతుంటాం. మనసును వేధించే అంశాలలో కొన్నిఅర్థంలేనివి. పట్టించుకోవాల్సిన అవసరం లేకపోయినా పట్టించుకునేవి. అటువంటివి వదిలించగలిగిన మరోమార్గం ఏదీలేదు. దీనికి మానవశక్తిని మించిన మరోశక్తి తోడ్పడాల్సిందే. ఆ తోడ్పాటును అందించేవి ప్రార్థనలని తెలుసుకోండి. ఊహకు అందని ఎన్నోఅంశాలను సాధించి పెట్టేలాగా చేస్తాయి. ప్రార్థనలు వాటిని విశ్వసించి అనుసరిస్తే తేడాను అతిసులభంగా అర్థం చేసుకుంటారు. ఎంతో మంది విజేతలు ప్రార్థనను విరివిగా ఉపయో గించుకున్నదే.

10. ప్రార్థన బిగ్గరగా చేస్తారు కొందరు. మౌనంగా చేసేవారు మరి కొందరు. మౌనంలోచేసే పనుల్లో మరెంతో శక్తి ఉందనిపిస్తుంది. అందుకేనేమో మహాత్మాగాంధి వారంలో ఒకరోజు మౌనం పాటించేవారు. ప్రసిద్ధ గురువులు ఇదేపద్ధతి పాటించేవారు. ప్రసిద్ధి గురువులు ఇదేపద్ధతి పాటించేవారు. రోజంటా మౌనంగా ఉండటం సాధ్యంకాకపోయినా కనీసం 20 నుండి 30నిమిషాలు మౌనానికి కేటాయించాలి. కేవలం శ్వాసమీద దృష్టి నిలిపి చేసే 'మౌనవ్రతం' ఇతర వ్రతాలన్నింటికన్నా మేలైనది.

11. స్పందన అనేది సహజం. అయితే స్పందించే తీరు అందురిలో ఒకలా ఉండదు. మీకు ఓ ప్రత్యేకతతెచ్చేది మీ స్పందన విధానం. ఏ అంశం మీద అయినా తక్షణం స్పందించాలనుకోవద్దు. కొద్దిసేపు ఆగి స్పందించటం వల్ల ఎంతో మేలు జరుగుతుంది. స్పందనకు ముందు మీరు తీసుకునే సమయం రెండు నిమిషాలే కావచ్చు. కాని ఆ కొద్దికాలమే అద్భుతమైన తేడానుతెస్తుంది. కొత్త ఆలోచనలను మీ ముందుంచుతుంది. మంచి, చెడులకు మధ్య ఉన్నతేడాను తెలుసుకుంటారు.

12. నీ స్నేహితులెవరో చెపితే నీ గుణగుణాల గురించి చెపుతా అన్నది తెలుగు నానుడి. ఇతి అక్షరసత్యం, మంచి ఆలోచనలు, మంచితనం కలిగిన వారితోనే స్నేహం చేయండి, సహనం,దయ,కరుణ, కలిగినవారితోనే

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

తిరుగుతుండండి. దీనినే మనపెద్దలు 'సత్సంగం' అంటారు. సత్సంగంలో అందరితో కలిసి అద్భుతంగా మీరు కూడా ఎదగగలుగుతారు.

**686. మద్వయ పురాణాల్ని వివరించండి ?**

మద్వయ పురాణాలు రెండు. మత్స్య పురాణం. మార్కండేయ పురాణం. **మత్స్యపురాణం :** దీనిలో 14,000 శ్లోకాలు ఉన్నాయి. మత్స్యావతారం ఎత్తిన విష్ణువుచే మనువుకు బోధింపబడింది. కార్తికేయ,యయాతి, సావిత్రుల చరిత్రలు, ధర్మాచరణాలు, ప్రయాగ, వారణాసి తదితర పుణ్యక్షేత్రాల మహాత్మ్యాలు దీనిలో పూర్తిగా వివరించారు.

**మార్కండేయ పురాణం :** దీనిలో 9,000 శ్లోకాలు ఉన్నాయి. మార్కండేయ మహర్షి చెప్పినది. శివ, విష్ణువు మహాత్మ్యాలు, ఇంద్ర, అగ్ని, సూర్యుల మహాత్మ్యాలు, సప్తశతి లేదా దేవీ మహాత్మ్యం ఉన్నాయి. చండీహోమం, శతచండీ, సహస్రచండీ హోమ విధానానికి ఈ సప్తశతియే ఆధారం.

**687. ఉగాది పచ్చడి సేవించడంలోని అంతరార్థం ఏమిటి ?**

నిజానికి ఉగాదిపేరు చెప్పగానే గుర్తుకు వచ్చేది ఉగాది వేపపువ్వు పచ్చడే. ఉగాదిపచ్చడి తినడంలో కూడా ఎన్నెన్నో అర్థాలు ఉన్నాయి. కొత్త సంవత్సరంలో అనుభవించబోయే శీతోష్ణ సుఖ దుఃఖాలను, లాభనష్టాలను, నిందాస్తుతులను (శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో చెప్పినట్లుగా సుఖదుఃఖే సమే కృత్వాలాభా లాభౌ...తుల్యానిందా స్తుతిర్మౌనీ..) ఈ పచ్చడిని సంకేతంగా అభివర్ణిస్తారు. వీటిని జీవితంలో సమదృష్టితో చూడాలనీ చెబుతోంది. అంతేగాక ఆయాఋతువుల్లో (వచ్చే వేడి,ఉష్ణం,శీతలం,చలి...) అనుభవించబోయే వాటిని ఉగాదిపచ్చడి రూపంలో స్వీకరించి చవిచూడమని చెబుతోంది. ఈఉగాది పచ్చడికి ఔషధగుణాలు లేకపోలేదు. దీనిని సేవించడం వలన అనేక దీర్ఘకాలిక వ్యాధులు శాంతిస్తాయని, మనిషికి అన్నివిధలా ఆరోగ్యన్నిస్తాయని విశ్వాసం.

**688. మరణించినవారు స్వప్నంలో కనబడడానికి కారణం ఏమిటి?**

ఫలానా కారణంవల్ల చనిపోయినవారు స్వప్నాల్లో కనిపిస్తారని చెప్పలేం. బంధుత్వం, మరణించిన వ్యక్తిపై ఉన్న మమకారం, ప్రేమవల్ల వారిదర్శనం అవ్వవచ్చును. ఇది కలలు కనేవారి స్వభావంపైన ఆధారపడి ఉంటుంది. మహాత్ముల జీవితాల్లో ఇలాంటివి సంభవించాయి. ఉదాహరణకు స్వామి వివేకానంద పరివ్రాజకులుగా ఘాజీపూర్ వెళ్ళారు. శరీరాన్ని దృఢపరచుకోవ




డానికి పవహారీ బాబావద్ద హఠయోగ సాధనచేద్దామనుకున్నారు. ఆయనను గురువుగా స్వీకరిద్దామని అనుకొన్నారు. అయితే శ్రీరామకృష్ణ పరమహంస గారు స్వామి వివేకానందజీకి స్వప్నంలో అనేకసార్లు దర్శనమిచ్చారు. అప్పుడు తననిర్ణయం సరైనదికాదనీ, దీనికి శ్రీరామకృష్ణుల అనుజ్ఞలేదనీ వివేకానంద స్వామి పవహారీ బాబావద్ద నుంచి యోగసాధన నేర్చుకోలేదు. మరణించిన జీవులు స్వప్నంలో కనబడడానికి అనేక కారణాలు ఉంటాయి.

**689. త్రికరణాలు, త్రికరణశుద్ధి అంటే ఏమిటి ?**

మనస్సు, వాక్కు, శరీరం అనేవి త్రికరణాలు. అంటే మూడు కణాలు అని అర్థం. ఇవి పరిశుద్ధంగా వుండాలి. వీటిలో ఎటువంటి మాలిన్యం వుండరాదు. ఇవి ఒకదానికొకటి సంబంధం కలిగివుంటాయి. మనస్సులో కలిగే అభిప్రాయాలను ప్రకటించేది వాక్కు. మనస్సు అంగీకరించే కార్యాన్ని నిర్వహించేది శరీరం. అవి ఎంత శుద్ధంగా వుంటే మనిషి అంతగా రాణిస్తాడు. మనస్సు నిర్మలంగా, వాక్కు సత్యంతోనిండి, ప్రియంగా వుండాలి.

**690. వేదా దేవతల రూపాలు ఉన్నాయా ?**

ప్రపంచంలో ప్రతి అంశానికి అధిష్ఠానదైవాలు ఉంటాయి. నదులు, పర్వతాలవంటి వాటికీ దివ్యదేహాల దేవతా రూపాలున్నాయి. అదేవిధంగా ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదాలకూ దేవతా రూపాలు ఉన్నాయి. ఆ యా వేదాలలో ఉండే లక్షణాలు ఆరు మూర్తులో కనిపిస్తాయి.

**ఋగ్వేదదేవత :** తెల్లనిరంగుతో రెండుచేతులతో ఉంటుంది. గాడిద ముఖంగలది. అక్షరమాల ధరించి, సౌమ్యముఖంతో ప్రీతిని ప్రకటించే వ్యాఖ్యానం చేసే ప్రయత్నంలో ఉంది. **యజుర్వేదదేవత :** మేక ముఖంతో పసుపు పచ్చని రంగుతో, జపమాలను ధరించి, ఎడమచేతిలో వజ్రాయుధం పట్టుకొని ఉంటుంది. ఐశ్వర్యాన్ని శుభాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది. **సామవేదదేవత :** గుర్రం ముఖంతో నీలి శరీరంతో ఉంటుంది. కుడిచేతిలో అక్షరమాల, ఎడమచేతిలో పూర్ణకుంబాన్ని పట్టుకుని ఉంటుంది. **అధర్వ వేద దేవత :** కోతిముఖంతో తెల్లనిరంగుతో ఉంటుంది. ఎడమచేతిలో జపమాల, కుడి చేతిలో పూర్ణకుంభాన్ని పట్టుకుని ఉంటుంది.

**691. అమృతం సేవించిన దేవతలకు నైవేద్యం దేనికి ?**

ఆలయాల్లో వుండే దేవతలు అమృతం తాగినవారుకాదు. అమృతం అందించినవారు. ఆలయాలలో మనంచేసే నివేదనలు ఆ విగ్రహాల

MOHAN PUBLICATIONS.COM

ఆరగింపుకు కాదు, ఆ విగ్రహరూపంలోవున్న దైవం అనుగ్రహించి మనకు అందజేసిన ఆహారాన్ని ఆ దైవానికి నివేదన చేసి మనం ఆరగించడానికి.

## 692. వివిధ రకాల కాలసర్పదోషాలు అనగా ఏమిటి ?

1. లగ్నం నుండి ఏడవస్థానం వరకు రాహు, కేతుగ్రహాల మధ్య మిగతా 7గ్రహాలు ఉంటే "అనంతకాలసర్పదోషం" దీనివలన వైవాహిక జీవితంలో, ఆరోగ్య విషయంలో సమస్య ఉటుంది.

2. జాతకచక్రంలో లగ్నం నుండి రెండవ స్థానము నుండి ఎనిమిదవ స్థానము వరకు రాహుకేతువుల మధ్య మిగతా గ్రహాలు ఉంటే "గుళిక కాల సర్పదోషం" దీని వలన ఆర్థిక, కుటుంబ సమస్యలుంటాయి.

3. మూడవస్థానం నుండి తొమ్మిదవ స్థానం వరకు రాహు, కేతుగ్రహాల మధ్య మిగతా7 గ్రహాలు ఉంటే "వాసుకి కాలసర్పదోషం" దీనివలన సోదర, బంధువర్గం వారితో సమస్యలు ఉంటాయి.

4. నాల్గవస్థానం నుండి పదవస్థానం వరకు రాహుకేతువుల మధ్య మిగతా 7 గ్రహాలు వుంటే "శంఖపాలకాలసర్పదోషం" దీనివలన తల్లి, స్థల, గృహ, వాణముల సమస్యలుంటాయి.

5. ఐదవస్థానం నుండి 11వస్థానం వరకు రాహుకేతువుల మధ్య మిగతా7 గ్రహాలుఉంటే "పద్మకాలసర్పదోషం" దీనివలన అనారోగ్యం, ఋణం, శత్రువుల సమస్యలుంటాయి.

6. ఆరవస్థానం నుండి పన్నెండవ స్థానం వరకు రాహు కేతువుల మధ్య మిగతా 7 గ్రహాలు ఉంటే "మహాపద్మకాల సర్పదోషం" దీనివలన వ్యాపారంలోను జీవిత భాగస్వామితోను సమస్యలుంటాయి.

7. ఏడవ స్థానంనుండి లగ్నం వరకు రాహు, కేతువులు మధ్య మిగతా 7 గ్రహాలు ఉంటే "తక్షక కాలసర్పదోషం" వ్యాపారంలో, జీవితభాగస్వామితో సమస్యలు.

8. ఎనిమిదవ స్థానం నుండి రెండవ స్థానం వరకు రాహు,కేతువల మధ్య మిగతా 7 గ్రహాలు ఉంటే "కర్కోటకకాల సర్పదోషం" దీనివలన భార్య వలన, ప్రమాదాల వలన సమస్యలుంటాయి.

9. తొమ్మిదవ స్థానం నుండి మూడవస్థానం వరకు రాహు, కేతువుల మధ్య మిగతా 7 గ్రహాలు వుంటే "శంఖచూడకాల సర్పదోషం" దీనివలన తండ్రి, నాస్తికత్వం, దురదృష్టం, గురువువలన సమస్యలు ఉంటాయి.

10. పదవస్థానం నుండి నాల్గవ స్థానం వరకు రాహు, కేతువుల మధ్య మిగతా7 గ్రహాలు వుంటే "ఘటకకాల సర్పదోషం" దీనివలన ఉద్యోగంలోను, వ్యాపారంలోను సమస్యలు ఉంటాయి.

11. పదకొండవ స్థానం నుండి ఐదవస్థానం వరకు రాహు, కేతువుల మధ్య మిగతా7గ్రహాలు ఉంటే "విపక్షకలసర్పదోషం" దీనివలన లాభనష్టాల లోను, మరియు వ్యాపార లావాదేవీలలోను సమస్యలు ఉంటాయి.

12. పన్నెండవ స్థానం నుండి ఆరవస్థానం వరకు రాహు,కేతువుల మధ్య మిగతా 7 విగ్రహాలు ఉంటే "శేషనాగకాలసర్పదోషం" దీనివలన అధిక ఖర్చువలన, శత్రువుల వలన సమస్యలు ఉంటాయి.



## 693. కాలసర్పదోషానికి నివారణామార్గాలు ఏమిటి ?

1. శ్రీకాళహస్తివెళ్ళి రాహు, కేతు సర్పదోష పరిహారము చేయించుకొని, మినుములు,కందులు,ఉలవలు దానంచేయడం, దుర్గ, పాతాళ వినాయకుని పూజించడం. 2. బంగారం లేదా వెండితో నాగపడగ చేయించి, ఏకాదశ రుద్రాభిషేకానంతరం ఆ పడగను బ్రాహ్మణులకు దానం ఇవ్వడం ద్వారా దోషం పోతుంది. 3. వెండితో సర్పాకారఉంగరం చేయించి వేలికి ధరించ డం. 4.ఏదైనా సుబ్రహ్మణ్య క్షేత్రంలో 108 ప్రదక్షిణలుచేసి దేవునికి వెండి పడగ సమర్పించడం. 5. కుజ, రాహు, కేతు గ్రహాలకు విడివిడిగా జపాలు చేయించి గ్రహదానాలు చేయడంద్వారా కాలసర్పదోషం నివారణ అవు తుంది. మంచి జరుగుతుంది.

## 694. వరాహ పురాణంలో ఏమి ఉన్నది?

శ్రీకృష్ణుడు, శివునిగురించి తపస్సు చేయడం, శివుని గొప్పదనాన్ని, మహత్యాన్ని చాటడం వంటి సందర్భాలు వరాహపురాణంలో కనిపిస్తాయి. జాంబవతి కోరిక మీద పుత్రార్థియై కృష్ణుడు, శివభక్తుడైన ఉపమన్యు ఉపదేశం ప్రకారం ఈశ్వరుని గురించి తపస్సుచేసి శివసాక్షాత్కారాన్ని పొందడం, శివుడు ఎంతో ప్రేమతో కృష్ణుని కైలాసానికి తీసుకునిపోవడం, అక్కడ కొంతకాలం వినోదిస్తూ ఉండగా, కృష్ణుడు లేని కారణాన ద్వారకను రాక్షసులు ముట్టడించడం, బలరాముడు నారదుని ద్వారా కృష్ణుని జాడ తెలుసుకొని, గరుత్మంతుని కైలాసా నికి పంపడం, కృష్ణుని రాకతో రాక్షసులు పారిపోవడం వంటి సంఘటనలు వివరంగా ఉన్నాయి. అనంతరం జాంబవ తికి సాంబుడు జన్మించాడు.



MOHAN PUBLICATIONS.COM

ఒకనాడు మార్కండేయ మహాముని ద్వారకకు రాగా, శ్రీకృష్ణుడు అతిథి సత్కారాలుచేసి, తనకు ఆత్మయోగాన్ని బోధించమని కోరడం, మార్కండేయుడు అన్నియోగాలు శ్రీకృష్ణుని కోసమేనని, యోగమయ పురుషుడైన శ్రీకృష్ణునికి చెప్పగలవాడను కాననిచెప్పి, శివలింగోద్భవ గాథను తెలుపమని కృష్ణుడినే మార్కండేయుడు కోరాడు. ఆ సందర్భంలో కృష్ణుడు శివలింగోద్భవాన్ని గురించి తెలుపుతూ ప్రళయంలో అంతా నశించి జలమయంగా అంధకారంలో ఉండగా, తాను విరాడ్రూపంలో వెయ్యితలలు, వెయ్యి చేతులు, వెయ్యిముఖాలు కలిగి జలంమీద పడుకుని నిద్రించి ఉండగా బ్రహ్మారావడం సంభవించిందనీ తను, బ్రహ్మ, ఆ లింగానికి ఆద్యంతాలు కనుక్కోలేక శివుని స్తోత్రంచేయగా, నిజరూపంలో పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యాడనీ బ్రహ్మ విష్ణువు ఈశ్వరుని నుండి పుట్టిన వారేనని కృష్ణుడు మార్కండేయుడికి తెలిపాడు.

### 695. భవిష్యపురాణంలో ఏమి ఉన్నది ?

ఈపురాణం శతానీకుడనే రాజుకు సుమంతుడు తెలుపుతున్నట్లుగా ఉంది. చంద్రభాగానది ఒడ్డున సాంబపురం ఆదిత్యునికి శాశ్వత స్థానమని చెప్పిన సుమంతునితో, శతానీకుడు సాంబుని గురించి చెప్పమనడంవల్ల సుమంతుడు కృష్ణుని కొడుకైన సాంబుని చరిత్రను తెలుపుతున్న సందర్భంలో కృష్ణ ప్రసక్తి కనిపిస్తుంది. సుమంతుడు, 'ద్వాదశాదిత్యులలో ఒకడైన విష్ణు దేవుడు వాసుదేవుడై భూలోకంలో జన్మించాడనీ, జాంబవతికి వాసుదేవునికి పుట్టిన సాంబుడు కృష్ణుని శాపంచేత కుష్ఠురోగిఅయి, తనపేరుగల పట్టణాన్ని కట్టించి, ఆదిత్యుని స్థాపించి పూజించాడనీ చెప్పాడు. సౌందర్య మదగర్వంతో దుర్వాసుని ఎగతాళిచేయడం, నారదుని తిరస్కరించి అవినయంగా ప్రవర్తించడంతో సాంబుని కుష్ఠురోగివి కమ్మని కృష్ణుడు శపించాడు.

అష్టాదశ పురాణాలలో బ్రహ్మ,బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, పద్మ, విష్ణు, నారద, మార్కండేయ, అగ్ని, మత్స్య, కూర్మ,స్కాంద,వరాహ,భవిష్యత్ పురాణాలలో కృష్ణప్రసక్తి కనిపిస్తుంది. ఆయాపురాణాలలో శ్రీకృష్ణుని జీవిత ఘట్టాలలో ప్రధానాంశాలు ఒకేవిధంగాఉన్నా మిగిలిన అంశాలలో కొద్దికొద్ది మార్పులు, తేడాలు గోచరిస్తున్నాయి. కొన్నిటిలో గోలోకవాసి శ్రీకృష్ణుడే భూలోకంలో అవతరించినట్లు, మరికొన్నిటిలో నారాయణుడే కృష్ణుడుగా అవతరించినట్లు, మరికొన్నిటిలో నారాయణుడే కృష్ణుడుగా అవతరించినట్లు ఉన్నది. కొన్ని పురాణాలు శ్రీకృష్ణునిజీవితాన్ని సంపూర్ణంగా క్షుణ్ణంగా వర్ణిస్తే,





మరికొన్ని పురాణాలు క్లుప్తంగాతెలియపాయి. కొన్నిటిలో గోలోకవాసి అయిన కృష్ణునికి అత్యంత ప్రియురాలు అయిన రాధాదేవి కూడా బృందావనంలో అవతరించినట్లు చెబితే, కొన్నిటిలో రాధ ప్రసక్తేలేదు. ఇటువంటి వ్యత్యాసాలకు కారణాలను పరిశీలించి నట్లయితే, కొన్ని విషయాలు అర్థం అవుతాయి. శ్రీకృష్ణుని చరిత్రలో కనిపించే తేడాలకు కల్పభేదం అనేది ప్రధాన కారణం.

కృష్ణావతారం ప్రతికల్పంలోనూ జరుగుతుంది. కనుక ఆయా కల్పాలలోని కృష్ణావతారం గురించిన లీలలోనూ తేడాలు కొద్దిగాఉండడం సహజం. ఆ తేడాలే ఆయా పురాణాలలో కనిపించడం జరిగింది. అయితే స్వయంభగవానుని పూర్ణావిర్భావం మాత్రం సారస్వత కల్పంలోనే జరుగుతుంది. ఇందులో సమస్త అంశ కళలు సమావేశం అయి ఉంటాయి. ఆ భగవానుని పూర్ణావిర్భావం ఈ కలియుగానికి పూర్వం జరిగిన ద్వాపరంలో జరిగినట్లు వ్యాసభగవానునిచేత శ్రీమద్భాగవతంలో వర్ణితమైనది. ఆయా పురాణాలలో కనిపించి భాగవతంలో కనిపించని పాత్ర రాధాదేవిది. కృష్ణునికి అత్యంత ప్రియురాలుగా, శ్రీకృష్ణునికి అభిన్నంగా పురాణలలో వర్ణితమయిన రాధ భాగవతంలో చోటు చేసుకోక పోవడానికి కారణమేమిటనేది చాలా మందికి కలిగే సందేహమే.

బృందావనంలోని ఒక్కొక్క గోపికలోనూ సంపూర్ణంగా రాధస్వభావం నిండి ఉంది. ప్రతిగోపిక రాధాతత్త్వాన్ని కలిగివుంది. వాస్తవానికి రాధే ఇన్ని రూపాలలో గోపికలుగా ప్రకటితమయినది. కనుకనే శ్రీకృష్ణుడు ఒక్కొక్క గోపికకు (రాధికకు) ఒక్కొక్క కృష్ణునిగాఅయి రాసక్రీడ జరిపాడు. ద్వాపరంలోని గోపికలేకాక శ్రీకృష్ణ నికి త్రికరణశుద్ధిగా సమర్పితమయి శ్రీకృష్ణునే సర్వస్వంగా భావిస్తూ, మధురభావనతో శ్రీకృష్ణునిసేవచేసే ప్రతిజీవి స్త్రీపురుష భేదంలేకుండా రాధాస్వరూపమే. భాగవతంలో రాధపేరు మాత్రమేకాదు ఏగోపిక పేరూ చెప్పలేదు. భాగవతంలో రాధ ఒక వ్యక్తిగాకాక గోపికా స్వరూపాలలో వ్యాపించి ఉందనడంలో ఎటువంటి ఆక్షేపణాఉండదు.

### 696. రాముని సకలగుణసంపన్నుడని అంటారు. ఇంతకీ ఆయనలోని సుగుణాలేమిటి ?

సకలగుణ సంపన్నుడైన శ్రీరామచంద్రుడిలో సహనం మేరుపర్వతమంత ఉన్నతమైనది. మహారాజులు, చక్రవర్తులలో ఈగుణం తక్కువగా ఉంటుంది. మానవజాతికి ఆదర్శపురుషుడుగా అవతరించిన రాముడు,

MOHAN PUBLICATIONS.COM

తను మహారాజుగా పట్టాభిషిక్తుడవుతున్నానని తెలిసినా పొంగిపోలేదు. ముందురోజు రాత్రి గురువుల ఆదేశానుసారం ఉపవాస నియమంతో అధశ్శమనంతో మౌనంగా గడిపాడు. అక్కడ కైకేయి అంతఃపురంలో మంధర మాట విని తనకొడుకు భరతుడే రాజుకావాలని, రాముడు పధ్నాలుగేళ్ళు అరణ్యానికి వెళ్ళాలని పట్టుబట్టింది. పట్టాభిషేకానికి అలంకృతుడైన రాముడిని పిలిపించి ఈవిషయం చెప్పారు. శాంతమూర్తి అయిన రాముడు వింటూనే రాజలాంఛనాలన్నీ తీసేశాడు. ఉత్తరీయం కూడా అక్కడ ఉంచి సంతోషంగా "అమ్మా!నాన్నగారికి నామీద ఎంతఅనురాగంఉందా? నిరంతరం రాజ్యపాలనతో, సమస్యలతో సతమత మవకుండా అర ణ్యంలో పుణ్యపురుషులైన మహర్షుల సన్నిధానంలో పరతత్వాన్ని ఉపాసించే అవకాశం అనుగ్రహించారు" అని కొనియాడాడు. "అన్నయ్యా, ఈరాజ్యం నీకు దక్కకుండా చేసేవారిని నా కరవాలానికి బలిఇస్తా"ననితమ్ముడు లక్ష్మణుడు ఆగ్రహంతో నిప్పులు చెరగ్గా, శ్రీరాముడు 'శాంతం' అంటూ ఎంతో ఓర్పుగా అతనిని సముదాయించాడు.

అరణ్యవాసంలో రాముడు భరించిన కష్టం, చూపిన ఓరిమి అంతా ఇంతాకాదు. హంసతూలికాతల్పం, అనుచరగణం, దాసదాసీలతో భోగభాగ్యాలు అనుభవించాల్సిన మహారాజు, కందమూలాలు తింటూ, రాతి నేలమీద పడుకున్నాడు. ఎముకలు కొరికే చలిలో, ఎండావానల్లో సర్వకాల సర్వావస్థల్లో రాముడు ఓర్పును వీడలేదు. సహనాన్ని కోల్పోలేదు. పలుమార్లు లక్ష్మణుడు అన్నయ్యా మనకు ఇదేం గతి అంటూ అసహనంతో కైకేయిని దూషించినా, అలా అనడం తప్పు అని ఓదార్చిన శ్రీరామచంద్రుని ఓర్పు, సహనం అనితరసాధ్యం. అందుకే ఆయన సకల గుణాభిరాముడు.

### 697. ఆంజనేయ అనుగ్రహం కోసం ఏం చేయాలి ?

ఆంజనేయుని పూజిస్తే సర్వదేవతలను పూజించి నట్లే. వైశాఖ బహుళ దశమి పూర్వాభాద్ర నక్షత్రం శనివారంనాడు జన్మించాడాయన. అందుకే శ్రీ ఆంజనేయ స్వామిభక్తులు, ఆయనను శనివారంనాడు ప్రత్యేకంగా పూజిస్తారు.ఆంజనేయ ఉపాసనతో కుజ, రాహు, శనిదోషాలు తొలగిపోతాయి. సర్వశత్రు వులను నివారించి, సంహరించి భక్తులను రక్షించే కొంగుబంగారం ఆయన, ఆంజనేయుని ఆరాధించడంవల్ల మనకు లభించే ఫలితాలను ఈ క్రింది శ్లోకంలో.





బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్స్మరణాద్భవేత్

ఇక్కడ చెప్పబడిన ఫలితాల క్రమం చాలా ముఖ్యమైంది. మొదట బుద్ధి చెప్పబడింది. ఆంజనేయుని ఆరాధించడంవల్ల సద్బుద్ధి సమకూరుతుంది. బుద్ధిసరిగ్గా వుంటే, మిగతా విషయాలన్నీ వాటంతటవే సరిగా ఉంటాయి. బుద్ధితర్వాతనే బలం, ఆంజనేయుని భజిస్తే కీర్తి, ప్రతిష్ట, ధైర్యం, వాక్చాతుర్యం, మంచిఆరోగ్యం...ఇలా ఎన్నోసిద్ధిస్తాయి.ఆంజనేయుడు తనను కొలిచిన వారికి బుద్ధిని, మనోబలాన్ని, ఇంకా ఇతరశక్తుల్ని ప్రసాదిస్తాడు. అందుకే ప్రతిఒక్కరూ ఆస్వామిని ప్రార్థించి, ఆయన అనుగ్రహానికి పాత్రులైతే సర్వసౌఖ్యాలతో వర్ధిల్లుతారనడంలో ఏమాత్రం సందేహం లేదు.

### 698. దైవానికి ఎట్ట ఎదుట నిలబడి నమస్కరించవచ్చా ?

గుడిలో మనం పూజించే దైవానికి ఎట్టఎదుట నిలబడి నమస్కరించడం సరికాదని పెద్దల ఉవాచ. ఎదురుగా నిలబడి మాటాడుతావా అనే మాటను మనం తరచూ వింటూంటాం. మనకంటే తక్కువస్థాయిలో ఉన్నవాడూ, చిన్న వాడూ ఎదురుగా నిలబడి మాట్లాడ్డం అవిధేయతగా భావిస్తాము. సమాన స్థాయిలో ఉన్నవారే ఎదుట నిలబడి మాట్లాడు కొంటాము.

దైవంముందు లోకమంతా చిన్నదే. ఇక కోటను కోట్ల జీవులలో మన స్థానం, మన స్థాయి అత్యల్పమైనది. అందుకే దైవం ఎట్ట ఎదుట నిలబడి నమస్కరించడం సరికాదన్నారు పెద్దలు. అయితే దైవానికి నమస్కరించే పద్ధతి ఎలాగుండాలి అనే సందేహం చాలామందికి కలుగుతుంది.

దేవుడి విగ్రహానికి కుడివైపున పూజారి ఉండి పూజలు నిర్వహిస్తూ ఉంటాడు. ప్రదక్షిణ విధానముగా దేవుని పూజాద్రవ్యాలు సమర్పిస్తూ హారతి పడుతాడు. ఈకార్యక్రమం పూజారి దేవునికి కుడివైపున ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. ఈ స్థితిలో భక్తులు దేవునికి ఎదుట ఎడమ ప్రక్కన ఉండాలి. అలా ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. ఈ స్థితిలో భక్తులు దేవునికి ఎదుట ఎడమప్రక్కన ఉండాలి. అలాఉన్నప్పుడు దైవమూ,అర్చనా కార్యక్రమాలు స్పష్టంగా కనబడుతాయి.అర్చన సందర్భంలో భక్తులు అధికంగా ఉంటే ఈ పద్ధతి కుదరదు. దైవానికి కుడి, ఎడమప్రక్కల భక్తులు చేరిపోవలసి వస్తుంది. దానిని దోషంగా పరిగణించకూడదు. అవసరసమయంలో అనుకూల్యతను అనుసరించమని చెప్పారు పెద్దలు.ఇక్కడ మరొక విషయాన్ని

MOHAN PUBLICATIONS.COM

కూడా గమనించాలి మనం. దైవవిగ్రహం మన దృక్మార్గాని కంటె ఎత్తయిన పీఠం మీద నెలకొల్పబడి ఉంటే ఎట్టఎదుట నిలబడి నమస్కరించడంలో ఆ దోషంలేదు. ఎత్తయిన పీఠంపై భగవంతుడు ఉన్నప్పుడు మనంఎదుటగా నిలబడితే ఆయన పాదాల మీద మనదృష్టిపడుతుంది. అలా మనంఎదుట నిలబడి నమస్కరించడ మంటే దేవుని పాదాలకు నమస్కరించనట్లవుతుంది.

దైవవిగ్రహం ఆపాదమస్తకం (పాదాలనుండి తలవరకూ) లేకపోయిన పాదాలస్థానం మారదు. గ్రామదేవత మూలవిరాట్టు శీర్షం మాత్రమే. ఈ విష యాన్ని గ్రహింపులో పెట్టుకొని దేవతలకు నమస్కారములు చేయాలి.

## 699. తీర్థ ప్రసాదాల పరమార్థమేమిటి ?

తీర్థం : భక్తులుతాము పూజించే దైవంనుండి ముఖ్యంగా ఆరోగ్య ఐశ్వర్యలను కోరుకొంటారు. ఒక్కో గుడిలో ఒక్కోదైవాన్ని ప్రతిష్ఠించి పూజిస్తుం టారు. ఒకగుడిలో ఎందరు దేవతలను నెలకొల్పినా, ప్రధానదైవం ఒకరేనని ఆ దైవం పేరుతోనే ఆ గుడిని పిలుస్తుంటారు. అర్చకుడు తీర్థం ఇచ్చేటప్పుడు ప్రధానదైవం పేరు మీదుగానే మంత్రంపఠించి ఇస్తాడు. విష్ణుదేవాలయాలలో పూజారి తీర్థాన్ని ఇస్తూ పఠించే విధమిది.

అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణం
సమస్తపాపక్షయకం శ్రీవిష్ణుపాదోదకం పావనం శుభం.

శివాలయంలో పూజారిపై మూడు వాక్యాలు చెప్పి, కడపటిపాదం "శ్రీశంకరపాదోదకం పావనం శుభం"అని పఠిస్తూ తీర్థమిస్తాడు.

ప్రసాదం : దేవుడి నివేదనకు పెట్టిన నైవేద్యాన్ని భక్తులకు ఇస్తాడు. పూజారి దేవుడికి అర్పించిన నైవేద్యం తిరిగి భక్తులకు చేరుతూ దైవ ప్రసాద మయింది. ప్రసాదాన్ని ఇచ్చేటప్పుడు పూజారి ఇలా పఠిస్తూ ఇస్తాడు.

ప్రసాదం శిరసాగృహ్ణామి సంతత శ్రీరసు సమస్త సన్మంగళానిభవంతు
నిత్య శ్రీరస్తు నిత్యమంగళానిభవంతు"

## 700. జంట అరటి పళ్ళు తినవచ్చా ?

కలసిన పండ్లు ఇవ్వడం తప్పు కాదా అనే మాటను ఎక్కడా చెప్పలేదు. కాబట్టి జంటగా కలసిన అరటిపండ్లు ఇచ్చిన దోషం లేదు. మామూలు కంటే తేడా కనబడే పండ్లను దేవుడికి సమర్పించడం మంచిదికాదు. అనే ఉద్దేశాన్ని కలిగించినది మధ్యలో ఎవరో తెలిసీ తెలియకుండా ఏర్పరచిన సాంప్రదాయం. అయితే అవకాశం ఉన్నంతవరకూ దోషంలేనిపండ్లు ఏ





తేడాలేని వాటిని సమర్పించాలి. తప్పనిసరి పరిస్థితిలో వీటిని సమర్పించినా తప్పులేదు. వాటిని తిన్నా తప్పులేదు. అందువల్ల జంట అరటిపండును తిన వచ్చు తప్పులేదు. దానిని దేవునికి సమర్పించవచ్చును.

## 701. ద్రౌపది జన్మవృత్తాంతం ఏమిటి ?

బ్రాహ్మణ వేషంలోనున్న అర్జునుడు మత్స్య యంత్రాన్ని ఛేదించాడు. ద్రౌపది అర్జునుడి మెడలో వరమాలను వేసింది. అనంతరం పాండవ సోదరులంతా ద్రౌపదిని వెంటబెట్టుకుని ఇంటికిచేరి, తల్లి కుంతీదేవితో 'అమ్మా! నీ బిడ్డలు భిక్షతెచ్చారు' అని అన్నారు. వారు చెప్పిన భిక్ష ఏమిటో చూడ కుండా అయితే సమానంగా పంచుకోండి నాయనా! అని అన్నది కుంతిదేవి మామూలుగా. ఆమాటల్లో పాండవులు ఐదుగురికి ద్రౌపది భార్య కావాలనే విషయం స్ఫురించింది. అందుకు కుంతీదేవితో సహా అందరూ ఆశ్చర్యపోయారు. అంతా దైవనిర్ణయమనుకున్నారు.

కానీ, ద్రౌపది తండ్రి ద్రుపదుడు అందుకు సమ్మతించలేదు. అప్పుడే అక్కడకు వచ్చిన వ్యాసుడు పాండవుల ద్రౌపదిల పూర్వజన్మ వృత్తాంతాలను వివరించి, ద్రౌపది ఐదుగురి భార్యకావడం వెనుక ఒక కథ ఉందని, దాని ప్రకారం ఆమెను పాండవులైదుగురు పెళ్ళిచేసుకోవడం సమంజసమేనని అన్నాడు. కుంతీదేవికి వరప్రభావ కారణంగా యమ,వాయు, ఇంద్ర,అశ్వనీ దేవతల అంశాలతో పాండవులు జన్మించారనీ, అలాగే ఆ దేవతల భార్యలైన భారతి,శ్యామల,శచీదేవి,ఉషలు ద్రౌపది రూపంలో ఉన్నారంటూ దాని వెనుక నున్నకథను చెప్పాడు.

ఒకసారి పార్వతి, శరీ, శ్యామల, ఉషలు ఒక దేహరూపాన్ని ధరించి బ్రహ్మముందుకువెళ్ళి, ఆవిషయాన్ని బ్రహ్మగుర్తిస్తాడో, లేదో అని తెలుసు కునేందుకు అటుఇటు రెండుసార్లు తిరిగారు. వారు తనను ఆటపట్టిస్తున్నా రనుకుని కోపగించిన బ్రహ్మదేవుడు, వారినిఅలాగే ఏకదేహంతో మూడుసార్లు భూలోకంలో జన్మించమని శపించాడు. మరొకసారి అలాంటి పొరపాటే చేయడంతో నాలుగవసారి కూడ భూలోకంలో జన్మించమని శపించాడు.

కాసేపటి తరువాత దేవతా స్త్రీలకు తమ తప్పు తెలిసివచ్చింది. భూలో కంలో జన్మిస్తే పరపురుషుల సంయోగాన్ని పొందాల్సి ఉంటుంది. ఆ పరిస్థితి నుంచి ఎలాతప్పుకోవాలి? అని ఆలోచిస్తున్నప్పుడు, వారి మదిలో ఒక ఆలోచన మెదిలింది. వాయుదేవుని భార్య భారతీ దేవి దేహంలో తామంతా ఇమిడిపోవాలని నిర్ణయించుకోగా, అందుకు భారతీదేవి కూడ సమ్మతిం

MOHAN PUBLICATIONS.COM

చింది. తత్ఫలితంగా ఆమె మిగతా నలుగురు స్త్రీలఅంశలను కలుపుకుని ద్రౌపదిగా జన్మించిందని, అందుకే ద్రౌపది పాండవులైదుగురిని వివాహం చేసుకోవచ్చని వ్యాసుడు చెప్పాడు. ద్రౌపది రూపంలోనున్న దేవతా స్త్రీలు, పాండవులలో ఎవరివంతు వచ్చినపుడు, ఆ దేవతాస్త్రీ మాత్రమే చేతనావస్థలో ఉండి, మిగిలిన నలుగురూ అచేతనావస్థలో ప్రక్కకు తప్పుకుని ఉంటారు. ఉదాహరణకు ఇంద్రుని అవతారంగా ఉన్న అర్జునుడి వంతు వచ్చినపుడు శచీదేవి మాత్రమే చేతనావస్థలో ఉంటుంది. అలా దేవవతాస్త్రీలు వారి వారి భర్తలతో సంగమం పొందుతుంటారని వ్యాసుడు, ద్రుపదునికి తెలియ జేసాడు. అదివిన్న ద్రుపదుడు ఆ రోజే పాణీగ్రహణ మహోత్సవాన్ని ఏర్పాటు చేసాడు. ధౌమ్యుని పౌరోహిత్యంతో, ఆ కల్యాణ మహోత్సవం బ్రహ్మాండంగా జరిగింది.

## 702. ఏకవింశత్యవతారాలు - ప్రయోజనాలు ఏమిటి ?

నిరాకార ఘనపరబ్రహ్మం ప్రప్రథమంగా సకల జగత్తు సృష్టించడానికి షోడశకలాత్మకమయిన పురుషరూపాన్ని ధరించాడు. ఆ విరాట్పురుషుని నాభి సరోవరము నుంచి పుట్టిన పద్మంనుండి ఈ సర్వలోకాలు కల్పించ బడ్డాయి. మొదటి అవతారమైన సనత్కుమార అవతారం బ్రహ్మచర్యానికి ప్రతీక. బ్రహ్మచర్యంవల్ల మనస్సు,బుద్ధి, చిత్తం, అహంకారం పవిత్రమవు తాయి. అంతఃకరణ శుద్ధికి బ్రహ్మచర్యం ప్రధానమని చెప్పేదే సనత్కుమారా వతరాం. రెండవదయిన వరాహావతరాం సంతోషావతారం. వరాహమంటే శ్రేష్టమైన దినము (వర+అహము). ఏ రోజున సత్కర్మజరుగునో అది మంచి రోజు. సత్కర్మతో లోభాన్ని చంపి భగవంతుడు మనకిచ్చిన దానితో తృప్తిచెంది సంతోషించమని చెప్పడమే ఈ అవతార రహస్యం. మూడవది నారదావ తారం. ఇది భక్తిరసావ తారం. భక్తి ద్వారా భగవత్సాక్షాత్కారం లభిస్తుంది గనుక నాలుగవది నారాయణా వతారం. అయితే జ్ఞానవైరాగ్యాలు లేకుండా భక్తి స్థిరపడదు. జ్ఞానవైరాగ్యాలకు ప్రతీకగా వెలసినది అయిదవదైన కపిలా వతారం.

బ్రహ్మచర్యం సంతోషం జ్ఞానం వైరాగ్యం భక్తి ఉన్నవారు గుణాతీతులవు తారు. అప్పుడే భగవంతుడు వారి సన్నిధికి వస్తాడు. దాని చిహ్నమే ఆరవద యిన దత్తాత్రేయ అవతారం. ఈ ఆరుఅవతారాలు బ్రాహ్మణ్యం కోసం ఏర్పడిన అవతారాలు. ఏడవదయిన యజ్ఞమూర్తి అవతారం, ఎనిమిదవ





యిన ఋషభ దేవుని అవతారం, తొమ్మిదవదయిన పృథురాజు అవతారం, పదవదయిన మత్స్యనారాయణావతారం క్షత్రియులకోసం ఏర్పడిన అవతా రాలు. ధర్మాదర్శాన్ని చూపడమే ఈ అవతారాల ఉద్దేశం.

పదకొండవదైన కూర్మావతారం, పన్నెండవదైన ధన్వంతరి అవతారం, పదమూడదైన మోహినీ అవతారం వైశ్యుల కోసం, అనేక లీలలు ప్రదర్శిస్తూ ఏర్పడిన అవతారాలు. భగవంతుని సర్వవ్యాపకత్వాన్ని తెలియజేసి ప్రహ్లాదు నిపై కృపను ప్రదర్శించడం పధ్నాలుగవదయిన నరసింహావతారం. దీని ప్రయోజనం కేవలం ప్రేమతోనే భగవంతుడిని జయించవచ్చు. మనశ్శక్తి, బుద్ధిశక్తి భగవంతుని లొంగదీయలేవు. ప్రహ్లాదునివంటిదృష్టి కలిగి ఉండాలని తెలియజేసే అవతారం ఇది. పదిహేనవ అవతారం అయిన వామనుడు పూర్తిగా నిష్కాముడు. భక్తి నీతుల ఛత్రం వామనుడిపైన ఉంది. ధర్మకవచం ధరించినటువంటి మానవుని భగవంతుడు కూడా చంపలేడు. పరమాత్మ ఎంత గొప్పవాడైనా బలిచక్రవర్తి వంటి వారి ముందు అతి చిన్నవాడు.

ఇక పదహారవదయిన పరశురామావతారం ఆవేశావతారం. పది హేడవ అవతారం వ్యాసభగవానునిది. ఇది జ్ఞానావతారం. పద్దెనిమివది మర్యాదాపురు షోత్తముడైన శ్రీరాముని అవతారం.పందొమ్మిదవది శ్రీకృష్ణావ తారం. శ్రీరామునిలా మర్యాదనుపాటిస్తే, కామం నశించి కృష్ణుడు లభిస్తాడు. 'కృష్ణస్తు భగవాన్స్వయమ్' శ్రీరామ కృష్ణావతారాలు అనంతకాలం వరకూ జీవులందరికీ శుభాన్ని కల్గించడానికి ఏర్పడిన పూర్ణావతారాలు. మిగిలినవి అంశావతారాలు. ఆ తర్వాతి బుద్ధకల్క్యావతారాలు కలిపి ఏకవిం శత్యవతా రాలు. ఈ అవతరాలాలలో బుద్ధుని అవతారం గౌతమ బుద్ధునిది కాదని కొందరి అభిప్రాయం. కలియుగంలో దేవవిద్వేషులు తామసికులైన జనులను మోహపరచడానికి బుద్ధుడనే పేరుతో అంజన యను నామెకు గయ ప్రాంతంలోజన్మిస్తాడని, యుగసంధికాలంలో(కలియుగాంతాన) రాజులు దస్యప్రాయులు కాగా జగన్నాథుడైన విష్ణువు కల్కి అనే పేరుతో విష్ణుయశుడనే బ్రాహ్మణునిగృహంలో జన్మిస్తాడని భాగవతం తెలుపుతోంది.

## 703. అవతార భేదాలు ఏమిటి?

భగవంతుని కళ భూమిమీద ప్రసరించి ఒకవ్యక్తిచేత లేదా జీవితచే లోకకల్యాణం కోసం ఘనకార్యాలు గావించడమే అవతరణం. అయితే ఆ కళ లేదా ఆ వ్యక్తి చేసిన ఘనకార్యాల తార తమ్యాన్నిబట్టి అవతార భేదాలు

MOHAN PUBLICATIONS.COM

కూడా ఏర్పడడం సహజం. ఇలా ఏర్పడిన అవతారాలు ఆరు విధాలు. 1. అంశావతారం 2. అంశాంశావతారం 3. ఆవేశావతారం 4. కళావతారం 5. పూర్ణావతారం 6. పూర్ణాతమావతారం.

అంశావతారులు : బ్రహ్మాదులు అంశావతారులు. బ్రహ్మ సృష్టికర్త. విష్ణువు స్థితికర్త. ఈశ్వరుడు సంహారకర్త. వీరు కార్యాధికారులు, సృష్టి స్థితిలయాలు పూర్ణానికి అంశాలు. కనుక బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పూర్ణతముని అంశావతరాలు.

అంశాంశావతారులు : అంశావతారాలకు తోడ్పడేవారు అంశాంశావతారలు. మరీచ్యాదులను అంశాంవావతారులుగా భావించవచ్చు. వీరు అంశావతారుల ఆజ్ఞాబద్ధులయి ఉంటారు.

ఆవేశావతారులు : జన్మతః లోకోత్తర శక్తివిశేషాలు లేకుండా ఒకొనొక సమయంలో ఆవేశ విశేషంచేత, లోకోత్తర కార్యాలను సాధించేశక్తి ఆవేశించినవారు ఆవేశావతారులు. జన్మతః ఋషికుమారుడైన పరశురాముడు తండ్రి మరణం కారణంగా సకల దుష్ట క్షత్రియ సంహారం గావించాడు. ఈ విధంగా శక్త్యావేశ పూరితులై ధర్మసంస్థాపన కావించిన వారంతా ఆవేశావతారులుగా పరిగణించబడతారు.

కళావతారులు : వీరు యుగ ధర్మోద్ధారకులు. కపిల కూర్మాదులు ఇటువంటివారు. కపిలునిలో పరమేశ్వరుని కళ ప్రసరించడం వలన ఆతనికితత్త్వం గోచరించి సాంఖ్యయోగ నిర్మాణం చేయగలిగాడు. ఈ కళ ప్రసరించడం వల్లనే కూర్మంలోనూ అధిక బలం చేకూరి సముద్రమథన సమయంలో మంధర పర్వతాన్ని మోయగలిగింది.

పూర్ణావతారులు : శాపవశులయిన రాక్షస జన్మలను సంహరించే నిమిత్తం ఆవిర్భవించినవారు పూర్ణావతారులు. నృసింహుడు. శ్రీరాముడు మొదలయినవారు.

పూర్ణతమావతరాం : సకల భువనాలకీ నాయకుడై అత్యుత్కృష్ట ధామమయిన గోలోకవాసి శ్రీకృష్ణుడు పూర్ణతముడు. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడయని శ్రీకృష్ణ భగవానుడు అనంతశక్తులను అపరిమితంగా కలిగి వాటిన లోకకళ్యాణానికై ఉపయోగించి పూర్ణతముడయినాడు. లోకరక్షైకారంభకుడు భక్తపాల కళాసంరంభకుడు, దానవోద్రేక స్తంభకుడు, కేళీలోల విలసదృగ్జాల సంభూత నానాకంజాత భవాండ





కుంకుడు, మహానందాంగనా డింభకుడు అయిన శ్రీకృష్ణ పరమాత్మ పూర్ణతమావతా రంగా భావించబడు తున్నాడు.

### 704. జంబూద్వీప నవఖండాలు అందులో నివసించే జీవులుఏవి?

1. దైవఖండము – దేవతలు 2. గభస్యఖండము – భూతాలు 3. పురుష ఖండము – కిన్నెరలు 4. భరతఖండము – మానవులు 5. శరభఖండము–సిద్ధులు 6. గంధర్వ ఖండము – గంధర్వులు 7. తామ్ర ఖండము –రాక్షసులు 8. శేరు ఖండము – యక్షులు 9. ఇందు ఖండము–పన్నగులు.

### 705. పూజకు పనికిరాని పూలు ఏవి?

దేవుళ్ళందరికీ అన్ని రకాల పుష్పాలనూ ఉపయోగించరాదు. ప్రత్యేకించి కొన్నింటిని కొందరు దేవుళ్ళపూజకు వాడకూడదు. ఆ వివరాలు :

అక్షతలతో – శ్రీమహావిష్ణువును పూజింపరాదు; గరికతో – దుర్గాదేవిని పూజింపరాదు; మారేడుదళాలు, తగరపుష్పాలను, సూర్యభగవానుడి అర్చనకు ఉపయోగించరాదు; ఉమ్మెత్త, అర్కపుష్పాలతో భైరవుణ్ణి పూజింపరాదు. తమాలపుష్పాలతో – సరస్వతీదేవినిపూజింపకూడదు. జిల్లేడు, గన్నేరు పూలతో, శ్రీదేవిని పూజింపరాదు. మొగలి, కుటజపుష్పాలను శివుడి పూజకు ఉపయోగించరాదు. దాసానిపుష్పం, వసంతకాలపుమల్లె, దిరిసెన, అడవిమల్లె, సన్నజాజి, మొగిలిపూవులతో ఎప్పుడూ శంకరుణ్ణి పూజించకూడదు. మందారం, జిల్లేడు, ఉమ్మెత్త, బూరుగ, దేవకాంచనం, తాండ్ర పుష్పాలు, విష్ణు పూజకు నిషిద్ధం. ఇక, నరసింహస్వామి పూజకు తెలుపు, పచ్చని రంగుల మొగిలి పూవులు కూడా నిషిద్ధం.

### 706. పంచగంగలు ఏవి ?

కావేరీ, తుంగభద్రా చ కృష్ణవేణీ చ, గౌతమీ ।
భాగీరథీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః॥

కావేరి, తుంగభద్ర అనే రెండు నదుల కలయికతో ప్రవహించే తుంగభద్రానది అలాగే ఒక స్త్రీకి ఉండే వేణిలాగ (జడ) అతిదీర్ఘంగా ఉండే కృష్ణవేణీ నది, ఒక్కొక్క మహర్షిచేత ఒక్కో దిక్కుగా తీసుకుపోబడి ప్రవహిస్తూ ఏడు పాయలుగా విడిపోయి సముద్రంలో ఏడుచోట్ల కలిసే గోదావరి నది (వాటిలో గౌతమునిచేత తీసుకుపోబడిన కారణంగా గౌతమి అనే పేరుతో పిలువబడే గోదావరి పాయ) ఈ నాలుగింటితో పాటు భగీరథునిచేత ఆకాశం నుండి తీసుకురాబడి, నేలమీద ప్రవహించి భాగీరథి అనేపేరు

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

పొందిన గంగానది అనే ఈ ఐదింటినీ పంగంగలు అనిపిలుస్తారు. ఈ ఐదు గంగలూ పాపాలను తొలగిస్తాయి.

## 707. 'అ'కార దేవత ఎవరు?

అకార దేవతని 'అజాముఖి' అంటారు. ఈమె మేక (అజ)ముఖం కలిగి ఎర్రగా ఉంటుంది. తెల్లటి వస్త్రాలు ధరించి హంస వాహనాన్ని కలిగి ఉంటుంది. నాలుగు చేతులుంటాయి. కుడిభాగమున క్రింద నుంచి పైకి వరద ముద్ర, విల్లు, ఎడమవైపున అభయముద్ర, బాణాన్నిధరించి ఉంటుంది. ఈమెపీఠంపై కూర్చునిఉంటుంది. హంసబొమ్మచెక్కి ఉంటుంది.

## 708. 'ఆ'కార దేవత ఎవరు ?

ఆకారాది దేవతని ఆ థర్వణి అంటారు. ఈమె అధర్వణ వేదమునకు సంబంధించినది. నల్లగా ఉంటుంది. తెల్లని వస్త్రములు కలిగి ఉంటుంది. నాలుగు చేతులుంటాయి. కుడిభాగాన క్రింద నుంచి పైకి అభయముద్రని, ఖట్వాంగ ఆయుధాన్ని ధరించి ఉంటుంది. ఎడమవైపున వరద ముద్ర, ఖేటమును ధరించి ఉంటుంది. ఈ దేవత వాహనం గుఇరంచిన ప్రస్తావన లేదు. ఈమె నిలబడి ఉంటుంది.

## 709. దత్త జయంతి విశిష్టత ఏమిటి?

అత్రి, అనసూయలు బుక్షపర్వంతపై తపస్సుచేసి, విష్ణుమూర్తిని సాక్షాత్కరింపచేసుకుని, తమతనయుడుగా జనించుమని కోరగా మహావిష్ణువే 'దత్తాత్రేయుడు'గా వారికి జన్మించెనని శ్రీమద్భాగవతం,దేవీభాగవతం, మార్కండేయాది పురాణాలు తెలియచేస్తున్నాయి. ఈ దత్తావతరణ గాథలో విశేష అంతరార్థం ఇమిడి యున్నది. అది భౌతిక, అధిదైవిక, ఆధ్యాత్మికమైన 'త్రి'విధ పాప,తాపములను జయించి, సాత్విక, రాజస, తామసాహంకారాన్ని (త్రివిధ అహంకారాలను) పారద్రోలినవాడు కనుక 'అత్రి' అని పిలువబడిన మునిసత్తముడు, అసూయ లేని సాధ్వి 'అనసూయ'లు సంతానార్థం తపస్సు చేసారు.'బుక్ష'అనగా 'భల్లూకం' అని అర్థం. 'పర్వతం' నిశ్చలస్థితిలో నుండు అచలం భల్లూకపు పట్టు (వదలని దీక్ష) లాంటి నియమ నిష్ఠలతో, అచంచల తపస్సు చేసినవారికి భగవంతుడు తనకు తానే దత్తుడవుతాడన్న భక్తి సిద్ధాంతానికి నిదర్శనమే ఈదత్తస్వామి అవతరణం. ఈ దత్తాత్రేయావిర్భావం 'మార్గశీర్షపూర్ణిమ' తిథినాడే కనుక విశేషించి ఆధ్యాత్మిక సాధనలకు, దత్తోపాసనకు మహిమాన్విత 'దత్తజయంతి'గా ఆచరణీయమైనది.





## 710. దత్తాత్రేయ రూపసంకేతార్థం ఏమిటి?

మూడ తలలతో, ఆరు భుజాలతో, శంఖచక్ర త్రిశులాది ఆయుధాలతో, వెంట నాలుగు కుక్కలతో, ఆవుతో దర్శనీయుడైయున్న దత్తాత్రేయుని స్వరూపం వెనుక సంకేతార్థము లేకపోలేదు.

మూడుశిరములు, ఆరుచేతులు త్రిమూర్తి సంకేతాలు, బ్రహ్మ, విష్ణు, శివాత్మక తేజస్వరూపం దత్త స్వరూపం క్రింద రెండు చేతుల్లో ధరించియున్న అక్షమాల, కమండలం బ్రహ్మత్వానికి మధ్య చేతుల్లోని డమరుకం,త్రిశూలం శివత్వానికి, పై రెండుచేతుల్లోని శంఖచక్రాలు 'విష్ణుతత్వానికి' ప్రతీకలు. అంతే గాక త్రిశూలం మనలోని త్రిగుణాలను నశింపచేసి గుణాతీతుడిగా చేస్తుందని, శంఖ (ఓంకార)నాదం సృష్టికార్యాన్ని నిర్వహించి జగత్తును అజ్ఞానం నుంచి మేల్కొలుపుతుందనీ, కమండలం చిత్తాన్ని శుద్ధిచేసుకోమని ప్రబోధిస్తుందనీ చక్రం అవిద్యను లయింపచేస్తుందని కూడ భావించబడు చున్నది.

ఆయన వెంట ఉండే గోవు 'కామధేనువు'కు సంకేతమని, దాని పొదుగు నుంచి చతుర్విధ పురుషార్థాలనే క్షీరాన్నిదత్తోపాసనకులకు అందిస్తాడని పురాణ ప్రతీతి. "ధర్మోయమో గౌరనఘాశుభా) దత్తోపాసకులకు అందిస్తాడని పురాణ ప్రతీతి. "ధర్మోయమో గౌరనఘాశుభా) యను ఇంద్రియస్య ధర్మః స్వభావోధర్మాధి వతేర్గుణాదేవా" తతను శరణుజొచ్చిన యమధర్మరాజును (ధర్మదేవతను) గోవుగా తన చెంత ఉంచుకుని రక్షిస్తున్నాడని, ఆ ధర్మదేవతను నాలుగు ప్రక్కల నుంచి నాలుగువేదాలు, నాలుగు 'శునక' రూపములతో కాపాడుతూ దత్తస్వామి ఆదేశానువర్తులై ఉన్నాయని కూడ పురాణ విదితం. దత్తాత్రేయ స్వరూపంలోని అంతరార్థమిదియే.

## 711. తలంబ్రాలు ఎందుకు వాడాలి?

గింజ విరగని బియ్యాన్ని కడిగి కొద్దిగా ఆవునెయ్యి వేసి కలుపుతారు. (కొందరు పసుపు కూడ కలుపుతారు.) వీటిని తలంబ్రాలు అని అంటారు. ముందుగా వధూవరులు ఒకరి తలపై ఒకరు రెండేసి సార్లు మంత్రయుక్తంగా పోసుకుంటారు. మిగిలినవాటిని పోటాపోటీగా మంత్రం లేకుండా పోసుకుంటారు. ముందుగా వరుడు వధువు తలపై నీవుకోరుకున్న సంతానము అభివృద్ధి అగుగాక అని ఉంచుతాడు. అనంతరం వధువు పాడిపంటలు అభివృద్ధి అగుగాక అని వరుని తలపై తలంబ్రాలు ఉంచుతుంది. రెండవ

MOHAN PUBLICATIONS.COM

సారి వరుడు యజ్ఞరూపమైన కోరిక సిద్ధించుగాక అని వధువు తలపై తలంబ్రాలు పోస్తాడు. అనంతరం వధూవరులు కలసి ఒకరి తలపై ఒకరు నాకు కావలసినధనము అభివృద్ధి అగుగాక అనితలంబ్రాలు పోసుకుంటారు.

### 712. తీర్థయాత్రల ప్రాముఖ్యత ఏమిటి ?

ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణం ప్రారంభించిన వ్యక్తికి తాను నమ్ముకున్న మార్గాన్ని మరింత బలపరిచే అనుభవాలు అవసరమవుతాయి. అటువంటి అనుభవం అతనికి కలిగించే ప్రాంతాలు, వ్యక్తులు ఉంటారు. అటువంటి వాటిని వెతుక్కుంటూ వెళ్ళటమే తీర్థయాత్ర. మునీశ్వరుల దగ్గరకు వెళ్ళి తమ సందేహాలను తీర్చుకునేవారు గతంలో. ఆ మహానుభావులున్న ప్రదేశాలే పుణ్య క్షేత్రాలయ్యాయి. అటువంటి శక్తి ప్రతిష్ఠించిన దేవతామూర్తుల ద్వారా లభిస్తుంది. ఆ విశేష స్థలపురాణం కలిగిన పుణ్యక్షేత్రాలను దర్శించటంవల్ల మానవుల మన సులో మార్పువస్తుంది. మారిన మనసు మనిషికి ప్రశాంతతను చేకూరు స్తుంది. ఇదే తీర్థయాత్రల ప్రాముఖ్యత.

### 713. సద్గతులు ఏవి?

పరమాత్మపై దృష్టి ఉంచి అంత్యకాలంలో ఆ భగవంతుని స్మరిస్తూ దేహాన్ని వదిలేవారికి ఎటువంటి సద్గతులు లభిస్తాయో చూడండి. మారీచుడు శ్రీరామచంద్రుడు కొట్టిన బాణంచే లేడి శరీరాన్ని వదిలి, రాక్షసరూపం దాల్చి 'శివశివా' అనిస్మరిస్తూ శివలింగమయ్యాడు. ఈ లింగం ఇప్పటికీ గోదావరి జన్మస్థానమగు నాసిక్‌లో మారీచేశ్వర లింగం అనే పేరుతో పూజింపబడుతోంది. కామకోటి పీఠాధిపతులలో సచ్చిద్ఘన జయేంద్ర సరస్వతీ స్వాములవారు కంచి దేవాలయంలో అంత్యకాలమున శివుని ధ్యానిస్తూ శివలింగాకృతి నొందారు. ఈయన పదమూడవ పీఠాధిపతి. అలాగే ఇరవై ఐదవ పీఠాధిపతియైన సచ్చిదానంద ఘన జయేంద్ర సరస్వతీ స్వాములవారు గోకర్ణక్షేత్రంలో అంత్యకాలమున శివుని ధ్యానిస్తూ శివలింగ మయ్యారు.

మీరాబాయి శ్రీకృష్ణునిలో లీనమయ్యింది. సక్కుబాయి శ్రీపాండురంగని లోనూ, శ్రీమతి తరిగొండ వేంగమాంబ శ్రీవేంకటేశ్వరునిలోనూ, భక్త గుడ గూచి శివలింగంలోనూ లీనమయ్యారు. వాల్మీకి మహర్షితులసీదాసుగా పుట్టాడు. శుకమహర్షి కబీరుదాసుగా పుట్టాడు. వసిష్ఠ మహర్షి నిమిచక్రవర్తి శాపంవల్ల మళ్ళీ వసిష్టుగానే జన్మించాడు. మరలా విఠోబాగా పుట్టాడు. నారద మహర్షి త్యాగరాజుగా, శ్రీపాదస్వామిగా కమాల్‌దాస్‌గా జన్మలను





పొందాడు. శివావతారమగు శంకరాచార్యులుగా జ్ఞానసంబంధ నాయనా రుగా, రమణమహర్షిగా జన్మలను పొందాడు. శివావతారమగు శంకరా చార్యులు కలియుగంలో ఇరవై ఎనిమిదిసార్లు జన్మలను పొందుతారట. ఆదిశేషుడు లక్ష్మణుడుగా, రామానుజా చార్యులుగా జన్మలను పొందాడు వాయుదేవుడు, భీముడిగా, మధ్వాచార్యులుగా జన్మలను పొందాడు. అర్జునుడు శ్రీకాహస్తిలో కన్నప్పగా పుట్టాడు. కర్ణుడు శిరోత్తండ నాయనారుగా జన్మించాడు.

### 714. గాయత్రీ మంత్రాన్ని స్త్రీలకు చెప్పరాదా ?

ఏ మంత్రనైనా ఎవరికైనా చెప్పవచ్చు. దానిని ఉపాసించేవారు నిర్మల హృదయంతో, పవిత్రమైన మనస్సుతో ఉండగల్గి మంత్రాన్ని స్వరంతో పలకగలి గితే, ఇందులో ఏది లోపించినా పురుషుడైనా, బ్రాహ్మణుడైనా వారికి మంత్రం అనవసరం. తంత్రాల్లో ఆస్తికూడబెట్టడం మంచిది.

### 715. జపము చేస్తున్న సమయంలో మనసు పరిపరి విధాల పోతుంది. అలా నిలకడలేని మనసుతో చేసే జపం ఫలిస్తుందా ?

సముద్రంలో అలలు ఉన్నాయి కాబట్టి అవి తగ్గినప్పుడు స్నానం చేయా లనుకుంటే మనం ఎన్నటికీ స్నానం చేయలేం. అలలు ఉన్నా స్నానం చేయడానికి ప్రయత్నించాలి. అలాగే మనసు నిలకడగా ఉండడం లేదని జపం చేయకపోతే భగవంతుణ్ణి పొందలేం. మనం తెలిసి నీళ్ళలోకి దూకినా, తెలియక నీళ్ళలో తోయబడినా బట్టలు తడుస్తాయి. అలాగే మనసు పూర్తిగా భగవంతునియందు నిమగ్నమైనా, కాకపోయినా జపం చేయడంవల్ల ఫలితం ఉంటుంది. ఓర్పుతో కొన్నాళ్ళు ప్రయత్నిస్తే మనసు పవిత్రమవు తుంది. పవిత్రమైన మనసు భగవంతుని యందు లగ్నమవుతుంది.

"స్వల్పమప్యస్య ధర్మస్యత్రాయతే మహతో భయాత్" ధర్మకార్యం ఎంత చిన్నదైనప్పటికీ వదలకుండా ప్రయత్నిస్తే అనంత ఫలాన్నిస్తుంది. ఒకసారి శ్రీకృష్ణపరమాత్మ నారదునికి ఒక గిన్నెలో నూనెనింపి, నూనె ఒలకకుండా కొండచుట్టూ తిరిగిరమ్మన్నాడు. తిరిగి వచ్చిన నారదుణ్ణి శ్రీకృష్ణుడు 'కొండ చుట్టూ తిరిగే సమయములో నన్ను ఎన్నిసార్లు స్మరించావు'అని అడిగాడు. నూనె ఒక్కచుక్క కూడా క్రింద పడకుండా నడుస్తున్నప్పుడు నా మనసంతా నూనె గిన్నెమీదే ఉంది. ఇంక నీ స్మరణ ఎలా చేయగలను అని నారదుడు బదులిచ్చాడు. ఇంత చిన్న పనిలోనేనీవునన్ను గుర్తుపెట్టుకోలేకపోయావు.

MOHAN PUBLICATIONS.COM

నా గృహస్థ భక్తుడు చూడు, అతడు ఎన్నో సంసార బాధ్యతల్ని నిర్వర్తిస్తూ కూడా నన్ను స్మరిస్తున్నాడు అని అన్నాడు భగవానుడు. సంసారంలో ఎన్ని పనుల మధ్యఉన్నా భగవంతుణ్ణి స్మరిస్తే తప్పక ఆయన అనుగ్రహం ఉంటుంది.

### 716. ఏ పుష్పములతో మనము పూజ చేయాలి ?

పుష్పాలు దేవతలందరికీ ఎంతో ప్రీతికరమైనవి. అందుకే, పూజలో మనం తప్పనిసరిగా పుష్పాలను వినియోగిస్తుంటాం. పుష్పాల పరిమళం దేవీ దేవతలకు సంతోషం కలిగింప జేస్తుందని పెద్దల మాట. చూడముచ్చట కలిగించే పుష్పాలను భగవంతుడికి సమర్పించడం కన్నుల పండుగగా ఉంటుంది. అంతేకాకుండా అవి ఆనందానికీ, సంతృప్తికీ ప్రతీకగా నిలుస్తాయి. పుష్పాలగురించి కులార్ణవ తంత్రంలో ఇలా పేర్కొన్నారు. 'పుణ్య సంవర్ధనాచ్చాపి పాపౌఘ పరిహారతః పుష్కలార్ధ ప్రదానార్థం పుష్ప మిత్యభి ధీయతే" పుణ్యాన్ని పెంపొందింపజేసి, పాపాన్ని పరిహరించి, అనేక ప్రయోజనాలను కలిగిస్తుంది కాబట్టి. దాన్ని పుష్పం అంటారు. ఇక శారదా తిలకమనే గ్రంథం 'దైవస్య మస్తకం కుర్యా త్కుసుమోపహితం సదా' అని చెబుతోంది. అంటే, దేవుని శిరస్సును సదాపుష్పాలతో అలంకరించాలన్నమాట. ఇక విష్ణు నారదీయం ధర్మోత్తర పురాణం ఇలా చెబుతున్నాయి. బంగారం కానీ, రత్నాలుకానీ సమర్పించనప్పటికన్నా, పుష్పాలు సమర్పించినప్పుడు దేవతలు ఎంతో సంతుష్టి చెందుతారు.

1. పవళమల్లె పుష్పాలతోపూజిస్తే – మంచి ఆలోచనలు, మంచి కోరికలు కలుగుతాయి. 2. మంగిషంపుష్పాలతో పూజిస్తే – ఓర్పు, సహనం పెరుగుతాయి. శాంతి కలుగుతుంది. 3. విరుచి పుష్పాలతో పూజచేస్తే– శరీరంలోని వేడిని తగ్గించి, మనస్సును ప్రశాంతంగా ఉంచుతుంది. 4. ఎరుకు పుష్పాలతో– పూజచేయడం మనలోని అధైర్యాన్ని పోగొట్టి, ఆత్మ స్థైర్యాన్నికలిగిస్తుంది. 5. అరళి పుష్పాలతో పూజించడం – సత్యసంధతను పెంపొందిస్తుంది. 6. తెల్ల తామరలతో పూజిస్తే–భక్తిని ప్రేరేపిస్తుంది. 7. తులసీ దళాలతో పూజచేయడం– భక్తిని పెంచుతుంది. ఆధ్యాత్మిక మార్గాన్ని చూపుతుంది. 8. గన్నేరు, జీవంతి పుష్పాలతో పూజించడంవల్ల దైవంమీద భక్తి పెరుగుతుంది. ముక్తి లభిస్తుంది. 9.దవనంతో పూజచేయడం–వ్యర్థమైన కోరికలను అణచివేసి, సంతోషకరమైన జీవనాన్ని ప్రసాదిస్తుంది. 10.మల్లె పూలతో పూజ–పాపప్రక్షాళన చేస్తుంది. బుద్ధిని నిష్కల్మషంగా ఉంచుతుంది.





11. సంపెంగ పూలతో పూజించడం–అన్ని రంగాల్లో అభివృద్ధిని చేకూరుస్తుంది. 12. నాగలింగ పుష్పాలతో పూజవల్ల ఆర్థిక పరిస్థితి మెరుగవుతుంది. 13. ఎర్రమల్లి పుష్పాలతో పూజించినట్లయితే సకల సంపదలకూ అధిదేవత అయిన శ్రీమహాలక్ష్మి కటాక్షం సిద్ధిస్తుంది. 14. తామర, శంఖ పుష్పాలతో పూజిస్తే–అష్టైశ్వర్యాలు కలుగుతాయి. 15.మారేడు దళాలతో పూజించినట్లయితే–జ్ఞానైశ్వర్యం కలుగుతుంది. ముక్తి లభిస్తుంది.

### 717. యమలోకాధిపతి యముడు ఎవరు ?

దక్షిణదిక్కుకు అధిపతి. సూర్యుడు, సంజ్ఞ తల్లితండ్రులు. సూర్యుని తేజస్సు తట్టుకోలేని సంజ్ఞ తన ఛాయను సూర్యునివద్ద ఉంచి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఛాయ తన పుత్రులను ప్రేమగా చూసుకుంటూ సంజ్ఞా సంతానమైన యమునిపై పక్షపాతం చూపించేది. తనను అనాదరణ చేస్తుందనే కోపంతో తన్నడానికి కాలును ఎత్తగా కాలు విరిగి నేలపై పడమని శపించింది. ఈ విషయాన్ని సూర్యునికి చెప్పగా క్రిందపడిన పాదము క్రిములచే తినబడినపుడు శాపవిమోచ నాన్ని ఇచ్చాడు. శాపభయముచే ధర్మమును కాపాడతుండడంతో ధర్ముడనే పేరు వచ్చింది. ధర్ముని ధర్మ గుణముబట్టి పితృలోకాధిపత్యం వచ్చింది. యముని భార్యలు ధూమోర్ణ, విజయలు. చిత్రగుప్తుడు, లేఖరి,చండుడు మహాచండుడు ఈయన పరివారము. వటవృక్షము ప్రీతికరమైన వృక్షము. కుంతియందు యమునికి ధర్మరాజు జన్మించాడు.మూడునేత్రములు, కిరీటము, నాలుగు చేతులలో కాలదండము,పాశము, అభయవరదహస్తములు, భార్యయైన శ్యామలా దేవితో, మహిష వాహనము ఎక్కి ఉంటాడు.

### 718. విశ్వకర్మ ఎవరు ?

ఋగ్వేదంలో విశ్వనిర్మాతగా విశ్వకర్మను వర్ణించారు. ఆ విశ్వకర్మ ఏ వనంనుండి, ఏ వృక్షంనుండి ద్యౌ, పృథ్వీలను నిర్మించాడు. భువనములను ధరించి నిల్చునిఉన్న ఆ పురుషుడు ఎవ్వడో మీ మనస్సులను ప్రశ్నించండి.(10.18.4)

1.వస్తువు అనే మనువుకు, అంగీరసకు పుట్టినవాడు. ఇతడికి ఆకృతి ద్వారా చాక్షుడనే మనువు పుడతాడు.(భాగ) 2. ప్రజాపతి. ప్రియవ్రతుడి భార్య బర్హిష్మతి ఇతడి కూతురు. 3. దేవశిల్పి. ప్రభాసుడనే మనువు కుమారుడు. ఇతని తల్లి బృహస్పతి చెలియయైన యోగసిద్ధి.

MOHAN PUBLICATIONS.COM

భార్య ప్రహ్లాదీ. సూర్యుడిభార్య సంజ్ఞ విశ్వకర్మ కూతురు. సుగ్రీవుని కొలువులో
వీన్న నలుడనే వానరుడు ఇతని కుమారుడు. విశ్వరూపుడనే అనేవాడు
మరొకుడు ఉన్నాడు. విశ్వకర్మ దేవతలుకు కావలసిన నగరాలు, హర్మ్య
ములు, రథములు, ఆయుధములు తయారుచేసి ఇస్తాడు. సంజ్ఞ సూర్యుని
తేజస్సును భరించలేక పోతే ఆ కిరణములను ఖండించి సుదర్శన చక్రం
తయారుచేసి శ్రీమహావిష్ణు వుకు ఇచ్చాడు. భూలోకములో ఇంద్రప్రస్థమును
నిర్మించాడు.

ఒకరోజు విశ్వకర్మ రథముపై పోతు ఘృతాచిని చూసాడు. ఆమెను
చూడగానే వివశుడై కామకేళికి రమ్మని పిలిచాడు. ఆమె నిరాకరించడంతో
విశ్వకర్మకు కోపంవచ్చి ఘ్రుతాచిని శూద్రయోనియందు పుట్టమని శపిస్తే,
నీవు భూలోకములో పడతావని పరస్పరం శాపాలు పెట్టుకునగా విశ్వకర్మ
బ్రాహ్మణునిగా జన్మించి ప్రయాగలో జపము చేసుకొంటూండేవాడు. ఘృతాచి
గోపకాంతగా ప్రయాగలో విశ్వకర్మకు కనపడింది. పూర్వవృత్తాం తము
తెలుసుకుని ఆమెతో రమించాడు. వారికి పుట్టిన సంతానమే కంచరులు,
వడ్రంగులు, స్వర్ణకారులైనారని బ్ర.వై పురాణములో చెప్పబడింది.

**719. బ్రహ్మకు పూజార్హత లేకపోవడం కారణము ఏమిటి ?**

బ్రహ్మ తొడనుండి నారదుడు పుట్టాడు. బ్రహ్మ నారదునితో నీవు
సృష్టి చేయమని చెప్పాడు. నారదుడు దీనికి నిరాకరించి నేను సంసారబంధ
ములో ప్రవేశించను. కావునా నేను సృష్టి చేయనని తిరస్కరించగా బ్రహ్మకు
కోపంవచ్చి నీవుకాముకుడువై శూద్రయోనియందు జన్మించమని శపించాడు.
నారదుడు కోపించి నీకు పూజాదులు లేకుందునని ప్రతిశాపం ఇచ్చాడని
బ్రహ్మ వైవర్త పురాణములో చెప్పబడింది.

ఒకసారి బ్రహ్మకు, విష్ణువులు తమలో ఎవరు అధికులనే విషయంపై
వాదులాడుకుంటుంటే వారి ఎదుట బ్రహ్మాండమైన తేజస్సుతో ఒక లింగం
ఆవిర్భవించింది. దాని ఆద్యంతములు చూడడానికి ఇద్దరు బ్రహ్మ పైకి,
విష్ణువు క్రిందవైపు వెళ్ళారు. ఎవరైతే దాని చివర వరకు వెళతారో వారికి
రెండవవారు సమస్కరించి, పూజించాలని పందెం వేసుకున్నారు. ఎంత
కాలనికి దాని తుదిని చేరలేదు. బ్రహ్మకు పైనుండి ఒక మొగలి పువ్వు
కనిపించి చాలాకాలం నుండి ఈ స్తంభం మొదలు చూడాలని ప్రయత్నిస్తున్నా
అది సాధ్యం కాలేదని చెప్పింది. విషయం తెలిసిన బ్రహ్మ దాని మొదలును





తాను చూసినట్లు అబద్ధం చెప్పడానికి నిశ్చయించుకుని తనకు సాక్ష్యంగా
ఉండమని మొగలిపువ్వును కోరాడు. విష్ణువుతో తాను కడపడి వరకు
వెళ్ళానని చెప్పగా విష్ణువు బ్రహ్మకు నమస్కరిం చాడు. అంతశివుడు ప్రత్యక్షమై
బ్రహ్మ అబద్ధం ఆడాడని చెప్పి బ్రహ్మకు పూజార్హత లేకుండా శపించాడు.
బ్రహ్మకుగల ఐదవముఖం గార్దభముఖం అయింది. బ్రహ్మ శివుని ప్రార్థించి
శాపవిమోచమం కోరుకోగా యజ్ఞము లందు మాత్రమే పూజార్హత ఉంటుంది
కాని ఇతర కార్యక్రములలో పూజలుండవని అనుగ్రహించా డని శివపురా
ణంలో చెప్పబడింది.

మహేశ్వరుని జ్యోతిర్లింగం బ్రహ్మతో "నీకు వరమిచెద్దను కోరు
కొమ్మంది". బ్రహ్మ తాను అధికుడుగా ఉండాలనే కోరికతో శివుని తనకు
కుమారునిగా జన్మించమని కోరాడు. శివునికి కోపంవచ్చి బ్రహ్మకు పూజార్హత
లేకుండా శపించాడని మరొక పురాణ కథనం. బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో
ముక్తిని కలిగించేవారు ఎవ్వరు అని మునులకు సందేహంరాగా, దీనిని
నిర్ధారణచేయడానికి భృగువుని నియమిం చారు. ముందరగా బ్రహ్మ వద్దకు
వచ్చిన భృగువు బ్రహ్మ అనుమతి లేకుండా అతని సమక్షంలో కూర్చున్నాడు.
ఈ కారణంగా బ్రహ్మ భృగువుపై కోప పడ్డాడు. నీవు రజోగుణ ప్రధానుడవు.
ముక్తిని ఇవ్వలేవు నీకు లోకములో పూజలేకుండును గాక! అని శపించినట్లు
మహాభాగవతంలో చెప్పబడింది.

వరములు కోరి తపస్సు చేసిన రాక్షసులందరికి వరములు ఇవ్వడం,
ఆ వరబలంతో లోకాలకు బాధలుకలిగించడం, ఇది హిరణ్యకశపుడు దగ్గర
నుండి రావణుని వరకు సాగడం, వారిని సంహరించడానికి విష్ణువు వివిధ
అవతారములు ఎత్తవలసి రావడంతో పాటు బ్రహ్మరాక్షసులకు వరములు
ఇచ్చే దేవునికిగా బ్రహ్మదేవుని అపఖ్యాతికి కారణమవ్వడంతో పూజలు
తగ్గిపోయినట్లు చెప్పుకోవచ్చును.వర్తమానంలో దేశం మొత్తం మీద బ్రహ్మకు
రాజస్థాన్‌లోని ఆజ్మీర్‌లో పుష్కరసరస్సు ప్రాంతంలో ఒకదేవాలయం మాత్రమే
కనిపిస్తోంది. అలానే ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరుజిల్లాలోని గుంటూరు
పట్టణమునకు సుమారు 20 కి.మీ. దూరములో చేబ్రోలు గ్రామము
చతుర్ముఖ బ్రహ్మలింగేశ్వరాలయం ఉన్నది. ఎక్కువ మంది భక్తులు గురు
వారమునాడు సందర్శిస్తారు. విధివ్రాత మార్చుకోవాలంటే ఈ దేవాలయము
సందర్శించ వలసినదే !

MOHAN PUBLICATIONS.COM

సృష్టి స్థితిలయ కారులుగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. వీరిలో రక్షణ ముఖ్యావసరం కనుక రక్షణనుఇచ్చే విష్ణువు అందరికి ఆరాధ్యుడు. జీవనానికి ముఖ్యావసరమయిన సంపదలకు అధిష్ఠానమైన లక్ష్మీదేవి విష్ణు మూర్తి భార్యే అవ్వడంతో విష్ణువుని అందరు ప్రార్ధిస్తారు.

శివుడు లయకారకుడు. మరణమంటే అందరికి భయమే. మరణం కావాలని సామాన్యంగా ఎవరు అడగరు కాని మరణం దూరం చేయమని లేదా మోక్షం ప్రసాదించమని శివుని ప్రార్ధిస్తారు.

ఈ ప్రార్ధనలన్ని పుట్టిన తరువాత. పుట్టించే దేవుడు బ్రహ్మ పుట్టక ముందు ఆయనను ప్రార్ధించే అవకాశములేదు. పుట్టించే బ్రహ్మను పుట్టించ మని ఎవరు ప్రార్ధించరు ఎందుకంటే తిరిగి పుట్టా లంటే ప్రస్తుతం మరణిం చాలి. ప్రస్తుతం మరణించడం ఎవ్వరికి ఇష్టంకాదు. మరణించిన తరువాత పుట్టించమని బ్రహ్మను ప్రార్ధించలేరు. ఈ తత్వాన్ని అర్ధం చేసుకోవడానికి బ్రహ్మ జ్ఞానంకావాలి. ఇది ఏకొద్ది మంది మహానుభావులకో తప్ప మిగిలిన వారికి సాధ్యంకాదు. తమకోరికలు తీర్చమంటూ ప్రార్ధనలు చేసేవారు శివకేశవులను ప్రార్ధించడం ప్రారంభించారు. శివకేశవులనే సంపదలకు, మోక్షము కోసం ప్రార్ధించడంతో బ్రహ్మకు పూజార్హత లేకుండా పోయింది. లౌకికంగా ఆలోచిస్తే ఇదే ప్రధానమైన కారణమని చెప్పవచ్చును.

## 720. బ్రహ్మకు ఐదు ముఖాలున్నాయా ?

బ్రహ్మకు మొదట్లో 5 ముఖాలు ఉండేవి. నాలుగు దిక్కులవైపు 4, ఊర్ధ్వంగా ఒకటి ఉండేది. ఒకసారి బ్రహ్మగర్వంతో శివుని దూషించాడు. కోపించిన శివుడు కాలభైరవుని పుట్టించి దూషించిన శిరస్సును నరకమని ఆజ్ఞాపిం చాడు. దీనికి భయపడిన బ్రహ్మ తన ఐదవ శిరస్సు శివుని దగ్గర పడాలని దానితో శివుడు భిక్షాటన చేయమని శివుని కోరాడని స్కాంథపురా ణం కాశీఖండ ములో చెప్పబడింది.

పూర్వం దేవాసుర యుద్ధం జరిగే సందర్భంలో బ్రహ్మకు గార్ధభముఖ ఆకారంలోఉన్న 5వముఖం ఉండేది. అది దానవులతో మీరు భయపడకండి. నేను దేవతలను మ్రింగివేస్తాను అని అన్నాడు. అది విన్న దేవతలు శివ విష్ణువులతో చెప్పారు. శివుడు బ్రహ్మయొక్క 5వ శిరస్సును ఖండించాడు. ఆ శిరస్సు పాతళములో పడింది. ఆశిరస్సు ఖండించబడిన ప్రాంతమే బ్రహ్మతీర్ధం.





ప్రారంభంలో బ్రహ్మకు ఒక శిరస్సే ఉండేదని తదనంతర కాలంలో 5శిరస్సులు ఉద్భవించినట్లు పురాణ కథనం. బ్రహ్మ సృష్టిని పెంపొందించ డానకి తన దేహం నుండి శతరూపఅనే స్త్రీని సృష్టించాడు. అత్యంత సుందర రూపం కలిగిన ఈమె వాక్, సరస్వతి. అతిలోక సుందరియైన ఈమెను బ్రహ్మ మోహించి తదేక దృష్టితో చూడసాగాడు. బ్రహ్మ దృష్టికి సిగ్గుపడిన సరస్వతి అతని దృష్టికి దూరంగా ఉండడానికి మిగిలిన దిక్కులవైపు తిరిగితే ఆ వైపు చూడడానికి ఎడమ, కుడివైపుల, వెనుకవైపు శిరస్సులను సృష్టించు కున్నాడు. ఆమె పైకివెళితే పైన ఒకశిరస్సు ఏర్పడిందని ఈ విధంగా 5 శిరస్సులు ఏర్పడ్డాయని పురాణ కథనం. వాణిపురందరుల సంతానం వర్తమాన సృష్టికి కారకుడైన స్వయంభూ మనువు.

## 721. నరనారాయణులు ఎవరు ?

ధర్మునిపుత్రులు. హిరణ్యకశపుని సంహరించిన తరువాత నరసింహావ తారం రెండు భాగాలైంది. నరరూపము నరుడు, సింహరూపము నారాయ ణుడు అయ్యారు. వీరు బదరీవనంలో తపస్సు చేసుకుంటుంటే ఆ తపస్సును చెడకొట్ట డానికి ఇంద్రుడు అప్సరసలను పంపగా, నారాయణుడు తన ఊరువును గోరుతో గీకగా అక్కడనుండి సుందరమైన ఒక స్త్రీపుట్టింది. ఊరువులనుండి పుట్టింది కనుక ఆమె ఊర్వశి అయింది. ఈమెను చూసిన అప్సరసలు సిగ్గుతో వెనుకకు వెళ్ళిపోయారు. వీరి వద్ద ఆయుధములు ఉండడంచూసిన ప్రహ్లాదుడు వీరితో వాదించి యుద్ధానికి దిగాడు. ఎంత పోరినా గెలవకపోవడంతో విష్ణువును ప్రార్ధించగా స్వామిప్రత్యక్షమై నరనారా యణలు విష్ణ్వంశము వారని, వారు అజేయులని చెప్పెను.

పూర్వము సహస్రకవచుడనే రాక్షసుని శరీరంపై వెయ్యి కవచములు ఉండేవి. వానిని సంహరించడానికి ఎవ్వరికి శక్తి ఉండేది కాదు. వీనిని సంహరించడానికి నరనారాయణులు తపస్సు చేస్తూ నరుడు వెయ్యి సంవత్సర ములు తపస్సుచేసి యుద్ధానికి వెళ్ళగానే నారయణుడు తపస్సు చేయడం, నారాయణుడు వెయ్యిసంవత్సరములు తపస్సుచేసి యుద్ధమునకు వెళ్లగానే నరుడు యుద్ధము మాని తపస్సుకు వెళ్ళడం ఈవిధంగా సహస్రకవ చుని 999 కవచాలు భేదించారు. తరువాత జన్మలో ఒక్క కవచంలో కర్ణునిగాపుట్టగా, నరనారాయణలు కృష్ణార్జనులుగా జన్మించి కర్ణుణ్ణి చంపారు.

### 722. ఆయుర్వేద ఆద్యుడు ఎవరు ?

ఆయుర్వేదాచార్యుడు. క్షీరసాగరమథనంలో చేతిలో కలశంతో పుట్టినవాడు. ఈయనకే అబ్జుడనే పేరుఉంది. ఒకసారి కాశీరాజు ధన్వుడు నారాయణుని అనుగ్రహం కోసం తపస్సుచేసాడు. తపస్సుకు మెచ్చిన నారాయణుడువరం కోరు కోమనగా 'నీఅంశతో పుత్రుడు' కావాలని అడిగాడు. భూలోకంలో ప్రజలు వివిధ రోగాలతో బాధపడడం చూసి దయతో నారాయణుడు తనఅంశగా 'ధన్వంతరి' అవతారంలో కాశీరాజు పుత్రునిగా జన్మించాడు. భరద్వాజుని వద్ద ఆయుర్వేదశాస్త్రం నేర్చుకున్నాడు.

### 723. మహావిష్ణువు వాహనము ఎవరు ?

పక్షిరాజు. శ్రీమహావిష్ణువు వాహనము. అనూరుడి సోదరుడు. అత్యంత బలశాలి. తల్లి వినత కాబట్టి వైనతేయుడని అంటారు. తండ్రి కశ్యపుడు. ఇంద్రుణ్ణి ఓడించి అమృతం తెచ్చి తల్లికి దాస్యవిముక్తి చేస్తాడు. ఇతడి రెక్కలు గట్టితనంవల్ల గరుడుని సుపర్ణుడు అంటారు. మణినాగుడనే శేషుని కుమారుడు విహరిస్తుండగా గరుడుడు ఆ పామును నోట కరుచుకుని వచ్చింది. ఆసర్పము శివుని ప్రార్థించింది. శివుడు ఆపామును విడిపించమని నందిని పంపగా, నంది విష్ణువుతో చెప్పెను. విష్ణువు చెప్పినా గరుడుడు ఆ పామును వదలలేదు. నీవు బలహీనుడవు కమ్మని విష్ణువు శపించగా, గరుడుడు విష్ణువును శరణు కోరగా నీవు శివుని ప్రార్దించమని చెప్పాడు. శివుని వద్దకు వెళ్ళి వేడుకొనగా నీవు గౌతమిలో స్నానము చేసి ప్రార్థించమని చెప్పాడు. ఇతడు స్నానంచేసి శివుని ప్రార్థించెను. గరుడుడు స్నానం చేసిన చోటు గరుడతీర్థమని బ్రహ్మ పురాణములో చెప్పబడింది. కాళింది నదిలో ప్రవేశిస్తే మరణి స్తావని సౌభ మహర్షి గరుత్మంతుణ్ణి శపిస్తాడు. ఇది చూసుకునే కాళీయమనే సర్పము ఇతనికి భయపడి ఆ మడుగులో దాక్కుంటుంది. ఇతడు జీమూతవాహనుణ్ణి రక్షిస్తాడు.

దేవాలయాలలో గరుడుని విగ్రహము మోకాళ్ళపై కూర్చుని నమస్కార ముద్రలో కనిపిస్తుంది. 2,4,8 చేతులు ఉంటాయి చేతులలో శంఖము. చక్రము, కత్తి,సర్పము మరియు అమృతపాత్ర ధరించినట్లున్న కొన్ని విగ్రహములు కనిపిస్తాయి.

### 724. మహావిష్ణువు శేషపాన్పు ఆదిశేషుడు ఎవరు ? శేషాద్రి ఎలా ఏర్పడినది ?

శేషుడు కద్రువ కుమారుడు. తండ్రి కశ్యపుడు. తన తల్లి వినతను, తమ్ములకు చేసిన అధర్మానికి కుపితుడై వారిని విడిచి బ్రహ్మను గురించి





తపస్సుచేసాడు. బ్రహ్మప్రత్యక్షమై నీవు సత్యధర్మ నిరతుడవు. నీవు భూభారమును వహించు, గరుడునితో సఖ్యము చేయుమని ఆదేశించాడు. భృగు మహర్షి శాపంవల్ల బలరామావతారం కలుగుతుంది.

శేషుడు సర్గములో విష్ణుని ద్వారమువద్ద కాపలాకాస్తుండగా, విష్ణు దర్శనార్థంవచ్చిన వాయువును అడ్డగించగా, గరుడుని తిరస్కరించి ముందుకు పోవడానికి ప్రయత్నించగా వారిరువురికి పోరాటానికి దిగి తమ బలాన్ని పరిక్షించుకోవడం ప్రారంభించారు. సందిడికి విష్ణువు బయటకు వచ్చి, శేషుడు మేరువు కుమారుడైన వెంకటాద్రిని చుట్టుకునును. వాయువు దానిని కదల్చాలి. కదిలితే వాయువు, కదలకపోతే శేషుడు బలవంతుడని చెప్పెను. శేషువు వెంకటాద్రిని గట్టిగా చుట్టుకొనగా వాయువు దానిని కదల్చి దూరంగా విసిరాడు. శేషువు చింతతో స్వర్గానికిపోవక విచారంతో ఉండగా విష్ణువు అతనిని ఓదార్చేడు. శేషుడు అదే పర్వతంపై ఉండడంతో అదే శేషాద్రి అయ్యిందని వేంకటేశ్వర మహత్యంలో చెప్పబడింది.

### 725. విష్ణుమూర్తి ఆయుధము పాంచజన్యము ప్రాశస్త్యము ఏమిటి ?

శ్రీమహావిష్ణువు ఆయుధము. పంచజనుడనే రాక్షసుని శరీరములో ఉన్న శంఖము. బలరామకృష్ణుల గురువైన సాందీపుని పుత్రుడు ప్రభాసతీర్థమున జలకాలాటాలు ఆడుతుండగా ఒక కెరటము వానిని కొట్టగా సముద్రములోకి కొట్టుకుపోయి నీటిలో మునిగిపోవగా పంచజనుడు మ్రింగాడు. సాందీపునికి గురుదక్షిణగా తన పుత్రుని కోరగా బలరామకృష్ణులు సముద్రుని వద్దకు వెళ్ళి గురుపుత్రుని ఇమ్మనికోరాడు. ప్రభాస తీర్థమున ఉన్న పాంచజన్యుడు మ్రింగాడని సముద్రుడు చెప్పగా ప్రభాస తీర్థములోదిగి పంచజనుడ్ని చూసి వానితో పోరాడి చీల్చివేసాడు. అందున్న శంఖాన్ని శ్రీకృష్ణుడు తీసుకుని యమపురికి వెళ్ళి ఆ శంఖాన్ని ఊదాడు. ఆ నాదానికి ఉలిక్కిపడిన యమధర్మరాజు శ్రీకృష్ణుడు వచ్చిన పనిని తెలుసుకుని సాందీపుని పుత్రుని ఇచ్చి పంపించాడని శ్రీమహాభాగవతములో చెప్పబడింది.

### 726. దంపతుల మధ్య అనురాగముపెంచే అర్థనారీశ్వరావతారం ఎలా వచ్చింది ?

బ్రహ్మ ప్రజలను సృష్టించాడు కాని వాళ్ళు ఎదుగు బొదుగు లేకుండా ఉండి పోయారు. ఆ కారణంగా ప్రజోత్పత్తి జరగలేదు. అపుడు ఆకాశవాణి "స్త్రీ పురుషులజంటలను కల్పించమని" ఆదేశించింది. కాని బ్రహ్మకు ఆ

MOHAN PUBLICATIONS.COM

రూపము ఏమిటో ఎలాఉంటుందో బోధపడలేదు. శివుణ్ణి ప్రార్ధించగా అనుగ్రహించిన శివుడు, సగము స్త్రీ,సగము పురుష రూపములో కనిపించాడు. తననుండి శక్తిని విడదీసి చూపించాడు. అపుడు బ్రహ్మ "స్త్రీలను సృష్టించడం నావల్ల కావడం కాలేదు. ఆ శక్తిని అనుగ్రహించమని కోరాడు". అపుడు శక్తి కనుబొమల నుండి ఒక దేవి ఆవిర్భవించింది. తక్షణమే శక్తి శివుడిలో లీనమైపోయింది. 'శక్తి!ఆబ్రహ్మ నీకైతపిస్తున్నాడు. అతనని అనుగ్రహించు"మని చెప్పి అంతర్ధానం చెందాడు.అదే అర్ధనారీశ్వరావతారం.

### 727. జ్ఞానము ప్రసాదించే దక్షిణామూర్తి ఎవరు ?

ఆది గురువుగా చెప్పబడ్డ మహేశ్వరుని రూపం దక్షిణామూర్తి. బ్రహ్మ విద్యా ప్రాప్తికోసం సనక సనందనాదులు సదాశివుని వద్దకు వెళ్ళారు. ఆ సమయంలో శివుడు గౌరిసమేతుడై దేవగణాల మధ్యన నాట్యం చేస్తున్నాడు. ఈ నృత్యగీత వినోదుడైన సంసారి తమకు బ్రహ్మవిద్యలను ఎలా బోధిస్తాడని అనుమానంతో వెనక్కి తిరిగారు. అలా తిరగగానే ఒక మర్రిచెట్టు క్రింద శివుడు యువరూపంలో కూర్చుని వృద్ధులైన శిష్యులకు వచ్చిన సందేహాలను తన మౌనంతో నివృత్తి చేస్తున్నాడు. ఆయనే దక్షిణామూర్తి. దక్షిణామూర్తి ద్వారా సనక సనందనాదులు బ్రహ్మజ్ఞానం పొందినట్లు చెప్పబడింది.

శివునియొక్క జ్ఞానస్వరూపం దక్షిణామూర్తి. మహావిష్ణువు యొక్క జ్ఞాన స్వరూపం హయగ్రీవావతారం. శివుదర్ధనారీశ్వర తత్త్వం. అర్ధనారీశ్వతత్త్వం రక్షణ పార్శ్వం ఒకటి. వామపార్శ్వం ఒకటి. దక్షిణ అంటే కుడివైపు. అది పురుష భాగం (పుంభావం) వామమంటే ఎడమభాగం స్త్రీరూపం. ఒకే చైతన్య త్తత్వం 'స్త్రీ-పుం' రూపంగా రెండుభాగాలయింది. అందుకే కాళిదాస మహా కవి 'స్త్రీ పుంసావాత్మభాగౌతే భిన్నమూర్తేస్సిసృక్షయా'అన్నాడు. దక్షిణ-దక్ష అంటే సమర్ధమైనది అని లాక్షణికార్థం. స్వతంత్రమైనదనిఅర్ధం. స్వతంత్రము స్వతః ప్రమాణసిద్ధమైంది జ్ఞానమొక్కటే. చైతన్యశక్తి రెండు అక్షులలో దక్షిణాక్షి లోనే విశేషంగా అభివ్యక్తమౌతుంది. తత్త్వానికి దక్షిణమైన మూర్తి జ్ఞానశక్తి అందుకే 'జ్ఞానశక్త్యవతారాయ దక్షిణా మూర్తయే నమః' అంటారు. దక్షిణాభి ముఖంగా వటవృక్షం క్రింద కూర్చున్న మూర్తి దక్షిణామూర్తి 'ఆచార్యేంద్రం' బ్రహ్మ విద్యను బోధించే ఆచార్య పురుషులందరకు మూలపురుషుడు. "మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వమ్" ఆయన





మౌనముద్రతో పరబ్రహ్మ తత్త్వాన్ని బోధిస్తున్నాడు. శివుని జ్ఞానశక్త్యవతారం దక్షిణామూర్తి.

### 728. అలక్ష్మి (జ్యేష్ఠాదేవి) ఎవరు ?

క్షీరసాగర మధనంలో లక్ష్మీదేవికంటే ముందు వచ్చినది అలక్ష్మి. ఈమెనెలా పూజించాలో బోధాయన సూత్రాలలో చెప్పబడింది. పదోశతాబ్దం కన్నా ముందర ఈమెను పూజించేవారు. తరువాత కాలంలో ఇది తగ్గిపోయింది. ఈమె పరాశక్తి అంశఅని శైవపురాణంలో చెప్పబడింది. మతాంతరంలో బ్రహ్మ మానస పుత్రికగా చెప్పబడింది. ఈమెను కపిలుడు వివాహం చేసుకున్నాడని వీరికి అధర్ముడనే పుత్రుడు కలిగినట్లు చెప్పబడింది. కొన్ని దేవాలయాలలో అందవికారమైన ముసలిరూపంలో, గాడిదపై కూర్చుని చేతిలో చీపురుతో ఉంటుంది. పతాకంపై కాకిఉంటుందని చెప్పబడింది. ఈమెను ఆరాధించిన వారికి కష్టనష్టాలు తొలగి అష్టైశ్వర్యాలను కలిగిస్తుందని చెప్పబడింది. ఈమెనే జ్యేష్ఠాదేవీ అని అంటారు. కొన్ని పురాణాలలో శనేశ్వరుని భార్యగా వర్ణిస్తారు.

### 729. శ్రీకృష్ణుని ప్రేయసి రాధ ఎవరు ?

శ్రీకృష్ణుని పేరు తలచిన వెంటనే గుర్తుకు వచ్చే మరోపేరు రాధ. నిష్కల్మషమైన ప్రేమ తత్త్వానికి రాధ ప్రతిరూపంగా రాధను పేర్కొంటారు.

ఇంద్రాణి విష్ణులోకంలో విష్ణువును పూజించి "నీ తొడపై కూర్చొనవలెననే కోరిక"ను కోరగా భూలోకములో నేను కృష్ణుడనై జన్మించినపుడు నీ కోరిక తీర్చెదనని వరమిచ్చాడు. శచిదేవే రాధ అని చెప్పబడింది.

హరివంశములో పుట్టిన రాజైన వృషభానునికి కళావతిద్వారా పుట్టిన కుమారైరాధ. శ్రీకృష్ణునికి మేనత్త. కృష్ణుడు గోలోకములో ఉన్నపుడు ఆయన శరీరంనుండి పుట్టినది కావడంతో అంటే రాసమునుండి పుట్టినది కనుక రాధ అయింది. శ్రీకృష్ణుడు రాధను మోహించాడు. రాధ శరీరమునందలి రోమకూపములనుండి గోపికలుపుట్టారు. రాధమాధవుల ప్రేమ అలౌకికము, అభౌతికమైనదిగా ఖ్యాతి చెందింది. వీరి సన్నిహిత సంబంధ మాధుర్యం సాటిలేనిది కానుక దీనికి మధురభక్తి అనే పేరువచ్చింది.

### 730. సర్పదోష నివారణకు మానసాదేవి పూజ చేయాలా ?

సర్పదోశాంతికి చేసే పూజలలో ముఖ్యమైనది మానసాదేవి పూజ. కశ్యప ప్రజాపతి మానసపుత్రిక మానసాదేవి. ఈమెకే జరత్కారువనే

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

పేరు ఉంది. పూర్వకాలం భూలోకంలో సర్పభయం ఎక్కువుగా ఉండడంతో అందరు కశ్యపుని శరణు వేడగా బ్రహ్మదేవుని సహాయంతో వేదాలనుండి బీజాక్షరాలను కూర్చి మంత్రాలను సృష్టించాడు. వాటికి అధిష్ఠాన దేవత మానసా దేవి. మానసాదేవి శివుని గురించి తపస్సుచేయగా, శివుని ఆజ్ఞ మేరకు పుష్కర క్షేత్రంలో మూడు యుగాలు తపస్సుచేసింది. శ్రీకృష్ణుడు సర్వలోక పూజితవు కమ్మని వరంఇచ్చి తానే మొదటగా పూజించగా తరువాత శంకరుడు మిగిలిన దేవతలు పూజించారు. కశ్యపుడు ఈమెను జగత్కారు మునీంద్రునకు ఇచ్చి వివాహం చేసాడు.

ఒకనాడు మానసాదేవి ఒడిలో జరత్కారుడు నిద్రిస్తుండగా సంధ్యా సమయమై నిత్యకర్మకు వేళ మించిపోతోందన్న కంగారులో నిద్రిస్తున్న భర్తను మేల్కొపగా, కోపించిన జరత్కారుడు ఆమెని విడిచిపోయాడు. వారికి కలిగిన సంతానమే అస్తీకుడు. జనమేజయుడు సర్పయాగము చేస్తున్న సందర్భంలో ఇంద్రాది దేవతల ప్రార్ధనలతో మానసాదేవి తన కుమారుడైన అస్తీకుని పంపి యాగమును ఆపించింది.

### 731. గణేశుని పుత్రిక సంతోషీమాత ఎవరు ?

ఉత్తరభారతదేశంలో పూజలందుకుంటున్న మరొక దేవత సంతోషీ మాత. ఒకసారి గణేశ పుత్రులైన క్షేమ లాభములు సోదరీ సోదరుల మధ్య అనుబంధానికి ప్రతీకగా చెప్పబడిన రక్షాబంధనము తాము చేసుకోవాల నుందని గణేశుని కోరగా గణేశుని సంకల్పముచే నేత్రముల నుండి ఒక జ్యోతి వెలువడి ఒక బాలిక రూపం ధరించింది. గణేశ పుత్రులైన క్షేమ లాభములకు విశేషమైన సంతోషము కలిగించినది కావడంతో ఆమెకు సంతోషీ దేవతగా, సంతోషీమాత అయినట్లు చెప్పబడింది.

### 732. జ్వరములు నివారణకు శీతలాదేవి స్మరించాలా ?

ఉత్తరాదిన, బెంగాల్, ఒరిస్సా రాష్ట్రములలో వ్యాధులను నివారింప చేసే దేవతగా శీతలాదేవిని విశేషంగా ఆరాధిస్తారు. అనంత శక్తి స్వరూపిణి అయిన జగదాంబ తన అనంత అనుగ్రహాన్ని వివిధ రకాలుగా అందించ డానికి దాల్చిన రూపాలలో శీతలాదేవి ఒకటి.

గాడిదవాహనంపై కూర్చుని చేట,చీపురు, కలశంతో ఈ దేవి రోగ నాశక శక్తులకు సంకేతం.(అలక్ష్మికి ఇదే రకమైన రూపము కలిగి ఉంది.) తెలుగుదేశంలోను వివిధ వ్యాధులకు అమ్మవార్లను, గ్రామదేవతలను





కొలవడం అందరికి తెలిసిందే. పిల్లలకు వచ్చే ఆటలమ్మ (అమ్మోరు) నివారణకు ఈ దేవినామస్మరణ చేయడంతోనే జ్వరతాపాలను పోగొడు తుందని చెపుతారు.

### 733. ధనాధిపతి కుబేరుడు ఎవరు ?

విశ్రావసువు, ఇలబిలల కొడుకు. అందుకని వైశ్రవణుడు, ఐలబిలుడు అని పిలుస్తారు. యక్షులకు, గుహ్యకులకు ప్రభువుగా చెప్పబడ్డాడు. రాజాధి రాజనే బిరుదు కలిగిఉన్నాడు.సముద్రాధిపతి. శివునికి స్నేహితుడు. బ్రహ్మవల్ల నలకూబరుడనే కుమారుడిని, లోకపాలకత్వాన్ని, ధనాధిపత్యాన్ని, ఉత్తరదిశాధి పత్యాన్ని మరియు లంకను వరంగా పొందాడు. తండ్రి అనుమ తితో లంకలో జీవిస్తుంటాడు. కాని రావణుని చేతిలోఓడి, పుష్పక విమానం కూడా పోగొట్టుకుని గంథమాదన పర్వతం చేరుకుంటాడు. కుబేరునిసభ ప్రసిద్ధిచెందింది. బ్రాహ్మణులను చంపినందుకు విరూపాక్షుడనే గంధర్వుణ్ణి కుబేరుడు శపిస్తాడు. పార్వతీదేవిని అసూయతో చూసినందుకు పింగాళా క్షుడిగా మారతాడు. అందుకే ఏకపింగుడు, ఏకపింగళుడు అని పిలుస్తారు. మణిమంతునితో కలసి పుష్పకంపై తిరుగుతుండగా మణిమం తుడు ఉమ్మేస్తే అది అగస్త్యుడు మీద పడడడంతో వారిని శపిస్తాడు.

పద్మావతితో వివాహ జరిగే సందర్భంలో శ్రీవేంకటేశ్వరుడు కుబేరుని వద్ద ధనాన్ని అప్పుతీసుకున్నాడని, శ్రీ వేంకటేశ్వరునికి భక్తులు చెల్లించిన ముడుపులు అప్పుమీద వడ్డీగా జమచేయబడతాయని, కలియుంతాంలో కుబేరుని అప్పు తీరుతుందని శ్రీవేంకటేశ్వరమహత్యంలో చెప్పబడింది.

బంగారము వంటి శరీరచ్చాయ, రెండు నేత్రములు, నాలుగు చేతు లలో క్రిందవి అభయ వరదహస్తములు, పైవి చేతులలో కత్తి,డాలును పట్టిఉండే యజ్ఞసూత్రము, ఉత్తరీయము, సర్వాభరణములతో, భార్య చిత్ర రేఖాదేవి, అశ్వవాహనము ఎక్కి ఉంటారు.

### 734. మనిషి మృత్యువు తరువాత ఎక్కడికి పోవును ?

మనిషి మృత్యువు తర్వాత తన కర్మననుసరించి పరలోకమునకు పోవును. ఏ మానవుడైతే విద్యాలయములు, అన్నసత్రములు, దేవాలయ ములు నిర్మించి దీనజనులకు సేవచేయునో అతడు చంద్రలోకములో సుఖముగ ఉండును. మరియు ఏ మానవుడైతే వాజపేయ సోమయాగాది హవనములు చేయునో అతడు స్వర్గలోకములో సుఖముపొందును. ఈరెండు

విధములైన మానవులు పరలోకములో కొంతకాలము సుఖముగా ఉండి మరల భూలోకమున జన్మింతురు. కాని ఎవరైతే సగుణ బ్రహ్మణ ఉపాసన చేయుదురో వారు బ్రహ్మలోకమునకుపోయి బ్రహ్మజ్ఞానమును పొంది అచ్చటనే ముక్తిపొందెదరు. ఇంతే కాకుండ పాపకర్మల నాచరించిన జనులు మరణానంతరము యమలోకము నందు పాపఫలములనుభవించి తిరిగి భూలోకముననే జన్మింతురు.

### 735. నాలుగు యుగములలో క్రమముగ ఒక్కొక్క యుగముయొక్క కాల ప్రమాణ మెంత ?

కృతయుగము–17,28,000వర్షములు, త్రేతాయుగము–12,96,000 వర్షములు, ద్వాపరయుగము 8,64,000 వర్షములు, కలియగము – 4,32,000 వర్షములు. ఈ విధముగ నాలుగు యుగములు కలిసి ఒక మహాయుగము అగును. 1000 మహాయుగములు గడిచినచో సృష్టికర్తయైన బ్రహ్మకు ఒకదినము. ఈవిధముగ 1000 మహాయుగములు గడిచిన పిమ్మట బ్రహ్మకు ఒక రాత్రి అగును. 432,00,00,000 సంవత్సర ములు బ్రహ్మకు ఒక రాత్రిఅగును. అనగా 432,00,00,000 సంవత్సర ములు బ్రహ్మకు ఒకదినము. మరల ఇన్ని సంవత్సరములైనచో ఒక రాత్రి.

### 736. వీధిగుమ్మంలో ఏ ఫోటో తగిలించాలి ? ఇంటికి వెనుక ఏ ఫోటో తగిలించాలి?

వినాయకుడి ఫోటోను వీధి గుమ్మంలో తగిలించవచ్చును. తన తొండముతో అసురశక్తుల పీడలను తరుముతాడు. హనుమంతుడి ఫోటో ఇంటివెనుక తగిలించాలి. తనతోకతో అసురశక్తులను తరుముతాడు.

### 737. నది నదము గల వ్యత్యాసము ఏమిటి ?

తూర్పుదిక్కువైపు ప్రవహిస్తూ పోయి తనంత తానే సముద్రంలో కలిసేది నది అనబడుతుంది. పడమట దిక్కువైపు ప్రవహిస్తూ పోయి అక్కడ నదితో చేరి సముద్రదంలో కలిసేది నదము అనబడుతుంది.

### 738. విగ్రహాలకి పూజచేసే పద్ధతి ఏమిటి ?

పురుషులైతే తలకుస్నానము చెయ్యవలసి ఉన్నది. స్త్రీలు కంఠం వరకు స్నానంచేస్తే సరిపోతుంది. స్నానంచేసిన తరువాత తడిలేని పొడిబట్టలు కట్టుకుని నుదుట కుంకుమ పెట్టుకోవాలి. నిత్యవిధులు నిర్వర్తించాలి.





పూజగదికివెళ్ళి ముందురోజు పెట్టిన గంధం, పువ్వులు తీసివేయాలి. దీపం వెలిగించి తిరిది క్రొత్తగా చందనం, కుంకుమపెట్టి పుష్పాలు సమర్పించాలి. పిమ్మట అగరువత్తి ధూపం, దీపం సమర్పించి పాలు,పళ్ళు,ద్రాక్ష మొదలైనవి నైవేద్యం పెట్టాలి. ఆ తరువాత హారతి కర్పూరం వెలిగించి, దీపారాధన చెయ్యాలి. హారతి కళ్ళకద్దు కుని, పువ్వులు తీసుకుని పుష్పాంజలి సమర్పించి నమస్కారం చెయ్యాలి. విగ్రహపూజ చేయాలనుకొనేవారు ఎవరైనా ఆ విషయం, వివరాలు తెలిసిన పెద్దవారి వద్ద ఆయా మూర్తికి సంబంధించిన మంత్రాలు ఉపదేశం పొంది విగ్రహపూజ చేయవచ్చును. స్త్రీలుఉపదేశం పొందినా సరే పంచలోహ విగ్రహమూర్తులను మాత్రముతాకి పూజ చేయవచ్చునే కాని పంచాయతన పూజా మూర్తులనుతాకి అర్పించకూడదు.

ఇంట్లో “అంగుష్ఠ” పరిమాణమునకు మించి ఉన్న విగ్రహములుపెట్టి పూజ చెయ్యకూడదు. నివేదనం చేస్తున్నపుడు నీళ్ళుచల్లి, ఒక పుష్పంవేసి నైవేద్యం పెట్టవలెను. అప్పుడే అక్కడ ఉన్న దుష్టశక్తులు తొలగి దేవునికి పవిత్రమైన నివేదనము చేసినట్లు అవుతుంది.

### 739. పంచాయతనములో ఐదు పంచమూర్తులు ఏయే ప్రదేశములలో లభించును?

1. స్వర్ణముఖి అనేనది నుండి అమ్మవారిగా పరిగణింపబడే శిల లభిస్తుంది. 2. స్ఫటికం నుండి సూర్యభగవానుడు లభిస్తాడు. 3. నర్మదా నది నుండి శివుడు గోచరమవుతాడు. 4. గండకినది నుండి విష్ణువుగా పరిగణింపబడే సాలగ్రామము ఆవిర్భవిస్తుంది. 5. గోమతినది నుండి వినాయకుడు ఉద్భవిస్తాడు.

### 740. ఏయే లోహాలతో చేసిన దీపాలను వెలిగించవచ్చును?

కంచు, ఇత్తడి, వెండి మరియు మట్టి ప్రమిదలతో దీపం వెలిగించ వచ్చును. ఏ పరిస్థితులలోను ఇనుము, స్టెయిన్‌లెస్ స్టీలుతో చేసిన కుందిలో దీపం పెట్టకూడదు.

### 741. దేవుని హారతి వల్ల కళ్లకు ప్రయోజనము ఏమిటి ?

ఆ జ్యోతి కళ్ళద్వారా వెళ్ళి మన హృదయమును పరిశుద్ధపరచవలెను. కర్పూరం ఏవిధంగా కరిగిపోయి పవిత్రంగా, ప్రకాశవంతంగా వెలుగు తుందో అదేవిధంగా మనలో ఉన్నదుర్గుణాలన్ని పోయి అంతరంగం ప్రకాశవంతంగా ఉండాలి అని హారతి కళ్లకద్దుకుంటాము.

MOHAN PUBLICATIONS.COM

## 742. పుట్ట ఉన్న స్థలం కొనవచ్చునా ?

మరొక మంచి స్థలం ఏదైనా కొనటానికి ప్రయత్నం చేయాలి. దొరకని పక్షంలో కొంతకాలం ఆగితే ఆ స్థలం దగ్గర మనుష్య సంచారం పెరిగితే పాము ఆ పుట్ట దగ్గరకు రావటం మానివేస్తుంది. అప్పుడు పాము లేకుండా కేవలం పుట్ట మాత్రమే అయినట్లయితే ఆ పుట్టవలన దోషం లేదు. ఆ పుట్టని తీసివేసి ఆ స్థలంలో ఇల్లు కట్టుకొనవచ్చును.

## 743. పాలను అభిషేకమునకు ఉపయోగించవచ్చునా ?

ఉదయం తీసిన పాలను సాయంత్రం అభిషేకమునకు ఉపయోగించ కూడదు. ఉదయం తీసినపాలను ఉదయం అభిషేకము కొరకు, సాయంత్రం తీసినపాలను సాయంత్రం అభిషేకం కొరకు ఉపయోగించవలెను.

## 744. విభూతిని నీటితో తడిపి నుదుటిమీద పెట్టుకోకూడదా ?

స్నానము చేయక మునుపు విభూతిని నీళ్ళతో తడిపి పెట్టుకొనకూడదు. స్నానము చేసిన తరువాత విభూతిని నీళ్ళతో తడిపి పెట్టుకొనవచ్చును. ఆ విధముగనే సాయంత్రం నీటితో తడపకుండా పెట్టుకొనవలెను.

## 745. క్రొత్తబట్టలు పసుపు పెట్టి ధరింపవలెనా ?

కొత్త వస్త్రములు ఎల్లప్పుడు శుభమును చేకూర్చుటకు వాటిని ధరించిన వారికి దృష్టి దోషము తగులకుండ ఉండుటకు పసుపు బొట్టుపెట్టి ధరించ వలెను.

## 746. ఆచమన తీర్థము ఎలా స్వీకరించాలి ?

హృదయం వరకు పోవునంత, (కుడిచేతిలో మినపగింజ మునుగునంత పరిమాణము) జలమును తీసుకుని చూపుడు వ్రేలును మడచి, బొటను వ్రేలును చూపుడు వ్రేలు వెనకభాగము నుండి మధ్యవ్రేలు మధ్యరేఖను తాకునట్లు పెట్టి ఆచమనము చేయవలెను.

## 747. చిన్ముద్ర అంటే ఏమిటో వివరించండి ?

చిత్+ముద్ర పరలోకాన్ని సూచించే చిహ్నము. చూపుడు వ్రేలును బొటన వ్రేలు క్రింద భాగానికి చేర్చి మిగిలిన మూడువ్రేళ్ళను విడిగా ఒక ప్రక్కకి పెట్టి చూపించే ముద్ర. బొటనవ్రేలు దైవాన్ని, చూపుడు వ్రేలు ఆత్మను, మిగిలిన మూడు వ్రేళ్ళలో మధ్యవ్రేలు అహంకారమును, ఉంగరపు





వ్రేలు కర్మను, చిటికిన వ్రేలు మాయను సూచిస్తాయి. మూడింతలుగా పెరిగి నిలచిన ఆత్మక్రుంగిచేరి సచ్చిదానంద సాగరంలో ఓలలాడటమే ఈ ముద్రలోని అంతరార్థం.

## 748. ఆదిత్య హృదయం స్తోత్రం స్త్రీలు పారాయణం చేయవచ్చునా?

ఆదిత్య హృదయం సూర్యభగవానుని స్తుతించే స్తోత్రము. అందరూ పఠించ వచ్చును. చిరువయస్సునుండే సూర్యుని ఆరాధన, సూర్యనమస్కా రాలు చెయ్యటం నేర్పించవలెను. పూర్వకాలంలో వనవాసంచేసే ఋషులవద్ద విద్య నేర్చుకొనుటకు వెళ్ళే విద్యార్థులు ప్రతిరోజు సూర్య నమస్కార ములు చేస్తుండేవారు. అందువలన శరీరానికి బలం వస్తుంది. ముఖంలో తేజస్సు ఒలుకుతుంది. చదువులో ఉత్తీర్ణులయ్యే జ్ఞానం కలుగుతుంది. సూర్యుడు తేజోమయుడు. ఆయనని అందరూ ఆరాధించవచ్చును.

## 749. భక్తుల తలమీద శఠగోపం పెట్టటం ఎందుకు ?

వైష్ణవ దేవాలయానికి వెళ్ళే భక్తులందరు అక్కడవున్న అన్ని హైందవ సన్నిధానములలోను తీర్థం, తులసి, పసుపు, కుంకుమ మొదలైన ప్రసాదాలు తీసుకుని తలమీద శఠగోపం పెట్టించుకుని వస్తేనే ఆయా సన్నిధానములలో ఆరాధన పూర్తియైనట్లు తలుస్తారు. పాదుకలే శ్రీ శఠగోపం, శ్రీశఠగోపమే ఆళ్వారు.పాదుకలు,శఠగోపం, ఆళ్వారు అంతా ఒకటే (శఠగోపం అంటేపాదు కలు) అంటే శఠగోపం ద్వారానేకదా శ్రీపతియైన భగవానుని దివ్యచరణాల మీద మన శిరస్సును సమర్పించ సాధ్యమవుతుంది.

## 750. ఇంట్లో పెద్దలకు, దేవాలయంలో దేవునికి ఏవిధంగా నమస్కారం చెయ్యాలి ?

ఇంట్లో పెద్దవాళ్ళకి ఒకసారి మనపేరు మొదలైన వివరాలు చెప్పి నమస్క రించాలి. పెద్దవారు కూడా నమస్కారంచేసిన పిన్నలను ఆశీర్వదించ వలసివున్నది. శివాలయంలో నందీశ్వరునికి బయటనే నమస్కారం చేయాలి. స్త్రీలు మూడుసార్లు, పంచాంగ నమస్కారం చేయాలి. సాష్టాంగం అంటే లలాటం, రెండుకళ్ళు, రెండు భుజాలు, రెండు మోకాళ్ళు రెండుపాదాలు, భుజాల నుండి రెండు నడుము వరకుగల భాగాలు. ఈ శరీర భాగలన్నీ భూమిని తాకునట్లుగ వంగి నమస్కారం చేయాలి.

పంచాంగం అంటే లలాటం, రెండు మోకాళ్ళు, రెండుపాదాలు. ఇవి గాక మిగిలిన శరీరభాగాలు ఏవీ భూమిని తాకకూడదు. దేవన వద్ద నమస్కా

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

రం చేస్తున్నపుడు మనపేరు వివరాలు చెప్పనవసరములేదు. మనం చేసిన తప్పులు మన్నించమని కోరుతూ నమస్కరించాలి.

సన్యాసులకు స్త్రీలు, పురుషులు అందరూ నాలుగుసార్లు నమస్కారం చేయాలి. మనపేరు, వివరాలు చెప్పనవసకరంలేదు. ఓం నమోనారాయణాయ అని చెప్పి నమస్కరించాలి. సన్యాసులు కూడా నమస్కారం స్వీకరిస్తూ నారాయణ అని చెప్పి ఆశీర్వదించవలసి ఉన్నది.

### 751. స్త్రీలు సుందరకాండ పారాయణము చేయవచ్చునా ?

స్త్రీలు సుందరకాండ పారాయణము చేయవచ్చును. మంచిరోజు, మంచిసమయములో వేదపండితుని ద్వారా ఆరంభింపవలెను. పారాయణం పూర్తిఅయిన రోజు ఒకసుమంగళికి లేదా ఒక మంచి వ్యక్తికి భోజనము పెట్టిన మంచిది. కోరిన ఫలము లభించును.

### 752. ముక్తిని ప్రసాదించే నగరములు ఏవి ?

అయోధ్య : శ్రీరామచంద్రుని జన్మస్థలము. ఈ పవిత్రమైన పుణ్యభూమిలో మరణించిన పుణ్యము; మధుర : శ్రీకృష్ణ పరమాత్మ జన్మస్థానము. ఇక్కడ మరణించిన మోక్షము వస్తుంది; కాశి : ఇక్కడ మరణించిన సద్గతులు కలుగుతాయి; హరిద్వార్ : ఇదియే గంగానది ఉత్పత్తి అయినస్థలము. ఈ గంగా దేవిని తలిస్తేనే పుణ్యం వస్తుంది; ఉజ్జయిని : ఇది సకల జనులకు ముక్తిని ప్రసాదించిన క్షేత్రం; ద్వారక : ఇక్కడ మరణిస్తే ముక్తి నిశ్చయము; ఏడవదికాంచీపురము: ఇక్కడ నివసిస్తేనే ముక్తిని ప్రసాదించే స్థలము. ఇక్కడ కామాక్షి అమ్మవారు విశేషంగా జీవన్ముక్తి ప్రసాదించటానికే వెలసియున్నారు. మనస్సును, అహంకార మును, ఆశలను, కోరికలను అణచివేయటం వలన ఇక్కడ జీవన్ముక్తిని ప్రసాదించగల పుణ్యక్షేత్రముఅయి వుండటమే కాంచీపురము యొక్క ప్రాముఖ్యత, ప్రత్యేకత.

### 753. ఏవారం ఏ పనులు చేయాలి ?

ఆదివారం : మంగళకృత్యాలు, ఉత్సవాలు, యుద్ధం, రాజ్యాభిషేకం, ధ్యానం, వ్యవసాయప్రారంభం, ఔషధ సేవనం, ఉపదేశం, మంత్రపఠనం, ఉత్తరదిక్కు ప్రయాణం,కెంపుధారణ; సోమవారం : ముత్యం,స్ఫటికం, జలాశయ నిర్మాణం, ఉపనయనం, స్థంభప్రతిష్ఠ,సంగీత, నృత్య, లలితకళలు, వెండి, తెల్లని వస్త్రధారణ, దక్షిణ దిక్కుప్రయాణం, సమస్త వాస్తుకర్మలు, వ్యవసాయం; మంగళవారం : వెండి,బంగారు,రాగి,ఇత్తడి ఇనుము కొలిమిలో కరిగించుట, కోర్టువ్యవహారం, కందులు,మేలశనగవిత్తనాలు వేయుట, సాహస విషయాలు తూర్పుదిక్కు ప్రయాణం, పగడం ధరించుట; బుధవారం: బంగారునగలు, వాహనం,శిల్పం,విద్యలు, వివాహం, వ్యాపారం, గణితం రత్నాభరణ ప్రక్రియ, యుక్తిపన్నడం, రాజీచేయడం,తోటలు, పెసలుపైరు వేయుట, పడమట దిక్కు ప్రయాణం, మరకతధారణ; గురువారం: యజ్ఞయాగది కర్మకాండ వివాహాది శుభక్రతువులు, విద్యారంభం, యుద్ధారంభం, దేవపూజ, శనగలు, పుష్యరాగ ధారణ,పడమరదిక్కు ప్రయాణం; శుక్రవారం: స్త్రీసంబంధ క్రియలు,ప్రేమ,వివాహపు నిర్ణయాలు వజ్ర,వైడూర్య ఆభరణ ధారణ, సుగంధద్రవ్యాలు,శయ్య, ఉద్యోగప్రయత్నం, కొత్తబట్టలు ధరించడం, సాహిత్య, కళావిషయాలు, ఉత్తరం వైపు ప్రయాణం; శనివారం : చెక్కడం, కొట్టడం, సీసపు పనులు, తగరం, ఇనుముపనులు, వెల్డింగ్ స్థిరమైన పనులు, గృహనిర్మాణపునాదులు, ఆవులు, గేదెలు, కూలీలను చేర్చుకొనుట, ఆయుధ నిర్మాణం, శనిదోష నివృత్తిపూజలు.





### 754. ఏ ఏ వారము శివస్తోత్రములు పారాయణచేయాలి?

ఆదివారము – అఖిలాష్టమకము – సర్వాభీష్టసిద్ధి, సంతానము; సోమవారం – చంద్రశేఖరాష్టకము–ఆయుష్షు, ఆరోగ్యం మనశ్శాంతి; మంగళ వారము–కాలభైరవాష్టకమ్–సర్వదోష పరిహారం; బుధవారం–విశ్వనాథాష్టకమ్– విద్య, ధనధాన్య సమృద్ధి; గురువారము–శివాష్టకమ్ –సర్వపాపనాశనం; శుక్ర వారము–లింగాష్టకమ్–ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మనాశనం; శనివారము–శివ నామావళిఅష్టకమ్–ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మనాశనం.

### 755. రావణాసురుడు అపహరించినది మాయసీతనా ?

ఈ విషయం వాల్మీకి రామాయణంలోలేదు. అయితే దేవీభాగవతంలో చెప్పబడినది. శ్రీరామచంద్రుడు సాక్షాత్ శ్రీమన్నానారయణుడే. సీతాదేవి మహా పతివ్రత. ఆమెను తాకుట అనే అవకాశం రావణాసురునికి లేదు. అందువలన రావణుడు సీతాపహరణకు ఆలోచన చేసిన వెంటనే అగ్నదేవుడు రాముని దగ్గరకు వెళ్ళి విషయం తెలిపి అసలు సీతను తనవద్ద వుంచుకొని మాయ సీతను రావణునికి అందునట్లు చేసెను. అందుకే రాముడు, రావణ వధానంతరం సీతను అగ్నిప్రవేశం చేయించి తర్వాత మాయసీతను అగ్నికి అప్పగించి అసలు సీతను పరిగ్రహించెను. మాయసీత కోసం యింత

MOHAN PUBLICATIONS.COM

చేయవలసిన అవసరం రాముడికి ఏమిటి అంటే?" రామావతార లక్ష్యం రావణసంహారం.

## 756. "ధనము, నగలు, ఆహార ధాన్యములు వంటివి విసిరివేయ కూడదు"అంటారు. నిజమా?

ధనమూ, నగలు, ఆపరధాన్యములు, ఇవి అన్నీ ఐశ్వర్యం అని అంటారు. ఐశ్వర్యం అంటే లక్ష్మీప్రదం. భారతీయ సంస్కృతిలో అమ్మవారి అనుగ్రహంవుంటే కానీ ఇటువంటి ఐశ్వర్యాలు లభింపవు అని పెద్దలవాదన. లక్ష్మి అనుగ్రహంతో లభించిన ఈ ఐశ్వర్యాలను విసిరివేయడం అంటే లక్ష్మీదేవిని వద్దను కోవడమే. అలా లక్ష్మీదేవి ప్రసాదం వద్దనుకునేవారికి కి దరిద్రం లభిస్తుంది. సౌభాగ్యం నశిస్తుంది. రామాయణంలో కైకేయి ఒకసారి "రాముణ్ణి అరణ్యములకు పంపుట, భరతుని రాజ్యపట్టాభిషేకంచేయుట, అనే కోరికలు కోరుకునే నిమిత్తంగా ఆవిడ తనఆగ్రహావేశాలతో ఒంటి మీదనున్న నగలు విసిరేసినట్లుగా రామాయణంలోవున్నది. మరి అమ్మవారికి ఆగ్రహం వచ్చిందేమో? కైకేయి ప్రవర్తన ప్రభావంగా దశరథుని మరణం, తద్వారా కైకేయికి సౌభాగ్యలక్ష్మి దూరమైనది. మీరు అడిగిన పై మూడు కాకుండా పనిముట్లు, వంటసామాగ్రి, యిలా ఓ వస్తువు అయిన అమ్మవారి అనుగ్రహం ఉంటేనే వాటిని వాడుకో గలుగుతాం. అందువలన మనం అనుభవిస్తున్న ప్రతి వస్తువును ఆగ్రహంతో చూడకూడదు. విసరుట, కాళ్ళతో తన్నుట, వంటి ద్వారా వాటిని అనుభవించ లేని దరిద్రం మరొకరూపంలో ప్రారంభమవుతుంది.

## 757. నవగ్రహాలకు గర్భాలయాలు వుండవు ఎందుకు ?

నవగ్రహాలకు విడివిడిగా ఆలయాలు కట్టేటట్లయితే గర్భగుడి కట్టవచ్చు. తమిళనాడులో సూర్యనార్ కోయల్ దగ్గర నవగ్రహాలకు విడిగా గర్భాలయాలతో ఆలయా లున్నాయి. నవగ్రహాలు ఒకపీఠంమీద నిర్మాణం చేసినప్పుడు ఆ విగ్రహాలు అష్టదిక్కులకు అభిముఖంగా వుంటాయి. అలావున్నప్పుడు గర్భాలయ నిర్మా ణం చేయరాదు. కారణం గర్భాలయంలోవున్న ఏవిగ్రహాన్ని అయినాసరే భక్తులు ఎదురుగా వుండి చూచునటుల విగ్రహాలు ఏర్పాటుఅవుతాయి. మరి నవగ్రహాలలో సూర్యశక్తులు మాత్రమే భక్తుడికి అభిముఖంగా వుండి మిగిలినవి వేరువేరు దిక్కులలో వుంటాయి. కావున వాటిని దర్శించుటకు భక్తుడు విగ్రహం దగ్గరకు వెళ్ళాలి లేనిదే ఆ పీఠం





మీద మిగిలిన విగ్రహాలు దర్శనీయంకావు. అందువలన భక్తులందరూ లోపలకు వెళ్ళాలంటే గర్భా లయంలాగా నిర్మాణం చేస్తే ఆగమ ధర్మాలకు విరోధం అవుతుంది. కావున ఒకపీఠంమీద తొమ్మిది విగ్రహాలు(నవగ్రహాలు) వుంచినప్పుడు గర్భాలయాలు పనికిరావు.

## 758. లక్ష్మీదేవి ఇష్టపడే స్త్రీలు ఎలా ఉండాలి ?

ఒకరోజు వైకుంఠంలో ఉన్న లక్ష్మీదేవి మందిరానికి రుక్మిణీదేవి వెళ్లింది. ఇద్దరూ పరస్పరం మాట్లాడుకొనే సందర్భంలో రుక్మిణి, లక్ష్మీదేవిని ఇలా అడిగింది."సోదరీ! నీవు ఏ స్త్రీలదగ్గర ఉండటానికి ఇష్టపడతావు? ఏ స్త్రీలు నీకుప్రియమైనవారు? నీకు ప్రీతిపాత్రులు కావటానికి ఆడవారు ఏం చెయ్యాలి?"

లక్ష్మీదేవి చిరునవ్వు నవ్వి ఇలా అంది "తన స్వామిపట్ల అచంచలభక్తి ఉన్నస్త్రీఅంటే నాకు చాలా ఇష్టం. ఒక్క క్షణం కూడా ఆమెను విడిచి ఉండను. అలాంటివారి దగ్గర ఉండటంవల్ల నాకు సంతోషం కలుగుతుంది. సమస్త గుణాలు ఉన్నా తన భర్తను గౌరవించని స్త్రీలని నేను తిరస్కరిస్తాను. వారిని నా దగ్గరికిరానివ్వను. ఇతరుల అపరాధాలను మన్నించే క్షమాగుణం కలిగిన స్త్రీ ఇంట్లో నేను నివసిస్తాను. సత్యం మాట్లాడే స్త్రీలు నాకు ప్రియమైనవారు. నిష్కపటంగా ఉన్న స్త్రీలు నన్ను పొందగలరు. మోసం, కపట స్వభావంతో ఇతరులను బాధపెట్టేవారిని నేను ఎంతమాత్రం ఇష్టపడను, నా దర్శనం వారికి లభించదు.

పవిత్రంగా ఉండి, నిర్దిష్టమైన నడవకి కలిగి, దేవతలను, బ్రాహ్మణులను పూర్తి గౌరవాలతోచూసే స్త్రీలు, పతివ్రతలైనస్త్రీలు, అతిథి సేవచేయాలని కోరే స్త్రీలు, నన్ను సులభంగా పొందగలరు. ఇంద్రియాలను జయించి, పరపురు షులను క్షణం కూడా భావించని స్త్రీలగృహం నుండి నేను ఎప్పటికీ వెళ్లను. వారే నన్ను తమఅధీనంలో ఉంచుకుంటారు."

"చెల్లెలా! నేను, ఎవరిని ఎంతమాత్రం ఇష్టపడనో వారి గురించి కూడా వివరిస్తాను. భర్తను వ్యతిరేకించి, బాధించే స్త్రీలు, పరుషంగా మాట్లాడి నొప్పించే స్త్రీలు నాకు అసంతృప్తి, క్రోధం కలిగిస్తారు. పరపురుషులను కోరేవారు, పరుల ఇంట్లో నివసించేవారు, అటువంటి స్త్రీలు నరకంలో కీటకాలవుతారు. నేను వారి దగ్గర ఉండటం కలలో కూడా ఇష్టపడను. నిర్లజ్జగా పోట్లాడే స్వభావం, పరుషవాక్కు, అతిభాషణ కలిగిన స్త్రీలు నాకు

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

సంతోషం కలిగించరు. అందరి తోను అతిగా మాట్లాడే మహిల, పోట్లాడే స్త్రీ, స్నేహభావం,దయలేని స్త్రీలను నేను త్యజిస్తాను. సోమరితనం, అతి నిద్ర, పెద్దలపట్ల అవినయం, అ్యవవస్థిత మైన గృహవాతావరణం, ఇంట్లోని వస్తువులపట్ల నిరాదరణగల స్త్రీలు ఎప్పటికీ నావారు (లక్ష్మీప్రాప్తి కలిగిన వారు) కాలేరు."

## 759. వివాహం నక్షత్రాలు ఏవి ?

27 నక్షత్రాల్లో మఖ, మూల, మృగశిర, హస్త, అనూరాధ, స్వాతి, ఉత్తరఫల్గుణి, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రోహిణి, రేవతి ఇవి అత్యంత శుభప్రద మైనవిగా భావిస్తారు. కొన్ని విశేష నక్షత్రాలు ఇతర కార్యాలకు శుభకరమే కాని, వివాహ ముహూర్తాలకు సరిపడవు.

పుష్యమి : ఈ నక్షత్రం సమస్త శుభకార్యాలకు శుభ నక్షత్రమైనా వివాహానికి ఎంతమాత్రం పనికిరాదు. బ్రహ్మ ఈ నక్షత్రంలో తన పుత్రిక వివాహం చేశాడని, పెళ్లి సమయంలో బ్రహ్మ మదగ్రస్తుడై పతితుడయ్యాడని జనశ్రుతి. అందుచేత పుష్యమి నక్షత్రంలో ఎవ్వరూ వివాహం చేయకూడదని బ్రహ్మ శాసించాడు.

పూర్వఫల్గుణి : వాల్మీకి ఋషి చెప్పినట్టు పూర్వఫల్గుణి నక్షత్రం ఉన్నప్పుడు సీతారాముల వివాహం జరిగింది. వారికి వియోగం సంభవించింది కనుక ఈ నక్షత్రంలో వివాహం సఫలంకాదు.

అభిజిత్ : నల దమయంతుల వివాహం అభిజిత్ నక్షత్రంలో జరిగింది. వారు అనేక కష్టాలు అనుభవించారు. అందుచేత అత్రి మహర్షి ఈ నక్షత్రాన్ని వివాహానికి అశుభంగా ప్రకటించారు.

మూల : మొదట్లో మూలా నక్షత్రాన్ని వివాహానికి అశుభంగా భావించేవారు. కాని భగవంతుడైన శ్రీకృష్ణునికి జన్మనిచ్చిన దేవకీదేవి వివాహం వసుదేవునితో మూలానక్షత్రంలో జరిగింది. అందుచేత తర్వాత ఈ నక్షత్రాన్ని శుభంగా భావిస్తున్నారు.

మఖ : మఖ నక్షత్రానికి అధిపతులు పితృగణాలు. వివాహంలో పితృకార్యాలు వర్జనీయాలు. కాని, ఈ నక్షత్రంలో దక్షప్రజాపతి తన కుమార్తెలను కశ్యప మహర్షికి ఇచ్చి ఈ నక్షత్రంలో వివాహం జరిపించాడు. వారందూ సౌభాగ్యవంతులై సుఖించారు. అందుచేత ఈ నక్షత్రాన్ని వివాహాలకు శుభంగా భావిస్తారు.





త్యాజ్యనక్షత్రాలు : గ్రహణంపట్టిన సమయంలో ఉన్ననక్షత్రం, భూకంప సమయంలోని నక్షత్రం, ధూమకేతువు జన్మించిన నక్షత్రం– ఈ నక్షత్రాలను ఆ సంఘటన జరిగిన ఆరుమాసాల వరకు వివాహాలకు వర్జించాలి.

## 760. పరమాత్మ స్వరూపాలు ఏవి ?

తన భక్తులను కాపాడేందుకై పరమాత్మ పలు రూపాలను ధరిస్తుంటాడు. అందులో శ్రుతిననుసరించి ఐదుఅవతారాలు ముఖ్యమైనవిగా తెలుస్తున్నాయి. పర,వ్యూహ,విభవ,అంతర్యామి, అర్చావతారం అనేవే ఆ ఐదు అవతారాలు. ఈ ఐదింటిలో పర,వ్యూహఅవతారాలు సామాన్యులకు అందనవి. విభవ అవతారాలు కాలాంతరంలో వెలిసాయి. అంతర్యామి దర్శనం యోగులకు మాత్రమే సాధ్యం. కాగా అర్చావతారం మాత్రమే మనందరికీ దర్శనమిస్తూ పూజలందుకుంటూ మనలను ధన్యులను చేస్తోంది.

1. పరస్వరూపం : శ్రీవైకుంఠంలో అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరు లచే పరివేష్టితమై లక్ష్మీయుతమై ఉండే దివ్యమంగళ స్వరూపం.
2. వ్యూహము:వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ తదితర నామాలతో గుర్తింపబడుతూ పాలకడలి మధ్యన శేషశాయిపై పవళించి ఈశాన బ్రహ్మేంద్రాది దేవతలతో, మునీశ్వరులతో సేవించబడుతున్న స్వరూపం.
3. విభవము:శిష్టరక్షణ, దుష్టశిక్షణ,ధర్మసంస్థాపనార్థం దేశకాల పరిస్థితులకు అనుగుణంగా వెలసే అవతారాలు, రాముడు, కృష్ణుడు వంటివి. 4. అంతర్యామి : సర్వప్రాణుల హృదయాలలో ఉండే స్వరూపం. 5. అర్చావతారం: మనకోసం ఇళ్ళలో, దేవాలయాలలో రథోత్సవాలలో ప్రతిష్ఠితమై, మనలను కరుణిస్తోన్న అమృతమయమూర్తులు.

## 761. గణపతులు వారి భార్యలు ఎవరు ?

సిద్ధిగణపతి–సిద్ధిబుద్ధి; లక్ష్మీగణపతి–జయలక్ష్మి; ధూమ్రగణపతి–సిద్ధలక్ష్మి; కృష్ణగణపతి–సువర్ణదేవి; రక్తవర్ణగణపతి–పద్మావతి; సువర్ణగణపతి–రజత దేవి; విఘ్నగణపతి–ప్రజాదేవి; నిర్విఘ్నగణపతి–అతిప్రజ్ఞాదేవి; వికట గణపతి–జ్ఞానదేవి; బాలచంద్రగణపతి–చంద్రముఖి; అంబరగణపతి–సంహారదేవి; భద్రగణపతి–శాంతిదేవి; శుక్లగణపతి–బుద్ధిలక్ష్మి; ఋణవిమోచనగణపతి–సౌభాగ్యలక్ష్మి; లంబోదరగణపతి – లోకమాత; లక్ష్మీప్రద గణపతి–వరలక్ష్మి; వక్రతుండ గణపతి–నవరత్నలక్ష్మి; చింతామణి గణపతి– విజయలక్ష్మి; ఏకదంతగణపతి– సిద్ధిలక్ష్మి;

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

## 762. సభాదీప ఫలం ?

ఎంతోమందికి చాలా సందర్భాల్లో సభామర్యాద సన్నగిల్లుతుంది. అంటే వారు చెప్పేది సరైనదేయైనా వారి మాటకు విలువ, గుర్తింపు ఉండవు. వారి మాటను ఎవరూ సముచితమైనదని గుర్తించరు. కానీ అనతికాలంలోనే వారిఆలోచన, అభిప్రాయం, మాటసరైనవిగా గ్రహిస్తారు. అయితే అందుకు విలువ మాత్రం ఉండదు. ఇటువంటివి మనలో చాలామందికి నిత్యం జరుగుతూవుంటాయి. అటువంటి సభామర్యాద దోషాలు సరిదిద్దుకునేందుకు శ్రావణపూర్ణిమ ఎంతో దోహదపడుతుంది.

గోధుమపిండి, పాలు కలిపి జ్యోతులు చేసి, దానిలో దీపం పెట్టి ఆ దీపానికి పసుపుకుంకుమాలంకరణ గావించి, పూజచేయాలి. పూజానంతరం శక్త్యానుసారం నివేదన చేయాలి. అనంతరం ఓంపౌరోహిత్య బ్రాహ్మణునకు విందు తాంబూలాది సత్కారాలుచేసి, ఆ దీపాన్ని దానమిచ్చి, ఆశీస్సులందుకోవాలి. ఇలా ఐదుసంవత్సరములు చేయాలి. మొదటి ఏడాది భక్తిశ్రద్ధలతో చేయగానే మాటకు విలువ,హోదా పెరుగుతాయి. సంఘమందు గౌరవం, సభామర్యాద దక్కుతాయి. అయితే సంకల్పంలో ఐదేళ్ళని చెప్పుకోవాలి. ఐదేళ్ళు చేయాలి. మాటకు విలువ, గౌరవం పెరిగిందంటే ఆర్థికంగా కూడా ఉన్నతమైన మార్పులు కలిగినట్లేనన్నమాట !

## 763. ఆళ్వారులు ఎంతమంది ? వారు ఎవరు ?

ఆళ్వారులు 12 మంది వారు 1. పూదత్తాళ్వారు 2. పొయ్‌గైయాళ్వారు 3. పేయాళ్వారు 4. పెరియాళ్వారు 5. ఆండాళ్ 6. తిరుమళిశైయాళ్వారు 7. కులశేఖరాళ్వారు 8. తిరుప్పాణియాళ్వారు 9. తొండరడిప్పొడియాళ్వారు 10. తిరుమంగైయాళ్వారు 11. మధురకవియాళ్వారు 12. నమ్మాళ్వారు.

## 764. శ్రీవారి పంచమూర్తులు అనగా ఏమిటి ?

మూలమూర్తి లేక ధ్రువమూర్తి : స్వామివారు స్వయంభువు. స్వామివారు తన దివ్యలోకమునుండి దిగివచ్చి స్వయంగా వెలసిన మూర్తి, స్వామివారు ఎనిమిదిఅడుగుల ఎత్తుకలిగి చతుర్భుజుడై వెలశాడు. స్వామివారి దక్షిణ వక్షస్థలమున శ్రీదేవి కొలువైవుంది. స్వామివారి చతుర్భుజములలో, రెండు ఊర్ధ్వ బాహువులందు శంఖచక్రములను అమర్చటం జరిగింది. అధోహస్తములలో దక్షిణ హస్తము కటిఅవలంబిత భంగిమలోను వుంటాయి. భక్తులు అడిగిన కోరికలను యథేచ్ఛగా ఇచ్చే వరదహస్తుడు





స్వామి వామహస్తమునందలి బొటన వ్రేలు తుంటి భాగమునకు, ఊరువుకు తగిలివుంటుంది. వక్షస్థల మధ్యన కౌస్తుభము ఒకటి వ్రేలాడుతూ వుంటుంది. స్వామి వారికి ఒక నాగాభరణము కూడావుంది. ఈ నాగాభరణము విగ్రహతమైనదికాదనీ, భక్తులెవరో సమర్పించిన కానుక అని భావిస్తారు.

**భోగశ్రీనివాసమూర్తి (కౌతుకబేరము) :** ఈ మూర్తిని కౌతుక బేరము అని అంటారు. పదవశతాబ్దములో స్వామివారి ఆలయంలో ప్రతిష్ఠింపబడిన రజత విగ్రహము. ఈ మూర్తికూడా ధ్రువమూర్తివలె చతుర్భుజమూర్తి. ఈ మూర్తి కూడా ధ్రువమూర్తివలె చతుర్భుజమూర్తి. ఈ మూర్తి పాదము క్రింద షట్కోణ యంత్రము ఒకటి వుంది. స్వామివారి నిత్యాభిషేకం, అర్చనలు కొరకు ఈ చరబింబమును ప్రతిష్ఠించటం జరిగింది. ఈ భోగశ్రీనివాస మూర్తిని ఒక సిల్కుదారముతో ధ్రువమూర్తికి అనుసంధానంచేసి వుంచుతారు. భోగశ్రీనివాసమూర్తి అన్నివిధములా ధ్రువమూర్తికి ప్రానిధ్యం వహించటం జరుగుతుంది. ధ్రువమూర్తికి గల అన్నిశక్తులు, అర్హతలు ఈ మూర్తికి కూడా వున్నాయి.

**కొలువు శ్రీనివాసమూర్తి (బలిబేరము) :** ఆలయంలో ప్రతినిత్యం తోమాలసేవ తరువాత తిరుమామణి మంట పంలో కొలువు జరుగుతుంది. ఇక్కడ కొలువ శ్రీనివాసుని ఒక వెండి పీఠంపైన వేంచేవు చేసి బంగారు గొడుగును అమరుస్తారు. ఇక్కడనే పంచాంగ శ్రవణం జరుగుతుంది. ముందురోజు హుండీద్వారా వచ్చిన ఆదాయ వివరాలను పలువురి సమక్షంలో చదువుతారు. నాణెములు, బంగారు నగలు, విలువగల రత్నముల వివరములను ఇక్కడ స్పష్టంగా ప్రకటిస్తారు. ఈ మూర్తి శ్రీవారి ఆలయంలోకి ఏ విధంగా ప్రవేశించాడో చెప్పలేము. ఈయనను దర్బారు శ్రీని వాసమూర్తి అనికూడా వ్యవహరిస్తారు.

**ఉగ్ర శ్రీనివాసమూర్తి :** భోగ శ్రీనివాసమూర్తి ఆలయ ప్రవేశముందునాటి నుంచే ఉగ్రశ్రీనివాసమూర్తి ఆలయంలోవున్నట్లు తెలుస్తుంది. ఆరంభంలో ఉగ్రశ్రీనివాసమూర్తియే ఉత్సవమూర్తిగా వ్యవహరించారు. ఈస్వామి వారి చేతిలోని చక్రము ప్రయోగించుటకు సిద్ధంగా వుంటుంది. ప్రస్తుతం ఈమూర్తి స్వామివారి చేతిలోని చక్రము ప్రయోగించుటకు సిద్ధంగా వుంటుంది. ప్రస్తుతం ఈ మూర్తి స్వామివారి మూడు ఉత్సవాలలో మాత్రమే పాల్గొనటం జరుగుతూ వుంది. అవి ముక్కోటి ఏకాదశి, ఉత్థాన ఏకాదశి, ద్వాదశారాధనం.

MOHAN PUBLICATIONS.COM

ఉత్సవమూర్తి (శ్రీభూదేవి సమేత మలయప్పస్వామి) : మలయప్ప స్వామి వారి రాకకు పూర్వం ఉగ్ర శ్రీనివాసమూర్తి ఉత్సవాలలో పాల్గొనేవారు. ఒకసారి బ్రహ్మోత్సవ సమయంలో గ్రామంలో మహాగ్నిజ్వాల రగిలి గ్రామ మంతా ఆహుతి అయింది. విధినిర్వహణలో దోషం ఏమైనా జరిగిందేమోనని అర్చకస్వాములు భయపడి క్షమింపమని స్వామివారిని కోరారు. ఆ సమయంలో ఒకరికి పూనికవచ్చి ఇక తనెప్పుడు ఉత్సవములలో ఉపయోగింప రాదని ఆ పర్వతమైదానంలో ఒకమూర్తి కలదనీ, ఆ మూర్తిని ఉత్సవములలో ఉపయోగింపవలసినదనీ స్వామివారు ఆనతిచ్చారు. స్వామివారి ఆనతి ప్రకారంవెదకగా, దేవేరులతోకల స్వామివారిమూర్తి లభించింది. మలై అంటే పర్వతం. పర్వతమునందు లభించిన స్వామి అనే పేరువచ్చింది. 1399వ సంవత్సరప్రాంతంలో ఈసంఘటన జరిగివుంటుందని భావిస్తున్నారు.

ఇతరమహర్షులు : స్వామివారి అయిదు మూర్తులుగాక, సన్నిధిలో సుదర్శన చక్రంవుంది. ఈస్వామిని చక్రత్తాళ్వారు అనిఅంటారు. బ్రహ్మోత్స వాల సమయంలో అంకురార్పణ సమయంలో ధ్వజస్తంభమువద్దకు తీసుకుని వస్తారు. బ్రహ్మోత్సవాల ముగింపులో చక్రస్నానంలో చక్రత్తాళ్వారు స్వామిని పుష్కరిణీకి వేంచేపు చేస్తారు. స్వామివారి సన్నిధిలో శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణ పరమాత్మ విగ్రహములు వున్నాయి.

## 765. తిరుమలకు ఆ పేరు ఎలా వచ్చినది ?

తిరుమలకు వేంగడం అనేపేరు వుంది. వేంగడం అంటే పాపాలను హరించునది. వేంగడానికి ప్రభువు కనుక వేంకటేశ్వరుడు అనేపేరు వచ్చింది. ఒక భాగవతోత్తముడు తిరులమకు వేంచేసి స్వామివారిని దర్శించి, కొండదిగివెళ్ళి అన్నంమూటను విప్పిచూస్తే అన్నంలో చీమలు కనిపించాయి. తను కారణంగా ఈ చీమలు పవిత్రమైన తిరుమల క్షేత్రాన్ని వదలి వచ్చాయి అని ఆయన ఎంతోబాధపడ్డాడు. మరల కొండ ఎక్కి ఆ చీమలను కొండపైకి చేర్చాడు. తిరుమలలో వానరాలు ఎక్కువగా కనిపిస్తాయి. ప్రాచీన కాలంలో ఈ వానరాలు కూడా శ్రీనివాసుని అర్చించేవి. పుష్కరిణిలో స్నానంచేసి, పూలుకోసి స్వామి భక్తితో స్వామికి సమర్పించేవి. వేదాలు పర్వత రూపంలో వెలయగా, వేదాలకు అధిపతి అయిన శ్రీమన్నారాయణుడు శ్రీనివాసుడై యీ పర్వతాలపై వెలశాడు. తిరుమల అనేది తరువాత వచ్చిన పేరు. అదికాలంలోవున్న పేరు తిరువేంగడం.





## 766. సంధ్యాకాలంలో తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి ?

సంధ్యాకాలం విశిష్టతగూర్చి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. లక్ష్మీ దేవి అనుగ్రహించే కాలం సంధ్యాకాలం. యోగశక్తిని పెంచుకోవడానికి అనుకూలించే కాలం సంధ్యాకాలం. అటువంటి సంధ్యాకాలంలో వీలయినంత శుచి, శుభ్రత, ప్రశాంతతలు పాటిస్తే మనిషికి జీవనం చాలా చక్కగా నడుచును. అందుకే మన పెద్దలు శుచి,శుభ్రత, ప్రశాంతతలు దృష్టిలో వుంచుకొని కొన్ని నియమాలు అందించారు. ఉభయ సంధ్యలోను మనం మన నివాస పరిసరాలు శుభ్రం చేయడం, స్నానాదికములు పూర్తిచేయడం, ఉభయ సంధ్యలలోను దీపారాధన చేయడం, అవకాశం వున్నంతవరకూ దైవారాధన చేయడం, ధ్యానంతో మౌనముతో ప్రశాంత చిత్తంకోసం మెడిటేషన్ చేయడం వంటివి ఏర్పరచారు. అందుకే స్త్రీలను సంధ్యాకాలంలో యిల్లువదలి వెళ్ళవద్దని పెద్దలుచెబుతారు. యిల్లు పూడవడం, కేశాలంకరణ, బట్టలు ఉతకడం వంటివి సంధ్యా కాలమునకు పూర్వమే పూర్తిచేయాలి. ఇటువంటి నియమాలు పాటించిన వారి యింట లక్ష్మి స్థిరంగా వుంటుంది. అంతేకాక ప్రాంతీయ ఆచారాలు కూడా తెలుసుకొని ప్రవర్తించడం చాలా అవసరం. ప్రాతస్సంధలో యింటి ముందర ముగ్గు ఇల్లాలు వేయుట, సాయింసంధ్యలో తులసిదగ్గర దీపంవెలిగించుట ద్వారా కుటుంబ సమస్యలు తీరగలవు అని పెద్దల వాదన.

## 767. పాత యిల్లు పడవేసి శంఖుస్థాపన ఎప్పుడు చేయాలి ?

స్థల యజమాని శంఖుస్థాపన చేయుటకు కార్యోన్ముఖుడయివున్నప్పుడు దానిని వ్యతిరేకమయిన కార్యం జీర్ణగృహం పడవేయడం, శంఖుస్థాపన చేయడం మరియు గృహం పడవేయడం అని రెండు వ్యతిరేక భావనలతో కూడిన కార్య ములు ఒకే సమయములో ఒకే యజమాని చేయకూడదు. అలా చేయవలసివస్తే గృహము పడవేయుకార్యము పనివారిచేత చేయించి శంఖుస్థాపన స్థలయజ మాని చేయవలెను. అంతేకాకుండాచెట్లు కొట్టడం, పాతయిల్లు పడవేయడం, బావులు పూడ్చడం వంటివి చేయాలి. అంటే ఆ కార్యములు చేసినతర్వాత ఆరునెలలు ఆగడం అవసరం. మరియు పితృ కర్మలుచేసిన సంవత్సరం కూడా శంఖుస్థాపన చేయరాదు.

## 768. సర్వాంతర్యామి మనలోనే ఉన్నట్లు భావించాలను కోవడంతప్పా?

సర్వాంతర్యామి అయిన సర్వేశ్వరుణ్ణి కేవలం దేవాలయానికో, పూజ గదికో పరిమితంచేయరాదు. ఎల్లప్పుడూ ఆయన మనతోనే ఉన్నట్లు భావించ

MOHAN PUBLICATIONS.COM

టం ఉత్తమం. ఆ ద్వితీయ పరమాత్మ అంతటా వ్యాపించి ఉన్నట్లు భావించాలి. అయితే దేవాలయాల్లోనూ, ఇంట్లోనూ పూజించకూడదనడం భావ్యం కాదు. ఆయన అర్చామూర్తిగా ఆలయాల్లో ఉంటూ భక్తుల నివేదనలను స్వీకరిస్తాడు. కల్పవృక్షమై వారి కోరికలను తీరుస్తాడు. దైవాన్ని సర్వజీవులలో చూడాలి అందరికీ అది సాధ్యంకాదు. ఆ స్థితిని చేరుకోవడానికి పూజ గదులు, దేవాలయాల ఆవశ్యకత ఉంది. దీన్ని గౌణిపూజ అంటారు. శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, పవహారి బాబా, శ్రీరమణ మహర్షి ఇలా అసంఖ్యాకులైన మహాత్ములు సర్వేశ్వరుని సర్వాంతర్యామిత్వాన్ని దర్శించాలంటే దైవానుగ్రహం ఉంటే మీరూచూడగలరు.

### 769. తారాబలం ఏవిధముగా చూస్తాము ?

జన్మతార అక్కడినుండి 3,5,7వ తారలు ప్రతికూల తారలు. కాగా 2.4.6,8,9వ తారలు అనుకూలమైనవి.

1. జన్మతార : మధ్యఫలదాయి. వివాహం, యాత్ర, గృహారంభం, గృహప్రవేశం, ఔషధసేవనం ప్రారంభించవచ్చు. శత్రుసంధి చేయకూడదు. 2. సంపత్తార : వ్యాపారం, పరిశ్రమలు, ధనసంబంధ వ్యవహారాలకు మంచిఫలితం ఇస్తుంది. కార్యారంభంచేస్తే ధనలాభం ఉంటుంది. 3. విపత్తార: లాభకారకమైంది. శుభకార్యాలు, సంధి, ఒప్పందాలు చేయ కూడదు. కార్యాలకు విఘ్నాలు కలగటమేకాక, వ్యక్తిగతంగా కూడా కష్టం కలుగుతుంది. 4. క్షేమతార: ఇది సుఖకరమైన నక్షత్రం. వివాహం, యాత్ర, గృహారంభం, గృహప్రవే శం, ఒప్పందాలు, గృహ, వాహనక్రయం, ఉద్యోగుల నియామకం, మొదలైన సుఖప్రాప్త కార్యాలన్నీ సఫలమవుతాయి. 5. ప్రత్యరి: ఇది శత్రుత్వాన్ని వృద్ధి చేస్తుంది. వివాహం, యాత్ర, భాగస్థ వ్యవహారాలు, ఒప్పందాలు, పదవీ స్వీకారం, వాద వివాదాలు, ధనం ఇచ్చి పుచ్చుకోవటం, ఇల్లు, దుకాణం అద్దెకు తీసుకోవటం, ఏదైనా ప్రణాళికను అమలుపరచటం, ఉత్సవ నిర్వహణవంటి కార్యాలు చేయకూడదు. 6.సాధనతార :ఈ తారా బలంవల్ల కఠినకార్యాలు కూడా సులభమవుతాయి. అతికష్టమై సమస్యాత్మకమైన కార్యాలను ఈ తార ఉన్న సమయంలో ప్రారంభించాలి. భవన నిర్మాణం, పరీక్షలకు సిద్ధంకావటం, సంధిసమాధానాలు, అధకారుల దగ్గర అర్జీ పెట్టుకోవటం, మంత్రసాధన, పూజాకార్యక్రమం, అనుష్ఠానం కష్టతరమైన యాత్ర,గృహారంభం, గృహప్రవేశం, పదవీ స్వీకారం, చికిత్స మొదలైనవి





ప్రారంభిస్తే సఫలమవుతుంది. 7. వధ : ఈ తారలో ప్రారంభించిన కార్యాలు జీవన, మృత్యు సంబంధిత కష్టాలకు కారణమవుతుంది. కార్యం పూర్తికాదు, యాత్ర, వివాహం, గృహారంభ, గృహప్రవేశం, వాహనక్రయం, చికిత్సా ప్రారంభం వంటివి చేయకూడదు. 8. మిత్రతార : ఇది మైత్రీ భావాన్ని పెంచుతుంది. సహకారాన్ని ఆపేక్షించే కార్యాలు, చిరకాలం సంబంధం నిలుపుకోవలసిన కార్యాలు ధనం ఆదాన ప్రదానం, భాగస్థ నిర్ణయం, స్నేహసంబంధాలు, మొదలైన వాటికి సత్ఫలితాన్నిస్తుంది. 9. అతిమిత్ర తార: ఇది మైత్రీ సంబంధాన్ని గాఢంగా చేస్తుంది. మైత్రి ప్రేమ వ్యవహారం, భాగస్థ నిర్ణయం. వివాహం, గృహారంభం, గృహప్రవేశం, యాత్ర మిత్రతారకు సంబంధించిన అన్ని కార్యాలకు ఇది ఎక్కువ సత్ఫలితాన్ని స్తుంది. జన్మతార నుండి లెక్కించుకొని అనుకూల నక్షత్రాలను నిర్ణయించుకొని ఏ రకమైన కార్యానికి ఏ రకమైన తారను ఎంచుకోవాలో నిశ్చయించుకుని కార్యాలు ప్రారంభిస్తే కార్యాచరణలో సఫలీకృతులవుతారు.

### 770. వివాహ సంబంధాలకు శ్రేష్ఠమైన పొంతన నక్షత్రాలు ఏవి ?

| వరుడు | వధువు |
|---|---|
| అశ్విని | పుష్యమి |
| భరణి | అశ్విని |
| కృత్తిక (మేషరాశి) | అశ్విని |
| కృత్తిక (వృషభరాశి) | శతభిష, ధనిష్ఠ(కుంభ) |
| రోహిణి | మృగశిర (వృషభ) పూర్వాభాద్ర(కుంభ) |
| మృగశిర (వృషభ) | రోహిణి, పూర్వాభాద్ర (కుంభ) |
| మృగశిర (మిధున) | ఆర్ద్ర, పునర్వసు, (మిథున) |
| | ఉత్తరఫల్గుణి (కన్య) హస్త |
| ఆర్ద్ర | మృగశిర (మిథున) |
| పునర్వసు(మిథున) | మృగశిర (మిథున) |
| పునర్వసు(కర్కాటక) | భరణి,పుష్యమి |
| పుష్యమి | అశ్విని, పుష్యమి |
| ఆశ్లేష | పుష్యమి |
| మఖ | జ్యేష్ఠ |
| పూర్వఫల్గుణి | ఉత్తరఫల్గుణి (సింహ) |

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

| | |
|---|---|
| ఉత్తరఫల్గుణి(సింహ) | పూర్వఫల్గుణి |
| ఉత్తరఫల్గుణి(కన్య) | మృగశిర (మిథున) |
| హస్త | మృగశిర (మిథున) |
| చిత్త (తుల) | విశాఖ (తుల) |
| విశాఖ (తుల) | చిత్త (తుల) |
| విశాఖ (వృశ్చిక) | జ్యేష్ఠ |
| అనూరాధ | ఉత్తరఫల్గుణి (సింహ)జ్యేష్ఠ |
| జ్యేష్ఠ | కృత్తిక (వృషభ) మఖ |
| | విశాఖ (వృశ్చిక) |
| మూల | ధనిష్ఠ (కుంభ) |
| పూర్వాషాఢ | ఉత్తరాషాఢ (ధనుస్సు) |
| ఉత్తరాషాడ(ధనుస్సు) | పూర్వాషాఢ, పూర్వాభాద్ర |
| | ఉత్తరాభాద్ర |
| ఉత్తరాషాడ (మకర) | ఉత్తరాభాద్ర |
| శ్రవణ | ఉత్తరాభాద్ర |
| ధనిష్ట (మకర) | ఉత్తరాభాద్ర |
| ధనిష్ఠ (కుంభ) | శతభిష |
| శతభిష | కృత్తిక (వృషభ) ధనిష్ఠ (కుంభ) |
| పూర్వాభాద్ర (కుంభ) | రోహిణి |
| పూర్వాభాద్ర (మీన) | పూర్వాషాడ, పూర్వాభాద్ర (మీన) |
| | రేవతి |
| రేవతి | పూర్వషాడ, ఉత్తరాభాద్ర |

### 771. వివిధ గ్రహాల ప్రసన్నతకు అనుకూల నక్షత్రాలు ఏవి ?

| గ్రహాలు | నక్షత్రాలు |
|---|---|
| సూర్యుడు | అశ్విని, ఉత్తరాఫల్గుణి |
| చంద్రుడు | కృత్తిక, రోహిణి, మృగశిర,పుష్యమి |
| కుజుడు | ధనిష్ట (పూర్వార్థం) అశ్విని |
| | కృత్తిక, (ప్రథమచరణం) |
| బుధుడు | హస్త, మృగశిర(పూర్వార్థం) చిత్త |
| గురువు | పునర్వసు, పుష్యమి, మూల, ఉ॥భా॥ |
| శుక్రుడు | రేవతి, మృగశిర(పూర్వార్థం)చిత్త |
| శని | స్వాతి, శ్రవణ, శతభిష |
| రాహు-కేతు | ఆర్ద్ర, మూల |



### 772. పరమశివుని అష్టమూర్తులు ఏమిటి ?

**1. ఏకామ్రేశ్వరుడు - పృథ్వీ(క్షితి)తత్వలింగం :** పంచభూతాల పేర్లతో ప్రసిద్ధిచెందిన శివలింగాల్లో పృథ్వీలింగం దక్షిణ భారతదేశం శివ కంచిలో స్థితమైంది. కంజీవరంకు కొంతదూరంలో సర్వతీర్థమనే సరోవరం తీరీన ఏకామ్రేశ్వరస్వామి ఆలయముంది. ప్రధానమందిరంలో మూడు ద్వారాలు దాటాక, లోపల శ్రీ ఏకామ్రేశ్వరశివలింగం దర్శనమిస్తుంది. శివలింగం నలుపురంగులో ఉంటుంది. దాని వెనక పార్వతీ పరమేశ్వరుల విగ్రహా లున్నాయి. ఏకామ్రేశ్వర స్వామికి జలంతో అభిషేకం చేయరు. మల్లెపూలు, సుగంధతైలంతో అభిషే కిస్తారు. ఈ స్వామి ప్రాశస్త్యాన్ని ఇలాచెబుతారు.

ఒకమారు పార్వతీదేవి, పరమేశ్వరుని కళ్లను తన చేతులతో కప్పింది. తత్ఫలితంగా మూడు లోకాల్లో గాఢాంధకారం వ్యాపించింది. అకాలంలో ఏర్పడిన ఈ ప్రళయకారక దృశ్యం చూసిన శివుడు ప్రాయశ్చిత్తంగా పార్వతీ దేవిని తపస్సు చేయమని ఆదేశించాడు. స్వామి ఆజ్ఞను పాలించి, ఇసుకతో శివలింగం (సైకతలింగం)చేసి పార్వతీదేవి ఉపాసించసాగింది. కఠోర తపస్సు చేసింది. ఆ సైకతలింగమే ఏకామ్రేశ్వర లింగం.

**2. జంబుకేశ్వరుడు-జలతత్వలింగం :** పంచమహాతత్వాల లింగాల్లో జలతత్త్వలింగం జంబుకేశ్వరుడు, తిరుచినాపల్లి శ్రీరంగం నుండి కొంత దూరాన ఒక జలప్రవాహంపై జంబుకేశ్వర లింగం స్థాపితమై ఉంది. లింగమూర్తి కింది నుండి పైకి జలం ఊరుతుంటుంది. దేవాలయంలో, బయటా ఉన్న జంబూవృక్షాలకూ వైశిష్ట్యం ఉంది. స్థాపత్య శిల్పకళా దృష్ట్యా ఈ దేవాలయం శ్రేష్టమైన నిర్మాణం. ఈ మహిమతోనే స్వామికి జంబుకేశ్వ రుడు అని పేరు.

**3. అరుణాచలేశ్వరుడు - తేజోతత్త్వలింగం :** అరుణాచలేశ్వర శివాల యం చాలా విశాలమైంది. మందిరగోపురం దక్షిణ భారతదేశంలోని ఇతర గోపురాలకంటే వెడల్పైనది. పార్వతీదేవి కొంతకాలం అరుణాచల క్షేత్రంలో తపస్సు చేసిందని పురాణగాథ. ఆమె తపస్సుతో అగ్నిశిఖ రూపంలో తేజో లింగం ఉద్భవించిందని, అదే అగ్నితత్వ లింగమైందని ప్రాచీన విశ్వాసం. అరుణాచలంకు తమిళనామం తిరువణ్ణామలై.



MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

**4. శ్రీకాళహస్తీశ్వరుడు-వాయుతత్వలింగం :** తిరుపతికి కొద్ది దూరంలో స్వర్ణముఖి నదీతీరాన పరమశివుడు వాయులింగ రూపంలో శ్రీకాళహస్తీశ్వరుడై వెలశాడు. ఆలయ గర్భగుడిలో భగవంతుని దర్శనం అఖండదీపం వెలుగులో చేయాలి. ఇక్కడ శివుడు వాయువీచిక రూపంలో దర్శనమిస్తాడు. దేవాలయం నాలుగువైపులా అనేక దేవీదేవతల మూర్తులు ప్రతిష్ఠితమయ్యాయి. ఇక్కడ శివమూర్తి గుండ్రంగా ఉండక నలుచదరంగా ఉంటుంది. ప్రప్రథమంగా స్వామిని సాలీడు, సర్పం, ఏనుగు పూజించాయని, అందుచేత నాటిపేరు మీద శివుడు శ్రీకాళహస్తీశ్వరుడు అయ్యాడని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

**5. చిదంబరేశ్వరుడు - ఆకాశతత్వ లింగం :** చిదంబరం దక్షిణాదిలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. పరమశివుని ఆకాశతత్వ లింగం చిదంబరంలో ఉంది. కావేరీ నదిఒడ్డున సుందర ప్రకృతి ఒడిలో ఈ ఆలయ నిర్మాణం జరిగింది. ఇక్కడ గర్భగుడిలో ఏ విగ్రహమూలేదు. ప్రక్కనేగల మందిరంలో పరమసుందరమైన తాండవ నృత్యలోలుడైన నటరాజస్వామి నిజమందిరం ఇక్కడినుంచి ఐదవ ప్రాకారంలో ఉంది.నటరాజస్వామి నృత్యముద్ర సువర్ణవిగ్రహం పరమ సుందరం. స్వామికి కుడివైపు నల్లనిగూటిలో ఒకయంత్రం స్థాపితమైంది. స్వర్ణహారాలు వేలాడుతూంటాయి. ఇది నీలంరంగులోని శూన్యాకాశ తత్వలింగం. ఇక్కడ సాధారణంగా తెరపడి ఉంటుంది. అభిషేక సమయంలోనే దర్శనం లభిస్తుంది. ఆలయంలో బంగారు తొడుగు వేసిన ఒక పెద్ద దక్షిణావర్త శంఖం కూడా భక్తులకు దర్శనమిస్తుంది.

**6. యజమానమూర్తి-పశుపతినాథుడు :** అష్టమూర్తుల్లో నేపాల్‌లోని పశుపతినాథుడు యజమానమూర్తి ప్రతీక. శ్రీపశుపతినాథుడు ఇక్కడలింగ రూపంలోగాక, మానుష విగ్రహరూపంలో ఉంటాడు. ఈ లింగం ప్రాదుర్భావం గురించి ప్రసిద్ధపురాణకథ శ్లేష్మాంతకమనే వనంలో సిద్ధాచలం సమీపాన దేవనది వాగ్మతితీరాన ఒకస్థలంలో కామధేనువడు రోజూ స్వేచ్ఛగా పాలధార వదిలేది. ఆ స్థలంలో శివుడు గుప్తంగా నివసించేవాడు. బ్రహ్మదేవుడు విష్ణువుతో కలిసి ఇక్కడికివచ్చి స్వయంభుదర్శనం చేసుకొని స్తుతించసాగాడు. బ్రహ్మ, విష్ణువులు ఆతేజోపుంజంపై రత్నమయమైన పంచముఖలింగ మూర్తినిస్థాపించి, అక్కడ అలాగే ప్రతిష్ఠితుడై ఉండమని ప్రార్థించారు. ఇప్పుడు ఆ మణిమయ స్వర్ణలింగం దర్శనంలభిస్తుంది. మందిర పరిసరాల్లో గణేశుడు, భైరవుడు,సూర్యుడు,విష్ణువు,వాసుకి,వాయుమంగళ, నీలసరస్వతి, శీతలాదేవి,అష్టమాతృక,నవగ్రహాలు,నీలకంతుడు,వీరభద్రుడు,మహాకాళి,

MOHAN PUBLICATIONS.COM





విరూపాక్షుడు,నంది,భృంగి మొదలైన దేవీదేవతల ప్రతిమలు ప్రతిష్ఠితమై ఉన్నాయి.

**7. చంద్రమూర్తి :** గుజరాత్‌లోని కథయవాడ్‌లోని సోమనాథ్, బెంగాల్‌లోని చీట్‌గావ్ దగ్గరవున్న చంద్రనాథ జ్యోతిర్మయ స్వరూపం శివుని చంద్రమూర్తి ప్రతీకలు. ఈ రెండు క్షేత్రాల్లోనూ శివుడు చంద్రరూపంగా పూజలందుకుంటున్నాడు.

**8. సూర్యమూర్తి :** సూర్యభగవానుని ప్రతి మందిరం పరమశివుని సూర్య మూర్తితత్వాన్ని ప్రకటిస్తుంది. ఆదిత్యుడు సర్వసాక్షి. ప్రత్యక్షదైవం, శివునికీ, సూర్యునికీ ఏమీ భేదం లేదు.

## 773. శ్రావణమాసం ప్రాశస్త్యము ఏమిటి ?

త్రిమూర్తులలో స్థితికారుడు, దుష్టశిక్షకుడ, శిష్టరక్షకుడు అయిన శ్రీమహావిష్ణువుకు, ఆయనే దేవేరి అయిన శ్రీమహాలక్ష్మికి అత్యంత ప్రీతికరమైన, వివిధ వ్రతాలు, పూజలను ఆచరించడంవల్ల విశేషఫలితాలు, సకల సౌభాగ్యాలను ప్రసాదించే దివ్యమైన మాసం-"శ్రావణమాసం"

చాంద్రమానం ప్రకారం శ్రావణమాసం ఐదవది. శ్రీమన్నారాయణుడి జన్మనక్షత్రం అయిన "శ్రవణానక్షత్రం" పేరుతోఏర్పడిన శ్రావణమాసం శ్రీ మహావిష్ణువు పూజకు ఉత్కృష్టమైంది. మనకు వారాలు ఏడుఉన్నాయి. ఆ ఏడింటితో మాఘమాసంలో గురువారాలు పుణ్యప్రదమైనవి కాగా, ఏడువారాల్లో మూడువారాలు శ్రావణంలో పుణ్యప్రదమైనవి. మంగళ, శుక్ర, శనివారాలు ఈ మాసంలో అత్యంత ప్రధానమైనవి. మహత్తును కలిగినవి. శ్రావణ మాసంలోని మంగళవారాలు శ్రీగౌరీపూజలకు, శుక్రవారం శ్రీలక్ష్మీ పూజకు, శనివారం విష్ణుపూజకు ముఖ్యమైనవి.శ్రావణమాసంలోని శుక్లపక్షం విశేషమైనది. ఈ పక్షంలోని ఒక్కొక్క రోజు ఒక్కోదేవుడికి పూజచేయాలని శాస్త్రవచనం. అంతేకాకుండా ఈ పదిహేనురోజుల్లో వివిధ దేవతలకు పవిత్రారోపణోత్సవాలు చేయాలని శాస్త్రాలు చెబుతున్నాయి. సాధారణంగా పవిత్రము అంటే దర్భతో చేసిన వేలితొడుగు. దర్భఅత్యంత పవిత్రమైనది. అటువంటి దర్భను ఉపయో గించి108 ముళ్ళతో కాశీదారంలా తయారు చేసి దానితో ఆయా దేవుళ్ళను అలంకరించి పూజలు చేయాలని శాస్త్రవచనం. దీనికిముందు పవిత్రమును దేవుడు ముందు వుంచి-

"సంవత్సరస్య యాగస్య పవిత్రీ కరణాయభో
విష్ణులోకత్వా నిత్రాద్య త్యాగచ్ఛేహ నమోస్తుతే"

MOHAN PUBLICATIONS.COM

అనే శ్లోకంతో పవిత్రమును పూజించవలెను. అనంతరం పవిత్రమును అలంకరింపజేసి ఒక్కోరోజు ఒక్కో దేవుడికి పూజలు చేయవలెను.

వివరాలు : 1. పాడ్యమి-బ్రహ్మదేవుడు; 2. విదియ-శ్రియఃపతి; 3. తదియ-పార్వతీదేవి; 4.చవితి-వినాయకుడు; 5.పంచమి-శచీదేవి; 6.షష్ఠి-నాగదేవతలు; 7.సప్తమి-సూర్యుడు; 8. అష్టమి-దుర్గాదేవి; 9. నవమి-మాతృదేవతలు; 10. దశమి-ధర్మరాజు; 11. ఏకాదశి-మహర్షులు; 12. ద్వాదశి- శ్రీమహావిష్ణువు; 13.త్రయోదశి-అనంగుడు; 14. చతుర్ధశి-పరమశివుడు; 15. పూర్ణిమ-పితృదేవతలు.

ఈ విధంగా శుక్లపక్షంలోని ఒక్కోరోజు ఒక్కోదేవతను పూజించడం, పవిత్రారోపణోత్సవం చేయడంవల్ల ఎటువంటి సమస్యలురావనీ, ఆయురారోగ్యాలు, సంపద వృద్ధిచెందుతుందని శాస్త్రవచనం, దీనితోపాటు-

శ్రావణమాసంలో పగలు నిద్రపోరాదు. ఈ మాసంలో ఒక్కపూట భోజనం చేయవలెను. మరోపూట ఉపవాసం వుండవలెను. ఈవిధంగా పూజలు, నియమాలను పాటించడంవల్ల శ్రావణ మాసంలో అనంతమైన ఫలితాలను పొందవచ్చు.

## 774. ముక్కోటి ఏకాదశి అంటే ఏమిటి ?

‘మాసానాం మార్గశీర్షోహం’ అని భగవద్గీతలో శ్రీకృష్ణస్వామి చెప్పాడు. ఆ మార్గశీర్షమాసంలో ముక్కోటి ఏకాదశి వస్తుంది. మన తిథులలో భీష్మఏకాదశి, వ్యాసపూర్ణిమ, ఇలా గొప్పవారు చేసిన వ్యవహరిస్తారు. గణేశచతుర్థి, వసంత పంచమి మొదలగునవి. సహస్రకోటి భాస్కర ప్రభాస మానుడై వైకుంఠంలో తిరుమాణి మండపంలో మహావిష్ణువు వేంచేసి ఉంటాడు. ఆరోజున మూడుకోట్లమంది దేవతలు స్వామిదర్శనార్థం వైకుంఠ నగరానికి వస్తారు. వైంకుంఠనగరానికి ఉత్తరద్వారం ఆనాడు తెరువబడు తుంది. ఉత్తర దర్శనం చేసినవారికి మోక్షం కరతలామలకం. అందువలన దీనిని ‘ముక్తి ఏకాదశి’ అనికూడ అంటారు. స్వామి యోగనిద్రనుండిలేచి రమాసహితుడై దేవతా సమూహాలకు ఉత్తరద్వార దర్శనమిస్తాడు.

## 775. ‘చిరంజీవ’ అని దీవిస్తారు. ‘ఆయుష్మాన్‌భవ’ అంటారు. మరి పాపీచిరాయువంటారు. వీటిని గురించి తెల్పండి.

ప్రకరణభేదం అనేది ఒకటి ఉంటుంది. సన్నివేశాన్నిబట్టి అర్థం చేసుకోవాలి. భగవంతుడు ప్రతిమానవునకు నూరేండ్లాయువిచ్చాడు. ‘శతాయుః



పురుషః’ అనే మంత్రం దానినే తెలుపుతుంది. తెలుగులో దినదిన గండం నూరేండ్లాయువు అనే సామెత వున్నది. అంటే ప్రతిదినం ప్రాణగండమే. దానినే అకాల మృత్యువంటాము. ఆ గండం దాటితే వందేండ్లాయువని అర్థం. ‘చిరంజీవ-ఆయుష్మాన్‌భవ’అని పెద్దలాశీర్వదిస్తే ఆ అకాల మృత్యువు తొలగిపోవాలని ఆకాంక్ష. తొలగిపోతుందని నమ్మకం. ఇకలోకంలో దుర్మార్గులు నీచులు, ఎక్కువకాలం జీవించి, దుష్టకార్యాలు చేసేటప్పుడు వారిని గురించి పాపీ చిరాయువంటారు. వీనిని కలిపి చూడటం ఔచిత్యవంతం కాదు. సమయాన్నిబట్టి అర్థంచేసుకోవాలి.



## 776. శివసహస్రనామస్తోత్రం ఎలా ఉద్భవించింది ?

సంస్కృతభారతం అనుశాసనికపర్వంలో శివసహస్రనామ స్తోత్రం ఉన్నది. యుధిష్ఠిరుడు భీష్మునితో “సురాసురగురో దేవ శంకరావ్యక్త యోనయే” శంకరుని గురించి చెప్పుమంటే భీష్ముడు అశక్తోహం గుణాన్వక్తుం మహాదేవస్య ధీమతః యోహి సర్వగతో దేవో న చ సర్వత్ర దృశ్యతే” మహాదేవునియొక్క మాహాత్మ్యాన్ని చెప్పటానికి నేను శక్తుడను కాను అన్నాడు. అందువల్ల ఉపమన్యు వనే మహర్షి వాసుదేవునకు శివసహస్రనామ స్తోత్రాన్ని చెప్పినట్లుగా ఉన్నది. భీష్ముడు ప్రాయోపవేశం చేసి ఉన్న సమయంలో ధర్మజుని సందేహాలన్నీ తీర్చటా నికి శ్రీకృష్ణపరమాత్మ ఆయనను భీష్ముని కడకు తీసుకొనివచ్చాడు. అపుడు జరిగిన విషయమిది.

దీనిని పఠిస్తే శివుడు కరుణించి సంసారార్తులనందరినీ ఉద్ధరిస్తాడు. సంసారమునుండి విమోచనం కలుగుతుంది. శంకర సన్నిధానాన్ని పొందుతారు. సమస్త పాపములను నాశనంచేస్తుంది. మోక్షం, స్వర్గసౌఖ్యం సంతోషంకలిగిస్తుంది. ఒక్కసంవత్సరం అనుష్ఠిస్తే కోరినకోరికలు సఫలీకృతమౌతాయి. ఇలా ఎన్నో ఫలితాలు చెప్పబడినవి. సంస్కృతభారతం సపాదలక్ష గ్రంథంగా ప్రసిద్ధం. కాని ఔత్తరాహప్రతులువేరు. దాక్షిణాత్య ప్రతులు వేరు. 130000 లక్షాముప్పది వేల శ్లోకాలు కొన్నింటిలో 160000 లక్షాఅరవై వేలశ్లోకాలు కొన్నిప్రతులలో కన్పిస్తున్నాయి. ఇవన్నీ ప్రక్షిప్తాలు. కవిత్రయం వారికి లభించిన ప్రతిలో ఇది ఉండకపోవచ్చు. అందుకే వారు దానిని అనువదింపలేదు. విష్ణు సహస్రనామస్తోత్రాన్ని మాత్రం పేర్కొనినారు. వీర మాహేశ్వరుడైన నీలకంఠ దీక్షితులు, భారతానికి వ్యాఖ్యవ్రాస్తూ దీనిని కూడ తానే కల్పించి భారతంలో చొప్పించాడని పండిత విశ్వాసం.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

### 777. తిరుకల్యాణం, ఆర్జిత కల్యాణం, నిత్య కల్యాణం వీటి తేడాను వివరించండి ?

తిరుశబ్దం–సంస్కృతంలోని 'శ్రీ' అదే దానికి సమానమైన తమిళపదం. శ్రీ అంటే శుభప్రదమైన అని అర్థం. మనం వ్యక్తుల నామములకు ముందు 'శ్రీ'ఉంచుతాం. శ్రీరాముడు, శ్రీకృష్ణుడుఅని. అదే తమిళంలో 'తిరురాముడు, తిరుకృష్ణుడు' ఇలా వాడతారు. తిరుపతి–శ్రీపతి, తిరుమల–శ్రీమల. మన వైష్ణవాలయాలలో స్వామివారి కల్యాణమహోత్సవం నిర్వహించేటప్పుడు బ్రహ్మాండ నాయకస్య–శ్రీవేంకటేశ్వరస్య తిరుక్కల్యాణసమయే'అని చదువు తుంటారు. దీనికి, శుభప్రదమైన లక్ష్మీసంబంధమైన కల్యాణమని అర్థం.

ఇకఆర్జిత కల్యాణమంటే మనమేదైనా పవిత్రదేవాలయానికి వెళ్లి నప్పుడు మనపేర శ్రీ స్వామివారి కల్యాణం చేయించాలని అనుకొంటాం. దానికి దేవ స్థానంచేత నిర్ణయింపబడిన రుసుంచెల్లించి, స్వామి కల్యాణం చేయిస్తాం. దానినే ఆర్జిత కల్యాణమంటారు. ఇంకా స్వామికనేక సేవలు చేయించటానికి రుసం నిర్ణయింపబడింది. ఆ రుసుంచెల్లించి స్వామివారికి జరిగే సేవాకార్యక్రమాలలో పాల్గొంటాం. వానినిఆర్జిత సేవలంటాం. ఆర్జితం అంటే సంపాదింపబడిన అని అర్థం.

ఇక నిత్యకల్యాణమంటే తిరుమలక్షేత్రంవంటి చోట్ల స్వామి వారికి ప్రతిదినం కల్యాణం జరగుతుంటుంది. భక్తులు కూడా చేయిస్తారు. లేక పోయినా దేవాలయం నిత్యం కల్యాణం నిర్వర్తిస్తే దానిని నిత్యకల్యాణ మంటారు. లోకంలో ఒకసామెత ఉన్నది. నిత్యకల్యాణం పచ్చతోరణంగా జీవితం సాగుతున్నది అని. పెండ్లికి పచ్చని ఆకులతో తోరణాలు కడతారు. అంటే పెండ్లిజరుగుతుంటే ఎంతశుభప్రదంగా ఆనందదాయకంగా కాలం గడుస్తుందో, అలా ప్రతినిత్యం సుఖంగా శుభంగా సాగే జీవితాలను గురించి అలా అంటుంటారు.

### 778. శ్రీ విద్యాజప విధానంలో జపసంఖ్యకు అరచేతిని లెక్కించుట ఎలా ?

చేతినాలుగు వేళ్ళలో అనామిక మూలపర్వను ఒకటిగ లెక్కించి అక్కడ నుండి ప్రదక్షిణ క్రమంలో లెక్కిస్తూ పదవ సంఖ్యను మధ్యవ్రేలి మూలపర్వతో పూర్తి చేయాలి. ఈక్రమంలో అనామిక, మధ్యవ్రేలిమధ్య పర్వాలు మేరువులుగా లెక్కించాక కనిష్టిక మూలపర్వం ఒకటిగా లెక్కించి అక్కడ నుండి తర్జనీ మూలపర్వంతో 8 పూర్తిచేయాలి. ఈ విధానం అష్టోత్తర శత సంఖ్యా జపానికి ఉపయోగపడుతుంది. త్రిపుర సుందరీ జపవిధానమది.

191



### 779. జపసంఖ్య ఎప్పుడు నిష్ఫలమగుతుంది ?

అంగుళ్యగ్రే చ యజ్జప్తం యజ్జప్తం మేరులంఘనే ।
పర్వసంధిమ యజ్జప్తం తత్ సర్వం నిష్ఫలం భవేత్ ॥

కొనవేళ్ళమీద లెక్కిస్తూ కాని, మేరు స్థానమును (అరచేతియందుకాని, మాలలోకాని) అతిక్రమించికాని, పర్వలను విడిచి పర్వసందులలోకాని లెక్కిస్తూ జపిస్తే ఆ జపం నిష్ఫలం అవుతుంది.

నాక్షతైర్హస్త పర్వైర్వా నధాన్యైర్న చ పుష్పకైః
న చందనైర్మృత్తికయా జప సంఖ్యాం చ కారయేత్ ॥

అక్షతలతోకాని చేతి పర్వసందుల గణనతోకాని, ధ్యానములతోకాని, పూవులతోకాని, చందనముతోకాని మట్టిని ఉపయోగించి కాని జప సంఖ్యను లెక్కించరాదు.

### 780. వేగములు ఎన్ని ? అవి ఏవి?

1. వాగ్వేగం : వాక్శక్తి అమోఘమైనది. దానిని వృథాచేయరాదని మృదు వగుమాటే జపమని, తపమని శాస్త్రం చెబుతోంది. పరుషవాక్కులు పలకడం, అసత్యం చెప్పడం, ఇతరులపై చాడీలుచెప్పడం, అసంబద్ధ ప్రలాపా లాడడం ఈనాల్గూవాగ్దోషాలు. 2.మనోవేగం:మనోవేగం పట్టరానిది, అనంత మైనశక్తి కలది. స్వర్గానికి, నరకానికి మనస్సేమూలం. ఇంద్రుడు, నహుషుడు మున్నగు వారు మనోవేగంవల్ల తమతమ అస్తిత్వాలను కోల్పోయారు. అత్యంత నిష్టాగరిష్ఠుడైనప్పటికీ ప్రవరాఖ్యుడు మనోవేగంవల్ల హిమాలయా లకుచేరి మనోక్లేశాన్ని పొందాడు. కావున, మనోవేగాన్ని నియంత్రించు కోవాలి. 3. క్రోధవేగం : ఇది మహాప్రమాదికారి. కామక్రోధలోభాలు మూడు నరక ద్వారాలని గీతాసందేశం. మానవునిలోఉన్న జ్ఞానమనే రత్నాలను తస్కరించడానికి కామక్రోధ లోభాలు దేహంలో తిష్ఠవేసుకుని ఉంటాయి. కావున జాగ్రత్తపడమని శ్రీశంకరులు బోధించారు. 4. జిహ్వావేగము : నాలుక రెండు విధాలుగా పనిచేస్తుంది. రుచులు గ్రహించడం,మాటలాడడం, ఈ రెండు పనులయందే వేగాన్ని కలిగి ఉంటంఉది. మంచి మాటలచే సిరిసంపదలు, బంధుబలగం సమకూరుతాయి. కాబట్టి జిహ్వా వేగాన్ని వశము నందుంచుకోవాలి. 5. ఉదరవేగం : అమితాహారం హాని కలిగిస్తుం దని, అల్పాహారం మేలుచేస్తుందని ఋషులవాక్కు తినకూడని పదార్థాలను తామసాహారాలను విడనాడాలని సుభాషితం చెబుతోంది. యుక్తాహార విహా రస్యయుక్తమైన ఆహార విహారాలుండాలని గీతాసందేశం. కాబట్టి తినడం

MOHAN PUBLICATIONS.COM

కోసం జీవించడం కాదని, జీవించడం కోసమే తినాలని పెద్దలమాట. 6. జననేంద్రియవేగం : ఇంద్రియ నిగ్రహాన్ని కలిగిఉండాలి. కామవేగాన్ని అణచుకోవాలి. "మరణం బిందుపాతేనే, జీవనం బిందుధారణాత్" మితి మీరిన వీర్యపతనంవల్ల ఆయువు తరుగునని దానిని నిల్పుకున్నచో ముఖ వర్చస్సు తేజస్సు, మేధస్సు ఆయుస్సు వృద్ధిచెందుతాయని, జ్ఞాపకశక్తి పెరుగు నని శాస్త్రవచనం. సౌరభముని జలంలో క్రీడించుకుంటున్న రెండు మత్స్యము లను చూచి మనోవికారం చెంది తపోభ్రష్టుడైనాడు. కావున జననేంద్రియ వేగాన్ని అరికట్టాలి.

## 781. 27 నక్షత్రాలు అధిదేవతలు ఎవరు ?

అశ్విని–అశ్వినీదేవతలు; కృత్తిక–అగ్నిదేవుడు; మృగశిర–చంద్రుడు; పునర్వసు–అదితి; ఆశ్లేష–సర్పములు; పుబ్బ–రవి; స్వాతి–వాయువు; అనురాధ–మిత్రుడు; మూల–నిర్రుతి; ఉత్తరాషాడ–విశ్వేదేవతలు; ధనిష్ట–అష్ట వసువులు;పూర్వాభాద్ర–అజైకపాదుడు;ఉత్తరాభాద్ర–అహిర్బుద్న్యుడు; భరణి–యముడు; రోహిణి–బ్రహ్మ; ఆరుద్ర–శివుడు; పుష్యమి–గురుడు; మఖ–పితృ దేవతలు;ఉత్తర–ఆర్యమ;చిత్త–త్వష్ట;విశాఖ–ఇంద్రాగ్నులు; జ్యేష్ఠ–ఇంద్రుడు; పూర్వాషాడ–గంగ; శ్రవణం–విష్ణువు; శతభిషం–వరుణుడు; రేవతి–పూషుడు.

## 782. 27 నక్షత్రాలు వృక్షములు ఏమిటి ?

అశ్విని–అడ్డసరు, భరణి–దేవదారు, కృత్తిక–అత్తి, రోహిణి–నేరేడు, మృగశిర–ఖదిర, అర్ధ్ర–రేల, పునర్వసు–వెదురు, పుష్యమి–పిప్పిలి, ఆశ్లేష–నాగకేసరా, మఖ–మర్రి, పుబ్బ–మోదుగ, ఉత్తర–జువ్వి, హస్త–కుంకుడు, చిత్త–తాడి, స్వాతి–మద్ది, విశాఖ–నాగకేసర, అనూరాధ–బొగడ, జ్యేష్ఠ–విష్టి, మూయి–వేగిస, పూర్వాషాడ–నెమ్మి, ఉత్తరాషాడ–పవన, శ్రవణం–జిల్లేడు, ధనిష్ట–జమ్మి, శతభిషం–అరటి, పూర్వాభాద్ర–మామిడి, ఉత్తరాభాద్ర–వేప, రేవతి–విప్పచెట్టు.

## 783. 27 నక్షత్రాలు అదృష్టవారాలు, దిశలు, రంగులు ఏమిటి ?

**నక్షత్రాలు–అదృష్టవారాలు:** 1 గురు2 శుక్ర 3 ఆది 4 సోమ 5 మంగళ 6 శుక్ర 7 గురు 8 శని 9 బుధ10 గురు11శుక్ర 12 ఆది 13 సోమ 14 మంగళ 15 శుక్ర 16 గురు 17 శని 18 బుధ 19 గురు 20 శుక్ర 21 ఆది 22 సోమ 23 మంగళ 24 శుక్ర 25 గురు 26 శని 27 బుధ.





**నక్షత్రాలు–అదృష్ట దిశలు:** 1 నైఋతి 2 పడమర 3 తూర్పు 4 ఉత్తరం 5 దక్షణం 6 వాయువ్యం 7 ఈశాన్యం 8 దక్షిణం 9 ఉత్తరం 10 నైఋతి 11 పడమర 12 తూర్పు 13 ఉత్తరం 14 దక్షిణం 15 వాయువ్యం 16 ఈశాన్యం17 దక్షిణం18 ఉత్తరదిశ 19 నైఋతి 20 పడమర 21 తూర్పు22 ఉత్తరం 23 దక్షిణం24వాయువ్యం 25 ఈశాన్యం 26 తూర్పు 27 ఉత్తరం.

**నక్షత్రాలు–ధరించవలసిన రంగులు :** 1 గోధుమ 2 తెలుపు 3 ముదురు ఎరుపు 4 తెలుపు 5 కుంకుమ 6 తేనె 7 బంగారు 8 ఆకాశం 9 ఆకుపచ్చ 10 గోధమ 11 తెలుపు 12 ముదురు ఎరుపు 13 తెలుపు 14 ఆకాశం 15 తేనె 16 బంగారు 17 నీలము (ఆకాశం) 18 ఆకుపచ్చ 19 గోధుమ 20 తెలుపు 21 ముదురు ఎరుపు 22 తెలుపు 23 కుంకుమ 24 తేనె 25 బంగారు 26 ముదురు 27 పచ్చ.

## 784. హిందూ వివాహంలో ముఖ్యమైన అంశాలు ఏవి ?

1 పెళ్ళిచూపులు 2 నిశ్చయ తాంబూలాలు 3 స్నాతకవ్రతం 4 కాశీ యాత్ర 5వరపూజ ఎదుర్కోళ్లు 6 గౌరీపూజ 7 వధూవరుల మంగళ స్నానాలు 8 కన్యావరణం 9 మధుపర్కాలు 10 యజ్ఞోపవీతధారణ 11 మహాసంకల్పం 12 కాళ్ళుకడగడం 13 జీలకర్ర–బెల్లం(సుముహూర్తం) 14 కాళ్ళు తొక్కించ డం 15 కన్యాదానం 16 స్వర్ణజలాభి మంత్రణం 17 యోక్త్ర బంధనం 18 మంగళసూత్రధారణ 19 తలంబ్రాలు 20 బ్రహ్మముడి 21 ఉంగరాలు తీయడం 22 సప్తపది, పాణిగ్రహనం 23 ప్రధాన హోమం 24 సన్నికల్లు తొక్కటం 25 లాజహోమం 26 స్థాళీపాకం 27 నాగవల్లి 28 సదస్యం 29 నల్లపూసలు కట్టడం 30 అరుంధతీ దర్శనం 31 ఉయ్యాల–బొమ్మని అప్పచెప్పటం 32 అంపకాలు (అప్పగింతలు) 33 గృహప్రవేశం–సత్యనారా యణవ్రతం 34 కంకణ విమోచనం 35. గర్భాదానం

## 785. ఋషిత్రయం గురించి వివరించండి ?

రాజర్షి, మహర్షి, దేవర్షి అనువారిని ఋషిత్రయమంటారు. ఉత్తమ శ్రేణికి చెందిన మహర్షులను బ్రహ్మర్షులు అనికూడా వ్యవహరిస్తారు. రాజుగా ఉంటూనే ఋషిత్వం పొందినవాడురాజర్షి. ఈయనకు వేదతత్త్వజ్ఞానం కూడా సమగ్రంగా ఉంటుంది. పూర్వం యోగవిద్యలో రాజర్షులు నిష్ణాతులై ఉండే వారు. భగవంతుడు వివస్వంతునికీ, వివస్వంతుడు మనువుకూ, మనువు ఇక్ష్వాకునకూ బోధించిన బ్రహ్మవిద్య రాజర్షులలో పరంపరాగతమై ఉండేదని భగవద్గీతను బట్టి తెలుస్తున్నది. సాధారణ ఋషిస్థాయినిదాటి ఈ గొప్ప

ఋషులు మహర్షులయ్యారు. 'మహర్షయః సప్తపూర్వే' అన్న గీతా వచనాన్ని బట్టి ఏడుగురు పూర్వమహర్షులు భగవత్సంకల్పంతో జన్మించినారు. పురాణాలలో అనేకులు మహర్షులుగా పేర్కొనబడినప్పటికీ 'మరీచిరంగిరా శ్చాత్రిః పులస్యః పులహః క్రతుః। వసిష్ఠఇతి సప్తైతే మానసా నిర్మితా హితే'॥ అన్న ప్రమాణాన్నిబట్టి స్వాయంభువ మన్వంతరంలో మార్పుననుసరించి మహర్షులలో కూడా భేదముండేది. భృగుమహర్షి భగవత్స్వరూపుడుగా గీతలో పేర్కొనబడియున్నాడు. (మహర్షీణాం భృగురహం). ఈ మహర్షులు వేదవిదులు, ప్రవృత్తిధర్మం పాటిస్తూ ప్రాజాపత్యంకల్గి ఉండేవారు. దేవర్షు లనగా "దేవలోక ప్రతిష్ఠాశ్చ జ్ఞేయా దేవర్షయః శుభాః" అన్నట్లు దేవలోకంలో ప్రతిష్ఠ గలవారు దేవర్షులుగా వినుతి కెక్కారు. అన్నట్లు ధర్ముని పుత్రులైన నరనారాయణులు, క్రతుపుత్రులైన వాలఖిల్యులు, పులహుని కుమారుడైన కర్దముడు, కశ్యప సుతులైన పర్వత నారదులు దేవతలను సైతం నియమించ గల వారుగాన దేవర్షులుగా పేర్కొనబడ్డారు.

**786. కామధేనువు, కల్పతరువు, చింతామణి గురించి తెలియ జేయండి?**

కామధేనువు ఒకగోవు. దీనిని 'సురభి' అని కూడా అంటారు. దేవతలు, రాక్షసులు క్షీరసాగర మథనం చేసే సమయంలో ఇది పుట్టినది. ఇది కోరిన కోర్కెలనన్నిటినీ ప్రసాదిస్తుంది. దీని పొదుగునుండి అమృతం స్రవిస్తుంది. కల్పవృక్షముగూడ కోరినవారి కోర్కెలను తీరుస్తుంది. ఇది గూడ కామధేనువు వలె క్షీరసాగర మథనకాలంలో పుట్టింది. ఈ దేవతావృక్షం ఇంద్రుని ఉద్యాన ములో ఉండి సమస్తఋతువులలోనూ పత్రపుష్పాదులచే శోభితమై ఉం టుంది. చింతామణి ఒక దేవమణి. ఇది గూడ చింతించిన అనగా కోరిన కోర్కెలను తీర్చే శక్తి గల్గియున్నది. చింతామణి మంత్రమును ఉపాసించిన వారికి సంకల్పి తార్థాలు సిద్ధిస్తాయి. కామధేను-కల్పవృక్ష-చింతామణులకు సంబంధించిన సిద్ధులను పేర్కొంటూ తత్త్వవేత్తలు నిష్కామస్థితియే కామధేను సిద్ధియనీ, నిస్సంకల్పస్థితియే కల్పవృక్షసిద్ధియనీ,నిశ్చింతాస్థితియే చింతామణి సిద్ధియనీ వివరించారు. జిజ్ఞాసువులు దీనిని గ్రహించగలరు.

**787. దూరంగా ఉన్నవ్యక్తి పేరుతో గ్రహశాంతి, జప, హోమాది క్రియలు ఎలా చేయాలి ?**

స్థానికంగా లేనటువంటి వ్యక్తుల విద్యా, ఉద్యోగ కరాణాలుగా ఇతర రాష్ట్రాలు, ఇతరదేశాలలో ఉన్నప్పుడు ఆ వ్యక్తుల జాతకరీత్యా ఏమైనా దోషాలు ఉండి, వాటికి శాంతిక్రియలు చేయవలసివస్తే వారికిసంబంధించిన





కుటుంబ సభ్యులు లేదా సమీప బంధువులు లేదా ఆత్మీయులు, మిత్రులు సంకల్ప పూర్వకంగా మంచి పండితులతో జప,తర్పణ,హోమాది కార్యక్రమ ములు నిర్వర్తించ వచ్చును. ప్రారంబసమయంలో ఎవరిపేరుతో శాంతి క్రియలు చేస్తున్నారో వారి పేరు, గోత్రము ఉదహరిస్తూ వారు ఇచ్చటలేని సందర్భముగా వారి తరపున నేను చేస్తున్నాను అని సంకల్పం చేయాలి. ప్రతిరోజు జప కార్యక్రమ సందర్భముగా చివరిలో హోమసందర్భముగా ఇచ్చే తీర్థమును కాశీవిభూదిలోవేసి, భద్రపరచవచ్చును. నిత్యము పూజచేసిన తీర్థము విభూదిలో వేస్తూ ఉండటం వలన అందులో ఆ ఫలముండును. చివరలో ఆ విభూదిని పూజ ఎవరిపేరుతో చేస్తున్నామో వారికి పంపవలెను. అచ్చట వారు వారి గృహమందు దేవతా మూర్తుల ఎదుట కొబ్బరికాయకొట్టి, ఆ నీటిలో ఈ విభూదిని కలిపి ముందుగా కొంచెం తలపైచల్లుకొని, తదుపరి మూడుసార్లు తీర్థం తీసుకోవాలి. పూజాప్రసాదం పంపదలిస్తే కొబ్బరి ప్రసాదం, పండ్లు నిలువ ఉండవు కాబట్టి, ఎండు ఖర్జూరం, ఎండుద్రాక్ష, జీడిపప్పు, బాదంపప్పు, పట్టిబెల్లం వీటిలో ఏదోఒకటి పూజాసమయంలో నివేదనచేసి, చివరలో దానం కూడా పూజ ఎవరికైతే చేస్తున్నామో వారి గోత్ర, నామాలతో సంకల్పంచేసి ఇవ్వాలి.

**788. గ్రహశాంతులు, జపాలు చేయుటానికి శక్తి లేనివారు ఏమి చేయాలి ?**

ఆర్థిక స్తోమతలేనపుడు, శాంతిక్రియలు చేయలేకపోయినప్పటికీ దోషము కలిగిన గ్రహములకు సంబంధించిన ధ్యాన శ్లోకములు నిత్యము కనీసం 11 సార్లు పఠించాలి. గ్రహసంఖ్య బట్టి అన్నిసార్లు యధాశక్తిగా కుదిరినన్నిరోజుల్లో చేయవచ్చు. అదేవిధంగా నవగ్రహములకు ప్రదక్షిణ ములు చేయుటవలన కూడా ఉపయోగము ఉంటుంది. ఆ గ్రహము లకు సంబంధించిన వారం రోజు ఉపవాసం చేయవచ్చు. సంబంధించిన గ్రహమునకు సాధారణ స్థాయిలో కనీసం అష్టోత్తరము పూజ చేసిన మంచిదే. లేదా ఇంటివద్దనే గ్రహములకు సంబంధించిన స్తోత్రములు పారాయణ చేయవచ్చు. రవిదోషం ఉంటే ఆదివారం, చంద్రోషం ఉంటే సోమవారం, కుజదోషం ఉంటే మంగళవారం, బుధదోషం ఉంటే బుధవారం, గురుదోషం ఉంటే గురువారం, శుక్రదోషం ఉంటే శుక్రవారం, శనిదోషం ఉంటే శని వారం రాహుదోషంఉంటే ఆది లేదా మంగళవారం కేతుదోషం ఉంటే మంగళ లేదా ఆదివారం ఉపవాసమున్న దోషనివారణ కలుగుతుంది. ఆ గ్రహమునకు సంబంధించిన ధాన్యధానంచేసిన మంచిదే.

MOHAN PUBLICATIONS.COM

## 789. కావేరీ నదీ ప్రాశస్త్యము వివరించండి ?

కావేరీనదిని దక్షిణ గంగ అనిపిలుస్తారు. సహ్యాపర్వత శ్రేణుల్లో సముద్ర మట్టానికి 1320 మీటర్ల ఎత్తున మైసూర్లోని బ్రహ్మగిరి కొండపై కావేరి ఆవిర్భ వించంది. కొడుగు లేదా కూర్గు అనే ప్రాంతం ఈ నదికి రూపకల్పన చేస్తుంది. కావున ఈ నది "కూర్గుకుపూరి" అని కావేరి ఉద్భవించే ప్రదేశాన్ని 'తలక్కాలేరా' అని అంటారు. కావేరి పుట్టేచోట ఒక చిన్న తొట్టె ఆకారంలో ఉంటుంది. ఈ తలక్కామేరిలో కావేరిమాల్ పెద్ద విగ్రహం ఉంది. కావేరి దేవతగా భక్తులు పిలుస్తారు. భక్తుల కోర్కె తీర్చే ఇలవేల్పుగా కావేరి దేవత పేరు పొందినది. ఈ దేవతకు ప్రతి ఏటా శ్రావణమాసంలో గొప్ప ఉత్సవం జరుగుతుంది. దక్షిణ గంగగా పేరు పొందిన కావేరికి షింసా, భవానీ అనేరెండు ముఖ్యమైన ఉప నదులు చెప్పబడుతున్నాయి. ఇవికాక కనక, సుజోజ్యోతి, హేమావతి, లోకాపాము, అర్ధావతి, తొప్పైయ్యేరు, శరభంగ, మణిమధుర, హొళే, సాగరఘాట్, లక్ష్మణతీర్థ, కాబినికుండల, అమరావతి మొదలగు చిన్న పెద్ద మొత్తం కలిసి 50కిపైగా కావేరికి ఉపనదులు ఉన్నాయి. వీటివల్ల కావేరి వెడల్పు పెరిగి ప్రవహిస్తుంది. కావేరి పరివాహక ప్రాంతం అంతా సస్యశ్యామలం. అందుకే కావేరిని "పొన్ని"అని అంటారు. పొన్ని అంటే ధాన్యం అని బంగారు అని రెండు అర్థాలు. ఈ నది ధాన్య సమృద్ధి కలిగించేది, బంగారు పంటలు పండించేదని ఈ కావేరి నదికి పేరు. కూర్గు కొండల్లో జన్మించి, కొంతదూరం పర్వత సీమలందే ప్రవహించి తర్వాత ఆగ్నేయదిశగా ప్రవహించి మైసూరు రాష్ట్రంలో పీఠభూమి దశ వదిలి క్రిందనగల పల్లలోకిని శివసముద్రంవద్ద దూకుతుంది. ఒక్కడ కావేరి రెండుగా చీలుతుంది. ఈ రెండుచీలకల పేర్లు పరుచుక్కి, గగనచుక్కి అని పిలుస్తారు. పరచుక్కి 230 అడుగులు క్రిందికి ఒక జలపాతంలా పడుతుంది. గగనచుక్కి అద్భుతంగా 90కి.మీ.కొండచరియల్లో కావేరినదీ అలసట లేకుండా ప్రవహిస్తుంది. శివసముద్రం దాటిన తర్వాత కావేరి తమిళనాడు రాష్ట్రంలో ప్రవేశించి, తంజావూరుజిల్లాలో అధికశాతం ప్రవహించి కావేరి అక్కడ నుండి మరికొంతదూరంసాగి బంగాళాఖాతంలో కలుస్తుంది.

## 790. భీమానదీ ప్రాశస్త్యము వివరించండి?

ఈ భీమానదినే భీమరది అని తామ్రపర్ణ అని పిలుస్తారు. పశ్చిమ కనుమల్లో సహ్యాపర్వత వరుసలో ఈ భీమానది ఉద్భవించినది. ఈ నది



ప్రస్తావన మత్స్య, బ్రహ్మ, వామన, బ్రహ్మాండ, శివ, వాయు, కూర్మ పురాణాల్లో రామాయణ భారతాల్లో ఈ నదీ ప్రస్తావన ఉన్నది. ఈ బీమానదికి పెక్కు ఉపనదులు ఉన్నాయి. భీమశంకర్ క్షేత్రము ప్రక్కన భీమగిరి అను సన్నని లోయ గుండా ప్రవహించి, పింపరీగామ్ వద్దచేరి, అక్కడ "భామ" అను చిన్న నదిని తనలో కలుపుకొనుచున్నది. బీమానదిలో కలిసే మరొక ఉపనది. ఇంద్రాణి ఈ ఇంద్రాణి దేహు అను గ్రామం గుండా ప్రవహిస్తుంది. ఈ గ్రామంలోనే కవి భక్త తుకారాం జన్మించింది. అక్కడ నుంచి తులాపూర్వద్ద భీమానదిలో ఇంద్రాణి కలుస్తుంది. ధాంధేరిడ్ను ప్రాంతానికి కొద్దిదూరంలో "తేల్" అను మరొకనది భీమా నదిలో కలుస్తుంది. తర్వాత "మాలాముధా" అనుప్రవాహం కలుస్తుంది. గోల్ అను చిన్ననది భీమాలో కలుస్తుంది. భీమానది ఆగ్నేయదిశగా ప్రవహిస్తూ ముందుకుసాగి, నరసింగ్పూర్ దగ్గర వీరా అను మరొక నదితో సంగమిస్తుంది. ఇక్కడ నుండి భీమానది మరికొంతదూరం ప్రవహించి పండరీపురం చేరును. అచ్చట ఈనది చంద్ర భాగానది అని పిలుస్తారు. ఇక్కడ ఆలయం పాండురంగస్వామి (విఠల్జీ) ప్రసిద్ధ క్షేత్రం. ఇక్కడున్న 11 స్నానఘట్టలు అత్యంత పుణ్యప్రదమైనవి. ఇక్కడనుండి భీమానది ఆగ్నేయంగా 10 మైళ్లు ప్రవహించి, స్కారలి వద్ద మాసా అను చిన్ననది కలుపుకొని షోలాపూర్కు దక్షిణంగా ప్రవహించి, 25 మైళ్ళదూరాన కుమలీ అనే ప్రాంతం వద్ద సేనా అను చిన్ననది తనలో కలుపుకొని చివరకు కర్ణాటక రాష్ట్రంలోని రాయచూర్కు ఉత్తరములోని మహ బూబ్నగర్ సరిహద్దులో కృష్ణారైల్వే స్టేషన్వద్ద కిష్ణానదికి ఉపనదిగా మారినది. కుంభకర్ణుని రెండవభార్య "కర్కటి"జన్మించిన భాముడనే రాక్షససంహారం చేసిన ఈశ్వరుడు "భీమశంకర్" జ్యోతిర్లింగంగా వెలిశాడు. ఈ లింగము క్రిందనుంచి ఊరిన నీరు భీమానదీ జన్మస్థానముగా మారినది.

## 791. బ్రహ్మపుత్ర నదీ ప్రాశస్త్యము వివరించండి?

హిమాలయంలోపుట్టిన బ్రహ్మపుత్రానది ప్రపంచంలో అతి పెద్దనది. త్రివిష్టపం (టిబెట్) పశ్చిమభాగం ఓ కైలాసపర్వత శ్రేణుల్లోకల మానస సరోవరానికి కొద్దిదూరానవున్న పెద్ద మంచుముద్ద నుండి బ్రహ్మపుత్ర పడుతుంది. అక్కడ దీనిపేరు సాంగ్పో సాంగ్పో అంటే టిబెట్ భాషలో "పానకము చేయునది" అని అర్థం. అక్కడ నుండి బ్రహ్మపుత్ర అరుణాచల్ ప్రదేశ్కు వచ్చి దిహాంగ్ అని పిలుస్తారు. అక్కడ నుండి అస్సాంచేరి బ్రహ్మపుత్ర



MOHAN PUBLICATIONS.COM

లోహత్‌గా పేరుతెచ్చుకొని, ఇక్కడ నుండి ప్రవహించి బంగ్లాదేశ్‌కి చేరి, మేఘన, జమునలుగా పిలువబడుతూ దౌలందా వద్ద గంగానదిలో కలిసి బంగాళాఖాతాన్ని చేరుతుంది. బ్రహ్మపుత్రానది పరమ పవిత్రమైనదని, స్నానమాత్రముచే సకల పాపాలు పోతాయని, తీర్థాలలో కెల్లా బ్రహ్మపుత్ర అమృతమైన తీర్థరాజమని,ఈనదిస్నానం నదీతీరంలో ధ్యానంకాని, పూజలు కాని, పితృకర్మలు చేస్తే అవి కోటిరెట్లు అధిక ఫలితాన్ని ఇస్తుందని" యోగిని తంత్రం తెలియచేస్తుంది.

భారతదేశంలో ప్రధానంగా అస్సాంలో ప్రవహిస్తుంది. అస్సామి భాషలో ఈ నదికి లోహితానది అనిపేరు. పురాణల్లో పుష్కర తీర్థ ప్రస్తావన కనిపిస్తుంది. విశ్వామిత్రుడు బ్రహ్మర్షిపదం పొందగోరి పుష్కర తీర్థ ప్రాంతాన ఉండి, వేయి సంవత్సరాలు తపస్సుచేశాడనీ, పుష్కర తీర్థంలోనే మేనక జలకాలాడుతూ విశ్వామిత్రుడికి కనిపించనట్లు చెప్పబడింది.

## 792. కల్పాలు ఎన్ని?

కల్పాలు పద్దెనిమిది ఉన్నాయని భవిష్యపురాణం చెబుతోంది. ఈ కల్పాలు కాల విభజనలో సుదీర్ఘమైన కాలావధులు. ఒక్కో కల్పంలో నాలుగు పాదాలు ఉంటాయి. అవన్నీ సమానమైన కాలావధితో ఉంటాయి. ప్రస్తుతం నడుస్తున్నది శ్వేతవరాహకల్పంలోని వైవస్వత మన్వంతరం. అందుకే సంలక్పం చెప్పుకునే టప్పుడు తిథి చెబుతూ, శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే అంటూ చెప్పుకుంటాం. ఇక ఈ కల్పాలపేర్ల విషయానికివస్తే అవి కూర్మకల్పం, మత్స్యకల్పం, శ్వేతవరాహకల్పం, నృసింహ కల్పం, వామనకల్పం, స్కంధ కల్పం, రామకల్పం, భావతకల్పం, మార్కండేయకల్పం, భవిష్యకల్పం, లింగ కల్పం, బ్రహ్మాండ కల్పం, అగ్ని కల్పం, వాయుకల్పం, పద్మకల్పం, శివకల్పం, విష్ణుకల్పం, బ్రహ్మీకల్పం, ప్రస్తుతం నడుస్తున్నది శ్వేత వరాహకల్పం. అంటే భవిష్యపురాణం ప్రకారం వరుసలో మూడోకల్పం. ఇక దీని తర్వాత 15 కల్పాలు ఉన్నాయి. అందులోని ప్రతిదానిలో మన్వంతరాలు ఉన్నాయి. ప్రతి మన్వంతరంలోనూ నాలుగు యుగాలు ఉంటాయి. ఈ చక్రం అంతా పూర్తయిన తర్వాతనే సంపూర్తి లయం. ఈలోగా ప్రతి కలియుగాంతంలో జలప్రలయంవచ్చి మానవాళిలో దుష్టప్రకృతికి చెందిన వారినందరినీ అంతం చేస్తుంది. మిగిలిన కొద్దిమంది మంచివాళ్లతో మరో మన్వంతరం లోని సత్య యుగం ఆరంభమౌతుంది.





## 793. కలి లక్షణాలు ఏమిటి?

మానవుల నందరిని కాముకులుగాను, జిహ్వా చాపల్యం కలవారుగాను చేసి, నిద్ర, కలహం,దుఃఖం, ఇష్టం, సిగ్గులేనితనం, ఇతరుల వస్తువులను, స్త్రీలను, ధనమును అపహరించటం, అహంకార పూరితులను చేసి వారిని వక్రమార్గంవైపు మరలించటం కలి లక్షణాలు.

అలాగే కొంగజపం చేసే దొంగ సన్యాసులన్నా, నమ్మినవారికి ద్రోహం చేసే వారన్నా, ధర్మబద్ధమైన వాటిని ద్వేషంచేవారన్నా, యజ్ఞ, యాగాదులను నాశనంచేసి హేతువాదంవైపు పురికొల్పేవారన్నా, స్త్రీ,పుత్ర,ధన, వ్యామోహంతో చిక్కినవారన్నా, స్వధర్మాన్నివీడి పరధర్మం వైపు మొగ్గు చూపేవారన్నా, వేద శాస్త్రాలను నిందించేవారన్నా శివకేశవులు వేరని తలచేవారన్నా, ద్వేషించే వారన్నా, కలికి మహాప్రీతి. అలా తప్పుదోవ పట్టించి పాపుల సంఖ్యను అంతకంతకు పెంచటమే కలిధ్యేయం. ఆ తప్పుతో మనని వధించ డం కవిలక్ష్యం. ఆ ఉచ్చుల వ్యామోహంలోంచి భగవత్ ధ్యానంతో బయట పడటం మన కర్తవ్యం.

## 794. కన్యాదాన ఫలం విశిష్టత ఏమిటి?

మహాసంసార చక్రంలో పశుపక్ష్యాదులుగా ఎన్నో జన్మలెత్తాక అదృష్టం కొద్దీ మానవజన్మ కలుగుతుంది. అప్పటినుంచి తెలిసికాని, తెలియక కాని చేసిన మహాపాతకాలు, ఉపపాతకాలు ఇలాగే ఇతర అనేక విధాలైన పాతకములు త్వరగా పోవడానికీ. తన వంశంలో తన వెనుక 10 తరాల్లోను, తన తరువాత 10 తరముల వారిలోనూ నరకములో ఉన్ననూ ఉండబోయే వారందరినీ కూడ రక్షించి శాశ్వతమైన పుణ్యాలోకములు పొందేటట్లు చేయడానికే. గంగా నదిలోని అణురేణువులను రాశిగా సప్తఋషి మండలం వరకును, నువ్వులను రాశిగా సూర్యమండలం వరకును, ఎద్దు వెంట్రుకలను రాశిగా నక్షపు మండలం వరకును, మినుములను రాశిగా ధృవమండలం వరకును పోసి వానిని దేవతా మానం ప్రకారం వేయి సంవత్సరాలు గడిచిన పిదప రాశిలో ఒక్కొక్కటి చొప్పున తీస్తూ ఆ రాశులన్నీ పూర్తిగా తరిగే వరకు తనకు బ్రహ్మలోకనివాసము సంప్రా ప్తించుటకు, మరియు అగ్నిష్టోమ, అశ్వమేధ యజ్ఞపుణ్య ఫలాలకు 3రెట్లు లభించుటకు, అంతేకాక ఈ జ్మలో రాజభోగాలనుభవించి అనంతరం విష్ణుసాయుజ్యం పొందటానికీ సర్వాలంకారాలతో కూడిన కన్యను దానం చేయాలి.

MOHAN PUBLICATIONS.COM

## 795. వ్యక్తి మరణిస్తే ఎవరు ఏడుస్తారు ?

ఇంట్లోవాళ్లు. ఇతర బంధువులు దుఃఖిస్తారు నిజంగా వాళ్లు కాదు ఏడ్చేది. జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, మనస్సూపడి పడి దుఃఖిస్తాయి. జ్ఞానేంద్రియాల్లో -

మొదటిది శరీరం. అది వణుకుతుంది. రెండవది కన్ను. అది కన్నీరు కారుస్తుంది. మూడవది చెవి. అది ఎవరెవరు ఏమి మాట్లాడుతున్నారో దాన్ని వినిపంచుకునే శక్తిని తాత్కాలికంగా కోల్పోతుంది. నాల్గవది నాలుక. దేనినీ తినాలనే ఊహలోనే లేక ఏదీ రుఇంచరకుండా చేసుకుంటుంది. ఐదవది ముక్కు ఉచ్ఛ్వాస నిశ్వాసాలని బరువుగా చేస్తుంది. ఇక కర్మేంద్రియాలు ఐదింటిలో మొదటిది మాట. మాట్లాడటానికి నోరు పెగలనే పెగలదు. రెండవది పాణి (చెయ్యి) ఏమి చేయాలో దానికి తోచదు. అందు చేత చెయ్యి ఆడదు. మూడవది పాదం (కాలు) ఎక్కడికీ వెళ్ళాలంటూ ఉత్సాహాన్ని చూపనే చూపదు. నాలుగు, ఐదు విసర్జక అవయవాలు. అవి దాదాపు పనిచేయవు. ఇక మనసు ఈ జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలను అదుపు చేయలేకపోతుంది. వ్యక్తికి సంబంధించిన పరిచయంతో ఏఏ పరిచయాలు జరిగాయో వాటిని తలుచుకుని తలుచు కుని దుఃఖిస్తాయి. కాబట్టి దుఃఖించేవాళ్లు పదకొండుగురు ఉన్నారన్నమాట.

## 796. రాజు అనే మాటకి అర్థం ఏమిటి ?

రం జయతి ఇతిరాజా, అందరినీ సంతోషపెట్టేవాడు రాజు అని అర్థం. సంతోష పెట్టేవాడు అనగానే వాళ్లందరికీ సొమ్ములనిచ్చో, వాళ్లకి వినోదాల్ని చేకూర్చో ఆనందపరిచే వాడని అర్థం కాదు. రాజా ప్రకృతి రంజనాత్ అని చెప్పబడ్డంవల్ల భూమి ద్వారా ఆనందాన్ని (చక్కని పంటలని పండించేలా చేసి) నీటిద్వారా ఆనందాన్ని (వర్షాలని కురిపించి) తేజస్సు ద్వారా ఆనందాన్ని (సరైన వేడిమిని అలాగే సరైన వెన్నెలని ఆకాశం కలిగి ఉండేలాగ అంటే సక్రమమైన కాలపద్ధతి పాటింపబడేలాగ చేసి-అకాలవర్షాలు, వర్షాల కాలంలో ఎండలు లేకుండచేసి) వాయువు ద్వారా ఆనందాన్ని (గాలివాన, తుఫాన్లు మొదలైన ఉపద్రవాలు లేకుండా చేసి) అందించేవాడెవడో అతడు రాజు. ఇవన్నీ రాజుకి సాధ్యమా? అవన్నీ పంచభూతాలు కదా! అని అనుకో నక్కరలేదు. రాజు సక్రమంగా పరిపాలన సాగించిన రోజున దైవాన్ని మరువని రోజున ఇవన్నీ సక్రమంగాసాగి నిజమైన రాజు కాగలుగుతాడు. కాబట్టి రాజు అంటే కేవలం పరిపాలించేవాడనేది అర్థంకాదు. ప్రకృతిలో ఉండే పంచభూతాల ద్వారా లోకానికి ఆనందాన్ని కలిగించేవాడని అర్థం.





## 797. మంత్రజపం అంటే ?

మననాత్ త్రాయతే ఇతిమంత్రః మననం చేసేవారిని రక్షించేది మంత్రం గురువుచే ఉపదేశింపబడిన మంత్రాన్ని జపించుటవల్ల మంత్రసిద్ధి కలుగుతుంది. "జపం"లో "జ"అంటే జన్మంరాకుండా, "ప" అంటే పాప పుణ్యాలు పోగొట్టే, "ము" అంటే ముక్తిని ప్రసాదించేది అని అర్థం. మంత్ర జపం మనలో ఉన్న పాపపుణ్యాలు హరింపజేసి భవసాగరంలో పడకుండా రక్షిస్తుంది. అయితే జపం మూడు రకాలు. 1. వాచకజపం 2. ఉపాంశక జపం 3.మానసికజపం. 1.వాచకజపం : వాక్కుద్వారా శబ్దాన్ని బహిర్గత మయ్యేట్లుగా, బయటకు వినిపించేటట్లుగా జపించేది. దీనికన్నా ఉపాంశక జపం శ్రేష్ఠం. 2. ఉపాంశక జపం : పెదువులు కదిలిస్తూ, శబ్దం ఎవరికీ వినపడకుండా జపించేది ఉపాంశకజపం. వీనికన్నా మానసికజపం శ్రేష్ఠ మైనది. 3.మానసిక జపం : ఏదేని ఆసనంపై కూర్చొని, దేహాన్ని నిటారుగా నిలిపి, బాహ్యచింతనవీడి, శబ్దం బయటకు రాకుండా, పెదాలు కదలకుండా, దృష్టినిపరమాత్మలో ఐక్యంచేసి, మనస్సులో జపించటంలచాలా శ్రేయస్కరం. ఇట్టిజపమే జీవుణ్ణి శీఘ్రంగా బంధనుండి విడుదలచేసి ముక్తిని ప్రసాదిస్తుంది-సిద్ధపురుషులెందరో ఇట్టి మంత్ర జపంచేసి సిద్ధిని పొందిఉన్నారు.

## 798. గురు పరంపర మొదలు ఎక్కడ ?

గురుపరంపరకు మూల పురుషుడు శివుడు. పరమేశ్వరుని శిష్యుడు విష్ణువు-విష్ణువుకు బ్రహ్మదేవుడు-ఆయనికి వశిష్టుడు-శిష్యులు. ఇలా వరుస క్రమంచూస్తే శక్తిపరాశరుడు,వ్యాసుడు,శుకుడు,గౌడపాదు,గోవింద భగవత్పాదాచార్యులు, శంకరభగవత్పాదులు, విశ్వరూపుడు, బోదజ్ఞానగిరి, సింహగిరి, ఈశ్వరతీర్థుడు, నృసింహతీర్థుడు, విద్యారణ్యుడు, మలయానందుడు, దేవ తీర్థుడు, యాదవేంద్ర సరస్వతి, కృష్ణసరస్వతి.

## 799. హనుమంతుడు ఎప్పుడూ నమస్కరిస్తూనే కన్పిస్తాడెందుకు ? (ఆలయ విగ్రహాల్లో)

రావణవధ అయ్యాక వెళ్ళిపోతూంటే సీతారాములు కూడ వెళ్తూంటే రాముడు ఆంజనేయుడితో అన్నాడు 'నీకేం కావాలి?' అని. నాకు మరే విధమైన కోరికలూవద్దు. ఏరూపం చూచినా అందులో నీ రూపమే

MOHAN PUBLICATIONS.COM

కన్పించేలానూ, ఏ శబ్దం వినిపించినా అందులో సీతారాముల కథే ఉందని అన్పించేలానూ, ఎక్కడ నమస్కరించినా అది మీకే చెందేలానూ, ఈ భావం నాకు శాశ్వతంగా ఉండేలా అనుగ్రహించు' అని కోరాడు హనుమ. దానికి రాముడు సరేనన్నాడు. అందుకని ఆంజనేయుని నమస్కారం సీతారాములకే. ఆంజనేయ ధ్యానమంతా సీతారాముల విషయంలోనే. సీతారాములకి నమస్కరిస్తున్న హనుమకి నమస్క రించడం సీతారాములకి మరింత ఇష్టం. ఎందుకంటే భగవంతుడు తనకి చేసిన నమస్కారం కంటె, తన భాగవతునికి (భక్తునికి ) చేసిన నమస్కారానికి ఎక్కువ ప్రాధాన్యాన్నిస్తాడు కదా! (అహం స్మరామి మద్భక్తమ్.)

### 800. యజ్ఞయాగాదులు ఎవరైనా చేయవచ్చా ?

యజ్ఞయాగాదులకి కొన్ని నియమాలున్నాయి. పుత్రకామేష్టిని సంతానం లేనివాడేచేయాలి. అశ్వమేధయాగాన్ని క్షత్రియుడే నిర్వహించాలి. రాజసూయ యాగాన్ని నాలుగు దిక్కుల రాజుల్నీ ఓడించిన మీదటనే చెయ్యాలి. సఫలం కాకుడదు అని బ్రహ్మరాక్షసులు వేయికళ్లతో చూస్తుంటారు కాబట్టిరాజ సూయంచేసిన రాజులందరూ దాదాపు దెబ్బతిన్నవాళ్లే. ధర్మరాజంతటివాడు రాజసూయాన్ని కృష్ణుని సమక్షంలో ఆయన్ని పూజించి చేసినా ఆ సభలోనే శిశుపాలవధ జరిగింది. దాని కారణంగానే మయసభ ఏర్పడింది. అరణ్యా జ్ఞాత వాసాలూ కురుక్షేత్రమూ వచ్చాయి. కాబట్టి యజ్ఞయాగాదులు అందరూ చేసేవి కావు. చేయవలసినవాళ్లు కూడ ఏదోలాచేస్తే ఫలితాల్నిచ్చేవీ కావు. సరిగా చేయబడని పక్షంలో క్షమించి విడిచిపుచ్చేదేవీకావు.

### 801. సంతాన ప్రాప్తికి నవగ్రహాల ఆటంకం ఏమిటి ?

1. సూర్యుడు : సంతాన ప్రాప్తికి సూర్యుడు బాధాకారక గ్రహమైతే, పితరులు, విష్ణువు, గురువుకు ద్రోహం చేయటంవల్ల వారి శాపంచేత సంతానం కలగదు. 2. చంద్రుడు : ఈ గ్రహం బాధాకారకుడైతే తల్లికిగాని, తల్లితో సమానురాలైన స్త్రీకిగాని మనస్తాపం కలిగించటంవల్ల సంతాన ప్రాప్తి ఉండదు. లక్ష్మిమాత శాపంవల్ల కూడా సంతానం కలగదు. 3. కుజుడు : బాధాకారక గ్రహం కుజుడైతే సోదరులు, శత్రువుల ద్వారా, రుద్ర భగవానుణ్ని ఆరాధించక పోవడంవల్ల సంతానప్రాప్తికి ఆటంకం కలుగుతుంది. 4. బుధుడు : బుధగ్రహ కారణంగా సంతానం కలగకపోతే సరస్వతిని పూజించక పోవడం, పిల్లులను, చేపలను చంపటం సంతాన





ప్రాప్తికి ఆటంకం అవుతుంది. 5.గురువు : సంతానప్రాప్తికి గురవు బాధాకారక గ్రహమైతే కులగురువు లేదా గురు సమానులను నిరాదరించం, ద్రోహం చేయటం, ఫలవృక్షాలను నరకటం సంతాన ప్రాప్తికి ఆటంకం. 6. శుక్రుడు : జాతకంలో శుక్రుడు పీడితుడైతే పుష్ప వృక్షాలను నరకటం, గోమాతను సేవించకపోవడం, యక్షిణీ శాపంకారణంగా సంతానం కలగదు. 7. శని : రావిచెట్టును నరకటం, పిశాచబాధ, యమధర్మరాజు కారణంగా జాతకంలో శనిగ్రహం సంతాన ప్రాప్తికి బాధాకరం అవుతుంది. 8. రాహువు: రాహువు బాధాకరగ్రహమైతే సర్పశాపంవల్ల సంతానం కలగదు. 9. కేతువు: బ్రాహ్మణ శాపంవల్ల జాతకంలో కేతుగ్రహం సంతానప్రాప్తికి ఆటంకమవు తుంది. ఈబాధాకారక గ్రహాలను ఉపశమింపచేయటానికి, విధి విధానంగా శాంతిక్రియలు ఆచరించటంవల్ల దోషం పరిహారమవుతుందదని శాస్త్రాను సారవిశ్వాసం.

### 802. ద్వాదశాదిత్యుల మాసములు ఏవి ?

1. సూర్యుడు–చైత్రము; 2. అర్యముడు–వైశాఖము; 3. వివస్వానుడు–జ్యేష్టము; 4. అంశుమంతు–ఆషాఢమాసము 5. పర్జన్యుడు–శ్రావణము 6. వరుణుడు–భాద్రపదము 7. ఇంద్రుడు–ఆశ్వయుజము 8. ధాతృది–కార్తీకము 9. మిత్రుడు–మార్గశిరము 10. పూర్ణ–పుష్యమి 11. భగుడు–మాఘము 12. తృష్ణ–ఫాల్గుణము.

### 803. ద్వాదశాదిత్యుల క్షేత్రములు ఏవి ?

1. లోలార్కుడు – కాశియందలి భదైని 2. ఉత్తరార్కుడు–కాశి–ఆలయా పూర్ 3. సాంబాదిత్యుడు–సూర్యకుండము 4. ద్రౌపదాదిత్యుడు–అక్షయవట మూలము 5. మయూఖాదిత్యుడు–మంగళగౌరి నయూవము 6. వినతా దిత్యుడు–త్రిలోచనఘాట్ 7. అరుణాదిత్యుడు–త్రిలోచనఘాట్ తూర్పు 8. వృద్ధాదిత్యుడు–మీరుఘాట్ 9. కేశవాదిత్యుడు–వరుణాసంఘము 10. విమలా దిత్యుడు–జంగమబాది 11. గంగాదిత్యుడు–లలితాఘాట్ 12. యమాదిత్యుడు– సంకటఘాట్.

### 804. భిక్షాటనోపాయములు అనగా ఏవి ?

1. బిగ్గరగా అధ్యయనం చేయడం 2. పురాతన గాధలు చెప్పడం 3. ఆడవాళ్ళతో మాట్లాడడం 4. పిల్లల్ని లాలించడం 5. ఆడవాళ్ల వంటవార్పు స్తుతించడం 6. వారి భర్తలను స్తుతించడం 7. దీనత్వము ప్రదర్శించడం

8. అంగవైకల్యం ప్రదర్శించడం 9. సాముద్రికము 10. జ్యోతిష్యము 11. చిట్కాట వైద్యము 12. గారుడమంత్ర బాలవిద్యలు.

### 805. మానవుని దరిద్ర ఫలములు ఏమి ?

1. దరిద్రుని తల్లి నిందించును 2. భార్య లక్ష్యపెట్టదు 3. నోటవచ్చు మాటలన్నియు విపరీతముగాతోచును. 4. తీరని దుఃఖము కలుగును. 5. సభలోనికి పోవుటు భయము కలుగును. 6. భాగ్యవంతుని ఎదుట నిలువ భయపడును. 7. శౌర్యము సన్నమగును 8. ఇంటికివచ్చిన చుట్టములు యమదూతలవలె కనిపింతురు 9. పెత్తనము దక్కదు 10. ఎవరితో ఏది చెప్పినను మంచి ఆలోచనచెప్పరు 11. అందరు ఎగతాళిచేయుదురు 12. జ్ఞానసంపద నిష్ప్రయోజనమగును.

### 806. దేవతారూపులు, దేవతా సమానులు ఎవరు ?

1. కన్నతండ్రి 2. తన్నుపోషించినవాడు 3. విద్య చెప్పినవాడు 4. మంత్రమునుపదేశించినవాడు 5. ఆపత్కాలమందు రక్షించినవాడు 6. దారిద్ర్య మునుపోగొట్టినవాడు 7.భయమును పోగొట్టినవాడు 8. కన్యా దానము చేసినవాడు 9. జ్ఞానమునుపదేవించినవాడు 10. ఉపకారము చేసినవాడు 11. రాజు. 12. భగవదర్శకుడు.

### 807. నదీ పుష్కరములు ఏవి ?

1. గంగాపుష్కరము-గురుడు మేషరాశియందు 2. నర్మదాపుష్కరము-గురుడు వృషభరాశియందు 3. సరస్వతీ పుష్కరము - గురుడు మిధునరాశి యందు 4. యమునానది పుష్కరము-కటకరాశి 5. గౌతమీనది పుష్కరము-గురుడు సింహరాశియందు 6. క్రిష్ణవేణీ నది పుష్కరము-గురుడు కన్యారాశి యందు 7.కావేరీనదీపుష్కరము-గురుడు తులారాశియందు 8. తామ్రపర్ణి నదీ పుష్కరము-గురుడు వృశ్చికరాశియందు 9. సింధునది పుష్కరము-ధనూరాశి యందు 10. తుంగభద్రనదిపుష్కరము-గురుడు మకరరాశి యందు 11. భీమానదీ పుష్కరము-గురుడు కుంభరాశియందు 12. తపతీ నది పుష్కరము-గురుడు మీనరాశియందు.

### 808. కామ్యకర్మ (శ్రార్థ) తిథి ఫలములు ఏవి ?

1. పాడ్యమి-ధనలాభము 2. విదియ-సంతానము 3. తదియ-ఇష్టార్థము 4. చవితి-శత్రునాశనము 5. పంచమి-ఐశ్వర్యము 6. షష్టి-విలాసము 7. సప్తమి-అధికారము, ఉద్యోగ లాభము; 8. అష్టమి-సుఖసంపద,





పశువృద్ధి; 9.నవమి-స్త్రీలాభము, వివాహాదిశుభము 10. దశమి-సకలకార్యముల సిద్ధి 11.ఏకాదశి-విద్యాప్రాప్తి; 12. ద్వాదశి-సర్వకార్యఫలప్రదము 13. త్రయోదశి-బుద్ధి, కుశలత, పశువృద్ధి, ఆయువృద్ధి 14. చతుర్దశి-ఆయుధముచే మృతిపొందినవారు 15. అమావాస్య(పౌర్ణమి) సకల లాభములు, సర్వసుఖములు కల్గును.

### 809. దశ మృతజీవులు: (బ్రతికియు చచ్చినవారు) ఎవరు ?

1.దరిద్రుడు 2.రోగిష్టి 3.ఇల్లరికముయున్నవాడు 4.రాజసభలో భంగపడినవాడు 5. భార్యధనముచే జీవించువాడు 6. తీరనిదుఃఖమనుభ వించువాడు 7. ఆడుదానికి వెఱచువాడు 8. ఉపకారముచేయనివాడు 9.లోభి10. రహస్యమైనవి రచ్చకుతెచ్చువాడు 11. ఆడదానిచే పడుపువృత్తి చేయించువాడు.

### 810. పితరులు : పితృసమానులు ఎవరు ?

1. ఉపాధ్యాయుడు 2. తండ్రి 3. అన్న 4. ప్రభువు 5. మేనమామ 6. మామగారు 7. అభయప్రదాత 8. మాతామహుడు 9. పితామహుడు 10. బంధువు 11. తండ్రిసోదరుడు.

### 811. కీర్తిశేషులు; చచ్చియు బ్రతికియున్నవారు ?

1. పరోపకారి 2. వనమాలి 3. దేవాలయ ధర్మకర్త 4. ధర్మసత్ర ధర్మకర్త 5. వైద్యశాల ధర్మకర్త 6. నీతిదప్పనిరాజు 7. యుద్ధరంగమందు వెనుదిరగని వీరుడు 8. గొప్పవిద్యనేర్చినవాడు 9. కృతియొనర్చినవాడు 10. కృతినందినవాడు 11. సత్పుత్రునిగన్నవాడు.

### 812. పాలు స్రవించేచెట్లు ఏవి ?

1 త్రిబిల్వం 2. జీడి 3. పెద్దజెముడు 4. ఆకుజెముడు 5. పచ్చగన్నేరు 6. జిల్లేడు 7. రావి 8.మర్రి 9. అత్తి 10. జువ్వి 11. కలజువ్వి.

### 813. సత్వగుణసిద్ధులు అనగా నేమి ?

1. క్షుత్పిపాసారాహిత్యము (ఆకలి దప్పులు లేకుండా ఉండడం) 2. దూరశ్రవణం (దూరంగా ఉన్న శబ్దం వినడం) 3. దూరదర్శనం (దూరంగా వున్న దానిని చూడడం) 4. మనోవేగగతి (మనస్సు పరుగెత్తినంత వేగంతో ప్రయాణం చేయడం) 5. కామరూపప్రాప్తి (కోరినరూపం ధరించగలగడం) 6. పరకాయప్రవేశం (పరుల శరీరంలోప్రవేశించడం) 7. స్వచ్ఛందమరణం (తన యిష్టం వచ్చినప్పుడు మరణించడం) 8. అప్సర్సహిత దేవతా క్రీడా దర్శనం (అప్సరసలతో, దేవతలు క్రీడిస్తూ ఉండగా చూడగలగడం) 9.

MOHAN PUBLICATIONS.COM

సంకల్పసిద్ధి (ఏదితలచుకుంటే అది సిద్ధించడం) 10. అప్రహతాజ్ఞ (తన ఆజ్ఞకు అడ్డు లేకుండా ఉండడం)

### 814. నామాపరాధములు అనగా ఏమి ?

1.సాధునింద 2. తన దైవమే గొప్పదనుట 3. సర్వజ్ఞ 4. వేదశాస్త్రనింద 5. హరినామమహిమ ప్రశంస మాత్రమే అనుట 6. హరినామమునకు అన్యార్థము 7. హరినామశక్తిచే పాపకార్య మొనర్చుట 8. హరినామముతో ఇతర కార్యములకు సమానత్వము చెప్పుట 9.శ్రద్ధలేనివారికి నామోపదేశము చేయుట 10. నామమహిమము వినిను దానియందు ప్రీతిలేకపోవుట.

### 815. దశవిధ పాపములు అనగా నేమి ?

1. పరుషపుమాటలు 2. అసత్యపుమాటలు 3. పరులను వంచింపు మాటలు 4.అసందర్భపుమాటలు 5. పరులధనమును గోరుట 6. ఇతరులకు అనిష్టము తలపుట 7. వృధాప్రయాసము 8. పరులకు హానిచేయుట 9. స్త్రీలను చెరచుట 10. హత్యాచారము చేయుట.

### 816. ప్రాణసంకటములు అనగా ఏవి ?

1. బిడ్డల ఏడ్పులు 2.ఇల్లుకారుట 3. పొయ్యి పొగరావడం 4. నూతి నీరు ఉప్పు కషాయం 5. బట్టలుమురికికంపు 6. దీపము కొడిగట్టి కాంతి విహీనము 7. పడక-నల్లులబాధ 8. తిండి-యజ్ఞప్రసాదము 9. దారి-బురద 10. భార్య-నిరంతర శాపనార్థాలు.

### 817. దుష్టగుణములు అనగా ఏవి ?

1. అబద్ధములాడుట 2. కొండెములు చెప్పుట 3. కఠినముగా మాట్లాడుట 4. నిష్ప్రయోజనముగా సంభాషించుట 5. దొంగిలించుట 6. దుష్కార్యములను సలుపుట 7. చంపుట 8. చెరుపుచేయకోరుట 9. కామించుట 10. ఆశపడుట.

### 818. దేవుని ఊరేగించు నవి ఏవి ?

1. హంస లేక గరుత్మంతుడు 2. సింహము 3. శేషుడు 4. ఆంజనేయుడు 5. సూర్యప్రభ 6. చంద్రప్రభ 7. రథము 8. అశ్వము 9. గజము 10. పుష్పకము. (బంగారములేక వెండితోగాని నిర్మింపబడినవి)

### 819. భాస్కర క్షేత్రములు ఎక్కడ ఉన్నాయి ?

1. వారణాసి క్షేత్రము (కాశీ) 2. పుష్పగిరిక్షేత్రము (విజయనగరం) 3. కాంచీక్షేత్రము 4. వివృత్తిక్షేత్రము 5. అలంపురీక్షేత్రము 6. శ్రీశైలము




7. విరూపాక్ష క్షేత్రము 8. శ్రీరామసేతు క్షేత్రము 9. గోకర్ణ క్షేత్రము 10. కేదార క్షేత్రము.

### 820. మహాదానములు అనగా నేమి ?

1. హిరణ్య(బంగారు) దానము 2. అశ్వదానము 3. తిలదానము 4. ఆంబోతుదానము 5.దాసీదానం 6. శకటదానము 7. భూదానము 8. గృహదానము 9. కన్యాదానము 10. గోదానము.

### 821. వట్టిచేతులతో పోకూడనవి ఏవి ?

1. అగ్నిహోత్రము 2. స్వగృహము 3. పుణ్యక్షేత్రము 4. గర్భిణీస్త్రీ 5. ముసలివారు 6. బాలురు 7. రోగిష్ఠి 8. రాజు 9. దైవము10. గురువు.

### 822. పాపక్రియలు అనగా ఏవి ?

1. అస్తేయం (దొంగిలించడం) 2. పరహింస 3. పరస్త్రీ సంగమము 4. పరుషంగా మాట్లాడడం 5. అబద్ధాలాడడం 6. పైశున్యం 7. అసంబద్ధము లాడడం 8. పరద్రవ్య వాంఛ 9. ఇతరులకు కీడు తలపెట్టడం 10. మొడిపట్టుదల

### 823. నాడుల అధిష్ఠానదేవతలు ఎవరు ?

1. ఇడ-వామనాసికాగతనాడి-హరి; 2. పింగళ దక్షిణనాసికాగతనాడి – బ్రహ్మ; 3. సుషుమ్న-నాసికామధ్యగతనాడి-రుద్రుడు; 4. గాంధారి-దక్షిణ నేత్రగతనాడి-ఇంద్రుడు; 5. హస్తిజిహ్వ-వామనేత్రగతనాడి-వరుణుడు; 6. పూష-దక్షిణగతనాడి-ఈశ్వరుడు; 7. యశస్విని-వామకర్ణగతనాడి-బ్రహ్మ; 8. కుహునాడి-గుదేంద్రగతనాడి-పృధ్వి; 9.అలంబుష-మేంఢ్రగత నాడి- సూర్యుడు) 10. శంఖిని-నాభిగతనాడి-చంద్రుడు.

### 824. హిందూమత ప్రధానసూత్రములు ఏవి ?

1. అహింస (మనోవాక్కాయ కర్మలచే ఇతరులకు హాని కలిగించకుండుట) 2. సత్యము (మనోవాక్కాయ కర్మలచే ఒకేవిధముగా వర్తించుట)

### 825. దిక్పాలకులు ఎవరు?

1.తూర్పు-ఇంద్రుడు; 2. ఆగ్నేయము-అగ్ని; 3. దక్షిణము-యముడు; 4. నైరుతిమూల-నైరుతి; 5. పడమర-వరుణుడు; 6. వాయువ్యము-వాయువు; 7. ఉత్తరము-కుబేరుడు; 8. ఈశాన్యము-ఈశానుడు; 9. ఊర్ధ్వ దిక్కు-బ్రహ్మం 10. అధోదిక్కు-విష్ణువు.

MOHAN PUBLICATIONS.COM

### 826. దశదేవతా స్వరూపులు (దేవయోనులు) ఎవరు ?

1. విద్యాధరులు (జీమూతవాహనాదులు) 2. అప్సరసలు (ఊర్వశి మొ॥) 3. యక్షులు (కుబేరాదులు) 4.రాక్షసులు (విభీషణాదులు) 5. గంధ ర్వులు (హాహాహూహూ) 6. కిన్నరులు (తుంబురాదులు) 7. గుహ్యులు (మణిభద్రాదులు) 8. సిద్ధులు (విశావసాదులు) 9. భూతలు (బాలగ్రహా దులు) 10. నరులు (నరనారాయణాదులు)

### 827. ముఖ్యమైన జయంతులు ఏవి ?

1. మత్స్యజయంతి (చైత్రబహుళపంచమి) 2. కూర్మజయంతి (జ్యేష్ఠ బహుళ ద్వాదశి) 3. వరాహజయంతి (చైత్రబహుళత్రయోదశి) 4. నృసింహ జయంతి (వైశాఖశుద్ధ చతుర్దశి) 5. వామనజయంతి (భాద్రపదశుద్ధ ద్వాదశి) 6. పరశురామజయంతి (మార్గశిర బహుళ ద్వితీయ) 7. శ్రీరామజయంతి (చైత్రశుద్ధ నమవి జన్మనవమి) 8. బలరామజయంతి (వైశాఖశుద్ధ తృతీయ) శ్రీకృష్ణఃజయంతి-శ్రావణ బహాళఅష్టమి) 9. బౌద్ధ జయంతి (భాద్రపద శుద్ధషష్ఠి) 10. కల్కిజయంతి (భాద్రపద శుద్ధద్వితీయ)

### 828. ఔసధసేవన కాలములు ఏవి ?

1.నిర్భుక్తం (భోజనానికి ముందు) 2. ప్రాగ్భుక్తం (భుజించిన తరువాత కాలం) 3. అదోభక్తం (భోజనంకాగానే పుచ్చుకునేది) 4. మధ్యేభక్తం (సగం భోజనం అయినతరువాత) 5. అంతరాభక్తం (రెండుభోజనాలకు మధ్య పుచ్చుకునేది) 6.సభక్తం(భోజనంచేస్తూ పుచ్చుకొనేది)7. సాముద్గం (భోజనా నికి ముందు వెనుకా పుచ్చుకునేది) 8. గ్రానం (ముద్దతో కలిపి పుచ్చుకునేది) 9. ముహుర్ముహువు (భోజనంచేసినా, చెయ్యకపోయినా మాటిమాటికి ఔషధంపుచ్చుకోవడం) 10. గ్రాసాంతరం (ముద్దముద్దకుమధ్య పుచ్చుకునేది)

### 829. స్వరం సరిచేసే కషాయ ద్రవ్యాలు ఏవి ?

1. సుగంధి 2. చెరుకువేళ్ళు 3. యష్ఠిమధుకం 4. పిప్పళ్లు 5. ద్రాక్ష పండు6.నేలగుమ్మడు7.పెనువేప8.హంసపాది9.పెద్దములంక10. వాకుడు.

### 830. దురదలు పోగొట్టేవి ఏవి ?

చందనం, వట్టివేరు, రేల, కానుగు, వేప, కొడిశపాల, ఆవాలు, యష్ఠి మధుకం, మానుపసుపు, తుంగద్దలు.





### 831. శ్రీచక్ర దేవీ రూప క్షేత్రములు ఎక్కడున్నాయి ?

లలితాదేవి-ప్రయాగ; కామేశ్వరి-కాశీ; మంగళాంబ-లంక; భద్రసుం దరి-త్రికూటము; మహలక్ష్మి-కరవీరమందు; రమాదేవి-వినాయకమందు; పుష్టి-దేవదారువనమందు; మోదాదేవి-కాశ్మీరమందు; తుష్టి-యక్షేశ్వర మందు.

### 832. శివభక్త లక్షణములు ఏవి ?

శివపురాణ కథాశ్రవణము; శివనామ సంకీర్తనము; శివస్మరణము, శివపాదసేవనము; శివార్చనము; శివునకు నమస్కరించుట; శివుని సేవించుట, శివలీలానురాగము; శివని యందు శరణ్యము.

### 833. నవరసములు ఏవి ? వారి మూర్తులు ఎవరు ?

శృంగారరసము-గోపికలు, కుబ్జ; హాస్యరసము-గోపాలబాలకులు; కరుణ రసము-దశరథుడు; రౌద్రరసము-ఇంద్రుడు; వీరరసము-బీష్ముడు; భయానకరసము-కంసుడు; భీభత్సరసము-అఘానురుడు; అద్భుతరసము - యశోద, అర్జునుడు; శాంతరసము-అక్రూరుడు.

### 834. నవభక్తులు ఎవరు భక్తి లక్షణములు ఏవి ?

పరీక్షిత్తుడు-శ్రవణము; నారదుడు-కీర్తనము; ప్రహ్లోదుడు-స్మరణము; భార్గవి-పాదసేవ; పృధుడు-అర్చనము; అక్రూరుడు-వందనము; గరుత్మం తుడు-దాస్యము; ధనంజయుడు-సఖ్యము; బలిచక్రవర్తి-ఆత్మనివేదనము.

### 835. తారావాహన ఫలములు ఏవి ?

1.జన్మతార (మయూరము) మనస్తాపము; 2. సంపత్తార (హయము) ధనాదిలాభము; 3. విపత్తార (అజము) కలహము; 4. క్షేమతార-(గజము) రాజ్యలాభము; 5. ప్రత్యక్తార-(వాయసము) కార్యహాని; 6. సాధనతార(నక్క) సౌఖ్యము; 7. నైధనతార (సింహము) యుద్ధభయము 8. మిత్రతార(గరుత్మం తుడు) యుద్ధభయము 8. మిత్రతార (గరుత్మంతుడు) అధిక సౌఖ్యము. 9. పరమ మిత్రతార (హంస) యత్నభంగము.

### 836. నవ తారాశుభా శుభములు ఏవి ?

1. జన్మత్తార (అశుభప్రదము) 2. సంపత్తార (శుభప్రదము) 3. విపత్తార (అశుభప్రదము) 4. క్షేమతార (శుభప్రదము) 5. ప్రత్యక్తార (అశుభప్రదము) 6.సాధనతార (శుభప్రదము) 7.నైధనతార (అశుభప్రదము) 8.మిత్రతార (శుభప్రదము) 9. పరమమిత్రతార (శుభప్రదము).

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

1. జన్మతార–దేశనానము; 2. సంపత్తార–సంపద; 3. విపత్తార–దరిద్రము; 4. క్షేమతార–క్షేమము; 5. ప్రత్యక్తార–కార్యనాశనము; 6. సాధనతార– కార్యసాధనము; 7. నైధనతార–కార్యసాధనము; 8. మిత్రతార–మైత్రి; 9. పరమమైత్రితార–పరమమైత్రి.

### 837. నవగ్రహాచారములు ఏవి ?

1. సూర్యుడు–ఒక్క రాశిలో 1నెల; 2. చంద్రుడు–ఒక్క రాశిలో 2 1/2 దినములు; 3. కుజుడు–ఒక్కరాశిలో 1నెల, 15రోజులు; 4. బుధుడు–ఒక్కరాశిలో 1నెల; 5. గురుడు–ఒక్కరాశిలో 12నెలలు; 6. శుక్రుడు–ఒక్క రాశిలో1నెల; 7. శని–ఒక్కరాశిలో 30 నెలలు; 8. రాహువు–ఒక్కరాశిలో 18నెలలు; 9.కేతువు–ఒక్క రాశిలో 18 నెలలు (12 రాశులయందు సంచరించును.)

### 838. నవగ్రహ వాహనములు ఏవి ?

సూర్యుడు–7 గుఱ్ఱాలరథము; చంద్రుడు–10 గుర్రాల రథము; కుజుడు–పొట్టేలు; బుధుడు–సర్పము, నెమలి; గురుడు–హంస; శుక్రుడు–కప్ప; శని–గ్రద్ధ; రాహువు–సింహము; కేతువు–డేగ.

### 839. నవగ్రహ శాంతికుంభోర్పణములు ఏవి ?

రవి–(ఆదివారము–గోధుమపిండినెయ్యితో భోజనము) చంద్రుడు–సోమవారము–పెరుగు, పరవాన్నముతోభోజనము) కుజుడు–(మంగళ వారము– కందిపప్పుతో భోజనము) బుధుడు(బుధవారము – పెసరపప్పు, నల్లవులవలతో భోజనము) గురుడు (గురువారము–కొమ్ము శనగపప్పు, మినపప్పుపుతో భోజనము) శుక్రుడు (శుక్రవారము–బొబ్బర పప్పుతో భోజనము) శని(శనివారము చేనువ్వులు వేసిన కూరతో భోజనము) రాహువు (పూర్ణము, ఎండుకాయగూరలతో భోజనము) కేతువు (అమావాస్య–పచ్చి కాయగూరలతోభోజనము)

### 840. నవగ్రహముల సమిధులు ఏవి ?

సూర్యుడు–జిల్లేడు; చంద్రుడు – మోదుగ; అంగారకుడు–చంద్ర; బుధుడు – ఉత్తరేణు; బృహస్పతి–రావి; శుక్రుడు–అత్తి; శని–జమ్మి; రాహువు – దర్భ; కేతువు–గరికి.

### 841. నవగ్రహములు వలన కలుగు రోగములు ఏవి?

రవి–అగ్నిరోగము(జ్వరము); చంద్రుడు–పాండురోగం (కామెర్ల రోగము); కుజుడు–మశూచి, కురుపులు; బుధుడు–గుహ్యరగము, ఉదర





రోగము; గురుడు– శ్లేష్మరోగము, గుల్మరోగములు; శుక్రుడు–మేహరోగము; శని–సంధిరోగము; రాహువు–అపస్మారము, క్రిమిరోగము; కేతువు–విశూచి, దురదరోగము.

### 842. నవగ్రహ సంచారములు ఎక్కడ ఉంటాయి ?

రవి–ఆత్మ; చంద్రుడు–మనస్సు; కుజుడు–బలము; బుధుడు–వాక్కు; గురుడు–జ్ఞానము, శుక్రుడు–కామము; శని–దుఃఖము; రాహువు–కేతువు.

రవి–దేవపూజాగృహములు; చంద్రుడు–జలవాటికలు; కుజుడు–పాకశాలలు; బుధుడు–క్రీడాగృహము; గురుడు–బొక్కసపు గృహము; శుక్రుడు–శయన గృహము; శని–స్నాన, మూత్ర, విసర్జన, శాలలు; రాహువు, కేతువు.

### 843. నవగ్రహ అధిదేవతలు ఎవరు?

రవి–నారాయణుడు; చంద్రుడు–లక్ష్మి; కుజుడు–రుద్రుడు; బుధుడు–సరస్వతి; గురుడు–దక్షిణామూర్తి; శుక్రుడు–పార్వతి; శని–భైరవుడు; రాహువు – షణ్ముఖుడు; కేతువు–గణపతి.

### 844. నవగ్రహ ఆత్మాదికర్మఫలములు అనగా ఏవి ?

సూర్యుడు–ఆత్మజ్ఞానము; చంద్రుడు–మనోజ్ఞానము, కుజుడు–బలము; బుదధుడు–వాక్కు; గురుడు–జ్ఞానము; శుక్రుడు–కామము; శని–దుఃఖము, రాహువు–పీడ; కేతువు–వైరాగ్యం.

### 845. నవగ్రహ ఆధిపత్యములు ఎవరికి?

రవి–పితృదేవతలకు; చంద్రుడు–మనుష్యులకు; కుజుడు–పితృ దేవతలకు; బుధుడు–తిర్యగ్జంతువులకు, గురుడు–దేవతలకు; శుక్రుడు–మనుష్యలకు; శని–నరకాదివాసులకు; రాహువు–కేతువు.

### 846. నవగ్రహ జన్మనక్షత్రములు ఏవి?

రవి–విశాఖ; చంద్రుడు–కృత్తిక; కుజుడు–పూర్వాషాడ, బుధుడు–శ్రవణము; గురుడు–పుబ్బ; శుక్రుడు–పుష్యమి; శని–రేవతి; రాహువు–భరణి; కేతువు–ఆశ్లేష.

### 847. నవగ్రహజాతులు ఏవి?

రవి–క్షత్రియులు; చంద్రుడు–వైశ్యులు; కుజుడు–క్షత్రియులు; బుధుడు–వైశ్యులు; గురుడు–బ్రాహ్మణులు; శుక్రుడు–బ్రాహ్మణులు, శని–శూద్రులు; రాహువు–మ్లేచ్ఛులు; కేతువు–ఛండాలులురు.

MOHAN PUBLICATIONS.COM

**848. నవగ్రహ గోత్రములు ఏవి?**

సూర్యుడు – కాస్యప; చంద్రుడు – ఆత్రేయస; కుజుడు – భరద్వాజ; బుధుడు–ఆత్రేయస; బృహస్పతి – అంగీరస; శుక్రుడు – భార్గవ; శని–కాళ్యా నస; రాహువు–పైఠీనస; కేతువు–జైమినిసగోత్రము.

**849. నవగౌరీదేవతలు ఎవరు ? ఎక్కడ ఉన్నారు ?**

1ముఖ నిర్మికాగౌరి (హనుమాన్ ఘాట్) 2 జ్యేష్ఠాగౌరి (కర్ణిఘంటా మహత్) 3 సౌభాగ్యగౌరి (విశ్వేశ్వరాలయము) 4 శృంగారగౌరి (విశ్వేశ్వరాల యము) 5 విశాలాక్షిగౌరి (విశ్వేశ్వరాలయము) 6 లలితాగౌరి (లలితాఘాట్) 7 భవానీగౌరి (కాళికాగల్లీ) 8 మంగళగౌరి (విశ్వేశ్వరాలయము) 9 మహాలక్ష్మీ గౌరి (విశ్వేశ్వరాలయమ)

**850. అష్టార్ఘ్యములు ఏవి ?**

1 పెరుగు 2 తేనె 3 నెయ్యి 4 అక్షతలు 5 గటికలు 6 నువ్వులు 7 దర్భలు 8 పుష్పములు

**851. అమృతస్థానములు ఏవి ? వీటికి మించినవి లేవు?**

1. దేవతలకు–స్వర్గమందు; 2.చకోరములకు–చంద్రునియందు; 3. చాతకపక్షులకు–మేఘములందు;4.బ్రాహ్మణులకు–విద్యయందు; 5. రాజు లకు–యుద్ధమునందు; 6. కవులకు–వాక్కులందు; 7. భక్తులకు–భగవంతుని యందు; 8. రోగులకు–ఔషధమునందు; 9. స్త్రీలకు–అధరములందు.

**852. ఆయముల అధిష్ఠాన దేవతలు ఎవరు? వారి ఫలములు ఏవి**

1.ధ్వజాయము–ఇంద్రుడు; సకలసౌభాగ్యము, ధనలాభము, జయము. 2. ధూమాయము–అగ్ని; రోగభయము, శత్రువృద్ధి, మరణభీతి. 3. సింహా యము–యముడు; శరీరసౌఖ్యము, రోగనాశనము, శత్రుజయము. 4. శ్వానాయము–నైఋతి; రాజకలహము, ఫలహాని,అగ్నివాహము. 5. వృషభా యము–వరుణుడు; శుభము, పుత్రలాభము, నిత్యశుభకార్యకరణము. 6. ఖరాయము–వాయువు; పరదేశగమనము, నిత్యదరిద్రము, దుఃఖము. 7. గజాయము–కుబేరుడు; వృద్ధి,రత్నలాభము,శత్రువిజయము. 8.కాకాయము –ఈశ్వరుడు; దుఃఖము, బలరాహిత్యము, నిష్ప్రయోజనము (గృహపతికి కలిగించును.)

**853. అష్టవైష్ణవ స్వయంవ్యక్త క్షేత్రములు ఏవి ?**

1 శ్రీరంగము 2 శ్రీముష్ణము 3 తోతాద్రి 4 సాలగ్రామము 5 నైమిశము 6 బదరికాశ్రమము 7 కాంచక్షేత్రము 8 తిరుపతి.



**854. అష్టాంగ ధూపములు ఏవి ?**

1 గుగ్గిలము 2 వేపాకు 3 వస 4 చెంగల్వ 5 కోష్టు 6 కరక్కాకయ 7 యవలు 8 నెయ్యి.

**855. స్త్రీశక్తి గ్రహములు ఏవి ? వాటి బాధలు ఏవి ?**

1. నియోజిక (పురుషులందుచేరి పరదార, పరద్రవ్యములందు ఆశ, వికారము పుట్టించునది) 2. విరోధిని (బంధుమిత్రులందుచేరి పరస్పరము విరోధము పుట్టించునది) 3.స్వయంభార (ధాన్యముగల తావులందు, పశువు లుండు స్థలములందు, పితికిన పాలయందు, మూతలేని వస్తువులందుచేరి వాటి ఉపయోగము చెరచునది) 4.కరిభ్రామణి (పురుషులందుచేరి నిష్కారణ ముగ స్త్రీలయందు మోహము పుట్టించునది) 5. ఋతుహారిణి (స్త్రీలయందు చేరి రజస్సు హరించునది) 6. స్మృతిహారిణి (మనుష్యుల స్మృతి హరించి జ్ఞాపకశక్తి నశింప చేయునది) 7. బీజహారిణి (స్త్రీ పురుష శుక్లశోణికములు హరించి సంతానప్రాప్తి లేకుండ చేయునది.) 8. విద్వేషిణి ( భార్యాభర్తల యందు చేరి పరస్పరము విరోధము కలిగించునది)



**856. మైధునములు ఎన్ని రకములు ?**

1. స్మరణము–స్త్రీలను సదా తలచుట; 2. కీర్తనము – స్త్రీల వర్ణనతో పాటలు పాడుట; 3. కేళీ–స్త్రీలతో కలసి తిరుగుట; 4. ప్రేక్షణం–స్త్రీ సంబంధ మగు నృత్యములు తిలకించుట; 5. గుహ్యాభాషణము (స్త్రీలతో ఏకాంత మంతనములు జరుపుట) 6. సంకల్పము–స్త్రీని పొందవలయునని తల పోయుట; 7. అధ్యవసాయము – స్త్రీ తనపై మక్కువ చూపకపోయిననూ ఆమెను పొందవలయునని తలపోయుట; 8. క్రియానిర్మిత– కోరిన స్త్రీతో పరస్పరము కోరిక తీరవలయునని తలంచుట.

**857. మౌనముగా ఎక్కడ ఉండాలి ?**

1.మలమూత్రవిసర్జనవేళ 2. స్త్రీసంగమమువేళ 3.స్నానమపుడు 4. భోజనసమయము 5. దంతదావనము 6. యజ్ఞము 7. హోమం 8.జపము.

**858. భక్తి లక్షణములు ఏవి ?**

1. భగవద్భక్తులందు ప్రేమ 2. భగవద్భక్తుని చూచి సంతోషించుట 3. భగవంతుని పూజించుట 4. నిరాడంబరమగుపూజ 5. భగవత్కథలు వినుట 6. దేహపులకాంకితము 7. భగవత్స్మరణము 8. భగవద్వియోగము సహింపరు.

**859. అష్టవిధ భైరవులు ఎవరు ?**

ఋరుభైరవుడు, ఛండభైరవుడు, కొండభైరవుడు, ఉన్మత్తభైరవుడు, కపాల భైరవుడు, భీషణభైరవుడు, కాలభైరవుడు, ఆనందభైరవడు.

**860 . అష్టవిధ వివాహములు ఏవి ?**

1 బ్రాహ్మము 2 పైశాచికము 3 ప్రాజాపత్యము 4 దైవము 5 గాంధర్వము 6 రాక్షసము 7 స్వయంవరము 8 అంగుళ్యము.

**861. అష్టవర్గారూఢ వాస్తుగృహాధిపతులు ఎవరు ?**

1 అవర్గము–తూర్పుదిశ–గరుత్మండుడధిపతి; 2. కవర్గము–ఆగ్నేయ దిశ–మార్జాలము; 3. చవర్గము–దక్షిణము–సింహము; 4. టవర్గము–నైఋతి దశ–శునకము; 5.తవర్గము–పశ్చిమదిశ–సర్పము; 6. పవర్గము–వాయువ్యదిశ–ఎలుక; 7. యవర్గము–ఉత్తరదిశ–ఏనుగు; 8. శవర్గము–ఈశాన్యదిశ– కుందేలధిపతి.

**862. మానవుడు సుఖపడటానికి అష్టభోగములు ఏవి?**

1 సంపద 2 మంచి వస్త్రములు 3 ఆభరణములు 4 భోజనసౌఖ్యము 5 తాంబూలసౌఖ్యములు 6 శయ్య(పాన్పు) సౌఖ్యము 7 సంభోగసౌఖ్యములు 8 పుష్పచందనపరిమళద్రవ్యాది సుగంధ ద్రవ్యానుభవసౌఖ్యములు.

**863. యజ్ఞమునకు కావలసిన సమిధులు ఏవి?**

రావి, మేడి,జువ్వి, మర్రిసమిధలు,నువ్వులు,ఆవాలు,పాయసము, నేయి

**864. అష్ట గురువులు ఎవరు ?**

1 అక్షరాభ్యాసముచేసినవారు 2 గాయత్రిని ఉపదేశించినవారు 3 వేదాధ్యయనము చేయించినవారు 4 శాస్త్రాభ్యాసము చేయించినవారు 5 పురాణేతిహాసములు తెలియజేసినవారు 6 మతబోధచేసినవారు 7 మహేంద్ర జాలాది విద్యలు నేర్పిన వారు 8 మోక్ష సాక్షాత్కరము తెలియజేసినవారు.

బోధకాచార్యులు, చోదకాచార్యులు, కారణాచార్యులు, నిషిద్ధకర్మ బోధకా చార్యులు, ఉపాధ్యాయుడు, కామ్యగురువులు, కర్మగురువులు, కర్మగురు వులు లేక పురోహితులు, సమయ గురువులు.

**865. అర్చన విగ్రహములు ఎన్ని రకములు ?**

1 శైలి (శిలావిగ్రహములు) 2 దారుమయీ (కర్రవిగ్రహములు) 3 లౌహి (లోహవిగ్రహములు) 4 లేఖ్య (లిఖింపబడినవి) 5 లేప్య (లేపనము

203



రంగులతో చేయబడినవి) 6 సైకతి (ఇసుకతో చేయబడినవి) 7 మనోమయి (మృణ్మయి–మట్టితోచేయబడినవి) 8 మణిమయి (మణులతో చేయబడినవి)

**866. వ్యర్థమైనవారు ఎవరు ?**

1 సోమరి 2 తిండిపోతు 3 లోకద్వేషి 4 మాయావి 5 క్రూరుడు 6 దేశకాల జ్ఞానరహితుడు 7 పాడువేషము గలవాడు.

1 శీలములేని ఆడుది 2 కన్నులులేని ప్రాణి 3 కర్మహీనుడగు విప్రుడు 4 ఆవులేనిఇల్లు 5 శాంతంలేనిచదువు 6 నీళ్లులేనియేరు 7పురుషుడులేనిస్త్రీ.

**867. పరబ్రహ్మ స్వరూప మహావాక్యములు అనగా ఏవి ?**

ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మోస్మి, తత్వమసిబ్రహ్మ, అయమాత్మ బ్రహ్మ సర్వం ఖల్విదంబ్రహ్మ, మాయోపాదికబ్రహ్మ, మాయరహిత బ్రహ్మ.

**868. నక్షత్ర దగ్ధయోగములు ఏవి ?**

భరణి–ఆదివారం; చిత్త–సోమవారం; ఉత్తరాషాఢ–మంగళవారం; ధనిష్ట–బుధవారము; ఉత్తరఫల్గుణి–గురువారం; జ్యేష్ఠ–శుక్రవారం; రేవతి–శనివారము.

**869. తిథి దగ్ధయోగములు ఏవి ?**

ఏకాదశి– సోమవారము; ద్వాదశి–శనివారము;; షష్ఠి గురువారము; తదియ–బుధవారము; అష్టమి–శుక్రవారము; నవమి–ఆదివారము; పంచమి– మంగళవారము.

**870. సప్తదేహ పాపకార్యములు ఏవి ? పుణ్యకార్యములు ఏవి ?**

మనస్సు–పరులకు కీడుదలచుట, నోరు–పరువాక్యములుపలుకుట, చేతుల–పరధనముఅపహరించుట, కాళ్ళు–శ్రమనెంచనివారివద్దకు తిరుగుట, చెవులు–పొంచివినుట, దేహము–పరస్త్రీల నాలింగనము చేసుకొనుట. స్త్రీ రజోదర్శనము గాంచుట.

మనస్సు–దేవునియందు భక్తి గలుగుట, నోరు – దేవుని నామము స్మరించుట, చేతులు–దేవునిపూజించుట, కాళ్ళు–దేవాలయమునకు పోవుట, కన్నులు– దేవుని కన్నులార గాంచుట, చెవులు – దేవుని కథలు వినుట, శిరము – దేవునికి వందనముచేయుట.

**871. సప్తద్వీప ప్రశస్త క్షేత్రములు ఏవి ?**

1 పుష్కరద్వీపము–బ్రహ్మదేవాలయము–పెద్ద మఱ్ఱిచెట్టు సుప్రసిద్ధము. 2 శాకద్వీపము–శేషశాయియగు విష్ణ్వాలయము–టేకు మ్రానుచెట్టు 3.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

క్రౌంచ ద్వీపము-శివాలయము-మానససరోవరము. 4. కుశద్వీపము-మందరగిరాల యము-దర్భలు 5. శాల్మలద్వీపము-ద్రోణపర్వత సంజీవ అలయము-బూరుగు వృక్షము 6. ప్లక్షద్వీపము-విపాశానదీతీర విరూపాక్ష దేవాలయము - జమ్మిచెట్టు 7. జంబూద్వీపము - విష్ణ్వాలయము - నేరేడు చెట్టు ప్రసిద్ధము.

### 872. ఆయుక్షీణత కలిగించేవి ఏవి ?

1. పాసిపోయిన మాంసం 2. వృద్ధస్త్రీ సంగమం 3. బాలార్కసేవ 4. లేవడిపెరుగు 5. ప్రాతఃకాల మైధునం 6. ప్రాతఃకాల నిద్ర.

### 873. ముక్తుల ఫలములు ఏవి ?

1 సాష్టిముక్తి (షడైశ్వర్యములు అనుభవించుట) 2 సాలోక్యముక్తి (వైకుంఠ లోకమునవశించుట) 3 సారూప్యముక్తి (శ్రీమన్నారాయణ రూప దర్శనము) 4 సామీప్యముక్తి (దైవసన్నిధినివశించుట) 5 సాయుజ్యముక్తి (దైవముతో సమానత్వముబొందుట) 6 లీనతముక్తి (దైవమందులీనమగుట)

### 874. మానవులు చెడిపోవుదురు ?

1. మంచముపై పడక 2. తెల్లని వస్త్రములు 3. స్త్రీ సంగమము 4. చపలత్వము 5. పగటినిద్ర 6. తరచు తిరుగచుండుట.

### 875. షడ్విధ భక్తులు ఎవరు ?

1 శైవులు (శివుని అర్చించేవారు) 2 వైష్ణవులు (విష్ణువు అర్చించేవారు) 3 సిరులు (సూర్యుని అర్చించేవారు) 4 శాక్తేయులు (శక్తినిఅర్చించేవారు) 5గణాపత్యులు(గణపతినిఅర్చించేవారు)6కాపాలికులు(తపమాచరించువారు)

### 876. తంత్ర మంత్ర ప్రయోగములు ఏవి ?

1. వశ్యము (తనకు స్వాధీనముగా చేసుకొనుట) 2. మారణము (తానొకరి చావుక జపమొనర్చుట) 3. స్తంభనము (కదలమెలలేకుండుటకై జపమొనర్చుట) 4. సంమోహణము (మోహించుటకై జపమొనర్చుట) 5. ఉచ్చా టనము (పిశాచాదుల వెడలగొట్టుటకై జపించుట) 6. ఆకర్షణము (పిశాచా దులు వచ్చునట్లు జపించుట)

### 877. చేయరాని పనులు ఏవి ?

1. జూదము - నలచక్రవర్తి దుఃఖపడెను; 2. పరస్త్రీ వ్యామోహనము-రావణుడు నశించెను; 3. పగచేత-సుగ్రీవునిచే వాలి మృతి చెందెను. 4.



వంచనచేత - ఇల్వలుడు రూపుమాసెను. 5. పరద్రవ్యాశచేత-దుర్యోధనుడు కీడునొందెను. 6. అహంకారముచేత - హిరణ్యకశిపుడు నశించెను.

### 878. కీర్తి (కాంక్ష) కార్యములు ఏవి ?

1. పితృవాక్యపరిపాలన-శ్రీరాముడు కీర్తి పొందెను. 2. మాతృవాక్య పరిపాలన-(గరుడుడు యోగముపొందెను) 3. సత్యవ్రతము-(హరిశ్చం ద్రుడు ఖ్యాతిగాంచెను.) 4. దానము- (బలిచక్రవర్తి ఘనతకెక్కెను.) 5. ఓర్పుచేత-(ధర్మ రాజు పూజ్యత పొందెను). 6. పెద్దలు తలపెట్టినకార్యము నెరవేర్చుటచేత- (భగీరథుడుడు ఖ్యాతి నొందెను.)

### 879. బ్రాహ్మణులు చేయవలసినవి ఏవి ?

1. యజన -యజ్ఞములు చేయుట; 2. యాజన-యజ్ఞములు చేయించుట; 3. అధ్యయన-వేదశాస్త్రములు చదువుట 4. అధ్యాపన (వేదములు పరులకు నేర్పుట) 5. దాన-ఇతరులకు దానధర్మములు చేయుట. 6. ప్రతి గ్రహణములు - ఇతరులనుండి దానములను స్వీకరించుట.

### 880. షట్చక్రాధిదళ దేవతలు, దేవరలు ఎవరు ?

1. మూలాధారము-గణపతి 2. స్వాధిష్ఠానము-బ్రహ్మ 3.మణిపూరకము-విష్ణువు 4. అనాహతము-రుద్రుడు 5. విశుద్ధము-ఈశ్వరుడు 6. అజ్ఞా చక్రము-సదాశివుడు.

1. గణపతి-వల్లభ 2. బ్రహ్మ-సరస్వతి 3. విష్ణువు-లక్ష్మి, 4. రుద్రుడు- పార్వతి 5. ఈశ్వరుడు-ఉన్మని 6. సదాశివుడు-మనోన్మని.

### 881. పంచాయతన దేవతాశిలలు అనగా నేమి ?

1. ఆదిత్యుడు-సూర్యకాంతశిల 2. అంబిక-స్వర్ణవిమలశిల 3. విష్ణువు - గండకీనది సాలగ్రామశిల 4. గణపతి-శోణభద్రనదీశిల 5. రుద్రుడు - నర్మదానది యందలి బాణలింగశిల.

### 882. పంచ సూక్తములు అనగా ఏవి ?

1 శ్రీసూక్తము 2 పురుషసూక్తము 3 భూసూక్తము 4 నీలా సూక్తము 5. నీలాసూక్తము 6. మన్యుసూక్తము.

1. పురుషసూక్తము 2. దేవీసూక్తము 3. సూర్యసూక్తము 4. పర్జన్య సూక్తము 5. శ్రీసూక్తము



MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

**883. సూతకములు అనగా ఏమి ?**

1. జన్మసూతకము 2. మృతసూతకము 3. రజఃసూతకము 4. అంటు (రోగ) సూతకము 5. శదర్శన సూతకము.

**884. శివతాండవ సభాస్థలములు ఎక్కడ ఉన్నాయి ?**

1. కనకసభ (చిదంబరము) 2. రజితసభ (మధుర) 3. తామ్రసభ (తిరునల్వేలి) 4. చిత్రసభ (మలయపర్వతము) 5.రత్నసభ (తిరువాలంగారు)

**885. పంచశక్తులు అనగా ఎవరు ? అధిదేవతలు ఎవరు ? కార్యములు ఏమిటి ?**

1. ఇచ్ఛాశక్తి 2. జ్ఞానశక్తి 3. క్రియాశక్తి 4. ఆదిశక్తి 5. పరాశక్తి.

1. ఇచ్ఛాశక్తి–ఉత్పత్తికి కారణము 2. జ్ఞానశక్తి–స్థితికి కారణము 3. క్రియాశక్తి–లయకారము4.ఆదిశక్తి–తిరోదానము5.పరాశక్తి–అనుగ్రకృత్యము

1. ఇచ్ఛాశక్తి–బ్రహ్మ 2. జ్ఞానశక్తి – విష్ణువు 3. క్రియాశక్తి–రుద్రుడు 4. ఆదిశక్తి–తిరోదానము 5. పరాశక్తి–అనుగ్రహ కృత్యములు.

**886. శిల్పులు అనగా ఎవరు ?**

1. మనువు (కమ్మరము పనులుచేయవాడు) 2. యు (వడ్రంగి పనులు చేయువాడు) 3. దైవజ్ఞుడు (వెండి, బంగారు పనులుచేయువాడు) 4. త్వష్ట (కంచరపు పనులు చేయువాడు) 5. శిల్పి (రాతిపనులు చేయువాడు)

**887. మాతృదేవతలు అనగా ఎవరు ?**

1 తనుగన్నతల్లి 2 భార్యనుగన్నతల్లి 3 అన్నభార్య 4 గురుభార్య 5 రాజుభార్య.

**888. పూజాంగములు ఏవి ?**

1. అభిగమనము (భగవంతుని స్మరించుచు ఆలయమునకు వెడలుట) 2. ఉపాదానము (పూజాద్రవ్యములు సంపాదించుట) 3. ఇజ్య (ధూప,దీప, నైవేద్యములతో ఆరాధించుట) 4.స్వాధ్యాయము (మంత్రపఠనముతో స్తుతించుట) 5. యోగము (తదేక నిష్ఠతో ధ్యానించుట)

**889. పంచలింగక్షేత్రములు ఏవి ?**

1. జలలింగము (జంబూకేశ్వరం) 2. అగ్నిలింగము (అరుణాచలము) 3. ఆకాశలింగము (చిదంబరము) 4. పృథ్వీలింగము (తిరువాయూరు) 5. వాయు లింగము (కాళహస్తిలో)





**890. పంచ వటవృక్షములు ఏవి ?**

1. బిల్వము (మారేడు) 2. వటము (మఱ్ఱి) 3. అశ్వత్థము (రావి) 4. ధాత్రి (ఉసిరిక) 5. మేడి (అత్తి)

**891. పంచమహాపాతకములు అనగా ఏవి ?**

1. స్త్రీహత్య 2. శిశుహత్య 3. గోహత్య 4. బ్రహ్మహత్య 5. గురుహత్య.

**892. మహాయజ్ఞములు అనగా ఏమిటి ?**

1. దేవయజ్ఞము– హోమము 2. బ్రహ్మయజ్ఞము–వేదాధ్యయనము 3. భూతయజ్ఞము – కాకబలి 4. పితృయజ్ఞము–పిండతర్పణ క్రియ 5. మనుష్య యజ్ఞము – అతిథిపూజ

**893. దేవాలయ విగ్రహములు ఎన్ని రకములు ?**

1. ధృవబేరము (మూలవిరాట్టు) 2. కౌతుకబేరము 3. బలిబేరము 4. స్వపనబేరము 5. ఉత్సవబేరము.

**894. పంచద్వారకలు గురించి చెప్పండి ?**

1. గోమతిద్వారక 2. భేటీద్వారక 3. కాకడీద్వారక 4. శ్రీనాధద్వారక 5. మోక్షద్వారక

**895. పంచ గవ్యములు అనగా ఏవి ?**

1. గోమూత్రము (ఆవుపంచితము) 2. గోమయము (ఆవుపేడ) 3. గోక్షీరము (ఆవుపాలు) 4. గోదధి (ఆవుపెరుగు) 5 గోఘృతము (ఆవునెయ్యి)

**896. నోటివలన పాపకార్యములు ఏవి ?**

1. పౌరుష్యము (పరుషంగా మాట్లాడడం) 2. పైశున్యము (కొండెములు చెప్పుట) 3.అనృతు(అబద్ధాలాడడం) 4. అసంబద్ధ ప్రలాపము (వ్యర్థప్రసంగము)

**897. వేదస్వరములు ఎలా పలకాలి ?**

1. ఉదాత్తము (పైకెత్తి పలుకునది) 2. అనుదాత్తము (దిగువుగా పలుకునది) 3. స్వరితము (దీర్ఘముగా పలుకు స్వరము) 4. ప్రచయము (సమముగా పలుకునది)

**898. యుగావతారములు ఏవి ?**

1. కృతయుగమున శుక్లవర్ణ–హరి అవతారము 2. త్రేతాయుగమున –రక్తవర్ణ–హయగ్రీవావతారము 3. ద్వాపరయుగమున – కృష్ణవర్ణ – శ్యామా వతారము 4. కలియుగమున – పీతవర్ణ–కృష్ణావతారము.

MOHAN PUBLICATIONS.COM

**899. వనములు ఎన్ని రకములు ఏవి ?**

1. ఉద్యానవనం (కాముకులు విహరించేది) 2. మహావనం (క్రూర మృగాలతో నిండివుండిన అరణ్యం) 3. ఉపవనం ఫలపుష్పాదులుగల మామిడి పనస అరటి మొ॥గు తోటలు) 4. ప్రమదావనం (రాణులు, వారి చెలికత్తెలు విహరించేది)

**900. మానవునకు ప్రధానములు ఏవి ?**

1. సన్యాసులకు-ఇంద్రియ నిగ్రహము 2. వానప్రస్థులకు-నియమ పాలన 3. గృహస్థులకు - దానము 4. బ్రహ్మచారులకు - గురు శుశ్రూష.

**901. మనిషికి ప్రాణాపాయ సమములు ఏవి ?**

1 దుష్టురాలైన భార్య 2. మోసకారియైన మిత్రుడు 3. అహంకారి యగు సేవకుడు 4. పాము తిరుగు యిల్లు.

**902. నావన కార్యములు ఏవి ?**

1. దాసీస్త్రీలతో పొందు-మర్యాదను; 2. వేశ్యాసంపర్కము -ధనమును; 3. విధవాస్త్రీతోకూటమి-ఆయుష్యును; 4.పరస్త్రీతో సంబంధము - సర్వసంప దలను నశింపజేయును.

**903. హిందూ సంప్రదాయప్రకారము దానములు ఎన్ని ?**

1.అన్నదానము 2.జ్ఞానదానము 3.ఔషధదానము 4. అభయదానము
1. కన్యాదానము 2. గోదానము 3. భూదానము 4. విద్యాదానము.

**904. మేరుపర్వతమున దివ్య వనములు ఏవి ?**

1. నందనవనము (ఉత్తరము) 2. చైత్రరథము (తూర్పు) 3. గంధ మాదనము (దక్షిణము) 4. వైభ్రాజనం (పశ్చిమము)

**905. దుర్గములు ఏవి ?**

1. గిరిదుర్గము 2. వనదుర్గము 3. స్థలదుర్గము 4. జలదుర్గము

**906. మానవునకు దుర్లభములు ఏవి ?**

1. ప్రియవచనములతోడి దానము 2. గర్వరహితమైన జ్ఞానము
3. క్షమాసహితమైన శౌర్యము 4. త్యాగయుక్తమైన విత్తము

**907. దైవోపాసకులు ఎవరు ?**

1. ద్విజాతులు (అగ్నిహోత్రునర్చించు వారు) 2. మౌనులు (మునులు పరమేశ్వరుని హృదయముగా ఆరాధించువారు) 3. అల్పబుద్ధులు (విగ్రహారా ధకులు) 4. విదితాత్ములు (సర్వము పరమేశ్వరుడన యారాధించువారు)





**908. ద్వారబంధములు ఏవి ?**

1. హరిద్వారబంధము (పరధనాపేక్ష, దురహంకారము లేకుండుట) 2. ఉపస్థద్వారబంధము (పరస్త్రీ వాంఛ లేకుండుట) 3. ఉదారద్వారబంధము (లభించునంతవరకు తృప్తిచెందుట) 4. వాక్ ద్వారబంధము (పరుష)వాక్య ములు పలుకకుండుట)

**909. చతుర్విధ కర్మలు ఏవి ?**

1. కామ్యములు (పుత్రకామేష్టి చిత్రాయోగము) 2. నిష్కామ్యములు (కోరికలేని కర్మలు) 3. నిత్యకర్మలు (సంధ్యావందన-అగ్నిహోత్రాదులు) 4. నైమిత్తికర్మలు (గ్రహణ స్నానాది స్మార్తక కర్మలు)

1. కృచ్ఛ్రము (దానములుచేయుట) 2. చాంద్రాయణము (తీర్థ యాత్రలుచేయుట) 3. నిత్యకర్మానుష్ఠానము (అనుదినార్హ నిత్యకర్మ లొనర్చుట) 4. నైమిత్తిక కర్మానుష్ఠానము (ఆయా పర్వదినముల కర్హములగు కర్మలొనర్చుట)

**910. గృహస్థ శత్రువులు ఎవరు ?**

1. అప్పుచేసిన తండ్రి 2. వ్యభిచారిణియైన తల్లి 3. రూపవతియగు భార్య 4. చదువుకొనని కొడుకు (మూర్ఖుడు)

**911. గృహస్తునకు అమృతోప సమానములు ఏవి ?**

1. గుణవతియైన గృహిణి 2. పిల్లల ముద్దుమాటలు 3.రాజసభా సన్మానము 4. మితమైన భోజనము

**912. స్త్రీల అలంకారములు ఏవి ?**

1. కేశాలంకారము 2. శరీరాలంకారము 3. భూషణాలంకారము 4. లేపనాలంకారము

**913. నిలకడలేనిది ఏది ?**

1. వెలయాంద్రకు - అభిమానము 2. సంపదలకు-స్థిరత్వము 3. మూర్ఖులకు-వివేకము 4. కర్మలకు వినాశనము ( ఉండవు )

**914. అంతరిక్ష జలములు అనగా ఏమి ?**

1. దారం (వాననీరు) 2. కారం (వడగళ్ళనీరు) 3. తౌషారం (మంచు నీరు) 4. హైమం (సూర్యోదయానికి పూర్వంపడే పొగమంచునీరు)

**915. అంతఃకరణ అధిదేవతలు ఎవరు? ప్రవృత్తులు ఏమిటి ?**

1 మనస్సు-చంద్రుడు, 2 బుద్ధి-బ్రహ్మ 3. చిత్తము-వాసుదేవుడు 4. అహంకారము-రుద్రుడు.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

1 మనస్సు-సంకల్పము 2. బుద్ధి-జ్ఞానము (నిశ్చయము) 3. చిత్తము-చింతనము 4. అహంకారం-అహం -(అభిమానము)

**916. శరీరానికి సంబంధించే అగ్నులు ఏవి ?**

1.కామాగ్ని(తృష్ణ) 2. క్రోధాగ్ని(కోపము) 3. క్షుధాగ్ని (ఆకలిబాధ) 4. జఠరాగ్ని (పైత్య ప్రకోపమున కలిగేది)

**917. ఆశ్రమములు అనగా ఏవి ?**

1. బ్రహ్మచర్యము 2. గార్హస్థ్యము 3. వానప్రస్థము 4. సన్యాసము
1.పర్ణశాల 2.మఠము 3. పాఠశాల 4.సేవాశ్రమము (శరణాలయము)

**918. చతుర్వర్ణ దేవతలు ఎవరు ? శక్తులు ఎవరు ?**

1. బ్రాహ్మణులకధిదేవుడు - శివుడు 2. క్షత్రియులకు-విష్ణువు 3. వైశ్యులకు-లక్ష్మి 4. శూద్రులకు - గణపతి.

**919. పుండ్రములు (బొట్లు) ఎవరు పెడతారు ?**

1. బ్రాహ్మణులకు - ఊర్ధ్వపుండ్రము 2. క్షత్రియులకు - త్రిపుండ్రము 3. వైశ్యులకు - అర్ధచంద్రాకృతి పుండ్రము 4. శూద్రులకు - (బిందువాకృతి) వర్తులాకార పుండ్రము.

**920. స్త్రీ పోషితులు ?**

1.తండ్రి-బాల్యము2.భర్త-యౌవనమందు3.పుత్రులు-వృద్ధాప్యమందు

**921. అంబలు ఎవరు ? ఎక్కడున్నారు?**

1. జ్ఞానప్రసూనాంబ (శ్రీకాళహస్తి) 2. భ్రమరాంబ (శ్రీశైలం) 3. ముక్తాంబ (ముండేశ్వర శివక్షేత్రము)

**922. అక్షిణులు ఎవరు ఎక్కడ ఉన్నారు ?**

1. కంచికామాక్షి 2. మధురమీనాక్షి 3. కాశీవిశాలాక్షి

**923. సమాధులు ఎన్నిరకములు ?**

1. జీవాత్మ-సవికల్పసమాధి 2. అంతరాత్మ-నిర్వికల్పసమాధి 3. పరమాత్మ-నిర్బీజ సమాధి

**924. పూజా సమయములు ఏమిటి ?**

1. పూర్వాహ్ణం (దేవతలని) 2. మధ్యాహ్నం (మనుష్యులను) 3. అపరాహ్ణం (పితరులని పూజించాలి)



**925. దేవతాలక్షణములు ఏమిటి ?**

1 రెప్పపాటు లేకుండుట 2. భూమిమీద పాదము సోకకుండుట 3. వ్యసనము లేకుండుట.

**926. దేహధర్మములు ఏమిటి ?**

1. ప్రాణధర్మములు (ఆకలి, దప్పి) 2. మనోధర్మములు(శోకము, మోహము) 3. దేహధర్మములు (జన్మము, మరణము)

**927. స్నానములు ఏవి ? ఎన్నిరకములు ?**

1. బాహ్యస్నానము (బాహ్యశుద్ధి) 2. మానసికస్నానము (ఆత్మశుద్ధి)

**928. అమృతములు ఏవి ? ఎన్ని రకములు ?**

1. దేవామృతము (దేవలోకమందుండునది, జరామరణములు లేక సుఖింపజేయునది) 2. పంచామృతము-(పూజయందుంచబడునది, ఆరోగ్యము కలిగించునది)

**929. దేవతలు ఎవరు ? ఎన్ని రకములు ?**

రెండురకములు 1 దేవతలు (బ్రహ్మ,విష్ణు, మహేశ్వరులు) 2. దేవయోనులు (యక్ష, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుష, అప్సరస, రాక్షస, పిశాచ, గుహ్య, విద్యాధరులు)

**930. మంచి వీధిపోట్లు ఏవి ?**

1. ఈశాన్యపు వీధిపోటు 2. దక్షిణ ఆగ్నేయవీధిపోటు 3. పడమర వాయువ్యపు వీధిపోటు 4. తూర్పువీధిపోటు 5. తూర్పు ఈశాన్యపువీధిపోటు 6. ఉత్తరవీధిపోటు 7. ఉత్తర ఈశాన్యవీధిపోటు 8. దక్షిణవీధిపోటు 9. పడమర వీధిపోటు.

**931. చెడుచేసేవీధిపోట్లు ఏవి ?**

1. నైరుతివీధిపోటు 2. దక్షిణ నైఋతి వీధిపోటు 3. పడమర నైఋతి వీధిపోటు 4. ఆగ్నేయపు వీధిపోటు 5. తూర్పు ఆగ్నేయపు వీధిపోటు 6. వాయువ్యపు వీధిపోటు 7.ఉత్తర వాయువ్యపు వీధిపోటు. ముందుగా మంచి ఫలితాలను ఇచ్చే వీధిపోట్లను గురించి తెలుసుకుందాం.

**932. ఈశాన్యపు వీధిపోటు ఫలితాలు ఏమిటి ?**

1. బంధుమిత్రులు, ఆప్తులు ఎక్కువగా ఉంటారు. 2. ఆర్థికంగాను, పేరు ప్రతిష్ఠలలోను గొప్పగా వుంటారు. 3. స్త్రీ,పురుషులు సుఖ సంతో



MOHAN PUBLICATIONS.COM

షాలతోఉంటారు. 4. వస్తు, వాహనయోగం వుంటుంది. 5. పిల్లలు బాగా వృద్ధిలోకి వస్తారు. 6. రాజకీయాలు కలిసి వస్తాయి. 7. పూర్ణమైన ఆయుష్షు మంచి ఆరోగ్యం కలిగివుంటారు. 8. చీకూ, చింతలేని జీవితం గడుపుతారు. ఈశాన్యం వీధిపోటు వున్నప్పుడు లేదా ఈశాన్య మూలస్థలమందు ఇల్లు వున్నప్పుడు, ఒక్క తూర్పులోనే కాకుండా, ఉత్తరం వైపు కూడా గేటు వుండి తీరాలి. అలాగే ఇంటిలో ఈశాన్యం గదికి తూర్పు మరియు ఉత్తరాలలో తప్పనిసరిగా ద్వారాలు ఉండాలి.

### 933. తూర్పు ఈశాన్య వీధిపోటు-ఫలితాలు ఏమిటి ?

1 డబ్బు పట్లజాగ్రత్త అధికంగా వుంటుంది. 2. ఉద్యోగాలలో మంచి పేరు వస్తుంది. సంపాదన వుంటుంది. 3.స్త్రీలు కీర్తి కలిగి వుంటారు. 4. ఆరోగ్యంబావుంటుంది. 5. మగవారు విలాసవంతులుగా, భోగలాలసులుగా, సుఖ సంతోషాలు కలిగివుంటారు. 6. స్త్రీ సంతానం తక్కువగా వుంటుంది. 7. పిల్లలు బాగా చదువుకొని వృద్ధిలోకివస్తారు. 8. బంధుమిత్రుల రాకతో ఇల్లు కళకళలాడుతుంది. 9. ఉద్యోగరీత్యా మగపిల్లలు దూరప్రాంతాలకు (ఇతరరాష్ట్రాలకుగానీ లేదా దేశాలకుగాని) వెళతారు.

### 934. సాలగ్రామ అర్చనా ఫలము ఏమిటి ?

శ్రీ భవిష్యోత్తర పురాణమునందలి గండకీ శిలా మహాత్మ్యములో సాలగ్రామ శిలపగిలిననూ, గట్టిగా వుండిననూ, విరిగిపోయిన ముక్కఅయిననూ, అగ్నియందు కాలిననూ ఏ దోషమునూలేదు. ఆ సాలగ్రామమును పూజింప వచ్చును. సాలగ్రామ శిలను అర్చించువారికి మంత్రము తెలియకపోయిననూ, పూజించు విధానము తెలియక పోయిననూ, పుణ్యతీర్థములయందు స్నానములు చేయకపోయిననూ, మనసున ధ్యానించుట చేతకాకపోయిననూ,స్తుతి, పదునాఱు ఉపచారములు చేయుట తెలియకున్ననూ, సాలగ్రామమునందు సదా సన్నితుడైన శ్రీహరి (కేవలము నమస్కరించినంత మాత్రముననే) ప్రసన్నుడగును. సాలగ్రామశిలను పూజించినందువలన బ్రహ్మహత్య మున్నగు పాపము లునూ, మనసు, మాట, శరీరములచేత చేసిన పాపములునూ అవి అన్నియునూ వెనువెంటనే నశించిపోవును.

### 935. తీర్థము అనగానేమి ?

పురుష సూక్తము మొదలైన (పంచసూక్త) మంత్రములతో శ్రీ విష్ణు స్వరూపమగు సాలగ్రామ శిలకు స్నానము చేయించిన జలమునూ; అర్ఘ్య





పాద్య ఆచమనములు భగవానునకు పూజచేయు వేళ సమర్పించి తరువాత ఆ జలమును పతత్ గ్రహపాత్ర యందువుంచి, స్నపనము చేసిన జలము కూడా కలిపి (తులసీదళ సహితమై, పవిత్రమునూ, పాపహరమునూ అగు నీరము తీర్థము అనబడును.) ఈ తీర్థమును అర్చనఅయిన వెంటనే, మును ముందుగా అర్చకస్వామి తీసికొని తరువాత, తన్మయులైన వారికినీ, సన్యసించినవారికినీ, అధ్యాపకులకూ, యజమానులగు ధర్మకర్తలకునూ, తక్కిన భక్తులకునూ, వరుసగా యివ్వవలయును.

### 936. తీర్థమును ఏ మంత్రముతో ఎన్నిమారులు తీసికొనవలెను?

ఉత్తరీయమును మగవారునూ, పైట చెరగును ఆడవారునూ రెండు మడతలువేసి, అనగా నాలుగు పొరలు వచ్చునట్లుగా మడచి ఎడమచేతి యందు పెట్టుకొని, కుడిచేతిని ఆ గుడ్డ మడతపై పెట్టి, చూపుడు వ్రేలును క్రిందికి దించి, దానికి పైగా (చూపుడు వ్రేలు ఏ మాత్రమూ తగులకుండా) బ్రొటన వ్రేలును నడిమి వ్రేలిక్రింద కణుపునకుపెట్టి గట్టిగా నొక్కి మినప గింజ మునుగునంత తీర్థమును విడివిడిగా (ఓమ్ అచ్యుతాయనమః, ఓమ్ అనన్తాయ నమః ఓమ్ గోవిన్దాయనమః అను నామత్రయమన్త్రము తో ఒకచుక్క తీర్థమైననూ నేలపై పడనీయక వినమ్ర శిరస్కులై శ్రద్ధాభక్తులతో స్వీకరింపవలయును.

### 937. ప్రదక్షిణములు ఎన్ని రకములు ?

1వ ప్రదక్షిణము=నగరా ధ్వనితో చేయవలయును, 2వ ప్రదక్షిణము= నృత్యముతో చేయవలయును. 3వ ప్రదక్షిణము=పాటలతో చేయవలెను. 4వ ప్రదక్షిణము=మద్దెల మ్రోతతో చేయవలయును. 5వ ప్రదక్షిణము= పిల్లనగ్రోవి ధ్వనితో చేయవలయును 6వ ప్రదక్షిణ=ఘంటానాదముతో చేయవలయును 7వ ప్రదక్షిణము=భజన తాళముతో చేయవలయును 8వ ప్రదక్షిణము=శంఖధ్వనితో చేయవలయును. 9వ ప్రదక్షిణము=మంగళ వాద్యములేని శ్రుతి ధ్వనితో చేయవలయును. 10వ ప్రదక్షిణము=కొమ్ము బూర(బాకా) ధ్వనితో చేయవలయును. 11వ ప్రదక్షిణము=వేదపఠనముతో చేయవలయును. 12వ ప్రదక్షిణము=(ఏశబ్దముచేయక) శ్రీ వాసుదేవుని మనసున తలచుకొనుచూ మౌనముగా చేయవలయును.

### 938. అధికమాస, క్షయమాసములు అనగా ఏమి ?

ఏ చాంద్రమాస మాసమునందు సూర్యుని రాశీసంక్రమణము జరుగదో ఆ చాంద్రమాన మాసము అధికమాసము. ఏ చాంద్రమానమాసము నందు

MOHAN PUBLICATIONS.COM

సూర్యుడు రెండు రాశుల యందు ప్రవేశించునో ఆ చాంద్రమాన మాసము క్షయ మాసము అధికమాసమునూ, క్షయ మాసమునూ ఈ రెండు మాసము లునూ, మలమాసములు అనిపేరు పొందినవి అధికమాసముగానీ, క్షయ మాసముగానీ వచ్చిన సంవత్సరమునందు చాంద్రమాన మాసములు పండ్రెండు నెలలకుగాను పదుమూడు నెలలు వచ్చును.

**939. వారములో నూనెతో తల అంటుకొనుట మేలు : కీడులు తెలుపండి.**

ఆదివారము=తాపము (దుఃఖము) సోమవారము=శోభ(శుభము) మంగళవారము=మృత్యువు బుధవారము=ఐశ్వర్యము గురువారము=హాని శుక్రవారము=దుఃఖము, శనివారము=సుఖము.

అయితే ఈ దోషము రాకుండా వుండాలీ అని అనుకొంటే–

ఆదివారమైతే నూనెలో సువాసనగల పూలు కలపాలి, మంగళవార మైతే నూనెలో మట్టిని కొద్దిగా కలపాలి, గురువరమైతే నూనెలో గరికపోచలు వేయాలి. శుక్రవారమైతే నూనెలో ఆవుపేడ సూక్ష్మంగా కలపాలి.

**940. పెండ్లికి శుభవారములు ఏవి ?**

పెండ్లికి సోమ,బుధ,గురువారములు మేలైనవి. మంగళ, శని, ఆదివార ములు దోషము.

**941. జన్మతార పెండ్లికి పనికి వచ్చునా ?**

స్త్రీలకునూ, పురుషులకునూ జన్మతార, జన్మమాసము, జన్మ దినము శుభకరమైనవే అగును. అదేవిధముగా స్త్రీలకు అను జన్మతారలు (అనగా 1వతార, 10వ తార, 19వతారలు) మూడునూ పాణిగ్రహణమునకు శ్రేష్ఠమైనవి.

**942. ఏకనక్షత్ర వివాహము (శుభ, అశుభములు) తెలుపగలరు?**

శుభప్రద తారలు : రోహిణీ, ఆర్ద్రా, మఖా, విశాఖా, పుష్యమి, శ్రవణ, ఉత్తరాభాద్ర రేవతీ నక్షత్రములు భార్యా భర్తలు కాబోవు దంపతులకు ఇరువురిదీ ఒక నక్షత్రమే ఐననూ ఈ ఎనిమిది (8) తారలు శుభఫలములను ప్రసాదించును.

మధ్యమ ఫలప్రదతారలు : అశ్వినీ, భరణీ, ఆశ్రేషా, స్వాతీ, పూర్వఫల్గుణీ (పూ.ఫ, లేక పుబ్బా) అనూరాధా, మూలా, శతభిషా నక్షత్రములు దంపతులు





కాబోవువారికి ఒకటిగా వుండినచో ఈఎనిమిది(8) తారలు, మధ్యమ ఫలమును యిచ్చును.

దుష్ట ఫలము ఒసంగు తారలు : పూర్వాభాద్ర, ధనిష్టా, పునర్వసూ, కృత్తికా, మృగశీర్షా, చిత్రా, హస్తా, ఉత్తర ఫల్గుణీ (ఉత్తర) జ్యేష్టా, పూర్వాషాఢా, ఉత్తరాషాడ నక్షత్రములు దంపతులు కాబోవు స్త్రీ, పురుషులకు ఒకటియైనచో వారిరువురకునూ ఈపదనొకండు(11) తారలు వినాశనము సంభవించును.

1. దోషనక్షత్రమైననూ పాదములు తేడా ఐనచో మంచిదిగానే భావించి వివాహము చేయవచ్చును. 2. అటులకానిచో కన్యకు ముత్తైదువులచే పంచ పల్లవములతో కూడిన జలముచే, పవిత్ర స్నానము చేయించి, పురోహితుని ఆశీర్వచన, శాంతిమంత్రములతో వేరొక శుభకరమగు నామమును ధరింప చేసి పాణిగ్రహము చేయింపవలెను.

**943. గృహప్రవేశము ఎలా జరగాలి ?**

గృహప్రవేశము పగలు జరిగినచో శుభము కలుగును. రాత్రి జరిగినచో పుత్ర(కుమారులు)పౌత్రభివృద్ధి (మనుమలు) వీరితో వంశాభివృద్ధి కలుగును.

**944. గృహప్రవేశ శుభనక్షత్రములు ఏవి ?**

రోహిణి, మృగశీర్షా, ఉత్తరఫల్గుణీ, చిత్రా, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, ధనిష్టా, ఉత్తరాభాద్ర, ఈ 8 తారలునూ నూతన గృహప్రవేశమునకు సర్వ శ్రేష్ఠములు. అశ్వినీనక్షత్రముకూడా నూతన గ్రహప్రవేశమునకు సర్వశ్రేష్ఠము.

శిథిల గృహము బాగుచేయించి మరల చేరుటకు అనూరాధా, జ్యేష్ఠా, రేవతి తారలు మంచివి. పుష్యమీ, హస్తా,శ్రవణ, నక్షత్రములలో నూతన గృహప్రవేశము చేసినచో3సం॥దాటగనే ఆగృహయజమానిఇంటినితాకట్టు పెట్టుకొనును.

మృత్యుప్రద తారలు నూతన గృహప్రవేశము– భరణి, కృత్తికా, ఆర్ద్రా, పునర్వసూ, ఆశ్రేషా, మఖా, పూర్వఫల్గుణీ, స్వాతీ,విశాఖా,మూలా,శతతారా, పూర్వాభాద్రలలో చేసినచో గృహయజ మానిగానీ, గృహములోనివారు గానీ తప్పక (ఆరుసంవత్సరముల లోపల) మరణింతురు.

**945. గృహప్రవేశ శుభమాస వారములు ఏవి ?**

మాఘ, ఫాల్గుణ (మీన చైత్రము దక్షిణ భారత దేశీయులకు అనగా వింధ్య పర్వతమునకు దక్షిణము నందు నివసించువారికి శుభప్రదమైనదే) వైశాఖ, జ్యేష్ఠమాసములు సర్వశ్రేష్ఠమైనవి.

MOHAN PUBLICATIONS.COM

కార్తిక, మార్గశీర్షమాసములు మధ్యమ ఫలమును కల్పించును.

ఆది,మంగళవారములునూ, చవితి, నవమీ, చతుర్ధశీ, అమావాస్య తిథులనూ పూర్తిగావదలివేసి తక్కిన తిథి,వారములలో పగలుగానీ, రాత్రిగానీ నూతన గృహమునందు ప్రవేశించినచో సకల మంగళములునూ కలుగను.

సోమ, బుధ, గురు, శుక్రవారములలో ప్రవేశించినచో లక్ష్మీకటాక్షము కలుగును. శనివారమున చేరిన అన్ని విధాలుగానూ స్థిరంగానే వుంటారు. కానీ దొంగలబాధ కలుగును.

### 946. త్రివిధ ప్రవేశములు అనగా ఏవి ?

**1. అపూర్వప్రవేశము :** యజమాని తాను నిర్మించుకొనిన నూతన గృహము నందు తొలిసారిగా సుముహుర్తమున చేరునది.

**2. సుపూర్వప్రవేశము :** పెండ్లి ఐన తరువాత కొత్త కోడలు అత్తవారింట ప్రవేశము చేయునది.

**3. ద్వంద్వ ప్రవేశము :** రాజ, యుద్ధభయ, శత్రు, అగ్ని, భూకంప జలప్రళయ ముల వలననూ, కరవు, అంటువ్యాధులవలననూ, రక్షణకై పారిపోయి, తిరిగి పరిస్థితులు అనుకూలముగా మారినపుడు తన గ్రామ మును చేరి స్వగృహమున ప్రవేశించునది.

### 947. తారలు, శుభ, అశుభములు తెలుపండి ?

1 జన్మతార 2 సంపత్‌తార 3 విపత్‌తార 4 క్షేమతార 5 ప్రత్యక్ తార 6 సాధనతార 7 నైధనతార 8 మైత్రతార 9పరమమైత్రతార. 1,3,5,7 తారలు దోషకరమైనవి. 2,4,6,8,9 తారలు శుభకరమైనవి. ఐతే జన్మ తార యునూ, అను జన్మ(10,19) తారలునూ ఉపనయనముకునూ, స్త్రీ,పురుషుల వివాహము లకునూ, నూతన గృహప్రవేశములకునూ శ్రేష్టమే అగును.

### 948. శూన్యమాసములు అనగా ఏవి?

సూర్యుడు మీనరాశిలోవుండినప్పుడు–చాంద్రచైత్రముశూన్య మాసము, సూర్యుడు మిధురాశిలో వుండినపుడు–చాంద్రఆషాఢము శూన్యమాసము, సూర్యుడు కన్యారాశిలో వుండినపుడు–చాంద్రభాద్రపదము శూన్యమాసము, సూర్యుడుధనూరాశిలోవుండినపుడు–చాంద్రపుష్యము శూన్యమాసము.

### 949. షట్చక్రములు అనగా ఏవి ?

మూలాధార చక్రము – గుదస్థానము – ఎరుపురంగు; స్వాధిష్ఠాన చక్రము–పొత్తికడుపు–ఆరెంజిరంగు; మణిపూరకచక్రము–నాభి– పసుపు



రంగు; అనాహత చక్రము–హృదయము–ఆకుపచ్చరంగు; విశుద్ధిచక్రము–కంఠముమధ్య–నీలము రంగు; ఆజ్ఞాచక్రము–రెండు కనుబొమలమధ్య–ఊదారంగు; సహస్రారచక్రము– నడినెత్తిమీద–గులాబీరంగు;

### 950. పంచవాయువు అనగా ఏవి ?

**1. ప్రాణవాయువు :** శ్వాసను, ఆహారమును, నీటిని తీసుకొను బాధ్యత నిర్వహించును. ఇది గుండెలో కలదు.

**2. అపానవాయువు :** శరీరమునందలి మలినములు విసర్జించుటకు పని చేస్తుంది. ఈ రెండింటిని (ప్రాణాపాన వాయువులను) సమము చేయుట వలన, మనము ప్రాణాపాన సమాయుక్తమును సాధించగలము.

**3. వ్యానవాయువు :** మైక్రో మరియు మైక్రో సల్యూలార్ స్థాయిలో శరీరము నంతట గమనము కలిగిస్తుంది.

**4. ఉదాన వాయువు :** శరీరమునందు ఇచ్ఛాపూర్వక కండరాల కదలిక నిర్విహించును.

**5. సమానవాయువు :** జీర్ణక్రియ బాధ్యతను నిర్వహించును. సాధారణ ముగా ఉదరమునందు, జీర్ణక్రియకు బాధ్యత వహించును.

### 951. యజ్ఞము అనే పదానికి 3 అర్థాలు ఉన్నాయి అవి ఏవి ?

**1. దేవపూజనము :** దేవ పూజనమంటే దేవతా లక్షణాలు మనలో పెంపొందించుకొని, ఉన్నతమైన వ్యక్తిగా దేవ మానవునిగా (మహాత్మునిగా) ఉండుట, ఏదేవతను ఆరాధిస్తున్నామో ఆ దేవతా లక్షణాలను ఏర్పరచుకోవ డమే దేవపూజనము.

**2. సంగతీకరణము :** సంగతీ కరణము అంటే ఒకేపనిని అందరూ కలిసి పనిచేయ గలగడం. వసుదైకకుటుంబముగా ఒకరికొకరు సహకరించు కోవడము. ఒకగ్రూపుగా తయారయి సత్కర్మలు చేయడం, ఒకరి కష్ట సుఖాలలో అందరూ కలిసి భాగస్వామ్యం పంచుకోవడమే సంగతీకరణము.

**3. దానము :** దానము అంటే ఉదారత్వము. ఆపదలో ఉన్న అవతలి వ్యక్తి వద్ద లేనిది, నీ వద్ద ఉన్నది అతనికి నిస్వార్థముగా ఇచ్చి ఆదుకొనుటే దానము.

### 952. తపస్సాధనలో 3 రకాలు ఉన్నాయి అవి ఏవి ?

తపస్సులు3రకాలు 1. మనస్సు 2. వాక్కు 3. కాయము (శరీరం)తో చేసేది.

1. మనస్సుతోచేసే తపస్సును మానసిక తపస్సు అని అంటారు.



MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, సౌమ్యంగా (మంచిగా) ఉండడం, నీ ఇష్టదేవతామంత్రాన్ని ఎల్లప్పుడు మననం చేసుకుంటూ ఉండడం, పవిత్ర భావాలు కలిగియుండడం, మనస్సును నీఅదుపులో ఉంచుకోవటము ఇదే మానసికమైన తపస్సు.

2. వాక్కుతో ఇతరులను నొప్పించకుండా ఉండడము, సత్యము, ప్రియము, హితము అయిన మాటలు మాట్లాడడం ఇతిహాసాలు (భారత, రామాయణ, భాగవతం మొ॥గు గ్రంథాలు చదవడం-ఇది వాక్కుకి సంబంధించిన తపస్సు.

3. కాయము (శరీరము)తో తల్లి దండ్రులు, గురువులు, దేవతలను పెద్దలను పూజించటము, శుచిగాఉండటం (బాహ్యశరీరంశుచిగా ఉండటమే కాదు, మనస్సులోకూడా కల్మషం ఉండకూడదు.) ఋజు ప్రవర్తన (కుయుక్తి ఉండరాదు) బ్రహ్మచర్యం (పరబ్రహ్మకి అంకితమవ్వడం) అహింస అనేవి శారీరక తపస్సు. తపస్సు అంటే తపింపచేసేది, మనం చెయ్యవలసింది శరీరాన్ని తపింప చెయ్యడం కాదు, మనలోపాన్ని చెడు ప్రవర్తనను, చెడు ఆలోచనలనూ తపింప చేస్తూ గాయత్రీ మంత్రం జపిస్తే దైవదర్శనాలు లభ్యమవుతాయి. దైవం నీకు తోడుగాను యుంటుంది.

## 953. షట్కర్మలు అనగా ఏవి ?

షట్కర్మలు అనగా ఆరు కర్మలు అవి 1. పవిత్రీకరణము 2. ఆచమనము 3. శిఖావందనము 4. ప్రాణాయామము 5. న్యాసము 6. భూమిపూజ ఇవి గాయత్రీ లేదా ఏదేవతాపూజలోనయినా ప్రారంభంలో చేయవలయును.

## 954. షోడశ సంస్కారములు అనగా ఏవి ?

1. గర్భాదానము 2. పుంసవనము 3. సీమంతము 4. జాతకర్మ 5. నామకరణము 6. నిష్క్రమణము (4వ లేదా 5వమాసములో శిశువును బైట త్రిప్పుట) 7. అన్నప్రాశన 8. చూడాకర్మ 9. కర్ణవేధ 10. ఉపనయనము 11. యజ్ఞోపవీతము 12. సమావర్తనము (అధ్యయన సమాపనము) 13. వివాహము, 14. వానప్రస్థము 15. సన్యాసము 16. అంత్యేష్ఠి. ఈ షోడశ సంస్కారములు ఆచరించుట వలన వాని సమస్తపాపములు నశించి ఆత్మా జ్ఞానము కలిగి దేహాంతమున బ్రహ్మలోకము పొందును.

## 955. జపస్థలము ఎన్నుకొను విధానము గురించి తెలుపండి ?

1. ఉన్నివస్త్రము లేక ఉన్నితివాసీ మీదకూర్చుని జపం చేస్తే - వంశవృద్ధి 2. పర్వశిఖరం మీద కూర్చుని జపంచేస్తే జపం ఇంకా ఇంకా చేయాలన్న





తపన కలుగుట మరియు తపస్సిద్ధి కలుగును. 3. పీఠం,ఆశ్రమము, దేవాలయము ఆవరణలలో జపించిన దేవతానుగ్రహము, మంచి స్వప్నములు వచ్చుట జరుగును. 4. ఇంటిలోజపించిన ఎంత జపం చేస్తే అంత ఫలితమే వచ్చును. 5. ప్రవహించే జీవనదిలో నిలబడి బొడ్డుకు జలం తగిలిఏలాగ జపించిన జపసంఖ్యకు రెండురెట్లు ఫలితము లభిస్తుంది. 6. గోశాల యందు కూర్చుని జపంచేస్తే జపసంఖ్యకు నూరురెట్లు ఫలితము కలుగును. 7. యజ్ఞం చేసిన స్థలంలో కూర్చుని జపంచేసిన జపసంఖ్యకు నూరురెట్లు ఫలితంకలుగును. 8. కాశీలో విశ్వేశ్వరుని దేవాలయము, శ్రీశైలమల్లిఖార్జున దేవాలయము, తిరుమల తిరుపతి వెంకన్న దేవాలయాలులాంటి స్వయంభువుగా వెలసిన దేవాలయాలలో దేవతామూర్తికి ఎదురుగా లేక ముఖమండపములలోగాని కూర్చుని మంత్రం జపించిన జపసంఖ్యకు కోటిరెట్లు అధికముగా కలుగును. 9.సూర్యునికిగాని, గురువుకిగాని, దీపానికిగాని అభిముఖంగా కూర్చుని జపంచేసిన మంత్రము త్వరగా సిద్ధించును.

## 956. జప సమయములో వస్త్రధారణ ఎలా ఉండాలి ?

శీతకాలములో మనుష్యులు వాతము, కఫము హరించే, పట్టు, ఉన్ని ఎరుపు రంగుల బట్టలు ధరించాలి. కాషాయ వస్త్రము మేధస్సుకు హితకారి, అన్నివేళలా, అన్నిఋతువులలోనూ ధరించవచ్చు. తెల్లని వస్త్రాలు సుఖకరము, శీలమువేడిని నిరోధించగలవు. అందువలన ఎక్కువవేడి, ఎక్కువ చల్లదనము కలుగదు. తెలుపు దుస్తులు ధరించుట వలన హుందాతనము కూడా కలుగును. అందుచే పూజా సమయములో తెలుపు లేదా కాషాయ రంగు లేదా బంతిపువ్వు రంగు (పసుపుపచ్చ) శ్రేష్ఠము.

## 957. మంత్రోపదేశమునకు శుభమాసములు, వారములు, తిథులు, నక్షత్రములు, రాశులు, సమయాలు ఏవి ?

వైశాఖము, శ్రావణము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, మాఘం, ఫాల్గుణము, అధికమాసము మంచిదికాదు.

మంత్రోపదేశమునకు శుభవారములు : సోమవారం, శుక్రవారం.

మంత్రోపదేశమునకు శుభనక్షత్రములు : తన జన్మనక్షత్రము నుండి 8,9 నక్షత్రములలో అనగా తారాబలము ప్రకారము మిత్రతార మరియు పరమ మైత్రతార మంచి ఫలితానిస్తాయి. కనుక తారాబలములో 8,9

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

చూచుకోవలయును. అశ్వని,రోహిణి,ఆర్ద్ర,పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుణి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి.

మంత్రోపదేశమునకు శుభమైన తిధులు : పూర్ణిమ, పంచమి, విదియ, సప్తమి,శు.త్రయోదశి, శు.దశమి కృష్ణపక్షములో కంటే శుక్లపక్షము మంచిది. షష్ఠి మరియు గ్రహణసమయములందు మంత్రోపదేశమునకు అసలు మంచిది కాదు. గ్రహణసమయములలో మంత్రదీక్ష తీసుకుంటే 7 జన్మలు దరిద్రమును అనుభవించుదురు.

మంత్రోపదేశమునకు శుభరాశులు : మేషం,కర్కాటకం, కన్య, తుల, వృశ్చికం, మకరం, కుంభం.

మంత్రోపదేశమునకు శుభసమయములు : ప్రాతః సమయము, ఉదయ సంధ్యాసమయము, మిట్టమధ్యాహ్న సమయము వరుసగా శుభప్రద ములు. మంత్రోపదేశమునకు అర్ధరాత్రి, అధికమాసాలు మంచిదికాదు. సాయం సంధ్య మధ్య ఫలితము.

### 958. గాయత్రీ మంత్రపు అర్ధము ఏమిటి ?

ఓం భూఃర్భువః స్వః । తత్స వితుర్వరేణ్యం ।
భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్॥

ఓం=బ్రహ్మ; భూః=ప్రాణస్వరూపము(భూలోకానికి ప్రతీక); భువః=దుః ఖనాశకము (భువర్లోకానికి ప్రతిబింబము) స్వః=సుఖస్వరూపమైన (స్వర్గానికి ప్రతిరూపము) తత్=ఆ, ఆది, ఆశక్తి; సవితుః=తేజస్వి, ప్రకాశవంతుడు (సూర్యుడని కూడా అర్ధమున్నది) వరేణ్యం=శ్రేష్ఠుడైన; భర్గో=పాపనాశకము (ఈశ్వరుడని కూడా అర్ధము) దేవస్య=దివ్యమైన, ఇచ్చునటువంటివాడు; ధీమహి=ధారణ గావించి, (మనస్సులో ఆత్మలో భావించి) ధియో=బుద్ధిని; యో=యేది; నః= మనయొక్క; ప్రచోదయాత్=ప్రేరేపించుగాక!

### 959. నకిలీ రుద్రాక్షను గుర్తించే మార్గాలు ఏవి ?

రుద్రాక్షను రెండు రాగిరేకుల (రాగి నాణేల) మధ్యను వుంచినట్లయితే దానికి అదే సవ్యదిశలో తిరుగుతుంది. ఒక గిన్నెలో నీరుపోసి అందులో రుద్రాక్షవేస్తే ఒరిజినల్ అయితే మునుగుతుంది. డూప్లికేట్ అయితే తేలు తుంది. (బాగాపాత రుద్రాక్షలు తేలుతాయి, గమనించవలసింది) నీటిలో ఒక అరగంటసేపువేసి ఉంచితేనీరుకొద్దిగా వేడిక్కినట్లయితే ఒరిజినల్ రుద్రా.





### 960. రుద్రాక్ష ధారణా నియమాలు ఏవి ?

పుచ్చిపోయిన రుద్రాక్షలను ధరించరాదు. కుల, మతభేదము లేకుండా అందరూ రుద్రాక్షలను ధరించవచ్చు. బంగారు,వెండి, రాగి తీగెలతోగాని, నూలు లేదా సిల్కుదారముతోగుచ్చి ధరించవచ్చును. రతిసమయములో రుద్రాక్షలు పవిత్రస్థలములో ఉంచవలెను. పొరపాటున ఆ సమయములో ధరిస్తే, ఆ తరువాత వాటిని ఆవుపాలతో శుద్ధిచేయవలెను. రుద్రాక్షలను ధరించేటపుడు “ఓంనమఃశివాయ” ఒకమాల (108సార్లు) చేయుట శుభ ప్రదము. రుద్రాక్షలు ధరించినవారు వాటిని ఎల్లప్పుడు పరిశుభ్రంగా వుంచి, ప్రతీపూర్ణిమకు ఆవుపాలతో మహామృత్యుంజయ మంత్రంతోగానీ ఓం నమః శ్శివాయఅని అంటూ అభిషేకముచేయుట చాలామంచిది. రుద్రాక్షలు ధరించినవారు మాంసాహారం, మద్యం,పొగత్రాగుటమానివేయడం మంచిది.

### 961. పంచపాపాల దోషనివృత్తికి పంచ యజ్ఞాలు (మార్గాలు) తెలపండి?

శరీరం, మనస్సు, ఆత్మల కలయికయే మానవత్వం. వేదాంత పరి భాషలో చేయుట, తలచుట, ఉండుట అంటారు. సేవచేసేది దేహం, తలం చేది మనస్సు, ఎల్లప్పుడు ఉండేదిఆత్మ, శరీరం నిరంతరం కర్మలను ఆచరిస్తూ ఉంటుంది. ఉచ్ఛ్వాస, నిశ్వాసలు శరీరం ప్రధానకర్మలు. కర్మలను ఆధారం చేసుకునేది దేహం. మనం ఎంతమంచిగా ప్రవర్తించినా మనకు తెలియకుం డానే ఐదుదోషాలు కలుగుతాయి. 1.దైవయజ్ఞం 2. పితృయజ్ఞం 3. వేదపఠనము (స్వాధ్యా యము) 4. భూతయజ్ఞం 5. అతిథి యజ్ఞం.

1. దైవయజ్ఞం అనగా భగవత్ చింతన, ప్రార్ధన, పూజ, శ్రవణం, కీర్తనంమొదలగునవి. 2.పితృయజ్ఞంఅనగా దేహమునిచ్చి పెంచిన తల్లి దండ్రులను, వారు జీవించి ఉన్నంతవరకు, వారికి ఏ బాధ రానీయకుండా సేవలు చేయుట, మరణించిన తర్వాత పితృదేవతా కార్యాలు నిర్వహించడం. 3. వేదపఠనము అనగా వేదములలోగల మంత్రాలలో ముఖ్యమైనది గాయత్రీ మహా మంత్రము మరియు మహామృత్యుంజయమంత్ర జపము లేక పురుష సూక్తము, సద్గ్రంధ పఠనం. 4. భూత యజ్ఞం అనగా కాకులకు, పిచ్చుకలకు, ఆవులకు, కుక్కలకు నీవు తినేముందు ఆహారము పెట్టడం. 5. అతిథి యజ్ఞం అనగా ఇంటికి వచ్చిన బంధుమిత్రులకు, భిక్షకులకు అన్నం పెట్టడం.

MOHAN PUBLICATIONS.COM

## 962. తులసి గురించి మీకు తెలుసా ?

గాయత్రీ, మహావిష్ణు జపాలకు తులసిమాల అత్యంత సర్వశ్రేష్ఠము, మంత్రసిద్ధిని కలుగుజేయును. క్రొత్త తెల్లని వస్త్రమునకు పసుపురాసి ఆ వస్త్రమును ఎండపెట్టి అందులో తులసీమాలను చుట్టండి. ఆ వస్త్రమును క్రొత్త కుండలో ఉంచి కొత్త మట్టిమూత పెట్టి ఉంచండి. క్రొత్త ఇల్లు కట్టుకొను సమయమున ఈ కుండను ఇంటి పునాదిలో ఉంచండి. ఆ ఇంటిమీద పిడుగు ఎప్పుడూపడదు. తీవ్రతవలన ఎప్పుడయనా పడినట్లయితే వెంటనే భూమిలో కలిసిపోతుంది. ఇల్లురక్షింపబడుతుంది. తులసిమాలలో ఎక్కువగా విద్యుత్‌శక్తి ఉంటుంది. తులసిమాలను ధరించుటవలన పిడుగుయొక్క భయం తగ్గిపోతుంది. శరీరం సురక్షితంగా ఉంటుంది. వ్యక్తి ఆరోగ్యంగా, దీర్ఘజీవిగా ఉంటాడు. సదాచారిగా ఉండుటలో అధిక సఫలుడవుతాడు.

తులసిచెట్టు దగ్గర లేక సమీపంలో కూర్చొని చేసిన ధర్మకార్యాలు ప్రత్యే కంగా జపము, ధ్యానం ఎక్కువ ప్రభావం కలిగివుంటుంది. తులసి దగ్గరకు వివిధరోగాలు కలిగించే కీటకాలు రాజాలవు. దాని సమీప ప్రాంతానికి కూడ కీటకాలు రాలేవు. గాలి శుద్ధముగా నుండును. సాత్విక భావాలు స్వభావసిద్ధ ముగా సంచరిస్తాయి. మనస్సు కూడా శుద్ధముగా మరియు ఆరోగ్యంగా ఉండును. జనసమ్మర్ధము ఎక్కువగా ఉండే పట్టణ ప్రాంతములలో చెట్టునాటుట ద్వారా వాతావరణ కాలుష్యము తొలగించలేనపుడు ఆ పట్టణములలో, కుండీలలో తులసిని పెంచుట ద్వారా కాలుష్యము తొలగించ వచ్చును.

## 963. గృహములో ఎంత కొలతలు ఉన్న విగ్రహములు అర్చించ వలెను?

ఇంటియందు అర్చనచేయు విగ్రహములను మానాంగుళమల కొలత తోడనే చేయవలయును 2 అడుగుల (24 అంగుళములు) కొలతకు ఎక్కువ యునూ పదిరెండు(12) అంగుళముల కొలతకు తక్కువయునూ ఉండరాదు. భవనములలో మూలవిరాట్టులో శిలా,దారువులతో వర్ణములనుబట్టి కొల తలు వుండును. 1వవిధానము:బ్రాహ్మణులకు-24అంగుళములు; క్షత్రియులకు 21 అంగుళములు; వైశ్యులకు-19 అంగుళములు; శూద్రులకు17 అంగుళములు; 2వ విధము-బ్రాహ్మణులకు-12 అంగుళములు; క్షత్రియులకు-9 అంగుళములు; వైశ్యులకు-7 అంగుళములు; శూద్రులకు 5 అంగుళములు.





ఇంటియందు సంహార-శయనరూపములూ, విశ్వరూప, భృగు, రామ, హిరణ్యాక్ష సంహార శ్రీవరాహ; హిరణ్యకశ్యప సంహార శ్రీనారసింహ మహిష మర్దనీ శ్రీ వీరలక్ష్మీ, రూపము కలిగిన విగ్రహములను అర్చింపరాదు. శ్రీకృష్ణుని శ్రీ భూ నీళాదేవి సహితముగాకానీ, వారు లేకయే (ఒంటరిగా) కానీ, అర్చింప వచ్చును.

## 964. గృహములలో ఎలాంటి విగ్రహములను అర్చించవలెను ?

బ్రాహ్మణ,క్షత్రియ, వైశ్యులు పూజించుటకు తగినవి బంగారు, వెండి విగ్రహములు (శ్రేష్ఠము) ఆరకూటమూ, రాగీ ప్రతిమలు -కోరిన కోర్కెలను నెరవేర్చును. శిలతోనూ, కొయ్యతోనూ చేసిన బింబములను ఇంటియందు అర్చింపకూడదు, పిశాచములను వశీకరణ చేయవలెననిచో-ఇనుముతో చేసిన విగ్రహములను పూజింపవలెను. కంచువిగ్రహములు పూజించినచో- ఉచ్చాటనము జరుగును. త్రిలోహములు (బంగారం,వెండి,రాగి) కలిపి చేసిన విగ్రహములను పూజించినచో శత్రుజయము కలుగును. సీసముతో చేసినప్రతిమను పూజించినచో క్షయవ్యాధులు కలుగును. రత్నములతో చేసిన ప్రతిమను పూజించినచో అన్నికోరికలుతీరును. చంద్రకాంత శిలా విగ్రహ మును అర్చించినచో శాంతిలభించును. తెల్లనివన్నె కలిగినసాల గ్రామ మును పూజించినచో ప్రశాంతత లభించును. పసిమివన్నె సాలగ్రామ మును పూజించినచో ఐశ్వర్యప్రదము. రక్తవర్ణసాలగ్రమమును అర్చించినచో కోరిన కోర్కెలు తీరును. నల్లరాయితో చేసిన విగ్రహములను అర్చించినచో పుష్టి కల్గును. చందనకొయ్యతోచేసిన విగ్రహమును పూజించినచో లక్ష్మీ కటాక్షము కలుగును. ఆగరుకొయ్యతో నిర్మించిన విగ్రహమును భవనముల యందు సర్వదా అర్చింపవచ్చును. దేవదారుతో చేసిన విగ్రహమును కూడా భవనములందు సర్వదా అర్చింపవచ్చును. మారేడుతో చేసిన బింబమును అర్చించినచో చెప్పుటకు వీలుఏని అంతమహదైశ్వర్యము లభించును. గంగ రావి కొయ్యవిగ్రహమును అర్చించినచో బ్రహ్మవర్చస్సు కలుగును. శమీ(జమ్మి) దారువు స్వర్గసుఖము; మేడికొయ్య విగ్రహము అన్నమునకు లోటుకలుగదు. రావికొయ్య-రాజ్యపాలన లాభము. మట్టికొయ్య-చిర కాలము బ్రతుకుట, ధనలాభము, పుత్రదారుమయము పుత్రులనూ, మోక్ష మునూ చేకూర్చును. సరలామంత్రసాదనమగును. తమాల సర్వలోక సుఖావహము. మామిడి ఆరోగ్యప్రదము. రేగు పుత్రులనూ, ధనమునూ కల్గించును. పనస ఎక్కువమంది పుత్రులు కల్గుదురు. పాలుకారుచెట్టు-ధనమును కల్గించును;

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

### 965. విగ్రహములు విరిగినచో ఏమి చేయాలి ?

విగ్రహములకు చేతులూ, కాళ్ళూమున్నగు అవయవములు భిన్నమైనచో ఆచార్యుడు, యజమానిచే దానములూ, శాన్తిహోమములు, జరిపించి విరిగిన అవయవములను స్థపతిచే మరల అతికింపచేసి, అర్చింపవలెను, అతికించుటకు వీలుకాని విగ్రహ అవయవములు ఉండినచో ఆ భిన్నమైన విగ్రహమును నదిలో విసర్జించి క్రొత్తదానిని ప్రతిష్ఠింపవలెను.

### 966. శమీ విధానము తెలుపండి?

ఆశ్వయుజ శుద్ధదశమి (విజయదశమి) రోజున సాయంకాల సమయ మందు శత్రువినాశము కొరకు, విజయప్రాప్తి కొరకును, జమ్మిచెట్టు వద్ద అపరాజితా దేవిని, శమీవృక్షమును, విజయ పత్రములను పూజించి ఆ చెట్టు నుండి పత్రములు గ్రహింతురు. శ్రవణానక్షత్రము ఆ రోజువచ్చిన విశేషముగా తలంతురు. శమీ శమయతేపాపం శమీశత్రువినశనీ । అర్జు నస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శనం॥ అనిపత్రములపై వ్రాసి శమీవృక్ష కొమ్మలకు తగిలిం తురు.

### 967. పూజలో ఉపచార దోషములు అనగా ఏమిటి ?

గంధం ఉంచనిచో భయము కలుగును, గంధహీనే దరిద్రతా అని కూడ కలదు. పుష్పములుంచనిచో యుద్ధభయము, ధూపంలేనిచో రోగం దీపంలేనిచో మతిభ్రంశ, నైవేద్యం చేయనిచో దుర్భిక్షము అగ్నిహీనమైన సంకులము మంత్ర హీనమైన మరణం క్రియాహీనమయిన వ్యాధిగ్రస్థుడు అగును. అందుచే యథా విధిగా ఈశ్వరుని పూజించవలెను.

### 968. ఉపచార ధర్మములు అనగా ఏవి ?

పాద్యమును పాదములయందు వక్త్రమందు ఆచమనమును అర్ఘ్యము హస్తమందు వుంచి గంధము పూయవలెను. పుష్పమును శిరస్సునందు ముక్కు దగ్గర ధూపమును నేత్రములయందు దీపమును అన్నమును హస్త మందును దర్శించవలెను.

### 969. దేవాలయము ఎలా చూడాలి ?

ఆలయ శిఖరము శిరస్సు, గర్భాలయం కంఠము, ముఖమంటపము పొట్ట ప్రాకారము కాళ్లు, గోపురము పాదము, ధ్వజమే ప్రాణమువంటివి అని భావము.





### 970. స్నానభేదములు ఎన్నిరకములు ?

ముఖ్యస్నానము దీనినే వారుణస్నానము అని అందురు. ఇది ఆరు విధములు. 1. నిత్యము–ప్రతిరోజు ప్రాతఃకాలమునచేయు స్నానము; 2. నైమిత్తికము–మృతాశౌచాదుల సందర్భమునచేయబడునది. 3. కామ్యము–ప్రత్యేక మైన కోరికతో కార్తీక, మాఘమాసాదులందు చేయబడునది. 4. క్రియాంగము– దేవతాపూజ, జపము, వ్రతము, తిథికార్యము మొ॥వాని ప్రారంభమునకు ముందు చేయునట్టి స్నానము. 5. మలాపకర్షణము – పండుగరోజులలో తలంటుకొని, నలుగుపిండి పెట్టుకొని చేయు అభ్యంగన స్నానము. 6. క్రియాస్నానము–సరస్సు, పుష్కరిణి, నదీతీరములయందు చేయు స్నానము.

గౌణస్నానము : శరీరమునకు ఉత్తమ గుణములను కల్గించు స్నానము. ఇది ఏడు విధములు. 1.మంత్రస్నానము–అబ్లింగ మంత్రములు చదు వుచుజలమును ప్రోక్షించుకొనుట. దీనికి 'బ్రాహ్మస్నాన'మని నామాంతరము. 2.భౌమము–పుట్టమట్టిని కాని రేగడిమట్టిని కాని శరీరమునిండా పులుము కొనుటయే భౌమస్నానము దీనినే 'పార్థివము' మృత్తికాస్నానము అనికూడా అందురు. 3. ఆగ్నేయము–అగ్ని కుండములోని భస్మమును ధరించుట. 4. వాయువ్యము–గోధూళి శరీరముపై ప్రసరించగా అది వాయవ్య స్నానమగును. 5. దివ్యము–సూర్యకిరణ స్పర్శచే ఏర్పడునది. 6. వారుణము –వర్షమున తడియుట లేదా నీటిలో పూర్తిగా మునుగుట. 7. మానసము – దైవమునుఏకాగ్రతతోధ్యానిస్తు ప్రశాంతముగా నుండుటయే మానస స్నానము. ఇదే యౌగికము.

### 971. "తర్జని" (చూపుడువ్రేలు) ని ఎప్పుడు దూరముగా ఉంచాలి ?

జపము చేయునపుడు జపమాలకు తర్జని తగులరాదు. ఔషధము సేవించునపుడు, హోమము చేయునపుడు, ఆచమనముచేయునపుడు, పళ్ళు తోము సమయమున పళ్ళకునూ తర్జని తగులరాదు.

### 972. షోడశ మహారాజులు అనగా ఎవరు?

1.గయుడు 2. అంబరీషుడు 3. శశిబిందువు 4. అనంగుడు 5. పృథువు 6.మరుత్తుడు 7. సహోత్రుడు 8. పరశురాముడు 9. శ్రీరాముడు 10. భరతుడు 11.దిలీపుడు 12. సృగుడు 13. రంతిదేవుడు 14. యయాతి 15. మాంధాత 16. భగీరథుడు.

MOHAN PUBLICATIONS.COM

## 973. షోడశ సుగంధ ద్రవ్యములు అనగా ఏవి ?

1. వట్టివ్రేళ్ళు 2. పర్పాటకం 3. తుంగముస్తలు 4.పచ్చకర్పూరం 5. గవిళాలు 6. అగరుచెక్క 7. యాలుకలు 8. లవంగములు 9. తక్కోలాలు 10. జాజికాయ 11. జాపత్రి 12. చంగల్వకోష్టు 13. ప్రానిపసుపు 14. వస 15. కర్జూరము 16. పసుపు.

## 974. సప్తదశ ధాన్యములు అనగా ఏవి ?

1.వడ్లు 2. గోధుమలు 3. యవలు 4. తిలలు 5. శనగలు 6. ప్రియంగ వులు 7. ఉదారములు 8. కోరదుష్టములు 9. వామకములు 10. మినుములు 11. పెసలు 12. మసూరములు 13. నీవారములు 14. ఉలవలు 15. హారికలు 16. కారికలు 17. గ్రామారణ్యకములు.

## 975. త్రివిధ దీక్షలు అనగా ఏవి ?

1. దృగ్దీక్ష :- వీక్షణమువలన మత్స్యములు తమ అండములను ఎట్లు పిల్లలను చేయునో అట్లే ఆచార్యుడు శిష్యునకు ఉపదేశముచేసి అతడు మోక్షము కల్గించును.

2. వాగ్దీక్ష : భ్రమరకీటన్యాయము తుమ్మెద పురుగునుతెచ్చి దానిచుట్టూ, తిరుగుచు నినాదము చేయును. అట్లుచేసి దానిని తుమ్మెదగా మార్చును. అట్లే ఆచార్యుడు శిష్యుని బోధనచే తనంత వానినిగా చేయును.

3. స్పర్శదీక్ష : పక్షుల తమ అండములను పొదిగి పిల్లలను చేయునట్లు గురువు శిష్యుని స్పర్శచేత తెలివి నొందింపజేయుట.

## 976. చతుర్విధ జ్ఞానములు అనగా ఏవి ?

శ్రవణము-గురువువద్ద వినుట; చింతన-మననము చేయుట; నిశ్చల-అనుష్ఠించుటకు నిశ్చయము; నిష్ఠ-చేయుటకు నిష్ఠ.

## 977. పంచముద్రలు అనగా ఏవి ?

భూచరీ: నాసాగ్రమందు దృష్టిని నిలిపిచేయు ధ్యానము; ఖేచరీ: కను బొమ్మల మధ్య దృష్టిని నిలిపిచేయు ధ్యానము. మధ్యమ : నాసాగ్ర భ్రూమధ్య ప్రదేశమందు దృష్టి నిలిపి చేయు ధ్యానము. శాంభవీ : రెండు నాశికారంధ్ర ములు అనామికవ్రేలుతోను రెండు చెవులను అంగుష్ఠములతోను, రెండు కను లను మధ్యమ వ్రేళ్ళను రెండిటితో పట్టుకొని నాదములను వినుచు కళలను దర్శింప జేయు ధ్యానము. షణ్ముఖీ : రెండు బొటనవ్రేళ్ళతో రెండు చెవులు మూసికొని నాదము ఆలకించుచు చేయు ధాన్యము.



## 978. పంచమార్గములు అనగా ఏవి ?

కపిమార్గము: కోతిపిల్లవలె ఆచార్యుని విడువక వారితోబాటు తిరుగుచు చేయు శిష్యరికము; విహంగమార్గము : ఆచార్యుడు శిష్యుని విహంగమువలె పొదిగి అండములను పిల్లలను చేయువిధముగా శిష్యుని జ్ఞానినిగా చేయుట; మార్జాలమార్గము : పిల్లి తన పిల్లలను రక్షించుకొనుటకు గొనిపోవునట్లు, గురువు శిష్యుని జ్ఞానోపదేశముచే రక్షించుట (మార్జాలకిశోరన్యాయము). 4. మీనమార్గము: చేపగ్రుడ్డులనుపెట్టి వానివంక చూచుచు జ్ఞానిని చేయుట. 5. కూర్మమార్గము : తాబేలు గ్రుడ్లనుపెట్టి తాను తిరుగుచు వానిని తలచి పిల్లలను చేసినట్లు ఆచార్యుడు శిష్యుని ఆశీర్వచనము వలన జ్ఞానినిచేయుట.



## 979. పంచ భ్రమలు అనగా ఏవి ?

దేహాత్మభ్రమ : దేహమే తాను అనిభ్రమించుట (పొరబడుట); తరుపాషా ణాది భ్రమ : రాళ్ళయందు చెట్లయందు దేవుడు కలడగు భ్రమ. మిథ్యాత్మ భ్రమ: ఆత్మవేదమనుకొను భ్రమ. దేవతాభ్రమ : మోక్షమొసగని దేవతల నారాధించు యందలి భ్రమ. కర్మభ్రమ : కర్మమోక్ష మొసగునని శ్రౌత స్మార్తవ్రత ఉపవాసముల చేయుభ్రమ.

## 980. హోమద్రవ్యములూ వాడితే ఫలితములూ ఏమిటి ?

1. యజ్ఞవృక్ష (రావి,జువ్వి, మర్రి, మేడి) సమిధలతో శాంతి; 2. యజ్ఞవృక్ష పుష్పములతో సౌభాగ్యము; 3. సుగంధ ధూపద్రవ్యములతో -ఆరోగ్యము; 4. పాలతో,పెరుగుతో పుష్టి; 5. అన్నముతో-సర్వవాంఛలు; 6. నేయితో చిరంజీవు లగు పుత్రులు; 7. తెల్లని పద్మములతో-బ్రాహ్మీ సంపద; 8. శ్రీ(మారేడు) పుష్పములతో మారేడు సమిధలతో పద్మములతో -మహత్ ఐశ్వర్యప్రాప్తి, జ్ఞానము. 9. గోఘృతముతో-జ్ఞానము, 10. కాల పుష్పములతో-తానునచ్చిన కన్య లేక వరుడు 11. ఆవుపేడ (పిడకలతో) గో సంపద; 12. గరికతో-ఆయుర్ వృద్ధి; 13. పవిత్రమగు మట్టితో-భూలా భము; 14. యవల (బార్లీ గింజల)తో దేహసుఖము; 15.నూవులతో-సర్వజన ప్రియత్వము; 16. బ్రహ్మవృక్ష (గంగా రావి) సమిధలతో-బ్రహ్మ వర్చస్సు; 17. యవ-వేణు, నీవార, శాలి ధాన్యములతో సర్వవాంఛలు; 18. పేలాలతో-అన్ని కోరికలు; 19. పాయసముతో-సుపు త్రులు; 20. వేపపూవులతో-బంగారము.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

**981. హోమసమిధ లక్షణము ఎలా ఉండాలి ? ఫలితము ఎలా ఉంటుంది?**

1. పైతోలు (బెరడు) లేనిచో-వినాశనము; 2. విరిగిపోయినచో-క్షీణత; 3.పచ్చిగా వుండినచో-బంధునాశనము; 4. పాతవి ఐనచో-పుత్రనాశనము; 5. గంట్లుగా నరుకబడినచో-భార్యామరణము; 6. చీలుకొమ్మ వుండినచో-కలహము; 7. ఎక్కువలావైనచో-మనఃస్థిమితము కోల్పోవుట; 8. వంకరగా వుండిన-దుష్టగ్రహబాధ; 9. మిక్కిలి పొడవుగా వుండిన-ఎడతెగని బహుదిన ముల వర్షము.

**982. అగ్నులు ఎన్ని రకములు ?**

1. బాలాగ్ని 2. యౌవనాగ్ని 3. వృద్ధాగ్ని

1. బాలాగ్ని : అరణి మంధలను (రావి-జమ్మి కొయ్యలతో) మధింపగా, దానియందు పుట్టినఅగ్నికి బాలాగ్ని అనిపేరు. బాలాగ్నిని దీక్ష స్వీకరించునపుడునూ; శాంతి హోమమునందునూ, భగవత్ ప్రతిష్ఠ కాలములయందునూ ఉపయోగింతురు. 2. చెకుముకిరాళ్లు రాపిడిచేసి పుట్టించిన అగ్నికి యౌవనాగ్ని అనిపేరు ఈ యౌవనాగ్నిని అన్ని ఉత్సవముల యందు ప్రతిష్టించి దానిలో చరు పదార్థములతో హుతముచేసి దేవతలను తృప్తి చెందింపవలెను. 3. వేద పండితుల యిండ్ల యందు వుండిన పవిత్రమగు అగ్నికి వృద్ధాగ్ని అనిపేరు. ఈ వృద్ధాగ్నిని నిత్యమునూ యింటి యందు ఆచరించు వైశ్వదేవ హోమము నందు వాడుకచేయవలెను.

**983. జపమాల ఫలములు ఏమిటి ?**

వ్రేలు కణుపుతోచేసినచో ఒకటికి ఒకటియేఫలము, వ్రేలు పర్వములతో చేసినచో 8రెట్లు పుణ్యఫలము; పుత్రజీవములతోచేసినచో (ఒకజాతిచెట్టు విత్తనము) 10రెట్లు; శుఖమణితో జపముచేసినచో100రెట్లు; ప్రవాళ (పగడముల) మాలతో జపము చేసినచో వేయిరెట్లు; ముత్యముల మాలతో జపము చేసినచో పదివేలరెట్లు; బంగారుపూసలమాలతో జపముచేసినచో పదికోట్లరెట్లు; తెల్లని పద్మపు పూసలతో జపము చేసినచో అమితఫలము; దర్భముడులతోకానీ, తులసీ కాష్టమాలతోకానీ జపము చేసినచో చెప్పుటకు వీలులేనంత పుణ్యఫలము కలుగును.

1. శంఖములు, అక్షముల, మణులు, వీనితోచేసినమాల = లక్ష్మీ ప్రదము 2. స్పటికమాల మోక్షదాయకము 3.తామరపూసల మాల





పుష్టికరము 4. రుద్రాక్షమాల భుక్తి,ముక్తుల నొసంగును 5. పుత్రజీవ ముల (ఒకజాతిచెట్టు గింజలు) మాల పశు,పుత్ర, ధాన్యప్రదము 6. పగడముల (ప్రవాళ) మాల ధనము, వశ్యము 7. ముత్యమాల సౌమంగల్యమునిచ్చును. 8. దర్భముడుల మాల పాపము నశించును; 9. బంగారు, వెండి పూసల మాలకోరిన కోర్కెలుతీరును; 10. పగడములూ, ముత్యములూ, స్పటికములూ కలసినమాల కోటిరెట్లఫలము 11. తులసీ, రుద్రాక్షమాలలు అక్షయ ఫలము 12. వ్రేళ్ళతోజపించినచో సామాన్యఫలము 13. కణుపులతో జపించిన రెట్టింపు ఫలము 14. కణుపులమధ్య గీతలతోచేసిన పదిరెట్లు ఫలము 15. శంఖమాల నూఱురెట్లు 16. ప్రవాళ (పగడ)మాల వేయిరెట్లు 17. స్పటికమాల పదివేల రెట్లు; 18. ముత్యాలమాల లక్షలరెట్లు; 19. తామర పూసలమాల పదిలక్షల రెట్లు 20. సువర్ణమాలకోటిరెట్లు 21. దర్భముడుల మాలనూఱుకోట్లరెట్లు 22. తులసీ,రుద్రాక్షమాలలు అనంత,అక్షయ ఫలము.

**984. దిక్కులు జపము ఫలితములు ఏమిటి ?**

తూర్పుముఖము-కామ్య కర్మకు; దక్షిణముఖము-క్రూరకర్మకు; పడమర ముఖము-వశ్య కర్మకు; ఉత్తరముఖము-మోక్షప్రాప్తికి. శ్రేష్ఠకర్మలకు-అంగుష్ఠ అనామికలతోడనూ, ఆకర్షకర్మలకు-అంగుష్ట మధ్యమములతోడనూ, ఉచ్చాటన కర్మలకు-అంగుష్ట తర్జనులతోడనూ, మారణకర్మలకు-అంగుష్ఠ కనిష్టికలతోడనూ జపమాలను త్రిప్పవలెను.

**985. అష్టాదశ పురాణములు ఏవి ?**

1. మత్స్య పురాణము 2. మార్కండేయపురాణము 3. భవిష్యపురాణము 4. భాగవతపురాణము 5. బ్రహ్మపురాణము 6. బ్రహ్మాండ పురాణము 7. బ్రహ్మవైవర్తపురాణము 8. వరాహపురాణము 9. వామనపురాణము 10. వాయు పురాణము 11. విష్ణు పురాణము 12. అగ్నిపురాణము 13. నారదపురాణము 14. పద్మపురాణము 15. లింగపురాణము 16. గరుడపురాణము 17. కూర్మ పురాణము 18. స్కాందపురణము.

**986. చతురామ్నాయ శంకరపీఠములు ఎక్కడ ఉన్నాయి?**

జగద్గురు శ్రీ శంకరాచార్యులు అదిపీఠమగు కంచిలోని కామకోటి పీఠము నకు అదనముగా భారతదేశములోనాల్గు దిక్కుల యందును నాలుగు శంకర పీఠములను నెలకొల్పియుండిరి. 1. పశ్చిమమున ద్వారకయందు శారదా (కాళికా) మఠము 2. తూర్పున పూరీ యందు గోవర్ధనమఠము

MOHAN PUBLICATIONS.COM

3. ఉత్తరమున బదరీనాథ్ నందు శ్రీ మఠము (జ్యోతిర్మఠము) 4. దక్షిణమున శృంగేరి యందు శారదా మఠము.

### 987. నాలుగు మహావాక్యములు ఏవి?

ప్రజ్ఞానం బ్రహ్మ సాధన వాక్యము-ఋగ్వేదం; అహం బ్రహ్మాస్మి అనుభూతి వాక్యము-యజుర్వేదం; తత్వమసి-ఉపదేశ వాక్యము-సామ వేదం; అయ మాత్మా బ్రహ్మ సర్వానుభవ వాక్యము-అధర్వవేదం.

### 988. ఏ దేవుడు పూజిస్తే ఏ ఫలితము కలుగుటుంది?

శివుడు-ఆయుర్దాయము,ఐశ్వర్యము, శుభములు; విష్ణువు-జయము, మోక్షము; విఘ్నేశ్వరుడు-విద్య, యత్నకార్యసిద్ధి; లక్ష్మీదేవి-ధనధాన్యసిద్ధి, శుభసంతోషములు; ఆంజనేయస్వామి-బలము, నిర్భయత్వము, కార్యసిద్ధి; వెంక టేశ్వరస్వామి-అభీష్టసిద్ధి; దక్షిణామూర్తి-మేధ, జ్ఞానము, యశస్సు; సూర్యుడు- ఆరోగ్యము,కీర్తి; చంద్రుడు-మనశ్శాంతి, సత్త్వభావము, ధన ధాన్యవృద్ధి; కుజుడు-ధైర్యము,శత్రుజయము,ఋణవిమోచనము; బుధుడు-బుద్ధికుశలత, బంధుమిత్రత, వ్యాపారవృద్ధి; గురుడు-ధనము, విద్య,గౌర వము, కుటుంబవృద్ధి,శుభకార్యసిద్ధి, సువర్ణలాభము;శుక్రుడు- సుఖదాంప త్యము, భోగభాగ్యములు; శని-ఆయుర్దాయము, కార్యానుకూలత, పీడల నుండి విముక్తి; రాహువు- దారిద్ర్యబాధానివారణ, అదృష్టభాగ్యము; కేతువు-చోర, అగ్నిపైశాచిక బాధలనివారణ, జ్ఞానవృద్ధి,మంత్రసిద్ధి,పుణ్య తీర్థసేవ నము. ఏలినాటిశనితొలగుటకు శ్రీవిష్ణుసహస్రనామములను పఠించుట మంచిది.

### 989. ద్వాదశ మాసములందు గణేశోపాసనములు ఏమిటి ?

చైత్రమాసమునందు వాసుదేవ రూపముతో, వైశాఖమాసమునందు సంకర్షణరూపముతో, జ్యేష్ఠమాసమునందు ప్రద్యుమ్నరూపముతో, ఆషాఢ మాస మునందు అనిరుద్ధ రూపముతో, శ్రావణమాసమునందు బహుల యను పేరుతో భాద్రపదమాసమందు సిద్ధివినాయకునిపూజిస్తారు. ఆశ్వ యుజ మాసమందు కపర్దీశఅనుపేరుతో, కార్తీకంలో క్రకరచతుర్థీవ్రతం, మార్గశీర్షంలో చతుర్వర్ణ వ్రతం, పుష్యంలో విఘ్నవినాయకవ్రతం, మాఘంలో సంకష్టహర గణేశవ్రతం, ఫాల్గుణంలో ఢుండీ వినాయకవ్రతం చేస్తారు. మంగళవారము చతుర్థీ తిథితో కలిసి వచ్చినచో దానిని అహంకార చతుర్థిగా చెప్తారు. ఇతి చాల ఫలదాయక మైనదిగా ప్రతీతి. అలాగే ఆదివారమునాడు వచ్చే చతుర్థికూడా ఫలదాయక మైనదే.





### 990. వేదాంగములు ఎన్ని ? అవి ఏవి ?

వేదాంగములు 6 అవి 1 శిక్ష: వేదమందలి అక్షరములను, స్వరము లను ఉచ్చరించురీతిని వివరించి చెప్పేది. 2.వ్యాకరణము:సుశబ్ద, అపశబ్ద ములను బోధించును. 3.ఛందస్సు :మంత్రములందుగల వృత్త విశేషము లను తెలియచేయును. 4. నిరుక్తము : మంత్రములందు గల కఠినపదముల భావమునుబోధించును. 5. జ్యోతిషము : ఆయాకాలములందు చేయవల సిన యజ్ఞయాగాది విధులకు సంబంధించిన కాల విశేషములను తెలియ చేయును. 6.కల్పము : మంత్రములుపఠించుచూ చేయవలసిన కార్యక్రమ ములను బోధించును. ఉపనిషత్తులు:ఉపనిషత్తులకు మరొకపేరు వేదాంత ములు. ఆత్మ, అనాత్మ, జీవుడు, జీవేశ్వరుల సంబంధము మొదలగు ప్రశ్నల గురించి చర్చలు జరుపగా లభించిన జవాబులే ఉపనిషత్తులు ఇవి 108గా పేర్కొన్నారు. ఇందు 10 ఉపనిషత్తులు మాత్రము శంకరాచార్యులవారి కాలమున అంగీకారము పొందినట్లు తెలియుచున్నది.

### 991. దేవయజ్ఞం (వైశ్వదేవం) అనగా ఏమిటి ?

ఏ మహాశక్తి దయవల్ల మనం అన్నం తింటున్నామో ఆ మహాశక్తికి లేదా ఆ పరమేశ్వరునకు నివేదించి లేదా అర్పించి కృతజ్ఞతను చూపించడం కోసమే ఈ దేవయజ్ఞం ఉద్దేశింపబడింది. పంచ మహాయజ్ఞాలతో కూడినదే వైశ్వదేవం అని పెద్దలఅభిప్రాయం. ఇది గృహ్యాగ్నిలోకాని, మామూలు అగ్నిలోకాని చేయాలని, అగ్నిలేకపోతే నీళ్ళలోగాని, వట్టినేలపైగాని జరుపు కోవాలని శాసనం. ఇందులో సమస్త దేవతలకు బలి (పూజ) ఉంటుంది. తాను తినక పోయినా చేయాలని అపరార్కుడన్నారు. వైశ్వదేవం చేయకపోతే రోజంతా ఉపవాసం ఉండాలన్నారు. దీనివల్ల ఆహారశుద్ధి ఏర్పడుతుందని పెద్దలమాట. ఇది ప్రొద్దున్న, సాయంకాలం కూడా ఉంటుంది. గౌతముని మతప్రకారం వైశ్వదేవంలో అగ్ని ధన్వంతరి విశ్వేదేవుల ప్రజాపతి స్విష్టకృత్ దేవతలకు పూజయుండగా మనువుప్రకారం అగ్నిసోముడు అగ్నీషోములు విశ్వేదేవతలు ధన్వంతరి కుహూఅనుమతి ప్రజాపతి ద్యావాపృథ్వులు స్విష్టకృత్ మొదలగు దేవతలకు పూజ.

సాయంకాలం భార్యయే మంత్రాలు లేకుండా చేయవచ్చుని ఉంది. ఇది మొదటి మూడువర్ణాలవారి మాట. మిగిలినవారికి ఆ దేవతలను ఉచ్చరిస్తూ చివరనమః అనిచేర్చి పచ్చిద్రవ్యాలతో చేయాలనివుంది. ఇందులో

MOHAN PUBLICATIONS.COM

మినుము, సెనగ, కొఱ్ఱలు, బటానీ, ఉప్పు, నూనెతో చేసినవి, పాడైపోయిన పదార్థాలను విసర్జించాలి. ఆహారం అర్పించలేనివాడు పండ్లతోగాని, వేరులతో గాని, నీళ్ళతో గాని చేయవచ్చు. వైశ్వదేవం చేయలేకపోతే కనీసం ఆ మంత్రాలను చదివినా ఫలం ఉందన్నారు.

## 992. తాంబూలంవల్ల ఉపయోగము ఉన్నదా ?

భోజనం తరువాత తాంబూలం వేసుకోవాలి. సంసార సుఖం అనుభవించేటప్పుడు, నిద్రనుండి లేచినతరువాత, స్నానం చేసిన తరువాత, యుద్ధంలో పండిత సభల్లో తాంబూలాన్ని సేవించాలని భావప్రకాశవాక్కు. గాయాలతో బాధపడేవారు, కంటిరోగాలతో ఉన్నవారు, విష,మూర్ఛ,మద, క్షయాది రోగాలతో బాధపడేవారు వేసుకోకూడదని అష్టాంగ హృదయం చెబుతోంది.

ఇది కామాన్ని వృద్ధిచేస్తుంది. నోటి అరుచిని పోగొడుతుంది. శ్లేష్మాన్ని పోగొట్టడం,నాలుకను, ఇంద్రియాలను నిర్మలంగా చేయడం దీని గుణాలు. జీర్ణశక్తికి మంచిది. పసుపురంగుతో కూడిన తెలుపురంగు గలిగిన ఆకులు మంచివన్నారు. ఇందులో వేసే కవిరి, కఫ, పిత్తాలను, సున్నం వాతశ్లేష్మాలను హరిస్తాయి. ప్రొద్దున్న పోకచెక్క ఎక్కువ వేసుకోవాలి. మధ్యాహ్నం కవిరి హెచ్చుగా వేసుకోవాలి. రాత్రిసున్నం ఎక్కువగాను ఉండాలి. ఆకుయొక్క తొడిమి తింటే వ్యాధి, చివరతింటే పాపం, మధ్యలోఉన్న ఈనెలు నమిలితే బుద్ధిపోతాయి కాబట్టి తొడిమి, చివరిభాగం, ఈనెలు లేకుండా చూసుకోవాలని భావప్రకాశ వ్యాఖ్య, నమిలేటప్పుడు, మొట్టమొదట వచ్చే రసం విషంతో సమానం కాబట్ట ఉమ్మివేయాలి. రెండవసారి కష్టంగా జీర్ణం అవుతుంది. కాబట్టి అదీ పనికిరాదు. తరువాత మింగాలి. అమృతంతో సమానం. ఒక వక్కతో తాంబూలం ఆరోగ్యాన్నిస్తుంది. రెండు వక్కలు పనికిరాదు. మూడు వక్కలతో మంచిది. సున్నం ఉంచిన ఆకును వేసుకోకూడదు అని పరాశరుని వాక్కు. జాజికాయ, లవంగాలు, పచ్చకర్పూరం, తక్కోలం, మిరియాలు, వక్కతో కూడిన లేత తమల పాకులు వేసుకోవాలి. వట్టి వక్కలు తినకూడదు. ముందు వక్క వేసుకున్న తరువాత తమలపాకులు నమలకూడదు. సున్నం బొటన వేలితోగాని, మధ్యవేలుతోగాని రాసుకోవాలి. దానివల్ల ఆయుర్దాయం ఫలం అన్నారు. ఆకలితో ఉన్నప్పుడు, విరేచనాలకు మందు వేసుకున్నవారు వాడకూడదు.

MOHAN PUBLICATIONS.COM





## 993. రజస్వలా ధర్మాలు ఏమిటి ?

స్త్రీ బయట ఉన్నపుడు పెక్కు నియమాలు పాటించాలని ధర్మశాస్త్రకారులు, వైద్యులు గట్టిగా చెప్పారు. ఇవన్నీ ఆరోగ్యానికి సంబంధించినవి. మంచి సంతానం కలగడం కోసం ఈ నియమాలను పాటించాలన్నారు.

బయట ఉన్నస్త్రీతో కలిసేదొంగ, ఆమెతో మాట్లాడితే సిగ్గుకలవాడు, ఆమె ఆ రోజుల్లో స్నానం చేస్తే పరుపడి చనిపోయేవాడు, తలంబు పోసుకుంటే శ్వేత (బొల్లి) కుష్ఠ మొదలగు రోగాలతో పుట్టేవాడు, నేలమీద రాసినచో బట్టతలకలవాడు, కాటుక పెట్టుకుంటే గుడ్డివాడు, పండ్లుతోముకుంటే పుప్పి దంతాలు కలిగినవాడు, కుట్టితే నసంపుకుడు, ఆకులతో నీళ్ళుతాగితే పిచ్చివాడు, తాళ్ళుపేనితే ఉరిపోసికొని పోవువాడు, చిన్నచెంబుతో తాగితే మరుగుజ్జువాడు, ఇట్లా చెడ్డ సంతానం కలుగుతుందని పెక్కు నియమాలను చెప్పింది యజుర్వేదం.

పైనియమాలను మూడు రోజులు పాటించాలి. చేతులతోగాని, నిప్పులో వేయని మూకుడులోగాని నీళ్లు తాగాలి. ఇత్తడి పాత్రలో నీటిని తాగవచ్చుని, బట్టలు ఉతక్కూడదని, నాల్గవరోజున వడ్లుదంచాలని బృహదారణ్యక ఉపనిషత్తు చెబుతోంది. నేలపై పడుకోవాలి. పగలు నిద్రపనికిరాదు. మాంసం తినకూడదు. గ్రహాలను చూడకూడదు. గట్టిగా నవ్వకూడదనే నియమాలు వసిష్ఠధర్మ సూత్రా లులలోఉన్నాయి.

చేతినేపాత్రగా చేసుకొని భుజించవచ్చని లఘుహారీత స్మృతి. రజస్వల స్త్రీలు ఒకరినిఒకరు తాకకూడదు. దోసిలితోగాని, ఇనుపపాత్రతోగాని నీటిని తాగాలని రాగిపాత్రతో తాగకూడదని వైఖానస్య గృహ్య సూత్రాలులో ఉంది. నీళ్ళు పోసుకున్న తర్వాత అంటే నాల్గవరోజున ఇతరులతో మాట్లాడకుండా తన భర్తముఖాన్నే చూడాలనే నియమంవుంది అట్టి సందర్భంలో ఏ పురుషుణ్ణి చూస్తే అట్టిసంతానమే కలుగుతుందని శాస్త్రాలు చెబుతున్నాయి.

## 994. 'శ్రీ'కారం అనగా ఏమిటి ?

"శ్రీ" లక్ష్మీప్రదమైనది, మంగళకరమైనది, మంగళకరమైనది, మోక్షదాయకమైనది. శ్రీకారమున శవర్ణ, రేఫ, ఈ కారములుచేరి, శ్రీ అయినది. శవర్ణ ఈ కారములకు లక్ష్మీదేవి అధిదేవత. రేఫమునకు అగ్నిగదేవుడు దేవత. 'శ్రియమిచ్ఛేద్దు తాశనాత్' అనుపురాణ వచనానుసారంగా 'అగ్ని'యీ లక్ష్మీ ప్రదుడే, శుభకరుడే. ఇలా శ్రీలో గల మూడు వర్ణములకు శుభదేవతలే

MOHAN PUBLICATIONS.COM

కారకు లైరి. 'శ'వర్ణమునకు గ్రహం గురుడు. 'రేఫ' 'ఈ' కారములకు గ్రహాలు 'గురుడు' 'శుక్రుడు' గురు,శుక్ర గ్రహములు రెండూ శుభకరులే కావున 'శ్రీ' శుభాన్ని సూచిస్తుంది. శుభాన్ని కోరుతుంది. నిఘంటువులో 'కమలా శ్రీర్హరిప్రియా' అని ఉంది. లక్ష్మి నామములలో 'శ్రీ' ఒకటి అని తెలియుచున్నది. కావున శుభవాచకమైనది.

ఇన్ని విధాలుగా శ్రీ సర్వశ్రేష్టవాచకమైనది. ప్రతి శుభకార్యమునకు, శ్రీకారము తలమానికమై వెలుగొందుచున్నది. శ్రీ శుభసూచికయే కాదు, గౌరవ ప్రదమైనది కూడా. ఏ మతమందైననూ, ఏ ప్రాంతమునందైననూ, ఏ భాషయం దైననూ శ్రీ అనుపదం గౌరవ సూచకంగా, శుభసూచకంగా వాడుతుంటారు. దీనిని బట్టి శ్రీకారమునకు ఎంతటి ఉన్నతమైన స్థాన మున్నదో అర్థమవుతుంది.

### 995. శ్రీ కృష్ణుని పేర్లు ఏమిటి ?

సజ్జనులను తన గుణసంపదచేత రమింపజేస్తాడు కాబట్టి రాముడు. బలంలో అధికుడు కాబట్టి బలుడు. అందరికీ ఐకమత్యం సంకర్షిస్తాడు కాబట్టి సంకర్షణుడు. ద్వాపరయుగంలో భగవంతుడు కృష్ణవర్ణంలో ఇలా జిన్మంచాడు గాబట్టి కృష్ణుడు. వసుదేవునికి జన్మించాడు కాబట్టి వాసుదేవుడు, నందుని ఇంట పెరిగాడు గాబట్టి నందనందనుడు, ఆయన చేసిన కృత్యాలనుబట్టి, గుణాన్ని బట్టీ గోవర్ధనుడూ, గోవిందుడూ ఇలాంటి ఎన్నో పేర్లతో కృష్ణుడు పిలువబడుతున్నాడు. "ఇతడు శ్రీమన్నారాయణుడే అని తెలుసుకొని పెంచు" అని కృష్ణునికి నామకరణం జరిపిన గర్గాచార్యుడు నందునికి ఈ విషయాలను తెలియజేశాడు.

### 996. దీపారాధన-పూజా సమయం నియమ నిబంధనలు ?

దీపం పరబ్రహ్మ స్వరూపం, దీపారాధన చేయకుండా దేవతారాధన చేకూడదు.సాధారణంగా పూజసమయంలో రెండు దీపపు కుందెలు వాడాలి. ఒకటికూడా వాడవచ్చు. ప్రతి కుందెలో రెండేసి వత్తులు ఉండాలి. ప్రతిరోజూ కాలినవత్తులు, మిగిలిన నూనె తీసివేస్తూ ఉండాలి. కొంతమంది ఒక్కొక్క దేవునికి ఒక్కొక్క నూనె వాడాలని అనుకుంటారు. కానీ ఇది సరైనది కాదు. పూజామందిరంలో దీపారాధనకు ఒకేనూనెను వాడాలి. ఆవునెయ్యి అన్నింటికంటే శ్రేష్ఠమైనది. ఇది రోజూ వాడడానికి వీలుకాకపోవచ్చు. నువ్వులనూనె అందరు దేవుళ్ళకూ మంచిది. మంగళకరమైనది, ఆరోగ్యకర





మైనది, వేరుశనగ, రిఫైన్డ్ఆయిల్, డాల్డాల వంటివి దీపారాధనకు పనికి రావు. పూజ మధ్యాహ్నం లోపున భోజనానికి ముందు ఎప్పుడైనా చేయవచ్చు. ఉదయం వాతావరణం ప్రశాం తంగా, ఆహ్లాదకరంగా ఉంటుంది కాబట్టి పూజకు మానసిక ప్రశాంతత కలుగుతుంది. సూర్యోదయంలోపు యోగాస నాలు,స్నానం,జపం,ధ్యానం, స్తోత్రపాఠం, సూర్యోదయంవేళ సంధ్య, ఆదిత్య హృదయంపటనం, సూర్యోదయం తర్వాత పూజ, నివేదన, మంగళహారతి ముగించి కుటుంబ సభ్యులు, బంధుమిత్రులకు తీర్థప్రసాదాలు ఇవ్వాలి.

### 997. దేవాలయ దర్శనం, చేయవలసిన విధులు ?

మొదట పుష్కరిణినది, లేదా కుళాయినీరుతో అయినాసరే కాళ్ళు కడు క్కుని తలమీద నీళ్ళుచల్లుకోవాలి. బొట్టుపెట్టుకొని క్షేత్రపాలకుడిని దర్శిం చాలి. గుడికి ప్రదక్షిణం తరువాత ధ్వజస్తంభం ముందు సాష్టాంగనమస్కారం చెయ్యాలి. అటుతరువాత ముఖమండపంలో గరుడుని లేదా నందిని లేదా ఆంజనేయుని దర్శించాలి అదివిష్ణాలయమైతే, అదేసమయంలో ఆళ్వారు లను దర్శించాలి. తరువాత అమ్మవారిని దర్శించి ద్వారపాలకులకు నమస్క రించి గర్భగుడిలో స్వామిని (మూలవిరాట్టును) పూజించాలి. భక్తితో స్వామి స్వాయరూపధ్యానం చెయ్యాలి. స్వామి మంగళహారతికి నమస్కరించి, తీర్థప్రసాదాలు తీసుకొని, ముఖమండపంలో కాసేపు కూర్చుని మానసిక ప్రశాంతతను అనుభవించి, తదుపరి వెలుపలికి రావాలి. గుడిలో ఎప్పుడు పడితే అప్పుడు గంటలు మ్రోగించ కూడదు. భక్తుల ధ్యానానికి భంగం కలిగించకూడదు. ఇలా చేస్తే దేవాలయ దర్శనం మనశ్శాంతినిస్తుంది.

### 998. షోడశ గణపతులు అనగా ఎవరు ?

1. బ్రహ్మగణపతి 2. విష్ణుగణపతి 3. హేరంబ గణపతి 4. లక్ష్మీగనపతి 5. మహాగణపతి 6. తాండవ గణపతి 7. ధుండీ గణపతి 8. ద్విముఖగణపతి 9. త్రిముఖ గణపతి 10. యోగగణపతి 11. వల్లభ గణపతి 12. హరిద్రా గణపతి 13. ఉచ్ఛిష్ట గణపతి 14. వీరగణపతి 15. విజయ గణపతి 16. సిద్ధ గణపతి.

### 999. ఏకవింశతి గణపతులు (21) అనగా ఎవరు ?

1. లక్ష్మీగణపతి 2. సిద్ధిగణపతి 3. చింతామణి గణపతి 4. ఏకదంత గణపతి 5. వక్రతుండ గణపతి 6. లక్ష్మీప్రద గణపతి 7. నింబ గణపతి 8. లంబోదరగణపతి 9. ఋణవిమోచన గణపతి 10. శుక్ల గణఫతి 11.

ధూమ్రగణపతి 12. కృష్ణగణపతి 13. రక్తగణపతి 14. సువర్ణగణపతి 15. విష్ణుగణపతి 16. నిర్విఘ్న గణపతి 17. వికటగణపతి 18. బాలచంద్ర గణపతి 19. అంబరగణపతి 20. బాలగణపతి 21. శక్తి గణపతి.

### 1000. చతుస్ త్రింశత్ 34 గణపతులు ఎవరు ?

1. బాలగణపతి 2. తరుణ గణపతి 3. భక్తగణపతి 4. వీరగణపతి 5. శక్తిగణపతి 6. ద్విజగణపతి 7. సిద్ధగణపతి 8. ఉచ్ఛిష్టగణపతి 9. విఘ్న గణపతి 10. క్షిప్రగణపతి 11. హేరంబగణపతి 12. లక్ష్మీగణపతి 13. మహాగణపతి 14. విజయగణపతి 15. నృత్య గణపతి 16. ఊర్ధ్వ గణపతి 17. ఏకాక్షర గణపతి 18. వర గణపతి 19. త్ర్యక్షరగణపతి 20. క్షిప్రతప్రదాయక గణపతి 21. హరిద్రాగణపతి 22. ఏకదంత గణపతి 23. సృష్టి గణపతి 24. ఉద్దండ గణపతి 25. ఋణవిమోచన గణపతి 26. ఢుండి గణపతి 27. ద్విముఖ గణపతి 28. త్రిముఖ గణపతి 29. సింహగణపతి 30. యోగగణపతి 31. దుర్గా గణపతి 32. సంకట హర గణపతి 33. వల్లభగణపతి 34. సిద్ధి బుద్ధి గణపతి.

### 1001. శకునం బాగాలేనపుడు, ఏం చేయాలి ?

సాధారణమైన పనులు, నిత్యకృత్యముల విషయములలో ఫరవాలేదు. కానీ, ముఖ్యమైన పనులమీద బయలుదేరేటప్పుడు దుశ్శకునములు కలిగినపుడు కొద్దిసేపు ఆగి, కాళ్ళుచేతులు కడుగుకొని, నోట్లో నీళ్ళుపోసుకొని మూడుసార్లు ఉమ్మివేయాలి. నీటితో కళ్ళను తుడుచుకొని పూజామందిరము వద్ద లేదా ఎక్కడ ఉన్నాసరే తూర్పుదిశగాచూస్తూ తమ ఇష్టదేవతను స్మరించుకొని, బయలు దేరాలి. ఒకటికి రెండుసార్లు బయలుదేరగానే దుశ్శకునములు ఎదురైతే ఆ పని అప్పటికి ఆపటం మంచిది.

### 1002. చెడు కలలు వచ్చినపుడు ఏం చేయాలి ?

దుస్వప్నములు కలిగినపుడు ఆ కలిగిన సమయాన్ని బట్టి ఫలితము ఉంటుంది. తెల్లవారుజామున కలిగే ఫలితాలు సత్వరంగా ఫలించును. రాత్రివేళ వచ్చే కలల ఫలితం కొంత ఆలస్యంగా ఉంటుంది. అనారోగ్యంతో ఉన్నపుడు ఒకేవిషయం గురించి, ఎక్కువగా ఆలోచించేటప్పుడు ఆ విషయాలు స్వప్నంలోవస్తే పెద్దగా దోషం ఉండదు. అలాకాకుంఆ తనకు లేదా తనవారికి ఇబ్బంది ఉన్నట్టు లేదా స్వప్న శాస్త్రం ప్రకారం దుష్ఫలితాలు కలిగించే కలలు వచ్చినపుడు వెంటనే నిద్రమేల్కొంటే, దుర్గా అమ్మవారిని





స్మరించుకోవటం చేస్తేసరిపోతుంది. మరసటిరోజు ఉదయం తలస్నానంచేసి, కనీసం మూడురకాల నూనెలు (ఉదా:- ఆవునెయ్యి, నువ్వులనూనె, ఆముదము) కలిపి మీఇష్టదేవతముందు దీపం వెలిగించాలి. దుస్వప్న దోషపరిహారం కోసం ఉప్పులేదా గుమ్మడికాయ లేదా నిమ్మకాయ పూజసమయంలో అచ్చట ఉంచి తర్వాత దూరంగా పారవేయాలి.

### 1003. యాత్రకు వెళితే పాత్రలు తేవాలి నిజమా ?

ప్రాచీన కాలంలో తీర్థయాత్రలకు వెళ్లాలంటే అదొక పెద్ద తతంగంగా ఉండేది. కాలినడకన లేదా ఎడ్లబండిపై లేదా గుర్రపుస్వారీచేస్తూ యాత్రలకు వెళ్ళేవారు. దారిలో అవసరమైన తినుబండారాలు తీసుకువెళ్ళినా అవి కొంత కాలమే వస్తాయి. కాబట్టి తరువాత భోజన అవసరాలకోసం తాము ఉన్న ప్రాంతంలలో అవసరమైన పాత్రలు, సామాగ్రి కొనుగోలుచేసి, వాటి ఆధారంగా వంట చేసుకొనేవారు. తిరుగు ప్రయాణంలో ఆ పాత్రలు అచట వదిలివేయలేక శక్తిగలవారు తీసుకొనివచ్చేవారు. కొందరు అక్కడే ఎవరికైనా దానం చేసేవారు. పదేపదే అనేకమంది అలాచేయడంవల్ల వాడుకలో యాత్రకు వెళితే పాత్రతేవాలి అని నానుడి ఏర్పడింది. తేవాల్సిన అవరంలేదు. కాని మీరు వెళ్లిన పవిత్ర స్థలంలో స్థలపురాణం, ఇష్టదేవతల ప్రతిమలు, అచ్చటి తీర్థప్రసాద, కుంకుమ మొదలైనవి తెచ్చుకుంటే సరిపోతుంది.

### 1004. ప్రపంచంలో పవిత్రమైన వస్తువులేవి ?

ప్రపంచంలో 1. గంగాజలం 2. అగ్నిహోత్రుడు 3. దర్భలు 4. విభూతి ఇవి పవిత్రమైనవి. అగ్ని-దేవతలకు హవిస్సు నందించుటచే పవిత్రుడు. దర్భలు- గరుత్మంతునిచే అమృతం పెట్టబడుటచే పవిత్రమైనవి. గంగాజలం - గోముఖ మునుండి వచ్చుటనే పవిత్రమైనది. విభూతి-శివుని ధారణచే పవిత్రమైనది.

### 1005. పూజ ప్రారంభమునకు ముందు పాటించవలసిన కనీస నియమాలు తెలపండి ?

మగవారి విషయంలో నిత్యం తలస్నానంచేసి పూజకు ఉపక్రమించాలి అనే నియమంవుంది. ఆడవారు కేవలం శుక్రవారం తలంటుపోసుకోవాలి. మిగిలిన రోజులలో పసుపునీళ్ళు నెత్తినచల్లుకోవాలి. పూజకు ప్రత్యేక వస్త్రం

MOHAN PUBLICATIONS.COM

ప్రతిరోజూ ఉతికిఆరవేసుకోవాలి. పూజకు ఉపక్రమించినది మొదలు పూజ అయ్యేవరకు మనకు కావలసిన సామాగ్రి ప్రక్కనే వుంచుకోవాలి. పూజ మధ్యలో లేవకూడదు. మరియు యితర విషయాల గురించి చర్చించ కూడదు. దీపారాధన, నివేదన, భక్తిలేని పూజలు వ్యర్థం. అసనం వేసుకొని కూర్చోవాలి. మనకంటే వున్నత ఆసనంమీద దేవుడు వుండాలి. పూజా సమయంలో యితరులకు నమస్క రించరాదు. మగవారు శైవులు విభూతి, వైష్ణవులు నామం పెట్టుకోకుండా పూజచేయరాదు. ఆడవారు నుదుట కుం కుమ, కాళ్ళకు పసుపులేకుండా పూజచేయరాదు. కావున పసుపు కుంకుమ ధారణ స్త్రీలకు తప్పనిసరి. పూజా సమయంలో ఆడవారు బొట్టుబిళ్లలు ధరించుట శ్రేయస్కరం కాదు. పూజచేసిన తరువాత ఆసనంతీయకపోయినా, నిద్రనుండి లేవగానే పక్కబట్టలు తీయకపోయినా దరిద్రం వస్తుంది. అని పెద్దలు చెబుతారు.

## 1006. శ్రీ వేంకటేశ్వరుని బాలాజీ అని ఎందుకు అంటారు?

శ్రీ వేంకటేశ్వరస్వామిని తొలిరోజులలో అరణ్యాలలోని శబరులు శక్తి స్వరూపిణిగా ఆరాధించారు. ఇప్పటికీ స్వామి విగ్రహానికి వెనుక స్త్రీలముడి వంటి ముడి ఉన్నదని కొందరు చెబుతారు. కనుక ఆమెను బాలాత్రిపుర సుందరిగా భావించారు. వైష్ణవాలయాలలో ఎక్కడాలేని విధంగా దసరా పండుగకు స్వామివారి బ్రహ్మోత్సవాలు నిర్వహించబడటం, దేవాలయంపై అమ్మవారి వాహననమైన సింహాల బొమ్మలు నలువైపుల ఉండటం– ఇటువంటివన్నీ ఆ వాదానికి బలంచేకూర్చాయి. దసరా శక్త్యారాదన పర్వం కదా! కనుక బాలాత్రిపుర సుందరి నామాన్ని భక్తులు ముద్దుగా 'బాల' అని పిలుస్తారు. అందువల్ల ఔత్త రాహులు 'బాలాజీ' అని అంటారు. రామానుజులవారువచ్చి ఈయన విష్ణువని ప్రతిపాదించి నిర్థరించకపూర్వం స్వామికి ఆరుమాసాలు శివపూజ, ఆరుమాసాలు విష్ణుపూజ నిర్వహింప బడేవి. 'ఏకంసత్ విప్రాబహుధావదంతి' పరమాత్మ ఒక్కడే. పండితులు భిన్నస్వరూపాలుగా చెబుతున్నారని వేదవాక్యం. సర్వదేవతా స్వరూపం వేంకటేశ్వరస్వామి.

## 1007. ధర్మరక్షణ అంటే ఏమిటి ? ఆచరించే విధానాన్ని తెల్పండి?

ధర్మం అంటే దైవానికి ప్రతిరూపం. పురుషార్థాలు నాలుగు. 1. ధర్మం 2. అర్థం 3.కామం 4.మోక్షం. దైవప్రతిపాదకమైన ధర్మశబ్దం పురుషార్థాలలో





ముందు చెప్పబడింది. ధర్మబద్ధంగా డబ్బు సంపాదించి, దానితో ధర్మబద్ధమైన కోరికలు తీర్చుకొని, తద్వారా మోక్షం పొందుమని ఆక్రమానికర్థం. వాల్మీకి మహర్షి ధర్మోరక్షతి రక్షితః అన్నారు. ధర్మాన్ని మనం రక్షిస్తే ధర్మం మనందరినీ రక్షిస్తుంది. ధర్మశబ్దంతోనే భగవద్గీతా శాస్త్రం ప్రారంభమైనది. ధర్మమంటే ఏమిటో భారతంలో ఒకేపద్యంతో వ్యక్తం చేశాడు తిక్కన మహాకవి. ఇతరులు నీకేమిచేస్తే నీకు బాధకలుగుతుందో ఆ పనిని నీవు ఇతరులకు చేయకుండా ఉండటమేధర్మం. ధర్మస్వరూపాన్ని తెలిసికొని, దానిని పాటిస్తూ మంచి ప్రవర్తనతో, ధర్మాన్నిరక్షించాలి. వేదం, 'సత్యంవద ధర్మంచర' 'మాతృదేవోభవ –పితృదేవోభవ'వంటి ధర్మాలను చెప్పింది. ధర్మం సర్వకాలాలకు, సర్వజాతు లకు, సర్వదేశాలకు ఒక్కటిగానే ఉంటుంది. నీతి కాలాన్నిబట్టి, జాతినిబట్టి, దేశాన్నిబట్టి మారుతుంది. గురునిర్దేశిత సత్ప్రవర్త నతో ధర్మాన్ని రక్షించాలి.

## 1008. వివాహసమయాల్లో జీలకఱ్ఱ బెల్లం పెట్టడానికి కారణమేమి?

భారతీయుల సంప్రదాయాలు, మతపరంగా–విజ్ఞానశాస్త్రపరంగా పూర్వులుఏర్పాటు చేశారు. భారతీయులతత్త్వమే ఇహపరసాధకం కావాల నేది. జీలకఱ్ఱ, బెల్లం కలిపి నూరితే అది విడదీయటానికి వీలుకానంత బంధంతో కలిసిపోతుంది. ఈ వివాహబంధం భార్యాభర్తలను అదేవిధంగా ఒక్కటిగా కలిపి ఉంచాలనేది సంకేతం. బెల్లం మధురం. జీలకఱ్ఱ క్షారం. జీవితం కేవలం తీయనైనదేకాదు బాధలనే కారం కూడా కలిసి ఉంటుంది. సుఖకష్టాల మిశ్రమ స్వరూపం సంసారమని సంకేతం. పెండ్లిరోజు భార్యా భర్తలు నిరాహారులుగా ఉంటారు. వారికి కొంత పైత్యవికారం కూడా కలుగవచ్చు. నెత్తిమీద బ్రహ్మ రంధ్రం ఉంటుంది. అక్కడ గనుక జీలకఱ్ఱ బెల్లం ఉంచితే నాడుల ద్వారా శరీరంలోకి ప్రవేశించి, ఆ పైత్య ప్రకోపాన్ని శమింప చేస్తుంది. జీలకఱ్ఱ బెల్లం ఆయుర్వేదపరంగా ఆరోగ్యానికి మంచిగుణం కలిగినది.

## 1009. చంద్రుని తల్లిదండ్రులెవరు ?

చంద్రుని జననం గురించి వేరు వేరు విధాలుగా పురాణాలు చెప్పాయి. అత్రి మహర్షి అనసూయతో రతిక్రీడసలుపుతుండగా ఆయనకు రేతస్సు పతనమయింది. వాయుదేవుడు దానిని మూడుభాగాలుగా చేశాడు. అందులో ఒక భాగం అత్రికంటి యందు ప్రవేశించింది. ఆ కంటినుండి బ్రహ్మాంశతో చంద్రుడు జన్మించాడని మార్కండేయపురాణం చెబుతున్నది.

MOHAN PUBLICATIONS.COM

అత్రి తపస్సు చేస్తున్నాడు. ఆయన నేత్రాలనుండి గొప్ప తేజస్సు వ్యాపించింది. ఆ కాంతిని దశదిక్కులు ధరించాయి. కాని ఆ తేజస్సును భరించలేక దిక్కులు దానిని సముద్రంలో వెడలగ్రక్కినవి. ఆతేజస్సు నొకచోట చేర్చి బ్రహ్మ దానికొక పురుషరూపమిచ్చినాడు. దేవతలప్పుడు సోమమం త్రంతో ప్రార్థించగా సముద్రం నుండి చంద్రుడుద్భవించాడు. ఇది మత్స్య పురాణ కథనం. ఈతడు విష్ణువు యొక్క ఎడమకన్ను.

దధిశంఖ తుసారాభం క్షీరార్ణవ సముద్భవమ్
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణమ్

పెరుగు, శంఖము, మంచులవలె తెల్లనైన కాంతి కలిగినవానిని, దేవ దానవులు చిలుకునప్పుడు పాలసంద్రంలో జన్మించినవానిని, శంకరుని శిరోభూషణమైన చంద్రుని గురించి నమస్కరించుచుంటిని.

**1010. భగవంతుని నామస్మరణ సర్వకాలసర్వావస్థలలో చేయవచ్చా?**

నిరభ్యంతరంగా చేయవచ్చు. 'కలౌ కేశవ కీర్తనమ్' అని ఉపనిషత్తులు చెబుతున్నది. ఎప్పుడైనా ఎక్కడైనా నామస్మరణ చేయవచ్చు. ఒకసారి ఒక శిష్యుడు రామానుజయతీంద్రుని ఒక ప్రశ్న అడిగారు. "స్వామీ! బహిర్దేశానికి వెళ్ళి కాళ్ళుకూడా కడుక్కోకుండా వస్తున్నాను. ముఖప్రక్షాళనం కూడ కాలేదు. అప్పుడే గుడిలో తీర్థప్రసాద వినియోగం జరుగుతున్నది. ఇప్పుడు నేను వెళ్ళి వానిని స్వీకరించవచ్చా?" అందుకు రామానుజ యతీంద్రులు 'దైవతీర్థ ప్రసాదాలవల్ల నీవు పవిత్రుడవౌతావు. నీవింటికి పోయి తాపీగా స్నానాదులు ముగించుకొని వచ్చేవరకు, తీర్థ ప్రసాద కార్యక్రమం ఆగదు కనుక ఎలా ఉన్నా పోయి వాటిని స్వీకరించటం ముఖ్యం.' అని సమాధానం చెప్పారు. కనుక స్త్రీలు ముట్టయిన కాలంలో కూడా దైవనామ స్మరణ చేయవచ్చును. అలాంటివేళ మహా మంత్ర పఠం మాత్రం కూడదు.

**1011. ప్రపంచాన్ని జయించగలిగే పన్నెండు గుణాలు ఏవి ?**

ప్రపంచాన్ని జయించి మానవోత్తముడు కావటానికి మనిషి 12 గుణాలను అవరచుకోవాలి. అవి 1.జ్ఞానము–తత్వార్థము తెలియుటు, 2. సత్యము–విశ్వహితమైన యదార్థము పలుకుట 3. దమము–మనో నిగ్రహము 4. శ్రుతము–ఆధ్యాత్మిక శాస్త్రము వినుట, 5. అమాత్సర్యము–జీవులయందు ద్వేషము లేకుండుట, 6.హ్రీః–అకార్యము చేయుటకు సిగ్గుపడుట 7.తితిక్షా– శీతోష్ణాది ద్వంద్వములనుసహించుట, 8. అనసూయ –పరదోషములను బయట పెట్టకపోవడం. 9. యజ్ఞవ–అగ్నిష్టోమాది మహా యజ్ఞములు 10.దానము – పాత్రత ఎరిగి దానంచేయుట 11. ధృతి–ఇంద్రియనిగ్రహము 12. శమము – అంతరింద్రియ నిగ్రహము తపస్సు ప్రాధాన్యం.





**1012. వేంకటేశ్వరస్వామి వడ్డీ చెల్లిస్తున్నారు, అసలు ఎప్పుడు తీరు తుంది?**

ఇది వేంకటాచల మహాత్మ్యంలో కన్పించే ఒకథ. మనంఆయన్ని ఎంత ఆరాధించినా ఆ పుణ్యంమొత్తం పూర్వజన్మపాపాలు తొలగడానికే సరిపోతుంది తప్ప, ఈ జన్మలో మనకంటూ పుణ్యాన్ని సంపాదించు కోడానికి సాధ్యపడదనే విషయాన్ని సంకేతరూపంగా చెప్పడమే–వడ్డీకే సరిపోతోంది తప్ప అసలు తీరడంలేదని అనడమంటే జీతం మొత్తం బాకీలతీర్చుడుకే సరిపోతే, ఇల్లు గడిచేదెలా ? అని అనుకున్నట్లన్నమాట.

**1013. ఎవరిని ప్రార్థించాలి ?**

"ప్రార్థన"అంటే "యాచనం" లేక అడగడం. ప్రార్థి అంటే వేడుకునే వాడు, అడిగేవాడు. కాబట్టి "ప్రార్థించు" అంటే "అడుగు" అనిఅర్థం. (సూ.ఆం.ని) ఇది ప్రాచ్యభాషలలోని వివరణ. దాదాపుగా ప్రపంచంలోని భాషలలోనూ ప్రార్థన (ఆయా భాషలలో సమానార్థకశబ్దాలు) అంటే వేడు కొనుట, యాచించుట అనిఅర్థం. అడగటం (వేడుకోవటం) అన్నది నిరూపిత మయింది కనక రెండవప్రశ్న ఎవర్ని అడగాలి అన్నది వస్తుంది. వేడుకునే వాడికి ఏదికావాలో అది ఇవ్వగలిగినవాడిని అడగాలి. నీరుకావాల్సి వచ్చినప్పుడు మేఘుణ్ణి అడగాలి. అంతేకాని అగ్నిని అడిగిలాభం లేదుకదా. అలాగే కావాల్సిన దానిని ఇవ్వగలిగినవాణ్ణే అడగాలి. అర్థిలోని దైన్యం, అవసరం గుర్తించగల ఆ భగవంతుణ్ణి ప్రార్థించాలి (అడగాలి) ఆయన మాత్రమే మనలోని నిజాయితీని దర్శించగలడు. ప్రార్థన చేయాల్సిన అవసరం ఏర్పడింది. అందుకే 'అర్థిఅవసరం' అర్థియొక్క మనస్సు భగవంతుడు మాత్రమే చూడగలడు. ఆయన సర్వాంత ర్యామి ప్రార్థన చేయగా చేయగా గాని అర్థిలోని 'అహం'పూర్తిగా నశించదు. అహం నశిస్తున్న కొలదీ "ప్రార్థనలో" తల్లీనత పెరుగుతుంది. ఆ తల్లీనత లక్ష్యసిద్ధివైపు ఏకాగ్రత చేకూరుస్తుంది. మనస్సును నిష్కల్మషంగా చేస్తుంది. అప్పుడు అర్థి ఆశయం ఫలిస్తుంది. ప్రార్థన చేయాలిసిన అవసరం "లక్ష్యం" వైపు చిత్తశుద్ధితో పయనించటానికే.

MOHAN PUBLICATIONS.COM

### 1014. మోక్షమనగా ఏమిటి ?

మోక్షమంటే అన్నిటినీ విడిచివేయగలడమే. (ముచమోచనే) అప్పటి వరకూ ఆ నాళంద్వారా ఆహారాసారాన్ని తీసుకుని పెరిగి పెద్దదైన దోసపండు తన ఆహారనాళం నుండి తాను వేరైనట్లు వ్యక్తి కూడ తానున్న బంధు,మిత్ర, గృహబంధాల నుండి తెగిపోయి ఇవతలికి రాగలిగితే అదిమోక్షమే. తనవారికి తన ఎదురుగా ఘోరకష్టం జరుగుతున్నా, చెప్పలేని అవమానం జరుగుతున్నా నాటకంలో ఎవరో ఒక పాత్రధారికి జరుగుతున్నట్టుగా భావిస్తూ ఏమాత్రపు చలనమూ లేకుండా విడివిడి ఉండడమే ఇహలోకమోక్షం. ఈ సాధన పెరిగినట్లైతే భగవదైక్యం తప్పదు. కుచేలుడు దీనికి గట్టిసాక్ష్యం.

### 1015. శివునికి మారేడు దళాలు అన్న ఎందుకిష్టం ?

ఏ దైవానికీ ఇవి ఇష్టం అవి అనిష్టం అని ఉండదు. బిల్వం (మారేడు) మూడు కన్నుల ఆకారంతో ఉన్న పత్రాలతో శంకరుణ్ణి పోలి ఉంటుందనీ, బిల్వాన్ని కోసాక 8 రోజులపాటే వాడుకోవడం తప్పుకాదు కాబట్టి ఆ 8 అంకె శంకరుని అష్టమూర్తి విదానాన్ని తలపిస్తోంది. కాబట్టీ, బిల్వభస్మం (ఆయుర్వే దంలోని ఔషధం) శరీరానికి జీర్ణలోపాన్నీ నిద్రమాంద్యాన్నీ తొలగిస్తుంది కాబట్టీ బిల్వం శంకరునికి ఇష్టమన్నారు పెద్దలు.

### 1016. చెన్నకేశవస్వామి శ్రీ మహావిష్ణువుని అవతారమా ?

నిజానికి అవతారాల సంఖ్య 22 అని భాగవతం చెప్పింది. ప్రత్యేక ప్రయోజనఉన్న సందర్భాల్లో మాత్రమే కనిపించే అవతారాన్ని దశావతారాల్లో చేర్చారు. దత్తాత్రేయుడు సాక్షాత్తూ విష్ణువు అవతారమే అయినా దశావతారాల్లోలేడు. ఆది వరాహావతారం దశావతారాల్లో ఒకటే అయినా ఆయనికి పూజా పురస్కారాలులేవు. కాబట్టి శ్రీమహావిష్ణువుకు ఉన్న ఒక అంశావతారాన్ని ప్రాంతీయమైన పేరుతో చెన్నకేశవుడు అన్నారు తప్ప ఆయన కేశవుడే కదా! ఒకవేళ ఆవిగ్రహాన్ని చెన్నపట్టణంనుండితెచ్చి ఉంటారేమో! చెన్నకేశవ నామం ఏ పురాణాల్లోనూ కనబడదు. కాబట్టి ఈ ఆలయం కేశవాలయమే.

### 1017. దశరథుని భార్యలని గురించి తెలియజేయండి ?

సీతారాముల కల్యాణమయ్యాక విశ్వామిత్రుడే కనపబడలేదంటే, శ్రీమద్రామాయణాన్ని నడిపించిన మంథర ఆ ఘట్టం పిమ్మట ఊసే లేకుండా పోయిందంటే ఈ ముగ్గురు భార్యల చరిత్ర గురించి వాల్మీకి ఆలోచిస్తాడా? రాముణ్ణీ, అలాగే సీతమ్మనీ గురించి వ్రాయడం ఆయనకిముఖ్యం. ఆ





త్రోవలో ఎవరు కన్పిస్తే వాళ్ళని గురించి ఎంతవరకూ అవసనరమో అంతే వివరిస్తాడు తప్ప వాళ్ళ హోదాకి ప్రాముఖ్యాన్ని ఇచ్చి చివరివరకూ వారి చరిత్రని వ్రాయాలని అనుకోడు, అనుకోలేడు వాల్మీకి.

### 1018. తేజోస్వరూపిణులు, ధామేశ్వరిణులు, పంచమహా పతివ్రతలు, భక్తురాండ్రు, శక్తులు, సతీ స్వరూపిణులు, పంచకన్యలు ఎవరు ?

1. నలుగురు తేజోస్వరూపిణులైన సతులు : 1. సతీ సావిత్రి 2. సతీ శాండిలిని 3. సతీ సీతా 4. సతీదమయంతి.

పంచదివ్య ధామేశ్వరిణులు : వైకుంఠవాసీ రమా (లక్ష్మీదేవి) గోలకవాసీ రాధికా, సాకేతపురే సీతా, కైలాసే గౌరీబ్రహ్మలోకే బ్రహ్మణీ పంచదివ్య ధామేశ్వరం శుభరూపిణీ॥

పంచమహాపతివ్రతలు:సీత,అరుంధతీ,పార్వతీ, అనసూయ, శాండిలినీ.

పంచమహా భక్తురాండ్రు : అనసూయ, శబరి, గీపప్త్రీ మీరా, విదురాణీ.

పంచమహాశక్తులు : లక్ష్మీ, సర్వస్వతీ, కాళీ, తారా, దుర్గా

పంచసతీ స్వరూపిణులు : సావిత్రి, చంద్రమతి సీత, దేవహూతి, దమయంతి.

పంచకన్యలు : అహల్య, ద్రౌపది, తార, కుంతీ, మండోదరి. వీరు భగవంతుని అనుగ్రహమును పొంది ధన్యులైన కన్యలు.

### 1019. శివాభిషేకం వాటి ఫలితాలు ఏమిటి ?

తులసితీర్థం–మనశ్శాంతి, పాలు–దీర్ఘాయువు, పెరుగు–వంశాభివృద్ధి, చక్కెర–శత్రుజయం, తేనె–విద్యా, సంగీతవృద్ధి, నెయ్యి–స్వర్ణార్థత, పన్నీరు–సకల ఐశ్వర్యప్రాప్తి, చందనం–ధనాభివృద్ధి, విభూది–సర్వరోగనివారిణి; నిమ్మరసం–మరణభయం హరం; పంచామృతాలు–దేహదారుఢ్యం; పువ్వులు–సుఖం; అరటిపళ్ళు–వ్యవసాయం; అన్నం–పెండ్లి, సౌభాగ్యం; పంచలోహ జలం–మంత్రసిద్ధి, కస్తూరి–కార్యసాఫల్యం; దానిమ్మరసం–శత్రువశీకరణ; సుగంధ ద్రవ్యములు– ఆయుర్దాయం; మానవుడు తనకోరికలు తీర్చుకొనుటకు భగవంతుని నవవిధా లుగా కొలుస్తున్నాడు, ఆ భగవంతుని అభిషేకం ద్వారా, స్మరణద్వారా కొలచి ప్రసన్నం చేసుకోగలరు.

### 1020. స్త్రీలు శివలింగార్చన చేయవచ్చునా ?

శివలింగార్చన అందరూ చేయవచ్చు. వారి వారి సంప్రదాయాలతో శివలింగపూజ చేయవచ్చు. కేవలం 'శివాయనమః' అనే నామంతో మొత్తం అర్చనచేసినాచాలు, ధన్యులమవుతాం.

MOHAN PUBLICATIONS.COM

బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రో వా ప్రతిలోమజః।
పూజయేత్సతతం లింగం తత్తన్మంత్రేణ సాదరమ్ ॥
కుంబహూక్తేన మునయః స్త్రీణామసి తథాన్యతః।
అధికారోస్తి సర్వేసాం శివలింగార్చనే ద్విజాః॥

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది సర్వులూ శివలింగాన్ని, వారి వారి విధానాలతో ఆదరంగా పూజించాలి. ఓమునులారా! ఇన్ని మాటలెందుకు? (పురుషులేకాక) స్త్రీలుకూడా శివారాధనకు అధికారులే. శివలింగార్చనలో అందరూ అధికారులే" ఈవాక్యాలు శ్రీశివపురాణం, విద్యేశ్వర సంహితలోని 38,39,40శ్లోకాలలోనివి. అయితే కొన్నిగ్రంథాలను పరిశీలిస్తే బాణలింగాన్ని మాత్రం అత్యంత నియమాలతో అర్చించాలి అని చెప్తున్నారు.

బాణలింగం, సాలగ్రామం స్త్రీలు ఆరాధించరాదని కొన్ని గ్రంథాలలో ఉంది. పూర్వసువాసినులు స్పటికలింగాన్ని పూజించవచ్చు. అని శివపురాణంలో ఉంది. విధవానాం ప్రవృత్తానాం స్పాటికం పరికీర్తితమ్। (విద్యేశ్వరసంహిత 51వ శ్లోకం) పార్థివలింగ పూజ అందరికీ శ్రేష్ఠమని చెప్పారు. వెండి లింగం నిషేధంకాదు. రజత లింగార్చన ఐశ్వర్య ప్రదం. వెండి, బంగారంవంటి ధాతువులు శివవీర్యోద్భవాలు, అని కొన్ని పురాణాల్లో ఉంది. కాని వాటిని ఆభరణాలుగా ధరించడంలేదా? కనుక లింగార్చనగా స్త్రీలకు వెండినిషేధం, అనడానికి ప్రమాణంలేదు. శివలింగార్చన చేసిన స్త్రీ భక్తులు చాలామంది పురాణాల్లోనే కనిపిస్తున్నారు. ఘుశ్మ అనే భక్తురాలు. ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగ ఆవిర్భావానికి కారణమైన మహాత్మురాలు. అక్క మహాదేవి మొదలైన శివలింగా ర్చకులు చరిత్రలో ప్రసిద్ధి. అయితే పాదరస లింగాన్ని మాత్రం ద్విజులు ఆరాధిం చాలని శివపురాణం చెబుతోంది.

### 1021. భారతీయ కళలు అనగా ఏవి ?

వాత్స్యాయనుడు పేర్కొన్న చతుష్షష్టి కలలు. 1. గీతము 2. వాద్యం 3.నృత్యం 4. ఆలేఖ్యం (చిత్రలేఖనం) 5. విశేష కచ్ఛేద్యం (తిలకం, పత్ర భంగం) 6. తండుల కుసుమ బలివికారాలు(బియ్యపుపిండి, పూలతో బలిముగ్గులు) 7. పుష్పాస్తరణం (పూలతో శయ్యలు, ఆసనాలు) 8. దశన వసనాంగరాగం (దంతాలకు వస్త్రాలకు రంగులద్దడం) 9. మణిభూమికా కర్మ (మణులతో బొమ్మలునిర్మించడం) 10. శయన రచనలు (ఋతువుల ననుసరించి శయ్య లేర్పరచడం) 11. ఉదకవాద్యం (జలతరంగిణి) 12.





ఉదకాఘాతం (వసంతకేళిలో నీరు చిమ్మడం) 13. చిత్రయోగాలు (వేషాలతో సంచరించడం) 14. మాల్యగ్రథన వికల్పాలు (మాలలను కూర్చుట) 15. శేఖరకాపీడ యోజనం (పూలకిరీటాలు, తలచుట్టు) 16. నేపథ్యయోగాలు (అలంకరణవిధానాలు) 17.కర్ణపత్రభంగాలు (ఏనుగుదంతాలతో, శంఖంతో కర్ణాభరణాలు) 18. గంధయుక్తి (సుగంధద్రవ్యాలతయారీ) 19. భూషణ యోజన (నగల నలంకరించుకోవడం) 20. ఇంద్రజాలం (కనికట్టు) 21. కౌచుమారయోగం (సుభగ కరణాదులు) 22. హస్తలాఘవం (చేతులోని వస్తువుల్ని మాయం చేయడం) 23. విచిత్రశాక యూషభక్ష్య వికారక్రియలు (రకరకాలవంటలుచేయడం) 24. పానక రసరాగాసవయోజనం (పానకాలు, మద్యంచేయడం) 25. సూచీవాసకర్మ (గుడ్డలుకుట్టడం) 26. సూత్రక్రీడ (దారంతోచేసే క్రీడ) 27. వీణాడమరుకవాదనం 28. ప్రహేళికలు (గూఢార్థకవిత్వశక్తి) 29. ప్రతిమాల (పేరడీలుచదవడం) 30. దుర్వాచకరన యోగం (విలాసంకోసం క్లిష్టరచనలు చదవడం) 31. పుస్తకవాచకం (అర్థవంతంగా చదవడం) 32. నాటకాఖ్యాయికా దర్శనం (నాటకాలకు, కథలకు సంబంధించినజ్ఞానం) 33. కావ్య సమస్యాపూరణం (పద్యాలతో సమస్యలను పూరించడం) 34. పట్టికావేత్ర వాన వికల్పం (ఫ్రేముతోకుర్చీలు, మంచాలు అల్లడం) 35. తక్షకర్మ (విలాసం కోసం బొమ్మలు చేయడం) 36. తక్షణం (కఱ్ఱపనినేర్పు) 37. వాస్తు (గృహనిర్మాణవిద్య) 38. రూప్యరత్నపరీక్ష (రూపాయలలో, రత్నాల్లోని నాణ్యత నిర్ణయించడం) 39. ధాతువాదం (లోహాలు లభించే ప్రదేశాలను కనుగొనడం) 40. మణిరాగాకర జ్ఞానం (మణులగనులను కనుగొనడం) 41. వృక్షాయుర్వేద యోగాలు (చెట్ల వైద్య జ్ఞానం) 42. మేషకుక్కుటలావక యుద్ధవిధి (పొట్టేళ్ళు,కోళ్ళు,లావక పక్షుల పందాలు) 43. శుక సారికా ప్రలాపనం(చిలుకలకు, గోరింకలకు మాటలు నేర్పడం) 44. ఉత్సాద, సంవాదన, కేశమర్దనం (ఒళ్ళు, కాళ్ళు పట్టడం, తలంటడం..మొ॥నేర్పు) 45.అక్షర ముష్టికా కవనం (న్యస్తాక్షరి కవిత్వం) 46. మ్లేచ్ఛిత కవికల్పం (అక్షర వ్యత్యయం చేత సాధు శబ్దాన్ని అసాధు శబ్దంగా భ్రమింపజేయడం) 47. దేశభాషా విజ్ఞానం (బహు భాషా జ్ఞానం) 48. పుష్పశకటిక (పూలరథాలు, పల్లకీలు చేయడం) 49. నిమిత్త జ్ఞానం (శుభాశుభ శకున పరిజ్ఞానం) 50. యంత్ర మాతృక (యంత్ర నిర్మాణం నేర్పు) 51. ధారణమాతృక (ఏకసంధాగ్రహణం) 52. సంపాఠ్యం (ఒకరి ననుసరించి అనేకులు వల్లించడం) 53. మానసీక్రియ (మనస్సును అను

MOHAN PUBLICATIONS.COM

కున్న అంశంపై కేంద్రీకరించడం) 54. కావ్యక్రియ (కావ్యరచన) 55. అభిధాన కోశచ్ఛందో విజ్ఞానం (నిఘంటు, ఛందస్సు పరిజ్ఞానం) 56. క్రియాకల్పం (కావ్యాలంకార శాస్త్రపరిజ్ఞానం) 57. ఛలితక యోగం (మారు వేషంతో చలామణి) 58. వస్త్రగోపనం (వస్త్రాలను మాయంచేయడం) 59. ద్యూత విశేసం (జూదాలకు సంబంధించినజ్ఞానం) 60. ఆకర్షక్రీడలు (జూదంమొదలైన ఆటలు) 61. బాలక్రీడనకం (పిల్లల ఆటల్లోనేర్పు) 62. వైనయికీజ్ఞానం (గజ,అశ్వశాస్త్రపరిజ్ఞానం) 63. వైజయికీవిద్య (విజయ సాధనోపాయ పరిజ్ఞానం) 64. వ్యాయామికీజ్ఞానం (శారీరక వ్యాయాయ పరిజ్ఞానం)

### 1022. ఉపవాసం చేయడం వలన ఫలితమేమిటి ?

భగవంతుని అనుగ్రహం పొందడానికే ఉపవాసం. ఇంకా చెప్పాలంటే, శారీరక, మానసిక మాలిన్యాలను వదిలించుకోవడానికే ఉపవాసదీక్ష. నిష్కా మంగా ఈ దీక్షను చేయగలిగితే భగవంతుడు మనకోరికలను అడగకుండానే నెరవేర్చుతాడని ప్రతీతి. శరీరానికి అలసట కలిగితేనే మనసు స్థిరపడుతుంది. మనస్సు స్థిరపడి నిగ్రహాన్ని పొందితేనే ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానం పొందినప్పుడే ఓమనిషి తనని తాను తెలుసుకుంటాడు. తనని తాను తెలుసు కోడమంటేనే దైవం గురించి తెలుసుకోవడన్నమాట. ఉపవాస దీక్షరోజున పండ్లను, పాలను స్వీకరిస్తూ పూర్తిగా దైవచింతనలోనే దీక్షాసమయాన్ని గడపాలి.

### 1023. ఈశ్వరపూజకు మారేడు దళాలు ఎందుకు ?

"ఏకబిల్వం శివార్పణం" అని మారేడు దళాలలతో శివుని పూజిస్తారు. మూడు దళములు కలసి ఒక్కఅండముననే ఉండును కావున, దీనికి బిల్వము అని పేరు వచ్చింది. ఈ మూడు రేకులకు ఆధ్యాత్మికంగా.

పూజకుడు–పూజ్యము –పూజ; స్తోత్రము – స్తుత్యము – స్తుతి; జ్ఞాత–జ్ఞేయము–జ్ఞానము; అనిఅర్థాలు చెప్పుచున్నారు. ఈవిధంగా (3×3) మూడు, మూడును వేర్వేరుగా భావించుటయే త్రిపుటిజ్ఞానము, ఇదియే అజ్ఞానము, వేరువేరుగా కన్పించిననూ, అధారకాండము ఒక్కటే అయినట్లు, 'ఓమహా దేవా! సృష్టి, స్థితి, లయకారకుడవైన నీవే మారేడుదళము నందు మూడు పత్రములుగా వేరువేరుగా వున్నట్లు తోచుచున్నావు.





పూజకుడవు నీవే, పూజింపబడునది నీవే, పూజాక్రియవు నీవే అనే భావంతో అభేదబుద్ధితో పూజించుటయే సరియైన పద్ధతి, మరియు పుణ్యఫల ప్రదము. ఈవిధమైన భావముతో పూజించకుండుటయే అజ్ఞానము మరియు పాప హేతువు. ఈ జ్ఞానరహస్యమును తెలుసుకుని, బిల్వపత్రరూపముతో త్రిపుటిజ్ఞానమును, నీపాదములచెంత నేను సమర్పించుచున్నాను. 'శివో హమ్' శివోహమ్, అను మహావాక్యజ్ఞానమును, స్థిరపర్చునదియే బిల్వార్చన యగును. పవిత్రమగు ఈశ్వర పూజకు ఈ బిల్వపత్రము సర్వశ్రేష్ఠమైనది మరియు అతి పవిరత మైనది. శివార్చనలకు మూడు రేకులతోనున్న పూర్తి బిల్వదళముననే ఉపయో గించవలెను. ఒకసారి కోసిన బిల్వపత్రములు, సుమారు 15 రోజులవరకు పూజర్హత కల్గియుండును. వాడిపోయినను దోషములేదు. కాని మూడురేకులు మాత్రము తప్పనిసరిగా ఉండవలెను.

ఏకబిల్వ పత్రంలోని మూడురేకులలో ఎడమవైపునది బ్రహ్మ అనియు, కుడివైపునది విష్ణువనియు, మధ్యనున్నది సదాశివుడనియు, పురాణములలో తెలియుచున్నది. మరియు బిల్వదళములోని ముందుభాగమునందు అమృత మును, వెనుకభాగమున యక్షులును వుండుట చేత, బిల్వపత్రముయొక్క ముందుభాగమును శివునివైపు వుంచి పూజించవలెను.

బిల్వవనము కాశీక్షేత్రముతో సరిసమానమైనది అని శాస్త్రములలో తెలుపుచున్నారు. మారేడుచెట్టు వున్నచోట, ఆ చెట్టు క్రింద శివుడు ఉంటాడు. ఇంటి ఆవరణలో ఈశాన్య భాగమున మారేడుచెట్టువున్నచో, ఆపదలు తొలగి సర్వైశ్వర్యములు కల్గును. తూర్పునవున్నచో సుఖప్రాప్తికల్గును, పడమరవైపున వున్నచో సుపుత్రసంతానము కల్గును. దక్షిణవైపు వున్నచో యమబాధలు వుండవు.

శ్లో॥ బిల్వానాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనమ్।
అఘోరపాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥

బిల్వపత్రముయొక్క దర్శనంవలన పుణ్యము లభించును. వాటిని స్పృశిం చుట వలన సర్వపాపములు నశించును. ఒకబిల్వపత్రమును శివునికి భక్తిశ్రద్ధలతో అర్పించుట వలన, ఘోరాతిఘోరమైన పాపములు సైతము నిర్మూలమగును. ఇట్టి త్రిగుణములుగల బిల్వదళమును నీకు అర్పించు చున్నాను. నన్ను అనుగ్రహింపుము.

### 1024. జపము చేయునపుడు విడిచిపెట్టదగిన పనులు ఏవి ?

ఆలస్యం జృంభణం నిద్రాక్షువం నిష్ఠీవనం భయమ్ ।
నీచాంగస్పర్శనం కోపం జపకాలే వివర్జయేత్॥

MOHAN PUBLICATIONS.COM

అని చెప్పబడినట్టు జపము చేయునపుడు సోమరితనం,ఆవులింత, నిద్ర, తుమ్ము, ఉమ్మివేయుట,భయం, శరీరమునందలి నీచమైన అవయవ ములను స్పృశించుట, కోపంవంటి పనులను వెంటనే విడిచిపెట్టవలెను.

**1025. నిజమైన శివపూజ ఏది ?**

ప్రాణులందరికీ ఉపకారముగావించుట, ప్రాణులందరిపై దయ చూపుట, ఆపదలలో ఉన్నవారిని ఆదుకొని, వారికి అభయమునిచ్చుట నిజమైన శివారాధన అని నీలకంఠ దీక్షతుల ఆభాణకం. సర్వభూతోపకరణం / సర్వభూతానుకంపనం, సర్వాభయ ప్రదానంచ/శివస్యారాధనంవిదుః.

**1026. శివపూజా ఫలమును వివరించుము ?**

శివపూజ చేసిన పుణ్యాత్ములకు శివుడు వారి ఇంట మదించిన ఏనుగులను, వాయువేగముతో కూడిన గుఱ్ఱములను, చంద్రముఖులగు స్త్రీలను నివసింప జేయుచున్నాడు. (స్కాందపురాణం).

**1027. తంత్రములని ఏ గ్రంధములకు పేరు?**

సర్గ, ప్రతిసర్గ, మంత్రనిర్ణయ, దేవతా సన్నివేశ, తీర్థ,వర్ణాశ్రమ, యుగ ధర్మ, రాజధర్మ, పుణ్య, నరలోకవాస, దేవతాచక్రయంత్ర లక్షణ, స్త్రీ పురుష లక్షణ, బ్రాహ్మణ సంసేవన, వ్రతజ్యోతిర్విజ్ఞానాది అనేకవిషయాలను బోధించు గ్రంథాలకు తంత్రములని పేరు. తంత్రములు ఆస్తిక తంత్రములు మరియు బౌద్ధతంత్రములు అనిరెండు విధములుగా కలవు. ఆస్తిక తంత్ర ములు మరల వైష్ణవ తంత్రములు శైవతంత్రములు, శక్తి తంత్రములు అని మూడు విధములుగా విభజింపబడినవి.

**1028. వైదిక గ్రంథములందు ఏ విభాగమునందు రేఖా గణితమునకు ప్రాధాన్యము ఇవ్వబడినది ?**

యజ్ఞశాలలను, హోమవేదికలను వివిధ ఆకృతులలో నిర్మించడానికై మార్గదర్శములుగా రూపొందించబడిన “శుల్బసూత్రములలో” రేఖాగణితము నకు అత్యంత ప్రాధాన్యం ఈయబడినది.శుల్బము అనగాతాడు అని అర్థము.తాటి సహాయంతో (నేడుమెజరింగ్ టేప్వంటి కొలత లకు ఉపయోగించుతాడు) రేఖాగణిత నియమములను అనుసరించి ఈ గ్రంథము లందు శాలానిర్మాణవిధానం వివరించబడింది.

**1029. శ్రీకృష్ణుని చుట్టూ ఉండే రాజకన్యలందరూ మహర్షులంటారు నిజమేనా ?**

నిజమే. శ్రీరాముడు పుంసాం మోహనరూపాయ పురుషులకు కూడ మోహం కలిగించే సౌందర్యం కలవాడు. ఆయన అరణ్యాలకు వెళ్ళినపుడాయన సౌందర్యం చూచి సర్వసంగపరిత్యాగులైన మహర్షులు కోరికతో ఆయనను కౌగిలించుకొనబోయారు. అపుడాయన “నాధునా నాధునా” ఇప్పుడు కాదిప్పుడు కాదు. ఈ అవతారం ఏకపత్నీవ్రతనిష్ఠం. కృష్ణావతార కాలంలో మీకా అవకాశం వస్తుందని తెలిపినట్లైంది. రాముని నిద్రలేపుటకు వెళ్లిన విశ్వామిత్రుడాయనను కౌగిలించుకొనబోయి, నిగ్రహించుకొని, ద్వాపర యుగంలో అంశగా సత్యభామలో ప్రవేశించాడు.





శ్రీకృష్ణస్వామి యవతారపరిసమాప్త్యనంతరం, ఆ చుట్టుపట్లగల బోయలు కిరాతులువచ్చి శ్రీకృష్ణస్వామివారి భార్యలను నాభార్య అంటే నాభార్య యని కౌగిలించుకొంటూ కామక్రీడలకు బలాత్కరిస్తున్నారు. కృష్ణనిర్యాణానంతరం త్రిలోక విజయ ధనుర్ధరుడైన అర్జునుడు వారి దాడి నుండి స్త్రీలను రక్షింపలేక పోయాడు.

అపుడు కృష్ణుని భార్యలా కిరాతులతో “స్వామి వారవతారం చాలించి ఇంకా మూడు రోజులు దాటలేదు. ఒక్కసారి సముద్రంలో మైలస్నానాలా చరించి మిమ్ముపతులుగా స్వీకరిస్తామని నమ్మించారు. వారు మెల్లిగా సముద్రంలో జారుకొంటారని భావించి, ఒక్కొక్కకిరాతుడు తాను గైకొనదలచిన స్త్రీకి తాళ్ళు గట్టి వారిని సముద్రంలో స్నానం చేయుమని, తాళ్ళు పట్టుకొని ఒడ్డున కూర్చున్నారు. ఆస్త్రీలు ఒక్కసారి సముద్రతరంగా లలో మునిగి, మీసాలుగడ్డాలతో “హరహర మహాదేవ” అంటూ పైకిలేస్తు న్నారు. అయ్యాబాబోయ్! వీరంతా మహర్షులు శపిస్తారని భయపడి కిరాతులు పారిపోయినట్లు భాగవత పురాణం సాక్ష్యమిస్తున్నది. అయినా శ్రీకృష్ణ స్వామికి 16108 మంది భార్యలంటే అది జీవేశ్వర సంబంధమేగాని తుచ్ఛ కామకేళీకవకాశముండే స్త్రీ పురుషసంసార బంధంకాదు.

**1030. పదహారు ఫలాల నోములో పనసపండ్లు కూడా 16 ఇవ్వాలా?**

మనం భగవంతునకు షోడశోపచారాలు చేసేటప్పుడు సువర్ణరత్నసింహాసనం సమర్పయామి నవరత్న సింహాసనం సమర్పిస్తున్నానంటాం. సమర్పిస్తామా? తదర్థమక్షతాన్ సమర్పయామి దానికి బదులు అక్షతలు సమర్పిస్తున్నా మంటాం. 16 పండ్లు లభించేశక్తి ఉండి ఇస్తే మంచిదే! అది ఒకపండు ఇచ్చి ప్రత్యామ్నాయంగా వేరే 15 పండ్లు పెట్టవచ్చు. “మన ఏవమనుష్యాణాం కారణం బంధ మోక్షయోః” మనస్సు ప్రధానం. శ్రద్ధగా నోము నోచారా? లేదా? అనేది ముఖ్యం.

MOHAN PUBLICATIONS.COM

## 1031. లక్షవత్తుల నోము ఎలా నోచుకోవాలి ?

"తమసోమాజ్యోతిర్గమయ" అనే ఉపనిషణ్మంత్రమే దీపారాధనకు మూలం. అజ్ఞానమనే చీకటిలోనుండి నన్నుజ్ఞానమనే కాంతిలోనికి తీసి కొనిరా! అనిఅర్థం. అదే దీపారాధన. భగవంతుడు జ్యోతిస్స్వరూపుడు. ఈ ప్రపంచ మంతా ద్వంద్వం. అందుకే దీపారాధనకు రెండు వత్తులుండాలి. వానిని ముందు భాగంలో కలిపి, దీపశిఖ వెల్గించాలి. వెనుక మాత్రం ఏ వత్తికావత్తి వేరుగా ఉండాలి. ద్వంద్వమయమైన ప్రపంచాన్ని ఒక్కటిగా వెల్గించే తేజస్స్వరూపుడే దైవమని దీని పరమార్థం. లక్ష అనేది ఉపలక్షకం. ఇది మిగిలిన నోముల వలెనే విష్వక్సేన పూజ (గణపతిపూజ) మంటపార్చన, కలశారాధనలతో లక్షదీపాలు వెలిగించి, దైవాన్ని పూజించేవ్రతం, చక్కగా తెలిసిన ఏపురోహితుడైనా చేయిస్తాడు. మీరైనా ఆయా పూజలుచేసి నోము నోచుకోవచ్చు. ఏదైవానికి ప్రతీకగా నోము నోస్తున్నారో ఆ స్వామికి సహస్ర నామ పూజ చెల్లించాలి. లక్షవత్తులనోము శివపరంగా విష్ణుపరంగా కూడా ఉన్నది.

## 1032. మంత్రపుష్పమంటే ఏమిటి ?

మననం చేయువారిని రక్షించేది మంత్రం. శ్రీకృష్ణుడు 'పత్రం, పుష్పం ఫలంతోయం' ఒకఆకునైనా ఒకపూవునైనా ఒకపండైనా నీటినైనా ఎవరు భక్తితో సమర్పిస్తారో వారిని రక్షిస్తాడు భగవంతుడు. మంత్రపుష్పమంటే మంత్రాన్ని పుష్పంగా స్వామిపాదాలకు సమర్పించుకోవటం లేదా, అక్షతలు, పూవులను మంత్రసహితంగా స్వామిపాదాలకు సమర్పించు కోవటం. మనం ఏదైనా పూజగానీ హోమాదులుగానీ నిర్వహిస్తాం. ఆ పూజానంతరం, అర్చకులు పూజచేసిన కర్తలందరి దోసిళ్ళలో అక్షతలతో కూడిన పూవులు గానీ, కేవలం పూవులుగాని ఉంచి, వారివారి గోత్రనామాలను చదివి, మంత్రపుష్పం స్వామిపాదాలకడ సమర్పిస్తాడు. ఆ మంత్రం ఓమ్ సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ అని ప్రారంభమౌతుంది. వేయి శీర్షములుగల భగవంతుని విశ్వమే నేత్రంగా గలవానిని, లోకానికి శుభ కారకుడైన వానిని అనిప్రారంభించి అట్టివానికి పుష్ప మంత్రరూపంతో మనహృదయాన్ని సమర్పించటమే మంత్రపుష్పమంటే. ఈ మంత్రంలో భగవంతుని విశ్వవిరాట్స్వరూపం వర్ణింపబడుతుంది.





## 1033. పంచక్రియలు అనగా ఏమిటి ?

1. ఉపాసన-పూజగదిలోగానీ, ఆలయంలోగానీ ప్రార్థించడం, భక్తితో క్రమశిక్షణతో, ఆచారవ్యవహారాలు నిర్వహిస్తూ దైవారాధన చేయడం. 2 ఉత్సవం - కుటుంబంలోకలిసి పండుగలు, వేడుకలు జరిపించటం, ఉప వాసాది క్రియలలో పాలుపంచుకోవడం, నియమానుసారం ఆలయాలకు వెళ్లడం. 3. అహింసావిధానం : ఇతరుల యోగక్షేమాలు ఆలోచించే నిస్వార్థ జీవన విధానం, మానసికంగాను, శారీరకంగాను, ఇతరులను హింసించని 'అహింసావిధానం'తో కూడిన కర్మబద్ధజీవనం. 4. తీర్థయాత్రలు : ప్రాపంచిక పరమయిన విషయాలోచనలు వదలిపెట్టి, వీలునుబట్టి తీర్థయాత్రలు సాగిస్తూ, భగవంతుని, గురువులనూ సందర్శిస్తూ వైరాగ్యవిధానాన్ని అల వాటు చేసుకోవటం. 5. సంస్కారం : పురుడు, నామకరణం, కర్ణభూషణం, అక్షరాభ్యాసం, ఉపనయనం, వివాహం, మరణం...ఇలా అనేక సమయాలలో ఆచరించే హైందవ ఆచార వ్యవహారాలను సక్రమంగా నిర్వహించటం.

## 1034. ఏయే సమయాల్లో ఆలయాలకు వెళ్తే మంచిది ?

నిజం చెప్పాలంటే మనకు అవకాశం వున్నంత మేర ఉదయకాలంలో శ్రీ మహావిష్ణువునీ, ఆయన అవతారలైన దేవుళ్ళనీ, సాయం సమయంలో శంకరుణ్ణీ ఆయన రూపాలయినటువంటి దేవుళ్ళనీ ప్రతిరోజూ దర్శించా ల్సిందే. "ప్రాతర్విష్ణుం భవం సాయే అనునిత్యమ్" అయితే ఇది సాధ్యంకాని పని అయినప్పటికీ ఇక్కడ ఓ అద్భుతమైన విశేషం ఉంది. విష్ణాలయంలో తులసి తీర్థాన్ని, పూమాలనీ ఇస్తారు. మనం ఉదయాన్నే దర్శిస్తున్నాం కదా. తులసితీర్థం శ్వాసకోశాన్నిశుభ్రపరుస్తుంది. పూమాల అలంకార ప్రియత్వాన్ని కలిగిస్తుంది. ఇదంతా దినచర్య ప్రారంభంలో లేదా జీవిత ప్రారంభంలో అవసరం.

ఇక సాయంకాలం శివదర్శనమప్పుడు మారేడాకులు మునిగి తీర్థాన్ని భస్మాన్ని ఇస్తారు. మారేడు నీరు జీర్ణకోశాన్ని శుభ్రపరుస్తుంది. భస్మం ఒక తీరు వైరాగ్యదృష్టిని కలుగచేస్తుంది. ఈ తీరుభావన, రోజు ముగిశాక ఏం చేశానని పరిశీలించుకున్న పశ్చాత్తాపపడానికీ లేదా జీవితపు చరమకాలం లోనూ ముక్తికిఅవసరం. ఈ ప్రశ్నకే మరోకోణంనుంచి సమాధానాన్ని చూస్తే బర(మనస్సు)కి ఏ విధమైనపని తొందరా లేక కేవలం దేవుణ్ణి దర్శించాలని అన్పించినప్పుడూ, పరమసంతోషవార్తని విన్నప్పుడు కృతజ్ఞత లని చెప్పుకునేందుకూ, పరమదుఃఖం కలిగినప్పుడు ఒడ్డున వేయ వలసి

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

నదిగా దీనంగా ప్రార్థించేందుకూ, భగవంతునికి ఇష్టమైన పర్వదినాలలోనూ గుడికి వెళ్ళాలి. ఇలాంటప్పుడుదర్శిస్తే, తప్పకుండా భగవంతునిమీద గురి కుదురుతుంది. ప్రతిరోజూ ప్రతిదేవుడికీ పర్వదినంకాదు. కాదు కాబట్టి భక్తులదర్శనం వీలుకోసమై తిరుమల క్షేత్రాన్నీ కలియుగ వైకుంఠమని పిలుస్తూ, దేవతలు అంతా ఆయన్నే సర్వదేవతా స్వరూపునిగా చిత్రించి అనుక్షణం ఉత్సాహమయంచేసి, ఈ రోజు ఆ రోజుఅని తేడా లేకుండా రావచ్చునని అన్నారు. నిత్యోత్సవం, పక్షోత్సవం, మాసోత్సవం ఇదే తీరుగా మహేశ్వరునికి నిత్యాభిషేక ఉత్సవాన్ని జరిపే ఏర్పాటు చేశారు.

### 1035. పూజా యంత్రాలు, ప్రతిష్ఠాయంత్రాల తేడా ఏమిటి ?

ప్రతిష్ఠాయంత్రాలు రెండు రకాలు. దేవాలయాలలో విగ్రహాలకు చైతన్యం కోసం ప్రతిష్ఠించేవి. మరొకటి గృహాలలో మత్యయంత్రం వంటివి ప్రతిష్ట చేస్తారు.అయితే దేవాలయాలలో వేసే ప్రతిష్ఠాయంత్రాలకు ఏ విధంగా కలాపం జరుగుతుందో అదే విధంగా ఇళ్లలో వేయు యంత్రాలకు కూడా కలాపం జరిపించాలి. ఇళ్లలో యంత్రాలు ప్రతిష్ఠ జరిగిన తర్వాత ప్రత్యేక నియమాలు వుండవు. పూజా యంత్రాలు దేవతా మందిరాల్లో, ప్రతి యింట ఉండదగినవి వీటికి కొన్ని ప్రత్యేక నియమాలు వున్నాయి. నియమ బద్ధంగా యంత్రాలను పూజిస్తే ఆ యంత్రదేవతల అనుగ్రహం తప్పక లభిస్తుంది. యంత్రదేవతలను యంత్రరూపంలో నిత్యం అర్చించవలెను. నిత్యం ధూప, దీప, నివేదనలు సమర్పించవలెను. అలాచేసి సదాచార సంపత్తితో జీవనం చేసిన యింటి దేవత అనుగ్రహం వలన అష్టైశ్వర్యములతో తులతూగే అవకాశం కలుగుతుంది. అంతేకాకుండా యంత్రంద్వారా ఫలితాలు త్వరగా అందుతాయి.

### 1036. శుభకార్యం చేసిన ఎన్నిరోజులలోపుగా అబ్దీకం పెట్టరాదు?

ఆబ్దీకంపెట్టరాదు అనేవాక్యంతప్పు. శుభకార్యంచేసిన రెండు నెలలలోపు ఆబ్దీకం రాకుండా ముహూర్తం నిర్ణయించుకోవాలి. నోములు వ్రతములు వంటివి ఆబ్దీకం ముందురోజు, మరుసటిరోజు పనికిరాదు. తల్లిదండ్రులకు ఆబ్దీకం మానడం చాలాతప్పు. అందువలన ఆబ్దీకములను దృష్టిలో వుంచుకొని శుభకార్యములు ముహుర్తాలు పెట్టించుకోవాలి. ఆబ్దీకం అనంతరం శుభకార్యం దోషంలేదు. ఆబ్దీకమునకు నెలరోజులు ముందు శుభకార్యం దోషంలేదు.





### 1037. గణపతికి గుంజీలు యిష్టమా ?

గణపతికి గుంజీలు తీసివందనం చేయడం అనాదిగా ఆచారం. శ్రీహరి ఒకానొకప్పుడు కైలాసానికివెళ్లాడు. మర్యాదలన్నీ అయిన తరువాత శివకేశవులిద్దరూ ముచ్చటలాడుకుంటూ కూచున్నారు. ఇంతలో గణపతి అక్కడకువచ్చాడు. శ్రీహరిచేతిలో వున్న సుదర్శన చక్రాన్ని చూచాడు. ఎంతో బాగానచ్చిందా చక్రం గణపతికి. వెంటనే ఆచక్రాన్నిలాగి తన నోటపెట్టుకున్నాడు. శ్రీహరి ఎంత బలిమాలిన చక్రంఇవ్వలేదు గణపతి. ఏం చెయ్యాలో ఎవరికీ అర్థం కాలేదు. ఉపాయశాలి శ్రీహరి తన రెండు చెవులను రెండు చేతులతో పట్టుకొని గుంజీళ్లు తీయడం మొదలు పెట్టాడు. శ్రీహరి చేసే ఈ విచిత్రమైన ఆటకు గణపతి నవ్వు ఆపుకోలేక పోయాడు. పకపకా నవ్వడం మొదలుపెట్టాడు. అలాపడిపడీ నవ్వడంతో గణపతి నోటినుండి చక్రం కాస్తాకింద పడిపోయింది. అంతే శ్రీహరి ఆ చక్రాన్నిచేత చిక్కించుకొన్నాడు. ఈ విధంగా గణపతి గురించి సాక్షాత్తు శ్రీమహావిష్ణువే గుంజీళ్లు తీయడంవలన గణపతికి గుంజీళ్లు ప్రీతికరంగా మారాయి. అలా, ఆనాటి నుండి వినాయకచవతినాడు వినాయకుని ముందు గుంజిళ్లు తీయడం, స్వామి అనుగ్రహం పొందడం ఆచారంగా మారిపోయింది. భక్తులంతా పరమభక్తితో స్వామికి గుంజిళ్ల సేవచేయడం అభీష్ట దాయకం.

### 1038. కవలలకు వివాహం ఒకసారే చేయాలా ?

కుదిరితే చేయట విశేషమే. వివాహమునకు ముందు చేయవలసిన ప్రతి క్రియ ఉపనయన, అన్నప్రాశన, అక్షర స్వీకారం వంటివి అన్నీ ఒకరోజే ఒక ముహుర్తంలోనే చేయాలి. వివాహంమాత్రం కుదిరితే ఒకేసారే చేయాలి. లేకపోతే విడిగా అయినా చేయవచ్చు. అంతేకాక కవలలో భూమిమీదకు వచ్చిన మొదటి సంతానమునకే మొదట వివాహం చేయాలి.

### 1039. వాస్తు మానవ జీవితంపై ఏ ప్రభావం చూపుతుంది ?

స్థానబలం లేనిదే మనం చేయు ఫలితాలు సక్సెస్ అవ్వడం శ్రమ యుక్తం అవుతుంది. అయితే జాతకరీత్యా వున్న ఫలితాలు వాస్తుకానీ, మరొకటికానీ మార్చలేవు. మనదశ బాగావుంటే అదితేలికగా మనం అనుభవించడానికి వాస్తుతోడ్పాటు అవుతుంది. దశబాగా లేకపోతే వాస్తు ఏమీచేయలేదు. దశ బాగాలేకపోతే మంచి వాస్తుప్రభావంగా రక్షణ పొందవచ్చు. కానీ యోగంమారదు. ఒక ఉదాహరణచూద్దాం. ప్రతి మనిషికీ

పుట్టగానే జాతక ప్రభావంగా ఆ ఉద్యోగం వచ్చే రోజుకంటే ఎక్కువ కాలం ముందుగా ప్రయత్నాలు ప్రారంభించి చాలా ప్రయత్నాలుచేసి చివరకు ఆ జాతకరీత్యా వ్రాసివున్న రోజున అదే ఉద్యోగం అందుకుంటారు. ఈలోగా చాలా మానసికశ్రమ శారీరక శ్రమచేస్తారు. దీనికి కారణం వాస్తు బాగా లేకపోవడమే. అదే మంచి వాస్తువున్న యింట నివాసం వుంటే మనకు సక్సెస్ అయ్యే రోజుకు దగ్గర్లో ప్రయత్నాలు ప్రారంభించడం ప్రశాంతంగా ప్రయత్నించడం, చాలా శాంతంగా అదే ఉద్యోగం పొందడం జరుగుతుంది. వాస్తు బాగావున్నా లేకున్నా జాతకరీత్యా వున్నరోజున, అదే ఉద్యోగం పొందడం జరుగుతుంది. వాస్తు జాతకయోగాలని మార్చలేదు. అలాగే రత్నాలు కూడా జాతకయోగం మార్చలేవు. జాతక యోగం మార్పు చేయుట దైవానికే సాధ్యం. అందుకే దైవారాధననిత్యం చేయండి.

### 1040. సీమంతం చేసి ఆడపిల్లను పురిటికి అత్తగారింటి నుండి పుట్టింటికి పంపడం శాస్త్రమా? ఆచారమా?

ఆచారమే. దీనిని గూర్చి ఎక్కువ చర్చకు కూడా అవకాశం యివ్వనవసరంలేదు. అయితే గర్భిణీస్త్రీ "షాణ్మోసాదూర్ధ్వం"ఆరునెలలు నిండినది మొదలు ఆమె ఎంత ప్రశాంతంగా ఆనందంగా వుంటే అంత చక్కటి సంతానం కలుగుతుంది అని పెద్దలవాదన. అంతేకాక ఆరుమాసాలకు గర్భస్థ శివువుకు రూపం ఏర్పడుతుంది. పురాణాలు, శాస్త్రములు, వైద్యశాస్త్రం ప్రకారంగా గర్భిణీ స్త్రీ యొక్క నడవడి దృష్ట్యా ఆమెయొక్క ప్రశాంతత లేదా అశాంతిని దృష్టిలో వుంచుకొని అత్తవారింటి కంటే పుట్టింటిలో ఎక్కువ ప్రశాంతంగా వుండే అవకాశం వుంటుంది. అనే దృష్టిలో పుట్టింటికి పంపుతారు. అయితే వివాహానంతరం ప్రతిపనీ అత్తవారింటిలోనే జరగాలి. యిది వైదిక సాంప్రదాయం మరియు శాస్త్రం.

### 1041. రావిచెట్టు-జ్యేష్ఠాదేవి విశిష్ఠత ఏమిటి ?

క్షీరసాగరాన్ని దేవతలూ దానవులూ కలసి మధిస్తున్నారు. ఆ మధనంలో నుంచీ ఎన్నో మహాద్భుతమైనవి పుడుతున్నాయి. లక్ష్మీ,కౌస్తుభం ఇలా ఎన్నో వచ్చాయి. అలా వచ్చిన లక్ష్మిని విష్ణుమూర్తి పెండ్లిచేసుకుంటానన్నాడు. కాని లక్ష్మీదేవి అందుకు ఒప్పుకోలేదు. నాకన్నా పెద్దది మా అక్క జ్యేష్ఠాదేవి వున్నది. ఆమెకు పెండ్లికాలేదు. నేనెలా చేసుకుంటానన్నది. కనుక మా అక్క పెళ్ళి విషయం చూడండి. తరువాత నా పెళ్ళి అన్నది. ఆమె మాటలు





విన్న విష్ణుమూర్తి పెద్దలతో విచారణచేసి, ఉద్దాలకుడు అనే మహర్షికి జ్యేష్ఠా దేవిని ఇచ్చి వివాహం జరిపించాడు.

జ్యేష్ఠాదేవి ఎర్రని కన్నులతో, కరకు కంఠధ్వనితో పెళుసుగావుండే శిరోజాలతో వుండేది. అయినా ఉద్దాలకుడు ఆమెను వివాహం చేసుకొని తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు. అక్కడ జరుగుతన్న హోమాలు, వేద మంత్రాల పఠనము, పూజలూ మొదలైన విషయాలు ఆమెకు రుచించలేదు. వెంటనే భర్తనుపిలిచింది. ఏడుస్తూఉద్దాలకా, నీ ఆశ్రమం నాకేమీ బాగాలేదు. ఈచోటు నాకుసరిపడదు. ఈయజ్ఞాలు,యాగాలు,వేదాలూ,అతిథి సత్కారాలూ, పితృదేవతల పూజలూ, అన్యోన్య అనురాగాలూ, గురుపూజలూ, సత్కరాలూ, ప్రేమాభిమానాలూ, నీతి, ధర్మం మొదలైన విషయాలు నాకు ఇష్టం ఉండవు. ఇక్కడ మాత్రం అన్నా ఇవే వున్నాయి. నేనిక్కడ వుండలేను. అంటూ గొడవ ప్రారంభించింది.

తనకిష్టమైనచోట్లు కొట్లాటలు, తగాదాలూ, వృద్ధులకూ, మిత్రులకూ పరాభవాలు జరిగేచోట్లు, పరులద్రవ్యములు దొంగిలించేచోట్లూ, దురలవాట్లు దురాచారాలూగల తావులే నాకిష్టమైన ప్రదేశాలు. నేను అలాంటి చోట్లలోనే వుంటాను. మద్యపానం చేసేచోట్లూ, బ్రహ్మహత్యలుచేసేచోట్లూ, ఇష్టపడ తాను. అంటే విసుగులేకుండా మాట్లాడడం మొదలుపెట్టింది. ఉద్దాలకుడు బాధపడ్డాడు. వేదవిదుడు, విద్యావేత్త, అయిన తనకీభార్యా? అంటూ బాధపడ్డాడు. సరే,జ్యేష్ఠావుండు నీకుతగినచోటు వెదకివస్తాను అంటూ బయలుదేరాడు. అంతవరకూ ఈ రావిచెట్టు మొదట్లో మాయిగా కూర్చో అంటూ, ఆమెఅక్కడ వదలి వెళ్ళిపోయాడు. ఎన్నాళ్ళైనా ఉద్దాలకుడు రాలేదు. ఎదురుచూసీచూసీ విసిగిపోయిన జ్యేష్ఠాదేవి పెద్దగా ఏడవడం మొదలు పెట్టింది. ఏడుపులు అన్ని దిక్కులా వ్యాపించాయి. అక్కడ విష్ణువు లక్ష్మి ఈ రోదనలు విన్నారు. ఇద్దరూ బయలుదేరి జ్యేష్ఠాదేవి దగ్గరకు వచ్చారు. ఎన్నోరకాలుగా ఆమెను ఓదార్చారు చివరకు విష్ణువు జ్యేష్ఠా, దిగులుపడకు. ఈ రావిచెట్టు నాస్వరూపమే. నీవిచటనే స్థిరముగా ఈరావి చెట్టు మొదలు లోనే వుండిపో. స్థిరంగా ఇక్కడవున్న నిన్నుపూజించే జనులకు లక్ష్మీఅను గ్రహం కలుగుతుంది. సంవత్సరానికి ఒకసారి నీకు షోడశోపచారములూచేసి పూజిస్తారో వారి కోరికలన్నీ నేను తీరుస్తాను. వారికి లక్ష్మీ కటాక్షం పూర్తిగా కలుగుతుంది. దిగులుపడకు ఇదే నీ స్థిరనివాసము అంటూ

ఓదార్చి అనునయించి లక్ష్మీనారాయణులు తమ నివాసానికి వెళ్ళి పోయారు. ఆనాటినుంచీ శనివారాలు రావిచెట్టు పూజనీయాలుగా మారి పోయాయి. జ్యేష్ఠాదేవిని పూజించిన వారికి అలక్ష్మి తొలగిపోయి లక్ష్మీ అనుగ్రహం కలుగుతుంది. ద్వాపరయుగంలో సత్యభామ ఇదే జ్యేష్ఠాదేవీ వ్రతంచేసి సకల సౌభాగ్యాలూ పొందినట్లు శాస్త్రవచనం. సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మే ఈవ్రతమును సత్యభామకు చెప్పినట్లు పురాణాలవల్ల తెలుస్తున్నది.

## 1042. చిత్రగుప్తుడెవరంటే...?

చిత్రగుప్తుడి అసలుపేరు చిత్రుడు. చిత్రుడు సూర్యవంశపురాజు. తన వంశానికి మూలపురుషుడైన సూర్యభగవానుని గురించి చిత్ర మహారాజు తపస్సుచేశాడు. అతని తపస్సుకు మెచ్చుకున్న సూర్యుడు సాక్షాత్కరించి, చిత్రునికి సర్వజ్ఞత్వాన్ని, అన్నికార్యాలలోనూ నిపుణత్వాన్ని వరాలుగా ప్రసాదించాడు. చిత్రుడు మహాదానంత పడ్డాడు. ఆదిత్యునిచేత వరదుడైనాడు కనుక నాటినుండి చిత్రున్ని చిత్రాదిత్యుడనసాగారు. యమధర్మరాజు చిత్రా దిత్యుని వంటి సకలకార్యదురంధరుడు, సర్వజ్ఞుడు, తనవద్ద చేదోడుగా ఉంటే వెసలుబాటుగా ఉంటుందని భావించాడు. చిత్రాదిత్యుని సశరీరంగా తన పట్టణానికి తీసుకురావలసినదిగా భటులను పంపాడు. యమభటులు చిత్రాదిత్యుని సన్నిధికి వెళ్ళి, జరిగిన వృత్తాంతమంతా అతనికి విన్నవించి యమలోకానికి తీసుకువెళ్ళారు. యముడు చిత్రాదిత్యునితో వివిధ ప్రాణులు చేస్తూవుండే కార్యకలాపాలను గమనిస్తూ, వాటన్నింటిని గుప్తంగా గ్రంథస్తం చేయవలసినదని, ఆ విధంగాచేస్తే పాపులను శిక్షించడం తనకు సులభమవు తుందని, లోకకళ్యాణార్థం ఈ బాధ్యత స్వీకరించవలసినదేనని ప్రార్థించాడు. చిత్రాదిత్యుడు అందుకు అంగీకరించాడు. నాటినుండి యమలోకంలో తన నిత్య నివాసాన్ని ఏర్పర్చుకొని ఎనభైనాలువేలకోట్ల జీవరాశులు నిత్యం చేసే పాప, పుణ్యకర్మలన్నింటిని తనసర్వజ్ఞత్వంతో పరికిస్తూ, రహస్యంగా గ్రంథ స్థం చేయసాగాడు. ఈవిధంగా గుప్తంగా పాపపుణ్యాల చిట్టాను భద్రపరస్తు న్నాడు గనుక చిత్రునికి చిత్రగుప్తుడనే పేరు వచ్చింది.

మన భారతదేశంలో చిత్రగుప్తునికి కూడా దేవాలయం వుంది. అది ఏడుమోక్షపురాలలో ఒకటైన కాంచీపురంలో చిత్రగుప్తునికి దేవాలయం వుంది. అందరు దేవతలకువలెనే ఆ దేవాలయంలో చిత్రగుప్తునికి నిత్య పూజలు జరుగుతాయి. పాపం సెలవులులేని పని కలిగిన కార్యాలయంలో కార్యదర్శిగా నియమితుడైన గొప్పకార్మికుడు చిత్రగుప్తుడు.





## 1043. 27 నక్షత్రాలు ఇష్టపడే పదార్థాలు ఏవి ?

అశ్విని-బంగాళాదుంప, బూడిదగుమ్మడికాయ, వేరుశెనగ; భరణి-పుట్ట గొడుగులు, జీడిపప్పు; కృత్తిక-జిలేబి, ఎర్రగడ్డలు, స్ట్రాబెర్రీ, బాదాంపప్పు,బొప్పాయి; రోహిణి-కొబ్బరి, కోడిగుడ్డు; మృగశిర-క్యారట్ హల్వా, ఎండు మిర్చి; ఆర్ద్ర-చింతపండు,పులిహోర, అల్లం; పునర్వసు-నిమ్మ కాయ పులిహోర, పైనాపిల్, శెనగపప్పు, జాంపండు, పనసపండు; పుష్యమి-వంకాయ, పిస్తా; ఆశ్లేష-ఆకుకూర, క్యాబేజీ, బీరకాయ, పెసలు, పొట్లకాయ, కాకరకాయ, పచ్చబఠానీలు;మఖ-చాకోలేట్లు, గోధుమ ఉప్మా; పూర్వాభాద్ర-మొక్క జొన్నలు, పొంగల్; ఉత్తరాభాద్ర-నేరేడు, నల్లబెల్లం; హస్త-వెల్లుల్లి, తెల్ల ఉల్లిపాయలు, ముంజులు; చిత్త-కేసరి, బీట్‌రూట్, కందిపప్పు; స్వాతి-కాఫీ,తేనె; విశాఖ-అరటిపండు, క్యాలిఫ్లవర్; అనూరాధ-నల్లద్రాక్ష,సీతాఫలం; జ్యేష్ట-పచ్చిమామిడి, బీన్స్, మునక్కాయలు, సొరకాయ, కరివేపాకు; మూల-సపోట,చపాతి,బెల్లం; పూర్వాషాడ-పాలు, పాలపదా ర్థాలు; ఉత్తరాషాడ-గెనసగడ్డ,ఆపిల్; శ్రవణం-ఇడ్లీ, చక్కెర, తెల్లమినుములు; ధనిష్ట- టమోటా, నారంజ, జాంగ్రి, పుచ్చకాయలు; శతభిషం-దోశె, వడ, బోండా,బజ్జి,చిరుతిండ్లు; పూర్వాభాద్ర-మామిడిపండు, దోసకాయ; ఉత్తరాభాద్ర-కర్జూరం, గోధుమ, నల్లమినుములు; రేవతి-బెండకాయ, కీర దోసకాయ, చిక్కుడు కాయలు, కొత్తిమీర.

## 1044. వ్యాస క్షేత్రాలు అనగా ఏవి ?

మనదేశంలో అనేక క్షేత్రాలు వ్యాసుని పేరుతో ముడిపడి ఉన్నాయి. దేవ ప్రయాగకు దగ్గరగా వాసాశ్రమం, కురుక్షేత్రంలో వ్యాసస్థలి, హిమా లయాల్లో వ్యాసాశ్రమం, కాశీకి సమీపంలో వ్యాసకాశి. ఇలా చాలా స్థలాలు ఆయన నివసించిన ప్రదేశ జ్ఞాపకాలుగా మిగిలాయి. మన ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ సరస్వతీక్షేత్రం బాసర వ్యాసక్షేత్రంగా, వ్యాసపురిగా ఆదికాలం నుంచి ఖ్యాతిపొందింది. బాసరలో తల్లి సరస్వతిని సాక్షాత్కరించుకున్న వ్యాసులవారు, గోదావరి తీరాన ఆమెను ప్రతిష్ఠించినట్లు బ్రహ్మాండపురాణ గాథ. అంతేకాక అష్టాదశ శక్తిపీఠాలలోని ద్రాక్షారామంతో కూడా వ్యాసునికి అనుబంధం ఉంది. మన ఆంధ్రను పునీతం చేసింది ఆ మహర్షి పాదస్పర్శ.

## 1045. చాతుర్మాస్యం అనగా ఏమి ?

ప్రతి ఆశ్రమానికి ఒక ధర్మముంటుంది. సన్యాసాశ్రమ స్వీకారం చేసిన యతి ఒకే స్థానంలో ఎక్కువరోజులు గడపకూడదనేది నియమం. సంచరిస్తూ

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

ధర్మప్రచారం, చేయడం సన్యాసికర్తవ్యం. ప్రజల్ని కలుస్తూ వారిలో ధార్మిక తను, భక్తిప్రపత్తులను పెంపొందింపజేయడమే ఈ నియమానికి మూల సూత్రం. ఒకేచోట నివాసముంటే ఆస్థలంతో అక్కడి ప్రజలో బంధం బలపడు తుంది. అట్టిబంధాలకు అతీతంగా ఉండాలన్నదే ఈ సంచార నియమంలోని మరోరహస్యం. కాని ఇట్టిసంచారంవల్ల సాధనకు ఆటంకా లేర్పడతాయనే ఉద్దేశంతో సన్యాసికి చాతుర్మాస్యదీక్షను శాస్త్రం విధించింది. ఈ చాతుర్మాస్య దీక్ష ఆషాఢశుద్ధ పౌర్ణమితో ప్రారంభమై వర్షఋతువులో ఘటిస్తుంది.

అంతేకాక కేవలం పాదచారులై సంచరించే సన్యాసుల పాదాల క్రింద వర్షాకాలంలో తరచుగా రహదారుల్లో నడిచే క్రిమి కీటకాలు పడితే, వారు అహింసా ధర్మానికి దూరమవుతారనే భావన కూడా ఈ సంచా నియమంలో మరో ప్రధానమైనతాత్పర్యం. సన్యాసి చాతుర్మాస్య దీక్షకు అనువైన ప్రాంతాన్ని ఎన్నుకుని, తానాచోట దీక్ష సంకల్పించానని అక్కడి పురజనులకు ప్రకటిం చాలి. ఆ పౌరులు స్వామివారి సంకల్పాన్ని తమ పాలిట వరం అని భావించి ఆ స్వామికి అన్నివిధాలా సహకరిస్తామని, కైంకర్యంలో లోటుపాట్లు జరగ బోవని ప్రతినబూనాలి. ఈచాతుర్మాస్యదీక్షలో స్వామికి సమర్పించే భిక్షావంద నం ఒకవరం.

### 1046. వేదమనగా నేమి?

ఇష్టప్రాప్త్య నిష్టపరిహారయోర లౌకికముపాయం యో గ్రంథో వేదయతి స వేదః అను సాయణాచార్య నిర్వచనము ననుసరించి యే గ్రంథము వలన అభీష్ట సిద్ధి అనిష్ట విషయ నివారణము జరుగుటకు అవసరమైన అలౌకికమైన ఉపాయము తెలియజేయబడునో ఆ గ్రంథమునకు వేదమని పేరు. శ్రీసాయణులవారే మరొక శ్లోకమునందు వేదమును గురించి ప్రత్యక్షే ణాను మిత్యావా యస్తూపాయో నవిద్యతే! ఏనం విదంతి వేదేనప తస్మాత్వే దస్య వేదతా"అని చెప్పారు. అనగా ప్రత్యక్ష ప్రమాణము చేతగాని, అనుమాన ప్రమాణముచేతగాని ఏ ఉపాయము స్ఫురించదో ఆ ఏ పాయమును వేదము చేత తెలిసికొనవచ్చును. అందుచేతనే వేదమునకు వేదత్వము సిద్ధించును అని శ్రీ సాయణులమతము.

### 1047. ఉపవేదములని వేటికి పేరు ?

ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, శిల్పవేదము ఈ నాల్గింటికి ఉపవేదములని పేరు.





### 1048. పంచమూర్తులు ఎవరు?

శ్రీ గణపతి, శ్రీ సుబ్రహ్మణ్యస్వామి, శ్రీ పరమశివుడు, శ్రీ పార్వతీదేవి, శ్రీ చండికేశ్వరుడు.

### 1049. పంచయజ్ఞాలు అంటే ఏమిటి ?

జల్లెడ, రుబ్బురోలు, చీపురు,రోలు,కుండ ఈ ఐదింటిని వాడటంవల్ల పాపం వస్తుంది. వీటి నివారణకు చేసే యజ్ఞాలను పంచమహాయజ్ఞాలు అంటారు.

### 1050. పంచహోమాలు అంటే ఏమిటి ?

గణపతిహోమం : అనుకున్న కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరేందుకై చేసేహోమం;చండీహోమం :దరిద్రం, భయాలు తొలగేందుకు చేసే హోమం; నవగ్రహహోమం : గ్రహదోషం తొలగేందుకు నవగ్రహప్రీతికోసం చేసే హోమం; సుదర్శనహోమం : సమస్తదోషాలు తొలగేందుకు; రుద్రహోమం: ఆయుర్వృద్ధి, ఆరోగ్యం కోసం చేసే హోమం.

### 1051. పంచనాథ స్థలాలు ఎక్కడ ఉన్నాయి ?

కాశీ–శ్రీ విశ్వనాథుడు, పూరి– శ్రీజగన్నాథుడు; రామేశ్వరం–శ్రీరామ నాథుడు; వైదీశ్వరం–శ్రీవైధీశ్వరుడు

### 1052. పంచ భగవతి స్థలాలు ఎక్కడ ఉన్నాయి ?

కొల్లూరు – మూకాంబిక; వడగరా – లోకాంబిక; పాల్ఘాట్– హోమాంబిక; కొడుంగళ్లూరు–మహాభగవతి; కన్యాకుమారి–బాలాంబిక.

### 1053. మంత్రసాధన ఆసనం ఏమివాడాలి?

కుశాసనం, మృగచర్మాసనం, వ్యాఘ్రచర్మాసనం, ఉన్ని ఆసనం శ్రేష్ఠ మైనవి. ఆసనంలేకుండా, కష్టపడుతూ చేసిన మంత్ర జపం సిద్ధించదు.

### 1054. మంత్రసాధనకు జపమాల ఏమివాడాలి?

రుద్రాక్షమాల, జయంతీఫలమాల,తులసిమాల,స్ఫటికమాల, శంఖ మాల, హస్తిదంతమాల, పగడాలమాల, ఎర్రచందనం మాల వీటిలో ఏవైనా 108–54–27 పూసలమాల ఉండాలి. మంత్రసాధనకు రుద్రాక్షమాల శ్రేష్ఠమైనది. జపం శీఘ్రంగా సిద్ధించి పరమేశ్వరుని కృపలభిస్తుంది.

### 1055. మంత్రసాధనలో చేయకూడనివి ?

జప సమయంలో ఆసనం మార్చటం, దగ్గటం, తుమ్మటం, ఉమ్మటం, అపానవాయుత్యాగం, ఇతర విషయాల చింత నిషిద్ధం. జపం చేసేవారు

MOHAN PUBLICATIONS.COM

ఏకాగ్రతతో మంత్రం, తదధిష్టాన దేవతను ధ్యానించాలి. మంత్రాన్ని పాటలా పాడటం, ఉచ్చారణదోషం చేయటంతప్పు. స్నానం చేశాఖ శుద్ధమైన నూలు, పట్టు, లేదా ఉన్ని వస్త్రాలను ధరించాలి. జపసమయంలో కోపం, దుర్భాష లాడటం తగదు.

### 1056. మంత్రసిద్ధికి 12 నియమాలు ఏవి ?

1.నేలమీదనిద్ర 2.బ్రహ్మచర్యం 3.మౌనం4.గురుసేవ 5. త్రికాలసంధ్య 6. పాప కర్మపరిత్యాగం 7. నిత్యపూజ 8. నిత్యదానం 9. దేవతాస్తుతి 10. నైమిత్తికపూజ 11. ఇష్టదైవం, గురుదేవునిపై విశ్వాసం 12. జపనిష్ఠ.

### 1057. పుష్కరస్నానానికి, పిండప్రదానాలు, తర్పణాలకు గల సంబంధ మేమిటి?

బృహస్పతి (గురువు) ఆయారాశులలో ప్రవేశించినప్పుడు ఆయా నదులకు పుష్కరాలువస్తాయి. పుష్కరసమయంలో నదీస్నానం చేయడం, నదీ తీరంలో క్షౌరం చేయించుకుని తరువాత విధిప్రకారం మృత్తికాస్నానంచేసి, పితృతర్పణంచేసి, దానాలుచేసి, పిండప్రదానంచేయడం ముఖ్యం. పుష్కర సమయంలోనేగాక గయ, త్రివేణీ సంగమం వంటి తీర్థక్షేత్రాలలో విధిగా క్షౌరం,స్నానం, పితృతర్పణాలు వదలటం, పిండప్రదానాలు చేయాలి. పుష్కరాలునదులకే వస్తాయిగాని, సముద్రానికిరావు. సముద్రస్నానానికి సంబంధించిన నియమ నిబంధనలు వేరేగా వున్నాయి.

### 1058. కాంతివ్రతం అంటే ఏమిటి ? ఆ వ్రతాన్ని ఏ సమయంలో చేయాలి? వ్రత విధానాన్ని వివరించగలరు.

వెలుతురును పూజించే వ్రతానికి కాంతి వ్రతమని పేరు. దీనినే లక్షవర్తి వ్రతమని పిలవడం పరిపాటి. ఆషాఢ శుద్ధ దవమి రోజున ఏకభుక్తంచేసి మరునాడు అనగా ఏకాదశినాడు, ఈవ్రతాన్ని ప్రారంభించి, పది ఏకాదశులు ఉపవాసంచేస్తూ కార్తీకశుద్ధ ఏకాదశినాడు ఉపవాసంచేసి, లక్షవర్తులను పూర్తిచేసి, తరువాత మండపారాధన, మొదలైనవిచేసి పౌర్ణమికి వ్రతాన్ని ముగించాలి. ఈ వ్రతం ఎంతో ఫలదాయికమైన వ్రతం. దీనిని ఆచరించే విధానము, ఇతరవివరాలు స్థానికపురోహితుల ద్వారా తెలుసుకుని ఆచరించండి. శుభం కలుగుతుంది.

### 1059. శ్రీ లలితా త్రిపురసుందరీదేవి ఎందుకు శివుని వక్షస్థలంపై కూర్చొని ఉంటుంది ?

అది ఒక అలంకారిత వర్ణన. అమ్మవారు శక్తిస్వరూపిణి. శివునికి శక్తితోడయితేనే శివుడు ఏమైనాచేయగల సమర్థుడౌతాడు. ఆశక్తిని స్త్రీ





మూర్తిగా భావించడంలో అంతర్యమేమిటంటే స్త్రీఅనగా సకార, తకార, రకారాలు,పైన ఈ కారం వ్రాస్తాము. అంటే త్రిగుణాలైన సత్వ,రజ,స్తమో గుణాలు,పైన ఈకారమంటే చైతన్యానికి చిహ్నంకాబట్టి అమ్మవారు సత్వరజ స్తమోగుణాత్మకమైన చైతన్యశక్తి అన్నమాట. ఈ త్రిగుణాలే బ్రహ్మ, విష్ణు, శివులు, సత్వగుణ స్వరూపుడైన బ్రహ్మపుట్టిస్తాడు. రజోగుణ ప్రధానుడైన విష్ణువు పెంచుతాడు. తమోగుణ ప్రధానుడైన శివుడు తృంచుతాడు. ఆ ముగ్గురూ తమపనులు కొనసాగించాలంటే వారికి చైతన్యశక్తి తోడుకావాలి. ఆ చైతన్యశక్తికిమూర్తి అమ్మవారు. ఆ శక్తికాళ్ళలోనే, భుజాలలోనేగాక గుండెల్లో నిండి ఉండాలి. అందుకే ఆ శక్తి తమ పనులు కొనసాగిస్తుంటారు. ఆ చైతన్యశక్తిని శ్రీలలితా త్రిపురసుందరి రూపంలో తన వక్షస్థలంమీద కూర్చోపెట్టుకుని శివుడు తనపనిని కొనసాగిస్తాడు. ఆ శక్తి బ్రహ్మవిషయంలో సరస్వతి, విష్ణువుదగ్గర లక్ష్మీదేవి, శివునికి పార్వతీ స్వరూపాలలో ఉంటుంది. ఆ ముగురమ్మలకు మూలపుటమ్మ పరాశక్తి, అంతా ఆ పరాశక్తి లీలలే. ఆ శక్తే అంతటికీ కారణం.

### 1060. భార్య చనిపోతే తద్దినాలు, తర్పణాదులు భర్త చేయాలా ? కొడుకులు చేయాలా ?

మాసికాలు, తద్దినాలు పెద్దకొడుకే చేయాలి. భర్త ఆయా సమయాలలో తర్పణాలు వదలాలి, అసలు శ్రాద్ధకర్మకు, పిండప్రదానాదులకు వెనుక ఒకరహస్యముంది. చనిపోయిన జీవుడు తన సంస్కారములకు అనుకూలమైన మరియొక శరీరమును వెతుకుతూ కారణశరీరంలో ఆకాశంలో సంచరిస్తూ వుంటాడు.

ఆ జీవుని గర్భావాసంలో పుట్టిన పెద్దకొడుకును తండ్రి లేక తల్లియొక్క సంస్కారములు బాగా తెలిసివుంటాయి. అందువలన ఒక సంవత్సరము పాటు ఆ జీవుడిని తనగర్భవాసంలో ప్రవేశించమని పిలుస్తాడు. అదే మాసికమంటే, అందులో పిండప్రదానం చేస్తాడు. పిండమంటే శరీరమే. ఆ విధంగా చనిపోయిన జీవుడు అతని మనసులో ప్రవేశించి అతని రేతస్సు ద్వారా అతని భార్య కడుపులో ప్రవేశించి మరల జన్మిస్తాడు.

### 1061. శివునికి లింగ రూపం ఎందుకు ?

ఆ పరమశివునికి రెండు తత్వాలున్నాయి. అవి ఒకటిఅకలం. రెండవది సకలం. అకలం, అంటే నిరాకారాం, నిర్గుణం, నిరంజనం , బ్రహ్మజ్యోతి స్వరూపం. సకలం, అంటె సగుణం, భక్తానుగ్రహవిగ్రహం. లింగరూపం

MOHAN PUBLICATIONS.COM

అవయవరహితమై, జ్యోతిస్స్వరూపంగా,ఆద్యంతములు తెలియనిదై గోచరి స్తుంటుంది. చంద్రశేఖర్ చర్మాంబరదలు మొదలైనవి సకలం. ఈ రెండు తత్వాలు పూజనీయాలే. సర్వందేనిలో లీనమైఉంటుందో ఆ పరమాత్మే లింగరూపుడు. అందుకే ఆ పరమశివుణ్ని లింగరూపంలో పూజిస్తారు.

శివుడు'అశుతోషుడు' అంటే భక్తజన సులభుడు. ఆది మద్యాంత్ రహితుడై ఆయన్ని లింగరూపంలో అర్చిస్తారు. మహాశివరాత్రినాడు ఆ లింగానికి అర్చించి మారేడు దళాలతో పూజించడం మహాపుణ్యదాయకం.

## 1062. కృత్తికా యోగం ఎప్పుడు వస్తుంది ?

కార్తీక పూర్ణిమనాడు కృత్తికా నక్షత్రం వుంటే అదే కృత్తికా యోగం. ఆనాటి పుణ్యం అంతా,యింతా కాదు. మహాపుణ్యదినం. ఆనాడు కుమార స్వామిదర్శనం అనంత ఫలప్రదం. ఎటువంటి పనిచేయడానికైనా సరే నేను తయారు అన్నట్లుగా నడుంమీద చెయ్యిపెట్టుకొని మరీ నిలుచోవడం అమితవేగం గల ఇంద్రుడిచ్చిన నెమలి వాహనం ఎక్కి తిరగడం ఆయన సామర్థ్యానికిగురుతు. శ్రీమహావిష్ణువు మహర్షిగా భూలోకంలో అవతరించాడు. ఆయన కుమార్తె చాలాసన్నగా వుండేది. అందుకే ఆమెకు "వల్లి"అనేపేరు. ఈమెను వివాహ మాడి మహావిష్ణువుకు అల్లుడైన కుమారస్వామి గంభీరమైన మంచిస్వరంతో కృత్తికాయోగంలో అర్చించిన భక్తులకు అనుగ్రహం ప్రసా దిస్తాడు. కోరికలన్నీ తీరుస్తాడు.

## 1063. ప్రదోషార్చన విశిష్టత ఏమిటి ?

యశ్శివో నామ రూపాభ్యాం, యాదేవీ సర్వమంగళా, తయోః సంస్మర ణాత్, పుంసాం సర్వతోజయమంగళ॥

శివస్వరూపమూ నామమూ శుభప్రదమైనవి. ఆనందమిచ్చేవి. పార్వ తియే సర్వమంగళములు యిచ్చేతల్లి. ఆ ఇరువురి స్మరణము అన్ని శుభము లనూ సర్వవిధ మంగళములనూ ప్రసాదిస్తుంది.

కార్తీక సోమవారాలు శివా శివులకు ప్రీతికరమైన రోజులు. అంబతో వున్న శివునికి "సాంబశివుని"కి అత్యంత ప్రీతిపాత్రాలు. ఈ విధంగా సోమ వారాలు ప్రదోషంలో దీపం, ధూపం, నైవేద్యాలు చేసేవారికి సాంబశివుడు సకలాభీష్టాలూ తీరుస్తాడు. సర్వవిధమైన శనిబాధలు నశింపచేస్తాడు. కాలస్వరూ పుడు కనుక, నవగ్రహాలూ కాలము నందలివే కనుక, ఆయా వారాలలో ప్రదోష సేవ చేసిన వారికి ఆయా గ్రహ దోషాలు తొలగించి





సాంబశివుడు అనుగ్రహి స్తాడు. సూర్యుడు అస్తమించిన ఒక గంట తరువాత వచ్చేది ప్రదోషం, ఇది కాల విశేషం. ఒక గంట అనగా మూడు ఘడియల కాలం. ఈ ప్రదోష కాలంలో శివుని సేవించిన వారికి సర్వవిధ దోషాలు తొలగిశ్రేయోభివృద్ధి కలుగుతుంది. ఇదే ప్రదోషార్చన. ఈ ప్రదోష కాలంలో దేవతలందరూ ఒకచోట వుంటారట.

కైలాస పర్వతంపై...భవనంలో త్రిజగజ్జనని గౌరి రత్నాలు పొదిగిన బంగారు సింహాసనంపైన ఆసీనయై వుంటుంది. ఆ తల్లి ఎదుట శివుడు నాట్యం చేస్తాడట. సరస్వతి వీణ వాయిస్తున్నది. ఇంద్రుడు వేణువు నూదు తాడట. బ్రహ్మ తాళం వేయడం, లక్ష్మీదేవిపాట పాడడం, మహావిష్ణువు మృదంగం వాయిస్తున్నాడట, గంధర్వులూ, సిద్ధులూ, దేవతలూ ఈ ప్రదోష వేళ సేవించుకొని, తమతమ కోరికలు తీర్చుకుంటారట. అంతటి మహిమాన్వితమైనది ప్రదోషకాలం. కార్తీకంలో ప్రదోషకాలాన్ని ఆనందంగా దైవస్మరణతో పంచుకోండి శ్రేయస్సు పొందండి.

## 1064. ఘంటానాదం అనగా ఏమి ?

దేవతార్చనలో ముందుగా వేయవలసింది ఘంట మ్రోగించడం పూజకు ముందు ఘంట యెందుకు మ్రోగించాలో తెలుసుకోవాలి.

"ఆగమార్థంతు రాక్షసాం గమనార్థంతు రాక్షసాం ।
కురు ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనం॥

పూజాస్థలంలో– ఆగమార్థంతు దేవానాం దేవతలు రావడం కోసం గమనార్థంతు రాక్షసాం అచ్చట వుండే కొన్ని రాక్షసశక్తులు పోవడం కోసం ఘంట మ్రోగించి శబ్దం చేయడం ఓ విధమైన లాంఛనమిది. ప్రతిచోటా, ప్రతినోటా అనుకూల శక్తులూ, ప్రతికూలశక్తులూ వుంటాయి. కంటికి కనుపించకుండా వుండే ఈ శక్తులు మనని ప్రభావితం చేస్తాయి. అందుకే శుభ్రత, కాంతి, శుచివున్న చోట్లకు వ్యతిరేకశక్తులురావు. అశుభ్రత, అశుచి వున్నచోటే దుష్టశక్తులుంటాయి. అవే రాక్షస శక్తులు. వాటిని పారద్రోలి, దీపాలు వెలిగించి, ధూపాలువేసి, శుచిగా, శుభ్రతగా వుంచడం, దైవశక్తులకు ఆహ్వానం పలకడం, ఘంటానాదంలోని ప్రత్యేకత. అందుకే పూజ ప్రారం భంలో ఘంటానాదం తప్పక చేయవలసిన లాంఛనం!

## 1065. యాత్రలకు వెళ్ళినప్పుడు యింటిలోని దేవతా విగ్రహాల స్థితి ఏమిటి ?

దేవతార్చన, దేవతా యంత్రాలు, దేవతా విగ్రహాలు నిత్యం దీప, ధూప, నైవేద్యాలతో అర్చించిన కొలదీ అవి శక్తివంతమయి వుంటాయి.

MOHAN PUBLICATIONS.COM

అయితే సాంసారిక జీవనంలో వున్నవారు, గృహస్థ ధర్మం ఆచరించే సంద ర్భంలో భాగంగా బంధువుల ఇండ్లకు, శుభాశుభ నిమిత్తంగా ప్రయాణం చేయవలసి రావడం, తీర్ధయాత్రలు చేయవలసిరావడం జరుగుతూ వుం టుంది. అటువంటి సందర్భంలో దేవతా విగ్రహాలు, దేవతా యంత్రాలను, దేవతార్చనలను బియ్యం డబ్బాలోపెట్టి మూతవేసి వుంచి, తిరిగి వచ్చిన తరువాత వాటికి సంప్రోక్షణచేసి, ప్రాణప్రతిష్టచేసి యధావిధిగా నిత్యం దీప,ధూప,నైవేద్యాలతో అర్చించు కొనవచ్చును. యిది పెద్దలు ఏర్పరి చిన ఆచారము. ప్రయాణమునకు వెళ్ళే టప్పుడుదేవతార్చన, దేవతా విగ్ర హాలు, దేవతా యంత్రాలను వుంచిన బియ్యముతో వంటచేసి దేవతా నివేదన చేయుట ఆచారముగా వున్నది.

### 1066. జీర్ణమయిన దేవతా పటములను, ఫోటో ఫ్రేములు దేవతా విగ్రహములను ఏమి చేయాలి ?

జీర్ణమయిన పటములు, విగ్రహములవంటి వాటిని పూజలో వుంచ కూడదు. రంగులు వెలసిపోయిన పటములు మరియు విరిగిపోయిన విగ్రహ ములు కూడా పూజలో వుంచరాదు. అటువంటి వాటిని జీవనదిలో కలిపి వేయుట లేదా దేవాలయములో అప్పగించుట చేయవలెను.

### 1067. ప్రయాణమునకు ముహూర్తము కుదరకపోయినచో ఏమిచేయ వలెను?

రోజువారి ప్రయాణములు, ఉద్యోగరీత్యా ప్రయాణములు, ప్రమాద స్థల ములకు వెళ్ళవలసి వచ్చినప్పుడు ముహూర్తాల కోసం వెదకనవసరం లేదు. అంతే కాకుండా ప్రభుత్వ విషయంగా, ఆరోగ్య విషయంగా, వృత్తి విషయాలలోను ప్రయాణానికి ముహూర్తములు వెతకవలసిన అవసరం లేదు. కేవల వర్జ్యము, దుర్మహూర్తము మాత్రమే చూసి అవిలేని సమయంలో ప్రయాణం చేయవచ్చును. ప్రయాణమునకు ముందు భగవన్నామ స్మరణ, మంచి శకున ములు, భగవద్దర్శనంతో ముహూర్త దోషాలు పోతాయి. ప్రయాణంరోజున తిథి, వార, నక్షత్రములు కుదరకపోతే, అత్యవసరంగా ప్రయాణం చేయవలసి వస్తే హనుమానంజనాసూనుః వాయుపుత్రో మహాబలః రామేష్ట ఫల్గుణ సఖః పింగాక్షో మిత విక్రమః, ఉదతిక్రమణశ్చైవ సీతా శోక వినాశకః లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవచ్చ దర్ణమా పారాయణ చేసుకుంటూ ప్రయాణం చేయండి. సుఖ ప్రయాణం జరుగుతుంది. గర్భవతుల విషయంలో ఆషాఢ, భాద్రపద, మౌఢ్య, కర్తరీ దోషాలు ప్రయాణా నికి చూడనవసరంలేదు.





### 1068. పితృదేవతలు ఎవరు?

బ్రహ్మకుమారుడైన మనుప్రజాపతికి సప్తఋషులు జన్మించారు. వారు పితృదేవతలను సృష్టించారు. వీరేకాక విరాట్ పురుషుడు, బ్రహ్మదేవుడూ పితృదేవతల్నీ ఏర్పరచారు. బ్రహ్మ సంభవుడు రూపాలుగల మూడురకాల దేవతల్నీ, తేజస్సుగల నాలుగు రకాల పితృదేవల్ని సృష్టించాడు. మానవులు తర్పణంద్వారా సమర్పించే పిండాలు వారికి చేరుతాయి. పిండప్రదానం ద్వారా వారి ఋణం తీర్చుకోవాలి. అలా చేయని వారికి పాపం వస్తుంది. 'అకరణే ప్రత్యవాయః' అని శాస్త్రంచెబుతోంది. మనిషి తన శరీరాన్ని నిత్యం అన్నపానీయాలతో పోషించినట్లు సంవత్సరానికొకసారి పిండప్రదానం ద్వారఆ పితృదేవతనలు శ్రద్ధా భక్తులతో పూజించాలి.

### 1069. అష్టవిధ పుష్పాలు అనగా ఏవి ?

భగవంతుణ్ణి ఎనిమిది రకాలైన పుష్పాలతో అర్చించాలని పెద్దల మాట. ఆ అష్టవిధ పుష్పాలగురించి ప్రతీకాత్మకంగా చెప్పారు. దీని గురించి ఓ పురాణకథ ఉంది. శ్రీస్కాంద మహాపురాణంలోని రేవాఖండంలో 51వ అధ్యాయంలో ఇలా ఉంది. నర్మదా తీరంలో అమరకంటకమనే ఓ పర్వతం ఉంది. అక్కడే నర్మతలో శూలభేద తీర్థం ఉంది. ఆతీర్థం దగ్గర అమర కంటక పర్వతంమీద ఓ గుహ ఉంది. ఆ తీర్థం దగ్గర అమర కంటక పర్వతం మీద ఓగుహ ఉంది. ఆ గుహలో శ్రీమార్కండేయ మహర్షి వెయ్యి దివ్య సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒక శివలింగాన్ని కూడా అక్కడ ప్రతిష్ఠించాడు. ఆ స్వామికి మార్కండే యుడని పేరు. ఆ లింగమూర్తికి అష్టవిధ పుస్పాలతోనూ, అష్టవిధ మానసిక పుష్పాల తోనూ పూజచేయాలి. ఆ అష్టవిధ పుష్పాలు.

వారిజం, సౌమ్యం, ఆగ్నేయం, వాయవ్యం, పార్థివం, వానస్పత్యం, ప్రాజాపత్యం, శివపుష్పం, అని పుష్పాలు ఎనిమిది విధాలు. వివరంగా చెప్పాలీ అంటే- 1. వారిజ-పుష్ప సమర్పణమంటే దేవుడికి అభిషేకం చేయడం, 2. సౌమ్య-పుష్పసమర్పణమంటే భగవంతుడికి తేనె,నెయ్యి,పాలు నివేదించడం. 3. ఆగ్నేయ-పుష్పసమర్పణమంటే దేవుడికి(ధూప,దీపాలు సమర్పించడం) 4.వాయవ్య పుష్పపూజ అంటే చందనం మొదలైనవి దేవుడికి అలదడం. 5.పార్థివ పుష్పార్చనమంటే కందమూలాదుల్ని నైవేద్యంగా పెట్టడం 6.వానస్పత్య పుష్పోపహారమంటే దేవుడికి ఫలాదుల్ని సమర్పించ

డం. 7. ప్రాజాపత్య పుష్ప సమర్పణమంటే దేవుడి ఎదుట వేదపురాణాదుల్ని చదివి, వినిపించడం. 8. శివపుష్ప సమర్పణమంటే భక్తుడు తన మనోవాసనల్ని సమర్పించడం.

### 1070. మానసిక పుష్పాలు అనగా ఏమి ?

భగవత్ భక్తులు మొదట ఇలాపత్రాలు, పుష్పాలతో పూజిస్తారు. ఇవన్నీ పూజలో ప్రథమసోపానాలు. అయితే, సాధనాక్రమంలో ముందుకు వెళ్ళాక, ఆత్మవికాసం పొందిన తరువాత, సర్వాంతర్యామి అయిన దేవదేవుణ్ణి మనః పుష్పాలతోనే పూజించవచ్చు. మానసికంగా కూడా ఎనిమిది పుష్పాలుంటాయి. అవి 1.అహింసాపుష్పం 2.ఇంద్రియ నిగ్రహపుష్పం 3. దయాపుష్పం 4.క్షమాపుష్పం 5.ధ్యానపుష్పం 6.తపఃపుష్పం 7.జ్ఞానపుష్పం 8. సత్యపుష్పం.

### 1071. దేవాలయాలు ఎప్పుడు తెరవాలి ?

దేవాలయం ఎప్పుడు తెరవాలి అనే అంశానికి బ్రాహ్మణ ధర్మాలు, ధర్మశాస్త్రం, ఆగమశాస్త్రం, మూడింటినీ సమన్వయపరచి చెప్పాలి. బ్రాహ్మణ ధర్మాలు, ధర్మశాస్త్రాలను అనుసరించి బ్రాహ్మణుడు బ్రహ్మముహూర్తం అని పిలువబడే ఉషఃకాలముతో నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకుని, సంధ్యా వందనములు పూర్తిచేసుకుని, సూర్యోదయం వరకు గాయత్రీ జపంచసి, సూర్యోదయకాలంలో సూర్యోపస్థానంచెప్పి ఆ తర్వాత ఇతర కార్యక్రమాలు చేపట్టాలి. ఈ విషయంగా బ్రాహ్మణ ధర్మాలు, ధర్మశాస్త్రం, పురాణాలలో మతాంతర పాఠాలు లేవు. అందరూ ఈ విషయాన్ని ఒకేవిధంగా తెలిపారు. అంతేకాకుండా ఏదేనిఅత్యవసర సందర్భాలలోను, విశేషదినములు, పర్వదినములలోను ఇతరకార్యం చేయదలిస్తే, ఉషఃకాలంలో సంధ్యావందనం అర్ఘ్యంఇచ్చి సూర్యపస్థానంఆపి, ఆ వేరుకార్యం చేయవచ్చని పెద్దల వాదన.

### 1072. ఉషఃకాలం అంటే ఏమిటి ?

ఉషః కాలం అంటే సూర్యోదయానికి పూర్వం రెండుగంటల కాలమ. నిత్యంలో ఏ వైదిక కర్మకాండ ఆచరించాలన్నా ఆగమశాస్త్ర ప్రకారం ఏదేని పూజ నిర్వహించాలన్నా, ఉషఃకాలంలోనే వారం, తిథి మార్పును గూర్చి సంక ల్పంలో ఉచ్చరించాలి. అటువంటి ధర్మాలు బ్రాహ్మణులకి ఉన్నాయి కావున బ్రాహ్మణులైన అర్చకులు ఉషఃకాలములో సంధ్యావందనాదులు ఆచరించికానీ దేవాలయం తెరవకూడదు. రామాయణం బాలకాండ 23వ సర్గలో విశ్వా మిత్రుడు రామలక్ష్మణులను గంగా సరయూనదీ తీరంలో





నిద్రలేపు సందర్భంలో కౌసల్యా సుప్రజారామా పూర్వా సంధ్యాప్రవర్తతే.. ఉత్తిష్ఠ నరశార్దూలా కర్తవ్యం దైవమాహ్నికం అని నిదుర లేపారు.

### 1073. శంఖుస్థాపనలో ఏమి యంత్రాలు వేయాలి ?

ఏ యంత్రమును వేయకూడదు. యంత్రం పూజచేసి ఏర్పాటు చేస్తారు. శంఖుస్థాపన దగ్గరనుండీ గృహనిర్మాణంపూర్తి అయ్యేవరకు కూడా ఆ గృహంలో అందరూ నియమబద్ధమైన సంచారం చేయరు. అంతేకాక యంత్రంవేసిన ప్రదేశం కాంక్రీటుతో పూడ్చబడి వుంటుంది. దానిమీద నడుస్తూ వుంటారు. అందుకని గృహప్రవేశం దాకా యంత్రాలు వేయకూడదు. మరోకోణంలో ఆలోచిస్తే, యంత్రమును పూజ యంత్రంగా వేస్తే నిత్యం పూజచేయాలి. ప్రతిష్ఠాయంత్రం అయితే అక్కడ శంఖుస్థాపన చేయుచోట ప్రతిష్ఠా కలాపన చేయుటకు అనుకూలం కాదు. కావు శంఖుస్థాపన సమయంలో యంత్రాలు వేయుట అజ్ఞానులు చేయుపని.

### 1074. ఎటువంటి రుద్రాక్షను ధరించాలి ?

సహజంగా రంధ్రం వుండే రుద్రాక్ష శ్రేష్ఠమైనది. మనావుడు రంధ్రం చేసిన రుద్రాక్ష మధ్యమం. పురుగుపట్టింది, పగిలింది, విరిగింది, కంటకములు లేనిది, మరియు వ్రణం వున్నది అనే ఆరురకాల అవలక్షణాలు గల రుద్రాక్షలను ధరించకూడదు.

### 1075. ఎన్ని రుద్రాక్షలు ధరించాలి ?

ఎప్పుడైతే 1100 రుద్రాక్షలతో కిరీటం చేసి ధరిస్తాడో అప్పుడు ఆ వ్యక్తి రుద్రరూపుడౌతాడు. 550 రుద్రాక్షలతో కిరీటం ధరిచే భక్తుడు మిక్కిలి శ్రేష్ఠమైనవాడు. 360 (మూడువందల అరవై) రుద్రాక్షలను మూడు పేటలుగా చేసి యజ్ఞోపవీతంగా ధరించాలి. శిఖలో మూడు రుద్రాక్షలను ధరించాలి. ఒక్కొక్క చెవికి ఆరు రుద్రాక్షలను ధరించాలి. కంఠంలో నూట ఒకటి రుద్రాక్షలు ధరించాలి. బాహువులకు 11, చేతులకు 11 మణికట్టులకు 11 రుద్రాక్షలు ధరించాలి. ఈవిధంగా రుద్రాక్షలను ధరించినవారిని ఈశ్వరునితో సమానమైన వాడని భావించి అందరూ నమస్కరించి స్తుతిస్తారు. ఈవిధంగా 1100 రుద్రాక్షలు ధరించి, శివనామం జపించే భక్తులను దర్శించిన వారందరి పాపాలు నశించిపోతాయి.

MOHAN PUBLICATIONS.COM

## 1076. రుద్రాక్ష ధరించే సమయంలో చేయాల్సిన మంత్రజపం ?

శిరస్సులో రుద్రాక్ష ధరించేసమయంలో "ఈశాన" మంత్రజపం చేయాలి. "తత్పురుష" మంత్రజపం చేస్తూ చెవులలో రుద్రాక్షలు ధరింఆచలి. "అఘోర" మంత్రజపం చేస్తూ హృదయంలోకూడా రుద్రాక్షలు ధరించాలి. "అఘోర బీజమంత్రం" పఠిస్తూ రెండుచేతులలో రుద్రాక్షలు ధరించాలి. "వామదేవ" మంత్రంతో 15 రుద్రాక్షమాలలను ఉదరం చుట్టూ ధరించాలి. "అంగసాహితి" ఓంకారం ఐదుసార్లు జపించి, మూడు, ఐదు, లేదా ఏడు రుద్రాక్ష మాలలను ఉదరం చుట్టూ ధరించాలి.

## 1077. రుద్రాక్ష ధారణలో ఆహారనియమాలు ఏవి ?

రుద్రాక్షలు ధరించేవారు మద్యం స్వీకరించకూడదు. మాంసం, వెల్లుల్లి, నీరుల్లి, మునగకూర, పందిమాంసం, విరిగినచెట్టుకూరను భుజించకూడదు. బ్రహ్మచారి గృహస్థుడు, వానప్రస్థుడు, మరియు సన్యాసి నియమ పూర్వకంగా రుద్రాక్షలను ధరించాలి. పుణ్యంచేసిన వారికి మాత్రమే రుద్రాక్షలను ధరించే భాగ్యంలభిస్తుంది. రుద్రాక్షలు లేకుండా ఒక్కక్షణమైనా వుండరాదు. రుద్రాక్షలను వీడిన వ్యక్తి సమస్త నరకాలను పొందుతాడు.

## 1078. రుద్రాక్షలను ఎప్పుడు ధరించాలి ?

ముందుగా ఉసిరికాయ ప్రమాణంలోగల రుద్రాక్షలను ధరించాలి. తర్వాత వాటికంటే తేలికైన వాటిని ధరించాలి. చిక్కుడు గింజప్రమాణం గల రుద్రాక్ష ప్రశస్త మైంది. అన్నివర్గాలవారు, అన్నిఆశ్రమాలలో వుండేవారు, స్త్రీలు, పురుషులు, సర్వదా రుద్రాక్షలు ధరించాలి. పగలు ధరిస్తే రాత్రి సమయంలో చేసిన పాపం, రాత్రిధరిస్తే పగలు సమయంలో చేసిన పాపం, సర్వకాలాలలోధరిస్తే సర్వపాపాలు, తొలగిపోతాయి. రుత్రదాక్ష శివుని మంగళకరమైన చిహ్నం. సర్వదా రుద్రాక్షలు ధరించాలి అనేది సాక్షాతు శివుడి ఆజ్ఞ.

## 1079. రుద్రాక్షలు - ప్రయోజనములు ?

ఏకముఖి రుద్రాక్ష : ఏకముఖి రుద్రాక్ష సాక్షాత్తూ శివసమానమే! అది భక్తిని, ముక్తిని సమస్త ఫలాలను ప్రసాదిస్తుంది. దానిని దర్శించిన మాత్రము చేతనే బ్రహ్మహత్యాదోషం తొలిపోతుంది. దానిని పూజించే స్థలములో సంపదలు విలసిల్లుతాయి. ఉపద్రవాలు తొలగిపోతాయి. కోర్కెలు తీరుతాయి. రెండు ముఖాలరుద్రాక్ష : రెండుముఖాలుగల రుద్రాక్ష శ్రేష్ఠమైనది.





గోహత్యా పాపాన్ని తొలగిస్తుంది. 3ముఖాలరుద్రాక్ష : మూడు ముఖాలు గల రుద్రాక్ష సాధన సంపత్తిని ప్రసాదిస్తుంది. దాని ప్రభావంవల్ల సాధకునికి విద్యలన్నీ స్థిరంగా వుంటాయి. 4ముఖాలరుద్రాక్ష : నాలుగ ముఖాలుగల రుద్రాక్ష సాక్షాత్తు బ్రహ్మ స్వరూపమైంది. నరహత్యా దోషం పోగొడుతుంది. దానిని దర్శించి, స్పృశించడంవల్ల నాల్గుపురుషార్థాలూ సిద్ధిస్తాయి. 5 ముఖాల రుద్రాక్ష:ఐదుముఖాలుగల రుద్రాక్ష సాక్షాత్తూ రుద్రస్వరూప మైంది. సర్వసమర్థమైన ఈ రుద్రాక్షను కాలాగ్నిఅంటారు. అది సర్వవిధముల ముక్తిని ప్రసాదిస్తుంది. సర్వకామములను యిస్తుంది. తినకూడని దానిని తినడం మొదలగు పాపాలన్నీ ఇది పోగొడుతుంది. మరియు అగమ్య గమనాన్ని పోగొడుతుంది. 6 ముఖాలరుద్రాక్ష :ఆరుముఖాలుగల రుద్రాక్షను ఎవరైతే కుడిభుజంలో ధరిస్తాడో అట్టివ్యక్తి బ్రహ్మహత్యాది పాపాలన్నింటి నుండీ నిస్సందేహంగా విముక్తి పొందుతాడు. ఏడుముఖాలరుద్రాక్ష: ఏడుముఖాల గల రుద్రాక్షకు "అనంగం" అనే పేరుంది. దాన్ని దరిద్రుడుగా వుండే వ్యక్తి ధరించినా కూడా అట్టి వ్యక్తి సమర్థుడవుతాడు. 8 ముఖాలగలరుద్రాక్ష : 8 ముఖములుగల రుద్రాక్షకు"భైరము" అనేపేరుంది. అది అష్టవసువుల స్వరూపమై వుంటుంది. దానిని ధరించే వ్యక్తి "పూర్ణఆయుర్దాయం" పొందుతాడు. మరణంచిన తర్వాత శివసాయుజ్యం లభిస్తుంది. 9ముఖాల రుద్రాక్ష: 9ముఖాలుగల రుద్రాక్షను ఎవడైతే తన ఎడమ భుజంలో ధరిస్తాడో, అట్టివ్యక్తి సర్వసమర్థుడు అవుతాడు. ఆవ్యక్తి శివునితో సమానమైన వాడుగా వుంటాడు. ఈ రుద్రాక్ష భైరవ స్వరూపమైనది. దీనికి 9రూపాలతోవిలసిల్లే దుర్గామహేశ్వరి అధిష్ఠానదేవత ఈ రుద్రాక్ష కపిలమహర్షియొక్క స్వరూపమని చెప్పబడింది. 10 ముఖాలరుద్రాక్ష : పదిముఖాలుగల రుద్రాక్ష సాక్షాత్తూ జనార్దుని స్వరూపము. దీనిని ధరించే వ్యక్తి కోర్కెలన్నీ తీరుతాయి. 11ముఖాలరుద్రాక్ష: 11ముఖాలుగల రుద్రాక్ష రుద్రునిరూపం కాబట్టి దీన్ని ధరించేవ్యక్తి సర్వత్రా విజయంలభిస్తుంది. 12ముఖాలరుద్రాక్ష : 12 ముఖాలుగల రుద్రాక్షను కేశములలోధరించాలి. ద్వాదశాదిత్యులు దానియందు ప్రతిష్ఠితులై వుంటారు. 13ముఖాలరుద్రాక్ష: 13ముఖాలుగల రుద్రాక్ష విశ్వదేవతల స్వరూపంకాబట్టి దీన్ని ధరించే వ్యక్తికి సమస్త కోరికలు నెరవేరడమే కాకుండా సౌభాగ్యం, మంగళప్రదం కూడా లభిస్తాయి. 14ముఖాలరుద్రాక్ష : 14 ముఖాలుగల రుద్రాక్ష సాక్షాత్తూ పరమశివుడి స్వరూపం. దానిని భక్తితో శిరస్సుపై ధరించే వారికి సమస్త పాపాలు తొలగిపోతాయి.

MOHAN PUBLICATIONS.COM

## 1080. రుద్రాక్ష ధారణమంత్రములు ఏవి ?

ఏకముఖి రుద్రాక్ష మంత్రం–ఓం హ్రీం నమః; రెండుముఖాల రుద్రాక్ష మంత్రం–ఓం నమః; 3 ముఖాల మంత్రం–ఓం క్లీంనమః; 4 ముఖాల మంత్రం–ఓం హ్రీం నమః; 5ముఖాలమంత్రం–ఓం హ్రీం నమః; 6ముఖాల మంత్రం–ఓం హ్రీం హుం నమః; 7ముఖాల మంత్రం–ఓం హుంనమః; 8 ముఖా మంత్రం–ఓం హుం నమః; 9ముఖాల మంత్రం–ఓం హ్రీం హుంనమః; 10ముఖాల మంత్రం–ఓంహ్రీంనమః; 11ముఖాల మంత్రం–ఓం హ్రీంహుం నమః; 12 ముఖాల మంత్రం–ఓం క్రోంక్షౌంరౌం నమః; 13ముఖాల మంత్రం–ఓం హ్రీంనమః; 14ముఖాల మంత్రం–ఓంనమః.

## 1081. లక్ష్మీదేవి తమ్ముడే దక్షిణావర్త శంఖమా?

సాధారణంగా శంఖాల్లో చాలాభాగం ఎడమవైపునకు తెరచుకొని ఉంటాయి. మరోమాటలో చెప్పాలంటే, అవి అపసవ్య దిశలో ఏర్పడినవన్న మాట. ఇక, కుడి వైపునకు తెరుచుకొని ఉండే శంఖాలు, అంటే సవ్యదిశలో ఏర్పడిన శంఖాలు అరుదుగా లభిస్తాయి. ఇలా కుడివైపునకు తెరుచుకొని ఉన్న శంఖాలనే పండితులు 'దక్షిణావర్తశంఖాలు'అని వ్యవహరిస్తుంటారు. ఇలాంటి శంఖం ఇంట్లో పూజగదిలో ఉండడం శుభప్రదమని హిందువుల విశ్వాసం, అయితే, వీటిధర చాలా ఎక్కువ.సమస్త సంపదలకూ సంకేతమైన లక్ష్మీదేవి ఇలా కుడివైపునకు తిరిగిన (దక్షిణావర్త) తెల్లటి శంఖంలో నివాసమై ఉంటుందని ప్రజలనమ్మకం. తెల్లటిశంఖం, లక్ష్మీదేవి రెండూ సముద్రంలోనే పుట్టాయని భావిస్తారు. కుడివైపు తెరచిఉన్న తెల్లటిశంఖాన్ని లక్ష్మీదేవికి తమ్ముడిగా విశ్వసిస్తారు. దక్షిణావర్త శంఖం గొప్పదనాన్ని మన శాస్త్రాలు ఇలా వివరించాయి.

ఏ ఇంట్లో అయితే కుడివైపునకు తెరుచుకొని ఉన్న తెల్లటి శంఖం ఉంటుందో, ఆ ఇంట్లో సంపదలు, సంతోషం వెల్లివిరుస్తాయి. సాక్షాత్తూ లక్ష్మీదేవే ఆ ఇంట్లో వసిస్తుంది. దేవుణ్ణి నిత్యం పూజించడానికి చందనం, కర్పూరం వగైరా ఏఇంట్లో వినియోగిస్తారో ఆ ఇల్లు ధనం, సౌభాగ్యాలతో తులతూగుతుంది.

## 1082. దేవతలకు నెలవు దక్షిణావర్త శంఖమా ?

దక్షిణావర్తమైన తెల్లటి శంఖం దివ్యత్వంలో సూర్య చంద్రులతో సమానమైనది. ఈ శంఖం అగ్రభాగంలో గంగ నివాసం ఉంటుంది. మధ్యలో వరుణుడు, పృష్ఠభాగంలో బ్రహ్మ వసిస్తుంటారు. శ్రీ మహావిష్ణువు ఆదేశాల





మేరకు ముల్లోకాలలోని అన్నితీర్థాలూ ఈ శంఖంలో ఉంటాయి. కుబేరుడు సైతం ఈ శంఖంలో కొలువై ఉంటాడు. దీన్ని నిత్యం పూజించాలి. ఈ శంఖాన్ని చూసినంత మాత్రాన సూర్యోదయంతో మంచు కరిగిన రీతిలో అన్ని దోషాలూ నశిస్తాయి. ఇక ఈ శంఖాన్ని స్పృశిస్తే, దివ్యత్వం సిద్ధిస్తుంది.

## 1083. శంఖనాదం ఎప్పుడు చేయాలి ?

అయితే, శంఖాన్ని ఎప్పుడు పడితే అప్పుడు ఊదకూడదు. కేవలం ఉదయం, సాయంత్ర వేళల్లోనే శంఖాన్ని ఊదాలి. అదీ సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయం తరువాత అని పెద్దలు చెబుతుంటారు. అలా కాకుండా మిగిలిన సమయాల్లో శంఖం ఊదితే, ఆ నాద తరంగాలకు సూర్యకిరణాలు ఆటంకమవుతాయని అంటారు. ఏమైనా, వాతావరణం ప్రశాంతంగా ఉండే ఉదయ, సాయం వేళల్లో శంఖం ఊదితే, ఆ నాదం చాలాదూరం వినిపిస్తుంది. శంఖనాదం విన్నవారంతా దానివల్ల ప్రయోజనం పొందుతారు.

## 1084. శంఖావిర్భావ గాథ ఏమిటి ?

శంఖం ఆవిర్భావం గురించి ఓకథ ప్రచారంలో ఉంది. పూర్వం శంఖాసురుడనే రాక్షసుడు ఉండేవాడట. వాడు దేవతలను ఓడించి, వేదాలను అపహరించి, సముద్రం అడుగున దాక్కున్నాడట. దిక్కుతోచని దేవతలు శ్రీహరిని సాయం వేడారు. అప్పుడు విష్ణుమూర్తి మత్స్యావతారం ధరించి, ఆ శంఖాసురుణ్ణి సంహరించాడట అప్పుడు ఆ దేవదేవుడు శంఖం ఆకారంలో ఉన్న ఆ రాక్షసుడి చెవినీ, శిరస్సునూ ఊదాడట. దానినుంచి ఓంకారం వెలువడిందట. ఆ ఓంకార నాదం నుంచివేదాలు వచ్చాయట. వేదాల్లో ఉన్న జ్ఞానంమొత్తం ఓంకారానికి విస్తృతరూపమే! అలా ఆ శంఖాసురుడి నుంచే శంఖం అనే పేరువచ్చింది.

## 1085. శంఖనాదంలో అంతరార్థం ఏమిటి ?

దేవదేవుడైన శ్రీకృష్ణ భగవానుడు పూరించే శంఖం పేరు పాంచజన్యం చతుర్భుజుడైన విష్ణుమూర్తిచేతుల్లో ఒకదానిలో శంకం ఉంటుంది. జీవితానికి అత్యంత కీలకమైన చతుర్విధ పురుషార్థాల్లో ఒకటైన ధర్మానికి అది ప్రతీక. కాబట్టి, శంఖధ్వానం అధర్మం మీద ధర్మం సాధించిన విజయానికి చిహ్నం. మంచి శంఖాన్ని ఎప్పుడైనా మన చెవులకు దగ్గరగా పెట్టుకొని, జాగ్రత్తగా గమనిస్తే, మనకు సాగర ఘోష వినిపిస్తుంది.

MOHAN PUBLICATIONS.COM
MOHAN PUBLICATIONS.COM

అలాగే, శంఖంతోసహా ఇతర మంగళవాద్యాలతో ధ్వనులు చేయడం వెనుక మరోకీలకం ఉంది. ప్రతికూల వ్యాఖ్యలనూ, శబ్దాలనూ నిర్వీర్యం చేసి, దేవుణ్ణి అర్చిస్తున్న వారికి శుభప్రదమైన ధ్వనులతో సాంత్వన చేకూర్చా లన్నది దీని అంతరార్థం. పల్లెటూళ్ళు, కుగ్రామాల్లోని ఆలయాల్లో హారతి సమయాల్లో శంఖనాదం చేయడంవల్ల అది అందరికీ వినబడేది. ఆలయా నికి వెళ్ళే తీరిక, ఓపిక, అవకాశం లేనివాళ్ళు సైతం క్షణకాలం అన్నీమరిచి, దైవాన్ని స్మరించుకోవడానికి అది ఓ సూచనగా ఉపకరించేది. తీరికలేని జీవితం గడుపుతున్నవారిలో సైతం దైవచింతన బలపడడానికి శంఖారావం తోడ్పడేది.

### 1086. శంఖనాదఫలితం ఏమిటి ?

అంతరిక్షం, గ్రహమండలం, సువర్ణాల సమ్మేళనం శంఖమని అథర్వణ వేదం (4/10) పేర్కొంటోంది. శంఖనాదం శత్రువులను భయభ్రాంతులను చేయడమేకాక, రాక్షసులనూ, దుష్టశక్తులకూ నియంత్రిస్తుంది. అజ్ఞానాన్నీ, బద్ధకాన్నీ, వ్యాధినీ పారద్రోతులుంది. దీర్ఘాయువును ఇస్తుంది. ఇక, పూజా సమయంలో శంఖాన్ని పూరించేవారు అన్నిపాపాల నుండి విముక్తులవు తారు. శ్రీమహావిష్ణువు సంతుష్టుడవుతాడు అని పెద్దలమాట.

### 1087. హనుమంతుణ్ణి నవవ్యాకరణ పండితుడు అంటారు. ఎందు వలన? నవ వ్యాకరణాలు ఏవి ?

శ్రీమద్రామాయణంలోని కిష్కింధకాండలో మొట్టమొదట రామలక్ష్మణు లను ఆంజనేయ స్వామి దర్శించి వారెవరో తెలుసుకోగోరుతాడు. దూతగా వచ్చి వారి వివరాలు అడిగే విధానాన్ని గమనించిన దాశరథి సౌమిత్రితో ఋగ్, యజుర్, సామవేదాలు, వేదాంగాలను అధ్యయనం చేయనివాడు ఈ విధంగా మాట్లాడలేడు అని అతణ్ణి అభినందిస్తాడు. శ్రీ సూర్యభగవానుని నుండి రామదూత శాస్త్రాధ్యయనం చేశాడు. నవ వ్యాకరణాలు అంటే 1. పాణినీయం 2. కలాపం 3. సుపద్మం 4. సారస్వతం 5. ప్రాతిశాఖ్యం 6. ఐంద్రం 7. వ్యాఘ్రభౌతికం 8. శఖటాటాయనం 9. శాకల్యం (ప్రాతిశాఖ్యా నికి కుమార వ్యాకరణం అని మారుపేరు ఉంది.)

### 1088. గ్రహదోషాలు ఉన్నప్పుడు శాంతి,జపాలు చేయటానికి వీలులేనప్పుడు చేసేవారు దొరకనప్పుడు స్వయంగా చేసుకోవచ్చా ?

గ్రహబలం చాలనప్పుడు జాతక పరిశీలన చేసి, ఏయే గ్రహాలు అనుకూలంగా లేవో, వాటికి చేయవలసిన శాంతిని జ్యోతిష పండితులు



చెపుతారు. వాటిని యథావిధిగా మంచి పురోహితులతో సాంప్రదాయ బద్ధంగా చేయించాలి. కొన్నిప్రాంతాలలో పురోహితులు అందుబాటులో లేకపోవడంవల్ల, లేదా శాంతులు చేయించటానికి ఆర్థికంగా స్తోమత లేకపోవటంవల్ల అని కొందరు సందేహపడుతుంటారు. పురోహితులు వేదమంత్రాలతో జపానుష్ఠానములు చేస్తాంటారు. అలాకాకుండా స్వయంగా చేసుకోదలచినపుడునిష్ఠగా, నియమంగా చేసేశక్తి ఉంటే గురువుల వద్ద లఘువిధానంలో చేసే మంత్రములు ఉపదేశం తీసుకుని చేయవచ్చు. లేదా ఆ గ్రహములకు, ఆగ్రహములకు అధిపతులైన దేవతలకు సంబంధిం చిన ధ్యానశ్లోకములు, స్తోత్రములు, పారాయణ చేసుకోవచ్చు. తప్పులు లేకుండా చదవాలి. క్రమపద్ధతిలో చేసినచో దోషనివారణ జరిగి, కార్యసిద్ధి కలుగును. చిన్నపిల్లలకు ఆరోగ్యం సరిగాలేనివారికి, పెద్దవారికి వారి తనపున ఇంటిలోని ఇతరులు స్తోత్రపారాయణాదులు చేసుకొన వచ్చును. పవిత్రమైన ప్రదేశంలో చేయటం వల్ల యోగించును.

### 1089. దోషాలకు శాంతులు చేసినపుడు దానాలు ఇవ్వటం కుదర నపుడు, తీసికొనేవారు దొరకనపుడు ఏమి చేయాలి ?

గ్రహములకు జపములు, పూజలు చేసినపుడు తదుపరి ధాన్యదానం చేయాలి. ఏగ్రహానికి ఎంతజపం, పూజచేయాలో చెపుతూ ఏధాన్యం ఎంత దానం ఇవ్వాలో చెపుతారు. ఆ ప్రకారం విస్తరాకులో ధాన్యమును వుంచి, తూర్పుదిశగా ఉండి, సంకల్ప పూర్వకంగా దానం తీసుకునే వ్యక్తికి ఇవ్వ వలెను. తద్వారా దోషనివారణ జరుగును. కొన్ని ప్రాంతాలలో ధాన్యదాన ములు తీసికొను టకు ఎవరూ దొరకక పోవటం జరుగుతుంది. తిలదానం, అపమృత్యుదానం తప్ప మిగతావన్నీ కొందరు పురోహితులు తీసుకుంటారు. కొన్నిచోట్ల అవికూడా తీసుకోరు. కావున దానం తీసుకునే వ్యక్తులు దొరకనపుడు పూజఅనంతరం దానంఇచ్చినట్లుగా సంకల్పించి, ఆ ధాన్యంను జీవనది లేదా పారుతున్న కాలువలలో కలుపవచ్చును. అవకాశంలేనివారు నీళ్లలో తడిపి, ఆ ధాన్యం తినగల జంతువులకు ఆహారంగా పెట్టవచ్చు. లేదా ఎవరూ త్రొక్కనిచోట చల్లిరావచ్చును. దానం ఇచ్చిన వస్తువులు పొరపాటుగా కూడా తిరిగి తీసికొన కూడదు. కొందరు ఒక్కసారి దానం ఇచ్చిన వస్తువులనే కుటుంబములోని అందరూ ఒకరి తర్వాత ఒకరు దానం ఇవ్వటంచేస్తుంటారు. దీనివల్ల దోషంపోకపోగా, మరొకదోషం కలుగవచ్చు.

MOHAN PUBLICATIONS.COM

### 1089. సర్వేజనా సుఖినోభవన్తు. లోకాసమస్తా సుఖినోభవంతు అని ఎందుకు కోరుకోవాలి ?

లోకంలో మనం బాగుండాలి, బాగున్నాం ! అనుకోకండి, మనచుట్టు వున్న సంఘం కరువు దరిద్రములతో బాధపడుతున్నారు అనుకుందాం, వారి దృష్టి ఎలావుంటుంది. దరిద్రంలోవున్న ప్రజలు వారి కనీసావసరాలు తీర్చుకో వడం కోసం దోపిడీలకు, దొంగతనాలకు అలవాటుపడే అవకాశం వున్నది. వారు అలా ప్రవర్తించడం వలన వారు మన మీదకు దోపిడీకి వచ్చే అవకాశంవున్నది. అనే భయంతో మనం జీవించాల్సి వుంటుంది. అందువలన మనచుట్టూవున్న సంఘం బాగుంటే మనకు ఎటువంటి ప్రమాదాలు, భయాలు, ఉండవు. సత్సంగం, సంఘస్సత్సు విధీయతాం సత్సంగత్యే నిస్సంగత్యం ఇలా ఎన్నో వాక్యాల గూఢార్థాలు కూడా యివే. అందుకోసమే "సర్వేజనా సుఖినోభవంతు, లోకాసమస్తా సుఖినోభవంతు అని కోరుకోవాలి.

### 1090. విధి నిర్వహణలో లోపం చేయటం ద్వారా వచ్చే నష్టాలు ఎలా వుంటాయి?

చేసిన తప్పులకు సమానమయిన శిక్షలు భూమిమీదనే అనుభవించే అవకాశం వున్నది. ఒకసారి మహాభారతం పరిశీలించండి. చక్రవర్తి అయిన దృతరాష్ట్రుడు ఒకపెద్ద విధినిర్వహణలోపం చేశాడు. తనకుమారుడు పాండుకుమారులను చంప ప్రయత్నాలను అడ్డుకోలేదు. చక్రవర్తి, సర్వాధికారి అయిన తను అడ్డుకోని కారణంగా తనకుమారులు 100మంది ధృతరాష్ట్రుడు బ్రతికుండగానే చంపబడ్డారు. అదేభగవంతుడు వేసినశిక్ష. ఇదేరీతినవృత్తి రీత్యా చేసిన తప్పులకు సమానమైన శిక్షలనే అనుభవింపవలసివస్తుంది.

### 1091. ఆడవారు అందరూ ధరింపదగిన రత్నాలు ఏవి ఉన్నాయి ?

పూర్వం ఆడవారు ముత్యం, పగడం, నల్లపూసలు, రవ్వలు, (వజ్రాలు) సౌభాగ్యప్రదము అని తప్పనిసరిగా ధరించాలి అని పెద్దలు చెబుతుండేవారు. ఉన్నతమైన వసుధారణ ప్రభావంగా ఐశ్వర్యప్రాప్తి కలుగుతుంది. వజ్రపు ముక్కు పుడక, వజ్రపు కర్ణాభరణములు, అలంకరణ విషయములో ప్రత్యేక తను పొంది వుండేవి. అలాగే పగడాలు, ముత్యాలు, సౌభాగ్య హేతువులు అందువలన వీటి ధారణ విషయంగా జాతకం చూసేవారు కాదు. నేటికీ ప్రాచీన సాంప్రదాయం నడిపే కుటుంబాలలో ఆడవారి మంగళసూత్రాలలో, నల్లపూస, పగడం, ముత్యంవేసి తాడుకట్టుకునే అలవాటు మనం





చూడవచ్చు. నేటి సమాజంలో నవరత్నాలు పిచ్చి ఎక్కువ అయి సమాజంలో ఆడవారికి పగడం, ముఖ్యం, వజ్రం, ద్వారా వచ్చే సౌభాగ్యవృద్ధి గూర్చి తెలిపేవారు కరువయ్యారు.

### 1092. ఉపాసనకు, ఉపవాసానానికి సంబంధం ఏమిటి ?

శబ్దపరంగా ఈ రెండుపదాలకు అర్థం ఇంచుమించు ఒకటే. ఉప+ ఆసనం=ఉపాసనం. అంటే దగ్గర కూర్చోవటం. ఉప+వాసం = ఉపవాసం. అంటే దగ్గర నివసించటం. పరమాత్మ గుణగానలు భావనచేయటం ద్వారా ఆయనకు దగ్గరగా కూర్చోవడమే ఉపాసన. భావనచేయటం అనేది మానసిక ప్రక్రియ. కడుపునిండాతిని కూర్చున్నప్పుడు భావనసరిగా జరుగదు. భావన సరిగా జరగాలంటే కడుపుఖాళీగా ఉండాలి. ఈ విధంగా పస్తుఉండడం ఉపాసనకు సహకారి కనుక పస్తును కూడా ఉపవాసం అని వ్యవహరించారు.

గమనించవలసిన విషయం ఏమిటంటే పస్తు పడుకున్నంత మాత్రాన అది ఉపాసన కానేరదు. పస్తుఉన్న రోజు భగవత్ ఉపాసన కోసం కృషిబాగా జరగాలి. నిజానికి ఆ ఉపాసన బాగా జరిగేందుకు పస్తుఉండడం జరగాలి. అలాంటపుడే అది ఉపవాసం అవుతుంది.

### 1093. వందన సమర్పణ అనగా ఏమి ?

విష్ణువు యొక్క అవతారముల విగ్రహములకు, పరమేశ్వరుడికి మనం నమస్కరించేటపుడు శిరస్సువంచి పన్నెండు అంగుళాలఎత్తున చేతులు ఉంచి నమస్కరించాలి. మిలిగిన అందరి దేవుళ్ళకు నమస్కరించేటపుడు శిరస్సు మీద చేతులుజోడించి నమస్కారము చేయాలి. గురువుకు నమస్కరించేటపుడు నేరుగా చేతులు జోడించి నమస్కరించాలి. యోగి పుంగవలులకు, మహానుభావులకు వక్షస్థలంవద్ద చేతులు జోడించి నమస్కరించాలి. తండ్రికి, రాజులకు నోటిమీదుగా చేతులు జోడించి నమస్క రించాలి. తల్లికి ఉదరమున చేతులు జోడించి నమస్కరించాలి.

### 1094. శివ, కేశవులుకు వైరం జరిగినదా ?

శివకేశవులంటే మనం అనుకున్నట్టుగా ఇద్దరుదేవతలు కాదు. శివశక్తి, కేశవశక్తి అనే రెంటికీ పరీక్షవచ్చిందని అర్థం చేసుకోవాలి. ప్రతి పురాణం లోనూ ఈ పరిక్షవస్తూ ఉంటుంది. ఇష్టం లేకపోయినా శివరాత్రివేళ తప్పని సరిగా ఉపవసించి శివపూజని చూసి లింగోద్భవదర్శనాన్ని చేసిన భక్తుడు మరణిస్తే యమదూతలురాగా శివదూతలు వారించి శివలోకానికి తీసుకు పోయారు.

MOHAN PUBLICATIONS.COM

